# ఆర్ష విజ్ఞాన సర్వస్వము

మొదటి సంపుటము

## వేద సంహితలు





తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

# ఆర్ష విజ్ఞాన సర్వస్వము

మొదటి సంపుటము

## వేద సంహితలు

ప్రధాన సంపాదకుడు

**ప్రొఫెసర్ ఎస్.బి. రఘునాథాచార్య**

ప్రచురణ

**కార్యనిర్వహణాధికారి**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

# *ARSA VIJNANA SARVASVAMU*

*(Encyclopaedia of Ancient Indian Literature)*

***First Volume :***

**VEDASAMHITALU**

***Chief-Editor :***

**Dr. S.B. Raghunathacharya**

***First Edition :*** 1982
***Second Edition :*** 2003

***Copies :*** 2,000

**Published by :**

Executive Officer
Tirumala Tirupati Devasthanams
Tirupati, Andhra Pradesh

***Printed at :***

Students Offset Princters,
Tirupati. Ph : 2229253

# సంపాదకసమితి

అధ్యక్షులు : **శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్,** ఐ.ఏ.ఎస్.
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

సభ్యులు : **శ్రీ ధూళిపాళ రామచంద్రశాస్త్రి**
అధ్యక్షులు : ఎస్.వి వేదాగమవిద్యాకేంద్రము,
నరసింగాపురము

**శ్రీ ఆర్. కృష్ణస్వామి అయ్యంగార్**
విశ్రాంతాధ్యక్షులు : ఎస్.వి వేదాగమపాఠశాల,
తిరుమల

**డాక్టర్ ఎమ్. నరసింహాచార్య**
రీడర్, సాంస్క్రిట్ డిపార్ట్మెంట్,
మద్రాస్ యూనివర్సిటీ, మద్రాస్

ప్రధానసంపాదకుడు : **డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య**
కో - ఆర్డినేటర్, పబ్లికేషన్స్,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

ఆర్ష విజ్ఞాన సర్వస్వము

# వేదసంహితలు

ఈ సంపుటంలో మన వాఙ్మయానికి మూల గ్రంథాలైన ఐదు వేదసంహితలకు సంబంధించిన విజ్ఞానం విడివిడిగా క్రింది శీర్షికలలో పొందుపరచబడింది:

పరిచయం

శాఖలు - విభాగం

శాఖలు - దేశవ్యాప్తి

పాఠవిశేషాలు

మంత్రద్రష్టలగు మహర్షులు

దేవతలు

ఛన్దస్సు

వైశిష్ట్యం

మతం - తత్త్వం

సాంఘికాచారవ్యవహారాలు

కవితాసౌందర్యం

సంగ్రహసమీక్ష

**తిరుమల తిరుపతి దేవస్థానములు**
**తిరుపతి**

# ముందుమాట

**శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్,** ఐ.ఎ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి

**ఆర్షవాఙ్మయం :**

చరిత్రకందని కాలంలో దివ్యజ్ఞాన సంపన్నులు, దయాళువులైన మహర్షులు మనకందించిన వాఙ్మయం ఆర్షవాఙ్మయం. మహామహిమాన్వితులైన ఆ మహర్షులద్వారా భగవంతుడావిష్కరించిన నిత్యసత్యాలే వేదాలు. వేదమనే పూనాది పైనే కాలం గడిచేకొద్దీ ఎన్నో ధర్మహర్మ్యాలు వెలసినాయి. కనుకనే సమస్త సాహిత్యానికి, ధర్మానికి, సంస్కృతికి వేదం మూలాధారమని భారతీయుల విశ్వాసం.

**వేదసంహితలు :**

ఋక్సంహిత, కృష్ణయజుస్సంహిత, శుక్లయజుస్సంహిత, సామసంహిత, అథర్వసంహిత అని మనకు ఐదు వేదసంహితలున్నాయి. వేదాలు నాలుగే అయినా యజుర్వేదంలోగల కృష్ణ - శుక్ల భేదంతో సంహితలు ఐదుగా ఏర్పడ్డాయి. ఈ సంహితలనే మంత్రభాగమంటారు. ముందు చెప్పబోయే బ్రాహ్మణాలు, ఈ సంహితలు కలసి వేదమనే వ్యవహారాన్ని పొందుతున్నాయి. కొందఱు సంహితాభాగాన్ని మాత్రమే వేదమంటారు. ప్రతిసంహితలోను కొన్ని శాఖలున్నాయి.

**బ్రాహ్మణాలు :**

పై సంహితలకు గల ప్రతిశాఖకు బ్రాహ్మణ గ్రంథాలుండేవి. నశించిపోయిన శాఖలు నశించిపోగా మనకిప్పుడు కొన్ని బ్రాహ్మణాలు మాత్రమే దొరుకుతున్నాయి. మంత్రభాగవ్యాఖ్యానరూపాలే బ్రాహ్మణాలు. ఇవి ఆయా యాగాలను విధిస్తూ వాటి స్వరూపాన్ని చక్కగా వివరిస్తున్నాయి. ఐతరేయబ్రాహ్మణం, తైత్తిరీయబ్రాహ్మణం, శతపథబ్రాహ్మణం, షడ్వింశబ్రాహ్మణం, గోపథబ్రాహ్మణం మొ॥ బ్రాహ్మణాలు పై సంహితలకు సంబంధించినవి.

**ఆరణ్యకాలు :**

బ్రాహ్మణగ్రంథాలలాగానే గద్యపద్యమయమైనవి ఆరణ్యకాలు. ఇవి బ్రాహ్మణాలకు పరిశిష్టాలు. వానప్రస్థాశ్రమం స్వీకరించినవారు అరణ్యాలలో అధ్యయనం చేయడంవల్ల వీటికి ఆరణ్యకాలని పేరేర్పడింది వీటిలో కర్మకాండయొక్క చరమదశ, బ్రహ్మకాండ ప్రారంభావస్థ మనకు కనపడుతుంది. బ్రహ్మకాండ అంటే వేదాంతం. ఆరణ్యకాలలో యజ్ఞయాగాలకు, ధర్మాచారాలకు సంబంధించిన ఎన్నో విశేషాలు వివరింపబడుతున్నాయి ఐతరేయారణ్యకం, తైత్తిరీయారణ్యకం మొ॥ ఆరణ్యకాలు ప్రసిద్ధాలు.

**ఉపనిషత్తులు :**

ధర్మార్థకామమోక్షాలు నాలుగు పురుషార్థాలు. ఇవి విద్యా వివేకాలచేత సంపాదించదగినవి. విద్యలు 'పర" అని "అపర' అని రెండు విధాలు. నాలుగువేదాలు అపరవిద్య అని పిలువబడతాయి. వీటితో మొదటి మూడు పురుషార్థాలను సాధించుకోవచ్చు. కాని పరమపురుషార్థమైన మోక్షాన్ని అపరవిద్య సాధించలేదు. ఉపనిషత్తులలో చెప్పబడిన పరవిద్యద్వారానే అది సాధ్యం. ఉపనిషత్తులకే

వేదాంతాలని పేరు. వీటి సంఖ్యను గురించి ఎన్నో వాదాలున్నాయి. నూటఎనిమిది ప్రసిద్ధో పనిషత్తులలోను త్రిమతాచార్యులు ప్రమాణంగా స్వీకరించినవి ఈశాది ఉపనిషత్తులు పది.

**వేదభాష్యాలు :**

వేదార్థాన్ని తెలుసుకోకుండా కేవలం వల్లెవేయడంవల్ల పరిపూర్ణమైన ఫలం కలుగదు. మఱి వేదార్థాన్ని ఎలా తెలుసుకోవాలి? యాస్కుడు వేదార్థపరిశీలనం చేస్తూ నిరుక్తాన్ని వ్రాశాడు. తరువాత స్కందస్వామి, వేంకటమాధవుడు, ఉద్గీథుడు మొదలైనవారు భాష్యాలు వ్రాశారు. సాయణాచార్యులు వేదసంహితల కన్నింటికి ఇంకా కొన్ని బ్రాహ్మణాలకు, ఆరణ్యకాలకు కూడ భాష్యాలను వ్రాసి వేదాభాష్యకారపదాన్ని సార్థకం చేశాడు. ఉవటుడు మహీధరుడు శుక్లయజుస్సంహితకు చక్కని భాష్యాలను కూర్చారు.

**వేదాంగాలు :**

వేదార్థాన్ని క్రమబద్ధంగా తెలుసుకోవడానికి ఆచరణలో పెట్టడానికి ఉపయోగించేవి వేదాంగాలు శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యౌతిషం, కల్పం అని ఇవి ఆఱు. వీటిలో కొన్ని వేదార్థాన్ని తెలుసుకోవడానికి ఉపయోగిస్తే, మిగతావి వేదంచేత ప్రతిపాదింప బడిన ధర్మాన్ని అనుష్ఠించడానికి సాహాయ్యం చేస్తాయి.

**ఆర్షవిజ్ఞానం :**

వేదాలు విజ్ఞాననిధులు. ఆధ్యాత్మికంగా మహోన్నతస్థాయిని సాధించిన మహర్షులు ఆధిదైవిక - ఆధిభౌతిక విషయాలలో స్వయంసమృద్ధిని సాధించడంలో ఆశ్చర్యమేముంటుంది? భౌతిక విషయాలలో ఇప్పుడు కోట్లకొలది ధనవ్యయంతో ఎందఱో వ్యక్తులు, ఎన్నో సంవత్సరాలు పరిశోధించి అతికష్టంమీద కనుగొనగల్గిన

విశేషాన్ని వారు యోగాభ్యాసంతో మానసిక ప్రణిధానంతో తేలికగా కనుక్కోగలిగారు. ఆత్మశక్తి తగ్గిపోయి బాహ్యప్రకృతి మీద ఆధారపడి మనం ఎన్నో ప్రయోగాలు చేసి విసిగి వేసారి చిట్టచివరకు ఎలాగో ప్రకృతితత్త్వాన్ని కొంత తెలుసుకోగలుగుతున్నాం కాని యోగాభ్యాసంతో, తపశ్శక్తితో ఆత్మశక్తిని బాగా పెంచుకున్న మహర్షులు ప్రకృతిమీద ఆధారపడకుండా భౌతికాభౌతికసత్యాలను అరచేతిలోని రేగుపండులాగా చూడగలిగారు. ఆ సత్యాలనే లోకానికి ఆవిష్కరించారు.

వేదాలలో కొన్ని సందర్భాలలో కనపడే అంశాలనుబట్టి వారి విజ్ఞానాన్ని మనం చక్కగా తెలుసుకోవచ్చు ఉదాహరణకు కొన్నింటిని మాత్రం ఇక్కడ పరిశీలిద్దాం. ఇలాంటివి వేదసంహితలలో అడుగడుగునా ఎన్నో ఉన్నాయి. వాటిని ఉత్సాహవంతులు చదివి అర్థంచేసుకుని మన వెనుకటి తరాలవారి సంస్కృతిని విజ్ఞానాన్ని లోకకల్యాణానికి ఉపయోగించాలి.

**ఆకాశయానం :**

ఈనాడు విమానాలు సర్వసాధారణాలైనాయి. కాని ఆనాటి వారికి విమానయానం తెలియనిదికాదు. ఋగ్వేదంలో ప్రథమ మండలంలో **116**వ సూక్తంలో **3**వ మంత్రంలో ఈ ప్రస్తావం కనబడుతుంది తుగ్రుడనే రాజర్షి భుజ్యుడనే తన కొడుకును శత్రు విజయంకోసం. విమానంలో పంపాడు. విమానాన్ని అశ్వినీదేవతలు నడిపారు. యంత్రాలతో అది నడిచింది. నీటిపైన నడిచే జలనౌక మాత్రం కాదది. అంతరిక్షమంతా తిరగగల సామర్థ్యం కలది. అంటే వారి విమానాలు జలంలోను, భూపరిధిలోను, అంతరిక్షంలోను స్వైరవిహారం చేసే శక్తి గలవని తెలుస్తున్నది. మనమింకా మూడుచోట్ల నడచేశక్తిగల విమానాలను తయారు చేసుకోలేదు. యజుర్వేదంలోను

(19-54, 19-43), అథర్వవేదంలోను (7.63.3) ఈ విమాన ప్రస్తావం ఉంది. ఈ విమానాలకు మూడు చక్రాలున్నట్లు ఋక్సంహిత చెబుతున్నది (8.58.3).

## విద్యుద్విజ్ఞానం :

విద్యుత్తును ఉత్పత్తి చేయడం, దానిద్వారా ఎన్నో కార్యాలను సాధించడం మనమిప్పుడు చూస్తున్నాం. యజుర్వేదకాలం నాటికే విద్యుత్తును గురించిన స్పష్టమైన లక్షణాలను గుర్తించినట్లు తెలుస్తున్నది. యజుర్వేదంలో (4.15.19) సుమారు ఐదు మంత్రాలలో విద్యుత్తు అగ్ని స్వరూపమని, దానికి రెండుతలలని, వాటితో అది వస్తూ - పోతూ ఉంటుందని, రవ్వలరూపంలో ఆవిర్భవిస్తుందని చెప్పబడింది ఋణ - ధనాత్మకమైన రెండు విద్యున్మార్గాలు రెండు తలలుగా చెప్పబడ్డాయి ఇలాగే విద్యుత్తుస్వరూపానికి సంబంధించిన లక్షణాలు స్పష్టంగా ఈ వేదంలో వర్ణింపబడ్డాయి.

## ఓషధి విజ్ఞానం :

ఓషధులకుగల గుణగణాలను పరీక్షించి వాటిని తమ అనారోగ్యాలను పోగొట్టుకోవడానికి ఉపయోగించడం ఆనాటి మహర్షులకు బాగా తెలుసు. ఈ ఓషధి లక్షణాలను యజుర్వేదం చక్కగా వివరిస్తున్నది (12-80,12-89 12-97). అథర్వవేదంలోను మూలికలు వాటి ప్రయోగాలు మొ॥ విషయాలు చాలా విపులంగా చెప్పబడ్డాయి.

## ఆయుర్వేదం :

ఋగ్వేదానికి ఉపవేదం ఆయుర్వేదం. ఈ సంహితలో ఓషధి విజ్ఞానం వివరింపబడింది. అథర్వసంహితలో నాలుగోవంతు

ఆయుర్విజ్ఞానాన్ని వివరించే మంత్రభాగమే కనబడుతుంది. ఈ సూక్తాలలో మానవుని శరీరంలోని ప్రతిచిన్న అవయవానికి సంబంధించిన విశేషాలు పేరుపేరున చెప్పబడ్డాయి. శరీరానికి, మనస్సుకు ఏర్పడే అనారోగ్యాలు, ఇంకెన్నో భయంకరమైన వ్యాధులు, వాటి నివారణోపాయాలు వీటిలో వివరించబడ్డాయి. దీనినిబట్టి సూక్ష్మదృష్టి, ప్రాపంచికవిషయాలపై ఉండవలసినంత శ్రద్ధ వారికి పుష్కలంగా ఉన్నదని తెలుస్తున్నది.

## గృహసూక్తం :

అథర్వవేదంలోని గృహసూక్తాన్ని పరిశీలిస్తే ఆనాటివారి జీవనాన్ని గురించి, వారి భావనలను గురించి మనకు స్పష్టమౌతుంది. ఇవి వారి భావనలు :

> "మా ఇండ్లు సత్య మధుర సంభాషణలు కలవైయుండాలి మంచి సౌభాగ్యాలతో హాస ప్రమోదాలతో నిండి, ఆకలిదప్పులు లేకుండా, నిర్భయమైనవిగా ఉండాలి పుష్కలమైన ధనధాన్యాలతో, మిత్రులతో బంధువులతో సంతోషాన్ని పెంచుతూ కళకళలాడుతూ ఉండాలి మా కుటుంబ సభ్యులందఱు ఆరోగ్యంగా ఉండాలి మా ఇండ్లలో ఆహారపదార్థాలు, పాలు వగైరా కొరతలేకుండా ఉండాలి

ఇలా లక్ష్మీతాండవంచేసే గృహసంపదగల సమాజాన్ని లోక కల్యాణాన్ని వారాశించారు. అందుకోసం ధర్మబద్ధంగా ప్రయత్నం చేశారు. తమను తీర్చిదిద్దుకున్నారు. మన సమాజం కూడా అలాఉంటే ఎంతబాగుంటుంది!

## స్త్రీపురుషసమానాధికారం :

స్త్రీపురుషులలో ఒకరు హెచ్చు, ఒకరు తక్కువ అనే భావం వారిలో లేదు. స్త్రీసహకారం లేని పురుషుని జీవితం ఏ ప్రయోజనాన్నీ

సాధించలేదు. పురుషసాహచర్యం లేని స్త్రీజీవితం గౌరవాస్పదం కాదు కనుక ఇద్దఱు కలసి, మంచి సంతానాన్ని కని సత్యధర్మ ప్రేమలును తమ సంతానాని కందించాలి. అప్పుడే ఈ సమాజంలో శాంతి వెల్లివిరుస్తుంది వేదాలన్నింటిలోను వివాహానికి సంబంధించిన మంత్రభాగాలలో ఈ విషయం స్పష్టంగా చేయబడింది. ప్రతి కుటుంబంలోను స్త్రీ మకుటంలేని మహారాణి. ఆ వంశ ప్రతిష్ఠ ఆమె మీదనే ఆధారపడి ఉంది. మఱి ఆమెకు పతి ప్రత్యక్షదైవం. వారిద్దఱి గృహస్థజీవితం ఈ సమాజానికొక ఆదర్శం. ఇలాంటి భావనలే మనకు వేదాలలో కనబడతాయి.

**సమసమాజభావన :**

వేదాలన్నింటిలోను ఈ విశ్వమంతా ఒకే ఒక కుటుంబమనే భావన స్పష్టంగా కనబడుతుంది ఇప్పుడు మనం చూసే జాతి - వర్గ విభేదాలు లేని సమాజం అది. తోటిసభ్యుణ్ణి ప్రేమించడం, సహృదయంతో అతణ్ణి అర్థం చేసుకోవడం వారికి సహజలక్షణం. తండ్రిమాట వినే కొడుకు, పిల్లల మంచి గురించి ఆలోచించే తల్లి ప్రియంగా, హితంగా, శాంతంగా భర్తతో మాట్లాడే భార్య, పరస్పరం ప్రేమతో ఉండే తోబుట్టువులు ఉండాలనే వారి భావనలో సమాజాన్ని వారెంత చక్కగా తీర్చి దిద్దుకున్నారనే విషయం తెలుస్తుంది.

సమాజంలో ఎన్ని తేడాలున్నా హెచ్చుతగ్గులు మాత్రం ఉండకూడదు. అందఱం సోదరులమై కలసిమెలసి ఉండాలి. సామూహిక క్షేమాన్ని అభిలషించి కలసిమెలసి ఏపనినైనా చేయాలి. ఒకరి హృదయం ఒకరు బాగా అర్థంచేసుకోవాలి. ఈ సమాజం పరమేశ్వరస్వరూపం. అందఱం ఆయన అవయవాలమే. ఇందులో ఎవరూ పెద్దవారూ కాదు, చిన్నవారూ కాదు. అంతా సమానమే అనే భావన వారిలో దృఢంగా ఉండేది.

**జాతీయభావన :**

చుట్టూ ఒక గిరిగీసుకొని ఇది నాది, అది నీది. ఈ జిల్లా నాది, ఈ రాష్ట్రం నీది. నాది ఈ దేశం, నీది ఆ దేశం. నాది ఈ మతం, నీది ఆ మతం అనుకోవడం నేటి మానవుడికి పుట్టుకతోనే వస్తుంది కానీ ఆనాడు మానవజాతి అంతా ఒకే కుటుంబం, ఈ భూమి నా తల్లి, మేమంతా ఆమె పిల్లలం అనే విశ్వకుటుంబభావన ఉండేది సంకుచిత తత్త్వాలను బాగా గర్హించిన కాలమది ప్రేమతో అందఱిని తన వారుగా చేసికొన్న సమాజమది. వారేంచేసినా మానవజాతి కంతటికి క్షేమం కలగాలనే చేశారు. అంతేకాని హద్దులు పెట్టుకొని, పక్షపాతాలతో దేశాన్ని సమాజాన్ని ముక్కలు చేసుకొనే ఆలోచనలు వారిలో లేవు. ఇలా వేదాలలోను, వైదికసంస్కృతిలోను జాతీయభావన పదే పదే కనిపిస్తుంది.

**పూర్ణాయుష్యం :**

వేదాలలో మానవుడు పరిపూర్ణాయుష్యాన్ని పొందడాన్ని గురించి చెప్పబడింది. నూరు సంవత్సరాలు మానవునికి పూర్ణాయుష్యమని చెబుతారు అది సర్వసాధారణం కాని మానవుడు అంతకంటే ఎక్కువకాలం బ్రతకవచ్చునని, అది అతని జీవన విధానంపై ఆధారపడి ఉంటుందని పూర్ణాయుష్య గరిష్టపరిమితి వెయ్యి సంవత్సరాలని వేదం చెబుతున్నది **(శు.సం.3.62).**

జఠరాగ్నిని జాగ్రత్తగా కాపాడుకున్నవాడు **300** సంవత్సరాలు జీవించవచ్చు జ్ఞానేంద్రియనిగ్రహాన్ని సంపాదించి ధ్యానంతో మంచి దృష్టిని పొందినవాడు ఇంకొక మూడువందల సంవత్సరాలు జీవించవచ్చు. యోగాభ్యాసంతో యమ - నియమాదులను బాగా అభ్యసించి ఆచరించేవాడు ఇంకో మూడువందల సంవత్సరాలు

బ్రతకగలడు. మొత్తం తొమ్మిదివందల సంవత్సరాలు. సామాన్యమైన ఆయుష్యం నూరు సంవత్సరాలు కలిస్తే మొత్తం వెయ్యి సంవత్సరాలు అవుతుంది బ్రహ్మచర్యాన్ని బాగా కాపాడుకొన్నవాడికి ఊర్ధ్వరేతస్కునికి ఇది సులభం. కనుకనే భవిష్యజ్జీవితానికి ఆధారభూతమైన బ్రహ్మచర్యాశ్రమంలో విద్యావివేకాలు పొందినవాడు మిగతా జీవితాన్ని చక్కగా నడుపుకోగలడని వారు ప్రథమాశ్రమంగా బ్రహ్మచర్యాన్ని ఏర్పాటుచేశారు ఆ వ్యవస్థను పోగొట్టుకొని ఈనాడు అల్పాయుష్కుడై పోయినాడు మానవుడు. కొంతలో కొంతైనా ఆయుష్యాన్ని పొందగోరేవాడు వేదోపదేశాన్ని తప్పక అనుసరించాలి.

## జ్ఞానోపదేశానికి ప్రతివాడు అర్హుడే !

సమాజంలో ప్రతివాడికి విద్య, రాష్ట్రం, సంస్కృతి అనే మూడు శక్తులు కావాలి వాటిని పటిష్ఠం చేసుకోకపోతే మనుగడే సాగదు. కనుక ప్రతివాడు ఈ మూడింటిని బాగా పెంచుకోవాలని వేదం ఉపదేశిస్తున్నది. (శు.సం.20.43). కనుక జ్ఞానాన్ని సంపాదించడానికి ప్రతివాడికి అర్హత ఉంది అలాగే 'కల్యాణప్రదమైన ఈ వాక్కును సమాజంలో అందరికి చెబుతున్నా'నని వేదమే ప్రతిపాదిస్తున్నది (శు సం.26.2). కాబట్టి వీరు వారు అనే తేడాలు లేకుండా వేద విజ్ఞానాన్ని, సంపాదించడానికి ప్రతివానికి అర్హత ఉన్నది.

## ధర్మానికి మూలం వేదమే !

లోకంలో ప్రతివాడు ఇష్టాన్ని పొందాలని, అనిష్టాన్ని పొందకుండా ఉండాలని ప్రయత్నిస్తూంటాడు. పురుషునిచేత కోరబడేదే పురుషార్థం. ధర్మం, అర్థం, కామం, మోక్షమనే నాలుగు పురుషార్థాల్లో మొదటి మూడింటికి వేదం సాక్షాత్తూ కారణమౌతూ, మోక్షమనే నాల్గవపురుషార్థానికి కర్మానుష్ఠానంవల్ల కలిగిన చిత్తనైర్మల్య

- ప్రసాద - వైరాగ్యాలద్వారా పరంపరగా కారణమౌతున్నది. యజ్ఞయాగాదులే ధర్మాలు. వాటి అనుష్ఠానంవల్ల అర్థకామాలు సిద్ధిస్తాయి. ధర్మానికి మూలభూతమై, ధర్మప్రతిపాదకం కావడం వల్లనే వేదం గొప్పధర్మంగా పేర్కొనబడింది (వేద ఏవ పరో ధర్మః).

సమాజం ఎందుకు ఇన్నిరకాల బాధలకు గురౌతున్నది? మనశ్శాంతి మానవులకు ఎందుకు కరువౌతున్నది? లోకానికి మంచి కలిగే పనులు ఎవరూ చేయకపోవడంవల్ల, అధార్మికమార్గాలకు లొంగిపోవడంవల్ల, ధర్మబద్ధమైన ఆలోచనలకు కూడా కరువు రావడంవల్ల, మఱి ఈ వ్యామోహంనుంచి బయటపడి మంచిమార్గంలో ప్రవేశించడానికి ఏమిటి మార్గం? మళ్ళా యజ్ఞభావన సమాజంలో పునరుజ్జీవించాలి. యజ్ఞమంటే ఏదో కాదు; త్యాగం. దాన్ని సమాజంలో కలిగించగలిగింది వేదం ఒక్కటే అందుకనే ధర్మానికి మూలం వేదమే అనడం ఎంతో సముచితం భారతీయ సంస్కృతి, తత్త్వం అన్నీ వేదం మీదనే ఆధారపడి ఉన్నాయి.

## భారతీయసంస్కృతిలో వేదాలస్థానం :

ఇతరదేశాల్లో సాంస్కృతిక చైతన్యం మొగ్గతొడగడానికి ఎంతో కాలం వెనుక భారతీయులు సాంస్కృతికంగా మహోన్నత ప్రమాణాల నందుకున్నారు. ఇంతటి సముజ్జ్వలమైన సంస్కృతి, ప్రశంసా యోగ్యమైన సభ్యత వీరికెలా సంక్రమించాయి? వీరి జీవనవిధానం లక్ష్యశుద్ధి కలిగింది కావడంవల్ల, ధర్మానికి విరుద్ధంకాని అర్థ - కామాలను వీరు సేవించడంవల్ల. జాతకర్మ - నామకరణాలనుంచి అంత్యేష్టివఱకు భారతీయులకు వేదాలే పరమప్రమాణాలు. వేదోపదేశమనే ధర్మక్షీరంనుంచి ఏర్పడిన మీగడలాంటిది భారతీయ

సంస్కృతి. కనుకనే వేదవాఙ్మయం లేకపోతే భారతీయసంస్కృతి నిరాశ్రయమనే భావం ప్రపంచమంతటా వ్యాపించి ఉంది.

భారతీయజీవనంలో సంస్కృతిలో వేదాలకు అత్యున్నతమైన స్థానం ఉంది. అదొక దివ్యవాణి అని, నిత్యమైన శబ్దరాశి అని, భూత భవ్య భవిష్యత్కాలలకు మూడింటికి సంబంధించిందని హిందువుల దృఢతరవిశ్వాసం.

## ఎన్ని వేదశాఖలు నశించాయి ?

ప్రతివేదంలోను మనకు దొరుకుతున్న శాఖలు చాలా తక్కువ. నశించిపోయిన శాఖల సంఖ్య చాలా ఎక్కువ. 21 ప్రధాన శాఖలున్నట్లు ప్రసిద్ధిగాంచిన ఋగ్వేదానికి ఇప్పుడు దొరుకుతున్న శాఖలు కేవలం రెండుమాత్రమే అంటే 19 ప్రధాన శాఖలు కాలగర్భంలో కలిసిపోయాయి అలాగే 20 ఉపశాఖల పేర్లు మాత్రమే మిగిలి ఉన్నాయి. ఇది ఋగ్వేదానికి ప్రస్తుతమున్న స్థితి.

ఇక కృష్ణయజుర్వేదానికి 86 శాఖలున్నట్లు ప్రసిద్ధి. అందులో ఇప్పటికి 82 శాఖలు నశించిపోయినాయి. కొన్నింటికి పేర్లుమాత్రం మిగిలాయి. మిగతావాటికి అవికూడా లేవు. ఇప్పుడు దొరుకుతున్న శాఖలు నాలుగు మాత్రమే.

శుక్లయజుర్వేదానికి 17 ప్రధాన శాఖలుండేవి. కాని ఇప్పుడు రెండు శాఖలుమాత్రమే దొరుకుతున్నాయి. [illegible] ఉపశాఖలు నిరాశ్రయాలై నశించిపోయినాయి. మొత్తం 41 శాఖలు నశించి పోయినాయన్నమాట.

సామవేదానికి 1000 శాఖలుండేవి. కాని ప్రస్తుతం దొరుకుతున్న శాఖలు కేవలం మూడు మాత్రమే. గౌతమశాఖ మనదేశంలోనే

ఉండేదని, శార్దూలశాఖ నశించి 300 సం. గడిచాయని చెబుతారు. మొత్తంమీద ఈ వేదంలో 997 శాఖలు నశించాయి.

అథర్వవేదానికి 9 ప్రధానశాఖలుండేవి. అందులో 7 శాఖలు నశించిపోగా ఇప్పుడు రెండుశాఖలు మాత్రమే దొరుకుతున్నాయి. ఇంతవిజ్ఞానం బూడిదలో పోసిన పన్నీరులాగా అయిపోయినా ఈ సమాజానికి ఏమీ పట్టలేదు మనమెంత పోగొట్టుకున్నామనే విషయంకూడా తెలియని నిద్రాణస్థితిలో ఉన్నాం.

మనకు దొరుకుతున్న ఈ కొద్దిశాఖలద్వారానే వేదాలలోని సంస్కృతిని, విజ్ఞానాన్ని చూసి మనం ఇంత ఆశ్చర్యపడుతున్నామే! నశించిన గ్రంథాలలో ఇంకెంత విజ్ఞానం భూగర్భంలోకి చేరిపోయిందో! ఎన్ని నిత్యసత్యాలు పేర్లుకూడా తెలియని స్థితిలో అడుగంటి పోయాయో! మన దౌర్భాగ్యానికి ఎంతో బాధపడాలి

**వేదాలపై నిరాదరణ :**

ఒకప్పుడు ప్రపంచంలోని మానవులందఱకు సంస్కృతిని, సభ్యతను ఆచార్యస్థానంలో ఉండి నేర్పింది భారతదేశం. అంతర్జాతీయ పుస్తక భాండాగారంలో మొట్టమొదటి గ్రంథం ఋగ్వేదమని విదేశీయులే మన విజ్ఞానాన్ని ప్రశంసించారు. ఈనాటి ప్రపంచంలోని మేధావులందఱు ఏకగ్రీవంగా వేదాలు విశ్వవిజ్ఞాన నిధులని ప్రశంసించారు. సుమారు 90 శాతం గ్రంథాలు నశించిపోగా మిగిలినవి కొన్ని పాశ్చాత్యపరిశోధకుల ప్రయత్నాలవల్ల చాలా వఱకు వెలుగు చూశాయి.

సామాజిక - ఆర్థిక పరిస్థితుల ప్రభావాలకు లొంగిపోయి కుంగిపోయిన సాంప్రదాయికులైన వేదజ్ఞాల సంఖ్య ఆశ్రయం, ఆదరం

లభించక నానాటికి తగ్గిపోయింది ప్రోత్సాహరహితమైన, సమాజాదరానికి పాత్రకాలేని విద్యను చదవడానికి ఎంత పెద్ద ఘనపాఠి సంతానమైన ఇష్టపడుతుందా? తనవఱకు ఎన్నో తరాలనుంచి సంరక్షింపబడుతూ, సంక్రమిస్తూ వచ్చిన ఈ విజ్ఞాన ధనానికి ఒకవైపు వారసులు లేకపోవడం, ఇంకొక వైపు తనలాగానే తన సంతతి నిరాశ్రయమై బ్రతుకుతెరువు లేకుండా పోవడం, ఎంతటివాడికైనా బాధను కలిగించక తీరదు. కానీ, ఫలితం? వేదవిద్య మెలమెల్లగా కనుమరుగైపోతూ వచ్చింది.

దీన్నిలా వదిలేయడమేనా? పోయినదానితోపాటు మిగిలింది కూడా నశించిపోతుంది. మఱి ఈ విషయంలో ఏమిటి మనకర్తవ్యం? ఈ తరంలో ఉన్న మనకు ఏ బాధ్యత లేదనుకుందామా? రానున్న తరాలవారు మన ఉదాసీనవైఖరిని ఎంతగర్హిస్తారో! కనుక మన శక్తివంచన లేకుండా ఏదో ఒక ప్రయత్నం చేయాలి. కనీసం ఇప్పుడు లభిస్తున్న వేదసంచయాన్ని మన ముందు తరాలవారికి అందించ గలిగితే; నిజంగా అది వారికి మనం చేసే మహోపకారం

ఏదో ఒక కులానికి, ఏదో ఒక మతానికి, ఏదో ఒక దేశానికి మాత్రమే సంబంధించక విశ్వమానవజాతికంతటికి మంచి కలగాలని, మానవులందఱు ఒక విశాల విశ్వకుటుంబసభ్యులనే భావనను కలిగించేది వేదవిజ్ఞానం. అలాంటి మహోజ్జ్వల విజ్ఞానరాశిపైన మనం లేనిపోని సంకుచితభావాలను ఆపదనుంచి, దాన్ని సంరక్షించడం ఎవరినో సంరక్షించడమని, మతరహిత జీవనవిధానంకల ఈ దేశంలో వేదాలనెలా ప్రోత్సహిస్తామని నిట్టూరుస్తూ వాటిని నిరాదరించడం, అపరాధి తన వాదబలంతో నిరపరాధికి శిక్ష వేయించడం లాంటిదే అవుతుంది. జాతి - మత - కుల - వర్గ - ప్రాంత భేదభావలకతీతమైన, అద్వితీయమైన ఈ వేదవిజ్ఞానం మనలో

కరుడు కట్టుకుపోయిన అశ్రద్ధకు, సంకుచితభావనలకు బలి అయిపోవడాన్ని భావితరాలవారు ఎలా క్షమిస్తారు? నీవు, నేను, వాడు, అనే భేదం లేక (సర్వే జనాః సుఖినో భవన్తు) లోకంలో నీ జనులంతా సుఖంగా ఉండాలని యుగయుగాలుగా చాటిచెప్పే వేదసంస్కృతికి అసూయతో ద్వేషంతో మానసికబలహీనతతో రంగులు పూసి నిరాదరించిన మన సాహసం క్షమార్హమౌతుందా?

భారతీయ ప్రాచీన వాఙ్మయ విజ్ఞానాలలోని గొప్పతనాన్ని మనవారు చెబితే మనం అలక్ష్యం చేస్తాం. అదే ఒక పాశ్చాత్యుడు "మీ పూర్వులింత గొప్పవాళ్లు, మీ ప్రాచీనవిజ్ఞానం ఇంత గొప్పది" అంటే, అబ్బ! అని ఆశ్చర్యపడటం మనకలవాటు. ఈ పట్టిపట్టని పరిస్థితి ఎప్పుడు మారుతుంది? ఈ గడ్డపై పుట్టిన ప్రతి భారతీయుడు "వేదవిజ్ఞానం నాకు పరంపరగా వచ్చిన ఆస్తి. దాన్ని సంరక్షించి లోకక్షేమానికి ఉపయోగించే బాధ్యత నాపైన ఉంది ఇది నాకు జన్మతః సిద్ధించిన కర్తవ్యం. ఈ నిధికి ధర్మకర్తను నేను" అని ఎప్పుడు స్పందిస్తాడు? ఆ మహనీయమైన క్షణం ఎంతదూరంలో ఉంది? వెలుగును విరజిమ్మే ఆ మధుర సుప్రభాతం ఎంతసేపటికి వస్తుంది? మనకు పట్టిననిద్ర ఎప్పటికి పోతుంది? ఆ పవిత్ర సమయం కోసం ఎదురుచూద్దాం

**ఆర్షవిజ్ఞానసర్వస్వం ప్రణాళిక :**

వేదాల మహత్త్వం వాటిలో ఉండే విజ్ఞానం ప్రతివాడికీ అందుబాటులోకి వస్తే, అందులో నిండి ఉన్న విజ్ఞానధనాన్ని పరిరక్షించుకోవడానికి అందఱు ముందుకు వస్తారు. కనీసం ఆ సంకల్పమైనా చేస్తారు. ■ ఉద్దేశ్యంతోనే వైదికవిజ్ఞానాన్ని సంగ్రహంగా సమాజంలోని ప్రతివాడికి అందించాలనే ఆశతో తిరుమల తిరుపతి

దేవస్థానం ఈ ఆర్షవిజ్ఞానసర్వస్వమనే ప్రణాళికకు రూపకల్పన చేసింది. దీనిక్రింద ప్రస్తుతం 'వేదసంహితలు' అనే మొదటిసంపుటం ప్రచురింప బడుతున్నది. ఇలాగే ఇకముందు బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు ఉపనిషత్తులు వేదభాష్యాలు శ్రౌతగృహ్యసూత్రలు పాంచరాత్రం, వైఖానసం, శైవం, వాస్తు - శిల్పం అనే తొమ్మిది సంపుటాలు ప్రచురింపబడతాయి. మొత్తం పది సంపుటాలలో ఒకవైపు ఆర్షవాఙ్మయ స్వరూపాన్ని సంగ్రహంగా ప్రదర్శిస్తూ, అందులోని విజ్ఞానాన్ని ప్రజలకు అందుబాటులో ఉండే వ్యావహారికభాషలో ఒకచోట చేర్చి అందించడం ఈ ప్రణాళికాలక్ష్యం. సుమారు 400 పేజీలలో ప్రతి సంపుటం వెలివడుతుంది. సంపుటాలన్నీ కలసి సుమారు 5,000 పుటలుగా రూపొందే ఈ ఎన్‌సైక్లొపిడియా ఆర్షవాఙ్మయవిజ్ఞానాలకు పట్టిన అద్దమై నిలుస్తుందని నేను భావిస్తున్నాను. ఈ భవ్యమైన ప్రణాళికను మీకు సమర్పించడానికి సంతోషిస్తున్నాను.

దీన్ని ప్రాంతీయ భాషలలోకి, అలాగే ఆంగ్లభాషలోకి అనువాదం చేసి ప్రచురిస్తే బాగుంటుందని అనేక కోణాల్నుంచి మాకు సూచనలు వచ్చినాయి. అలా అనువాదాలు చేయించి అన్ని ప్రాంతాల్లో వారికి దీన్ని అందుబాటులోనికి తీసుకురావాలనే ప్రయత్నాలు జరుగు తున్నాయి. ప్రస్తుతం ఆంగ్లానువాదం జరుగుతున్నది. కొద్దినెలల్లో దాన్ని సర్వాంగ సుందరంగా తయారుచేసి ఇతర రాష్ట్రాలవారికి, ఇతర దేశాలవారికి కూడ అందుబాటులోకి తప్పక తీసుకువస్తాం.

తిరుమల తిరుపతి దేవస్థానాల తరపున ఈ ప్రణాళికను రూపొందించి, వివిధ ప్రాంతాల పండితులనుంచి కావలసిన విషయాన్ని సేకరించి, నలుగురికీ ఉపయోగించే పద్ధతిలో దాన్ని సంపాదించి ఈ సంపుటాన్ని చక్కగా తయారు చేసినవారు డాక్టర్ ఎస్.బి. రఘునాథాచార్య (కో-ఆర్డినేటర్ పబ్లికేషన్స్, టి.టి.డి.). ఆయన

నిరంతరకృషికి ప్రతిరూపమే ఈ సంపుటం. నిర్విఘ్నంగా ఆయన ఈ ప్రణాళికద్వారా వైదికవాఙ్మయ విజ్ఞానాలను సామాన్యమానవునికి అందుబాటులోకి తీసుకువస్తారని నేను నమ్ముతున్నాను. ఈ బృహత్కార్యక్రమాన్ని ఓపికతో, అవధానంతో నిర్వహించి ప్రధాన సంపాదకుడుగా సుందరమైన ఈ ప్రథమసంపుటాన్ని మనముందుంచిన శ్రీ రఘునాథాచార్యగారిని మనసారా అభినందిస్తున్నాను. వైదిక వాఙ్మయ పరిశోధనలో లబ్ధప్రతిష్ఠులైన ఆయనను ఆంధ్రదేశం తప్పక అభినందిస్తుందని ఆశిస్తున్నాను.

మా కోరికను మన్నించి ఎంతో శ్రమపడి వైదికవాఙ్మయాన్ని పరిశోధించి ఈ సంపుటానికి కావలసిన విషయాలను పంపిన రచయితలందరికి, సంపాదకసమితికి నా కృతజ్ఞతలు. ఈ సంపుటాన్ని ఇంత మనోహరంగా ముద్రించి ఇచ్చిన తిరుమల తిరుపతి దేవస్థాన ముద్రణాలయం సిబ్బందికి నా అభివందనలు.

ఇంతవఱకు భారతీయభాషల్లోగాని, భారతీయేతరభాషల్లోగాని ఈ పద్ధతిలో వైదికసాహిత్యంమీద ఎలాంటి రచన వెలువడలేదు. ఇది సామాన్యుడికి వైదికవిజ్ఞానాన్ని పరిచయంచేస్తూ, ఇంకావిశేషాలు తెలిసుకోవాలనే ఉత్సాహాన్ని కలిగిస్తుందని, వైదికవాఙ్మయంపైన, ఇతర భౌతికశాస్త్రాలపైన పరిశోధనలు జరిపేవారికి కొత్త కొత్త సమాచారాలను సవిమర్శంగా మూలాధారాలతో అందిస్తూ భారతీయ విజ్ఞానగవేషణలో ప్రోత్సాహాన్నిస్తుందని నేనాకాంక్షిస్తున్నాను. వైదికవాఙ్మయ విజ్ఞానాలను పరిచయం చేసుకోదలచినవారు, వాటిపై పరిశోధనలు జరిపేవారు మా ఈ ప్రయత్నాన్ని సద్వినియోగం చేసుకుంటారని ఆశిస్తున్నాను.

# సంపాదకుని మాట

శ్రీపద్మావతీ ప్రాణనాథుడైన శ్రీనివాసుని భవ్యసంకల్పమే ఈ ఆర్షవిజ్ఞానసర్వస్వం. ఆర్షవాఙ్మయ విజ్ఞాన సుమసౌరభాలను సమాజంలోని ప్రతి సామాన్య మానవుడికి అందుబాటులోనికి తీసుకురావడానికి ఆయన ఆదేశంతో తిరుమల తిరుపతి దేవస్థాన పాలకవర్గం దీన్ని సంకల్పించింది ఆర్షవిజ్ఞానసర్వస్వమనే ప్రణాళికను రూపొందించమని, ఈ సంపుటాలను సంపాదించమని శ్రీనివాసుని ప్రతినిధిగ తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి.వి ఆర్‌కె ప్రసాద్, ఐ.ఏ.ఎస్. గారు నన్ను ఆదరంతో ఆదేశించారు. సువిశాలదృక్పథం, లోకకల్యాణభావన, ఆర్షధర్మాభినివేశం వారిలో రూపుదాల్చినాయనడం స్వభావోక్తి అవుతుంది. వారు ఈ ప్రణాళికకు జీవనాడి. నేను కేవలం నిమిత్తమాత్రుడను. పరమానుగ్రహంతో ఇంతటి భవ్యమైన సేవ చేయించుకోవడానికి సంకల్పించిన పద్మావతీజాని శ్రీనివాసుని పాదారవిందాలకు కోట్లకొలది ప్రణామాలను సమర్పిస్తున్నాను.

తిరుమల తిరుపతి దేవస్థాన పాలకవర్గ సౌజన్యంతోనే ఈ ప్రణాళికద్వారా ప్రథమసంపుటం వెలువడుతున్నది. వారికి నా హార్దమైన కృతజ్ఞతలు. ఊపిరి సలపని కార్యభారంతో నిజమైన కర్మయోగిగా చిరునవ్వులు చిందిస్తూ, కావలసిన సకల సహకారాల నందిస్తూ, ఈ ప్రథమసంపుటాన్ని విలక్షణంగా ప్రకాశింపజేసి, ముద్దులు మూటగట్టే ముందుమాటను పలికిన తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్‌గారికి నిండుమనసుతో నా కృతజ్ఞతామందారాల నందిస్తున్నాను.

ఈ ప్రణాళిక ప్రారంభంనుంచి తగిన సలహాలనిస్తూ, అడుగడుగునా ఎంతో సాహాయ్యం చేస్తున్న టి.టి.డి. పౌరసంబంధ

శాఖాధికారి, ప్రియమిత్రులు, సౌజన్యమూర్తి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి గారికి మనఃపూర్వక కృతజ్ఞతలు. అవసరమైన సలహాలనిచ్చి ఈ సంపుటాన్ని ఇంత చక్కగా తయారుచేయడంలో సహకారాన్నందించిన సంపాదకసమితికి, తమ అమూల్యమైన కాలాన్ని వెచ్చించి, వైదికవాఙ్మయాన్ని పరిశీలించి మేమడిగిన శీర్షికలపై చక్కని సమాచారాన్ని పంపిన రచయితలందఱికి నా ధన్యవాదాలు.

శిల్పానికి జీవకళను సమకూర్చేది శిల్పి. అలాగే ఈ సంపుటం బాహ్యశిల్పాన్ని చక్కగా తీర్చిదిద్దిన టి.టి డి. ప్రెస్ మేనేజర్, ప్రియ మిత్రులు శ్రీ ఎమ్. విజయకుమార్ రెడ్డిగారికి, ఇబ్బందులెన్నివచ్చినా హుందాగా పరిష్కరించి ఇంత అందంగా దీన్ని ముద్రించిన శ్రీ ఎమ్. గోపాలరెడ్డికి (అసిస్టెంట్ మేనేజర్) ఇతర ముద్రణాలయ సిబ్బందికి నా ధన్యవాదాలు.

ప్రూఫులు సరిదిద్దడంలో సహకరించిన మిత్రమణులు శ్రీ ఎమ్ రామకృష్ణశాస్త్రి (కంట్రోలర్ ఆఫ్ పబ్లికేషన్స్ టి.టి డి), శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులుగార్లకు నా కృతజ్ఞతాకుముద మంజరులు.

ఈ సంపుటానికి సంబంధించిన వ్యాసాలను తెప్పించడం లోను, ప్రెస్ కాపీ తయారుచేయడంలోను, ప్రూఫులు చదవడంలోను సహకరించిన ప్రాజెక్టు అసిస్టెంట్స్ కుమారి డి. శారద, కుమారి టి. సావిత్రి, శ్రీ పి. ఎన్. వి. రమణరావులకు నా శుభాకాంక్షలు.

ఇది శ్రీనివాస పాదపద్మాంకితమైన ఆర్షవిజ్ఞానారవిందం. దీన్ని ఆంధ్రలోకానికి ఆదరంతో సమర్పిస్తున్నాను. దీని దివ్య సౌరభాలను అందఱు ఆనందంతో అనుభవిస్తారని ఆకాంక్షిస్తున్నాను.

22-5-1982

రఘునాథాచార్య

# రచయితలు

ఏ. ఎస్. ఎస్. శ్రీ ఏ. సోమేశ్వరశర్మ, ఎం.ఏ.,
రీడర్, సాంస్క్రిట్ డిపార్ట్మెంట్,
ఆంధ్రయూనివర్సిటీ, వాల్తేరు.

2.9 మతం-తత్త్వం; 4.6 దేవతలు.

బి. ఆర్. ఎమ్. డాక్టర్ బి. ఆర్. మోదక్, ఎం.ఏ. పిహెచ్.డి.
రీడర్, సాంస్క్రిట్ డిపార్ట్మెంట్, కర్ణాటక
యూనివర్సిటీ, ధార్వార్.

5.10 సాంఘికాచారవ్యవహారాలు.

సి. ఎమ్. ఎస్. డాక్టర్ సి. మార్కండేయశాస్త్రి, ఎం.ఏ., పిహెచ్.డి.
జాయింట్ డైరక్టర్, నాన్‌ఫార్మల్ ఎడ్యుకేషన్.ఏ.పి.,
హైదరాబాద్.

5. 6 దేవతలు

డి. ఏ. ఎస్. డాక్టర్ డి. అర్కసోమయాజి, ఎం.ఏ., పిహెచ్.డి.
రాష్ట్రపతి బహుమానగ్రహీత, సెక్రటరీ,
హిందూధర్మరక్షణ సంస్థ, తిరుపతి.

3. 8 వైశిష్ట్యం.

డి. ఎస్. బి. డాక్టర్ డి. శ్రీధరబాబు, ఎం.ఏ., పిహెచ్.డి.
రీడర్, ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్,
శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ, తిరుపతి.

4.10 సాంఘికాచారవ్యవహారాలు

డి. వి. ఏ. ప్రొఫెసర్ దివాకర్ల వెంకటావధాని,
ఎం.ఏ. (ఆనర్స్), పి.హెచ్.డి.
తెలుగు ప్రొఫెసర్ (రిటైర్డ్), ఉస్మానియా
యూనివర్శిటీ, హైదరాబాద్.

1.10 సాంఘికాచారవ్యవహారాలు;
4.12 ఆర్చికలు-సంగ్రహసమీక్ష

జి. ఎస్. ఆర్. శ్రీ జి. సౌందరరాజన్, ఎం.ఏ., పి.ఒ.ఎల్.
విద్యాప్రవీణ, సంస్కృతపండితులు, తణుకు.

2.10 సాంఘికాచారవ్యవహారాలు

కె. వి. ఆర్. శ్రీ కె.వి. రాఘవాచార్యులు, ఎం. ఏ., (తెలుగు)
ఎం.ఏ. (సంస్కృతం), విద్వాన్, డిప్లొమా ఇన్ లింగ్విస్టిక్స్,
లెక్చరర్, శ్రీ వేంకటేశ్వరకాలేజ్ ఆఫ్ మ్యూజిక్ అండ్
డాన్స్, తిరుపతి.

1.7 ఛందస్సు; 3. 5 మంత్రద్రష్టలగు మహర్షులు
3.7చందస్సు; 3.12 అధ్యాయాలు సంగ్రహసమీక్ష

కె. వి. ఆర్. కె. శ్రీ కె.వి.ఆర్. కృష్ణమాచార్యులు, ఎం. ఏ.,
విద్యాప్రవీణ, లెక్చరర్, కేంద్రీయ సంస్కృత విద్యాపీఠమ్,
తిరుపతి.

1.6. దేవతలు; 3.6 దేవతలు;
3.10 సాంఘికాచారవ్యవహారాలు.

ఎమ్. డి. బి. ప్రొఫెసర్ ఎమ్.డి. బాలసుబ్రహ్మణ్యమ్,
ఎం. ఏ. పిహెచ్.డి.
ప్రిన్సిపాల్, కేంద్రీయసంస్కృత విద్యాపీఠమ్, తిరుపతి.

1.8 వైశిష్ట్యం.

| | |
|---|---|
| ఎమ్. ఎన్. | డాక్టర్ ఎమ్. నరసింహాచార్య, ఎం. ఏ. (సంస్కృతం)ఎం.ఏ. (తెలుగు), పిహెచ్.డి. రీడర్, సాంస్క్రిట్ డిపార్ట్మెంట్, మద్రాస్ యూనివర్శిటీ, మద్రాస్. |
| | 1.9 మతం-తత్త్వం; 2.11 కవితాసౌందర్యం. |
| ఎమ్. వి. ఆర్. | శ్రీ ఎమ్.వి. రామనాథ ఘనాపాఠి, సలక్షణవేద ఘనాపాఠి వేదపండితులు (రిటైర్డ్) శ్రీ వేంకటేశ్వరా ఓరియంటల్ కాలేజ్, తిరుపతి. |
| | 2.8 వైశిష్ట్యం. |
| ఎన్. ఎస్. ఆర్. | ప్రొఫెసర్ ఎన్.ఎస్.ఆర్. తాతాచార్య, న్యాయ మీమాంసా వ్యాకరణ వేదాంతశిరోమణి, విద్యావారిధి (పిహెచ్.డి.) ప్రొఫెసర్, కేంద్రీయసంస్కృత విద్యాపీఠమ్, తిరుపతి. |
| | 2.7 ఛందస్సు |
| పి. ఎస్. ఆర్. | డాక్టర్ పి. శ్రీరామచంద్రుడు, ఎం.ఏ (సంస్కృతం), ఎం.ఏ (తెలుగు). ఎం.ఏ (ఇంగ్లీషు). పిహెచ్.డి. శిరోమణి. రీడర్, సాంస్క్రిట్ డిపార్ట్మెంట్, ఉస్మానియా యూనివర్శిటీ, హైదరాబాద్. |
| | 5.5 మంత్రద్రష్టలగు మహర్షులు. |
| ఎస్. బి. ఎల్. | శ్రీ ఎస్.బి.ఎల్. నరసింహాచార్యులు, విద్వాన్ అధ్యక్షులు, ఆగమగురుకులము, రావిఅనంతవరం, రేపల్లె. |
| | 4.9 మతం-తత్త్వం; 5.12 కాండలు సంగ్రహసమీక్ష. |

ఎస్. బి. ఆర్. డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్య, ఎం.ఏ., పిహెచ్.డి. విద్యాప్రవీణ. డిప్లొమా ఇన్ జర్మన్ ప్రధానసంపాదకుడు లెక్చరర్, సాంస్క్రిట్ డిపార్ట్‌మెంట్, శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ. కో- ఆర్డినేటర్ పబ్లికేషన్స్ టి.టి.డి తిరుపతి.

1.1, 2.1, 3.1, 4.1, 5.1. పరిచయం;
1.2, 2.2, 3.2, 4.2, 5.2. శాఖలు - విభాగం;
1.3, 2.3, 3.3, 4.3, 5.3. శాఖలు - దేశవ్యాప్తి;
1.4, 2.4, 3.4, 4.4, 5.4 పాఠవిశేషాలు;
1.5 మంత్రద్రష్టలగు మహర్షులు.
1.11 కవితాసౌందర్యం;
3. 9 మతం-తత్త్వం: 5.11 కవితాసౌందర్యం.

ఎస్. బి. ఎస్. శ్రీ ఎస్.బి.ఎస్. భట్టాచార్య, ఎం.ఏ., శిరోమణి లెక్చరర్, వి.ఎస్. కాలేజ్, నెల్లూరు.

5.7 ఛందస్సు; 5.8 వైశిష్ట్యం

ఎస్. ఎల్. ఎన్. శ్రీ ఎస్. లక్ష్మణయ్యనాయుడు, ఎం.ఏ., శిరోమణి స్పెషల్ ఆఫీసర్, ఎపిక్‌స్టడీ ఎగ్జామినేషన్స్, టి.టి.డి తిరుపతి.

4.7 ఛందస్సు; 4.8 వైశిష్ట్యం; 5.11 కవితాసౌందర్యం.

టి. ఎన్. సి. శ్రీ టి. నరసింహాచార్, శిరోమణి సంస్కృత పండితులు (రిటైర్డు), తిరుపతి.

2. 6 దేవతలు.

టి. ఎస్. కుమారి టి. సావిత్రి, ఎం.ఏ.,
అసిస్టెంట్, అర్థ విజ్ఞానసర్వస్వం ప్రాజెక్టు,
టి.టి.డి. తిరుపతి.

4. 5 మంత్రద్రష్టలగు మహర్షులు

యు. వి. ఆర్. శ్రీ యు. వెంకటరామయ్య, ఎం.ఏ.,
విద్యాప్రవీణ, భాషాప్రవీణ
లెక్చరర్, ఎస్. వి. ఓరియంటల్ కాలేజ్, తిరుపతి.

2.11 అధ్యాయాలు సంగ్రహసమీక్ష.

వి. కె. ఎస్. శ్రీ వి. కుటుంబశాస్త్రి, బి.ఏ విద్యాప్రవీణ. శిరోమణి
లెక్చరర్. కేంద్రీయసంస్కృత విద్యాపీఠమ్, తిరుపతి.

1.12 మండలాలు - సంగ్రహసమీక్ష; 2.11 కవితాసౌందర్యం.

వి. ఎస్. జి. శ్రీ వి. సుబ్రహ్మణ్యఘనపాఠి, విద్యాప్రవీణ
లెక్చరర్, కె.ఎల్.ఎన్ సంస్కృత కాలేజ్, తెనాలి.

2. 5 మంత్రద్రష్టలగు మహర్షులు.

వి. వి. ప్రొఫెసర్ వి. వరదాచార్య, ఎం.ఏ., పిహెచ్.డి.
ప్రొఫెసర్, ఫ్రెంచి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండాలజీ.
పాండిచ్చేరి.

5. 9 మతం - తత్త్వం.

# ప్రస్తావన

## విషయసూచి


| | | |
|---|---|---|
| ఆర్షవిజ్ఞానం | ... | xxxiii |
| వేదం అంటే ఏమిటి? | ... | xxxiv |
| వేదపద నిర్వచనం | .... | .... |
| వేదం మొదట్లో ఒకటేనా? | .... | xxxvi |
| వేదాలెన్ని? | ... | xxxviii |
| వేదాలకు ఎన్ని పేర్లున్నాయి? | .... | xL |
| వేదాధ్యయనం అంటే ఏమిటి? | ..... | xLi |
| అర్థజ్ఞానం అవసరమా? | ..... | .... |
| చరణం అంటే ఏమిటి? | ..... | xLiv |
| శాఖలు - అనుశాఖలు - సౌత్రశాఖలు | .... | xLv |
| మంత్రం అంటే ఏమిటి? | .... | xLvi |
| మంత్రాలెన్నిరకాలు? | ..... | xLvii |
| మంత్రోచ్చారణకే ప్రభావం ఉందా? | . .... | xLviii |
| స్వరం అంటే ఏమిటి? | ..... | xLix |
| స్వరం వల్ల ఏం ప్రయోజనం? | ..... | Li |
| వేదానికి కాలనిర్ణయం చేయవచ్చా? | ..... | Li[illegible] |
| సంహితలలో ముందువెనుకలున్నాయా? | .... | Liv |

వేదాంగాలేవి? ఏమిటి వాటి ప్రయోజనం? ... Lv

ప్రాతిశాఖ్యలంటే ఏమిటి? ..... Lviii

బృహద్దేవత అంటే ఏమిటి? .... Lix

అనుక్రమణికలంటే ఏమిటి? .... Lx

వేదభాష్యాలు - భాష్యకారులు .... Lxi

సాయణుడు - ఆయన భాష్యాలు ... Lxvii

భారతీయుల వేదర్థానుశీలనపద్ధతి .... Lxiv

ఉవటుని వ్యాఖ్యానపద్ధతి .... Lxx

వేదాలు మానవులకే ప్రమాణాలా? .... Lxxi

వేదాలు ఏదో ఒక కాలానికి పరిమితమైనవా? .... ...

పురాణాదివిద్యలు వేదజ్ఞానం కోసమేనా? ... Lxxii

వేదాలు బహుదేవతావాదాన్ని ప్రతిపాదిస్తున్నాయా?... ...

వేదాల్లో ఏకదేవతావాదం .... Lxxiv

పాశ్చాత్యుల వేదార్థానుశీలనం ... Lxxv

సాయణభాష్యం - కొందఱు పాశ్చాత్యులదాడి ... Lxxvi

సమాజదృష్టి ..... Lxxvii

ఆర్షవిజ్ఞానసర్వస్వం - అవసరం ...... Lxxviii

# ప్రస్తావన

**డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్య**
సంస్కృతవిభాగం
శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి.

**ఆర్షవిజ్ఞానం :**

ఋషులకు సంబంధించినది ఆర్షం. ఆర్షవాఙ్మయంలో నిండి ఉన్న విజ్ఞానమే ఆర్షవిజ్ఞానం. పరమేశ్వర నిశ్వాసరూపాలు వేదాలు అవి దివ్యజ్ఞాన సంపన్నులైన మహర్షుల దర్శనానికి అంది లోకంలో ఆవిష్కరింపబడ్డాయి. ఆ సత్యావిష్కరణం భగవత్సంకల్పంవల్లనే జరిగింది మహర్షులు అందులో నిమిత్తభూతులై మంత్రద్రష్టలనే గౌరవాన్ని పొందారు. ఋగ్వేదంతో ప్రారంభించి శాఖోపశాఖలుగ ఆర్షవాఙ్మయం విస్తరించింది. అందులోని విజ్ఞానం ఇంత, అంత అని చెప్పడం ఎవరికి శక్యమౌతుంది? లోకకల్యాణాన్ని కలిగించే ఎన్నో భావనలు, త్యాగనిరతిని పెంచే ఎన్నో ప్రక్రియలు, అణువణువునా భగవంతుని స్వరూపాన్ని భావన చేయించే మంచి ఉపదేశాలు, సమసమాజాన్ని నిర్మించుకోవడానికి కావలసిన ఎన్నో సమన్వయాలు, పురుషార్థాలను సంపాదించుకోవడానికి ఎన్నో భౌతికాభౌతికోపాయాలు, ఇలా ఇంకెన్నో; అవన్నీకలసి ఆర్షవిజ్ఞానమని పిలువబడుతోంది. ఆ ఆర్షవిజ్ఞానసహస్రకిరణుని ముందు మిగత విజ్ఞానాలు మిణుగురుపురుగులల్లే వెలవెలబారిపోవలసిందే.

## వేదం అంటే ఏమిటి?

సామాన్యంగా సమాజంలో వేదం అంటే వివాహాది శుభ కార్యాల్లో చదివే మంత్రాల సమూహం అనే అభిప్రాయం ఉంది కొన్ని వేదమంత్రాలు అలా ఉపయోగింపబడుతున్నాయి కనుక అది కొంతవఱకు నిజమే; వేదం అసలుస్వరూపం అదికాదు భారతీయులమైన మన భాగ్యవశాన భగవంతుడు మంత్రద్రష్టలైన మహర్షులద్వారా ఆవిష్కరించిన సత్యవాక్సమూహమే వేదం[1] పరమపురుషుని నిశ్వాసమే వేదమని (అస్య మహతో భూతస్య నిశ్వసితం యదృగ్వేదః (2.4.10) బృహదారణ్యకోపనిషత్తు చెబుతున్నది. ఇదే భావాన్ని సాయణాచార్యుడు (క్రీ.శ 1315-1387) తన వేదభాష్య భూమికాప్రారంభంలో వ్యక్తీకరించాడు[2] భూత - భవిష్యత్ - వర్తమానకాలాల్లో తిరుగులేని సత్యాలను ఆవిష్కరించిన, దివ్యమైన జ్ఞానరాశి వేదం. ముల్లోకాలకు యోగక్షేమాలను కలిగించి, సమాజానికి చక్కని విజ్ఞానాన్ని శాంతిని అందించే ఉత్తమగ్రంథ సముదాయమే వేదం

## వేదపదనిర్వచనం :

వేదమనే పదం 'విద్' అనే ధాతువునుంచి ఏర్పడింది జ్ఞానమని ఈ ధాతువుకు అర్థం. ఇంకా ఇతరధాతువులనుంచి కూడా ఈ పదనిష్పత్తిని చెబుతున్నారు. పై ధాతువుద్వారా వేదమంటే జ్ఞానోపదేశపరమైన గ్రంథమని చెప్పవచ్చు. లోకంలో ప్రతి జీవి

---

1. యజ్ఞేన వాచః పదవీయమాయన్తామన్వ విన్ద న్నృషిషు ప్రవిష్టామ్ |
తామాభృత్యా వ్యదధుః పురుత్రా తాం సప్తరేభా అభిసన్నవన్తే ||
ఋసం 10.71.3.

2. యస్య నిశ్వసితం వేదాః యో వేదేభ్యోఽఖిలం జగత్ |
నిర్మమే తమహం వన్దే విద్యాతీర్థమహేశ్వరమ్ || వే.భా.భూ.1.

తన ఇష్టాన్ని పొందడంకోసం, అనిష్టాన్ని పోగొట్టుకోవడం కోసం ఉపాయాన్ని వెదుకుతుంటుంది శాశ్వతప్రాతిపదికలో ఇష్టప్రాప్తి-అనిష్టపరిహారాలకు సంబంధించిన అలౌకికోపాయాన్ని తెలియజేసేది కాబట్టి దీనికి వేదమని పేరు ఏర్పడిందని తైత్తిరీయ సంహితాభాష్య భూమికలో సాయణుడు వివరించాడు[1] ప్రత్యక్షం, అనుమానం మొ॥ ప్రమాణాలు లౌకికాలేగాని అలౌకికాలు కావు జ్యోతిష్టోమం మొ॥ యాగాలు ఇష్టాన్ని సిద్ధింపచేస్తాయని కాని కలంజం (ఉల్లిపాయ అని కొందరు, మాంసమని కొందరు) తినకపోవడం అనిష్టాన్ని పోగొడుతుందని గాని ఈ లౌకికప్రమాణాలు ప్రతిపాదించలేవు. "ప్రత్యక్షంగా గాని అనుమానంద్వారా కాని అలౌకికమైన ఆ ఉపాయం తెలియటం లేదు వేదంద్వారానే దాన్ని తెలుసుకుంటున్నారు కనుకనే వేదానికి వేదత్వం సార్థకమౌతున్నది" అనే సిద్ధాంతం పరంపరగా వస్తున్నది[2]. మొత్తంమీద ప్రత్యక్షానుమానాలకు అందని అలౌకికోపాయమే ఈ వేదంలో ప్రతిపాద్య విషయమని సాంప్రదాయికుల అభిప్రాయం.

"దీనిద్వారా ధర్మాదిపురుషార్థాలు తెలియబడి పొందబడుతున్నాయి కాబట్టి ఇది వేదమ" ని దేవమిత్రుడు బహ్వృచప్రాతిశాఖ్య వృత్తి ప్రారంభంలో వేదపదాన్ని నిర్వచించాడు[3]. పురుషులచే (మానవులచే) రచింపబడని వాక్యం వేదం (అపౌరుషేయం వాక్యం వేదః) అని కూడా వేదస్వరూపాన్ని వివరించవచ్చు ఆపస్తంబుడు యజ్ఞపరిభాషలో `మన్త్రబ్రాహ్మణగ్రంథాలకు రెంటికి వేదమని పేరు'

1. ఇష్టప్రాప్త్యనిష్టపరిహారయోరలౌకిక ముపాయం యో గ్రన్థో వేదయతి స వేదః
వే భా భూ 1.

2. ప్రత్యక్షేణానుమిత్యా వా యస్తూపాయో న విద్యతే ।
ఏతం విదన్తి వేదేన తస్మాద్వేదస్య వేదతా ॥ అందులోనే, 2.

3. విద్యన్తే జ్ఞాయన్తే లభ్యన్తే వా ఏభిర్ధర్మాది పురుషార్థా ఇతి వేదః.
సం.సా.వి 14.

(మన్త్రబ్రాహ్మణయోర్వేద నామధేయమ్) అన్నాడు. సర్వానుక్రమణీ వృత్తి భూమికలో షడ్గురుశిష్యుడు ఈ విషయాన్నే సమర్థించాడు[1].

## వేదం మొదట్లో ఒకటేనా?

ప్రారంభంలో ఋక్కులు, యజుస్సులు, సామలు అన్నీ కలిసిపోయి ఒకే వేదరాశిగా ఉండేవి. అప్పట్లో వేదాధ్యయనం చేయడమంటే అన్నీ కలిసిన వేదాన్ని చదువుకోవడం ఎంతోకాలం గురుకులంలో ఉండి క్లేశాలననుభవించి అధ్యయనం చేసేవారు ద్వాపరయుగం నడుస్తున్నది కాలం గడిచేకొద్దీ సుకుమారమతులు ఎక్కువైనారు అధ్యేతలలోను, ఆ వాఙ్మయాన్ని వినియోగించుకొనేవారిలోను ఉత్సాహం సన్నగిల్లుతున్నది. ఆ సమయంలో వ్యాసుడు ఈ సమ్మిశ్రాన్ని విడదీసి ఋక్కులనన్నింటిని కూర్చి ఋక్సంహితను, యజుస్సుల కూర్పుతో యజుస్సంహితను, సామలనన్నింటిని కలిపి సామసంహితను, అథర్వమంత్రాలను ఒకచోట చేర్చి అథర్వసంహితను తయారుచేశాడు అందుకనే ఆయనకు భగవాన్ వేదవ్యాసుడని పేరు ఆయన శ్రీ మహావిష్ణువు అంశ అని ఆస్తికులందఱు విశ్వసిస్తున్నారు.

ఈ వాదానికి విష్ణుపురాణం మత్స్యపురాణం ఎంతో తోడ్పడుతున్నాయి ద్వాపరయుగంలో ఒకే వేదరాశి నాలుగు సంహితలుగా విభజింపబడినట్లు వీటిద్వారా స్పష్టంగా తెలుస్తున్నది. ఇరవై ఎనిమిదిమంది వేదవ్యాసులు ఇప్పటికి ఈ వేదవిభాగాన్ని

1. మన్త్రబ్రాహ్మణయోరాహుర్వేదశబ్దం మహర్షయః ।
వినియోక్తృవ్యరూపో యః స మంత్ర ఇతి చక్షతే ॥
విధిస్తుతికరం శేషం బ్రహ్మణం కథయన్తి హి ॥ వే ప.3.

నిర్వహించారని విష్ణుపురాణం చెబుతున్నది[1].

శుక్లయజుస్సంహితకు వేదదీపమనే భాష్యాన్ని వ్రాసిన మహీధరుడు తన భాష్యారంభంలో ఇలా అంటున్నాడు[2].

> "బ్రహ్మపరంపరగా వచ్చిన వేదాన్ని మందమతులైన మనుష్యులను దృష్టిలో పెట్టుకొని, వారిపై గల జాలితో ఋగ్యజుస్సామాథర్వాలని నాలుగుగా విభజించి వేదవ్యాసుడు పైల, వైశమ్పాయన, జైమిని, సుమన్తులను తన నలుగురు శిష్యులకు క్రమంగా ఉపదేశించాడు"

దీనివల్ల మొదట్లో ఒకటిగా ఉన్న వేదాన్నే అధ్యేతల సౌకర్యం కోసం వేదవ్యాసుడు విభజించాడనే సిద్ధాంతం మహీధరుని కాలానికి బాగా ప్రచారంలో ఉందని మనం తెలుసుకోవచ్చు.

అలాగే ఉవటుడు కూడ తన భాష్యప్రారంభంలో - ``హిరణ్యగర్భపరంపరలో అభివ్యక్తమైన ఈ వేదం నిత్య" మని ఏకవచనంతో చెప్పటం అవి ఒకటిగా ఉన్న పూర్వావస్థను గుర్తుకు తెస్తున్నది[3].

భట్టభాస్కరుడు తన తైత్తిరీయసంహితాభాష్యం మొదట్లో "ఒకే రాశిగా ఉన్న వేదాలను లోకోపకారం కోసం వ్యాసుడు విభజించి శాఖలను విడివిడిగా నిర్దేశించాడ"ని స్పష్టీకరించాడు. భట్టభాస్కరుడు మహీధరునికంటే పూర్వుడు. నిరుక్తానికి వృత్తి వ్రాసిన దుర్గాచార్యుడు

---

1. జాతుకర్ణోఽభవన్మత్తః కృష్ణద్వైపాయనస్తతః |
అష్టావింశతిరిత్యేతే వేదవ్యాసాః పురాతనాః ||
ఏకో వేదశ్చతుర్ధా తు యైః కృతో ద్వాపరాదిషు | వి పు.3.3 19-20
వేదశ్చైకశ్చతుర్ధా తు వ్యస్యతే ద్వాపరాదిషు || మ.పు. 144.11

2. తత్రాదౌ బ్రహ్మపరంపరయా ప్రాప్తం వేదం వేదవ్యాసో మన్దమతీన్మనుష్యాన్విచిన్త్య తత్కృపయా చతుర్ధా వ్యస్య ఋగ్యజుస్సామాథర్వాఖ్యాంశ్చతురో వేదాన్ పైల వైశమ్పాయన జైమిని సుమన్తుభ్యః క్రమాదుపదిదేశ. మహీ.1.

3. సోఽయం హిరణ్యగర్భపరంపరయాఽభివ్యక్తో నిత్యో వేదః ఉవ.1.

భట్టభాస్కరునికన్నా ప్రాచీనుడు. ప్రాచీనవేదవాఙ్మయం ఒకటిగా ఉండేదని అతడు కూడా అభిప్రాయపడ్డాడు[1].

ఆధునికులు కొందఱు 'వేదాః' అనే బహువచన ప్రయోగాలు అక్కడక్కడ కనబడుతున్నాయని వేదాలు మొదటినుంచీ నాలుగేనని వాదిస్తున్నారు కాని ఆనాడు ఇప్పుడున్న తీరులో ప్రణాళికాబద్ధమైన విభాగం వేదాలలో లేకపోయినా మంత్రస్వరూప - స్వభావ - ప్రయోగాలవల్ల వచ్చిన భేదం ఆ బహుత్వభావనకు మూలమని అనుకోవచ్చు పరంపరగా వచ్చిన వేదభాష్యకారుల అభిప్రాయాలను విశ్వసించటం మన కనీసధర్మం

## వేదాలెన్ని?

ఋగ్యజుస్సామవేదాలకు 'త్రయి' అనే పేరున్నది. చాలాకాలం పఱకు ఈ మూడింటి ద్వారానే యజ్ఞాలు విధింపబడినట్లు సత్యాషాఢసూత్రం పేర్కొంటున్నది[2] ఈ మూడు వేదాలుగా గౌరవింపబడి పై పేరుతో ఎంతోకాలం ప్రసిద్ధిని పొందాయి. ఋక్సామయజుర్వేదాలు మూడు యజ్ఞంనుంచి పుట్టినట్లు ఋగ్వేదంకూడ పేర్కొంటున్నది[3]. ఐతరేయబ్రాహ్మణ[4]- తైత్తిరీయ బ్రాహ్మణా[5] లలో మూడే వేదాలని నొక్కిచెప్పబడింది. వీటిని

---

1. వేదం తావదేకం సన్తమతిమహత్త్వాత్ దురధ్యేయమనేక శాఖాభేదేన సమామ్నాసిషుః, సుఖగ్రహణాయ వ్యాసేన సమామ్నాతవన్తః ని 1.20.
2. త్రిభిర్వేదైర్విధీయతే. సత్యా. సూ 1.1.
3. యజ్ఞాత్ ఋచస్సామాని జజ్ఞిరే యజుస్తస్మాదజాయత. ఋ.సం.10.90.9.
4. త్రయో వేదా అజాయన్త. ఋగ్వేద ఏవాగ్నేరజాయత, యజుర్వేదో . వాయోః సామవేద ఆదిత్యాత్, త్రయ్యా విద్యయేతి బ్రూయాత్.

   ఐ.బ్రా. 5.32.33.
5. యం ఋషయః త్రయోవిదో విదుః ఋచః సామాని యజూంషి. తై బ్రా.1.2.1.26.

   వేదైరశూన్యస్త్రిభిరేతి సూర్యః. ఇందులోనే. 3.12.

పరిశీలించినప్పుడు, ఒకప్పుడు అథర్వవేదాన్ని ఎవరూ వేదమని పట్టించుకోలేదేమో! అనిపిస్తుంది.

కానీ ఋగ్వేదం హౌత్రాన్ని, యజుస్సు ఆధ్వర్యవాన్ని, సామ ఔద్గాత్రాన్ని ప్రతిపాదించినప్పటికి బ్రహ్మకర్తవ్యప్రతిపాదనం చేసేది వీటిల్లో ఏదీలేదు. అందువల్ల యజ్ఞశరీరం సరిగా నిష్పన్నం కాలేదు. కనుక బ్రహ్మకర్తవ్యాన్ని బోధించే అథర్వవేదాన్ని గుర్తించక తప్పలేదు. ఏం పై మూడు వేదాలే ఆ పని కూడా చెయ్యలేవా? అంటే నిజమే, చెయ్యలేవు. ఆ వేదాల ప్రవృత్తి ఈ అంశాన్ని పూరించే తాత్పర్యంతో ఏర్పడలేదు. కనుక ఆపని అథర్వవేదమే చేయాలి అప్పుడే యజ్ఞం (చతుష్పాత్) నాలుగు పాదములు కలదిగా సిద్ధిస్తుంది. మొదటి మూడు వేదాలు యజ్ఞంలో వాగ్రూపమైన సగభాగాన్ని మాత్రమే నిష్పాదనం చేస్తాయి. మిగతా సగాన్ని అథర్వవేదంద్వారా మనస్సుతో బ్రహ్మ సంస్కరిస్తాడు (గో. బ్రా.3.2) కనుకనే యజ్ఞాల్లో బ్రహ్మగా అథర్వవేదజ్ఞుణ్ణే వరించాలని గోపథబ్రాహ్మణం స్పష్టంగా చెబుతున్నది[1]. 'వేదాలు మొదట మూడే; తరువాత కాలక్రమేణ అథర్వవేదానికి కూడ వేదత్వాన్ని అంగీకరించారు' అనే వాదం, సమగ్రవైదికసాహిత్యసమీక్ష చేసినవారికి సందర్భశుద్ధి లేనిదేమో! ననిపిస్తుంది.

వేదాలు నాలుగని కూడ మనకు వైదికవాఙ్మయంద్వారానే తెలుస్తున్నది. తైత్తిరీయారణ్యకం[2], బృహదారణ్యకం[3], గోపథ

1. ఋగ్విదమేవ హోతారం వృణీష్వ. యజుర్విదం అధ్వర్యుమ్. సామవిదం ఉద్గాతారమ్. అథర్వాంగిరోవిదం బ్రహ్మాణమ్. గో. బ్రా. 2.24.
2. యద్ అథర్వాంగిరసో మధోః కుల్యాః. తై. ■ 2.10.
3. అస్య మహతో భూతస్య నిశ్వసితమేతద్యదృగ్వేదో యజుర్వేదః సామవేదో౽థర్వాంగిరసః బృ.ఆ. 2.4.10.

బ్రాహ్మణం[1], ముండకోపనిషత్తు [2], నృసింహపూర్వతాపనీయోపనిషత్తు[3] అథర్వవేదానికి వేదత్వాన్ని చెబుతూ, వేదాలు నాలుగని నిరూపిస్తున్నాయి.

## వేదాలకు ఎన్ని పేర్లున్నాయి?

వేదాలకు 1. శ్రుతి 2. అనుశ్రవం 3. త్రయి 4. ఆమ్నాయం 5.సమామ్నాయం 6. ఛన్దం 7. స్వాధ్యాయం 8. ఆగమం 9. నిగమం మొ॥ తొమ్మిది పేర్లున్నాయి.

గురువు ఉచ్చరించినదాన్ని సరిగా విని తిరిగి అలాగే ఉచ్చరిస్తూ శిష్యుడు దీన్ని నేర్చుకుంటాడు కాబట్టి శ్రుతి అని అనుశ్రవం[4] అని దీనికి పేర్లు (శ్రుతిస్తు వేదో విజ్ఞేయః. మను. 2.10.). ఋగ్యజుస్సామలు మూడింటికీ త్రయి అని పేరు 'మ్నా' అనే ధాతువుకు అభ్యాసమని అర్థం. ఎప్పుడూ అభ్యసింపబడుతుంది కనుక ఆమ్నాయమని సమామ్నాయమని దీనికి పేరు. జైమిని (మీ. ద 1.2.1; 1.4.1.) యాస్కుడు (ని.7.6.4; 7.7.1.) మొ॥ వారు ఆమ్నాయ - సమామ్నాయశబ్దాలతో వేదాన్ని పేర్కొన్నారు[5]. ఛన్దశ్శబ్దానికి వేదపరంగాను, ప్రత్యేకించి సామవేదపరంగాను ప్రయోగాలున్నాయి. వేదం వంశపరంపరగా అధ్యయనం చేయబడేది కాబట్టి స్వాధ్యాయ

1. అథర్వాగ్ ఏనం ఏతాన్వేవాప్యన్విచ్ఛ. గో. బ్రా.1.4.
2. తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వవేదః ముం 1.1.
3. ఋగ్యజుస్సామాథర్వాణశ్చత్వారో వేదాః. నృ.పూ. తా. 1.2.
4. 'గురుముఖాదనుశ్రూయతే ఇత్యనుశ్రవో వేదః' అని అంటున్నాడు సాంఖ్యతత్త్వకౌముదిలో వాచస్పతిమిశ్రుడు. సాం. కా. 2.
5. 'ఆమ్నాయ- సమామ్నాయశబ్దౌ వేదే ఏవ రూఢౌ' అని లఘుశబ్దేందు శేఖరంలో నాగేశభట్టు చెబుతున్నాడు.

మనబడుతోందని తైత్తిరీయారణ్యకం వివరిస్తున్నది (2.15.7). భగవంతుని నిశ్వాసరూపంగా బయల్పడేది కాబట్టి దీనికి ఆగమమని వ్యవహారం. యాస్కుడు దీన్ని నిగమమని వ్యవహరించాడు (2.1.3.) ఇలా వేదానికి ప్రసిద్ధమైన పేర్లు చాలా ఉన్నాయి.

## వేదాధ్యయనం అంటే ఏమిటి?

'స్వాధ్యాయోఽధ్యేతవ్యః' (తై. ఆ. 2.2.5) అని తమ తమ శాఖాధ్యయనం చేయాలని వేదమే విధిస్తున్నది. దానిననుసరించి ఉపనీతుడైన శిష్యుడు పారంపర్యంగా వచ్చిన తన వేదశాఖను గురుకులంలో గురూచ్చారణను విని దాన్నే తిరిగి తిరిగి చెబుతూ సస్వరంగా వేదాన్ని వల్లెవేసే పద్ధతిని ఈనాడు వేదాధ్యయనం అంటున్నారు. అలా చేయబడిన అధ్యయనం క్రమంగా ఆశబ్దరాశిని స్వరం తప్పకుండా గుర్తుపెట్టుకొని పారాయణ చేసుకోవడానికి ఉపయోగిస్తుంది.

## అర్థజ్ఞానం అవసరమా?

స్వశాఖను అధ్యయనం మాత్రం చేస్తే చాలా? అలా కాక వల్లెవేసిన ఆశబ్దరాశిని అర్థం చేసుకోవాలా? అని కొందఱి మీమాంస. అధ్యయనం చేస్తేచాలు; దానివల్లకూడా స్వాధ్యాయాధ్యయనరూపమైన నిత్యవిధి నెరవేరినట్టేనని కొందఱు సాంప్రదాయికుల వాదం. ఇప్పటిసమాజంలో వీరి సంఖ్యే హెచ్చు. ఎందువల్లనంటే సంపూర్ణంగా ఒక శాఖను అధ్యయనం చేసేటప్పటికే పది సంవత్సరాలు కనీసం పడుతున్నది. ఇంకా ఆపైన అర్థజ్ఞానంకోసం కృషిచేయడానికి ఎంతమందికి ఉత్సాహం, అవకాశం ఉంటాయి? ఈనాటి సామాజిక - ఆర్థికపరిస్థితులలో ఏ సంపాదన చేయకుండా గృహస్థుడైనవాడు ఎలా తన కుటుంబాన్ని పోషించుకోగలడు? కనుక ఏదో ఒక ఉపాధికోసం పాకులాడక తప్పదు. కనుక మూలగ్రంథాధ్యయనంతోనే వేదవిద్యకు స్వస్తి చెప్పవలసిన పరిస్థితి ఏర్పడుతున్నది.

అంతేకాకుండా వేదభాష్యాలనర్థం చేసుకోవడానికి సామాన్య శాస్త్రాలైన న్యాయమీమాంసలతో పరిచయం తప్పనిసరి. వ్యాకరణం వేదాంగం కాబట్టి అంగాలలో తప్పకుండా నేర్చుకోవాలి అప్పుడే ఇతనికి భాష్యంలో ప్రవేశం కలుగుతుంది. ఒకప్రక్క వేదాన్ని వల్లె వేస్తూ ఇంకొకపక్క ఇతరశాస్త్రాలను చదవగలవాడే అధ్యయనం పూర్తిచేసి భాష్యాల్లో పరిశ్రమ చేయగలడు. అలా ఎంతమంది కృషిచేస్తున్నారు? కనుక కారణాలు ఏవైనా వెనుకటినుంచి అర్థజ్ఞానం మీద దృష్టి తగ్గి కేవలవేదాధ్యయనంతోనే తృప్తిపడటం కొట్టవచ్చినట్లు కనపడుతున్నది

వీరి వాదనప్రకారం వేదాలనర్థం చేసుకోకపోయినా కొంప మునిగిందేమీ లేదు; వాటిని కంఠస్థంచేసి పారాయణం చేసినా చాలు కాని ఈ సందర్భంలో ప్రాచీనుల అభిప్రాయాలను పరిశీలిస్తే అర్థజ్ఞానం సంపాదించడం తప్పనిసరి అని తేలుతున్నది. చూడండి:

అధ్యయనవిధితోపాటు అర్థజ్ఞానాన్నికూడా నిత్యకర్మగా విధిస్తున్నది వేదం - 'బ్రాహ్మణుడు నిష్కారణంగా (అంటే ఇది కామ్యం కాదు తప్పనిసరి అని అర్థం) ధర్మాన్ని, ఆరు అంగాలుకల వేదాన్ని అధ్యయనం చేయాలి, అర్థంచేసుకోవాలి[1], అని. కనుకనే సాయణుడు తన వేదభాష్యభూమికలలో 'అధ్యయనంలాగానే అర్థజ్ఞానం విధింపబడిందని[2], అధ్యయనవిధి వేదాన్ని వల్లెవేయడాన్నే చెప్పగా, అర్థాన్ని తెలుసుకోవాలని ఇంకొకవిధి చెబుతున్నదని[3], అర్థజ్ఞానం లేకుండా వేదంవల్ల చెప్పబడే అలౌకిక పురుషార్థోపాయాన్ని తెలుసుకోవడం కుదరదు కాబట్టి, కేవలం వల్లెవేయబడిన వేదానికి

1. బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః షడంగో వేదోఽధ్యేయో జ్ఞేయశ్చ మహా.1.1.
2. తస్మాదధ్యయనవదర్థజ్ఞానస్యాపి విహితత్వాత్. ఋ.వే. భా. భూ. 48.
3. అధ్యయనవిధిః పాఠమాత్ర పర్యవసాయీ. అర్థావబోధస్తు విధ్యన్తర ప్రయుక్త ఇతి సిద్ధమ్. కాణ్వ. భా భూ.109.

ముఖ్య వేదలక్షణమే సిద్ధించదని, అగ్నిలేనిచోట పడవేసిన కట్టె మండనట్లు అర్థజ్ఞానంలేని వేదపాఠం స్వార్థాన్ని ప్రకాశింపజేయజాలదని కనుక అర్థం తెలుసుకోవడం తప్పనిసరి అని పదేపదే చెబుతున్నాడు[1].

వేదాన్ని అధ్యయనం చేసి అర్థజ్ఞానం సంపాదించనివాడు అందులో ఏముందో తెలియకుండా ఏదో బరువును మోసేవాడు మాత్రమే వాడు పూలను పండ్లను ఇవ్వలేని ఎండిపోయిన చెట్టు మొద్దులాంటివాడని, అర్థం తెలిసినవాడు జ్ఞానంచేత అన్ని పాపాలను పోగొట్టుకొని శుభాన్ని పొందుతాడని యాస్కుడు చెబుతున్నాడు[2].

'వేదాన్ని మూలం మాత్రం వల్లెవేసేవాడు పూలు పండ్లులేని వాక్కును సేవిస్తున్నాడు. వేదవాక్కు అనే ఆవు, వాడికి ధర్మ, బ్రహ్మజిజ్ఞాసారూపమైన పాలనివ్వదు కనుక అర్థంతెలియని వేద వచనం ఐంద్రజాలికుడు కల్పించిన మాయగోవులాంటిదే కాని అసలు ఆవు ఎంతమాత్రమూ కాదు' అని ఋగ్వేదమే చెబుతున్నట్లు సాయణుని భాష్యం[3].

అందువల్ల వేదాధ్యయనంతోపాటు అర్థజ్ఞానాన్ని సంపాదించడానికి, దాని ప్రయోజనాన్ని తాముపొంది లోకకల్యాణాన్ని

---

1. యద్వేదవాక్యం ఆచార్యాద్గృహీతం అర్థజ్ఞానరహితం పాఠరూపేణైవ పునః పునరుచ్చార్యతే. తత్కదాచిదపి న జ్వలతి. స్వార్థం న ప్రకాశయతి. యథా అగ్నిరహితప్రదేశే ప్రక్షిప్తం శుష్కకాష్ఠం న జ్వలతి తద్వత్. తథాసతి. తస్య వాక్యస్య వేదత్వమేవ ముఖ్యం న స్యాత్. వే.భా.భూ 45.

2. స్థాణురయం భారహారః కిలాభూదధీత్య వేదం న విజానాతి యోఽర్థమ్। యోఽర్థజ్ఞ ఇత్సకలం భద్రమశ్నుతే నాకమేతి జ్ఞానవిధూతపాప్మా ॥ ని. 1.18.

3. అధేన్వా చరతి మాయయైష వాచం శుశ్రువానఫలామపుష్పామ్. ఋ.సం.10.71. 5.

కలిగించడానికి వేదాధ్యేతలందరు కృషిచేయాలి. సమాజం, ధార్మిక సంస్థలు అర్థజ్ఞానపరంపరను అంధకారంలో పడనీయకుండా జ్ఞాననిధులైన వేదాలను, వాటినధ్యయనం చేసిన పవిత్రాత్ముల్ని పరిరక్షించాలి. అజ్ఞానంతో వారినవహేళనచేయడమో! అసూయతో చిన్నచూపుచూసి తక్కువగా అంచనావేయడమో! చేస్తే అది అలాంటి వారికి వ్యక్తిగతంగానే కాక, సమాజానికి సంబంధించిన సమష్టి సంక్షేమానికి కూడ గొడ్డలిపెట్టు అవుతుంది ప్రశాంతికిరణాలను ప్రసరింపజేసే విజ్ఞానం నశించిపోయిన తరువాత మనచుట్టూ చైతన్యరహితమైన శరీరాలు, సంస్కారరహితమైన హృదయాలు అసూయాద్వేషాగ్నులతో తగలబడుతూ చిందులు తొక్కుతూ ఉంటాయేగాని, శాంతితో త్యాగంతో మనుగడ సాగించే మహనీయ స్వభావులు ఉదాహరణకు కూడా దొరకరు. ఇప్పటికే విశృంఖలం వికృతం అయిన ఈ పరిస్థితి సమాజంలో కనపడకపోవటంలేదు.

## చరణం అంటే ఏమిటి ?

ఈ చరణశబ్దం చాలా ప్రాచీనమైనది. ఇదొక వైదిక పారిభాషికపదం. నిరుక్తంలోను (1.17) పాణినీయాష్టాధ్యాయిలోను (2.4.3.) మహాభాష్యంలోను (4.2.104; 134) ప్రతిజ్ఞాపరిశిష్టంలోను పారిభాషికపదంగా దీని ప్రయోగాలు కనబడుతున్నాయి. చాలామంది చరణశబ్దానికి శాఖ అర్థమని భ్రమపడుతున్నారు. కాని చరణానికి శాఖకు ఎంతో భేదం ఉంది. శాఖలు ఏర్పడటానికి ముందున్న మూలభాగానికి చరణమనే వ్యవహారం ఉన్నట్లు తెలుస్తుంది. ఉదాహరణకు - శాకల, బాష్కల, వాజసనేయ, చరక మొదలైనవి చరణాలు. ఇవి మళ్లా కాలక్రమేణ ఒక్కొక్కటి కొన్ని శాఖలుగా విస్తరించాయి.

కనుకనే భోజవర్మ వేయించిన తామ్రశాసనంలో వాజసనేయ చరణం ఇలా పేర్కొనబడింది:

జమదగ్ని ప్రవరాయ వాజసనేయచరణాయ
యజుర్వేదకాణ్వశాఖాధ్యాయినే[1]

జమదగ్ని ప్రవర, వాజసనేయ చరణం యాజుషకాణ్వశాఖాధ్యాయి అనడంవల్ల చరణ - శాఖల భేదం స్పష్టమవుతోంది. చరణానికి అవాంతర విభాగాలే శాఖలు. అలా శాఖల మూలగ్రంథాన్ని చెప్పేదే 'చరణ' మనే వైదికపారిభాషికపదం.

**శాఖలు - అనుశాఖలు - సౌత్రశాఖలు:**

ప్రతి వేదంలోను కొన్ని చరణాలుంటాయి. చరణం కొన్ని శాఖల సముదాయం. ఈ శాఖలు వేదంలో భాగాలు, ఆ శాఖలన్నీ కలిపి ▪ వేదంగా వ్యవహరింపబడుతున్నాయి. అలాకాకుండా వేదవ్యాఖ్యానరూపాలే శాఖలనే మతంకూడా వున్నది.

**అనుశాఖలు :**

ప్రతిశాఖకు కొన్ని అనుశాఖలుండేవి. అనుశాఖలన్నా ఉపశాఖలన్నా ఒకటే అర్థం. ఈ విషయాన్ని విష్ణుపురాణం చక్కగా వివరించింది[2]. వీటినే అవాంతర శాఖలనికూడా అంటారు

**సౌత్రశాఖలు :**

ఎన్నోశాఖలు నశించిపోయాయి. ఇప్పుడు వాటికీ సంబంధించిన సూత్రాలు దొరుకుతున్నాయి. భారద్వాజ, సత్యాషాఢ సూత్రాలు అలాంటివే. వాటికి సౌత్రశాఖలనిపేరు. ఒకప్పుడు ఈ సూత్రాలకు కూడా మూలశాఖలుండేవి.

---

1. Inscription of Bengal part III, P. 21, Veerendra Research Society Rajasahi, 1929.
2. ఇత్యేతాః ప్రతిశాఖాభ్యోప్యనుశాఖా ద్విజోత్తమ. వి. పు. 3.1.25. 'అనుశాఖా అవాన్తరశాఖా' ఇతి శ్రీధరీయమ్.

## మంత్రం అంటే ఏమిటి ?

లోకంలో మంత్రం అనే పేరుతో అనేకవ్యవహారాలున్నా వైదిక పరిభాషలో మంత్రానికొక విలక్షణమైన స్వరూపం ఉంది దీన్నిగురించి వైదికవాఙ్మయంలో చాలా విచారం జరిగింది మంత్రానికేమిటి లక్షణం? అని విశ్లేషణచేస్తూ కొందఱు (విహితార్థాభిధాయకః మంత్రః) విధింపబడ్డ అర్థాన్ని వివరించి చెప్పేది మంత్రమన్నారు విధిరూపమైన మంత్రాలకు ఈ లక్షణం సరిపోదు (అవ్యాప్తి అనే దోషం) కాబట్టి ఇది అందఱికీ ఆమోదయోగ్యం కాలేదు.

పోనీ యాస్కుడు నిరుక్తంలో (7.3.6) 'మన్త్రా మననాత్' అన్నాడు కాబట్టి (మననహేతుః మన్త్రః) మననం చెయ్యడానికి హేతువయ్యేది మంత్రం అంటే పోలేదా! అని కొందఱన్నారు అనవచ్చుగాని ఆరకమైన లక్షణం బ్రాహ్మణాలకు కూడా ఉండటంవల్ల వాటిల్లో మంత్రలక్షణం పట్టవలసి వస్తుంది (అతివ్యాప్తి అనే దోషం) బ్రాహ్మణగ్రంథాలను మంత్రభాగంక్రింద తీసుకోవడం కుదరదు మఱి, మంత్రాలను చెప్పినలక్షణం అవికాని బ్రాహ్మణాలకు కూడా పట్టడం ఉచితంకాదు గదా! కనుక ఇంకో లక్షణం చెప్పవలసివచ్చింది.

యజ్ఞయాగాది కర్మలుచేస్తూ వాటిస్వరూపాన్ని స్మరించడం మొ॥ పనులకోసం యాజ్ఞికులు ప్రత్యేకంగా ఉచ్చరించే శబ్దాలే మంత్రాలు[1]. ఈ లక్షణం మంత్రాలన్నింటిలోనూ పడుతుంది. దీనికి ఏ దోషాలు రావు.

---

1. యాజ్ఞికానాం సమాఖ్యానం లక్షణం దోషవర్జితమ్,
తేఽనుష్ఠానస్మారకాదౌ మంత్రశబ్దం ప్రయుంజతే,, జై. న్యా. మా. 2.1.7.
యాజ్ఞికసమాఖ్యానస్య నిర్దోషలక్షణత్వాత్. తచ్చ సమాఖ్యానంఅనుష్ఠాన స్మారకాదీనాం మన్త్రత్వం గమయతి. వే.భా.భూ. [illegible]

## మంత్రాలెన్నిరకాలు :

మంత్ర - బ్రాహ్మణభేదంతో వేదం రెండు భాగాలుగా ఉంది (మన్త్రబ్రాహ్మణయోర్వేదనామధేయమ్, ఆపస్తంబుని యజ్ఞపరిభాష 1.33) ఇందులో సంహితాభాగానికే మంత్రభాగమని పేరు. సామాన్యంగా మంత్రాలు ఋక్కులని, యజుస్సులని, సామలని మూడురకాలు. వాటి విశేషలక్షణాలు ఆయా పరిచ్ఛేదాల ప్రారంభంలో ఇవ్వబడ్డాయి (చూ.పే.1; 133; 335)

సాయణుడు సామవేదభాష్యభూమికలో మంత్రాలను 1. అనుష్ఠాన స్మారకాలు 2. స్తుతిరూపాలు 3. యుష్మచ్ఛబ్దాన్తాలు 4. ఆమంత్రణ రూపాలు 5. ప్రైషరూపాలు 6. విచారరూపాలు 7. పరిదేవనరూపాలు 8. ప్రశ్నరూపాలు 9. సమాధానరూపాలు అని తొమ్మిదివిధాలుగా విభజించి ఉదాహరణలను ఇచ్చాడు ఇంకా ఇలాగే కొన్నిభేదాలను ఊహించుకోవచ్చన్నాడు (వే.భా భూ. 65.)

శుక్లయజుస్సంహితాభాష్య ప్రారంభంలో ఉవటుడు మంత్రాలు పదమూడురకాలని ఇలా విభజించి చెప్పాడు:

1. విధి - అశ్వస్తూపరో గో మృగః
2. అర్థవాద - దేవా యజ్ఞమతన్వత
3. యాఞ్చా-తనూపా అగ్నేఽసి తన్వంమే పాహి
4. ఆశీస్సు-ఆవో దేవాస ఈమహే
5. స్తుతి - అగ్నిర్మూర్ధా దివఃకకుత్
6. ప్రైష-హోతా యక్షత్సమిధాగ్నిమ్
7. ప్రవహ్లికా-ఇన్ద్రాగ్నీ అపాదియమ్
8. ప్రశ్న - కః స్విదేకాకీ చరతి
9. వ్యాకరణం - సూర్య ఏకాకీ చరతి
10. తర్కం - మాగృధః కస్యస్విద్ధనమ్
11. పూర్వవృత్తానుకీర్తనం - ఓషధయః సమవదన్త
12. అవధారణం - తమేవ విదిత్వాతి మృత్యుమేతి
13. ఉపనిషత్ - ఈశావాస్యమ్

శాబరభాష్యంలో 'ఆశిర' మొ॥ పదమూడు విధాల మంత్రాలు పేర్కొనబడ్డాయి. ఇలా మంత్రవిభాగంలో ఒక్కొక్కరి దృష్టి ఒక్కోరకంగా కనబడుతున్నది.

## మంత్రోచ్చారణకే ప్రభావం ఉందా?

ఈనాడు చాలామంది వేదాన్ని వల్లెవేసి పారాయణం చేస్తున్నారు గదా! అర్థం తెలియకుండా అలాచేసే పారాయణకు ప్రయోజనం ఉందా! అని కొందఱి సంశయం. తప్పకుండా ప్రయోజనం ఉందనే చెప్పాలి. కాకపోతే అర్థజ్ఞానంతో పఠించినప్పుడు సంపూర్ణమైన పుష్కలమైన ప్రయోజనం సిద్ధిస్తే అర్థజ్ఞానం లేకుండా చదివినపుడు కేవలం ఆశబ్దోచ్చారణవల్ల కలిగే ఏకొద్ది ప్రయోజనమో కలుగుతుంది నిష్ప్రయోజనం ఆపారాయణం అని అనకూడదు. మంత్రాలనేక రకాలుగా ఉంటాయి అందులో కొన్ని అర్థజ్ఞానం పొందితేనేగాని ఉపయోగించనివి. కేవలం ఉచ్చారణచేతనే కొంత ప్రయోజనాన్ని కలిగించేవి ఇంకొన్ని ఉదాహరణకు - తేలుమంత్రం పాముమంత్రం మొదలైనవి ఇవి ఉచ్చరింపబడటంతోనే ఆ శబ్దతరంగస్పందనవల్ల అవతలవాడిలో మార్పువచ్చి బాధోపశమనం కలగటం మనం చూస్తున్నాం. వాటికి అర్థప్రసక్తి లేదు. ఆ మంత్రశబ్దాలను నియమంతో కొన్ని లక్షలసార్లు ఉచ్చరించడం చేతనే వాడికి కొన్ని శక్తులు వస్తాయి.

కనుక అర్థజ్ఞానం లేకుండా కేవలం మంత్రాలను పారాయణ చేసేవారిని మనం తక్కువ చేయనక్కఱ లేదు. అయితే అంతమాత్రం చేత అర్థజ్ఞానం ముఖ్యంకాదని భ్రమపడకూడదు. విలున్నంతవఱకు ఈ రెంటికి సమన్వయభావన ఎంతైనా అవసరం.

## స్వరం అంటే ఏమిటి?

వేదమంత్రాల్లో ఉండే అచ్చులకు ఉచ్చారణను బట్టి ఉదాత్త, అనుదాత్త, స్వరితాలనే పేరుతో మూడురకాలైన స్వరాలుంటాయి[1]. ఏకశ్రుతిని కూడ ఒక స్వరంగా కొందఱంగీకరించారు. అచ్చులతో చేరటంవల్లనే హల్లులకు స్వరసంబంధం ఏర్పడుతున్నది కాని వాటికి స్వరం లేదు. అచ్చులకే స్వరాలనే పేరున్నది. అవి మూలపాఠాన్ని సంరక్షించడానికి, సందర్భానికి తగిన అర్థాన్ని నిర్ణయించుకోవడానికి ఉపయోగిస్తాయి. ఒకేపదానికి స్వరభేదాన్నిబట్టి అర్థం కూడ మారిపోతుంది.

తాలువు (దవడ) మొ॥ స్థానాలకు పైభాగంలో పుట్టిన అచ్చు ఉదాత్తమని, తాలువు మొ॥ వాటికి దిగువ పుట్టిన అచ్చు అనుదాత్తమని, ఈ ఉదాత్తానుదాత్తధర్మాలు రెండూ కలసిఉన్న అచ్చు స్వరితమని పాణిని తన అష్టాధ్యాయిలో చెప్పాడు[2]. ఇక నాల్గోది ఏకశ్రుతి. దీనికే ప్రచయ మని కూడా పేరు. ఇందులో ఉదాత్త- అనుదాత్త- స్వరితలక్షణాలేవీ కనబడవు. ఉదాత్త- అనుదాత్త స్వరాలు రెండూ స్వతంత్రమైనవి చూడండి :

అగ్నిమీళే పురోహితమ్ (ఋ.సం.1.1.1)

ఇక్కడ 'మీ' అనే అక్షరం పైన గీత ఉన్నది. అది స్వరితానికి గుర్తు. 'పు' అనే అక్షరానికి అడుగున గీత ఉన్నది. అది అనుదాత్త స్వరానికి గుర్తు. ఉదాత్తస్వరానికి ఏ రకమైన గుర్తులేదు. ఇదే నియమం.

1. ఉదాత్తశ్చానుదాత్తశ్చ స్వరితశ్చ స్వరాస్త్రయః. పా.శి.11.

2. ఉచ్చైరుదాత్తః, నీచైరనుదాత్తః, సమాహారః స్వరితః. అష్టా.1.2.29-31.

**1. ఉదాత్తం :** అథర్వవేదంలోను, ఋగ్యజుర్వేదాల్లోను ఉదాత్త స్వరానికి ఏ రకమైన గుర్తు ఉండదు. సామాన్యంగా అనుదాత్తవర్ణానికి ముందుండేది ఉదాత్తం అవుతుంటుంది.

అగ్నే యం యజ్ఞ మధ్వరమ్ (ఋ.సం. 1.1.4)

ఈ మంత్రంలో '**అ**' అనే వర్ణం ఉదాత్తం. అలాగే అనుదాత్త వర్ణాలైన 'గ్నే' '**య**' '**ధ్వ**' అనే వర్ణాలకు ముందుండటంవల్ల 'యం' '**జ**' '**ర**' అనే వర్ణాలు ఉదాత్తస్వరం కలవి సామవేదంలో ఉదాత్త వర్ణానికి పైన **1** అనే అంకెను వేస్తారు.

**2. అనుదాత్తం :** ఋగ్యజుర్వేదాల్లోను అథర్వవేదంలోను ఇది అక్షరానికి అడుగున ఉండే గీతద్వారా తెలియజేయబడుతుంది ఉదా: 'అగ్నిం' ఇక్కడ 'అ' అనే అక్షరం అనుదాత్తం సామవేదంలో అనుదాత్తవర్ణానికి పైన 3 అనే అంకెను వేస్తారు. (కొందఱు 2 వేస్తారంటారు). యజుర్వేదంలోను శతపథబ్రాహ్మణంలో స్వరాంకన పద్ధతిని ఇంకోరకంగా కొందఱు చెబుతారు.

**3. స్వరితం :** ఉదాత్తానుదాత్తస్వరాల సమ్మిశ్రమే స్వరితం. గ్రీకుభాషలోని సర్కంఫ్లెక్స్ (**Circumflex**) స్వరితంలాగానే ఉంటుంది. ఋగ్యజురథర్వవేదాల్లో స్వరితవర్ణంపైన నిలువుగీతతోను ('అగ్ని మీళే' ఇక్కడ 'మీ' అనే అక్షరం స్వరితం), **సామవేదంలో 2అంకెతోను** గుర్తింపబడుతుంది (కొందఱు **3** వేస్తారంటారు). ఇది **1.** సన్నిధిజం **2.** జాత్యం **3.** అభినిహితం **4.** క్షైప్రం **5.** ప్రశ్లిష్టం **6.** తైరోవ్యంజనం **7.** వైవృతం పాదవృత్తం **8.** తైరోవిరామం **9.** తథాభావ్యమని తొమ్మిది విధాలని ప్రాతిశాఖ్యం చెబుతున్నది.

**4. ఏకశ్రుతి / ప్రచయం:** ఏకశ్రుతిలో **ఉదాత్తానుదాత్త** స్వరిత కార్యాలేవీ కనపడవు. సామాన్యంగా స్వరితవర్ణం **తరువాత** వచ్చే

వర్ణాలలో ఏ గుర్తు లేకపోతే వాటిని ఏకశ్రుతి వర్ణాలనుకోవచ్చు. చూడండి :

హోతా[1]రం రత్నధాత[1]మమ్ (ఋ.సం. 1.1.1)

ఇక్కడ 'తా' స్వరితవర్ణం, దాని తరువాత నున్న 'రం ర' అనే రెండువర్ణాలు ఏకశ్రుతివర్ణాలు. అవి అనుదాత్తవర్ణాలతో పోలిఉంటాయి.

## స్వరం వల్ల ఏం ప్రయోజనం?

ఈ స్వరం కేవలం వైదికభాషకు మాత్రమే కాదు; పూర్వం లౌకికభాషలో కూడా పాటింపబడేది. ఇప్పటికీ మన సంభాషణల్లో కొన్ని పదాలను ఒత్తిపలకడంద్వారా, దీర్ఘం తీయటంద్వారా అర్థభేదం రావడం గమనిస్తూనే ఉన్నాం. వేదాల్లో స్వరభేదాన్ని బట్టి అర్థభేదం ఎంతో కనపడుతుంది చూడండి;

హనో వృత్రం జయా[1] అపః (ఋ. సం. 1.80.3.)

జయో మే[1] సవ్య ఆహి।తః (అ.సం. 7.52.8)

పై రెండు మంత్రాల్లోను 'జయ' అనే ఒకే పదం ఉన్నా స్వరంలో తేడా ఉంది. ఋగ్వేదమంత్రంలోని 'జయా' అనే పదంలో 'జ' ఉదాత్తం. కనుక పదం ఆద్యుదాత్తం (మొదట ఉదాత్తవర్ణం కలది.). కనుక 'ఓ ఇంద్రా! నీవు నీటిని జయింతువు గాక!' అని క్రియాపదంగా అర్థం చెప్పాలి. ఇక అథర్వమంత్రంలోని 'జయ' అనే పదంలో 'య' ఉదాత్తం కాబట్టి అది అంతోదాత్తం (చివఱ ఉదాత్తవర్ణం కలది). ఇది క్రియాపదం కాదు. దీనికి 'జయం' అని అర్థం. 'జయం నా ఎడమ చేతిలో ఉంది' అని అర్థం. వేదభాష్యకారులంతా ఈ స్వరనియమాలను దృష్టిలో పెట్టుకొనే వ్యాఖ్యానిస్తారు. స్వరభేదంవల్ల అర్థమెలా మారుతుందో చూడండి:

| | పదం | అర్థం |
|---|---|---|
| 1. | జ[1]ఠరః | అగ్ని |
| | జఠరః | పొట్ట |
| 2. | సత్యమ్ | నిజము |
| | స[1]త్యమ్ | దరిద్రము |
| 3 | జ్యే[1]ష్ఠః | = ప్రశంసింపదగినవాడు |
| | జ్యేష్ఠః | = వయసులో పెద్దవాడు |

ఇలా పదం ఒకటిగా కనపడినా స్వరభేదంవల్ల అర్థభేదం వస్తుంది. ఏ అర్థంలో ప్రయోగించాలో తెలుసుకోవాలంటే స్వర స్వరూపం అవగతం కావాలి.

స్వరజ్ఞానం లేకపోవడంవల్ల ప్రయోజనం కలగకపోగా అనర్థాలు సంభవించే ప్రమాదం లేకపోలేదు. పాణినీయశిక్షలో స్వరజ్ఞానలోపంవల్ల కలిగే ప్రమాదం ఇలా అభివర్ణింపబడింది. చూడండి:

ఇన్ద్రశత్రుర్వర్ధస్వ (తై. సం. 2.4.12.1)

ఈ మంత్రంలో `ఇన్ద్రశత్రుః' అనే పదానికి `ఇంద్రుని శత్రువు (చంపేవాడు)' అని తత్పురుష సమాసం చెప్పాలి. అలా చెప్పాలంటే అది అంతోదాత్తం (చివఱ ఉదాత్తస్వరం కలది) కావాలి. కాని ఆద్యుదాత్తంగా (మొదటి ఉదాత్తస్వరం కలదిగా) ప్రయోగింపబడింది. సమాసం మారిపోయి తత్పురుషం కాస్తా బహువ్రీహి అయింది. `ఇంద్రుడు చంపేవాడుగా ఎవరికి ఉన్నాడో వాడు' అనే విరుద్ధార్థం ఏర్పడింది. కనుక ప్రమాదాలు తప్పాలంటే స్వరజ్ఞానం తప్పనిసరి అని తెలుస్తున్నది.

## వేదానికి కాలనిర్ణయం చేయవచ్చా?

మానవుల రచనలకు కాలనిర్ణయం చేయవచ్చు. కాని అపౌరుషేయాలు, నిత్యసత్యాలు, భగవంతుని నిశ్వాసరూపాలైన వేదాలకు కాలనిర్ణయం చేయబూనడం హాస్యాస్పదం. కనుక వేదాలు అనాదులు అనంతాలు నిత్యాలు అని వైదికుల దృఢవిశ్వాసం. కొందఱు పాశ్చాత్యులు, వారి అనుయాయులైన భారతీయులు వేదాలకు కాలనిర్ణయం చేయడానికి ఉపక్రమించారు. వారి ఊహాలు అందరికీ అంగీకారయోగ్యాలు కాకపోయినా, వారు పడిన శ్రమ మాత్రం అసాధారణమైందని చెప్పక తప్పదు.

మాక్స్ ముల్లర్ క్రీ. పూ. 1200 సం॥లకు ముందు వేదాలు ఏర్పడినాయన్నాడు. ఇంకొందఱు 3, 000 సం॥లకు ముందని అన్నారు. బాలగంగాధరతిలక్ క్రీ. పూ. 4,000 సం॥లకు ముందు వేదాలు ఏర్పడినట్లు అభిప్రాయపడ్డాడు. క్రీ.పూ.7,000 నాటివి వేదాలని పావగీపండితుడనుకున్నాడు. అవినాశచంద్రదాసు క్రీ పూ. 25,000 సం॥లకు నుంచి 75,000 సం॥ మధ్య వేదనిర్మాణ కాలమని నిశ్చయించాడు. సనాతనధర్మపరాయణులు, సంప్రదాయవిదులు ఈ నిర్ణయాలు వేటిని అంగీకరించరు. వారి దృష్టిలో ఇవి ఒకప్పు డేర్పడ్డవికావు. ఆవిర్భవిస్తూ అంతర్ధానాన్ని పొందుతూ మళ్లా ఆవిర్భవిస్తూ ఉండే నిత్యమైన శబ్దరాశి ఇది.

ఈనాడు మనకు దొరుకుతున్న వేదశాఖల భాష వగైరాలను దృష్టిలో పెట్టుకొని ఈ కాలనిర్ణయాలేర్పడ్డాయి. కాని ఈ అనంత కాలంలో ఎన్నిశాఖలావిర్భవించాయో ఎన్ని మటుమాయమైనాయో ఎన్నింట్లో ఏ మార్పులు సంభవించాయో! మనం చెప్పగల్గినవిషయం కాదు. అలాంటప్పుడు అనంతమైన వేదరాశికి కాలనిర్ణయం ఎలా కుదురుతుంది?

## సంహితలలో ముందువెనుకలున్నాయా?

వైదికవాఙ్మయంలో పరిశోధనలు చేసిన పాశ్చాత్యులు వేదసంహితలన్నింటిలో ఋక్సంహిత చాలా ప్రాచీనమైందని చెబుతారు. వారిదృష్టిలో రెండవమండలం మిగతా మండలాలంత ప్రాచీనం కాదు. ఋక్సంహితకు పరిశిష్టంలాంటిది పదవమండలం. సామసంహితలోగల చాలా మంత్రాలు ఋక్సంహితలోనివే. ఋక్సంహితకంటే శుక్లయజుస్సంహిత నవీనమైనది. అథర్వసంహిత మిగతా మూడు వేదాలకు పరిశిష్టంలాంటిది.

వైదిక సంప్రదాయవిదులు ఈ సిద్ధాంతాన్ని అంగీకరించరు. వారిలా అంటారు: ఇది కేవలం సంహితల బాహ్యస్వరూపాన్ని మాత్రం చూసినప్పుడు కలిగే భ్రమ. ఋక్సంహితలోనే ఇతర వేదాలప్రస్తావం ఎన్నోచోట్ల కనిపిస్తున్నది. యజుస్తస్మాదజాయత (ఋ. సం. 10.90.9) తమేవ ఋషిం తము బ్రహ్మాణ మాహుర్యజ్ఞన్యం సామగాముక్థశాసమ్ (ఋ.సం.10.107.6), ఋక్సామభ్యామభిహితౌ (ఋ.సం.10.85.11), గాయత్సామ నభన్యమ్ (ఋ.సం. 1.173.1) రథన్తరమాజభారా వసిష్ఠః (ఋ.సం.10.181.1), రథన్తరే సూర్యమ్పర్యపశ్యత్ (ఋ.సం. 1.164.25).

పై ఉదాహరణలద్వారా ఋక్సంహితలో ఇతర వేదప్రస్తావం స్పష్టంగా తెలుస్తున్నది. వేదరాశినుంచి ఋక్కులనన్నింటిని కూర్చి సంహితగా రూపొందించిననాటికే ఇతర వేదాలు సంకులావస్థలో ఉన్నాయి. మానవుడు చేసిన రచనకాదు కాబట్టి మానవరచనా ధర్మాలను నిత్యమైన వేదంలో ఆరోపించడం న్యాయ్యంకాదు. వేదవ్యాసుడు సంహితలను కూర్చినవాడే గాని రచయిత కాదు. కనుక వేదాలలో ముందువెనుకలుండటం అసంభవం.

పాశ్చాత్యులవాదం కేవలం కూర్పు వరకే పరిమితమైతే కొంతకు కొంత నయం. కానీ వారి ధోరణి అలా కనపడదు. ఈ విషయాన్ని

గురించి ఇంకా విశేషాలు పం. సత్యవ్రత సామాశ్రమి వ్రాసిన 'వేదత్రయీ పరిచయం'నుంచి తెలుసుకోవచ్చు. పాశ్చాత్య సిద్ధాంతాల ఖండనం అందులో దొరుకుతుంది.

**వేదాంగాలేవి? ఏమిటి వాటి ప్రయోజనం?**

అతిగంభీరమైంది వేదం. దాన్ని సరిగా అర్థంచేసుకోవడానికి ఏర్పడినవే వేదాంగాలు. అవి శిక్ష, కల్పం, వ్యాకరణం, నిరుక్తం, ఛన్దస్సు, జ్యోతిషమని ఆఱు. వేదానికి ఛందస్సు పాదాలు, కల్పం హస్తాలు, జ్యోతిషం నేత్రం, నిరుక్తం శ్రవణేంద్రియం, శిక్షప్రాణం వ్యాకరణం ముఖం అని పాణినీయశిక్ష చెబుతున్నది[1]. ఈ అంగాల స్వరూపం తెలియందే వేదహృదయం సరిగా అర్థం కాదు. వేద సంహితలు, బ్రాహ్మణాలు, ఈ వేదాంగాలు అపరవిద్యలు. పరమపురుషార్థమైన బ్రహ్మజ్ఞానాన్ని కలిగించే ఉపనిషత్తులు పరవిద్య (ము. 1.1.4.5).

**శిక్ష :**

వేదంలోని అకారాది వర్ణాలను, ఉదాత్తాదిస్వరాలను, హ్రస్వాది మాత్రలను, స్థాన ప్రయత్నాది బలాలను, నిషాదాదిసామను, వికర్షణాది సన్తానాన్ని తెలియజేసేది శిక్ష. ఇవి సుమారు ముప్పై గ్రంథాలు దొరుకుతున్నాయి. అందులో యాజ్ఞవల్క్య-వాసిష్ఠ-కాత్యాయనీయ-పారాశరి-మాండవ్య-నారదీయ-శౌనక-గౌతమీ-పాణినీయశిక్షలు ప్రధానమైనవి.

**కల్పం :**

శ్రౌతసూత్రగ్రంథాలకు కల్పమని పేరు. వీటిని కల్పసూత్రా

---

1. ఛన్దః పాదౌ తు వేదస్య హస్తౌ కల్పోఽథ పఠ్యతే ।
జ్యోతిషామయనం చక్షుర్నిరుక్తం శ్రోత్రముచ్యతే ॥
శిక్షా ప్రాణస్తు వేదస్య ముఖం వ్యాకరణం స్మృతమ్ । పా.శి. 41-42.

లనికూడా అంటారు. శ్రుతిప్రతిపాదితమైన యజ్ఞయాగాదుల ప్రయోగాలను వివరిస్తాయి.

శాంఖాయన-ఆశ్వలాయన-మశక-లాట్యాయన-దాక్షాయణ-కాత్యాయన-ఆపస్తంబ-వైతాన శ్రౌతసూత్రాలు ప్రసిద్ధాలు.

**వ్యాకరణం :**

ఇది శబ్దాలలోని ప్రకృతి-ప్రత్యయాలను వివరిస్తూ పద స్వరూపాన్ని నిష్కృష్టంగా చెప్పి దానిద్వారా అర్థనిశ్చయాన్ని పొందడానికి ఉపయోగిస్తుంది. రక్షోహాగమలఘ్వసందేహాలు దీనికి ప్రయోజనంగా చెప్పబడ్డాయి.

1. **రక్ష**: వేదరక్షణ వ్యాకరణానికి ప్రథమ ప్రయోజనం. వర్ణలోప, ఆగమ, వికారాలను బాగా తెలుసుకున్నవాడు వేదాలను రక్షించి, వాటి అర్థాన్ని తెలుసుకోగలుగుతాడు.

2. **ఊహ**: యజ్ఞయాగాల్లో లింగవిభక్తులను అవసరమైనచోట్ల మార్చాలంటే వ్యాకరణం తెలిసి ఉండాలి.

3. **ఆగమం**: వేదాంగాలలో వ్యాకరణం ప్రధానం. సాంగంగా వేదం చదువుకోవాలి అనడంవల్ల ప్రధానమైన వ్యాకరణం చదవడం తప్పనిసరి అని తెలుస్తున్నది. కనుక ప్రధానాంగాన్ని చదవడం ద్వారా విధిని గౌరవించిన ఫలం కలుగుతుంది.

4. **లాఘవం**: వ్యాకరణజ్ఞానం లేనిదే లఘూపాయంద్వారా శబ్దజ్ఞానం కలుగదు. కనుక శబ్దజ్ఞానం తేలికగా కలగడానికి వ్యాకరణం చదవాలి.

5. **అసందేహం**: యజ్ఞయాగాదులు చేసేటప్పుడు పదాలకు సరైన అర్థాన్ని నిర్ణయించాలంటే వ్యాకరణం తప్పకుండా కావాలి. ఇతర ప్రయోజనాలు వే. భా. భూ. 52 లో వివరింపబడినాయి.

## నిరుక్తం :

అర్థావబోధకలగడంలో ఇతరాపేక్ష లేకుండా ఎక్కడ పదాలు నిర్వచింపబడ్డాయో అది నిరుక్తం. యాస్కమహర్షి దీని రచయిత. ఇది 1. నైఘంటుక 2. నైగమ 3. దేవతాకాండలని మూడుభాగాలు. మొదటికాండలో పృథివ్యాదిలోకాలు, దిక్కులు, కాలాలు మొ॥ వాటికి సంబంధించిన శబ్దాలు చెప్పబడ్డాయి. రెండవకాండలో మనుష్యులు వారి అవయవాలు మొ॥ శబ్దాలు వివరింపబడ్డాయి. మూడవకాండలో పై రెంటిలోని బహుత్వ హ్రస్వత్వాది ధర్మాలకు సంబంధించిన పేర్లు చెప్పబడ్డాయి.

## ఛన్దస్సు :

గాయత్రి మొ॥ ఛందస్సుల జ్ఞానం ఛన్దశ్శాస్త్రపరిచయంలేనిదే కలగదు. ఆయా మంత్రాలకు ఋషి, ఛన్దస్సు, దేవత తెలియకుండా యజ్ఞయాగాదుల్లో ప్రయోగించడం అధ్యాపనం చేయడం చాలా తప్పని ప్రతిమంత్రానికి వీటిని తెలుసుకోవాలని కాత్యాయనసర్వానుక్రమణి (1.1.) చెబుతున్నది. అది తెలుసుకోవడానికి ఛన్దోగ్రంథాలుపయోగపడతాయి.

## జ్యోతిషం :

జ్యోతిశ్శాస్త్రజ్ఞానం లేనిదే ఏ యజ్ఞం ఎప్పుడు చేయాలో సరిగా నిర్ణయించుకోవడం కుదరదు. వేదంలో ప్రత్యేకకాలాల్లో చేయవలసిన యాగాలు కొన్ని ఉన్నాయి. (సంవత్సరమేతద్ వ్రతం చరేత్ తై. ఆ. 1.32.1, వసన్తే బ్రాహ్మణోఽగ్నీనాదధీత....తై. సం. 5.6.5.1). వాటిని సరిగా ఆచరించడానికి కాలనిర్ణయం కావాలి. అది జ్యోతిశ్శాస్త్రంపై ఆధారపడి ఉంది. కనుక ఈ [redacted] అంగాలు వేదాన్ని అధ్యయనం చేయడానికి అర్థాన్ని తెలుసుకోవడానికి బాగా ఉపయోగిస్తాయి.

## ప్రాతిశాఖ్యలంటే ఏమిటి?

ప్రాతిశాఖ్యలు వేదరక్షణకోసం ఏర్పడ్డాయి. ప్రతిశాఖకు సంబంధించిన వర్ణసమామ్నాయం, స్వర - వ్యంజనసంఖ్య, స్వరోచ్చారణ పద్ధతులు, సంధులు, ప్రగృహ్యసంజ్ఞలు, పదవిభాగ నియమాలు, వాటికి అపవాదాలు, శబ్దవ్యుత్పత్తులు, నిర్వచనాలు ఇందులో విచారించబడతాయి కాబట్టి వీటికి ప్రాతిశాఖ్యలని పేరు. ప్రాచీన భారతీయుల సంస్కృతభాషోచ్చారణ పద్ధతులను యథా తథంగా మనం వీటిద్వారా తెలుసుకోవచ్చు. ప్రాచీనభాషల ధ్వనిసిద్ధాంతాలను తెలిసికొనగోరే భాషాశాస్త్రజ్ఞులకు నిజంగా ఇవి ఎంతో ఉపకారం చేస్తాయి.

వేదశాఖలకన్నింటికి ప్రత్యేకమైన ప్రాతిశాఖ్యలుండేవని చెబుతారు. శాఖలకే నిలువనీడలేక నశించిపోయినప్పుడు ప్రాతిశాఖ్యలకు చోటెక్కడ దొరుకుతుంది. ▪ విజ్ఞానమంతా బూడిదపాలైంది. కాలగర్భంలోకి పోయినవి పోగా ఇప్పటికీ అయిదు ప్రాతిశాఖ్యలు దొరుకుతున్నాయి.

**1. ఋక్ప్రాతిశాఖ్యమ్ :**

అన్నింటిలో ప్రధానమైంది ఋక్సంహితకు సంబంధించిన ఋక్ప్రాతిశాఖ్యం. దీనికి 'పార్షదసూత్రమ'ని కూడ పేరు. ఛన్దస్సుకు ఇందులోగల వివరణ ప్రశంసనీయం. ఇది శౌనక ప్రణీతమని చెబుతారు. ఇందులో మూడు అధ్యాయాలున్నాయి. ఇది ఫ్రెంచి భాషలో ఎ. ఎగ్నియర్ చేత **1858**లో ప్రచురింపబడింది. దీన్ని ఎఫ్. మాక్సముల్లర్ జర్మన్ టిప్పణితో **1869**లో ప్రచురించాడు.

**2. తైత్తిరీయప్రాతిశాఖ్యమ్ :**

ఇది ఇరవైనాలుగధ్యాయాలు కలది. చాలా సాంకేతికంగా

ఉంటుంది. దీనికి 'త్రిరత్న' భాష్యం ఉంది. దీని స్వరూపం ఇప్పటికీ చెక్కుచెదరకుండా ఉంది.

**3. శుక్లయజుఃప్రాతిశాఖ్యమ్ :**

ఇది కాత్యాయనమునిప్రణీతం. ఎనిమిది అధ్యాయాలుగల ఈ ప్రాతిశాఖ్యానికి ఉవటుడు 'మాతృమోదం' అనే భాష్యం వ్రాశాడు. ఇది ఆఱుఖండాలుగా కాశీనుంచి ప్రచురింపబడింది.

**4. సామప్రాతిశాఖ్యమ్ :**

సామసంహితకు సంబంధించిన ప్రాతిశాఖ్యాన్ని పుష్పర్షి వ్రాశాడు. శాకటాయనుడు వ్రాసిన 'ఋక్తంత్రమ్' ప్రసిద్ధం. దీనిద్వారా ఇంకాకొన్ని గ్రంథాలేర్పడ్డాయి. వాటిలో 'పుష్పసూత్రమ్' అనేది ముఖ్యమైంది. దీన్ని ప్రాతిశాఖ్యం అని కూడా అంటారు. ఇందులో పది ప్రపాఠకాలు, పదకొండు కండికలు ఉన్నాయి. సామగానానికి సంబంధించిన వివరాలు దీనిలో ఇవ్వబడ్డాయి. సామతంత్రం, పంచవిధసూత్రం అనేవి దీనికి పరిశిష్టాలు.

**5. అథర్వప్రాతిశాఖ్యమ్ :**

అథర్వవేదానికి రెండు ప్రాతిశాఖ్యలు. రెంటిలో బాగా ముఖ్యమైంది 'శౌనకీయ చతురధ్యాయి' అని పిలువబడుతోంది.

**బృహద్దేవత అంటే ఏమిటి?**

బృహద్దేవత మన్త్రదేవతాస్వరూపాలను ప్రతిపాదించే గ్రంథం. దేవత మన్త్రంచేత ప్రతిపాదింపబడే విషయం. అందుకే దేవతకిలా లక్షణం చెబుతారు. 'దాని (మంత్రం) చేత ఏది చెప్పబడుతుందో అది దేవత' (యా తేనోచ్యతే సా దేవతా) అని.

సామన్యంగా దేవతాస్వరూపాన్ని ప్రతిపాదించేటప్పుడు అధిదైవిక, అధిభౌతిక, ఆధ్యాత్మికార్థాలు మూడు చెబుతుంటారు.

కాని బృహద్దేవతలో ఒకే మహాదేవతగా పరమేశ్వరుడే ప్రధానంగా ప్రతిపాదించబడినాడు ఈ విషయంలో ఇతరగ్రంథాలకు దీనికి పొత్తు కుదరదు. ఇది ఒకరకంగా ఏకదేవతావాదాన్ని బలపరుస్తున్నట్లు కనబడుతుంది

పూర్వం బృహద్దేవత అనే పేరుతో ప్రతివేదానికి సంబంధించిన మంత్రదేవతాస్వరూపాలను విచారించే గ్రంథాలు ఉండేవి. రానురాను మన దౌర్భాగ్యంవల్ల అవి నశించిపోగా, ఒక్క ఋగ్వేదానికి మాత్రమే ఇప్పుడు 'బృహద్దేవత' అనే ఈ గ్రంథం దొరుకుతున్నది. మిగతా వేదాలకు ఇలాంటి గ్రంథం ఎక్కడా దొరకడంలేదు.

ప్రస్తుతం దొరుకుతున్న ఈ బృహద్దేవత శౌనకుని రచన. చారిత్రికులు ఇది క్రీ.పూ. 4వ శతాబ్దంలో వ్రాయబడిందని చెబుతారు. కాని ఋగ్వేదానికి గల స్కందస్వామిభాష్యంలోను, ఉద్గీథభాష్యంలోను, వేంకటమాధవభాష్యంలోను బృహద్దేవత స్మరింపబడింది. అలాగే ఉవటాచార్యుడు తనభాష్యంలోను, దుర్గాచార్యుడు నిరుక్తవృత్తిలోను దీన్ని పేర్కొన్నారు. కనుక వీరందఱి రచనలకంటే ఇది ప్రాచీనమని తెలుస్తున్నది.

**అనుక్రమణికలంటే ఏమిటి?**

అనుక్రమణికలనే ఈ గ్రంథాలు వేదాల స్వరూపాన్ని ఉన్నది ఉన్నట్లుగా కాపాడటానికే ఏర్పడ్డాయి. అంతమాత్రమే కాకుండా ఇవి వేదార్థాన్ని తెలుసుకోవడానికి కూడా ఉపయోగపడతాయి. ఒక్కొక్క వేదాన్ని దర్శించిన మహర్షులెవరు? ఈ మంత్రాలకు దేవతలెవరు? ఈ సంహితలో ఏయే ఛందస్సులున్నాయి? ఈ సంహితా విభాగం ఎలా ఉంది? ఇలాంటి ప్రశ్నలకు సమాధానాలు మనకు అనుక్రమణుల్లో లభిస్తాయి.

శౌనకమహర్షి ఋగ్వేదరక్షణంకోసం 1. ఆర్షానుక్రమణి 2 ఛన్దోనుక్రమణి 3. దేవతానుక్రమణి 4. అనువాకానుక్రమణి 5.సూక్తానుక్రమణి 6 ఋగ్విధానం 7. పాదవిధానం 8. బృహద్దేవతా 9. ప్రాతిశాఖ్యం 10. శౌనకస్మృతి అనే గ్రంథాలు వ్రాశాడు. ఇందులో మొదటి ఏడు గ్రంథాలు అనుక్రమణికావాఙ్మయంలో చేరతాయి

కాత్యాయనుడు ఋక్సర్వానుక్రమణిని వ్రాశాడు. ఉవట భాష్యంతోను, షడ్గురుశిష్యుడు వ్రాసిన 'వేదార్థదీపిక' అనేవృత్తితోను దీన్ని మెగ్డానల్ 1896లో ప్రచురించాడు. అనుక్రమణులన్నింటిలో గల విషయాలన్నీ ఇందులో సంక్షేపంగా ఉన్నాయి.

అథర్వవేదానికి గల 'బృహత్సర్వానుక్రమణి' చాల విశిష్టమైన గ్రంథం. ఇందులో అథర్వవేదానికి సంబంధించిన ఋషి - దేవత - ఛన్దస్సు మొ॥ వాటి వివరాలున్నాయి అథర్వసంహితలోని 20వ కాండకు సంబంధించిన వివరాలు ఆశ్వలాయనీయానుక్రమణిలో ఇవ్వబడ్డాయి.

కాత్యాయనుడు వ్రాసిన 'శుక్లయజుస్సర్వానుక్రమసూత్రం' అయిదు అధ్యాయాల్లో ఉన్నది. అనన్తదేవుడు దీనికి ఎంతో అందమైన భాష్యం వ్రాశాడు.

యాస్కుడు కృష్ణయజుర్వేదానికి 'యాజుషసర్వానుక్రమణి' వ్రాశాడు. ఇందులో ఛందస్సు ప్రత్యేకంగా నిరూపించబడింది.

**వేదభాష్యాలు - భాష్యకారులు :**

చరిత్రకందని కాలంనుంచి వేదార్థావగమనంకోసం ఎన్నెన్నో భాష్యాలు, వ్యాఖ్యానాలు, ఉపవ్యాఖ్యానాలు ఏర్పడి కొన్ని ప్రచారంలో ఉన్నాయి. ఇంకొన్ని కాలగర్భంలో కలిసిపోయాయి. అది కాల

సహజమైన లక్షణం. ఇప్పటికి మనకు దొరుకుతున్న వివరాలనుబట్టి సుమారు 25 మంది భాష్యకారులున్నట్లు తెలుస్తుంది

## యాస్కుడు :

వేదంలోని నిగూఢార్థాలుకల పదాలను సంకలనంచేసి ప్రాచీనాచార్యులెవరో నిఘంటువును తయారుచేశారు. దానికి వ్యాఖ్యానం లాంటిదే యాస్కుని నిరుక్తం. ఈనాడు భాషాశాస్త్రాలపైన జరుగుతున్న తర్జనభర్జనలకు ఇది ముఖ్యాధారం తరువాత వేదభాష్యాలు వ్రాసిన వారందఱు నిరుక్తాన్ని పరమప్రమాణంగా తీసుకున్నారు.

## ఋగ్వేదభాష్యాలు :

### 1. స్కందస్వామి:

యాస్కుని తరువాత అదే ఒరవడిలో ఋగ్వేదానికి భాష్యం వ్రాసినవాడు స్కందస్వామి ఇప్పటికి దొరుకుతున్న ఋగ్వేదభాష్యాల్లో ఇదే మొదటిది. కాని స్కందస్వామి తన భాష్యంలో అక్కడక్కడ పేర్లు చెప్పకుండా 'కొందఱు' అని ఇతరభాష్యకారులను స్మరించడం చూస్తే అంతకుముందు కొన్ని భాష్యాలున్నట్లు తోస్తుంది ఇతడు వలభినివాసి. ఇతని తండ్రిపేరు భర్తృధ్రువుడు. 7వ శతాబ్దంలో ఇతడున్నట్లు తెలుస్తుంది. వేదార్థాన్ని పూర్తిగా తెలుసుకోవాలంటే ఛన్దస్సు బాగా తెలియాలని ఇతడభిప్రాయపడ్డాడు. ఇతని భాష్యం యజ్ఞపరమైనది. ఋక్సంహితకు ప్రథమాష్టకానికి పూర్తిభాష్యం దొరుకుతున్నది. మిగత అష్టకాలభాష్యం దాక్షిణాత్యగ్రంథాలయాల్లో ఉన్నట్లు తెలుస్తుంది.

### 2. నారాయణాచార్యుడు:

ఇతడు స్కందస్వామికి భాష్యరచనలో సాహాయ్యం చేసినవాడు.

ఋక్సంహితలోని ఐదు, ఆరు, ఏడు అష్టకాలకు అక్కడక్కడ భాష్యం వ్రాశాడు.

**3. ఉద్గీథాచార్యుడు:**

వేదభాష్యకారులలో గొప్ప ప్రసిద్ధికలవాడితడు. కాని ఋక్సంహితకు ఈయన భాష్యం పదవమండలంలోని అయిదవ సూక్తం నుంచి ఎనభైమూడవసూక్తం వరకే దొరుకుతున్నది. సాయణుడీయనను చాలాసార్లు తన భాష్యంలో స్మరించాడు. ఇతని ఒరవడిలోనే సాయణభాష్యం నడిచింది ఉద్గీథుడు స్కందస్వామి సమకాలికులు. ఇదికూడ యజ్ఞపరమైన భాష్యమే.

**4. హస్తామలకుడు:**

ఇతడు ఎనిమిదవ శతాబ్దం వాడు ఋగ్వేదభాష్యకారుడుగా ప్రసిద్ధి ఉందికాని ఆ గ్రంథం ఇంతవఱకు దొరకలేదు

**5. వేంకటమాధవుడు:**

కౌశికగోత్రుడైన వేంకటమాధవుడు కావేరీ ప్రాంతంవాడు ఇతని తల్లిదండ్రులు సుందరీవేంకటాచార్యులు. పదవశతాబ్దంలో ఇతడు ఋక్సంహితకు 'ఋగరదీపిక' అనే భాష్యం వ్రాశాడు. ఇదికూడ యజ్ఞపరమైన భాష్యమే వేదార్థాన్ని తెలుసుకోవడానికి కేవలం నిరుక్త వ్యాకరణజ్ఞానం మాత్రంచాలదు బ్రాహ్మణగ్రంథపరిచయం కూడా ఉండాలని ఇతని అభిప్రాయం[1].

**6. లక్ష్మణాచార్యుడు:**

ఇతడు ఋక్సంహితకు 'వేదభూషణమ్' అనే భాష్యం వ్రాశాడు. అది ఇంకా వెలుగు చూడలేదు. పన్నెండవ శతాబ్దంలో ఇతడున్నట్లు చెబుతారు.

---

1. సంహితాయాస్తురీయాంశం విజానన్త్యధునా జనాః ।
నిరుక్తవ్యాకరణయోరాసీ ద్యేషాం పరిశ్రమః ॥

**7. అనన్దతీర్థుడు :**

ద్వైతసంప్రదాయ ప్రవర్తకుడైన మధ్వాచార్యుడే ఆనన్దతీర్థుడు. 13వ శతాబ్దంలో (1198-1270) కర్ణాటకంలో ఉన్న ఈయన ఋక్సంహిత ప్రథమమండలంలోని మొదటి 40 సూక్తాలకు దిగ్దర్శనంగా ఏకదేవతావాదపరమైన భాష్యం వ్రాశాడు. పరమేశ్వరుడైన విష్ణువే సకలవేదప్రతిపాద్యుడని ఈయన సిద్ధాంతం.

**8. ఆత్మానన్దతీర్థుడు:**

ఋక్సంహిత ప్రథమమండలంలోని 40 సూక్తాలకు ఈయన భాష్యం వ్రాశాడు. 'అస్య వామస్య' సూక్తానికి (1.164) భాష్యం వ్రాసిన ఆత్మానందుడు ఈయన ఒకటే కావచ్చు. 13వ శతాబ్దంలోని వాడితడు.

**9. ముద్గలాచార్యుడు:**

ఇతడు వ్రాసిన ఋక్సంహితాభాష్యం ప్రథమాష్టకానికి పూర్తిగాను, చతుర్థాష్టకానికి అయిదవ అధ్యాయం వఱకు దొరుకుతున్నది. ఇతడు 15వ శతాబ్దంవాడు. సాయణభాష్యానికి సంగ్రహరూపమే ఇతని భాష్యం

**10. దేవస్వామి:**

ఇతడు ఋక్సంహితకు భాష్యంవ్రాసినట్లు ప్రసిద్ధి. కాని ఎక్కడా అజాడ దొరకడం లేదు. చాలా ప్రాచీనుడితడని ప్రసిద్ధి.

**11. చతుర్వేదస్వామి:**

ఋక్సంహితలో కొన్ని భాగాలకు కృష్ణపరమైన భాష్యం ఈయన వ్రాశాడు. బృందావనవిహారియైన కృష్ణచరితం వేదమంత్రాలలో ఉన్నదని ఈయన సిద్ధాంతం.

## యజుర్వేదభాష్యాలు:

### 1. భట్టస్వామి:

ఇతడు చాలాప్రాచీనుడైన భాష్యకారుడు. ఇతడు తైత్తిరీయ సంహితకు వ్రాసిన భాష్యం ఇప్పుడు దొరకడం లేదు.

### 2. భట్టభాస్కరుడు:

యజుర్వేదభాష్యకారులలో ప్రసిద్ధుడైన ఈయన పదకొండవ శతాబ్దంవాడు. సాయణుడు ఇతని భాష్యాన్ని చాలచోట్ల ఉదాహరించాడు. ఇతడు కౌశికగోత్రసంభవుడు. ఇతడు తన భాష్యంలో చాలామంది ప్రాచీనభాష్యకారులను పేర్లు చెప్పకుండా పేర్కొన్నాడు.

### 3. దుర్గాచార్యుడు:

పదిహేనవ శతాబ్దపువాడైన దుర్గాచార్యుడు తైత్తిరీయసంహితకు భాష్యం చేశాడు కాని అది ఇప్పుడు దొరకడంలేదు.

### 4. ఉవటుడు:

ఇతడు పదకొండప శతాబ్దంలో భోజరాజుపాలనలో అవన్తీ నగరంలో ఉండేవాడు. శుక్లయజుస్సంహితకు పూర్తిగా ఈయన భాష్యం దొరుకుతున్నది. ఇతనితండ్రి మహావిద్వాంసుడైన వజ్రభట్టు.

### 5. మహీధరుడు:

ఇతడు శుక్లయజుస్సంహితకు వ్రాసిన భాష్యం పూర్తిగా దొరుకుతున్నది. ఇతడు 'మన్త్రమహోదధి' అనే తన్త్రశాస్త్రగ్రంథం కూడా వ్రాశాడు. 12వ శతాబ్దం ఇతనికాలమని కొందఱంటే, కాదు ఏడవశతాబ్దంలోనే ఇతడున్నాడని ఇంకొందఱంటున్నారు.

### 6, 7. భవస్వామి - గుహదేవుడు:

వీరిద్దఱు తైత్తిరీయసంహితకు భాష్యాలను వ్రాశారు.

## సామవేదభాష్యాలు:

**1. మాధవుడు / భరతస్వామి / గుణవిష్ణువు:**

వీరు ముగ్గురు సామవేదానికి భాష్యాలను వ్రాశారు.

## బహుభాష్యకారులు:

**1. సాయణాచార్యుడు:**

ఋగ్వేదం, కృష్ణయజుర్వేదం, శుక్లయజుర్వేదం, సామవేదం అథర్వవేదం - వీటన్నింటికి సంప్రదాయబద్ధమైన భాష్యాలు వ్రాసి అనన్యసాధారణమైన కీర్తిప్రతిష్ఠలను గడించినవాడు సాయణాచార్యుడు (చూ. పే. Lxvii).

**2. ధానుష్కయజ్వ:**

ఈయన ఋగ్యజుస్సామవేదాలకు భాష్యాలను చేశాడు. కాని అవి మనకు దొరకడంలేదు.

**3. రావణుడు:**

ఋగ్వేదానికి యజుర్వేదానికి అధ్యాత్మార్థప్రధానమైన భాష్యం వ్రాశాడు. ఇది అక్కడక్కడా దొరుకుతున్నది. లంకాధిపతి, ఇతడు ఒకడేనని చాలామంది భ్రమపడ్డారు. కాని ఇతడు ఈ యుగంలోవాడే.

**4. స్వామి దయానన్దసరస్వతి:**

ఆర్యసమాజస్థాపకుడైన దయానందుడు యజుర్వేదానికి పూర్తిగాను, ఋగ్వేదానికి 7వ మండలంవఱకు భాష్యం వ్రాశాడు. ఈయన వ్యాఖ్యానపద్ధతిని వైదికులలో కొందఱు అంగీకరించరు.

**5, 6. హలాయుధుడు - అనన్తాచార్యుడు:**

ఈ ఇద్దఱు వేదభాష్యాన్ని వ్రాసినట్లు ప్రసిద్ధి. అంతకంటే వివరాలు దొరకడంలేదు.

ఇలా ఇప్పటికి కొన్ని నశించినవి పోగా, ఇంకాకొన్ని నశించడానికి సిద్ధంగా ఉన్నాయి. పాశ్చాత్యుల పుణ్యంవల్ల ఉన్నవాటిలో కొన్నింటిని ముద్రించుకున్నామే కాని, ఆ సంప్రదాయాన్ని కాపాడుకోలేకపోతున్నాం. వేదం చదువుకున్నవాడినే ఆదరించే మనుష్యులు కరువైన ఈ దేశంలో, వేదభాష్యంలో లోతైన పరిశ్రమ చేయడానికి, మన సంస్కృతిని, సంప్రదాయాలను లోకకల్యాణం కలిగేటట్లు పరిరక్షించడానికి ప్రోత్సహించేదెవరు?

## సాయణుడు - ఆయన భాష్యాలు:

మాయణ-శ్రీమతుల నోములపంట సాయణుడు. ఇతని అన్న మాధవుడు. ఆయనే సన్న్యాసం తీసికొని విద్యారణ్యస్వామియై హరిహరరాయలు బుక్కరాయలుద్వారా విజయనగరసామ్రాజ్యాన్ని స్థాపింపజేశాడు. తమ్ముడు భోగనాథుడు. ఇతడు సంగమనృపతికి నర్మసచివుడు. వీరు ముగ్గురు వేదవేదాంగాలలో నిష్ణాతులు. ఇతడు భారద్వాజగోత్రుడు, బోధాయనసూత్రుడు, కృష్ణయజుర్వేది అయిన ఆంధ్రబ్రాహ్మణుడు.

క్రీ.శ. 1315లో పుట్టి 1387 దాకా జీవించిన సాయణుడు హరిహర బుక్కరాయల ఆస్థానంలో ఉండేవాడు. బుక్కరాయలు రాజగురువైన మాధవాచార్యుణ్ణి (విద్యారణ్యుణ్ణి) వేదాలకు భాష్యాలు వ్రాసి వేదార్థాన్ని ప్రకాశింపజేయమని ప్రార్థించాడు. అందుకు నాతమ్ముడు సామ్రాజ్యధురంధరుడైన[1] సాయణుడు సమర్థుడని మాధవుడు చెప్పగా రాజు సాయణుని వేదభాష్యాలు వ్రాయడానికి ఉపక్రమించమని ప్రార్థించాడు. బుక్కభూపతి ప్రేరణతో

1. ఇతి శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర వైదికమార్గప్రవర్తక శ్రీ వీరబుక్క భూపాల సామ్రాజ్యవాదధురందరేణ సాయణాచార్యేణ విరచితే మాధవీయ వేదార్థప్రకాశ ఋక్సంహితాభాష్యే ప్రథమాష్టకేఽష్టమోఽధ్యాయః సమాప్తః

సాయణాచార్యుడు ఈక్రింది సంహితలకు బ్రాహ్మణాలకు భాష్యాలను వ్రాశాడు[1].

1. తైత్తిరీయసంహిత (కృష్ణయజుర్వేదం)
2. ఋక్సంహిత
3. సామసంహిత
4. కాణ్వసంహిత (శుక్లయజుర్వేదం)
5. అథర్వసంహిత

కృష్ణయజుర్వేదానికి సంబంధించిన 1. తైత్తిరీయబ్రాహ్మణం, 2. తైత్తిరీయారణ్యకం, శుక్లయజుర్వేదానికి సంబంధించిన 3. శతపథ బ్రాహ్మణం, ఋగ్వేదానికి సంబంధించిన 4. ఐతరేయబ్రాహ్మణం, 5. ఐతరేయారణ్యకం, సామవేదానికి సంబంధించిన 6. తాండ్య (పంచవింశ), 7. షడ్వింశ, 8. సామవిధాన, 9. ఆర్షేయ, 10. దేవతాధ్యాయ 11. ఉపనిషత్, 12. సంహితోపనిషత్, 13. వంశబ్రాహ్మణాలు.

వైదికవాఙ్మయంలో సాయణుడు చేసిన కృషి అద్వితీయం, అనన్యసాధారణం. ఆయన వ్యాఖ్యానపద్ధతితో పూర్తిగా ఏకీభవించని వారుకూడా ఆయన చేసిన కృషిని అభినందించకుండా ఉండలేరు. చూడండి: ఋగ్వేదప్రథమాష్టకానికి అనువాదంచేస్తూ ప్రొఫెసర్ విల్సన్ ఇలా అంటున్నాడు:

---

1. తత్కటాక్షేణ తద్రూపం దధత్ బుక్కమహీపతిః ।
ఆదిశన్మాధవాచార్యం వేదార్థస్య ప్రకాశనే ॥
స ప్రాహ నృపతిం రాజన్ సాయణార్యో మమానుజః ।
సర్వం వేత్త్యేష వేదానాం వ్యాఖ్యాతృత్వే నియుజ్యతామ్ ॥
ఇత్యుక్తో మాధవార్యేణ వీరబుక్కమహీపతిః ॥
అన్వశాత్సాయణాచార్యం వేదార్థస్య ప్రకాశనే ॥
యే పూర్వోత్తర మీమాంసే తే వ్యాఖ్యాయాతిసంగ్రహాత్ ॥
కృపాలుః సాయణాచార్యో వేదార్థం వక్తుముద్యతః ॥
బ్రాహ్మణం కల్పసూత్రే ద్వే మీమాంసాం వ్యాకృతిం తథా ।
ఉదాహృత్యాథ తైః సర్వైర్మన్త్రార్థః స్పష్టమీర్యతే ॥ తై.సం.భా.భూ.1.7.

> He (Sayana) undoubtedly had a knowledge of his text far beyond the pretensions of any European scholar, and must have been in possession, either through his own learning or that of his assistants, of all the interpretation which had been perpetuated by traditional teaching from the early times.

ప్రొఫెసర్ మాక్స్‌ముల్లర్ ఒకచోట (Preface to his Vedic Hymns, Part I. p. 30) సాయణాచార్యుని గురించి అన్నమాటలివి :

> Those who recollect the history of vedic scholarship during the last five and twenty years know best that with all its faults and weaknesses, Sayana's commentary was a sine qua non for a scholar-like study of the Rgveda. I do not wonder that others who have more recently entered on that study are inclined to speak disparagingly of the scholastic interpretations of Sayana. They hardly know how much we all owe to his guidance in effecting our first entrance into this fortress of Vedic language and Vedic religion, and how much even they, without being aware of it, are indebted to that Indian Eustathius

## భారతీయుల వేదార్థానుశీలనపద్ధతి:

వేదాలు రహస్యార్థమయాలనే భావన భారతీయులలో ఎప్పటి నుంచో ఉంది. అందుకనే ఋక్కులు 'నిన్యాని' (రహస్యస్తోత్రాలు) అని చెప్పబడినాయి. యాస్కుని నిరుక్తానికి ముందే శాకపూణి మొ|| వారు వేదార్థాలను వివరించారు. నిరుక్తరచనాకాలం నాటికే వేదార్థానుశీలనం మనదేశంలో అనేకవిధాలుగా జరుగుతున్నట్లు తెలుస్తున్నది.

వేదాలను అధియజ్ఞ, అధిదైవత, అధ్యాత్మపరంగా భారతీయులైన సంప్రదాయవిదులు అర్థం చేసుకున్నారు. కనుకనే వేదాలన్నింటిలోను మూడు అర్థాలున్నాయనీ 'త్రయోఽర్థాః సర్వవేదేషు' అని పురాణాలు చెబుతున్నాయి. ఈ మూడుమార్గాలలోను వేదమంత్రాలకు భాష్యాలేర్పడ్డాయి

అధియజ్ఞపరమైన భాష్యాలు, యజ్ఞయాగాలననుష్ఠించడానికి వేదమొకసాధనమని, దేవతలు శబ్దరూపులేగాని వారికి ప్రత్యేకమైన ఉనికి లేదని భావించినాయి. స్కందస్వామి, సాయణుడు వేదాలకు అధియజ్ఞపరమైన భాష్యాలను చేశారు, వీరికి యజ్ఞమే ప్రధానాంశం.

అధిదైవతభాష్యం ప్రకారం దేవతలకు స్వరూపాదులున్నాయి. వారిని తృప్తిపరచడానికే యజ్ఞాలు చేయబడుతున్నాయి. వారు తృప్తిపడితే మన కోరికలను నెరవేరుస్తారు. ఇలాంటి యజ్ఞాలను ప్రతిపాదించేదే వేదం. యాస్కుని నిరుక్తం, వేంకటమాధవుని భాష్యం, ఇంకా అనేకాధునికవ్యాఖ్యానాలు ఈ మార్గంలోనే ఏర్పడ్డాయి. బహుదేవతావాదం ఇందులో ముఖ్యం.

అధ్యాత్మపరమైన భాష్యాలు, పరమపురుషుడే ఇంద్రాది దేవతలరూపంలో ఉన్నాడని చెబుతున్నాయి. సాయణుడు తన భాష్యాల్లో చాలా మంత్రాలకు అనేకార్థాలను వివరిస్తూ అధ్యాత్మార్థాన్ని కూడ వివరించాడు. ఆత్మానందతీర్థుడు, ఆనందతీర్థుడు (మధ్వాచార్యులు) ఈ ఏకదేవతావాదాన్ని బలపరుస్తూ భాష్యాలు వ్రాశారు

ఇలా భారతీయులు వేదమంత్రాలకు తమ భాష్యాల్లో మూడు విధాలైన అర్థాలను ప్రతిపాదించారు. క్రమికమైన వికాసంకూడ ఈ మూడు అర్థాలలో గోచరిస్తున్నది.

**ఉవటుని వ్యాఖ్యానపద్ధతి:**

శుక్లయజుస్సంహితకు భాష్యంచేసిన ఉవటుడు వ్యాఖ్యాన పద్ధతిని [redacted] వివరించాడు:

**అధికంగా ఉన్న పదాన్ని (అక్షరాన్ని) వదిలివేయడం, తగ్గిపోయిన పదాన్ని వాక్యంలో జోడించడం, దూరంలో ఉన్నదాన్ని తెచ్చి అన్వయించడం, అనుపూర్విని కల్పించడం, వ్యాఖ్యానమునరించి లింగ**

ధాతు విభక్తులను సరిచెప్పడం, వాక్యంలో అర్థంకాకుండా ఉన్న వైదికపదాలకు సమానమైన లౌకికపదాలను చెప్పడం [illegible] స్థూలంగా వ్యాఖ్యానధర్మాలు[1].

వీటన్నింటిద్వారా వేదప్రతిపాద్యమైన అర్థం అందరికీ అందుబాటులోకి వస్తుందని ఆయన నిశ్చితాభిప్రాయం. ఉవటుని వ్యాఖ్యానంలో పై నియమాలను చాలావరకు పాటించాడు. పై వాటన్నింటికి వేదంలోనుంచి మంత్రాలను ఉవటుడు ఉదాహరించాడు. ఉత్సాహవంతులు ఉవటభాష్యప్రారంభంలోనే వాటిని చూడవచ్చు. (ఉవ.3).

## వేదాలు మానవులకే ప్రమాణాలా?

వేదాలు ఎవరికి ప్రమాణాలు? అవి మానవులమైన మనకేనా? లేక ఇతరులకు దేవతలకుకూడ ప్రమాణాలా? అని చాలామంది సందేహపడుతుంటారు. వేదాలు కేవలం మనకు మాత్రమే ప్రమాణాలుకావు. పితరులకు కూడా ప్రమాణాలు. ముల్లోకాలు వేదప్రామాణ్యాన్ని అంగీకరిస్తాయని మనుస్మృతి స్పష్టం చేస్తున్నది.

## వేదాలు ఏదో ఒక కాలానికి పరిమితమైనవా?

పురాతనమైన ఈ వేదరాశి ఇంతగా ఆధునికవిజ్ఞానం విస్తరించిన ఈ రోజుల్లోకూడ లోకానికి ప్రమాణమౌతుందా? అని కొందఱంటున్నారు. పెరిగిన ఆధునికవిజ్ఞానాన్ని సరిగా మంచిదృష్టితో ఉపయోగించుకుంటే మానవుడి భౌతికావసరాలను కొంతవఱకు అది తీర్చగలుగుతుంది. దుర్వినియోగంచేస్తే సమాజంలో కల్లోలాలను

---

1. అతిరిక్తం పదం త్యాజ్యం హీనం వాక్యే నివేశయేత్ ।
విప్రకృష్టం తు సందధ్యాదానుపూర్వ్యం చ కల్పయేత్ ॥
లింగం ధాతుం విభక్తిం చ యోజ్యం వాక్యానులోమతః ।
యద్యత్స్యాచ్ఛాన్దసం వాక్యే కుర్యాత్తత్తత్తు లౌకికమ్ ॥ ఉవ. 3.

సృష్టించి అశాంతికి కారణమౌతుంది. కాని ఆధ్యాత్మికచైతన్యాన్ని కలిగించడానికి, మానవునిలో సత్ప్రవృత్తిని పెంచడానికి ఉదాత్తమైన సంస్కృతిని నెలకొల్పడానికి వేదవిజ్ఞానం ఎంతైనా అవసరం. కనుక వేదాలు ఈకాలం ఆకాలం అనకుండా అన్ని కాలాల్లోను సృష్టిఉన్నంతవఱకు పరమప్రమాణంగానే ఉంటాయి.

## పురాణాదివిద్యలు వేదజ్ఞానం కోసమేనా?

ప్రాచీనభారతీయుల దృష్టిలో వేదాలకు అత్యున్నతస్థానం ఉండేది. మానవజీవన వికాసాలకు వారు వేదాలను కేంద్రాలుగా భావించారు. వేదంలో చెప్పబడ్డ ధర్మాన్ని, తత్త్వాన్ని, సంస్కృతిని జీవనాడిగా పెట్టుకొని, దాన్ని ఉపబృంహణం (బీజభూతంగా ఉన్న తత్త్వాన్ని విస్తరించి చెప్పడం) చేయడానికే ఇతరవిద్యలన్నీ ఏర్పడ్డాయి. ఇతిహాసపురాణాలు వేదార్థోపబృంహణానికే ఏర్పడినట్లు మహాభారతం చెబుతున్నది[1]. వేదాన్ని ఎలాబడితే అలా అర్థంచేసుకోవడానికి వీల్లేదు. దాన్ని ఉపబృంహణంచేసిన ఇతరవాఙ్మయాన్ని కూడా దృష్టిలో పెట్టుకొని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలి. లోకకల్యాణకరం, అనల్పం, దివ్యమైన వేదార్థాన్ని వివరించడంకోసమే తరువాత వాఙ్మయమంతా ఏర్పడింది. వేదతత్త్వమే ప్రాచీన భారతీయుల భావనలలో, జీవనంలో సంస్కృతిలో ప్రతిబింబిస్తూండేది. అందుకే వారి జీవితాల్లో చాలామటుకు శాంతికి కరువుండేదికాదు.

## వేదాలు బహుదేవతావాదాన్ని ప్రతిపాదిస్తున్నాయా ?

సూక్తాలలోని మంత్రాలకు దేవతానిర్ణయం చేయడమెలా? ఏ మంత్రం ఏ దేవతను స్తుతిచేస్తున్నదో స్పష్టంగా ఎలా చెప్పడం? దీన్ని గురించి బృహద్దేవతలో శౌనకుడిలా చెబుతున్నాడు-

---

1. ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్ ।
బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రతరిష్యతి. భార.1.1.269

"ప్రధానంగా ప్రయోజనాభిలాషతో భక్తితో స్తుతిచేస్తూ మహర్షి ఏయే మంత్రాలకు ఏయే దేవతను నిర్దేశించాడో ఆ మంత్రాలకు వారే దేవతలు; ఏ దేవత పేరు ప్రత్యక్షంగా ఏ మంత్రంలో కనబడుతుందో ఆ మంత్రానికి అతడే దేవత అని తెలుసుకోవాలి. కనుక మంత్రాలలో అనేకసార్లు పేరుతో ఏ దేవత స్తుతింపబడిందో ప్రయోగజ్ఞుడు బాగా తెలిసికొని దేవతానిర్ణయం చేసుకోవాలి [1]

ఎక్కడైనా ఏరకంగాను దేవతను గురించిన విశేషాలు తెలియకపోతే లక్షణప్రకరణాలద్వారా ఊహించాలేగాని, స్వతంత్రంగా కల్పించకూడదు. శుక్లయజుర్వేదంలో కూడ అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు, వసువులు, రుద్రుడు, ఆదిత్యుడు, మరుత్తులు, విశ్వేదేవులు, బృహస్పతి, ఇంద్రుడు, వరుణుడు మొదలగు దేవతలనేకమంది అని చెప్పబడింది (శు. సం. 24.20).

దీన్నిబట్టి వేదాలు బహుదేవతావాదాన్ని బాహాటంగానే ప్రతిపాదిస్తున్నాయని స్పష్టంగా తెలుసుకోవచ్చు. కాబట్టే హిందువులను ఇతరమతస్థులు 'మీకెంతమందో దేవతలు' అని పరిహసించడం కూడ కనబడుతుంది. కానీ ఇక్కడ వస్తుతత్త్వం ఏమిటి? ఇందరు దేవతలను పేర్కోవడంలో ఆంతర్యం ఏమిటి? అని ఆలోచిస్తే ఇతరులు హిందువుల దేవతాభావనను సరిగా అర్థం చేసుకోలేక పరిహసిస్తున్నారేగాని, ఈ సిద్ధాంతం చాలా విశిష్టమైందని తెలుస్తుంది.

---

1. అర్థమిచ్ఛన్నృషిర్దైవం యం యమాహాయమస్త్వితి ।
ప్రాధాన్యేన స్తువన్ భక్త్యా మన్త్రస్తద్దేవ ఏవ సః ॥
ప్రత్యక్షం దేవతానామ యస్మిన్మన్త్రేఽభిధీయతే ।
తామేవ దేవతాం విద్యాన్మన్త్రే లక్షణసంపదా ॥
తస్మాత్తు దేవతాం నామ్నా మన్త్రే మన్త్రే ప్రయోగవిత్ ।
బహుత్వమభిధానం చ ప్రయత్నేనోపలక్షయేత్ ॥ బృహ. 1.6.11.12

## వేదాల్లో ఏకదేవతావాదం:

వేదాలు పైకి బహుదేవతావాదాన్ని ప్రతిపాదిస్తున్నట్లు కనపడ్డా వాటిల్లో ప్రతిపాదింపబడింది ఏకదేవతావాదమే. ఈ విషయాన్ని వేదభాష్యకారులు బాగా గుర్తించారు. కాని బహుళ ప్రచారంలో ఉన్న యజ్ఞయాగాది పద్ధతులను, వైదికధర్మాన్ని దృష్టిలో పెట్టుకొని అధియజ్ఞపరంగాను, అధిదైవతపరంగాను తమ తమ భాష్యాలను వ్రాశారు. అయినా అక్కడక్కడ వస్తుతత్త్వమైన ఆధ్యాత్మికార్థాన్ని చెప్పకుండా ఉండలేకపోయారు.

వారిదృష్టిలో విభిన్న దేవతానామాలతో పిలవబడే పరమేశ్వరుడే ఏకదేవత. ఆయనలోగల గుణకర్మల ననుసరించి ఆయాపేర్లతో ఆయన్ను పిలవడం ఆరాధించడం హవిస్సుల నర్పించడం జరుగుతోంది. కనుకనే సాయణుడిలా అంటాడు-

'తస్మాత్సర్వైరపి పరమేశ్వర ఏవ హూయతే.'

బృహద్దేవతలో శౌనకుడు 'ఒకే ఒక మహాదేవత పరమ పురుషుడు' అనే తత్త్వాన్ని స్పష్టంగా ప్రతిపాదించాడు. యాస్కుడు నిరుక్తంలో అగ్ని పృథివిలోను, ఇంద్రవాయువులు అన్తరిక్షంలోను, సూర్యుడు దివంలోను ఉన్నారని ఇలా మూడుస్థానాల్లో మూడురకాల దేవతలను చెప్పినా పరదేవత పరమేశ్వరుడేనటమే ఆయన తాత్పర్యం. ఇతరదేవతలు గౌణ(అప్రధాన) రూపులని ముఖ్యుడైనవాడు పరమాత్మ అని ఆయన దైవతకాండలో స్పష్టీకరించాడు[1].

రాష్ట్రంలో లెక్కకు మించిన నరులున్నప్పటికీ వారందఱినీ కలిపి ఒకే నరుడున్నట్లు 'నరరాష్ట్రమ' ని ఎలా వ్యవహరిస్తున్నామో! అలాగే దేవత లెందఱున్నా వారందఱిద్వారా ఏకదేవతారూపుడైన

1. మహాభాగ్యాద్దేవతాయా ఏక ఏవ బహుధా స్తూయతే,
ఏకస్యాత్మనోఽన్యే దేవాః ప్రత్యంగాని భవన్తి. ని 1.7.

పరమేశ్వరుడే ప్రకాశిస్తున్నాడని ఆ సందర్భంలోనే యాస్కుడు ఉదాహరించాడు. మహాభాగ్యంవల్ల ఆ పరమేశ్వరునికే ఇన్ని పేర్లు చెందుతున్నాయి[1]. కనుకనే ఋగ్వేదం 'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి' (1.164-46). పరమేశ్వరుడు ఒకడే, విప్రులు ఆయననే వివిధ దేవతలుగా చెబుతున్నారు అని పేర్కొంటున్నది[2]. కనుక పరమేశ్వర ప్రతిపాదనమే వేదాలకు ప్రధానలక్ష్యమని తెలుస్తున్నది. "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి (బృహ. 4.4.22) అనే బృహదారణ్యక వాక్యానికి, 'వేదైశ్చ సర్వైర హమేవ వేద్యః' (భ.గీ. 15-5) అనే భగవానుని వాక్యానికి కూడ ఇదే సారతరమైన అర్థం.

## పాశ్చాత్యుల వేదార్థానుశీలనం :

పాశ్చాత్యులెందఱో వేదాలనర్థంచేసుకోవాలని అద్వితీయమైన పరిశ్రమచేశారు. భారతీయధర్మాన్ని, తత్త్వాన్ని అవగాహన చేసుకోవడానికి వారెంతో శ్రద్ధను ప్రదర్శించారు. అది నిర్వ్యాజమైన శ్రద్ధకాదని భారతీయులు అనుమానించకపోలేదు. అయినా వారు వేదవాఙ్మయాన్ని వెలుగులోకి తీసుకొనిరావడానికి చేసిన పరిశ్రమ అభినందించదగినది. పాశ్చాత్యులు ఇంతపరిశ్రమచేసి లోకానికి వేదవాఙ్మయాన్ని అందించినా ఎందఱు భారతీయులకు కనువిప్పు కలిగింది? వారిపేర్లు చెప్పుకొని కాలక్షేపం చేసేవారేకాని నిజమైన భక్తివిశ్వాసాలతో ఎందఱు భారతీయులు ఈ వాఙ్మయానికి సేవ చేయడానికి ముందుకు వస్తున్నారు? ఇది చాల దురదృష్టకరమైన విషయం.

---

1. తస్యా మహాభాగ్యాదేకస్యాపి బహూని నామధేయాని భవన్తి. ని.1.5
2. ఏకదేవతావాదాన్ని(Monotheistic Interpretation) గురించిన విశ్లేషణకు చూడండి: ఉపోద్ఘాతం: ఆచార్య కొత్త సచ్చిదానంద మూర్తిగారు ఋగ్వేదము: డా. ఎస్. బి. రఘునాథాచార్యులు. ఎస్.వి. యూనివర్శిటీ ఓరియంటల్ సిరీస్. 8. ఎస్.వి. యూనివర్శిటీ, తిరుపతి. 1978.

వేదవాఙ్మయ పరిశోధకులుగా పేరుపొందిన పాశ్చాత్యులందఱు న్యాయమైన మార్గంలో తమ పరిశోధనలను కొనసాగించలేదు. ఏ కొందఱికో తప్ప మిగతావారందఱికి భారతీయ వేదభాష్యాలపైన, ప్రత్యేకించి సాయణభాష్యంపైన ఉండవలసినంత గౌరవాదరాలు లేవు. వైదికగ్రంథప్రచురణద్వారా వారుచేసిన సేవను ప్రశంసించవచ్చునేగాని, ఆస్తికత్వాన్ని, ధార్మికదృక్పథాన్ని నిరాదరించే వారి వ్యాఖ్యానపద్ధతి అన్నివిధాలా యోగ్యమైనదని ఎలా అనగలం? వేదార్థవిచారణలో ఐతిహాసికసరణిని అవలంబించి వారు అన్నింటికీ కాలనిర్ణయాన్ని చేశారు. ఈ పద్ధతిని సంప్రదాయవిదులు అంగీకరించరు. సాయణభాష్యం ద్వారా వేదార్థప్రవేశం చేసిన వీరు ఆ భాష్యాన్నే ప్రమాణంకాదని తోసివేయడం ఎవరికి బాధను కలిగించదు?

## సాయణభాష్యం - కొందఱు పాశ్చాత్యులదాడి :

పాశ్చాత్యులలో చాలామందికి సాయణుడు వేదాలకు చేసిన భాష్యం వేదహృదయాన్ని సరిగా ఆవిష్కరించడం లేదనే అపోహ ఉన్నది. అందులో హెచ్.హెచ్ విల్సన్. రాథ్, గ్రాస్‌మన్ మొ॥ వారు ప్రముఖులు బాషాతత్త్వజ్ఞులలో ప్రపంచ ప్రసిద్ధిని ఫొందిన ప్రొఫెసర్ రాథ్ సాయణుణ్ణి ఇలా తీవ్రంగా విమర్శించాడు:

> We do not believe, as H.H. Wilson does, that Sayana better understood the expressions of the veda than any European exegete , and that we have nothing to do but repeat what he says ; [illegible] the contrary, we believe that a conscientious European exegete may understand the Veda much more correctly and better than Sayana.

ఇది సాయణభాష్యాన్ని పూర్తిగా చదవకుండా చేసిన అర్థరహితమైన విమర్శ అని ప్రొ. రాథ్‌ను గోల్డ్‌స్టుకర్ తీవ్రంగా ఖండించాడు. అంతేకాక వేదాలను సరిగా అర్థంచేసుకోవాలంటే సాయణభాష్యం, ఇంకా ఇతరబారతీయభాష్యాలపై ఆధారపడటం

తప్పనిసరి అన్నాడు. సంప్రదాయబద్ధంగా వేదార్థాన్ని తెలుసుకున్న విజ్ఞులైన భాష్యకారులపై గౌరవాదరాలు లేకపోతే మహర్షుల అనుభూతి మనకెలా అర్థమవుతుంది? అని ఇలా అంటాడు:

> How are we to know the revelations of the sages without having any regard to the learned commentators who are qualified to interpret them !

సాయణునిపై విదేశీయులు వేసిన అభాండాలను భారతీయ పండితులు అట్టేపట్టించుకోకపోయినా, పాశ్చాత్యుల్లోనే గోల్డ్‌స్టుకర్ లాంటి పండితులు వాటికి సమాధానం చెప్పారు.

## సమాజదృష్టి:

ఎవరికివారు బతుకుతెరువుకోసం వెంపరలాడుతున్న ఈ దీనసమాజంలో వేదాలు ఎవరికి పట్టలేదు. ఇప్పటికే అసంఖ్యాకమైన సంప్రదాయాలు నామరూపాలు లేకుండా కాలంలో కలిసి పోయినాయి అక్కడక్కడ మిణుకుమిణుక్కుమంటున్న ఈవేద విజ్ఞానాన్ని ఎవరు పట్టుపట్టి పదిమందికీ తెలియజేస్తారు? తెలుసుకోవాలనే జిజ్ఞాస కొందఱికి ఉన్నా వారికి వివరించి, విడమరచి చెప్పగలవారెందఱున్నారు? వేదం చదువుకున్నవారికి చాలామందికి వారు చదివిన వేదమహిమను గురించి లోకానికి చెప్పగలిగే ప్రజ్ఞలేదు శాస్త్రాలు చదివినవారికి వేదం కొరుకుడు పడదు. ఆంగ్లభాషాపరిచయం కలవారికి చాలామందికి వేదాలపై పాశ్చాత్యదృక్పథం తప్ప ఇంకోటి మనసులో పడదు. పాశ్చాత్యుల రచనలు చాలావఱకు వైదికసంస్కృతిని లోకానికి చాటడమనే ముసుగులో దాన్ని విమర్శించడానికే కంకణం కట్టుకున్నాయి. అయితే కొన్ని వాచ్యంగా ఆపనిచేస్తే కొన్ని వ్యంగ్యంగా చేస్తున్నాయి. ఇంతో అంతో వేదవాఙ్మయంమీద అభిమానం ఉండి తెలుసుకోవాలనుకునే సామాన్యప్రజలకు వేదంలోని

సారాంశం అందుబాటులో లేదు. పరిచయాత్మకంగా, సవిమర్శంగా వేదవిజ్ఞానం వీరికి ఎలాగైనా అందుబాటులోకి రావాలి. ఎలా? ఇలా మానసికంగా తర్జన - భర్జనలు జరిగిన తరువాతనే ఆర్షవిజ్ఞానసర్వస్వమనే ఈ ప్రణాళికద్వారా వైదికవాఙ్మయ విజ్ఞానాలను వాడుకభాషలో సామాన్య ప్రజలకు అందుబాటులోకి తీసుకువస్తే బాగుండుననే సంకల్పం కలిగింది.

**ఆర్షవిజ్ఞానసర్వస్వం - అవసరం :**

భారతీయసంస్కృతికి, విజ్ఞానానికి, జీవనవిధానానికి వేదాలు పునాదులని చెప్పేవాళ్ళేకాని, ఆ వేదాలలో ఏమున్నది? అని ఎవరైనా ఉత్సాహవంతులు ప్రశ్నిస్తే వారికి మనశ్శాంతి కలిగేటట్లు సమాధానం చెప్పేవాళ్లు కరువైనారు. దానివల్ల సమాజంలో మన ప్రాచీన వాఙ్మయంపైన చిన్నచూపేర్పడింది. అది అలా అలా పవిత్రమైన వేదవాఙ్మయ వినాశానికే దారితీసింది. నూటికి 90 పాళ్లు ఇప్పటికి నశించిపోయింది ఇప్పటికైనా ఏమేమి నశించిపోయిందో, ఏది మిగిలిఉందో కనీసం తెలుసుకుందామను కుంటే భారతీయసంప్రదాయాన్ననుసరించి వ్రాసిన పుస్తకాలేవీ లేవు. పాశ్చాత్యుల రచనలలోని దృక్పథం, కొంతమంది వాటిని చదివి నిజం చెప్పినా నమ్మలేని స్థితిలోకి దిగజారారు.

విశ్వవిద్యాలయాలకు వైదికగ్రంథపరిశోధనం అంటే చెప్పదగినంత ఆదరంలేదు. ఆదరం ఉన్నా చేసేవ్యక్తులు లేరు. అలా చేసినా అవి సామాన్య వ్యక్తికి ఉపయోగించే పద్ధతిలోకి రావు. మఱి సమాజంలోని సామాన్యుడికి ఈ విజ్ఞానంపై ఉన్న సంశయాలు ఎలా తీరుతాయి? అభిరుచి ఎలా పెరుగుతుంది? మహోదాత్తమైన ఆర్షసంస్కృతి ఈ సమాజం నరనరాల్లో ఎలా ప్రవహిస్తుంది? విశ్వమానవులకందఱకు `ఇదొక మానవ కుటుంబం'

అనే విశాలభావన ఎలా కలుగుతుంది? అసూయాద్వేషాలు పోయి శాంతి సౌహార్దాలతో ప్రతివానిముఖం ఎప్పుడు వికసిస్తుంది? వీటికీ; ఇంకా ఇలాంటి ప్రశ్నలకు సమాధానమే__

## ఆర్ష విజ్ఞాన సర్వస్వం

ఈ ప్రణాళికద్వారా వైదిక వాఙ్మయ విజ్ఞానసుమాలు వాకిటిలోకి వచ్చి మీ తలుపు తడతాయి. మహర్షుల మహనీయ దర్శనాన్ని సుమారు ఐదువేల పుటలలో మీచేతుల్లో ఉంచుతాయి. ప్రాచీన భారతీయుల విశాలదృక్పథాన్ని అర్థం చేసుకోండి. సమాజకల్యాణ సాధనకు సన్నద్ధులు కండి. సత్యధర్మాలపై నడచి, శాంతి ప్రేమలను తోటివారికి పంచండి. మీ జన్మకొక సార్థకతను సమకూర్చుకోండి.



# అనుక్రమణి


ముందుమాట vii

సంపాదకునిమాట xxiii

రచయితలు xxv

ప్రస్తావన విషయసూచి xxxi

ప్రస్తావన xxxiii

1 ఒకటవపరిచ్ఛేదం :

ఋక్సంహిః -131

1. 1 పరిచయం

ఋక్ అంటే ఏమిటి ? ...

సంహితా ప్రశంస 2

సూక్తాలెన్నిరకాలు ? ....

దేశం ....

కాలం 3

విషయం .....

పరిశోధన - ప్రచురణ 4

ఉపవేదం 5

1. [redacted] శాఖలు - విభాగం 6

మొత్తం శాఖలు ....

దొరుకుతున్నశాఖలు 7

మొదలు - చివఱ ....

మండలవిభాగం ....

పట్టిక 8

అష్టకవిభాగం ....

పట్టిక 9

1. [redacted] శాఖలు - దేశవ్యాప్తి 10

1. [redacted] పాఠవిశేషాలు 12

వేదవిభాగం ....

సంహితాలక్షణం 13

సంహితాభేదం ....

ఎనిమిది వికృతులు 14

సంహితాపాఠం ....

పదపాఠం ....

క్రమపాఠం ....

పంచసంధులు 15

పట్టిక 16

జటాపాఠం ....

మాలాపాఠం 18

క్రమమాలాపాఠం ....

పుష్పమాలాపాఠం ....

శిఖాపాఠం 19

రేఖాపాఠం 20

ధ్వజపారు ....

దండపాఠం 21

రథపాఠం ....

ద్విచక్రరథపారం 22

ఘనపాఠం 23

పాఠప్రయోజనం 24

1. 5 మంత్రద్రష్టలగు మహర్షులు 26

వేదమంత్రవర్ణనం ....

వసిష్ఠుడు 27

భరద్వాజుదు 28

| | |
|---|---|
| విశ్వామిత్రుడు | 29 |
| వామదేవుడు | 30 |
| గృత్సమదుడు | 31 |
| దీర్ఘతముడు | .... |
| అగస్త్యుడు | 32 |
| గోతముడు | .... |
| ఇతర మహర్షులు | 33 |
| **1. 6 దేవతలు** | **35** |
| దేవతాస్వరూపం | 35 |
| ఇంద్రుడు | 36 |
| అగ్ని | 39 |
| సోముడు | 41 |
| అశ్వినీదేవతలు | 44 |
| మరుత్తులు | 46 |
| వరుణుడు | 47 |
| ఉషస్సు | 48 |
| సూర్యుడు | 49 |
| సవిత | 50 |
| పూష | 51 |
| విష్ణువు | .... |
| బృహస్పతి | 52 |
| రుద్రుడు | 53 |
| యముడు | .... |
| ద్యావాపృథువులు | 54 |
| ఇతరదేవతలు | .... |
| **1. 7 ఛందస్సు** | **55** |
| ఛందస్స్వరూపం | .... |
| ఒకటవ వర్గం | .... |
| రెండోవర్గం | .... |
| మూడోవర్గం | 56 |
| నాలుగోవర్గం | 56 |
| ఛందోవికాస పరిణామాలు | 57 |
| పట్టిక | 59 |
| గాయత్రి | 62 |
| ఉష్ణిక్ | 63 |
| అనుష్టుప్ | 64 |
| బృహతి | 65 |
| పంక్తి | 67 |
| త్రిష్టుప్ | 68 |
| జగతి | 70 |
| **1. 8 వైశిష్ట్యం** | **72** |
| వేదం అపౌరుషేయం | .... |
| ఋగ్వేదస్థానం | .... |
| సత్యావిష్కరణం | 73 |
| పురుషుడంటే ఎవరు ? | 74 |
| భిన్నత్వంలో ఏకత్వం | 75 |
| ఋతస్వరూపం | .... |
| బింబారాధనం | 76 |
| జ్ఞానానికి పెన్నిధి | 77 |
| సమాజనిర్మాణం | .... |
| పాతకొత్తల మేలుకలయిక | 78 |
| **1. 9 మతం - తత్త్వం** | **79** |
| కర్మకాండ - జ్ఞానకాండ | .... |
| మతస్వరూపం | .... |
| తత్త్వం - దేవతలు | 80 |
| వరుణుడు | 81 |
| అగ్ని | 82 |
| ఇంద్రుడు | .... |
| విష్ణువు | .... |
| రుద్రుడు | 83 |

దస్యులు 83
మరణానంతరస్థితి 84
స్వర్గం - నరకం ....
జగత్సృష్టి 85
సాంఘికస్థితిగతులు 86
వర్ణాశ్రమవ్యవస్థ ....

1. 10 సాంఘికాచార వ్యవహారాలు 87
విజ్ఞానరాశి 87
వర్షము - పంటలు ....
సూర్యోపాసన 88
ఉషస్సు 89
సోమరసము 90
స్త్రీపురుషదైవారాధన ....
ఆర్యులు - అనార్యులు 91
పశుధనము ....
వ్యవసాయము 92
ఆహారము ....
లోహములు 93
శస్త్రములు - యుద్ధము ....
వేట ....
వాణిజ్యము 94
స్త్రీలు ....
దానము 95
విద్యావిధానము ....
వివాహపద్ధతి ....
ఆడపిల్ల - అత్తవారిల్లు 96
స్వయంవరపద్ధతి 97
అనులోమ - విలోమవివాహ విధానములు ....
మృతసంస్కారము 98
తత్త్వచింతన ....

1. 11 కవితాసౌందర్యం 100
కవితాసుందరి 100
పలుకుబళ్లు ....
వర్ణనలు 101
భావనలు 102
శబ్దాలంకారాలు 103
యమకం - వృత్త్యనుప్రాస ....
లాటానుప్రాస 104
మకుటాలు 105
అర్థాలంకారాలు 106
ఉపమ ....
అతిశయోక్తి 109
రూపకం 110
ఉత్ప్రేక్ష ....
అర్థాంతరన్యాసం 111
వ్యతిరేకం 112

1. 12 మండలాలు సంగ్రహసమీక్ష 113
మండలస్వరూపం 114
వాలఖిల్యసూక్తాలు 116
ఆప్రీసూక్తాలు ....
మంత్రాలకు మూడు అర్థాలు 117
ఇంకా పులోగమిస్తేనే 118
అందరికీ వందనాలు ....
రండి ! రండి ! ....
ఈశ్వరస్వరూపం 119
కన్నతండ్రి ....
కాలచక్రం ....

జీవుడు - దేవుడు [redacted]
ఋగ్వేదతాత్పర్యం ....
శ్రుతి ....
శుభాకాంక్ష 121
మంచిదోవలోపెట్టే బృహస్పతి ....
అన్నివైపులనుంచి అభయం 122
దుష్టశిక్షణ .. శిష్టరక్షణ ....
సత్పురుషులు ....
వైదిక విజ్ఞానస్రవంతి 123
వేదాలు ఎవరిని ప్రేమిస్తాయి? 124
ప్రపత్తి ....
పరమాత్మనుగురించి
ఏంచెప్పగలను? 125
సంఘం - సామాన్యమానవుడు ....
అప్పులబాధ ....
విష్ణుస్తుతి 126
కళ్లు తెరచిచూడు ....
మూర్ఖులనుంచి కాపాడండి! 127
పవమానసోముడు ....
జూదగాడు 128
మీరు గుర్తించలేరు 129
శ్రామికుడు ....
సమసమాజనిర్మాణం [redacted]
సమత్వం [redacted]

2. రెండవపరిచ్ఛేదం :
కృష్ణయజుస్సంహిత 135 -226
యజుస్సంహిత [redacted]
నామాంతరాలు ....
సంప్రదాయభేదం 136
ప్రచారం
భాష 136

2. 1. పరిచయం 137
యజుస్సంటే ఏమిటి? 137
కృష్ణయజుర్వేదం ....
దేశం 138
కాలం ....
విషయం 139
పరిశోధన - ప్రచురణ ....
ఉపవేదం 140

2. 2. శాఖలు - విభాగం 141
మొత్తం శాఖలు 141
ఇప్పుడు దొరికేవి 142
మొదలు చివర ....
సంహితావిభాగం -
తైత్తిరీయసంహిత ....
పత్రిక [redacted]
మైత్రాయణీసంహిత ....
కఠసంహిత ....
కాపిష్ఠల కఠసంహిత 144

2. 3. శాఖలు - దేశవ్యాప్తి 145

2. 4. పాఠవిశేషాలు 147

2. 5. మంత్రద్రష్టలగు
మహర్షులు 148
ప్రజాపతి 149
గోతముడు ....
దీర్ఘతముడు ....
పరమేష్ఠి ....
అత్రేయుడు 150
వామదేవుడు

| | |
|---|---|
| వసిష్ఠుడు | 150 |
| మేధాతిథి | .... |
| మధుచ్ఛందుడు | 151 |
| నారాయణుడు | .... |
| వత్సుడు | .... |
| విశ్వామిత్రుడు | .... |
| వరుణుడు | 152 |
| ఆంగిరసులు | .... |
| శునః శేపుడు | .... |
| అగస్త్యుడు | .... |
| జమదగ్ని | 153 |
| భరద్వాజుడు | .... |
| **2. 6. దేవతలు** | **155** |
| అగ్ని | 155 |
| ఇంద్రుడు | 157 |
| సవిత | 158 |
| ప్రజాపతి | 159 |
| విద్వాంసులు | 160 |
| విశ్వేదేవులు | 161 |
| యజ్ఞము | .... |
| సూర్యుడు | 162 |
| వాయువు | 163 |
| సోముడు | .... |
| ఈశ్వరుడు | [illegible] |
| బృహస్పతి | .... |
| రుద్రుడు | .... |
| విష్ణువు | [illegible] |
| పితరులు | .... |
| **2. 7. ఛందస్సు** | **167** |
| ఎందుకు ఛందస్సు? | .... |
| కేవలాక్షరగణనానుసారి ఛందస్సు | 167 |
| పాదాక్షరగణనానుసారి ఛందస్సు | 170 |
| గాయత్రి | .... |
| ఉష్ణిక్ | 172 |
| అనుష్టుప్ | 173 |
| బృహతి | .... |
| పంక్తి | 175 |
| త్రిష్టుప్ | 176 |
| జగతి | 177 |
| **2. 8. వైశిష్ట్యం** | **179** |
| యజ్ఞభావన | 179 |
| తైత్తిరీయ వైశిష్ట్యం | .... |
| పెద్ద పులిలాంటి అగ్ని | 182 |
| జలప్రయోజనాలు | .... |
| ఈ భూమి అగ్నిగర్భ | [illegible] |
| జాగ్రత్తగా పఠించాలి | [illegible] |
| **2. 9. మతం - తత్త్వం** | **185** |
| యజ్ఞవేదిక | .... |
| యజ్ఞమంటే ఏమిటి? | .... |
| ప్రధాన ఋత్విక్కులు | [illegible] |
| అగ్ని ఎన్నిరకాలు? | .... |
| యజ్ఞాలెన్ని రకాలు? | 187 |
| యజమాని బిరుదాలు | [illegible] |
| కర్మలెన్ని? | [illegible] |
| ఆధునిక దృష్టి | .... |
| యజ్ఞం - సంకేతవాదం | .... |
| కర్మమార్గరహస్యం | [illegible] |
| పశుహింస - సంస్కరణాలు | |
| ఉన్నది ఒక్కటే | .... |
| రుద్రప్రశస్తి | 191 |

అంతా బ్రహ్మమే 191

2\. 10. సాంఘికాచార వ్యవహారాలు 192

బుత్విక్కు లేం చేస్తారు? 192

సున్నితమైన ఆలోచన 194

స్త్రీ గౌరవం 195

దాంపత్యబంధం 196

వంశవృద్ధి [illegible]

యజ్ఞాలు చేస్తే

ముసలితనం రాదు ....

అగ్నిశాపం 197

క్షయవ్యాధి పోతుంది 198

అనాటి మానవవ్యవహారం [illegible]

సర్పపూజ 199

వ్యవసాయం ....

విజయంకోసం ఉపసద్హోమం ....

వైద్యుని పన్నులెన్నెందుకు? ....

సమాజ సంక్షేమం 200

2\. 11. కవితాసౌందర్యం 202

కృష్ణయజుర్వేదంలోని కవిత 203

శబ్దాలంకారం - అనుప్రాస ....

అర్థాలంకారాలు 205

ఉపమ ....

రూపకం 207

శ్లేష [illegible]

ఉల్లేఖం 209

లోకోక్తి 210

2\. 12. అధ్యాయాలు - సంగ్రహ సమీక్ష 211

జీవితమే ఒకయజ్ఞం 211

భారతీయజీవనం 212

అభిప్రాయమందే? ....

నేటి పరిశోధనల ఫలం ....

యజ్ఞంవల్ల ఏం ప్రయోజనం? 213

ఈ భూమికి నడిబొడ్డు యజ్ఞవేది ....

మాతృభూమి

గాయత్రీమంత్రం ....

వర్షాలెలా కురుస్తాయి? 218

అగ్నిమథనం ....

వాతావరణపరిపుష్టి

నీటిలో ఏముంది? 217

ఆదిత్యుని విశ్వరూపం

అగ్నిస్వరూపం 215

వ్యవసాయం చేయండి! 221

ఓషధుల ప్రయోజనం 221

నమకం 222

చమకం 223

పునర్జన్మ

మంచిపౌరులు పుట్టాలి!

అశ్వమేధం 223

విరాట్ పురుషుడు 224

మంచి సంతలాలు కలగాలి [illegible]

సామూహికక్షేమం 226

సర్వం - బ్రహ్మమయం ....

మూడవ పరిచ్ఛేదం

శుక్లయజుస్సంహిత 229 - 335

3\. 1. పరిచయం

శుక్లయజుస్సంహిత 229

దేశం 230

కాలం ....

విషయం ....

ప్రచురణ 231

ఉపవేదం ....

**3. 2 శాఖలు - విభాగం 232**

మొత్తంశాఖలు 232

ఇప్పుడు దొరికేవి ....

సంహితావిభాగం ...

పద్ధతి 233

**3. 3 శాఖలు - దేశవ్యాప్తి 234**

**3. 4 పాఠవిశేషాలు 235**

**3. 5 మంత్రద్రష్టలగు మహర్షులు 236**

ప్రజాపతి 237

దధ్యంగుడు ....

యాజ్ఞవల్క్యుడు ....

పరమేష్ఠి 238

నారాయణుడు ....

వరుణుడు ....

బృహస్పతి ....

వైవస్వతుడు 239

స్త్రీలు ....

జంటకవులు 240

ఇతరఋషులు ....

**3. 6 దేవతలు 241**

అగ్ని [illegible]

ప్రజాపతి 246

విష్ణువు 247

ఇంద్రుడు 248

సవిత - సూర్యుడు 249

మిత్రావరుణులు 251

సోముడు 252

రుద్రుడు 254

అశ్వినులు 256

వాయువు ....

మరుత్తులు 257

ద్యావాపృథువులు ....

అదితి ....

త్వష్ట ....

అష్టేపతలు 258

చంద్రుడు ....

బృహస్పతి ....

సినీవాలి ....

**3. 7 ఛందస్సు 259**

ఛందశ్శాస్త్రపరంపర ....

ఛందస్స్వరూపం 260

గాయత్రి ....

ఉష్ణిక్ 262

అనుష్టుప్ 263

బృహతి 264

పంక్తి 266

త్రిష్టుప్ 267

జగతి 268

అతిచ్ఛందస్సులు ....

యజుస్సులు 269

ఛందస్సు ప్రయోజనాలు 270

**3. 8 వైశిష్ట్యం 271**

యజ్ఞాలు - ఐహికప్రయోజనం 272

| | |
|---|---|
| ఆయుధాలవంటి మంత్రాలు | 274 |
| విహవ్యమంత్రాలు | 275 |
| **[illegible]. [illegible] మతం - తత్త్వం** | **276** |
| మతం | .... |
| మతం అంటే ఏమిటి ? | .... |
| యజ్ఞయాగాలు | 277 |
| దేవతలు | 278 |
| రుద్రుని చెల్లెలు అంబిక | .... |
| కోరికలు | 279 |
| యజ్ఞం అన్నింటినీ సాధిస్తుంది | 280 |
| ఆచారాలు | 283 |
| గోవుద్వారా పదివీర్యాలు | .... |
| ప్రార్థనలు | 284 |
| ఆలోచనలు | 286 |
| రాజు ధర్మానికి ప్రతీక | .... |
| మంచినే చూడాలి | .... |
| తత్త్వమంటే ? | 287 |
| పరతత్త్వం | .... |
| భగవంతునిదయ - మహిమ | 288 |
| జీవితం - మరణం | 289 |
| సృష్టి | 290 |
| ప్రకృతితత్త్వం | .... |
| మనస్తత్త్వం | 292 |
| **3. 10 సాంఘికాచార వ్యవహారాలు** | **293** |
| దేశం | .... |
| ప్రజలు | .... |
| ఆశ్రమాలు | 294 |
| సాంఘికపరిస్థితులు | 297 |
| రాజకీయపరిస్థితులు | 298 |
| యుద్ధాలు | [illegible] |
| కృషి (వ్యవసాయం) | 302 |
| వాణిజ్యం | .... |
| ప్రయాణసాధనాలు | .... |
| వృత్తులు | 303 |
| లోహాలు - వస్తువులు | .... |
| వైద్యం | 304 |
| విజ్ఞానాలు | .... |
| సంఖ్యామానం - గణితం | 305 |
| పశువులు - పక్షులు | .... |
| జలచరాలు - కీటకాలు | .... |
| ఆధ్యాత్మికభావనలు | [illegible] |
| **3. 11 కవితాసౌందర్యం** | **309** |
| కవితాస్వరూపం | .... |
| శబ్దచమత్కారం | 310 |
| ఉపమ | [illegible] |
| కల్పన | 317 |
| స్వభావోక్తి | .... |
| ప్రశ్నోత్తరిక | [illegible] |
| శ్లేష | .... |
| అతిశయోక్తి | [illegible] |
| వీరరసం | .... |
| కరుణం | 321 |
| **3. 12 అధ్యాయాలు - సంగ్రహ సమీక్ష** | **322** |
| యజుర్వేదప్రాధాన్యం | 322 |
| యజుశ్శాఖలు | 323 |
| శుక్లయజుర్వేదం | 324 |
| శుక్లయజుర్వేదశాఖలు | 325 |

వాజసనేయసంహిత 325

అధ్యాయాల వివరణ 326

దర్శపూర్ణమాసయాగం ....

రాజసూయం 328

అగ్నిచయనం ....

అశ్వమేధం 329

పురుషమేధం 330

సర్వమేధం ....

శివసంకల్పోపనిషత్తు ....

ప్రవర్గ్య 331

ఈశావాస్యం ....

సమీక్ష ....

శతరుద్రీయం 332

సమదృష్టి ....

ప్రహేళికలు [redacted]

**4. నాల్గవపరిచ్ఛేదం :**

**సామసంహిత 339 - [redacted]**

**4. 1 పరిచయం 339**

సామ అంటే ఏమిటి ? ....

సామప్రశంస 340

దేశం ....

కాలం 341

విషయం ....

ప్రచురణ ....

ఉపవేదం 342

**4. 2 శాఖలు - విభాగం 343**

మొత్తంశాఖలు ....

ఇప్పుడు దొరుకుతున్నవి 344

మొదలు - చివర ....

సంహిత - విభాగం 345

పట్టిక 346

**4. 3 శాఖలు - దేశవ్యాప్తి 348**

**4. 4 పాఠవిశేషాలు 350**

గానంలో ఐదుభాగాలు 351

**4. 5 మంత్రద్రష్టలగు మహర్షులు 353**

వసిష్ఠుడు 353

వామదేవుడు ....

భరద్వాజుడు 354

మేధాతిథి ....

కణ్వుడు ....

విశ్వామిత్రుడు ....

గోతముడు ....

శునఃశేపుడు 355

సౌభరి ....

జమదగ్ని ....

ప్రస్కణ్వుడు ....

నృమేధుడు 356

ప్రగాథుడు ....

కశ్యపుడు ....

రేభుడు ....

అత్రి 357

వాలఖిల్యులు ....

ఇతరమహర్షులు ....

**4. [redacted] దేవతలు 359**

అగ్ని ....

ఇంద్రుడు 361

సోమం 363

ఉషస్సు 365
సూర్యుడు 367
విష్ణువు 368
ఋతువులు 369
పురుషుడు 370

**4. 7 ఛందస్సు 371**
పద్ధతి 373
గాయత్రి ....
త్రిష్టుప్ 374
అనుష్టుప్ ....
బృహతి 375
పంక్తి ....
ప్రగాథమంటే ఏమిటి ? 376

**4. 8 వైశిష్ట్యం 378**
విభాగం 379
స్వరచిహ్నాలు ....
శాఖలు 380
స్వరప్రయోగం 381

**4. 9 మతం - తత్త్వం 383**
యజ్ఞయాగాలు ....
ఆచారాలు 384
ప్రార్థనలు 385
దేవతలు 386
ఆలోచనలు ....
కోరికలు ....
తత్త్వం 387
మరణం 388
జీవితం ....
మోక్షం ....
పరబ్రహ్మ 389
మనస్తత్త్వం ....
భగవంతుని దయ 390

**4. 10 సాంఘికాచార వ్యవహారాలు 391**
త్యాగభోగాలు 392
అతిథిగౌరవం 393
అంతాకలసిగానం 396

**4. 11 కవితాసౌందర్యం 399**
శబ్దాలంకారాలు 400
వృత్త్యనుప్రాస ....
లాటానుప్రాస 401
ఛేకానుప్రాస 402
యమకం 404
మకుటాలు ....
అర్థాలంకారాలు 405
ఉపమ ....
మాలోపమ 406
ఉల్లేఖం 407
స్వభావోక్తి 408

**4. 12 ఆర్చికలు - సంగ్రహ సమీక్ష 409**
పూర్వార్చికం ....
ఉత్తరార్చికం 410
స్తోభపదములు 414
సప్తస్వరములు ....
అమరులమగుదుముగాక ! 417
దోషములను పోగొట్టుగాక ! ....
మంచినోవరుని ప్రసాదించుము 418

స్పష్టమైన ధర్మపథము! 418

నన్ను స్నేహితునిగా భావించుము! ....

బ్రహ్మతేజస్సును పెంపొందించుము 419

అన్నమే పరబ్రహ్మ ....

భగవంతుని స్మరింపుము .....

జ్ఞానమును ప్రసాదించుము 420

ఐశ్వర్యమును అనుగ్రహించుము ....

అభయమొసంగుము 421

పాపములనుండి విముక్తి ....

అగ్ని అనుగ్రహము ....

శత్రువులను తరిమివేయుము 422

**5. ఐదవపరిచ్ఛేదం**

**అథర్వసంహిత 425**

**5. 1 పరిచయం 425**

వేదత్వప్రతిపత్తి ....

అథర్వవైశిష్ట్యం 426

అథర్వసంహిత - నామాంతరాలు 427

దేశం 428

కాలం ....

విషయం 429

సాయణభాష్యం 430

గద్యపద్యసమ్మిశ్రం ....

భాష ....

అథర్వవేదం - వైదికవాఙ్మయం ....

అభిచారం - హింస 432

ప్రచురణ ....

ఉపవేదం 433

**5. 2 శాఖలు - విభాగం 434**

మొత్తంశాఖలు ....

ఇప్పుడు దొరికేవి 434

మొదలు - చివర 435

సంహితావిభాగం ....

పట్టిక 436

**5. 3 శాఖలు - దేశవ్యాప్తి 437**

**5. 4 పాఠవిశేషాలు 439**

**5.5 మంత్రద్రష్టలు**

**మహర్షులు 440**

అథర్వుడు 441

భృగువు ....

వసిష్ఠుడు 442

విశ్వామిత్రుడు ....

కౌశికుడు ....

కుత్సుడు ....

అంగిరసుడు 443

శునఃశేపుడు ....

గోతముడు ....

ప్రస్కణ్వుడు ....

వామదేవుడు ....

మధుచ్ఛందుడు ....

భరద్వాజుడు 444

అగస్త్యుడు ....

సోభరి ....

మేధాతిథి ....

జమదగ్ని ....

ఇతరమహర్షులు ....

**5. 6 దేవతలు 447**

ఇంద్రుడు ....

అగ్ని 449

సూర్యుడు ఆదిత్యుడు మిత్రుడు 451
సోముడు చంద్రుడు 452
ఉదకం 453
మరుద్దేవతలు ....
వాచస్పతి - బృహస్పతి 454
రుద్రుడు ....
వరుణుడు 455
పర్జన్యుడు - భూమి 457
ద్యావాపృథువులు - అంతరిక్షం ....
విశ్వకర్మ 458
గరుత్మంతుడు - సుపర్ణుడు ....

**5. 7 ఛందస్సు 460**

ఛందస్సు పాదాలు 461
గాయత్రి 462
ఉష్ణిక్ 463
అనుష్టుప్ ....
బృహతి ....
పంక్తి 464
త్రిష్టుప్ ....
జగతి 465
పట్టిక 466

**5. 8 వైశిష్ట్యం**

నామాంతరాలు 467
కాండలస్వరూపం 468
అథర్వవేదప్రామాణ్యం ....
భౌతికసుఖసాధన 470
వ్యాధినివారణ ....
గృహస్థాశ్రమప్రశంస 471
ఆరోగ్యం - ఆయుష్యం ....
శల్య - శస్త్రచికిత్సలు [illegible]
ప్రజాస్వామ్యభావన 473
కార్యసాధన పట్టిక ....
ప్రజాక్షేమసాధన 474
సకలకార్యసిద్ధి 475

**5. 9 మతం - తత్త్వం 476**

ఆచరణబద్ధమైన దృక్పథం ....
బాధలమధ్యలో 477
లౌకికజీవనమంటే ఏమిటి? 478
అంతట భగవత్సాన్నిధ్యం 479
సమాజాన్నిముందుకు నడిపించాలి 481
ద్వేషమెందుకు? ప్రేమించు ....
మంచిమనస్సు కావాలి 482
ప్రతివాడికి గురువుకావాలి ....
పృథ్వీసూక్తం 483
ఈ జీవితంకూడా ముఖ్యమే ....
సమాజసేవే దైవారాధన 484

**5. 10 సాంఘికాచార వ్యవహారాలు 485**

వైదికజీవనానికి ప్రతిబింబం ....
రాష్ట్రం - రాజ్యం 486
వ్యవసాయం ....
గోసంపద 487
వ్యాపారం ....
విభేదాలను పోగొట్టుకోవాలి 488
మంత్రప్రయోగంతో ....
శకునాలు 489
ఎన్నోవ్యాధులు - ఎన్నో వైద్యాలు 489
ఇంద్రజాలం 490
శత్రునాశనం 491
తాత్త్వికదృష్టి ....

ఒకవైపురక్తి ఇంకోవైపుముక్తి 492

**5. 11 కవితాసౌందర్యం 493**

కవితాబీజాలు ....

వర్ణన 494

మాలోపమ 497

భావతీవ్రత 499

సాభిప్రాయపదప్రయోగం 500

హితోపదేశం 501

**5. 12 కాంతలు - సంగ్రహ సమీక్ష 502**

కాంతల స్వరూపం ....

పుట్టింట్లోనే ఉండిపోని! 504

క్రిమిరోగాలు నరికడతాను ....

ఇష్టమైన స్త్రీని వశపరచుకోవాలంటే 505

లోకాన్నెలా వశపరచుకోవాలి? 505

ఎలా నిద్రకలిగించడం? 506

విరిగిన ఎముకలు కలపడమెలా? ....

వరదమెలా కురుస్తుంది? ....

గ్రహబాధలెలా పోతాయి? 507

ఓ జ్వరమా! వెళ్లిపో! ....

స్త్రీవశీకరణం ....

ఇతడెలా అందుతాడు? ....

సభలో నాకేవిజయం లభించాలి? 508

క్షయవ్యాధి నివారణం ....

అతిథి సేవాఫలం ....

ఈ శరీరాన్ని భగవంతుడిచ్చాడు [illegible]

అన్నమే అన్నం తింటున్నది 510

అధ్యేయగ్రంథసూచి 511

BIBLIOGRAPHY 517

విశిష్టపదసూచి 523




# ఆర్షవిజ్ఞానసర్వస్వము

## వేదసంహితలు

## ఒకటవ పరిచ్ఛేదం: ఋక్సంహిత

### 1.1 పరిచయం

ఋక్ అంటే ఏమిటి ?

శాఖోపశాఖలుగా విస్తరించిన వైదిక లౌకిక వాఙ్మయ మహావృక్షానికి బీజభూతమైంది ఋగ్వేదం. దేనిచేత దేవత స్తుతింపబడుతుందో అది ఋక్ (**ఋచ్యతే స్తూయతే దైవతా యయా సా ఋక్**) అనడంవల్ల ఋక్ శబ్దానికి 'స్తుతి' అని అర్థం. 'ఋచ'-స్తుతౌ' అనే ధాతువునుంచి ఈ శబ్దం ఏర్పడింది. ఆయా యజ్ఞాల నిర్వహణంకోసం ఏర్పడి, అక్కడక్కడా ఉన్న ఈ ఋక్కులన్నీ ఒక్కచోట కూర్చబడ్డాయి. ఈ ఋక్కుల కూర్పునే ఋక్సంహిత అంటారు జైమిని 'అర్థాన్నిబట్టి పాదవ్యవస్థకలది ఋక్' అంటాడు[1].

---

1 తేషాం ఋక్, యత్రార్థవశేన పాదవ్యవస్థా, మీ ద 2-1-35, యత్ర పాదకృతా వ్యవస్థా స మంత్ర ఋఙ్నామా' అని శబరస్వామి దీన్ని వివరించాడు.

పాదబంధంతో, వృత్తబంధంతో ఉండి అర్థయుక్తమైన మంత్రం ఋక్ అనబడుతుంది[1]. ఋక్ప్రాతిశాఖ్య వ్యాఖ్యలో విష్ణుమిత్రుడు ఇలాగే ఋక్కుకు చక్కని లక్షణాన్నిచ్చాడు[2].

**సంహితాప్రశంస :**

ఇప్పుడు ప్రచారంలో ఉన్న ఋక్సంహిత శాకలమహర్షిచేత మండల సూక్తరూపంలో విభజింపబడింది. శౌనకుడుకూడ ఇలాగే మండల - సూక్తవిభాగం చేసినట్లు ప్రసిద్ధి ఉంది. సామాన్యంగా సూక్తమంటే మంచిమాట అని అర్థం. ఇక్కడ కొన్ని ఋక్కుల సమూహం సూక్తమనబడుతుంది. ఈ సూక్తాలు 1. **ఋషిసూక్తం, 2. దేవతాసూక్తం, 3. ఛన్దస్సూక్తం, 4. అర్థసూక్తమని** నాలుగు రకాలు. ఒకే ఋషి దర్శనంచేసిన మంత్రసమూహానికి ఋషిసూక్తమని పేరు. ఒకే దేవతకు సంబంధించిన మంత్రసమూహం దేవతాసూక్త మనబడుతుంది. సమానమైన ఛందస్సులో చెప్పబడిన మంత్ర సమూహం ఛందస్సూక్తమని పిలువబడుతుంది ఒక విషయం పూర్తయ్యేవఱకు చెప్పబడ్డ మంత్రాలన్నింటికి అర్థసూక్తమని వ్యవహారం.

**దేశం :**

చారిత్రకుల అభిప్రాయం ప్రకారం ఈఋక్సంహిత సింధునదీ తీరంలో ఈనాడు పంజాబ్ అని పిలవబడే పంచాపజనపదంలో ప్రాదుర్భవించింది. పశ్చిమదేశంనుంచి భారతవర్షంలో ప్రవేశించిన ఆర్యులు సింధునదీతీరంలో ఉన్న తూర్పు కాబూల్‌లోను, పంజాబ్‌లోను మొదట నివసించారు.

---

1. పాదబన్ధేనార్థేన చోపేతా వృత్తబద్ధా మంత్రా ఋచః. వే ప 24
2. యః కశ్చిత్ పాదవాన్ మంత్రో యుక్తశ్చాక్షరసంపదా ।
స్వరయుక్తో ఽవసానే చ తామృచం పరిజానతే ॥ అందులోనే, 24

**కాలం :**

పాశ్చాత్యుల అభిప్రాయాన్ననుసరించి ఈ సంహిత ఇప్పటికి 3,500 సం॥ పూర్వం రచింపబడింది అంటే క్రీ.పూ. సుమారు 1,500 సం॥ పూర్వం మనకు ప్రస్తుతం దొరుకుతున్న సంహిత పుట్టిందని వారి అభిప్రాయం ఈ సంహితకు ఇప్పుడున్న రూపం ఏర్పడటానికి కొన్నివందల సం॥ కాలం తప్పక పట్టివుంటుందని, అందులోని భాష, దాని స్వరూపం మనకు తెలియజేస్తున్నాయి. పాశ్చాత్యపండితులు ఈ సంహితలోని దశమమండలం నవీనమైనదని భావిస్తున్నారు మిగతా మండలాలకు దానికి సంబంధం చాల తక్కువ సాంప్రదాయికవాదులు ఈ కాలనిర్ణయాన్ని అంగీకరించరు.

భారతీయ సంప్రదాయాన్ననుసరించి నిత్యమైన ఈ శబ్దరాశి మహర్షులకు దృగ్గోచరమైందేగాని, వారు దీన్ని రచించలేదు అందు వల్ల వారు మంత్రద్రష్టలేగాని మంత్రరచయితలుకారు.

**విషయం :**

వేదాల్లో చెప్పబడనివిషయం ఏముంటుంది? అందులోను ప్రపంచవాఙ్మయానికే మూలభూతమైన ఋగ్వేదంలో బీజప్రాయంగానైనా అభివర్ణింపబడని తత్త్వమేముంటుంది? ప్రపంచోత్పత్తిని గురించి వర్ణించిన 'నాసదీయసూక్తం' ఋగ్వేదం మొత్తానికే తలమానికంలాంటిది. ప్రపంచ సృష్టితత్త్వాన్నిగురించి ఇందులోగల ఆనాటి వారి భావనలు ప్రపంచ ప్రసిద్ధులైన తాత్త్వికులకెందరికో ఆశ్చర్యాన్ని కలిగించాయి. తరువాత అదేమాదిరి సృష్టిని గురించి చెప్పిన సూక్తం పురుషసూక్తం. ఇందులో విశ్వోత్పత్తిరహస్యం ఎంతో రమణీయంగా వర్ణింపబడింది. జీవుల సముత్పత్తి, వారి బంధమోక్షాలు, ప్రకృతి రహస్యాలు, ఆయా దేవతల స్తుతులు మొ॥ విషయాలెన్నో ఈ వేదంలో ఉన్నాయి.

. ఈ సంహితలో ఏదైనా వస్తువు తత్త్వాన్ని వర్ణించడానికి ఉపయోగించిన సంవాదరూపమైన సూక్తాలు ఎంతో విశిష్టమైనవి. లోకంలో అందఱికి ఉపయోగించే జ్ఞానాన్ని ఋక్సంహిత మనకందిస్తున్నది. ఆకాశయానం (1.116.3) రాజధర్మం (10.125.3-4) లోకహితంకోసం చేపట్టవలసిన ఏకపత్నీవ్రతం, వివాహబంధం యొక్క వైశిష్ట్యం, స్త్రీ గౌరవం, ఆశ్రమవ్యవస్థ, పునర్జన్మ, ఆయుర్వేద విజ్ఞానం మొll అనేక విషయాలు ఋక్సంహితలో ప్రధానంగా వర్ణింపబడ్డాయి.

## పరిశోధన, ప్రచురణ:

మొట్టమొదట 1838లో ఫ్రెడ్రిక్ రోజెన్ (Friedrich Rosen) అనే పాశ్చాత్యపండితుడు వైదికపరిశోధనం మొదలుపెట్టాడు: తరువాత ఫ్రెంచిపండితుడు యుగేనె బర్నొఫ్ (Eugene Burnouf) యూరపులో వైదికవాఙ్మయాధ్యయానికి పునాదులువేశాడు ఎఫ్ మాక్స్ముల్లర్ (F. Maxmuller) ఇతని శిష్యుడే. మాక్స్ముల్లర్ 1849-1875 సంll మధ్య సాయణభాష్యంతో ఋగ్వేదాన్ని మొదట ప్రకటించాడు[1]. 1861-1863 మధ్యలో టి. హెచ్. ఔఫ్రిత్ (Th. Aufrecht) సంపూర్ణంగా ఋగ్వేదాన్ని ప్రకటించాడు.

ఇంగ్లీషు పండితుడైన హెచ్. హెచ్ విల్సన్ (H. H. Wilson) సాయణభాష్యాన్ననుసరించి ఋక్సంహితనంతటిని ఇంగ్లీషులోకి అనువదించి ప్రకటించాడు. తరువాత రుడాల్ఫ్‌రాథ్ (Rudolf Roth) శిష్యుడైన హెచ్. గ్రాస్‌మన్ (H. Grassmann) 1876-1877 లో ఋగ్వేదానికి పద్యానువాదం చేశాడు. వీరు సాయణభాష్యాన్ని పూర్తి ప్రమాణంగా తీసుకోరు. ఆల్ఫ్రెడ్ లుడ్విగ్ (Alfred Ludwig) పండితుడు

1. ఇది మళ్లా 1890-1892 లో ముద్రింపబడింది

ఋగ్వేదాన్ని జర్మన్ భాషలో అనువదించడమే కాకుండా అనర్ఘమైన వ్యాఖ్యానాన్నికూడా వ్రాసి 1876-1888 లో ప్రకటించాడు. ఈ సంహితకు ఆర్.టి. హెచ్. గ్రిఫ్పిత్ (R.T.H. Griffith) చేసిన ఆంగ్లానువాదం 1889-1892 లో బెనారస్‌లో ప్రకటించబడింది. ఇది అత్యుత్తమమైన అనువాదం.

వేదాలననువాదం చేసేటప్పుడు, వ్యాఖ్యానించేటప్పుడు భారతీయుల ఆలోచనాసరణిని తోసివేయకూడదని భావించి, భారతీయ సంప్రదాయాన్ని ప్రామాణికంగా తీసికొని వైదికవాఙ్మయపరిశోధన చేసినవారు ఆర్. పిశ్చెల్ (R. Pischel) కె ఎఫ్. గెల్డెనర్ (K.F. Geldner)[1].

లక్ష్మణసరూప్ లాహోర్‌నుంచి 1939 లో వేంకటమాధవ భాష్యంతోను, 1941 లో వైదికసంశోధనమండల్, పూనానుంచి సాయణభాష్యంతోను ఋగ్వేదాన్ని ప్రచురించారు. సాతవలేకర్ పారడీనుంచి మూలాన్ని (మూడవ ప్రచురణ) 1957 లో ప్రకటించారు.

**ఉపవేదం:**

ఋగ్వేదానికి ఆయుర్వేదం ఉపవేదం. దీనికి 1. శల్య 2.శాలాక్య 3. కాయచికిత్స 4. భూతవిద్య 5. కౌమారభృత్య 6. అగద 7.రసాయన 8. వాజీకరణాలనే పేరుతో ఎనిమిది అంగాలున్నాయి. ఇందులో చరక-సుశ్రుత-వాగ్భట-అష్టాంగ-హృదయ-శార్ఙ్గధరసంహితా-మాధవనిదాన, భావప్రకాశాదులు ప్రసిద్ధగ్రంథాలు.

**- ఎస్.బి.ఆర్.**

1. ' Vedische Studien' 3 Vols Stuttgart, 1889-1901.

## 1.2 శాఖలు - విభాగం

మొత్తం శాఖలు:

ఋగ్వేదానికి మొత్తం 21 శాఖలుండేవని **"ఏకవింశతిధా బాహ్వృచమ్"** అని మహాభాష్యకారుడైన పతంజలిమాట. వాటిల్లో శాకల-బాష్కల-ఆశ్వలాయన-శాంఖాయన మాండూకేయాలని ఐదుశాఖలు ప్రచారంలో ఉండేవని చరణవ్యూహం పేర్కొంటున్నది[1]. అందులో ఆశ్వలాయన, శాంఖాయన శాఖలు శాకల శాఖకంటే పెద్దగా విభిన్నమైనవి కావు

శాకలశాఖలో పదకొండు వాలఖిల్యసూక్తాలు, ఖిలసూక్తాలుగా అంగీకరింపబడ్డాయి. వాటిని ఆశ్వలాయనశాఖలో ఖిలసూక్తాలుగా కాకుండా మూలగ్రంథంగానే స్వీకరించారు. శాంఖాయనశాఖలోకూడా వాటిలో కొన్ని మంత్రాలను వదిలేసి మిగతావాటిని మూలగ్రంథంగానే పరిగణించారు. ఇదే శాకలశాఖతో ఈ రెండు శాఖలకుగల భేదం.

మాండూకేయశాఖలో ఇతరశాఖలకంటే ఏయే విశేషాలున్నాయో చరిత్రకందలేదు.

ప్రధానమైన ఈ శాఖలకు కొన్ని ఉపశాఖలున్నాయి. అందులో శాకల శాఖకు 1. ముద్గల 2. గాలవ 3. శాలీయ 4. వాత్స్య 5. శైశిర శాఖలు ఉపశాఖలు. బాష్కలశాఖకు : 1. బౌధ్య 2. అగ్నిమాఠర 3.పరాశర 4. జాతూకర్ణ్యశాఖలు ఉపశాఖలు. శాంఖాయనశాఖకు 1.కౌషీతకి 2. మహాకౌషీతకి 3. శాంబవ్యశాఖలు ఉపశాఖలు. ఇవిగాక 1 బహ్వృచ 2. పైంగ్య 3. ఉద్దాలక (ఆరుణి) 4. శతబలాక్ష 5. గజ

---

1. ఈ ఐదుశాఖలకు సాధ్యాయన - ఔదుంబర శాఖలను చేర్చి మొత్తం ఏడు శాఖలున్నాయని అథర్వణ పరిశిష్ట చరణవ్యూహం చెపుతున్నది వై సా.ఇ **158.**

6. బాష్కలి (భారద్వాజ) 7. ఐతరేయ 8. వాసిష్ఠ 9. సులభ 10.శౌనకశాఖలున్నట్లు తెలుస్తున్నది. (వై.వా.ఇ.191).

## దొరుకుతున్న శాఖలు :

ప్రస్తుతం మనకు దొరుకుతున్న శాఖలు శాకల - బాష్కల శాఖలనేవి రెండు వీటికి పరస్పరం పెద్దగా చెప్పతగినన్ని తేడాలు లేవు. శాకలశాఖలోని ఎనిమిది సూక్తాలు అధికంగా బాష్కలశాఖలో కనబడుతున్నాయని, ప్రథమమండలంలో కొంతగ్రంథభాగం బాష్కలశాఖలో వేఱేస్థానంలో ఉన్నదని ఇదే ఈ రెండుశాఖలకు చెప్పదగిన భేదమని కొందఱి అభిప్రాయం. ఇప్పటి సంహితాపాఠంలో ఇలాంటి విశేషాలు ఏమీ కన్పడవు. మొత్తంమీద ఋగ్వేదానికి ఏర్పడిన ఐదు శాఖల్లోను ప్రస్తుతం దొరుకుతున్న శాకలపాఠం పరంపరాప్రాప్తమైనది, అన్నివిధాల సరైనదని పండితులందఱి విశ్వాసం.

## మొదలు - చివఱ :

ఈ ఋక్సంహిత 'అగ్నిమీడే పురోహితం' అనే అగ్నిసూక్తంతో ప్రారంభమై "సమానీవ ఆకూతిః" అనే సంజ్ఞానమంత్రంతో పూర్తవుతున్నది.

## మండలవిభాగం :

ఋక్సంహిత మొదట పదిమండలాలుగ విభజింపబడింది. ప్రతిమండలంలోను సూక్తవిభాగం ఉన్నది. మొత్తం పదిమండలాల్లోను 1017 సూక్తాలున్నాయి. అవికాక ఎనిమిదవ మండలంలో పదకొండు వాలఖిల్యసూక్తాలు ఖిలసూక్తాలుగ గుర్తింపబడ్డాయి. వాటితో కలిసి

1028 సూక్తాలు ఈ సంహితలో ఉన్నాయి. మొత్తం 1028 సూక్తాలలోను 10,552 ఋక్కులున్నాయి.

| మండలవిభాగం | | |
|---|---|---|
| మండలాలు | సూక్తసంఖ్య | ఋక్కులు |
| 1. | 191 | 2006 |
| 2. | 43 | 429 |
| 3. | 62 | 617 |
| 4. | 58 | 589 |
| 5. | 87 | 727 |
| 6. | 75 | 765 |
| 7. | 104 | 842 |
| 8. | 92 | 1636 |
| 9. | 114 | 1108 |
| 10. | 191 | 1754 |
| | మొత్తం 1017 | మొత్తం 10,472 |
| | వాలఖిల్య సూక్తాలు 11 | 80 |
| | మొత్తం 1028 | మొత్తం 10,552 |

## అష్టక విభాగం:

ఋక్సంహితకు ఇంకోరకమైన విభాగంకూడ ఉన్నది. దానిప్రకారం ఈసంహితలోని 64 అధ్యాయాలు ఎనిమిది అష్టకాలుగా విభజింపబడ్డాయి. అష్టకమంటే ఎనిమిది అధ్యాయాల సమూహం. ప్రతి అధ్యాయంలోను కొన్ని వర్గలుంటాయి. ఏ విభాగాన్ననుసరించినా

ఋక్కుల సంఖ్యలో ఏ కొంచెంకూడ మార్పుండదు. వివరాలు ఇక్కడ ఇవ్వబడ్డ పట్టికలో ఉన్నాయి.

| | | అష్టక విభాగం | | |
|---|---|---|---|---|
| అష్టకం | సూక్తాలు | వర్గలు | ఋక్కులు | అక్షరాలు |
| 1 | 121 | 265 | 1370 | 48,931 |
| 2. | 119 | 221 | 1147 | 51,718 |
| 3. | 122 | 225 | 1209 | 47,636 |
| 4. | 140 | 250 | 1289 | 49,762 |
| 5. | 129 | 238 | 1263 | 48,022 |
| 6. | 124 | 313 | 1650 | 48,412 |
| 7. | 116 | 248 | 1263 | 47,562 |
| 8. | 146 | 246 | 1281 | 52,178 |
| | 1017 | 2006 | 10,472 | 3,94,221 |
| వాలఖిల్య సూక్తాలు | 11 | 18 | 80 | 3,044 |
| మొత్తం | 1028 | 2024 | 10,552 | 2,97,265 |

- ఎస్.బి.ఆర్.

## 1.3 శాఖలు - దేశవ్యాప్తి

వేదవ్యాసునిద్వారా ఋగ్వేదాన్ని మొదట అధ్యయనం చేసినవాడు పైలుడు. ఇతని తండ్రిపేరుకూడ పైలుడే. తల్లి పేరు పీల[1]. యుధిష్ఠిరుడు రాజసూయం చేసినప్పుడు వ్యాసుడీతణ్ణి ఆ యాగానికి హోతగా ఏర్పాటుచేశాడు[2]. ఈ పైలుడు ఋగ్వేదాన్ని ఇంద్రప్రమతికీ, బాష్కలునికి ఉపదేశించాడు.

ఇంద్రప్రమతి మండూకేయునికి, అతడు సత్యశ్రవునికి, సత్యశ్రవుడు సత్యహితునికి, అతడు సత్యశ్రీకి ఈ సంహితను అధ్యాపనం చేశారు. ఈ సత్యశ్రీకి ముగ్గురు శిష్యులు : 1. వేదమిత్ర శాకల్యుడు (శాకలుడుకూడా ఇతడే). 2. రథీతర శాకపూణి, 3 బాష్కలి భారద్వాజుడు. వీరు ముగ్గురు సత్యశ్రీద్వారా ఋక్సంహితనధ్యయనం చేశారు. శాకల్యుడు, 1. ముద్గల 2. గాలవ 3. గ్వాలీయ 4. వాత్స్య 5. శైశిరులనేవారికి ఈ సంహితనుపదేశించాడు. ఇలా ఇంద్రప్రమతి పరంపర భారతవర్షమంతటా విస్తరించింది.

రెండవవాడు బాష్కలుడు. ఇతడు 1. బౌధ్య 2. అగ్ని మాఠర 3. పరాశర 4. జాతూకర్ణ్యులనే నల్గురు శిష్యులకు తన శాఖను నేర్పాడు. ఇది అంతగా విస్తరించలేదు.

ప్రాచీన అంగదేశానికి రాజధాని ఇప్పుడు బీహార్ రాష్ట్రంలోని 'ముంగేర్'. అక్కడ గంగానదిఒడ్డున ముద్గలుని ఆశ్రమం ఉండేదని ప్రతీతి. దీన్నిబట్టి బీహార్ రాష్ట్రంలో ముద్గలశాఖాపరంపర ఉండేదని భావించవచ్చు. శతబలాక్షుడు, బధ్యశ్వుడు ఈ ముద్గలుని పుత్రులని,

---

1 పైలాదిభ్యశ్చ, అష్టా. 2.4.49. పీలాయా వా. అష్టా. 4 1.118.

2. పైలో హోతా వసోః ధౌమ్యేన సహితోఽభవత్. భార. సభా. 36-35.

వారుకూడా ఈ శాఖకు ప్రచారకులని తెలుస్తున్నది. (వై.వా.ఇ.162-163). ప్రతివేదశాఖ తండ్రినుంచి కుమారునికో, లేక గురువునుంచి శిష్యునకో పరంపరగా సంక్రమించి ప్రచారంలోకి వచ్చింది.

ఇలాగే బాభ్రవ్యడనేపేరుగల గాలవుడు పాంచాలదేశంలో ఈ సంహితను ప్రచారంలోకి తీసుకువచ్చాడు. ఈనాటి బరేలీ ప్రాంతమే పాంచాలదేశం. జాతూకర్ణ్యుడు ఇతనికి సమకాలికుడు. మహాభారతంలో ఋగ్వేదప్రచారకుడైన ఈ గాలవుని ప్రస్తావం చాల చోట్ల ఉన్నది[1].

అశ్వలుడు, జనకుడుచేసిన బహుదక్షిణాయుక్త యాగానికి హోత. అతని కుమారుడు ఆశ్వలాయనుడు మిథిలాప్రాంతంలో ఇతనిద్వారా ఋక్సంహిత ప్రచారంలోకి వచ్చింది

మండూకుని కుమారుడు మాండూకేయుడు. ఇతనిద్వారా మగధదేశంలో ఋక్సంహితాప్రచారం జరిగింది.

ఇలా ఆయా కాలాల్లో శాఖాప్రవర్తకులద్వారా ఋక్సంహిత భారతదేశమంతట వ్యాపించింది ఇప్పటికీ భారతదేశంలోని చాలా రాష్ట్రాల్లో ఋగ్వేదపరంపర అక్కడక్కడ మనకు కనబడుతున్నది.

**-ఎస్.బి.ఆర్.**

1. సభాయామృషయస్తస్యాం పాండవైస్సహ ఆసతే ।
సవిత్రపాణిః సావర్ణో భాలుకిర్గాలవస్తథా ॥ భార. సభా. 4.

## 1.4 పాఠవిశేషాలు

### వేదవిభాగం :

ప్రాచీనకాలంలో ఋక్కులు, యజుస్సులు, సామలు అన్నీ విడి విడిగా లేకుండా కలిసిపోయి ఒకే ఒక వేదరాశిగా ఉండేవి. అలాంటి మంత్రసమూహాన్నంతా ఆ రోజుల్లో మహర్షులు అధ్యయనం చేసేవారు. వారి అధ్యయనంలో ఋక్కులు యజుస్సులు, సామలు విడివిడిగా లేకపోయినా అన్నీ కలిసి ఉండేవి. కాలం గడిచింది. అంతటి వేదరాశిని అధ్యయనం చేసే ఓపిక సామాన్యుల్లో సన్నగిల్లింది వేదవ్యాసుడవతరించాడు. అలాంటి సుకుమారమతుల సౌకర్యంకోసం వేదరాశిలో అక్కడక్కడా ఉన్న ఋక్కులనన్నింటినీ ఏరి ఒకచోట కూర్చాడు[1] అది ఋగ్వేదమైంది. యజుస్సులన్నీ ఒకచోటకురాగా అది యజుర్వేదమైంది. సామలన్నీ కలసి సామవేదమైంది. అథర్వమంత్రాలన్నీ కలసి అథర్వవేదమైంది. ఇలా కూర్చడాన్నే 'సంధానం' అంటారు. ఈ కూర్పునే 'సంహిత' అంటారు. వీటిని పైల- వైశంపాయన-జైమిని-సుమన్తులనే తన నల్గురు శిష్యులకు ఉపదేశించాడు వేదవ్యాసుడు. ఈ విషయాన్ని మహీధర[2] భట్టభాస్కర[3] దుర్గాచార్యులు[4] వారి భాష్యాల్లో విశదీకరించారు.

---

1. ఏకో వేదశ్చతుర్ధా తు యః కృతో ద్వాపరాదిషు. వి.పు.3.3.19-20
   వేదశ్చైకశ్చతుర్ధా తు వ్యస్యతే ద్వాపరాదిషు మ.పు. 144-11
2. తత్రాదౌ బ్రహ్మపరంపరయా ప్రాప్తం వేదం వేదవ్యాసో మందమతీన్ మనుష్యాన్ విచిన్త్య తత్కృపయా చతుర్ధా వ్యస్య ఋగ్యజుస్సామాథర్వాఖ్యాంశ్చతురో వేదాన్ పైల వైశంపాయన జైమిని సుమన్తుభ్యః క్రమాదుపదిదేశ. వై.వా.ఇ.91
3. పూర్వం భగవతా వ్యాసేన జగదుపకారార్థమేకీభూయ స్థితా వేదా వ్యస్తాః శాఖాశ్చ పరిచ్ఛిన్నాః. అందులోనే 91.
4 వేదం తావదేకం సన్తమతిమహత్త్వాద్ దురధ్యేయమనేక శాఖాభేదేన సమామ్నానిషుః సుఖగ్రహణాయ వ్యాసేన సమామ్నాతవన్తః. అందులోనే 91

అయితే ఆరోజు ఆయనకూర్చిన సంహిత మళ్లా ఎన్నో మార్పులకు గురైంది. ఆయా వేదాలను కొందఋ మహర్షులు క్రమబద్ధంగా మళ్లామళ్లా కూరుస్తూవచ్చారు.

ఇలా ప్రతివేదానికి సంహితాపాఠం దొరుకుతున్నది. దీన్నే మనం ఋక్సంహిత, యజుస్సంహిత. సామసంహిత, అథర్వసంహిత అని పిలుస్తుంటాం.

**సంహితాలక్షణం :**

సంహితాలక్షణాన్ని ఋగ్వేదప్రాతిశాఖ్యం, యజుర్వేద ప్రాతిశాఖ్యం, అష్టాధ్యాయి ఇలా వివరిస్తున్నాయి. **'పదప్రకృతిః సంహితా'** (ఋ.ప్రా.2.1) **'వర్ణానామేక ప్రాణయోగః సంహితా'** (వాజ.ప్రా 1.158) పరస్సన్నికర్షః సంహితా, అష్టా. (1.4.109)

**సంహితాభేదం :**

ఈ సంహితలు స్థూలంగా 1. నిర్భుజసంహిత 2. ప్రతృణ సంహిత అని రెండురకాలు. ఇందులో మొదటిదైన నిర్భుజసంహితలో పాఠం యథాక్రమంగా ఇలా వుంటుంది.

**'అగ్నిమీడే పురోహితమ్'**

ప్రతృణసంహిత, 1. పదసంహిత 2. క్రమసంహిత అని రెండురకాలుగా ఉంటుంది. ఇది పదసంహితాపాఠం.

**'అగ్నిమ్, ఈడే, పురఃఽహితమ్'**

క్రమసంహితాపాఠం ఇలా ఉంటుంది.

**'అగ్నిమ్, ఈడే, ఈడే, పురోహితమ్, పురోహితమితి పురఃఽహితమ్'.**

ఈ క్రమసంహితాపాఠం, తరువాత చెప్పే జట మొ॥ ఎనిమిది వికృతి పాఠాలకు మూలభూతమైంది. ఈ క్రమపాఠం బాభ్రవ్యుడనే మహర్షి మొదట చేసినట్లు ప్రసిద్ధి. (వై.వా.ఇ.164).

**ఎనిమిది వికృతులు :**

ఇక్కడ ప్రసిద్ధమైన ఒక ఋగ్వేదమంత్రానికి సంహితాపాఠం, పదపాఠం, క్రమపాఠం ఎలాఉంటుందో వివరించి, జట మొ॥ ఎనిమిది వికృతుల స్వరూపం ప్రతిపాదింపబడుతుంది.

1. సంహితాపాఠం :

ఓషధయఃసంవదన్తేసోమేనసహరాజ్ఞా
యస్మైకృణోతిబ్రాహ్మణస్తంరాజన్పారయామసి
(ఋ.సం.10.97.22).

2. పదపాఠం[1] :

ఓషధయః। సం। వదన్తే। సోమేన। సహ। రాజ్ఞా।
1 2 3 4 5 6
యస్మై। కృణోతి। బ్రాహ్మణః। తం। రాజన్। పారయామసి।
7 8 9 10 11 12

క్రమపాఠం :

క్రమంగా రెండుపదాలను కలిపి చెప్పడమే క్రమపాఠం ఇది ముక్తపదగ్రస్తంలాగా ఉంటుంది. దీన్నే యోగరూఢయైన సంహిత అనికూడా అంటారు.చూడండి :

ఓషధయః సం। సం వదంతే। వదంతే సోమేన। సోమేన సహ।
1 2 2 3 3 4 4 [illegible]
సహ రాజ్ఞా। రాజ్ఞేతి రాజ్ఞా।
5 [illegible] 6 6

1. పదవిచ్ఛేదో ఽసంహితః కా.ప్రా

యస్మై కృణోతి। కృణోతి బ్రాహ్మణః। బ్రాహ్మణస్తం।

7 [redacted] 8 9 9 10

తం రాజన్। రాజన్ పారయామసి। పారయామసీతి పారయామసి।

10 11 11 12 12 12

ఈ క్రమపాఠంపైన 1.జట 2. మాల 3. శిఖ 4. రేఖ 5.ధ్వజం 6. దండం 7. రథం 8. ఘన అని ఎనిమిది వికృతి పాఠాలు ఏర్పడతాయని వ్యాడి శైశిరీయశాఖలో చెప్పాడు[1]. వీటిల్లో జట దండం అనే రెండు వికృతులు చాల ముఖ్యమైనవి. వీటిద్వారానే మిగత వికృతులు ఏర్పడుతున్నాయి. శిఖాపాఠం జటను అనుసరిస్తుంది. శిఖను దండ, మాలా, రేఖా, ధ్వజపాఠాలు అనుసరిస్తాయి. ఘనపాఠం జటాపాఠాన్ని దండపాఠాన్ని అనుసరిస్తుంది

**పంచసంధులు :**

జటాపాఠంలో 1.అనుక్రమం 2 ఉత్క్రమం 3. వ్యుత్క్రమం 4.అభిక్రమం 5. సంక్రమం అని అయిదు సంధులుంటాయి[2]. వీటి స్వరూపం ఇలావుంటుంది :

1. అనుక్రమం— 1+2; 2+3
2. ఉత్క్రమం— 2+2; 3+3
3. వ్యుత్క్రమం— 2+1; 3+2

---

1. శైశిరీయే సమామ్నాయే వ్యాడి (లి)నైవ మహర్షిణా ।
జటాద్యా వికృతీరష్టౌ లక్ష్యన్తే నాతివిస్తరమ్ ॥
జటా మాలా శిఖా రేఖా ధ్వజో దండో రథో ఘనః ।
అష్టౌ వికృతయః ప్రోక్తాః క్రమపూర్వా మహర్షిభిః ॥ వి.వ 1.5

2. అనుక్రమశ్చోత్క్రమశ్చ వ్యుత్క్రమోఽభిక్రమస్తథా ।
సంక్రమశ్చేతి పంచైతే జటాయాం కథితాః క్రమాః ॥ ఋ. సం 798.

4. అభిక్రమం— 1+1; 2+2
5. సంక్రమం— 1+2; 2+3
(మంత్రంలోని పదాల క్రమసంఖ్య పైన చూపబడింది)

| అనుక్రమం 1-2 | | ఉత్తమం 2-2 | | వ్యుత్తమం 2-1 | | అభిక్రమం 1-1 | | సంక్రమం 1-2 | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఓషధయః | సం | సం | సం | సమోషధయః | | ఓషధయః | ఓషధయః | ఓషధయః | సం |
| 1 | 2 | 2 | 2 | 2 | 1 | 1 | 1 | 1 | 2 |
| సం | వదన్తే | వదన్తే | వదన్తే | వదన్తే | సం | సం | సం | సంవదన్తే | |
| 2 | 3 | 3 | 3 | 3 | 2 | 2 | 2 | 2 | 3 |
| వదన్తే | సోమేన | సోమేన | సోమేన | సోమేన | వదన్తే | వదన్తే | వదన్తే | వదన్తే | సోమేన |
| 3 | 4 | 4 | 4 | 4 | 3 | 3 | 3 | 3 | 4 |
| సోమేన | సహ | సహ | సహ | సహ | సోమేన | సోమేన | సోమేన | సోమేన | సహ |
| 4 | 5 | 5 | 5 | 5 | 4 | 4 | 4 | 4 | 5 |
| సహ | రాజ్ఞా | రాజ్ఞా | రాజ్ఞా | రాజ్ఞా | సహ | సహ | సహ | సహ | రాజ్ఞా |
| 5 | 6 | 6 | 6 | 6 | 5 | 5 | 5 | 5 | 6 |
| రాజ్ఞేతి | రాజ్ఞా | | | | | | | | |
| 6 | 6 | | | | | | | | |

**జటాపాఠం :**

అనులోమ విలోమ క్రమంలో మంత్రాన్ని మూడుసార్లు చదవడాన్నే జటాపాఠం అంటారు[1].

1 అనులోమవిలోమాభ్యాం త్రివారం హి పఠేత్తమమ్
విలోమే పదవత్సంధిః అనులోమే యథాక్రమమ్
క్రమే యథోక్తే పదజాతమేవ ద్విరభ్యసేదుత్తరమేవ పూర్వమ్
అభ్యస్య పూర్వం చ తథోత్తరే పదేఽవసానమేవం హి జటాభిధీయతే
ఋసం 794

అనులోమం 1-2+ విలోమం 2+1 అనులోమం 1+2 (క్రమం 1-2+ వ్యుత్క్రమం 2-1+ సంక్రమం 1-2)

ఓషధయస్ సం సమోషధయ ఓషధయస్ సమ్ ।
1 2 2 1 1 2

సం వదన్తే వదన్తే సం సం వదన్తే ॥
2 3 3 2 2 3

వదన్తే సోమేన సోమేన వదన్తే వదన్తే సోమేన
3 4 4 3 3 4

సోమేన సహ సహ సోమేన సోమేన సహ
4 5 5 4 4 5

సహ రాజ్ఞా రాజ్ఞా సహ సహ రాజ్ఞా రాజ్ఞేతి రాజ్ఞా
5 6 6 5 5 6 6 6

యస్మై కృణోతి కృణోతి యస్మై యస్మై కృణోతి
7 8 8 7 7 [illegible]

కృణోతి బ్రాహ్మణో బ్రాహ్మణః కృణోతి కృణోతి బ్రాహ్మణః
[illegible] 9 [illegible] 8 8 9

బ్రాహ్మణస్తం తం బ్రాహ్మణో బ్రాహ్మణస్తం
9 10 10 9 9 10

తం రాజన్ రాజంస్తం తం రాజన్ ।
10 11 11 10 10 11

రాజన్పారాయామసి పారయామసి రాజన్ రాజన్పారయామసి
11 12 12 11 11 12

పారయామసీతి పారయామసి ।
12 12

**మాలాపాఠం :**

**ఈ** మాలాపాఠాలు 1. క్రమమాల 2. పుష్పమాల అని రెండు రకాలు. ఇందులో సగంబుక్కను మొదటినుంచి చివఱకు క్రమవిపర్యాసం చేస్తూ చెప్పడమే క్రమమాలాపాఠం[1].

**క్రమమాలాపాఠం :**

ఓషధయః సం1 2. రాజ్ఞేతి రాజ్ఞా
సంవదన్తే 3 4 రాజ్ఞా సహ
వదన్తే సోమేన 5 6 సహ సోమేన
సోమేన సహ 7 [illegible] సోమేన వదన్తే
సహ రాజ్ఞా 9 10 వదనే సం
రాజ్ఞేతి రాజ్ఞా 11 12 సమోషధయః
యస్మై కృణోతి 13 14 పారయామసీతి పారయామసి
కృణోతి బ్రాహ్మణః 15 16 పారయామసి రాజన్
బ్రాహ్మణస్తం 17 18 రాజం స్తం
తం రాజన్ 19 20 తం బ్రాహ్మణః
రాజన్ పారయామసి 21 22 బ్రాహ్మణః కృణోతి
పారయామసీతి పారయామసి 23 24 కృణోతి యస్మై

**పుష్పమాలాపాఠం :**

క్రమ వ్యుత్క్రమ సంక్రమాలు మూడు ఆవృత్తిని పొందడమే పుష్పమాలాపాఠం. ఇందులో పూలమాలలోలాగా పదాలు కూర్చ

---

1. బ్రూయాత్క్రమవిపర్యాసావర్ధర్చస్యాదితో **ఽన్తతః** ।
అన్తం చాదిం నయేదేవం క్రమమాలేతి గీయతే । ఋ.సం.795

బడతాయి[1] ఇది జటాపాఠం లాంటిదే కాని ప్రతి పదానికి విరామం, **ఇతి** అనే పదాన్ని చేర్చడమే ఇందులో విశేషం. కొందఱు పదసంధుల్లో కూడా ఇతి అనే పదాన్ని చెబుతుంటారు.

| క్రమం (విరామం) | వ్యుత్క్రమం (విరామం) | సంక్రమం | |
|---|---|---|---|
| 1 ఓషధయః సం | సమోషధయః | ఓషధయః సం | ఇతి (విరామం) |
| 2 సం వదన్తే | వదన్తే సం | సం వదన్తే | ఇతి (విరామం) |
| 3 వదన్తే సోమేన | సోమేన వదన్తే | వదన్తే సోమేన | ఇతి (విరామం) |
| 4 సోమేన సహ | సహ సోమేన | సోమేన సహ | ఇతి (విరామం) |
| 5. సహ రాజ్ఞా | రాజ్ఞా సహ | సహ రాజ్ఞా | ఇతి (విరామం) |
| 6. రాజ్ఞేతి రాజ్ఞా | | | |

**శిఖాపాఠం :**

జటాపాఠానికి చివఱ, పైపదాన్ని చేరుస్తూ ఉండటమే శిఖాపాఠం[2].

ఓషధయః సం, సమోషధయ, ఓషధయః సం - వదన్తే ।
సం వదన్తే, వదన్తే సం, సం వదన్తే - సోమేన ।
వదన్తే సోమేన, సోమేన వదన్తే, వదన్తే సోమేన - సహ ।
సోమేన సహ, సహ సోమేన, సోమేన సహ - రాజ్ఞా ।
సహ రాజ్ఞా, రాజ్ఞా సహ, సహ రాజ్ఞా ।
రాజ్ఞేతి రాజ్ఞా ।

1. మాలా మాలేవ పుష్పాణాం పదానాం గ్రన్థినీ హి సా ।
అవర్తన్తే త్రయస్తస్యాం క్రమవ్యుత్క్రమ సంక్రమాః ॥ ఋ. సం 796.
2. పదోత్తరాం జటామేవ శిఖామార్యాః ప్రచక్షతే । అందులోనే 797.

**రేఖాపాఠం :**

రెండుపదాలను, మూడుపదాలను, నాలుగుపదాలను, అయిదుపదాలను విడివిడిగా క్రమంగాను, తల్లక్రిందుగాను చెప్పడమే రేఖాపాఠం.

2. పదాలు— ఓషధయః సం । సమోషధయః । ఓషధయః సం ।

3. పదాలు— సం వదన్తే సోమేన । సోమేన వదన్తే సం సం వదన్తే ।

4. పదాలు— వదన్తే సోమేన సహ రాజ్ఞా । రాజ్ఞా సహ సోమేన వదన్తే ।
వదన్తే సోమేన। సోమేన సహ। సహ రాజ్ఞా। రాజ్ఞేతి రాజ్ఞా॥

**ధ్వజపాఠం :**

ఒక ఋక్కులో ఆదిపదాన్ని ఉచ్చరించి తరువాత ఋక్కులోని చివఱపదాన్ని చెప్పడంగాని, లేక వర్గంలోని మొదటి చివఱపదాలను క్రమంగా చెప్పుతూ పోవడంగాని ధ్వజపాఠం అవుతుంది[1]

| ఆదిక్రమం | చివఱిపదంతో చెప్పడం |
|---|---|
| 1 ఓషధయః సం | 2 పారయామసీతి పారయామసి |
| 3 సం వదన్తే | 4 రాజన్ పారయామసి |
| 5 వదన్తే సోమేన | 6 తం రాజన్ |
| 7 సోమేన సహ | 8 బ్రాహ్మణస్తం |
| 9 సహ రాజ్ఞా | 10 కృణోతి బ్రాహ్మణః |
| 11 రాజ్ఞేతి రాజ్ఞా | 12 యస్మై కృణోతి |
| 13 యస్మై కృణోతి | 14 రాజ్ఞేతి రాజ్ఞా |
| 15. కృణోతి బ్రాహ్మణః | 16 సహ రాజ్ఞా |
| 17 బ్రాహ్మణ స్తం | 18 సోమేన సహ |
| 19 తం రాజన్ | 20. వదన్తే సోమేన |
| 21. రాజన్ పారయామసి | 22 సం వదన్తే |
| 23 పారయామసీతి పారయామసి | 24 ఓషధయః సం |

1. బ్రూయాదాదేః క్రమం సమ్యగన్తాదుత్తారయేద్యది ।
వర్గే చ ఋచి వా యత్ర పఠనం స ధ్వజః స్మృతః ॥
ఋ సం 799

## దండపాఠం :

ఋక్కులో సగాన్ని తీసుకొని ముందు క్రమంగాను, తరువాత తల్లకిందుగాను మళ్ళా క్రమంగాను చెప్పి తరువాతిపదాన్ని జోడిస్తూ చెప్పుకుపోవడం దండపాఠమవుతుంది[1].

2 ఓషధయః సం । సమోషధయః ॥

3. ఓషధయః సం। సం వదన్తే। వదన్తే సమోషధయః।

4. ఓషధయః సం। సం వదన్తే। వదన్తే సోమేన। సోమేన వదన్తే సమోషధయః

5 ఓషధయః సం। సం వదన్తే। వదన్తే సోమేన। సోమేన సహ। సహసోమేన। వదన్తే సమోషధయః।

6 ఓషధయః సం। సం వదన్తే। వదన్తే సోమేన। సోమేన సహ। సహ రాజ్ఞా రాజ్ఞా సహ సోమేన వదన్తే సమోషదయః।

ఓషధయః సం। సం వదన్తే। వదన్తె సోమేన। సోమేన సహ।

సహ రాజ్ఞా। రాజ్ఞేతి రాజ్ఞా।

## రథపాఠం :

పాదక్రమాన్ననుసరించి ఋక్కులోని ఉత్తరార్థాన్ని కలిపి దండపాఠంలాగా చెప్పితే అది రథపాఠమవుతుంది[2]. ఈపాఠం ద్విచక్రరథపాఠం, త్రిచక్రరథపాఠం, చతుశ్చక్రరథపాఠమనే భేదంతో మూడురకాలు. త్రిచక్రరథపాఠం ప్రతిపాదంలోను సమాన పదసంఖ్య ఉండే గాయత్రీచ్ఛందస్సులో ఉన్న మంత్రానికే కుదురుతుంది. చతుశ్చక్రరథపాఠం పాదాన్ని బట్టి ఏర్పడుతుంది.

---

1 క్రమముక్త్వా విపర్యస్య పునశ్చ క్రమముత్తరమ్ ।
అర్ధర్చాదేవముక్తోఽయం క్రమదండోఽభిధీయతే ॥ ఋ సం. 800

2. పాదశోఽర్ధర్చశో వాపి సహోక్త్వా దండవద్రథః. అందులోనే 801

## ద్వచక్రరథపాఠం :

| | పూర్వార్థం | ఉత్తరార్థం | |
|---|---|---|---|
| I. | 1. ఓషధయః సం । | యస్మై కృణోతి । | (ఒకేపాద క్రమం) |
| | సమోషధయః । | కృణోతి యస్మై । | (తలక్రిందు) |
| II. | 1 ఓషధయః సం । | యస్మై కృణోతి । | (రెండుపాదాలుండే క్రమం) |
| | 2 సం వదన్తే । | కృణోతి బ్రాహ్మణః । | |
| | వదన్తే సమోషధయః | బ్రాహ్మణః కృణోతి యస్మై | (తలక్రిందు) |
| III | 1 ఓషధయః సం । | యస్మై కృణోతి | (మూడుపాదాలుండే క్రమం) |
| | 2 సం వదన్తే । | కృణోతి బ్రాహ్మణః | |
| | 3 వదన్తే సోమేన । | బ్రాహ్మణస్తం | |
| | సోమేన వదన్తే సమోషధయః | తం బ్రాహ్మణః కృణోతి యస్మై | (తలక్రిందు) |
| IV | 1 ఓషధయః సం । | యస్మై కృణోతి | (నాలుగుపాదాలుండే క్రమం) |
| | 2 సం వదన్తే । | కృణోతి బ్రాహ్మణః | " |
| | 3. వదన్తే సోమేన । | బ్రాహ్మణస్తం | " |
| | 4 సోమేన సహ । | తం రాజన్ | " |
| | సహ సోమేన వదన్తే సమోషధయః | రాజంస్తం బ్రాహ్మణః కృణోతి యస్మై । | (తలక్రిందు) |
| V | 1 ఓషధయః సం । | యస్మై కృణోతి | (అయిదుపాదాలుండే క్రమం) |
| | 2 సం వదన్తే । | కృణోతి బ్రాహ్మణః | " |
| | 3 వదన్తే సోమేన । | బ్రాహ్మణస్తం | " |
| | 4. సోమేన సహ । | తం రాజన్ | " |
| | 5 సహ రాజ్ఞా । | రాజన్ పారయామసి | " |
| | రాజ్ఞేతి రాజ్ఞా పారయామసీతి | పారయామసి । | (సమాప్తి) |

**ఘనపాఠం :**

మంత్రం చివరనుంచి క్రమంగా మొదటిదాకా చెప్పి, మొదటినుంచి మళ్లీ చివఱదాకా చెప్పడాన్నే ఘనపాఠమంటారు[1] ఈ ఘనపాఠం 1 ఘనమని 2. ఘనవల్లభమనీ మొదట రెండురకాలు మళ్లా అవి ఒక్కొక్కటి రెండురకాలు. మొత్తం ఘనపాఠాలు నాలుగు విధాలు.

I పూర్వార్ధం

1. రాజ్ఞేతి రాజ్ఞా। సహ రాజ్ఞా। సోమేన సహ। వదన్తే సోమేన। సం వదన్తే। ఓషధయః సం। (చివఱినుంచి మొదటికి)
సం వదన్తే। వదన్తే సోమేన। సోమేన సహ। సహ రాజ్ఞా। రాజ్ఞేతి రాజ్ఞా।
(మొదటినుంచి చివఱకు)

II. ఉత్తరార్ధం

2 పారయామసీతి పారయామసి। రాజన్ పారయామసి। తం రాజన్। బ్రాహ్మణస్తం। కృణోతి బ్రాహ్మణః। యస్మై కృణోతి।
(చివఱినుంచి మొదటికి)

కృణోతి బ్రాహ్మణః। బ్రాహ్మణస్తం। తం రాజన్। రాజన్ పారయామసి। పారయామసీతి పారయామసి। (మొదటినుంచి చివఱకు)

వేదానికి సంబంధించిన పై పాఠాలను అధ్యయనం చేసిన వారిని ఆయా పేర్లతో పిలుస్తారు. ఉదా:- క్రమపాఠం చదివిన వారిని 'క్రమపాఠి' అంటారు. ఘనపాఠం చదివినవారిని 'ఘనపాఠి' అంటారు.

---

1. అన్తాత్క్రమం పఠేత్పూర్వమాదిపర్యన్తమానయేత్ ।
ఆదిక్రమం నయేదన్తం ఘనమాహుర్మనీషిణః ॥ ఋ.సం. 805

ఇలా సంహితాపాఠం, పదపాఠం, క్రమపాఠం అని మూడు ప్రకృతిపాఠాలుండగా, వాటిల్లో క్రమపాఠంపైన పెరిగిన వికృతిపాఠాలు ఎనిమిది. ఇవన్నీ అన్ని వేదాలకు సంబంధించినవి. మరి, దేనికి ఈపాఠాలు ఏర్పడ్డాయి? ఏమిట వీటి ప్రయోజనం?

**ప్రయోజనం:**

కాత్యాయనుడు తన ప్రాతశాఖ్యలో మంత్రాన్ని యథాతథంగా స్మరించడంకోసమే క్రమపాఠమని ఇలా చెప్పాడు '**క్రమః స్మృతి ప్రయోజనః**' (కా ప్రా. 4.18)

ద్రష్టలైన మహర్షులు ఋక్కులను దర్శనంచేసిన చాలాకాలానికి దానికి సంహితాపాఠం ఏర్పడింది. ఈ పాఠంలో సంధినియమాలతో ఋక్కులలోని పదాలన్నీ సంధింపబడి ఉంటాయి కాలక్రమేణ తరాలుగడిచే కొద్దీ ఈ సంహితాపాఠంలో ఏదైనా మార్పు రావచ్చు. పదాల్లో ఏదైనా మార్పు సంభవం. అసలు సంహితాపాఠమే నశించిపోవచ్చు. కనుక దీన్నెలాగైనా కాపాడుకోవాలి. ఏమిటి ఉపాయం? అందుకే ఏర్పడింది పదపాఠం సంధినియమాలతో సంధింపబడిన సంహితాపాఠంలోని పదాలను విభజించి చూపెడుతుంది ఈపాఠం సంహితాపాఠం ఏర్పడటానికి ముందుండే వేదస్వరూపాన్ని మనం ఈ పదపాఠంలో చూడచ్చు.

ఈ పదపాఠం సంహితాపాఠం ఏర్పడిన కొద్దికాలానికి ఏర్పడింది. దీనివల్ల ఋగ్వేదంలో ఏది మూలాంశం? ఏది ప్రక్షిప్తభాగం? అనే విషయం మనకు తెలుస్తుంది

సంహితాపాఠసంరక్షణంకోసం ఏర్పడిన ఇంకొక ఉపాయమే క్రమపాఠం. ఇదికూడ పదపాఠంలాగ ప్రాచీనమైనదే. ఈ క్రమపాఠంలో

పదపాఠంలో ఉన్న ఒక్కొక్క పదం ముందువెనకపదాలతో కలిపి రెండుసార్లు ఉచ్చరింపబడుతుంది.

ఇలాగే జటాదివికృతి పాఠాలుకూడా సంహితాసంరక్షణకోసం ఏర్పడినవే. ఇంకా సంహితాసంరక్షణకోసం తీసుకొన్న జాగ్రత్తల్లో ప్రాతిశాఖ్యనిర్మాణం చెప్పదగింది. ఈ ప్రాతిశాఖ్యలు పదపాఠంలో విశ్లేషణాన్ని - పొందిన పదాలు మళ్లా కలిసినప్పుడేర్పడే వర్ణ వికారాదులను వివరిస్తున్నాయి.

ఇలా సంహితాస్వరూపపరిరక్షణోద్దేశ్యంతో ఏర్పడిందే పరిశిష్ట రూపంలో ఏర్పడిన అనుక్రమణి. సంహితాపాఠంలోని విషయాలను క్రమంగా వివరిస్తూ అందులోని సూక్తాలను, మంత్రాలను, పదాలను, అక్షరాలనుకూడ ఇది లెక్కవేసి చెబుతుంది ఇందువల్ల సంహితలో ఏమార్పువచ్చినా వెంటనే తెలిసిపోతుంది

ఇలా చరిత్రకందని కాలంలో ఏర్పడ్డ ఋగాదిసంహితలు అనేక పాఠవిశేషాలతో సంరక్షింపబడి ప్రపంచంలో ఏ సాహిత్యానికి దొరకని రక్షణను పొంది, చెక్కుచెదఱకుండా ఈనాటికీ మనకు లభిస్తున్నాయి.

**- ఎస్.బి.ఆర్.**

## 1.5 మంత్రద్రష్టలగు మహర్షులు

శబ్దాత్మకమైన పరబ్రహ్మస్వరూపం నిత్యమైంది. దీనికి ఆదికాని అంతంకాని లేదు. పరమాత్మ ఉచ్ఛ్వాసనిశ్వాసరూపాలే వేదాలని పెద్దలు చెబుతారు. మన ఇంద్రియాలకు గోచరించే సత్యాలు అత్యల్పమైనవి. తపస్సంపన్నులైన మహర్షులు ఇంద్రియాలకు గోచరింపని వస్తువులను కూడ సమాధిదశను పొంది తెలుసుకోగలిగారు. అలా వారు ఋజుప్రవృత్తికలవారై నిర్మలాంతఃకరణాలతో కనుగొన్న జ్ఞానఖండికలే ఈ వేదమంత్రాలు. వారు మంత్రాలను రచించలేదు. అనంతవిశ్వంలో భగవంతుని ఊపిరిగా సంచరిస్తున్న శబ్దతరంగాలను తమశక్తితో పసికట్టి, వాటిని తరతరాలుగా లోకకల్యాణం కలగడంకోసం మనకందించారు[1]. అందుకే వారు సామాన్యులుగాని, కేవలం ఋషులుగాని కారు. అసామాన్యులు, మంత్రదర్శనం చేయజాలిన మహామహిమగల మహర్షులు[2]. భగవంతుని ప్రేరణవల్లనే ఈ వేదవాక్కులు వారి హృదయాల్లో ప్రవేశించినాయని ఋగ్వేదం చెబుతోంది[3].

---

1 యుగాన్తేఽన్తర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః ।
లేభిరే తపసా పూర్వమనుజ్ఞాతాః స్వయంభువా॥ వే భా భూ 8

2 'మంత్రకృత్' అనే శబ్దానికి మంత్రద్రష్ట అనే అర్థం తైత్తిరీయారణ్యక భాష్యంలో సాయణుడీ శబ్దాన్నిలా నిర్వచించాడు యద్యప్యపౌరుషేయే వేదే కర్తారో న సన్తి, తథాపి కల్పాదావీశ్వరానుగ్రహేణ మంత్రాణాం లబ్ధారో మంత్రకృత ఇత్యుచ్యన్తే". వై. వా ఇ. 131.

3. యజ్ఞేన వాచః పదవీయమాయన్ తామన్వవిన్దన్నృషిషు ప్రవిష్టామ్। 10-71-3 ఇక్కడ సాయణుడు-(ఋషిషు అతీన్ద్రియార్థదర్శిషు ప్రవిష్టాం తాం వాచం అవిన్దన్ అలభన్త) సామాన్యులమైన మన ఇంద్రియాలకు గోచరింపని విషయాలను కూడ దర్శించగల మహర్షులలో ప్రవేశించిన వేదవాణిని అని భాష్యం చేస్తున్నాడు

ప్రపంచంలోని మానవపుస్తకభాండాగారంలో మొట్టమొదట ఆవిర్భవించిన గ్రంథరత్నం ఋగ్వేదం. ఈ ఋక్సంహితలోని మంత్రాలను దర్శించిన మహానుభావులు ఎందఱో ఉన్నారు. 'కాదు; వారు ఆ మంత్రాలను రచించారని' కొందఱు ఆధునికులు అభిప్రాయపడుతున్నారు వేదాలు పౌరుషేయాలని **(మానవులచే వ్రాయబడ్డాయని)** వారి వాదం. వేదాలు అపౌరుషేయాలు **(మానవులచే రచింపబడనివి)** అనే సాంప్రదాయికుల అభిప్రాయానికి ఇది విరుద్ధమైంది. ఇక్కడ ఒక విశేషాన్ని మనం గమనించాలి. సాంప్రదాయికులలోనే కొందఱు వేదాలు పౌరుషేయాలని అంగీకరించి, ■ పురుషుడు సామాన్యమానవుడు కాదు పరమపురుషుడైన భగవంతుడే అని సిద్ధాంతీకరించారు.

వేదాలు మనకందించే జ్ఞానం దివ్యమైంది. భూత భవిష్యత్ వర్తమాన కాలాలలో మొక్కబోని ప్రామాణ్యం కలది. కాబట్టి కావ్యాదులను రచించే సామాన్యకవులకు, వారికీ భేదాన్ని అంగీకరిస్తూ వారిని ద్రష్టలుగా స్వీకరించి వారికొక విశిష్టస్థానాన్నివ్వడమే ఋష్యాటికీ సముచితం. భాషాతత్త్వజ్ఞులు, ప్రామాణికులైన పాణిన్యాది మహర్షులుకూడా వారిని ద్రష్టలుగానే పేర్కొనడం గమనించదగిన విషయం మొత్తం ఈ ఋక్సంహితను సుమారు 403 మంది మహర్షులు దర్శించారు. వారికి సంబంధించిన విశేషాలు మనకు సంహితలలో ఎక్కువగా తెలియవు. ఇతిహాసపురాణాలలో వారి ప్రసిద్ధిని దృష్టిలో పెట్టుకొని, ఎక్కువమంత్రాలను దర్శించిన మహర్షుల క్రమంలో ముఖ్యులైన కొంతమందిని గూర్చి మాత్రం కొద్ది వివరణ ఈక్రింద ఇవ్వబడుతోంది.

### 1. వసిష్ఠుడు:

ఋక్సంహితలో గల సూక్తాలలో ఎక్కువ సూక్తాలను దర్శించిన మహర్షి వసిష్ఠుడు. 104 సూక్తాలను ఈ మహనీయుడు దర్శించినట్లు

మనకు సంహితద్వారా తెలుస్తున్నది. వసిష్ఠుడనే పేరుతో ఇతడు మూడు జన్మలనెత్తాడు. అందులో బ్రహ్మమనస్సునుండి మొదటిసారి జన్మించాడు. ఈ మొదటి జన్మలోనే ఇతడు అనేక వేదమంత్రాలను దర్శించాడు ఇతని భార్య అరుంధతి. పృథివి, జలం మొ॥ పంచ మహాభూతాలు వసువులు. అవి కలవాడు కాబట్టి ఇతడు వసిష్ఠుడైనాడు అణిమాది (శరీరాన్ని పరమాణువయ్యేట్లు తగ్గించడం) సిద్ధులచేత వసువులను వశపరచుకోవడంవల్ల ఇతడికీపేరు కలిగింది. దక్షయజ్ఞంలో దేవతలతోపాటు ఇతడుకూడ మరణించాడు. అప్పుడు అరుంధతి కూడ ఇతణ్ణి అనుసరించింది. వీరిరువురు నక్షత్రాలైనారు. వీరికి 1.చిత్రకేతువు 2 పురోచిషుడు 3 విరచుడు 4. మిత్రుడు 5. ఉల్బణుడు 6. వసుభృద్యానుడు 7. ద్యుమంతుడు అని ఏడుగురు కొడుకులు పుట్టారు. వీరందఱు బ్రహ్మర్షులే (శ్రీ. భా. IV. I.40.)

బ్రహ్మదేవుని హోమాగ్నినుంచి ఇతడు రెండవసారి పుట్టాడు. ఈ జన్మలో అరుంధతి అక్షమాల అనే పేరుతో ఇతనికి భార్య అయింది నిమిచక్రవర్తి శాపంచేత ఈ జన్మ అంతరించింది. మిత్రావరుణుల కుమారుడుగ, అగస్త్యుని సోదరుడుగ ఇతడు మూడవ జన్మనెత్తాడు. ఈ జన్మలో నారదుని చెల్లెలైన అరుంధతి ఇతని భార్య. పురాణాలలో వసిష్ఠునకు సంబంధించిన అనేక కథాభాగాలు రెండు, మూడు జన్మలకు సంబంధించినవి. వేదదర్శనం మొదటి జన్మకు సంబంధించింది.

**2. భరద్వాజుడు :**

మహాతపస్వియైన భరద్వాజుడు ఈసంహితలో **59** సూక్తాలను దర్శించాడు. భరద్వాజుడనే పేరుతో మన ఇతిహాసపురాణాలలో ఏడుగురు వ్యక్తులు కనబడుతున్నారు. అందులో చివఱివాడు తప్ప

మిగత అందఱు ఋషులే. ధర్మసూత్రకర్తయైన పండితుడు చివఱి భరద్వాజుడు. వీరిలో మంత్రద్రష్టయైన భరద్వాజుడు అత్రిమహర్షి పుత్రుడు. ఇతడు చాలా వేలసంవత్సరాలు జీవించాడు. ఇతని జీవితంలో చాలాకాలం వేదాధ్యయనానికే అంకితమైంది. వేదాధ్యయనం చేయడానికి ఎన్నోసార్లు ఇతడు ఇంద్రుని వరంవల్ల తన జీవితాన్ని పొడిగించుకొన్నాడు. సంపూర్ణంగా వేదాధ్యయనం చేయడానికి ఈ జీవితకాలం చాలదని ఇతడు ఇంద్రుని ప్రార్థించినప్పుడు, ఇంద్రుడు మూడు పర్వతాలను చూపించి, **'అనంతమైన ఆ వేదరాశిలో నీవు చదివినభాగం ఇంతమాత్రమే'**నని మూడు గుప్పిళ్ల ఇసుకను చూపించాడు. కాని భరద్వాజుడు నిరుత్సాహపడక తన అధ్యయనాన్ని దీక్షతో కొనసాగించాడు. వాల్మీకిశిష్యుడు, వనవాసప్రారంభంలో శ్రీ రామునకాతిథ్యమిచ్చినవాడు ఇతడేనని కొందఱంటారు. కొడుకులను, శిష్యులను, దేవతలను, ద్విజులను, భార్యను ప్రేమతో భరిస్తానని ఇతడు చేసిన ప్రతిజ్ఞవల్లనే భరద్వాజుడనే ప్రసిద్ధినీతడు పొందినట్లు భాగవతం పేర్కొంటున్నది[1]

**3. విశ్వామిత్రుడు** :

ఋక్సంహితలో 46 సూక్తాలను ఇంకా కొన్ని మంత్రాలను దర్శించిన మహనీయుడీతడు. కుశుని మనుమడైన గాధి కుమారుడు విశ్వామిత్రుడు. ఋచీకుని భార్య సత్యవతి ఇతని సోదరి. ఇతడు కాన్యకుబ్జ (కనూజ్) దేశాధిపతి. ఒకప్పుడు వసిష్ఠునితో పంతగించి తపస్సుచేసి మొదట రాజర్షియై తరువాత బ్రహ్మర్షియైనాడు. (రామా.బాల 51). కౌశికీనదీతీరంలో ఇతడు బ్రహ్మర్షిత్వాన్ని పొందినట్లు భారతం పేర్కొంటున్నది. (భార.వన.87-13) ఇతనికి నూరుమంది

---

1. భరే సుతాన్ భరే శిష్యాన్ భరే దేవాన్ భరే ద్విజాన్
భరే చ భార్యామవ్యాజాద్భరద్వాజోఽస్మి శోభనే॥ P E. 117

కొడుకులున్నట్లు తెలుస్తున్నది. అందులో గాలవుడు, మధుచ్ఛందుడు మొ॥ వారు ముఖ్యులు. విశ్వామిత్రునికి వసిష్ఠునితో దీర్ఘకాలవైరమున్నట్లు కనబడుతున్నది. ఇతని ప్రేరణవల్లే కల్మాషపాదుడు వసిష్ఠుని కొడుకులందఱిని చంపాడు (భార. ఆది 175-41). వసిష్ఠవిశ్వామిత్రుల విరోధవృత్తాంతం మనకు ఋగ్వేదంలో కనబడుతోంది. విశ్వామిత్రుడొక సారి కాన్యకుబ్జదేశంలో ఇంద్రునితో కలసి సోమపానం చేయగా, అప్పటినుంచి అతడు క్షత్రియుడుకాదని బ్రాహ్మణుడేనని ప్రసిద్ధి ఏర్పడింది (భార.వన.87-17). అజీగర్తుని కుమారుడైన శునశ్శేఫుని (దేవరాతుని), యాగంలో ఆహుతికాకుండా ఇతడు కాపాడాడు.

**4. వామదేవుడు** :

ఋక్సంహితలో 46 సూక్తాలను దర్శించిన మహర్షి వామదేవుడు. ఈయన ఈ సంహితలో దాదాపు 4వ మండలం అంతా దర్శించాడు. ఇదేపేరుతో ఒకరాజు, ఒక మనువుకొడుకు మన ఇతిహాసాలలో కనబడుతున్నారు. ఈ వామదేవుడు గోతముని కుమారుడు. వాల్మీకిరామాయణంలో (బాల.7 3) ఇతడు వసిష్ఠుని స్నేహితుడుగ, దశరథుని పురోహితుడుగ చెప్పబడ్డాడు తల్లిగర్భంలో ఉన్నప్పుడే అశ్వినీదేవతల స్తుతించిన వాడీమహానుభావుడు (ఋ.సం.119). ఇంద్రసభలో ఈ మహర్షి ప్రముఖసభ్యుడు. (భార.సభా.7-17). వసుమనసుడనే మహారాజుకు ఇతడెన్నో ధర్మాలనుపదేశించాడు.

ఇతడు అథర్వాంగిరసుల కుమారుడని గొప్పతపస్సుచేసి పరశురాముని సందర్శించాడని బృహదారణ్యకం చెబుతున్నది. అసిజ, బృహదుక్థులకు తండ్రి ఇతడని వాయుపురాణం (65.100.2) పేర్కొంటున్నది.

**5. గృత్సమదుడు** :

ఋక్సంహితలో **39** సూక్తాలను ఇంకా కొన్ని మంత్రాలను దర్శించిన మహాభాగుడితడు మహాతపస్వి అయిన ఇతడు వీతహవ్యమహర్షి కుమారుడు. బృహస్పతితో సమానమైన పాండిత్యం ఈయనది. ఇంద్రునికితనితో ఎంతో స్నేహం. చాలామంది ఇతణ్ణి చూసి ఇంద్రుడని భ్రమపడేవారు. రాక్షసులొకసారి ఇతణ్ణి చూసి ఇంద్రుడనుకొని తాళ్ళతో కట్టేశారు దాన్నిబట్టి ఇంద్రుని పోలికలితనిలో ఎంతగా ఉన్నాయో మనం తెలుసుకోవచ్చు. ఇతని కొడుకు కుచేతసుడు. మనువు కుమారుడైన వరిష్ఠుడు గృత్సమదుని స్నేహితుడు. ఇంద్రుడొకసారి వెయ్యి సంవత్సరాలొక యజ్ఞాన్ని చేశాడు. ఆ యజ్ఞంలో సామగానం చేయడంలో గృత్సమదుడు పొరపాటు పడ్డాడు దానికి **"పదివేల సంవత్సరాలు జంతువై అరణ్యాలలో తిరగమ"** ని వరిష్ఠుడీతణ్ణి శపించాడు (భార. అను 18).

**6. దీర్ఘతముడు** :

ఈ సంహితలో **25** సూక్తాలను దర్శించిన మహర్షి దీర్ఘతముడు. బ్రహ్మకుమారుడు అంగిరసుడు అతనికి ఉచథ్యుడు, బృహస్పతి అని ఇద్దరు కొడుకులు అందులో ఉచథ్యుని కొడుకే దీర్ఘతముడు. ఇతని తల్లి మమత. తల్లికడుపులోనున్నప్పుడే ఇతనికి వేదవేదాంగ జ్ఞానమున్నది. బృహస్పతి శాపంవల్ల ఇతడు గుడ్డివాడుగా పుట్టాడు. అందుకనే ఇతనికి దీర్ఘతముడనే పేరు ఏర్పడింది. బుద్ధిబలంలో ఇతడు బృహస్పతితో సమానుడు. ప్రద్వేషి అనే ఆమె ఇతని భార్య. గౌతముడు వీరిద్దరి కొడుకు. ఇతని ఇంకో భార్య ఉశిజ. ఈయనవల్ల ఆమెకు పదకొండుమంది కొడుకులు కలిగారు. వాళ్ళలో కక్షీవంతుడు చాల ప్రసిద్ధుడు. ఈ కక్షీవంతుడు కూడా ఋక్సంహితలో కొన్ని సూక్తాలను దర్శనం చేశాడు. దీర్ఘతముని అనుగ్రహంవల్ల సుధేష్ణకు పుట్టినవారే అంగ, వంగ, కళింగ, పుండ్ర శుంగులనే రాజులు.

వాళ్ళు తమపేర్లతో ఐదురాజ్యాలను స్థాపించారు. అవే ఇప్పుడు భాగల్పూర్, బెంగాల్, ఆంధ్ర, రాజసాహి, తామ్రవిక రాజ్యాలుగా ప్రసిద్ధమైనాయి.

**7. అగస్త్యుడు :**

ఋక్సంహితలోని **24** సూక్తాలను ఇంకా కొన్ని మంత్రాలను దర్శించిన మహర్షి ఇతడు కుండలో పెట్టబడిన వరుణుని వీర్యంనుంచి ఇతడు పుట్టడం చేతనే ఇతణ్ణి కుంభసంభవుడంటారు ఇతని భార్య లోపాముద్ర. కుమారుడు దృఢదస్యుడు. వాతాపి అనే రాక్షసుణ్ణి ఇతడు జీర్ణం చేసుకొన్నాడు. వింధ్యపర్వతం పైపైకి పెరిగిపోతున్నప్పుడు సూర్యచంద్రులు ఇతణ్ణి ప్రార్థించగా దాని ఎత్తు తగ్గించినవాడీతడు కనుకనే ఇతడీకి అగస్త్యుడనే పేరు సార్థకమైంది. ఆ సమయంలోనే ఉత్తరభారతదేశాన్ని వదలి ఈయన దక్షిణభారతదేశానికివచ్చి స్థిరపడిపోయాడు ఇతడు నహుషుని ఊసరవెల్లి కమ్మని శపించాడు (భార ఉద్యో 17) శ్రీమహావిష్ణువు ఆదేశాన్ని పురస్కరించుకొని కాలకేయులసంహారం కోసం ఈయన సముద్రాన్ని ఆపోశనబట్టి త్రాగేశాడు శ్రీరామచంద్రునికి ఆదిత్య హృదయాన్ని ఈ మహానుభావుడే ఉపదేశించాడు. (రామా యుద్ధ.107) ఇతనికి సుతీక్ష్ణుడనేవాడు తమ్ముడు, శిష్యుడు కూడ (అగ్ని. పు 7). ఇతడు శ్రీరామునికొక బాణాన్నిచ్చినట్లు ఉత్తరరామాయణం పేర్కొంటున్నది.

**8. గోతముడు :**

ఈ సంహితలో 21 సూత్రాలను ఇంకా అక్కడక్కడ కొన్ని మంత్రాలను కూడా దర్శించిన మహానుభావుడీమహర్షి. ఇతడు రాహూగణుని కొడుకు. ఒకప్పుడీమహర్షి దాహంవేసి మంచినీళ్ళివ్వమని

మరుత్తులను అడిగాడు. వాళ్లు ఇతని కోరికను మన్నించి పక్కనే పెద్దబావిని తవ్వించి ఇతని దాహాన్ని తీర్చారు. అపుడితనికోసం ఆ బావిని తవ్వినవాళ్లు అశ్వినీదేవతలు (ఋ.సం.1-116).

పైన పేర్కొనబడ్డ వారే కాక ఈ క్రింది మహర్షులు కూడా ఋక్సంహితను దర్శించారు.

దేవలుడు, అసితుడు, శ్యావాశ్వుడు, మేధాతిథి, అత్రిభౌముడు, అగ్ని సౌచీకుడు, (కశ్యపుడు) (మారీచుడు), కుత్సుడు (ఆంగిరసుడు), కృష్ణుడు (ఆంగిరసుడు), గౌరీవీతి, జమదగ్ని, త్రితుడు, నారదుడు, నృమేధుడు, కక్షీవంతుడు, అయాస్యుడు (ఆంగిరసుడు), అర్చనానా, అవత్సారుడు, ఇరింబిఠి, ఉచథ్యుడు, ఉశనసులు, ఋజిశ్వ, ఋషభుడు, కణ్వుడు (ఘౌరుడు), కవషుడు (ఐలూషుడు), కవి (భార్గవుడు), కురుసుతి, కుసీది, గాధి (కౌశికుడు), త్రసదస్యుడు, త్రితుడు (ఆప్త్యుడు), దేవరాతుడు, నాభాకుడు, నారదుడు, నోధాగౌతముడు, పరాశరుడు పరుచ్ఛేపుడు, ప్రగాధుడు, ప్రజాపతి (వాచ్యుడు), ప్రజాపతి (వైశ్వామిత్రుడు), ప్రభువు, వసువు, ఆంగిరసుడు, ప్రస్కణ్వుడు, ప్రియమేధుడు, బంధువు (గౌపాయనుడు లేక లౌపాయనుడు), బృహదుక్థుడు, మధుచ్ఛందుడు, మనువు (వైవస్వతుడు), మేధ్యాతిథి, మేధ్యుడు, వత్సప్రి (భాలందనుడు) , వసుకృత్తు, (వాసుక్రుడు) వసువు (భారద్వాజుడు), శంయువు, శునఃశేపుడు (ఆజీగర్తి), శ్రుతబంధువు, (గౌపాయనుడు, లేక లౌపాయనుడు), సవ్యుడు. సుతంభరుడు (ఆత్రేయుడు), సౌభరి (కాణ్వుడు), సోమాహుతి (భార్గవుడు), హిరణ్యస్తూపుడు మొదలగువారు.

ఇలా ఎందరో మహర్షులు దర్శించిన మహనీయ విజ్ఞానరాశి ఋగ్వేదం. ఈ ఋషులలో ఎందరో ఒకే వంశానికి, ఒకే కుటుంబానికి కూడ సంబంధించిన వారున్నారు. వీరిలో విభిన్నప్రాంతాలవారు,

విభిన్నాభిరుచులు కలవారు లేకపోలేదు. కాని ఎన్నో తేడాలుగల వారందఱిలోను కొట్టవచ్చినట్లు కనపడేది సత్యాన్వేషణ. అదే వారందఱిని కలిపింది. దానికై వారు వారిజీవితాలను త్యాగం చేశారు. ఫలితాన్ని అనుభవించమని మన చేతుల్లో పెట్టారు. ఆ మహత్తర సంప్రదాయాన్ని మంచిదృష్టితో మనం అర్థంచేసుకోవాలి.

**- ఎస్.బి.ఆర్.**

# 1.6 దేవతలు

ఋగ్వేదం అంటేనే దేవతాస్తుతిపరాలైన మంత్రాలసమూహం అని అర్థం. కాబట్టి ఋగ్వేదంలో ప్రధానవిషయం దేవతాస్తుతి అని వేరే చెప్పనక్కరలేదు ఋగ్వేదంలో అనేకదేవతలు స్తుతింపబడ్డారు. అందులో ముఖ్యమైనవాళ్లు ముప్పైముగ్గురని విమర్శకుల అభిప్రాయం. ఈ దేవతలంతా ప్రకృతిశక్తులకు రూపకల్పన చేయడంవల్ల సిద్ధించిన వాళ్ళని పాశ్చాత్యుల అభిప్రాయం.

వీరందఱికి మానవుల్లాగా శరీరం, అవయవాలు ఉన్నాయి. ఆయా ప్రాకృతికగుణాలే ఆయా అవయవాలుగా పోల్చబడ్డాయని అనవచ్చు. ఉదాహరణకు- కిరణాలు సూర్యుని హస్తాలుగాను, జ్వాలలు అగ్నినాలుకగాను వర్ణింపబడ్డాయి. ఈ దేవతలలో కొందఱు వీర యోధులైతే, మరికొందఱు పురోహితులు. వారు వివిధ జంతువులు లాగే రథాల్లో సంచరిస్తారు. మానవుల ఆహారమే వారికి కూడ ఆహారం. సోమరసం వారికి చాల ఇష్టమైన పానీయం. పుట్టుక కల్గినవారైనప్పటికి వారు సోమరసపానంచేత అమరులైనారు. విష్ణుపదమనబడే స్వర్గం వారి నివాసం. వారు గొప్ప బలవంతులు. తమను కొల్చేవారికి కోరినదంతా ఇస్తారు. ప్రకృతిని క్రమబద్ధం చేస్తారు. పాపాలను పోగొడతారు. మనుష్యులనందఱిని తమ అధీనంలో ఉంచుకొంటారు. వారు సత్యస్వరూపులు. రుద్రుడుతప్ప మిగిలిన వారందరు శాంతస్వరూపులే. ఘాతకుడైన రుద్రుడు కూడా పాపులనే దండిస్తాడు.

ఇలాంటి దేవతలందరు కామరూపులు. సామాన్యంగా దేవతలందరు ఒకేరకమైన సామర్థ్యం కలవారైనా వారివారి ప్రత్యేకతలు కూడ లేకపోలేదు. దేవతలలో ముఖ్యులైన వారి స్వరూప, స్వభావ, ప్రభావాల్ని ఇక్కడ పరిశీలిద్దాం.

**1. ఇంద్రుడు :**

ఋగ్వేదంలో నాల్గోవంతు సూక్తాలు ఇంద్రుణ్ణే వర్ణిస్తున్నాయి. దీనిని బట్టి ఇంద్రుని ప్రాధాన్యత వెల్లడవుతుంది ఈతడు అంతరిక్షంలో ఉండే దేవుడుగాను, జలాధిపతిగాను, యుద్ధాధిదేవతగాను కీర్తింపబడ్డాడు.

ఈతని శారీరకసౌష్టవం బాగా వర్ణింపబడింది (2-16 8-85). సోమరసంతో నిండిన ఇతని పొట్ట పెద్దసరస్సుగా (3-36) చెప్పబడింది. అలాగే ఇతని గడ్డం, దవడలు, పెదవులు (2-11,10-23) కేశాలు (10-96) హరితప్రకాశం (10-96) వర్ణింపబడ్డాయి. ఇతడు మహాకాయుడు. అత్యున్నతుడు. తన శరీరంతో భూ వాయు స్వర్గాలనే అతిక్రమించాడు (3-46) భూమి పదిరెట్లైతే ఇంద్రునితో సమానమౌతుందేమో! (1-52) ఒక సూక్తంలో (8-59) వందస్వర్గాలు, వందభూములు, వెయ్యిమంది సూర్యులు, రెండు ప్రపంచాలు గూడ అతనికి సరికావని వర్ణింపబడింది. పుట్టినవారిలోగాని, పుట్టబోయే వారిలోగాని అతనితో సమానమైనవాడెవ్వడూ లేడు (4-18). ఇతడు దేవతలను, మానవులను తన ప్రభావ, ప్రతాపైశ్వర్యాలచేత అధిగమిస్తాడు (1-165) దేవతలందరు ఇతని ఆజ్ఞకు లోబడినవారే ప్రపంచానికంతా అధిపతి (4-19) యైన ఇతడు కామరూపుడు (3-48, 3-53, 6-47), చాల బలమైన భూజాలు కలవాడు (6-19, 8-32).

ఇంద్రుడు పుట్టుకగలవాడు (3-48 4-18). రెండు సూక్తాలు ఇతని పుట్టుకని వర్ణిస్తున్నాయి. ఇతడు తన తల్లియైన 'గృష్టి' నుండి అసహజమైన పద్ధతిలో పుట్టాడట. పుట్టిన వెంటనే ఆకాశాన్ని ప్రకాశింప జేశాడట (3-44). సూర్యచక్రాన్ని సర్వదా తిరిగేట్లు చేశాడట (1-130). పుట్టుకతోనే యోధుడైన ఇతణ్ణి చూసి దేవతలు భయపడ్డారు

(5-30). భూమ్యాకాశాలు పర్వతాలుగూడ భయపడ్డాయి (1-61). దేవతలందరు కలిసి తమ విరోధులైన రాక్షసులను సంహరించటానికి ఇంద్రుణ్ణి పుట్టించినట్లు వర్ణింపబడింది (3-49). పురుషసూక్తంలో (10-90) ఇంద్రాదులు విరాట్పురుషుని ముఖంనుండి పుట్టినట్లు వర్ణింపబడింది.

అగ్నిదేవుడు ఇంద్రుని కవలసోదరుడు. 'పూష' కూడ సోదరుడే (6-55, 6-59). ఇంద్రుని ప్రధానస్నేహితులు, సేవకులు మరుత్తులు (5-42, 9-65). ఋగ్వేదంలో స్వతంత్రంగానే కాకుండా ఇతడు అగ్నితోను, వరుణునితోను, వాయువుతోను కలిపి స్తుతింపబడ్డాడు. సోమునితోను, విష్ణువుతోను, బృహస్పతితోను, పూషతోను గూడ అరుదుగా కలిపి స్తుతింపబడినట్లు కనపడుతోంది.

దేవతలందరిలోను ఇంద్రుడు ఎక్కువ సోమపానప్రియుడు. ఇతని వీరకృత్యాలకు సోమపానమే కారణం. ముఖ్యంగా వృత్రాసురుని చంపేటప్పుడీతడు మూడుచెరువుల సోమరసాన్ని త్రాగాడట (5-29). పుట్టినవెంటనే సోమరసాన్ని త్రాగినవాడితడు (3-48, 6-40). ముప్పై సరస్సుల మద్యాన్ని ఒకేసారి త్రాగివేయగల శక్తి కలవాడట (8-66). 10-119 సూక్తంలో సోమపానంచేసిన ఇంద్రుడు తన వీరకృత్యాలను తనే వర్ణించుకొన్నాడు. ఇలా ఇతడు ఎక్కువగా సోమపానం చేయడంవల్ల కల్గిన అనారోగ్యాన్ని దేవతలు సౌత్రామణి యాగంచేసి పోగొట్టారు.

ఇతని చరిత్రలో ముఖ్యఘట్టం వృత్రాసురసంహారం. వృత్రాసురుడు జలాలను నిర్బంధించగా, మరుత్తుల సహాయంతో అతనిపై దండెత్తి భయంకరయుద్ధంలో ఇంద్రుడు తన వజ్రాయుధంతో అతనిని చీల్చి, నిర్బంధించిన జలాలను వదలిపెట్టాడట. అలా

జలాలను వదలినవాడవటంవల్లనే ఇంద్రుడనే పేరు ఇతనికి కలిగింది. ఇందు శబ్దానికి జలబిందువు అని అర్థం. జలాలను వదలినవాడు ఇంద్రుడు. ఇంద్రవృత్రాసురులయుద్ధం అతిభయంకరం. వృత్రాసురుని చంపి, జలాలను నిర్బంధంనుంచి వదలి పర్వతాలను, నదులను, సముద్రాలను, సరస్సులను నింపాడు. మానవులకు ముఖ్యమైన జలాలనిచ్చేవాడు కాబట్టి దేవతలందరిలోను ఇంద్రుడు ముఖ్యతము డయ్యాడు (2-14, 10-99, 8-55, 6-18). ఇట్లే ఇతడు చేసిన ఇతర రాక్షససంహారం కూడ వర్ణింపబడింది.

రాక్షససంహారానికి ఉపయోగపడే ఇంద్రుని ఆయుధం వజ్రం. ఇది త్వష్టప్రజాపతిచేత నిర్మింపబడింది (1-32). కావ్యఉశనునిచే నిర్మింపబడినట్లు కూడ చెప్పబడింది (1-21, 5-34). ఇది సముద్రంలో సూర్యునికంటె లోతుగా ఉన్నదట (8-89, 10-27). ఇది లోహనిర్మితం (1-52). ఒకచోట స్వర్ణమయంగా కూడా వర్ణింపబడింది. (1-57). దీనికి నాలుగు కోణాలు (4-22), వందకోణాలు (4-17), వందకణుపులు (8-6), వేయి అంచులు (1-80) ఉన్నాయి. ఇది చాలా పదునైన ఆయుధం (7-18). ధనుర్బాణాలు, అంకుశం (8-45, 8-17) కూడ ఆయుధాలుగా వర్ణింపబడ్డాయి.

ఇంద్రుడు రథికుడై యుద్ధం చేసేవాడు. ఈతని రథం స్వర్ణమయం (6-29). ఈ రథం సామాన్యంగా రెండు గుఱ్ఱాలచేత లాగబడుతుంది. ఒక్కొక్కచోట వంద, వేయి, పదకొండువేల గుఱ్ఱాలు కూడ ఈ రథానికి కట్టబడేవి (2-18, 4-46, 6-47, 8-1) వాయువు ఈతని రథసారథి (4-46) ఇతని రథం, అశ్వాలు ఋభువులనే మరుత్తులచేత రూపొందింపబడ్డాయి (1-111, 5-31).

సర్వప్రాణిరక్షకుడుగా ఇంద్రుడు వర్ణింపబడినట్లు ఏ ఇతర దేవత వర్ణింపబడలేదు. తన భక్తులచేత తల్లిగాను, తండ్రిగాను,

సోదరునిగాను, స్నేహితునిగాను ఇతడు స్తుతింపబడ్డాడు. ఇతడు తననుసేవించినవారికి అమితైశ్వర్యబలాలను ప్రసాదిస్తాడు (10-47).

2. అగ్ని :

ఋగ్వేదదేవతలలో ఇంద్రుని తరువాత రెండవస్థానం అగ్నిదే. ఇతడు సుమారు 200 సూక్తాల్లో స్తుతింపబడ్డాడు.

యజ్ఞగతుడైన అగ్నియే ఎక్కువగా పేర్కొనబడటంచేత ఇతడు ఘృతపృష్ఠుడుగా (5-4), ఘృతముఖుడుగా (3-1), జ్వాలాకేశుడుగా (1-45), కపిలగడ్డం కలవాడుగా (5-7), పదునైనదవడలు కలవాడుగా (1-58), బంగారుపండ్లు కలవాడుగా (5-2, 5-7), జ్వాలాముఖుడుగా (7-3) స్తుతింపబడ్డాడు. ఈతడు దివసస్పుత్రుడు (10-45). ద్యావాపృథువుల పుత్రుడుగాకూడ కీర్తింపబడ్డాడు (3-2 3-3, 3-25, 10-1, 10-2). దేవతలందరు మానవులకొఱకై ఇతణ్ణి పుట్టించినట్లు కనబడుతుంది (6-7, 10-46). ఇంద్రుడు, అగ్ని కవలపిల్లలు.

అరణిమథనంచేత అగ్నిపుట్టుక ఋగ్వేదంలో వర్ణింపబడింది (3-29) అక్కడే అగ్నికి తల్లిదండ్రులుగా మథనానికుపయోగించే కర్రలు వర్ణింపబడ్డాయి. అగ్ని పుట్టగానే తల్లిదండ్రులను భక్షిస్తాడట (10-79). ఇతడు పదిమంది స్త్రీలచే వ్రేళ్లచే సృష్టింపబడ్డాడట (1-95). ఒరిపిడిచేత పుట్టడంవల్ల ఇతడు **'సహసస్పుత్రుడ'** ని పిలువబడుతున్నాడు (6-48). ఇలాగే జలాలలో అగ్నిపుట్టుక కూడ వర్ణింపబడింది. అగ్ని జలాల గర్భంగా (3-1), జలాలలో రేపబడినట్లు (10-45) సరస్సులో పెరిగిన వృషభంగాను (1-58), (5-1) హంసగాను (1-165) వర్ణింపబడ్డాడు. జలపుత్రుడుగా చెప్పబడే ఇతడు **'అపాంనపాత్'** అనే మరొక పేరుతో (2-35) స్తుతింపబడ్డాడు. ఇతడు స్వర్గంలో పుట్టినట్లు (1-143), 'మాతరిశ్వ' అనే దేవతచేత భూలోకానికి

తీసుకొనిరాబడినట్లు (1-93) తెలుస్తున్నది. సూర్యుడు గూడ అగ్నికి రూపాంతరంగా చెప్పబడ్డాడు (3-2). స్వర్గంలో పుట్టిన అగ్ని దివ్యపక్షిగాను (1-164), ఆకాశపుగ్రద్దగాను (7-15) పోల్చబడ్డాడు.

ఈ విధంగా మూడుస్థానాలలో అగ్నిపుట్టడంవల్ల మూడురకాలైన ప్రకాశాలు కలవాడుగాను (3-26), మూడు శిరస్సులు కలవాడుగాను (1-146), మూడు శరీరాలు, మూడుస్థానాలు కలవాడుగాను (3-20) వర్ణింపబడ్డాడు. సర్వప్రపంచాన్ని భూమ్యాకాశాలుగా విభజించినపుడు 'ద్విజన్మా' (1-60, 1-140), (1-149) అని, అరణిమథనంవల్ల పుట్టడంచేత 'బహుజన్మ' అనికూడ (10-5) పిలువబడుతున్నాడు.

ఈతని ప్రకాశం సూర్యప్రకాశంతోను (1-149,7-3), సంధ్యాప్రకాశంతోను (10-91), మెరుపుతోను సమానంగా ఉంటుంది. ఇతడు చీకటిని తన కిరణాలతో పారద్రోలగలడు (1-94). ఇతని మార్గం నల్లటిది (1-141, 2-4, 6-6, 7-8). భూమిపైనున్న అరణ్యాలను ఇతడు నశింపజేస్తాడు (10-142). ఇతని జ్వాలలు పెద్దపెద్ద సముద్రపు అలలతోను (1-44), పిడుగులతోను (5-25) పోల్చబడ్డాయి. ఈతని ఎర్రనిపొగ ఆకాశంవరకు వ్యాపించి ఆకాశానికి ఆధారస్తంభంగా ఉంటుంది (4-6). ధూమమే ఇతని ధ్వజం. అందుచేతనే ఇతడు 'ధూమకేతు'వని పిలువబడ్డాడు (8-92). ఇతని రథం బంగారపు కాంతికలది (3-14, 1-140, 1-141, 5-1, 10-1). దానిని ఎఱ్ఱని గుఱ్ఱాలు (7-42) లాగుతున్నాయి. ఇతడు యజ్ఞసారథి (1-25). దేవతలను తన రథంమీద యజ్ఞస్థానానికి తీసుకొని వస్తాడు (3-4). అందుచేత ఇతడు దేవతలను తీసికొనివచ్చే గుఱ్ఱంగా వర్ణింపబడ్డాడు (1-60). హవిస్సును భోజనంచేసే ఇతడు దేవతల ముఖంగా (2-1) వర్ణింపబడ్డాడు. ఇతని జ్వాలలే చంచాలుగా (1-76, 10-6) వర్ణింపబడ్డాయి. అగ్ని నెయ్యి (7-3), సమిధలు (2-7),

సోమరసం (1-14) ఆహారంగా స్వీకరిస్తాడు. మానవులు సమర్పించిన ఆహుతులను దేవతలకిచ్చి, వారిని యజ్ఞస్థలానికి తీసికొనిరావటంవల్ల ఇతడు 'దూత' గాను (1-72) యజ్ఞానికీతడే ముఖ్యుడుకావటంవల్ల ఋత్విక్కుగాను (1-1), హోతగాను (1-72), పురోహితుడుగాను (1-1), అధ్వర్యుడుగాను (3-5), బ్రహ్మగాను (4-9) స్తుతింపబడ్డాడు. హవ్యాన్ని దేవతలకందించడంచేత ఇతడు 'హవ్యవాహనుడని', శవసంస్కారంలో శవాన్ని దహించడంచేత 'క్రవ్యాద్' అని (10-16) పిలువబడు తున్నాడు.

మానవులకత్యంత సన్నిహితుడుకావడంచేత **'గృహపతి'** (7-15, 8-49) అని, 'అతిథి' అని (10-91), మరణధర్ములైన మనుష్యులలో పుట్టిన అమరుడని (8-60), సృష్టింపబడే ప్రాణుల విషయం తెలిసినవాడవటంవల్ల **'జాతవేదుడ'**ని (6-15), విశ్వాన్నంతటిని తెలిసినవాడు కావడంచేత **'విశ్వవేదుడ'**ని (10-11, 10-91, 3-1, 10-21) పిలువబడుతున్నాడు.

తనభక్తులను రక్షించడం (7-3), వారు కోరిన వరాలనివ్వడం (4-4) ఇతని కర్తవ్యాలు. గృహసౌఖ్యం, ఆయుర్దాయం, సంపద ఇతడిచ్చే వరాలు. తన భక్తులచేత ఇతడు తల్లిగాను, తండ్రిగాను (6-15), సోదరునిగాను (8-43), పుత్రునిగాను (2-1) భావింపబడ్డాడు.

దేవతలనందరిని తన మాహాత్మ్యంచేత అతిక్రమించిన అగ్ని (1-68, 3-9, 3-14, 10-69) ఋగ్వేదదేవతలలో చాలముఖ్యుడు.

**3. సోముడు :**

ఋగ్వేదంలోని కర్మకాండకు సోమరసానికి మిక్కిలి దగ్గర సంబంధం ఉంది. అందువల్ల ఈ సోమరసం, దీనికి అధిదేవతయైన సోముడు ఋగ్వేదంలో విస్తృతంగా వర్ణింపబడ్డారు. సోమలత, సోమరసాలే దేవతగా రూపొందింపబడి వర్ణింపబడినట్లు పాశ్చాత్యుల

నమ్మకం. ఋగ్వేదంలో తొమ్మిదవమండలం పూర్తిగాను, ఇతరమండలాల్లో 6 సూక్తాలు ఈ దేవతను వర్ణిస్తున్నాయి.

ఇతరదేవతల శరీరావయవాలు వర్ణింపబడినట్లుగా ఈ దేవత శరీరావయవాలు వర్ణింపబడలేదు. బహునేత్రుడుగాను (9-26), సహస్రాక్షుడుగాను (9-60) ఇతడు వర్ణింపబడ్డాడు ఇంద్రుని వీరకృత్యాలన్నీ సోమపానంవల్ల కలిగినవే అని ముందే చెప్పబడింది. అందుచేత ఈ సోమదేవత ఇంద్రుని ఆత్మగా (9-85), యుద్ధానికై పుట్టినట్లు (1-91), శూరులందరిలో గొప్ప శూరుడని (9-66), అపజయం తెలియనివాడని (9-66), రాక్షసులను, దుష్టులను సంహరించేవాడని (9-49, 9-28) వర్ణింపబడ్డాడు. ఈ సోముడు 'సూర్యా' అనే దేవతను వివాహమాడినట్లు (10-85) కూడా ఉంది. వైదికకాలం తరువాత సోమపదం చంద్రునిలో రూఢమైంది. అందువల్ల ఋగ్వేదంలో కూడ సోమదేవత అంటే చంద్రుడే అని కొందఱి అభిప్రాయం ఇతడు లతారూపుడు కావటంచేత 'వనస్పతి' (1-91) అని, ఇతర దేవతలలాగా పాలకుడని (9-97) వర్ణింపబడ్డాడు.

సోమరసం ఔషధరూపంగా వర్ణింపబడింది. అందుచేత ఈ సోమదేవత గ్రుడ్డివారికి దృష్టిని, అవయవహీనులకు ఆయా అవయవాలను ప్రసాదిస్తాడని (8-60, 10-25) వర్ణింపబడింది. ఇతడు మానవ శరీరరక్షకుడు (8-48). సుదీర్ఘమైన ఆయుర్దాయం ఇతని చేతిలో ఉంది (1-91, 9-4). అసత్యాన్ని రూపుమాపి, సత్యాన్ని రక్షించటం ఇతని విధి.

సోమరసం త్రాగినవెంటనే మూగవాడు మాట్లాడగలడు. అందుచేత ఈ దేవత 'వాచస్పతి' అని (9-26, 9-101) పిలువబడుతున్నాడు. ఇతడు ప్రజ్ఞకు అధిపతిగాను, ఋక్కులకు జనకుడుగాను, నాయకుడుగాను, ప్రచారకుడుగాను వర్ణింపబడ్డాడు.

ఇతడు కవులకు నాయకుడు. ఋత్విక్కులకు ఋత్విక్కు (9-96). యజ్ఞానికి ఆత్మ (9-2). దివ్యదృష్టితో ప్రాణులందరిని పరిశీలించ గలవాడీతడు (9-71).

తనను సేవించేవారికి ఆవులను, గుఱ్ఱాలను, రథాలను, బంగారాన్ని, స్వర్గాన్ని, జలాలను, అనేకవరాలను ఇతడివ్వగలడు (9-78). ఒక్కటేమిటి కోరినదేదైనా ఇస్తాడు (8-68). అందుచేత ఇతడు దేవతల ధనంగా వర్ణింపబడ్డాడు (9-48). మానవులను తమ శత్రువులనుంచి ఇతడు కాపాడగలడు (10-25). యజ్ఞంలో ఉపయోగించే సోమరసాన్ని తీసే పద్ధతిని కూడ ఋగ్వేదం వివరిస్తున్నది[1].

---

1 సోమలతయొక్క చిన్న చిన్న కొమ్మలు 'అంశువు' లనబడతాయి (9-67). వాటిని రాళ్ళతో చితుక కొడతారు (9-67). అప్పుడు కొమ్మల నుండి సోమరసం ద్రవిస్తుంది (10-85) రెండు చేతులు, పదివ్రేళ్ళు ఆ రాళ్ళను త్రిప్పుతాయి (10-94). అలా నూరగా వచ్చిన సోమరసాన్ని ఉన్నివస్త్రాలతో వడగడతారు (9-63). తరువాత పెద్దపెద్ద బానల్లో భద్రపరుస్తారు (9-60). ఈ బానలలోని సోమరసం పదిమంది సేవికలచేత (వ్రేళ్ళచేత) మళ్ళా శుభ్రపర్చబడుతుంది (9-6). తరువాత సోమరసం నీళ్ళతోను (9-30), పాలతోను (9-8), పెరుగుతోను (5-27), బార్లీతోను (5-27) కలుపబడి ఆయా యజ్ఞాలలో వినియోగింపబడుతుంది. ఒకానొకచోట తేనెతో గూడ కలుపబడుతుంది (5-43).

ఈ సోమరసం త్రాగినవారిని అమరులుగా చేస్తుంది. కాబట్టి అమృతమని, పీయూషమని (3-48) కీర్తింపబడింది ఈ సోమరసం సోమలత, సోమదేవత, అరుణవర్ణం కలవిగాను (10-94), హరితవర్ణం కలవిగాను (9-92) వర్ణింపబడ్డాయి. స్వర్గంలోవున్న ఈ సోమరసం దివ్యపక్షిచేత భూలోకానికి తీసుకొనిరాబడినట్లు (1-80), మూజవత్పర్వతాలలో పుట్టినట్లు (10-34) వర్ణింపబడింది.

**4. అశ్వినీదేవతలు :**

ఋగ్వేదంలో సోముని తరువాతిస్థానాన్ని అశ్వినీదేవతలాక్రమిస్తారు. ఋగ్వేదం అంతటా సంపూర్ణ సూక్తాలలోను, ఇతరత్ర కూత వీరు వర్ణింపబడ్డారు. కవలలైన (3-39) వీరు 'నాసత్యుల' ని వ్యవహరింపబడ్డారు (4-3). వీరు యువకులు (7-67), మంచి కాంతి కలవారు (7-68), బంగారంలాగా మెరిసేవారు (8-8), తేనెరంగువారు (8-26), కామరూపులు (1-117), సుందరులు (6-62), విజ్ఞానం కలవారు (8-8), మధువాహనులు కూడ.

వీరిరథం తేనెరంగుది. సూర్యునిలా ప్రకాశించేది (8-8), బంగారుమయం (4-44), బంగారు అలంకారాలు కలది (1-180). ఈ రథం ఇతర దేవరథాలకంటే విలక్షణం. దీనికి మూడు చక్రాలు, ఇలాగే మిగిలిన భాగాలుకూడ మూడేసి ఉన్నాయి (1-118). ఇది గుఱ్ఱాలచేత (1-117), హంస, గ్రద్ద మొదలైన పక్షులచేత (6-63, 10-143, 4-45, 1-118), ఒక్కొక్కచోట ఎనుబోతులచేత (5-73), గాడిదచేతను (1-34, 1-116, 8-74) లాగబడేట్లు వర్ణింపబడింది.

అశ్వినీదేవతల నివాసం అనేకరకాలుగా చెప్పబడింది ఒకచోట స్వర్గం (8-8), ఒకచోట ద్యావాపృథువులు (1-44), ఇంకోచోట వాయువు (8-8) , మఱోచోట సముద్రం (8-10), వేఱేచోట పర్వతం (7-70), వీరి నివాసస్థానంగా వర్ణింపబడింది. వీరి నివాసమిది అనే విషయం స్పష్టంగా తెలియడం లేదని (5-74), (6-63), (8-62) కూడ చెప్పబడింది. వీరు తెల్లవారుఝామున కొంచెం చీకటి ఉండగానే వస్తారుట (10-61). ఉష అనే దేవత వీరిని మేల్కొలుపుతుందట (8-9). వీరు ఉషస్సును అనుసరిస్తారు (8-5). తమ తమ హవిర్భాగాలను గ్రహించడానికి ఉదయం, మధ్యాహ్నం రాత్రిపూట కూడ అశ్వినీదేవతలు వస్తారు (5-76).

వీరు స్వర్గపుత్రులుగాను **(1-182, 1-184, 10-61)**, సముద్ర పుత్రులుగాను **(1-46)** చెప్పబడ్డారు. అశ్వినీదేవతలు విశ్వవంతునికి సరణ్యు అనే ఆమెలో పుట్టినట్లు వర్ణింపబడ్డారు **(10-17)**. ఉషస్సు వారి సోదరి **(1-180)**.

వీరు తమను కొల్చేవారికి త్వరగా సహాయం చేసే స్వభావం కలవారు **(1-112, 1-118)**. సముద్రంలో ఆపదలలో నున్న నౌకలను రక్షిస్తారు. సముద్రంనుంచి, స్వర్గంనుంచి, నిధులను తీసుకొచ్చి మనకిస్తారు **(1-47)**. వీరు ముఖ్యంగా స్వర్గలోకవైద్యులుగా **(8-18)** కీర్తింపబడ్డారు. అనేక రకాలైన వ్యాధులను అనేకౌషధాలతో పోగొడతారు **(8-22)**. గ్రుడ్డివారికి దృష్టిని ఇస్తారు **(1-116)**.

వీరి వైద్యనైపుణ్యాన్ని చాటే కథలు ఋగ్వేదంలో చాల ఉన్నాయి. చ్యవనుడనే మహర్షి ముసలివాడు కాగా, వీరు అతనికి యౌవనాన్నిచ్చి భార్యచే కామింపబడేటట్లు చేయడంగాక అనేక కన్యలకు భర్తగా అతనిని చేశారట **(1-116)** రేభుడనే ఋషిని అతని శత్రువులు తీవ్రంగా కొట్టారు కట్టేసి, పదిరాత్రులు, తొమ్మిది పగళ్ళు నీటిలో ముంచివేశారు. దాదాపు చచ్చిపోయిన ఆ ఋషిని ఆ అవస్థలో వీళ్ళిద్దఱు మరల జీవింపజేశారు **(1-112-119)**. ఒకప్పుడు **'అత్రి సప్తవధ్రి'** అనే వాడిని పరివారంతో కూడ రాక్షసులు అగ్నికుండంలో పడేశారు. వీరు అతణ్ణి రక్షించి, అతనికి యౌవనాన్నిచ్చారు **(10-30)**. అలాగే ఋజ్రాశ్వుని గుడ్డితనాన్ని **(1-116)**, పరావృజుని కుంటితనాన్ని **(1-112)** పోగొట్టారు. **'విశ్పలా'** అనే ఆమె తన కాలిని యుద్ధంలో పోగొట్టుకోగా, ఇనుముతో చేసిన కాలిని ఆమెకు అమర్చారు **(1-117, 10-39)** ఈ విధంగా అనేక కథలు వీరి వైద్యనైపుణ్యాన్ని తెలియజేసేవిగా ఉన్నాయి.

## మరుత్తులు:

ఋగ్వేదంలోని ముప్పై మూడు సూక్తాలు ప్రత్యేకంగా మరుత్తులనే వర్ణిస్తున్నాయి. మరి ఏడు సూక్తాలు ఇంద్రుని, మరుత్తులను వర్ణిస్తున్నాయి. ఇంకో రెండు మరుత్తులను అగ్ని పూషలతో కలిపి వర్ణిస్తున్నాయి.

వీరు సామూహికంగానే (1-37) స్తుతింపబడ్డారు. వారి సంఖ్య 27 (1-133) లేదా 180 (8-85). వీరు పృష్ణిరుద్రుల సంతానం (1-38, 2-34, 5-52). వాయుపుత్రులుగా (1-134), స్వర్గపుత్రులుగా (10-77), స్వయంజాతులుగా (1-168) వర్ణింపబడ్డారు. వీరందరు ఒకే వయస్సు (1-165), ఒకే శక్తి, ఒకే మనస్సుకల (8-20) సోదరులు. వారిలో ఏఒక్కరు ఏఒక్కరికంటె పెద్దగాని, చిన్నకాని కారు (5-59). వీరు భూమ్యంతరిక్షాలలో పెరిగారు (5-55). రోదసి అనే దేవత వీరిభార్య (5-56). ఇంద్రాణి, సరస్వతి వీరి స్నేహితురాళ్లు (10-86,7-96).

వీరు అగ్నిలాగా ఎఱ్ఱగాను (7-59), బంగారు రంగులోను (6-66) ప్రకాశిస్తారు. మెరపులే వీరి కళ్లు (5-54). వీరి ఆయుధాలు బంగారు గొడ్డళ్ళు (1-37,1-88, 5-33, 5-57, 8-20), ధనుర్బాణాలు (5-53, 5-57). వీరు పుష్పాలను, బంగారపు ఉత్తరీయాలను, ఆభరణాలను, కిరీటాలను, భుజకీర్తులను, కడియాలను ధరిస్తారు (5-53, 5-55, 5-60). వీరి రథాలు మెరపుల్లాంటివి (1-88). వాటిని లాగేవి **'పృషతు'** లనే ఆడగుఱ్ఱాలు (1-39). అవి ఎఱ్ఱటివి (1-80, 5-75), మచ్చలు కలవి, మనోవేగం కలవి. వీరు గొప్ప శక్తిమంతులు (5-58). సుందరులు (1-167), యువకులు (1-64). శుభ్రమైన వీరు (6-66) భయంకరులు (1-19), సింహాలవలె క్రూరులు (1-64), ఐనా పిల్లల్లాగే క్రీడాసక్తులు (1-166). వీరి మాట పిడుగులాంటిది (1-169). వీరు పర్వతాలను పెకలించగలరు. రెండు ప్రపంచాలను

కలియబెట్టగలరు (8-7). అలాగే అడవులను, అరణ్యంలోని జంతువులను నాశనం చేస్తారు (1-39, 1-64).

వీరి ముఖ్యకృత్యం వర్షం కురిపించడం (1-38). వీరు సూర్యనేత్రాన్ని వర్షంతో కప్పేస్తారు (5-59). వర్షించేటప్పుడు మేఘాలద్వారా చీకటిని పుట్టిస్తారు (1-38). పర్వతాలను, నదులను, సరస్సులను, సముద్రాన్ని, నింపేస్తారు (5-59). వడగండ్లు, పిడుగులు వీరివర్షంలో సహజాలు (5-54). అలాంటి వర్షం పాలు, నెయ్యి, తేనెలతో పోల్చబడింది (1-85, 1-64, 5-54).

చాలాచోట్ల వీరు దేవగాయకులుగా చెప్పబడ్డారు (5-52,5-60, 7-35). ఇంద్రుడు అహిశంబరులను సంహరించేటప్పుడు వీరు గానం చేశారు (3-47). అందుచేత వీళ్లు ఋత్విక్కులుగా (5-59) చెప్పబడ్డారు.

ఇంద్రునకు స్నేహితులైన ఈ మరుత్తులు ఇంద్రబలాన్ని ప్రార్థనలతోను, స్తుతులతోను పెంచారు (8-65). ఇంద్రుడు వీరి సహాయంవల్లనే వృత్రాసురుని సంహరించాడు (1-23, 8-7). ఇంద్రునితో కలువనప్పుడు వీరు తమ క్రౌర్యాన్ని ప్రదర్శించేవారు (7-56). వీరి భక్తులను వీరు పిడుగులనుంచి, పాపాలనుంచి, రోగాలనుంచి రక్షిస్తారు (8-20, 2-33). వీరు తమ తండ్రిలాగా ఔషధాలను భక్తులకిచ్చేవారు (5-53).

**6. వరుణుడు :**

ఇతడు సుమారు 12 సూక్తాలలో ప్రత్యేకంగాను, మరొక 24 సూక్తాలలో మిత్రునితోను వర్ణింపబడినా, ఇంద్రుని తరువాత స్థానాన్ని తనవ్యక్తిత్వంచేత పొందుతున్నాడు. అదితి కొడుకులందరిలో సత్యపాలనానికి, విశ్వాన్ని సక్రమంగా నడపటానికి వరుణుడు నియోగింపబడినట్లు తెలుస్తున్నది (1-2, 1-24, 10-132, 2-27, 5-

85): అందుచేత ఇతడు సమ్రాట్టుగా కీర్తింపబడ్డాడు. మానవుల, దేవతల నడవడులను ఇతడు గూఢచారులద్వారా (1-24) సూర్యుడనే కంటితోను (7-66) నిరీక్షిస్తాడు. ఇతని అవయవాలు చేష్టలు అన్నీ వర్ణింపబడ్డాయి ఇతని ఆజ్ఞవల్లనే ఉషస్సు ఉదయిస్తుంది సూర్యుడు ఆకాశాన్ని దాటుతాడు, మేఘాలు వర్షిస్తాయి, రాత్రి నక్షత్రాలు ప్రకాశిస్తాయి. ఆయా దేవతలను సక్రమమార్గాన నడిపించే వరుణశక్తి 'మాయ' గా వర్ణింపబడింది (6-48, 7-28, 10-99, 10-147). శీఘ్రకోపియైన ఇతడు తన నియమాలను, అధికారాలను కఠినంగా అమలుపరుస్తాడు. అందుచేత ఇతడు 'ధృతవ్రతుడ'ని (8-41) పిలువబడుతున్నాడు. ఏ ఒక్క ప్రాణి ఇతని దృష్టినుంచి తప్పించుకోలేడు (2-28). అపరాధులను కఠినంగా దండిస్తాడు (7-86). వారిని కట్టి దండించే ఆయుధంగా ఇతని 'పాశం' ప్రసిద్ధి కెక్కింది (1-24, 1-25, 6-74, 10-85) అసత్యాన్ని, పాపాన్ని అసహ్యించుకుంటాడు (1-152). ఇతడు జలాధిపతిగాను, జలశరీరుడుగాను (7-64 వర్ణింపబడ్డాడు. ఋతువులను, కాలాన్ని కూడా ఇతడు సక్రమంగా నడిచేటట్లు చేస్తాడు (1-25, 7-66) దివ్యనదీమధ్యంలో ఆకాశాన్నంటే సహస్ర స్తంభమంటపం ఇతని నివాసం (5-68, 2-41).

ఇతడు తన భక్తులకు సుముఖుడే. వారి పాపాలనేగాక (2-28, 5-85) వారి తండ్రుల పాపాలనుకూడా (7-86) పోగొడతాడు. తెలియక చేసిన నేరాలను క్షమిస్తాడు (7-89). తన భక్తులకు మరణభయం లేకుండాచేసి (1-24) మోక్షాన్ని ప్రసాదిస్తాడు (8-42).

**7. ఉషస్సు :**

ఈ దేవత సుమారు 20 సూక్తాల్లో వర్ణింపబడింది. ఈమె ప్రతిరోజు నియతకాలంలో నియతస్థలంలో క్రమం తప్పకుండా ఉదయిస్తూ దేవతలు నిర్ణయించిన మార్గంలో ప్రయాణిస్తూ ప్రాణులకు

కర్తవ్యపరిపాలనాన్ని బోధిస్తుంది (1-92, 1-123, 1-124, 7-76). ప్రాణివర్గాన్ని మేల్కొలుపుతుంది (1-113). ఈమె అనంతకాలం నుంచి అంతరిక్షంలో కనబడుతున్నప్పటికి యువతిగానే అందరిచేత చూడబడుతోంది (1-92). అప్పుడే చక్కగా స్నానం చేసి స్మితవదనంతో, చీకటిని పారద్రోలుతూ ఈమె వస్తుంది (5-80). ఈమె అందానికి దాసుడై సూర్యుడు ఈమెను వెన్నంటి ఉదయిస్తాడు (7-77). ఈమె సూర్యుని ప్రియురాలు. సూర్యకాంతితో ప్రకాశిస్తుంది (1-92). రాత్రికి అక్కగాను (1-124). స్వర్గానికి పుత్రికగాను, స్వర్గంలో అత్యంత ప్రియతమమైన వస్తువుగాను ఈమె స్తుతింపబడింది (1-30, 1-46). ఎఱ్ఱనికాంతి గల అశ్వాలనో, వృషభాలనో రథానికి కట్టి ఈమె అంతరిక్షంలో సంచరిస్తుంది (7-78, 1-23, 7-75 1-92). బలాసురుని కారాగారంలో బంధింపబడి, ఇంద్రబృహస్పత్యంగిరసుల ద్వారా విడిపింపబడినట్లు కూడా ఈమె వర్ణింపబడింది (10-68, 7-76). ఈమె తన భక్తులకు సంపదను, సంతానాన్ని, రక్షణను దీర్ఘాయుష్యాన్ని ఇస్తుంది (1-30, 1-48).

**8. సూర్యుడు :**

ఉషస్సు ననుసరించి ఉదయించే సూర్యుడు ఋగ్వేదంలోని పదిసూక్తాల్లో వర్ణింపబడ్డాడు. ఇతడు మిత్రావరుణుల నేత్రం (7-66), విశ్వానికంతటికి గూఢచారి (4-13), చరాచర ప్రపంచానికి ఆత్మ లేక సంరక్షకుడు (1-115, 7-60), ఆకాశాన ఎగిరే ఎఱ్ఱనిపక్షి (5-47), ఎఱ్ఱనిగ్రద్ద (5-45), ఆకాశపు వజ్రాభరణం (7-63), స్వర్గమధ్యంలో ప్రకాశించే మణి (5-47), మిత్రావరుణుల ఆయుధం (5-63), ఒకచక్రం (1-175), విశ్వకర్మ (10-170), దేవపురోహితుడు (8-90). ఇతడు మిత్రావరుణులచేత (2-12), ఇంద్ర విష్ణువులచేత

(7-99), ఇంద్రసోములచేత (6-72), అగ్నిచేతను (10-3), ధాతచేత (10-190), అంగిరసులచేత (10-62) పుట్టింపబడినట్లు, ఆకాశంలో ప్రతిష్ఠింపబడినట్లును ఉన్నది. ఇతడు 'ఏతశం' మొ॥ గుఱ్ఱాలను కట్టిన రథాన్నెక్కి, మిత్రావరుణులేర్పరచిన మార్గంలో బయలుదేరుతాడు (1-24, 7-63, 7-87). చీకటిని పోగొడతాడు (10-37). చీకటిని చుట్టచుట్టి సముద్రంలో పడేస్తాడు (7-63). రోగాలను, దుస్స్వప్నాలను పారద్రోలుతాడు (10-37). ప్రాణులన్నీ ఇతనిపై ఆధారపడి ఉంటాయి (1-164) ఇంద్రుడీతని జయించి, ఇతని చక్రాన్ని దొంగిలించినట్లు (1-175, 4-30) కూడ చెబుతారు.

**9. సవిత :**

ఇతడు ఋగ్వేదంలో 11 సూక్తాల్లో వర్ణింపబడ్డాడు. ఇతడొక బంగారు దైవం. ఇతని సర్వావయవాలు, రథం, ధ్వజస్తంభం, స్వర్ణమయాలు (1-35, 6-71, 7-45). ఇతని రథం గోధుమరంగు డెక్కలుగల (రెండు / చాల) గుఱ్ఱాలచేత లాగబడుతుంది (1-35). తన బంగారు భుజాలను, బంగారుకాంతిని భూమ్యంతరిక్షాల చివరికొనలవరకు వ్యాపింపజేసి ప్రాణులందఱిని మేల్కొలుపుతూ ఇతడు ఆశీర్వదిస్తాడు (2-38, 4-53, 6-71, 7-45). పసుపురంగు కురులు కల్గి సూర్యతేజస్సుతో ప్రకాశించే ఇతడు తూర్పునుంచే తన కాంతిని ప్రసరింపచేసి (10-139) తన భక్తుల పాపాలను, దుస్స్వప్నాలను పోగొడతాడు (5-82, 4-54, 1-35, 7-38). రాక్షసులను, పాపులను పారద్రోలుతాడు. జలాలు, వాయువు ఇతని మిత్రులు, అనుచరులు (2-38). దేవతలందరికి ఇతడు నాయకుడు (5-81). ఇతని ఇష్టాన్ని అడ్డగించగలవాడు దేవతల్లోగాని, మానవుల్లోగాని లేడు (2-38). ఇతడు రాత్రి అందరినీ విశ్రాంతి తీసుకొనేటట్లు

చేస్తాడు (4-53). గాయత్రీమంత్రం (3-62) ద్వారా మంచి ధీశక్తినిమ్మని ఇతడు కోరబడుతున్నాడు[1] (3-62).

**10. పూష :**

సూర్యుని ప్రతిరూపమైన ఈ దేవత ప్రత్యేకంగా ఎనిమిదిసూక్తాల్లోను, ఇంద్రసోములతో కలిపి ఒక్కొక్క సూక్తంలోను కీర్తింపబడ్డాడు. రాత్రి చీకటిలో పోగొట్టుకొన్న వస్తువులు, పగలు మరల తిరిగి వచ్చేటట్లు చేసే శక్తిగలవాడీతడు (౬-48). ఇతనికి దంతాలు లేవు (6-56). అందువలన జావయే ఇతని ఆహారం (6-56). ఇతడు మహాపరాక్రమం కలవాడవటంచేత ఇంద్రునికి వీరకృత్యాలలో సహాయపడతాడు (6-55). జటాజూటాన్ని ధరించి, మేకలులాగే రథాన్ని ఎక్కి తిరిగే ఈ దేవత 'శస్త్ర ఆరా' లేక 'అష్ట్రా' అనేపేరుతో కూడ ప్రసిద్ధుడు (1-38, 6-55). తన గోధనాన్ని అపహరించిన 'పణి' జాతిని వెంటనే సంహరించి, తమ గోవులకు విముక్తిని కలగజేయమని ఇతనిని ప్రార్థిస్తారు (6-54). ఇతడు 'సూర్యా' అనే దేవతను పెండ్లాడాడు (10-85). మార్గమధ్యంలో కలిగే ఆపదలను పోగొడతాడు (1-42).

**11. విష్ణువు :**

సూర్యుడే తన వ్యాప్తిశీలాన్నిబట్టి విష్ణువుగా కీర్తింపబడ్డాడు. ఇతడు ఐదు లేక ఆరు సూక్తాలలోనే వర్ణింపబడినప్పటికి దేవతలందరికంటే గొప్పవాడు. ఇతడు తన మూడు పాదాలతో

1. ఇతడు కూడ సూర్యుని ప్రతిరూపమే. సూర్యోదయానికి పూర్వం, ఉషోదయం తరువాత, ఇతడుదయిస్తాడని, సూర్యాస్తమయం తరువాత రాత్రివరకు ఇతడు ప్రకాశిస్తాడని సాయణుల వ్యాఖ్యానం.

భూమ్యంతరిక్ష స్వర్గాలనాక్రమించడమే ముఖ్యంగా వర్ణింపబడింది (1-155). ఈ విక్రమణాన్నిబట్టి ఈతడు 'ఉరుగాయుడు' అని 'ఉరుకర్ముడ'నికూడ పేర్కొనబడ్డాడు (1-155). ఇతని మూడుపాదాలలో రెంటిని మాత్రమే మనుష్యులు చూస్తారు. మూడవది పక్షిమార్గానికి పైనుండటంవల్ల దానిని చూడలేరు (1-155). ఈ మూడవపాదం స్వర్గానికే నేత్రం (1-22). అందుచేతనే స్వర్గాన్ని విష్ణుపదమంటారు. అందులో ముక్తులు, దేవతలు ఆనందాన్ని అనుభవిస్తారు (8-29). ఇతడే ఋతుచక్రాన్ని త్రిప్పుతాడు (1-155). ఇంద్రునికి యుద్ధాలలో సహాయపడతాడు (6-69). ఇంద్రునితో, మరుత్తులతోను కలిపి ఇతడు స్తుతింపబడ్డాడు.

**12. బృహస్పతి :**

ఋక్సంహితలో 11 సూక్తాలలో స్తుతింపబడినా ఇతడు దేవతలలో ముఖ్యస్థానాన్ని ఆక్రమిస్తున్నాడు. ఇతడు యజ్ఞపురోహితుడు (2-24). బృహస్పతిలేనిదే యజ్ఞం పూర్తికాదు. సేవాభావాన్ని ఇతడే కలిగిస్తాడు (1-18). ఇంద్రాదిదేవతలను సంతోషపెట్టే మంత్రాలను స్వయంగా చదువుతాడు (1-40). ఇతని గానం హంసగానం (10-67). ఇతనితో కలిసి పాడేవారు కూడ వెంట ఉంటారు (7-10). అందువల్ల ఇతడు 'గణపతి' (2-23) అని కూడా పిలువబడ్డాడు. ఇతడు స్వర్గంలో పెద్దకాంతితో, పెద్దధ్వనితో పుట్టాడట (4-50). పదునైన కొమ్ములు (10-155), వందరెక్కలు (7-97) కలవాడట. ధనుర్బాణాలు, ఇనుపగొడ్డలి (2-24, 10-53), ఇతని ఆయుధాలు. ఇతడు సత్యవ్రతుడు. సత్పురుషుని అన్ని అపాయాలనుంచి రక్షిస్తాడు. కోరినవిస్తాడు (1-18).

### 13. రుద్రుడు :

మూడుసూక్తాల్లో మాత్రం ఇతడు వర్ణింపబడ్డాడు. మరుద్గణాలకు తండ్రియైన ఇతడు పింగలవర్ణుడు (2-33). ఎల్లప్పుడూ ధనుర్బాణాలను ధరిస్తాడు (2-33). మరుత్తుల్లాగా ఇతడు కూడ బహు భూషణాలంకృతుడు (2-33). అపరాధుల శిరస్సులపై విద్యుత్తనే అస్త్రాన్ని వెనక ముందాలోచించకుండా ప్రయోగిస్తాడు (2-33). అపరాధుల విషయంలో చాలా క్రూరుడైనా, భక్తుల విషయంలో అత్యంతోదారుడు (2-33). తన భక్తుల అఘలను (మానసిక రోగాలను), వ్యాధులను (శారీరక రోగాలను) పోగొడ్తాడు (1-43). ఇతని చేతులు వివిధౌషధాలతో నిండి ఉంటాయి (1-43). ఆపదలలో రక్షించమనే ప్రార్థన విన్న వెంటనే ఎంతటి క్రూరుణ్డైనా పరుగెత్తి వెళ్ళి రక్షిస్తాడు (1-114). ఇంద్రునికి ఇతడు సహాయకుడు.

### 14. యముడు :

ప్రేతాత్మల సామ్రాజ్యానికి అధిపతియైన యముడు (10-14 10-135, 10-154) మూడు సూక్తాల్లోనే వర్ణింపబడ్డాడు. మృత్యువాత పడిన జీవుడు మరొకశరీరాన్ని ధరించేవరకు, అగ్నిసాహాయ్యంతో యమలోకానికిచేరి, అగ్నిదగ్ధులైన పితృదేవతలతోను అనగ్నిదగ్ధులైన భృగు, అథర్వ, అంగిరసాది పితరులతోను కలిసి ఆనందాన్ని అనుభవిస్తాడు 10-14). యజ్ఞంలో ఆవాహితులైన పితరులతోబాటు ఈ యముడు కూడా ఆవాహనం చేయబడి ఆహుతులను స్వీకరిస్తాడు (10-14). అగ్నిదగ్ధుడైన జీవుని పెద్దపెద్ద ముక్కులు, నాలుగుకళ్ళు కల రెండు కుక్కలు యమలోకానికి చేరుస్తాయట (10-14). మరణించబోయే వ్యక్తులను వెతకి, వారిని యమలోకానికి

తీసుకుపోవడం ఈ కుక్కల పని (10-14). ఈ యముని తండ్రి వివస్వంతుడు. తల్లి సరణ్యు (10-14, 10-17). గుడ్లగూబ యముని వార్తాహరుడు (10-165).

**15. ద్యావాపృథువులు :**

భూమ్యాకాశాలు రెండు జంటదేవతలు. వీరు దేవతలకు, మానవులకు తల్లిదండ్రులు (1-159, 7-97). వీరు ప్రాణులందరినీ సృష్టించారు (1-90). వీరిలో ఒకరు శ్రేష్ఠమైన ఆబోతు. ఇంకొకరు కామధేనువు (1-160). వీరు ముసలితనం లేనివారు (6-70) ఐశ్వర్యవంతులు (1-159). అన్నాన్ని, ధనాన్ని, కీర్తిని, స్వాతంత్ర్యాన్ని ఇస్తారు (6-70). తల్లిదండ్రులలాగా ప్రాణులను పాపాలనుంచి, దురదృష్టాలనుంచి రక్షిస్తారు (1-160). వీరు యజ్ఞానికి నేతలు (4-56).

ఇట్లే మరుత్తులకు తండ్రియైన వాయుదేవుడు, విశ్వకర్మయైన త్వష్ట, దేవమాత అదితి, రాక్షసమాత దితి, మేఘదేవత పర్జన్యుడు ఈవిధంగా అనేకదేవతలు అక్కడక్కడ స్తుతింపబడ్డారు. పైన పేర్కొనబడిన వారినే ముఖ్యదేవతలుగా మనం భావించవచ్చు.

కె.వి.ఆర్.కె.

## 1.7 ఛందస్సు

'ఛందస్సు' అనే పదం 'ఛద్' అనే ధాతువునుంచి రూపొందింది. ఈ ధాతువుకు '-ఆహ్లాదం' అని అర్థం. కనుక ఛందస్సు అంటే సంతోషం కలిగించే వాక్సమూహం. ఈ సంతోషం ఆ వాక్సమూహంలోని గురులఘువులవల్ల, వాటి ఆవృత్తివల్ల, వాటి నియమపూర్వక విచ్ఛేదం వల్ల కలుగుతున్నది. ఇవన్నీ ▪ శబ్దసమూహంలోని లయను అభివ్యక్తం చేయడం ద్వారా ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి.

ఛందస్సులో నియతవిచ్ఛేదం అనేకరకాలుగా ఉన్నది. అందులో ఆ వాక్సమూహాన్ని లయానుగుణమైన పాదాలుగా, గణాలుగా విభజించడం ప్రధానమైంది. గణాలు గురులఘువుల కూడికవల్ల ఏర్పడుతున్నాయి. అక్షరాలకు గురుత్వంగాని లఘుత్వంగాని వాటి ఉచ్చారణ కాలాన్ని బట్టి చెప్పబడుతుంది. ఆయా పాదాల్లో గురులఘువులుండే స్థానాల మార్పువల్ల ఛందస్సులో అనేకరకాల గమనాలు ఏర్పడుతున్నాయి. కాబట్టే (**"ఛందః పాదౌ తు వేదస్య"**) వేదపురుషునికి ఛందస్సు పాదాలు అని వర్ణింపబడింది.

పాదంలో ఉండే అక్షరసంఖ్యను బట్టి ఛందస్సు పేర్కొన బడుతోంది. ఛందస్సులో సాధారణంగా నాలుగు పాదాలుంటాయి. పాదంలో 1 మొదలు 26 వరకు అక్షరాలుంటాయి. కనుక 26 ఛందస్సులు ఉన్నాయి. అని సామాన్యంగా నాలుగు వర్గాలుగా విభజింపబడ్డాయి.

**1 వ వర్గం:** (1) ఉక్త (2) అత్యుక్త (3) మధ్య (4) ప్రతిష్ఠ (5) సుప్రతిష్ఠ. వీటికి అనాదిష్టచ్ఛందస్సులని పేరు.

**2 వ వర్గం:** (6) గాయత్రి (7) ఉష్ణిక్ (8) అనుష్టుప్ (9) బృహతి (10) పంక్తి (11) త్రిష్టుప్ (12) జగతి. వీటికి బృహచ్ఛందస్సులని పేరు.

**3 వ వర్గం:** **(13)** అతిజగతి **(14)** శక్వరి **(15)** అతిశక్వరి **(16)** అష్టి **(17)** అత్యష్టి **(18)** ధృతి **(19)** అతిధృతి. వీటికి అతిచ్ఛందస్సులని పేరు.

**4 వ వర్గం:** **(20)** కృతి **(21)** ప్రకృతి **(22)** ఆకృతి **(23)** వికృతి **(24)** సంకృతి **(25)** అభికృతి **(26)** ఉత్కృతి. వీటికి కృతిచ్ఛందస్సులని పేరు. (**1-26** వరస సంఖ్యలు ఆయా ఛందస్సుల్లో ఒకపాదంలోని అక్షరాల సంఖ్యను తెలుపుతున్నాయి.) ఋగ్వేదంలో **2,3** వర్గాల్లోని ఛందస్సులు మాత్రమే ఉన్నాయి.

ఛందోవిజ్ఞానంతో కూడిన వైదిక కర్మానుష్ఠానం ప్రశస్తమైంది. కనుక ఛందస్సు చాల ఆవశ్యకమైంది. ఛందస్సు వేదాంగంగా పరిగణింపబడింది. ఋగ్వేదంలోని ఛందస్సు **'ఋక్ప్రాతిశాఖ్యం'** లో **16, 17, 18** పటలాల్లో వివరింపబడింది. **నిదానసూత్రాలు** వైదికచ్ఛందస్సుల పేర్లను, వాటి స్వభావాల్ని వివరిస్తున్నాయి. ఇందులో వేదఋక్కులకు సంబంధించిన అనుక్రమణిక ఉంది ఛందో గ్రంథాల్లో పింగళమహర్షి రచించిన **'ఛందోవిచితి'** మొట్ట మొదటిది. దాన్నే వేదాంగమైన ఛందస్సుగా పరిగణించారు. కాత్యాయనుని **'సర్వానుక్రమణిక'** లో ఋగ్వేదంలోని ఛందస్సు సమగ్రంగా వివరింపబడింది. సాయణాచార్యుడు దీన్ని ఉదాహరించి ఆయా ఋక్కుల ఛందస్సును వివరించాడు.

ఋగ్వేదంలోని పురుషసూక్తంలో ఛందస్సు ఆవిర్భావం తెలుపబడింది. **"తస్మాత్ యజ్ఞాత్ సర్వహుతః ఋచః సామాని జజ్ఞిరే, ఛందాంసి జజ్ఞిరే తస్మాత్ యజుః తస్మాత్ అజాయత"** (**10.90 9**). 'సర్వహుత్' యజ్ఞంనుంచి ఋక్కులు, సామలు పుట్టాయి. దానినుంచే ఛందస్సులు జనించాయి. యజుస్సులు పుట్టాయి. ఇక్కడ **"ఛందాంసి"** అంటే గాయత్ర్యాది ఛందస్సులు అని సాయణుడు

వివరించాడు. అథర్వవేదమని పాశ్చాత్యపండితులు భావించారు. **"సప్తాస్యాసన్ పరిధయః" (10 90 15) లో "సప్తపరిధయః"** అంటే గాయత్రి మొదలైన ఏడుఛందస్సులని సాయణుడు అభిప్రాయపడగా మహీధరుడు ఏడుసముద్రాలని వ్యాఖ్యానించాడు.

**ఛందోవికాసపరిణామాలు :**

వైదికచ్ఛందస్సులో ముఖ్యమైన బృహచ్ఛందస్సుల (గాయత్రి ........ జగతి) నుంచే లౌకికసాహిత్యంలోని శ్లోకం, వృత్తాలు ఏర్పడ్డాయి. వేదవాఙ్మయంలో మొట్టమొదటి ఛందస్సు మధుచ్ఛందుని ద్వారా రూపొందింది:

అగ్నిమీడే పురోహితం
యజ్ఞస్య దేవమృత్విజమ్
హోతారం రత్నధాతమమ్ ॥

ఇది గాయత్రీచ్ఛందస్సు. ఇందులో 8 అక్షరాలు గల 3 పాదాలున్నాయి. మొత్తం అక్షరాలు ఇరవైనాలుగు. లౌకికవాఙ్మయంలో వాల్మీకిమహర్షి ముఖం నుంచి ఛందస్సు ఇలా ఆవిర్భవించింది :

మానిషాద ప్రతిష్ఠాం త్వమగమశ్శాశ్వతీస్సమాః ।
యత్క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితమ్ ॥
రామా. బాల. 2-15.

ఇది అనుష్టుప్ఛందస్సు. ఇందులో 32 అక్షరాలున్నాయి. అవి 8 అక్షరాలు కల 4 పాదాలుగ విభజింపబడ్డాయి. ఇది శ్లోకంగా ప్రసిద్ధికెక్కింది. శ్లోకమనే పదం ప్రస్తుతి చేయడంలో సార్థకమవుతున్నది. అష్టాక్షర, త్రిపదయైన వైదికగాయత్రియే లౌకికచ్ఛందస్సులో చతుష్పద అనుష్టుప్ శ్లోకంగా రూపొందింది. దీని లక్షణమిది–

1. అక్షరాలు సమానంగా ఉండటం. 2. నాలుగు పాదాలుండటం. 3. లయతో కూడి ఉండటం[1].

మూడుపాదాలు కల గాయత్రీచ్ఛందస్సు లౌకికసాహిత్యంలో అంతర్ధానమైంది. వైదికత్రిష్టుప్ నుంచే లౌకికచ్ఛందస్సులోని ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర, ఉపజాతి మొ॥ వృత్తాలు వికసించాయి. లౌకిక వంశస్థవృత్తం వైదికజగతీవికాసమే వైదికఅనుష్టుప్ లౌకిక సాహిత్యంలో సుశ్లోకంగా వర్ధిల్లింది

పురాణేతిహాసధర్మశాస్త్రాది రచనల్లో ఈ అనుష్టుప్శ్లోకానికే ప్రథమస్థానం. క్షేమేంద్రుడు శాస్త్రాలు, నీతికావ్యాలు, పురాణాదులు ప్రసన్నార్థమైన అనుష్టుప్ఛందస్సులో రచించాలని సూచించాడు రామాయణభారతాదులు. పురాణాలు. మన్వాది ధర్మశాస్త్రాలు. అనుష్టుప్ఛందస్సులోనే రచింపబడ్డాయి రామాయణంలో ప్రధానంగా అనుష్టుప్ఛందస్సు. సర్గాంతంలోను కొన్ని విశేషసందర్భాల్లో మాత్రమే భిన్నవృత్తాలు ఉపయోగింపబడ్డాయి.

వైదికచ్ఛందస్సు పాదంలోని అక్షరసంఖ్యచేత గుర్తింపబడుతుండేది. ఆ ఛందస్సులన్నీ 4 అక్షరాల తారతమ్యం కల్గి ఉన్నాయి గాయత్రి 24, ఉష్ణిక్ 28, అనుష్టుప్ 32, బృహతి 36 మొదలైనవి. పింగళమహర్షి లక్షణం చెప్పడంలో సౌలభ్యం కోసం గణాల (త్రికము) పద్ధతిని ప్రవేశపెట్టాడు. లౌకికచ్ఛందస్సులోని వృత్తాలన్నీ గణబద్ధాలే.

వైదికచ్ఛందస్సు ఉదాత్త, అనుదాత్త, స్వరితాలనే స్వరాలపైన, లౌకికఛందస్సు గురులఘువర్ణాలపైన లేక అక్షరాల హ్రస్వదీర్ఘాలపైన ఆధారపడి ఉంటుంది. వైదికవాఙ్మయం గేయరూపంలో ఉంటే లౌకికవాఙ్మయం పాఠ్యరూపంలో ఉంది. వీటికి కేంద్రంలో ఉన్న

---

1. పాదబద్ధో௨క్షరసమస్తంత్రీలయసమన్వితః ।
శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా ॥ రామా. బాల. 2-18

ఆదికావ్యమైన రామాయణం "పాఠ్యే గేయే చ మధురమ్" (రామా. బాల. 4.8) అని కీర్తింపబడుతున్నది.

భారతీయ సంప్రదాయం వైదికచ్ఛందస్సుకు పవిత్రతను సమకూర్చింది. అభిజ్ఞానశాకుంతలంలో కాశ్యపుడు ఋక్ఛందస్సు నాశ్రయించి గర్భవతియైన శకుంతలను ఆశీర్వదించాడు.[1]

ఈ పవిత్రభావమే రాను రాను వైదికచ్ఛందస్సు లౌకిక వాఙ్మయంలో అంతర్ధానమవడానికి కారణమై ఉంటుంది.

ఇంతకుముందు పేర్కొన్న 2 వ వర్గానికి సంబంధించిన గాయత్రి మొ॥ ఏడు ఛందస్సులు దైవి, ఆసురి, ప్రాజాపత్య, యాజుషి, సామ్ని, ఆర్చి, బ్రాహ్మి అని ఏడురకాలుగా విభజింపబడ్డాయి. వాటి స్వరూపాన్ని ఈ పట్టిక తెలియజేస్తుంది.

| సంఖ్య | పేరు | గాయత్రి | ఉష్ణిక్ | అనుష్టుప్ | బృహతి | పంక్తి | త్రిష్టుప్ | జగతి |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | దైవి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 2 | ఆసురి | 15 | 14 | 13 | 12 | 11 | 10 | 9 |
| 3 | ప్రాజాపత్య | 8 | 12 | 16 | 20 | 24 | 28 | 32 |
| 4 | యాజుషి | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 5 | సామ్ని | 12 | 14 | 16 | 18 | 20 | 22 | 24 |
| 6 | ఆర్చి | 18 | 21 | 24 | 27 | 30 | 33 | 36 |
| 7 | బ్రాహ్మి | 36 | 42 | 48 | 54 | 60 | 66 | 72 |

1. కాశ్యపః— ఋక్ఛందసా౽౽శాస్తె-
అమీం వేదిం పరితః క్లప్త ధిష్ణ్యా
సమిద్వంతః ప్రాంతసంస్తీర్ణదర్భాః ।
అపఘ్నంతో దురితం హవ్యగంధై
ర్వైతానాస్త్వాం వహ్నయః పావయంతు ॥ అభి. 4-8.

ఒక ఛందస్సులో ఉన్న మంత్రంలో ఒక అక్షరం తగ్గిపోతే **'నిచృత్'** అని అంటారు. రెండక్షరాలు తగ్గితే **'విరాట్'** అంటారు. లక్షణంకంటే ఒక అక్షరం ఎక్కువగా ఉంటే **'భురిక్'** అని పేరు. రెండక్షరాలు ఎక్కువైతే **'స్వరాట్'** అవుతుంది¹. ఇలా గాయత్రీ ఛ్ఛందస్సులో ఏ మార్పువస్తే ఏ పేరుతో దాన్ని పిలుస్తామో ఈ క్రిందిపట్టిక విశదంగా తెలియజేస్తుంది. అలాగే మిగతా ఛందస్సులను గ్రహించాలి.

పాదంలోని అక్షరసంఖ్యనుబట్టి ఛందస్సులు రెండురకాలు. సమానమైన అక్షరసంఖ్యకల పాదాలు ఏ ఛందస్సులో ఉంటే అవి సమచ్ఛందస్సులు. ఉదా- గాయత్రి, అనుష్టుప్, పంక్తి, త్రిష్టుప్, జగతి మొదలైనవి. అక్షరసంఖ్య విషమంగా ఉండే పాదాలుకల ఛందస్సులు విషమచ్ఛందస్సులు. ఉదా- ఉష్ణిక్, పురఉష్ణిక్, కకుప్, బృహతి, అతిశక్వరి, అత్యష్టి మొదలైనవి.

| అక్షరాలు | గాయత్రి | పేరు |
|---|---|---|
| 1. | దైవి | — |
| 2. | " | భురిక్ |
| 3. | " | స్వరాట్ |
| 4. | యాజుషి | విరాట్ |
| 5. | " | నిచృత్ |
| 6. | " | — |
| 7. | " | భురిక్, ప్రాజాపత్య, నిచృత్ |
| [redacted] | ప్రాజాపత్యా | — |
| 9. | " | — |
| 10. | " | స్వరాట్, సామ్రా, విరాట్ |

1. 'ఊనాధికేనైకేన నిచృద్భురిజౌ'
'ద్వాభ్యాం విరాట్స్వరాజౌ' ఛ.శా. 3.59.60.

| అక్షరాలు | గాయత్రి | పేరు |
|---|---|---|
| 11. | సామ్ని | నిచృత్ |
| 12. | " | — |
| 13. | " | భురిక్, ఆసురీ, విరాట్ |
| 14. | " | స్వరాట్, ఆసురీ, నిచృత్ |
| 15. | ఆసురి | — |
| 16. | " | భురిక్, ఆర్చి విరాట్ |
| 17 | " | స్వరాట్, ఆర్చి, నిచృత్ |
| 18. | ఆర్చి | — |
| 19. | " | భురిక్ |
| 20. | " | స్వరాట్ |
| 21. | పాదనిచృత్ | — |
| 22. | ఆర్చి | విరాట్ |
| 23. | " | నిచృత్ |
| 24. | " | — |
| 25. | " | భురిక్ |
| 26. | " | స్వరాట్ |
| 34. | బ్రాహ్మి | విరాట్ |
| 35. | " | నిచృత్ |
| 36. | " | — |
| 37. | " | భురిక్ |
| 38. | " | స్వరాట్ |

ఋక్సంహితలోని ఛందస్సులను వాటి భేదాలను ఇక్కడ సంగ్రహంగా పరిశీలిద్దాం.

26 ఛందస్సులలో గాయత్రి ప్రథమగణ్యమైంది. "గాయత్రీ ఛ్ఛందసామహమ్" (భ.గీ. 10.35) అని శ్రీకృష్ణుడు దాని ప్రాశస్త్యాన్ని

వెల్లడించాడు. ఋగ్వేదంలోని మొట్టమొదటి ఋక్కు గాయత్రీ చ్ఛందస్సులో వెలువడింది. ఋషి మధుచ్ఛందుడు. దేవత అగ్ని.

1. **గాయత్రి:** 3 పాదాలు 8+8+8=24 అక్షరాలు.
   అగ్నిమీడే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజమ్ ।
   హోతారం రత్నధాతమమ్ ॥ (1-1-1)

   1. **అతి నిచృత్:** 7+6+7=20 అక్షరాలు
      పురూతమం పురూణాం, స్తోతౄణాం వివాచి ।
      వాజేభిర్వాజయతామ్ ॥ (6-45-29)

   2. **పాదనిచృత్:** 7+7+7=21 అక్షరాలు.
      క్వ వః సుమ్నా నవ్యాంసి మరుతః క్వ సువితా ।
      క్వో విశ్వాని సౌభగా ॥ (1-38-3)

   3. **వర్ధమానా:** 6+7+8=21 అక్షరాలు
      ఓర్వప్రా అమర్త్యా నివతో దేవ్యుద్వతః ॥
      జ్యోతిషా బాధతే తమః ॥ (10-127-2)

   4 **విరాట్:** 9+6+7=22 అక్షరాలు.
      యత్రోత బాధితేభ్యశ్చక్రం, కుత్సాయ యుధ్యతే ।
      ముషాయ ఇంద్ర సూర్యమ్ ॥ (4-30-4)

   5. **యవమధ్యా విరాట్:** 7+8+7=22 అక్షరాలు.
      మిమీహి శ్లోకమాస్యే, పర్జన్య ఇవ తతనః ।
      గాయ గాయత్ర ముక్థ్యమ్ ॥ (1-38-14)

   6. **నిచృత్:** 8+8+7=23 అక్షరాలు.
      నకిరింద్ర త్వదుత్తరో, న జ్యాయాం అస్తి వృత్రహన్ ।
      నకిరేవా యథా త్వమ్ ॥ (4-30-1)

7. **యవమధ్యా గాయత్రీ: 7+10+7=24** అక్షరాలు.
స సున్వే యో వసూనాం, యో రాయామానేతా య
ఇళానాం సోమో యః సుక్షితీనామ్ ॥ **(9-108-13)**

8. **ఉష్ణిగ్గర్భా: 6+7+11=24** అక్షరాలు.
తామే అశ్వ్యానాం హరీణాం నితోశనా ।
ఉతో ను కృత్వ్యానాం నృవాహసా ॥ **(8-25-23)**

9. **భురిక్: 8+10+7=25** అక్షరాలు.
విద్వాంసా విద్దురః పృచ్ఛేదవిద్వానిత్థాపరో అచేతాః ।
నూ చిన్ను మర్తే అక్రౌ ॥ **(1-120-2)**

10 **భురిక్ పదపంక్తి: 5+5+5+5+6=26** అక్షరాలు.
ఘృతం న పూతం, తనూరరేపాః శుచి హిరణ్యమ్ ।
తత్తే రుక్మో న, రోచత స్వధా వః ॥ **(4-10-6)**

2. **ఉష్ణిక్ మూడుపాదాలు: 8+8+12=28** అక్షరాలు.
అగ్నే వాజస్య గోమత, ఈశానః సహసోయహో ।
అస్మే ధేహి జాతవేదో మహిశ్రవః ॥ **(1-79-4)**

1. **కకుమ్న్యంకుశిరా - నిచృత్: 11+12+4=27** అక్షరాలు.
దదీ రేక్ణస్తన్వే దదిర్వసు దదిర్వాజేషు పురుహూత వాజినమ్।
నూన మథ **(8-46-15)**

2. **కకుప్: 8+12+8=28** అక్షరాలు.
యుష్మాకం స్మా రథాం అను, ముదే దధే మరుతో జీరదానవః।
వృష్టీ ద్యావో యతీరివ ॥ **(5-53-5)**

3. **పురఉష్ణిక్: 12+8+8=28** అక్షరాలు.
తచ్చక్షుర్దేవహితం శుక్రముచ్చరత్ ।
పశ్యేమ శరదః శతం, జీవేమ శరదః శతమ్ ॥ **(7-66-16)**.

4. **పిపీలికామధ్యా: 11+6+11=28** అక్షరాలు.
హరీ యస్య సుయుజా వివ్రతా వేరర్వం తాను శేపా ।
ఉభా రజీ న కేశినా పతిర్దన్ ॥ (10-105-2)

5. **తనుశిరా: 11+11+6=28** అక్షరాలు.
ప్ర యా ఘోషే భృగ వాణే న శోభే,
యయా వాచా యజతి పజ్రియో వామ్ ।
ప్రైషయుర్న విద్వాన్ ॥ (1-120-5)

6. **అనుష్టుప్‌గర్భా: 5+8+8+8=29** అక్షరాలు.
పితుం ను స్తోషం మహో ధర్మాణం తవిషీం ।
యస్య త్రితో వ్యోజసా వృత్రం విపర్వ మర్దయత్॥(1-187-1)

3. **అనుష్టుప్: 4** పాదాలు. **8+8+8+8=32** అక్షరాలు.
సం గచ్ఛధ్వం సం వదధ్వం, సం వో మనాంసి జానతామ్ ।
దేవా భాగం యథాపూర్వే, సంజానానా ఉపాసతే ॥ (10-191-2)

1. **కావిరాట్: 9+12+9=30** అక్షరాలు.
తా విద్వాంసా హవామహే వాం,
తా నో విద్వాంసా మన్మవో చేతమద్య ।
ప్రార్చద్దయమానో యువా కుః ॥ (1-120-3)

2. 1. **విరాట్: 10+10+10=30** అక్షరాలు.
శ్రుధీ హవం విపిపానస్యాద్రే
ర్బోధాః విప్రస్యార్చతో మనీషామ్ ।
కృష్వా దువాంస్యంతమా సచేమా ॥ (7-22-4).

2. 2. **విరాట్: 11+11+11=33** అక్షరాలు.
అగ్న ఇంద్రశ్చ దాశుషో దురోణే.
సుతావతో యజ్ఞమిహోపయాతమ్ ।
అమర్ధంతా సోమపేయాయ దేవా ॥ (3-25-4)

3. **మహాపదపంక్తి:** 6 పాదాలు. **5+5+5+5+5+6=31** అక్షరాలు.
తవ స్వాదిష్ఠాగ్నే, సం దృష్టి రిదా, చిదహ్నఇదా చిదక్తోః ।
శ్రియే రుక్మో న, రోచత ఉపాకే ॥ (4-10-5)

4. **నిచృత్:** 4 పాదాలు **8+8+8+7=31** అక్షరాలు.
ఋతావానం విచేతసం, పశ్యంతో ద్యామివ స్తృభిః ।
విశ్వేషా మధ్వరాణాం హస్కర్తారం దమే దమే ॥ (4-7-3)

5. **నష్టరూపి: 9+10+13=32** అక్షరాలు
వి పృచ్ఛామి పాక్యా న దేవా న్వషట్ కృతస్యాద్భుతస్య దస్రా ।
పాతం చ సహ్యసో యువం చ రభ్యసో నః ॥ (1-120-4)

6 **కృతి: 12+12+8=32** అక్షరాలు.
మా కస్మై ధాతమభ్యమిత్రిణే నో
మా కుత్రా నో గృహేభ్యో ఘేనవో గుః ।
స్తనాభుజో అశిశ్వీః ॥ (1-120-8)

7. **పిపీలికామధ్యా: 12+8+12=32** అక్షరాలు.
పర్యూ షు ప్ర ధన్వ వాజసాతయే పరి వృత్రాణి సక్షణిః ।
ద్విషస్తరధ్యా ఋణయా న ఈయసే ॥ (9-110-1)

4. **బృహతి:** 4 పాదాలు. **8+8+12+8=36** అక్షరాలు.
ఆఘాయోషేవ సూనర్యుషా యాతి ప్రభుంజతీ ।
జరయంతీ వృజనం పద్వదీయత ఉత్పాతయతి పక్షిణః ॥
(1-48-5)

1. **పిపీలికామధ్యా: 13+8+13=34** అక్షరాలు.
అభి వో వీరమంధసో మదేషు గాయ, గిరా మహా విచేతసం।
ఇంద్రం నామ శ్రుత్యం శాకినం వచో యథా ॥ (8-46-14)

2. **ఊర్ధ్వబృహతి: 12+12+12=36** అక్షరాలు.
అజీజనో అమృత మర్త్యేష్వాం
ఋతస్య ధర్మన్నమృతస్య చారుణః ।
సదా సరో వాజమచ్ఛా సనిష్యదత్ ॥ (9-110-4)

3. **పురస్తాత్: 12+8+8+8=36** అక్షరాలు.
అధీ న్న్వత్ర సప్తతిం చ సప్త చ ।
సద్యో దిదిష్ట తాన్వః, సద్యో దిదిష్ట పార్థ్యః,
సద్యో దిదిష్ట మాయవః ॥ (10-93-15)

4. **ఉపరిష్టాత్: 8+8+8+12=36** అక్షరాలు.
న త మంహో న దురితం, దేవాసో అష్టమర్త్యం ।
సజోషసో యమర్యమా, మిత్రో నయంతి వరుణో అతిద్విషః॥
(10-126-1)

5. **న్యంకుసారిణి /స్కందగ్రీవీ/ఉరోబృహతి: 8+12+8+8=36** అక్షరాలు
ఈజానమిద్ ద్యౌర్గూర్తా, వసురీజానం భూమి రభి ప్రభూషణి ।
ఈజానం దేవావశ్వినా వభి సుమ్నైరవర్ధతా ॥ (10-132-1)

6. **విస్తార: 8+10+10+8=36** అక్షరాలు.
యువం హ్యాస్తం మహోరన్యువం వా యన్నిరత తం సతమ్।
తా నో వసూ సుగోపా స్యాతం పాతం నో వృకాదఘాయోః॥
(1-120-7)

7. **విషమపదా: 9+8+11+8=36** అక్షరాలు.
సనితః సుసనితరుగ్ర, చిత్ర చేతిష్ఠ సూనృత ।
ప్రాసహో సమ్రాట్ సహురిం స హంతం,
భుజ్యాం వాజేషు పూర్వ్యమ్ ॥ **(8-46-20)**

[redacted]. **బృహతి: (8+8+12+8)** సతోబృహతి **(12+8+12+8)**
ఒకదాని వెంట ఒకటి జంటలుగా ఉంటే 'ప్రాగాథ' అనబడుతుంది.
**ఉదా॥ 7-81-1,2,3,4,5,6. 7-96-1,2.** ఇట్టి ప్రాగాథలు **8** వ
మండలంలో ఎక్కువగా ఉన్నాయి.

**5. పంక్తి: 4** పాదాలు **12+8+12+8=40** అక్షరాలు
యం త్వా దేవాసో మనవే దధురిహ
యజిష్ఠం హవ్యవాహన ।
యం కణ్వో మేధ్యాతిథిర్దనస్పృతం
యం వృషా యముపస్తుతః॥ **(1-36-10)**
దీన్ని సతఃపంక్తి అంటారు.

1. **విరాజ్: 10X4=40** అక్షరాలు.
మన్యే త్వా యజ్ఞియం యజ్ఞియానాం
మన్యే త్వా చ్యవన మచ్యుతానామ్ ।
మన్యే త్వా సత్వనా మింద్ర కేతుం
మన్యే త్వా వృషభం చర్షణీనామ్ ॥ **(8-96—4)**

2. **విపరీతసతోబృహతి: 8+12+8+12=40** అక్షరాలు.
య ఋష్వః శ్రావయత్సఖా విశ్వేత్స వేద జనిమా పురుష్టుతః।
తం విశ్వే మానుషా యుగేంద్రం హవం తే తవిషం యతస్రుచః॥
**(8-46-12)**

3. **ఆస్తార: 8+8+12+12=40** అక్షరాలు.
అగ్నిం న స్వవృక్తిభి
ర్హోతారం త్వా వృణీమహే ।
యజ్ఞాయస్తీర్ణ బర్హిషే వి వో మదే
శీరం పావకశోచిషం వివక్షసే ॥ (10-21-1)

4. ప్రస్తార: 12+12+8+8=40 అక్షరాలు
ఉత నో దేవా వశ్వినా శుభస్పతీ
ధామభిర్మిత్రావరుణా ఉరుష్యతామ్ ।
మహః స రాయ ఏష తేఽతి ధన్వేవ దురితా ॥ (10936)

5. సంస్తార: 12+8+8+12=40 అక్షరాలు.
పితు భృతో న తంతుమి త్సుదానవః ప్రతి ధధ్మో యజామసి।
ఉషా అప స్వసుస్తమః సం వర్తయతి వర్తనం సుజాతతా॥
(10-172-34)

6. విస్తార: 8+12+12+8=40 అక్షరాలు.
అగ్నే తవ శ్రవో వయో
మహి భ్రాజంతే అర్చయో విభావసో ।
బృహద్భానో శవసా వాజముక్థ్యం
దధాసి దాశుషే కవే ॥ (10-140-1)

7. పథ్యాపంక్తి: 5 పాదాలు 8X5=40 అక్షరాలు.
మాదయస్వ సుతే స చా శవసే శూర రాధసే ।
విద్మా హి త్వా పురూ వసుముప కామాన్ త్ససృజ్మహే
ఽథా నోఽ వితా భవ ॥ (1-81-8)

6. త్రిష్టుభ్: 4 పాదాలు. 4X11=44 అక్షరాలు.
యో జాత ఏవ ప్రథమో మనస్వాన్
దేవో దేవాన్ క్రతునా పర్యభూషత్ ।
యస్య శుష్మాద్రోదసీ అభ్యసేతా
నృమ్ణస్య మహ్నా స జనాస ఇంద్రః ॥ (2-12-1)

1. **ఏకపదా: 11** అక్షరాలు.
అసిక్న్యాం యజమానో న హోతా **(4-17-15)**

2. **ద్విపదా: 2X11=22** అక్షరాలు.
అగ్నే భవ సుషమిధా సమిద్ధ,
ఉత బర్హిరుర్వియా విస్తృణీతామ్ ॥ **(7-17-1)**

3 **విరాట్: 4** పాదాలు. అక్షరాలక్రమం లేదు. **42** అక్షరాలు.
ఆ కృష్ణేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యం చ।
హిరణ్యయేన సవితా రథేనా దేవో యాతి భువనాని పశ్యన్॥
**(1-35-2)**

4. **నిచృత్: 4** పాదాలు. అక్షరక్రమం లేదు. **43** అక్షరాలు.
బ్రహ్మణస్పతే త్వమస్య యంతా
సూక్తస్య బోధి తనయం చ జిన్వ ।
విశ్వం తద్భద్రం యదవంతి దేవా
బృహద్వదేమ విదథే సువీరాః ॥ **(2-23-19)**

5. **అభిసారిణి: 10+10+12+12=44** అక్షరాలు.
యో వాచా వివాచో మృధ్రవాచ
పురూ సహస్రా శివా జఘాన ।
తత్తదిదస్య పౌంస్యం గృణీమసి
పితేవ యస్తవిషీం వావృధే శవః ॥ **(10-23-5)**

6 **విరాట్పూర్వా / పంక్త్యుత్తరా: 10+10+8+8+8=44** అక్షరాలు.
ఏవేంద్రాగ్నిభ్యా మహావి హవ్యం
శూష్యం ఘృతం న పూతమద్రిభిః ।
తా సూరిషు శ్రవో బృహద్రయిం గృణత్సు దిధృత
మిషం గృణత్సు దిధృతమ్ ॥ **(5-86-6)**

7. **మహాబృహతి:** 8+8+12+8+8=44 అక్షరాలు.
బృహద్భిరగ్నే అర్చిభిః, శుక్రేణ దేవ శోచిషా ।
భరద్వాజే సమిధానో యవిష్ఠ్య,
రేవన్నః శుక్ర దీదిహి ద్యుమత్పావక దీదిహి ॥ (6-48-7)

8. **భురిక్:** 4 పాదాలు. అక్షరక్రమం లేదు. 45 అక్షరాలు.
బృహస్పతే అతి యదర్యో
అర్హాద్ద్యుమ ద్విభాతి క్రతుమజ్జనేషు ।
యద్దీదయచ్ఛవస ఋతప్రజాత
తదస్మాసు ద్రవిణం ధేహి చిత్రమ్ ॥ (2-23-15)

9. **స్వరాట్:** 4 పాదాలు. అక్షరక్రమం లేదు. 46 అక్షరాలు
ధామన్ తే విశ్వం భువనమధిశ్రిత
మంతః సముద్రే హృద్యంతరాయుషి ।
అపామనీకే సమిధే య ఆభృత
స్తమశ్యామ మధుమంతం త ఊర్మిమ్ ॥ (4-58-11)

7. **జగతి:** 4 పాదాలు 12+12+12+12=48 అక్షరాలు.
గణానాం త్వా గణపతిం హవామహే,
కవిం కవీనాముపమ శ్రవస్తమం ।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత,
ఆ నః శృణ్వన్నూతిభిః సీద సాదనమ్ ॥ (2-23-1)

1. **ఉపజగతి:** 12+12+11+11=46 అక్షరాలు.
సో చిన్ను వృష్టిర్యూథ్యా స్వా సచాం ఇంద్రః
శ్మశ్రూణి హరితాభిప్రుష్ణుతే ।
అవ, వేతి సుక్షయం సుతే మధూదిద్,
ధూనోతి వాతో యథా వనమ్ ॥ (10-23-4)

2. **విరాట్: 4** పాదాలు. అక్షరక్రమం లేదు. **46** అక్షరాలు.
దేవాశ్చిత్తే అసుర్య ప్రచేతసో
బృహస్పతే యజ్ఞియం భాగమానశుః ।
ఉస్రా ఇవ సూర్యో జ్యోతిషా మహో
విశ్వేషామిజ్జనితా బ్రహ్మణామసి ॥ **(2-23-2)**

3. **నిచృత్: 4** పాదాలు అక్షరక్రమం లేదు. **47** అక్షరాలు.
అవిబాధ్యా పరిరాపస్తమాంసి చ
జ్యోతిష్మంతం రథమృతస్య తిష్ఠసి ।
బృహస్పతే భీమ మమిత్ర దంభనం
రక్షోహణం గోత్రభిదం స్వర్విదమ్ ॥ **(2-23-3)**

4. **మహాపంక్తి: 6** పాదాలు. **8X6=48** అక్షరాలు.
మహి వో మహతామ వో వరుణ మిత్ర దాశుషే ।
యమాదిత్యా అభిద్రుహో రక్షథానేమఘం నశ
దనేహసో వ ఊతయః
సు ఊతయో వ ఊతయః ॥ **(8-47-1)**

5 **మహాసతో బృహతి: 5** పాదాలు అక్షరక్రమం లేదు.
**12+12+8+8+ 8=48** అక్షరాలు..
ఆ యః పప్రౌ భానునా రోదసీ ఉభే ధూమేన ధావతే దివి।
తిరస్తమో దదృశ ఊర్మ్యాస్వా శ్యావా
స్వరుషో వృషా శ్యావా అరుషో వృషా ॥ **(6-48-6)**

ఈ విధంగా ఋగ్వేదకాలంనాటికే ఛందస్సులో, కావ్యరచనా కళలో ఎంతో వైవిధ్యం, అభివృద్ధి గోచరిస్తున్నాయి.

**- కె.వి.ఆర్.**

# 1.8 వైశిష్ట్యం

పవిత్రమైన ఋగ్వేదం ఇంకా ఇతరవేదగ్రంథాలు ఆ పరమపురుషుని నిశ్వాసరూపాలని **'అరేఽస్య మహతో భూతస్య నిశ్వసితమే తద్యద్ ఋగ్వేదః'** అని బృహదారణ్యకోపనిషత్తులో **(IV-5.11)** మనం చదువుతున్నాం. ఇతర వేదాల్లాగానే ఋగ్వేదం కూడా దోషరహితమైంది. అనాదియైన జ్ఞానాన్ని మనకందించే మహాగ్రంథం. ఇది మానవులచే రచింపబడలేదని **(అపౌరుషేయం)** భగవంతునిచే ఇవ్వబడిందని ప్రాచీనవైదిక సంప్రదాయం అభిప్రాయపడుతోంది వైదిక ఋషికవుల అనుభూతికి గోచరించిన దివ్యవాణి ఇది. ప్రపంచాన్ని సృష్టించి మానవజాతిని కొన్ని నియమాలతో **(10-90-16)** నడిపించిన భగవంతునితో ఈ మహర్షులు తమ ప్రార్థనలద్వారా చాలా సన్నిహిత సంబంధం కలవారు పద్యరూపంలో ఆవిష్కరింపబడ్డ సత్యమే ఈ వేదం. ఇది ఉదాత్తం, అనుదాత్తం, స్వరితం అనే మూడు ముఖ్యస్వరాలతో ఉచ్చరింప బడుతోంది.

వైదికసంప్రదాయాన్ననుసరించి ఇది అష్టకాలుగాను మండలాలుగాను విభజింపబడుతోంది. బహ్వృచుల గ్రంథాలతో సంబంధం లేకుండానే ఐతరేయ - కౌషీతకీబ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, అశ్వలాయన గృహ్య - శ్రౌత ధర్మసూత్రాలు, ఇవన్నీ కలిసిన ఋగ్వేదవాఙ్మయం విస్తీర్ణమై, సువిశాలమై, హిందూధర్మాన్ని అంచనావేయడంలో చాలా ముఖ్యమైన స్థానాన్ని ఆక్రమిస్తున్నది

ఋగ్వేదం చాలా ప్రాచీనం, విస్తీర్ణమైన విజ్ఞానానికి మూలం గ్రంథం కావడంవల్ల సామవేదానికి **(95 శాతం)** యజుర్వేదానికి **(25 శాతం)** అథర్వవేదానికి **(20 శాతం)** కూడా ముఖ్యమైన ఆధారం కాగలిగింది.

సంసారసాగరాన్ని దాటి, ఇంద్రియనిగ్రహంతో అతీంద్రియజ్ఞానాన్ని పొంది ద్రష్టలైన మహర్షులు[1] భగవదనుగ్రహంవల్ల అనుభూతిని పొంది ఉచ్చరించినవే మంత్రరూపంలో ఉన్న ఈ స్తుతులని ఇంతకు పూర్వమే చెప్పబడింది.

ఋగ్వేదసూక్తాలద్వారా వారు దర్శించి లోకానికందించిన సత్యం ఏమిటి? ఈ మహాత్ములు (**విప్రాః కవయః**) ఒకే ఒక సత్పదార్థం అనేకరూపాలలో వర్ణింపబడ్డట్లు విజయోత్సాహంతో ప్రకటించారు. పరబ్రహ్మను అగ్ని, యముడు, మాతరిశ్వ (**1-164-46**) ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు, సుపర్ణమనే ఒక పక్షిగా సంకేతం చేయబడ్డ ఒక దివ్యశక్తి అని వారు పిలిచారు (**10-114-5**). ఆనందపరవశులైన ఆ ద్రష్టలు ఒకే ఒక దివ్యపక్షిగా అతన్ని ఎన్నో రకాలుగా దర్శించారు. ఒకే ఒక అగ్ని రాజేయబడి పెరుగుతున్నాడు. ఒకే ఒక సూర్యుడు ప్రతివాడికి కనబడుతున్నాడు, ఒకే ఉషస్సు లోకాన్నంతా ప్రకాశింపజేస్తున్నది. ఆ ఒక్క పరబ్రహ్మ ఈ లోకంగా పరిణమిస్తున్నది (**8-58-2**).

ఏయే రూపాలో భగవంతుణ్ణి మనం తెలుసుకుంటున్నామో ఆపేర్లే ఆయనకు పెట్టబడ్డాయనే సిద్ధాంతాన్ని ఋగ్వేదం గట్టిగా అంగీకరిస్తున్నది[2].

1. సాయణాచార్యుడు దీన్ని ఋగ్వేద సంహితాభాష్యంలో ఉపోద్ఘాత ప్రకరణం (ఋ.సం.**1-32**) లోనే ఇలా వివరించాడు తదా అతీంద్రియస్య వేదస్య పరమేశ్వరానుగ్రహేణ ప్రథమతో దర్శనాత్ ఋషిత్వమ్ ఇతి ..ఋషి అంటే తపస్సంపన్నుడై అతీంద్రియపదార్థదర్శనం చేయగల ద్రష్ట అతడికే పరబ్రహ్మ తన సాక్షాత్కారాన్ని కలిగిస్తాడు ఋగ్వేదంలో ఋషితత్త్వాన్ని గ్రహించడానికి 'తపస్సు' అనే పదం ఎంతో ఉపయోగిస్తుంది ఇది ఋషిని తగ్గుస్థాయినుండి మహోన్నతస్థానానికి చేరుస్తుంది (**10-109-4**).
2. చూ హెర్మెస్ (**Hermes**) ``ఈ పేరన్నీ ఏపేరు లేని ఆ పరమాత్మవే, అందువల్లనే అతడు వారందఱికి తండ్రి" ఇలా ఆనందకుమారస్వామిచే పేర్కొనబడింది 2. పరిశోధనపత్రాలు. పె **67**. అధోజ్ఞాపిక. **6**. పె.**116** అజ్ఞా **2 (Princeton 1977)**.

ఆ పరతత్త్వం సచేతనం అచేతనం **(10-12-9)**; సత్పదార్థం అసత్పదార్థం కూడా **(10-5-7)**. అతడే భూమండలాన్ని తూర్పునుంచి పశ్చిమం వఱకు ఆక్రమించిన యజ్ఞపురుషుడు **(10-90-5)**. భగవంతుడు మానవశరీరంలో నివసించడంవలన పురుషుడనబడుతున్నాడు[1]. ఒక పక్షిలాగా ఆయన పురాలన్నిటిలో పొరుడుగా ఉన్నాడు (**సర్వాసు పూర్షు పురిశయః**). అందువల్లనే ఆతడు సార్థకమైన పురుషశబ్దంతో పిలవబడుతున్నాడు (బృ ఉ. **2-5-18**). అదేవిధంగా భగవత్సా మ్రాజ్యాన్ని లోపల ఇముడ్చుకొని ఉన్నమానవుడు కూడా పురుషుడని వ్యవహరింపబడుతున్నాడు.

ఆ పరమపురుషుని ప్రభావాన్ని లోకానికి తెలియజేయడానికే ఋగ్వేదసంస్కృతి యజ్ఞవ్యవస్థను ప్రవేశపెట్టింది విశ్వమానవ కల్యాణంకోసం ఆత్మసమర్పణం చేసుకోవడమే యజ్ఞభావనలోని ప్రధానతాత్పర్యం అహివృత్రుడు ఇంద్రునిచేత చంపబడటం అనే సాంకేతికసంఘటన ఒక జీవిపై ఇంకోజీవి ఆధిక్యతను తెలియ జేస్తున్నది. అగ్నిహోత్రయాగం చేసినవాడు తనలోని లోభం, దురాశ మొ॥ దుర్గుణాలను అణచి, మోహాన్ని కోపాన్ని తగ్గించుకుంటాడు యాగశాలలో చేరిన ప్రజలందరు పరస్పర సహకారభావాన్ని పెంచుకోవాలని ఉపదేశించడమే ఈ యజ్ఞప్రక్రియ ప్రధానోద్దేశ్యం తమలో అంతర్యామిగా ఉన్న భగవంతుని తెలుసుకోవడంద్వారా అందఱు తప్పక ఒకటౌతారనే సత్యాన్ని ప్రతివారు ఈ యజ్ఞంవల్ల తెలుసుకోగలుగుతారు.

ఋగ్వేదంలోని ధార్మిక - సాంఘిక - తాత్త్విక సూక్తాలలోని సూక్ష్మాంశాధ్యయనం నిర్వివాదంగా ఒక ఆదర్శసిద్ధాంతాన్ని మనకు తెలియజేస్తుంది ఒక్కటే అయిన పరబ్రహ్మకు ఎందఱో అయిన

1 అదే హృదయాంతర్గుహ. దానినే బ్రహ్మపురమంటారు.

జీవులకు మధ్యలో ఉన్న సంబంధరూపమే వైదికభావనామయమైన ▩ సిద్ధాంతం. `**విశ్వం ఏకమ్**' (3-54-8) `**విశ్వం సత్యమ్**' (2-24-12) `కృణ్వన్తో విశ్వమార్యమ్' (9-63-5) మొ॥ ఋగ్వేదవాక్యాలలో ఈ స్వభావాన్ని మనం పరిశీలించవచ్చు. నిజంలాగా కనబడుతున్న భిన్నత్వంలోని ఏకత్వాన్ని ఈ ఆదర్శసిద్ధాంతం తెలియజేస్తున్నది జాతినిర్మాతలు లోకంలోని ప్రతిపౌరుణ్ణి చక్కని వ్యక్తిత్వం గలవాణ్ణిగా తయారుచేయడానికి కృషిచేయాలి. ఈ విశ్వసత్యాన్నిబోధించే గ్రంథాలలో ఋగ్వేదం ప్రపంచంలోనే మొట్టమొదటిదనడం అతిశయోక్తి కాదు

విశ్వమానవకల్యాణం కోసం ఋగ్వేదద్రష్టలు ఈనాటి హిందూసాంఘిక-ధార్మిక - అధ్యాత్మికభావనా స్వరూపంగల ముఖ్య సిద్ధాంతమైన భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించి, ఆచరించి, బోధించారు. ఇది కేవలం వారికి ఋతతత్త్వం[1] పైన ఉన్న విశ్వాసం వల్లనే జరిగింది ఈ `**ఋతం**' అవెస్తాలోని **అశ** తో పోల్చబడింది. ఋతశబ్దాన్ని ఇలా మూడువిధాలుగా వ్యాఖ్యానించారు. 1.యజ్ఞప్రకియ (సత్యం, జలం, రాశిచక్రం) 2. విశ్వక్రమం, 3. ప్రపంచంయొక్క సమమైన సత్యమైన నడకకు సంబంధించిన నైతికక్రమం ఇందులో మూడవదానివల్ల నైతికాదర్శాలకు ఆచరణకు ఒక చక్కని సమన్వయం కుదురుతుంది. ఋతం కలిగి, ఋతాన్ని నిలబెట్టి, ఋతాన్ని కలిగించే దేవతలు తేజస్సును, సత్యాన్ని వ్యాపింపచేయడానికి, అంధకారాన్ని, దౌర్జన్యాన్ని పారద్రోలడానికి సమష్టితిద్వారా విశ్వక్రమాన్ని కాపాడడానికి వెడుతున్నారని ఋగ్వేదంలో మనం తరచుగ చదువుతుంటాం. ఈ దేవతలు మానవుల అంతరంగాలలో ఉండే

---

1. వైదిక 'ఋతం' అవెస్తాలో 'అశ' నుగురించిన వివరాలకు చూ **Anna Radicchı, Confronti Gathico - Rigvedichı Asa-Rta(Fıxenze 1961-2).**

ఆలోచనలు గ్రహించి, మంచివారికి-చెడ్డవారికి (2-27-3) ధార్మికులకు-అధార్మికులకు కపటులకు-నిష్కపటులకు నిజాయితీపరులకు-మోసగాళ్లకు (8-18-15) మధ్య ఉండే తేడాను గుర్తిస్తారు.

ఋతాన్ని లోకంలో విధించడమే వరుణునికి ఆదిత్యులకు స్వధర్మం. వరుణుడు రక్షకుడు, దయామయుడు, మంచిప్రవృత్తికల దేవత. ఆదిత్యసూక్తాలు వరుణుని మోక్షప్రణాళికను ఒక నైతిక మార్గంలో వివరిస్తున్నాయి. మనలోని తేజస్సును లేక భగవత్సామ్రాజ్యరూపమైన అభయమైన జ్యోతిస్సును అవగాహన చేసుకోవడమే (2-27-11) ఆ మార్గం. ఈ ప్రక్రియలో మనం నీతిమార్గంతో ప్రారంభమై ఏకదేవతావాదంతో పూర్తయ్యే ఉన్నతమైన నీతిరసాస్వాదం చేస్తున్నాం.

హిందూధర్మంలోని ధర్మతత్త్వానికి పునాదియైన ఋతమనే ఆదర్శంతోపాటు, ఆధ్యాత్మికతత్త్వాలైన బ్రహ్మ, ఆత్మ, మాయ, కర్మ, పునర్జన్మ మొదలైన విషయాలను కూడా ఋగ్వేదసూక్తలలో మనం గుర్తించవచ్చు. నేటి హిందూతత్త్వశాస్త్రానికి మూలసిద్ధాంతాలు ఋగ్వేదంలోని పదవమండలంలో విశేషంగాను, ఇతరమండలాల్లో సామాన్యంగాను కనబడుతున్నాయి. ఆగమశాస్త్రాలలో ప్రతిపాదింపబడే బింభారాధనాన్ని కూడా ఋగ్వేదంలోని ఆయా దేవతల అవయవ సన్నివేశవర్ణనలద్వారా మనం తెలుసుకోవచ్చు. ఋగ్వేదసంహితలోని **దివోనరః** 'నృపేశసః' మొదలైన విశేషణాలు, అది పరోక్షంగా సాకారసిద్ధాంతాన్ని (2-33-9; 1-25-13; 5-52-15) ప్రతిపాదిస్తున్నదనుకోవడానికి మూలం.

భారతీయులకు అత్యంత పవిత్రగ్రంథమైన ఋగ్వేదంలో కనబడే ఆకర్షణీయమైన సామెతలద్వారా ప్రపంచవిజ్ఞానానికి ఋగ్వేదంచేసిన ఉపకారం ఎలాంటిదనే విషయాన్ని మనం తెలుసుకోవచ్చు.

(అ) నేను మట్టితో కట్టిన ఇంట్లోకి ఎప్పుడు పోకుందునుగాక! ఓ సార్వభౌమా! వరుణా! మాకు సంతోషాన్ని అనుగ్రహించు (7-89-1).

(ఆ) కన్నులున్నవాడే లోకాన్ని చూడగలుగుతాడు, గుడ్డివాడు చూడలేడు (1-64-16).

(ఇ) శాంతికరమైన బహుమతు (హవిస్సు) లిచ్చేవాడు అమరత్వాన్ని పొందుతాడు(1-125-6).

(ఈ) ప్రార్థనే నాకు ముఖ్యకవచం (6-75-19).

(ఉ) మంచిమార్గంలో నడిచే దేవతల అనుగ్రహపాత్రులే, లోకంలో ప్రశంసించబడే మహాత్ములు (1-89-2).

ఇలాంటివి ఋగ్వేదంలో కొల్లలుగా ఉన్నాయి. ఇంతెందుకు నిజంగా ఋగ్వేదం జ్ఞానానికి, ప్రతిభకు ఒక పెన్నిధిలాంటిది.

ఋగ్వేదసంహిత కేవలం హిందూధార్మిక - ఆధ్యాత్మిక భావనలకే ఉపకారం చేయలేదు. హిందూసమాజ నిర్మాణానికి కూడా ఎంతో ఉపకరించింది ఋగ్వేదసంహితలో వర్ణింపబడ్డ సాంఘిక జీవనవిధానాన్ని అర్థం చేసుకోకుండా ఈనాటి సమాజాన్ని అర్థంచేసుకోవడం సాధ్యంకాని విషయం. ఎందువల్లనంటే ప్రజలవలంబించే అనేక వృత్తులు (వ్యవసాయం, చేనేత, పశురక్షణ, నౌకనిర్మాణం మొ॥), పితృప్రధానమైన కుటుంబవ్యవస్థ, స్త్రీపురుషుల సమానత్వం, శ్రమపడటంలోని గౌరవం, కళాపోషణ, సుస్థిర సమాజనిర్మాణం (10-173-5), ఉన్నతభావనలతో, ఆచరణలతో, దౌర్భాగ్యాన్ని, దారిద్ర్యాన్ని నిర్మూలించడం (10-155-1) - ఈ లక్షణాలే ఆనాటి సంఘంలో అడుగడుగునా కనబడతాయి. ఈ లక్షణాలే ఈనాటి హిందూసమాజానికి కూడా అవసరమైనవికావా?

ఋగ్వేదసాహిత్యం హిందూధర్మానికి, వేదాంతానికి, ధర్మ శాస్త్రానికి, కళలకు, భౌతికశాస్త్రాలకు, సామాజికసంస్థలకు మూలాధారమైన ఒక నీటిబుగ్గలాంటిది. హిందూధర్మంలో ఋగ్వేదం ఒక సజీవమైన వారసత్వం పునర్నిర్మితమైన వైదికధర్మమే హిందూధర్మం. ఋగ్వేదంలోని ముఖ్యసిద్ధాంతాలు అంతరించిపోలేదు సనాతన ధర్మాన్ని నిలబెట్టిన ఇతిహాసపురాణాల్లో, ఆగమాల్లో, ఇతరమతాల్లో, ధర్మవేదాంతగ్రంథాల్లో తగిన ప్రమాణంలో అవి భద్రపరచబడ్డాయి. కాబట్టి ప్రాచీన, ఆధునిక విజ్ఞానాల మేలుకలయికతో నవభారత సౌధనిర్మాణానికి ఉపయోగించే పునాదిని ఋగ్వేదసాహిత్యం మనలో తప్పక వేస్తుందని ఆశించడంలో తప్పేముంది?

**- ఎమ్.డి.బి.**

# 1. 9 మతం - తత్త్వం

ఋగ్వేదసంహిత చాలా ప్రాచీనమైంది. **'ఋక్కు'** అంటే దేవతలనుద్దేశించి చేయబడిన **'ప్రార్థన'** అని అర్థం. ఆర్షకవులనేకులు దివ్యమైన ఆవేశంతో వివిధదేవతల నుద్దేశించి **'దర్శించిన'** ప్రార్థనల సంకలనమే ఋగ్వేదమని చెప్పవచ్చు.

ప్రతివేదంలోను సంహిత, బ్రాహ్మణం, ఆరణ్యకం అనే భాగాలున్నాయి. వీటికి కర్మకాండ అని కూడ వ్యవహారమున్నది. యజ్ఞయాగాద్యాచరణానికి సంబంధించిన విషయాలను తెలపడంవల్ల కర్మకాండమని ఈ భాగానికి పేరు సార్థకమౌతున్నది ఇదీగాక ఆధ్యాత్మిక విషయాలను తెలిపే భాగంకూడా ఉన్నది. దీనికి ఉపనిషత్తు (రహస్యం) అని పేరు వేదాలకు చివర రావడంచేత దీనికి **'వేదాంతం'** అని కూడా పేరు

## మతం

ఋగ్వేదంలో ముఖ్యంగా అనేక దేవతలను గూర్చిన ప్రార్థనలు ఉన్నాయని ముందే తెలుసుకున్నాం అందువల్ల ఋగ్వేదం ఎందఱో దేవతలను ప్రతిపాదిస్తుందనుకోకూడదు అగ్ని, వరుణుడు, ఇంద్రుడు, సూర్యుడు, ఉషస్సు, రుద్రుడు మొ॥ దేవతలరూపంలో పరమాత్ముడు ఆయా ఋషులకు దర్శనమిచ్చాడని మాత్రమే తాత్పర్యం. **`ఏకం సద్ విప్రా బహుధా వదన్తి'** (ఋ.సం.**1-164**) 'తత్త్వమొక్కటే. కాని విజ్ఞులు దాన్ని అగ్ని, యముడు, వరుణుడు, వాయువు అనే విభిన్న నామాలతో పిలుస్తారు' అని ఋగ్వేదమే ప్రతిపాదిస్తున్నది.

ఋగ్వేదంలో చెప్పబడింది అద్వైతమా? ద్వైతమా? విశిష్టాద్వైతమా? అనే ప్రశ్నకు తావు లేదు. ఈ మతాలకు ప్రోద్బలకాలైన అంశాలు వేదాంతాలని చెప్పబడే ఉపనిషత్తుల్లో ప్రధానంగా

గోచరిస్తున్నాయి కాని వీటికి మూలాలని చెప్పదగిన **'బ్రహ్మ'** **'ఆత్మ'** **'కర్మ'** మొ॥ భావనలు ఋగ్వేదంలో ఉన్నాయని చెప్పక తప్పదు. **'బ్రహ్మ'** (నపుంసక లింగశబ్దం) అనే పదం ఋగ్వేదంలో తరచుగా **'మంత్రం'** **'ప్రార్థన'** అనే అర్థాలలో ప్రయుక్తమైంది. మంత్రాలలో ఉన్న ప్రభావమే క్రమంగా విశ్వప్రపంచానికి **'ఆత్మ'** అనే భావానికి దారి తీసిందని చెప్పవచ్చు. **'ఆత్మ'** అనే పదం ఋగ్వేదంలో ప్రాణం, వాయువు, ఇప్పుడు ప్రసిద్ధమైన ఆత్మ అనే అర్థాలలో ఉపయోగించబడింది. **'మాయ'** అనే పదం **'అద్భుతశక్తి'** అనే అర్థంలో వాడబడింది. అలాగే **'కర్మ'** అనే పదం 'పని' **'యాగాదిక్రియ'** అనే అర్థాలలో వాడబడింది. కాని, **'కర్మఫలం'** అనే అర్థం ఎక్కడా లేదు. **'ఇష్టాపూర్తం' (10-14-8)** అనే శబ్దానికి 'మన మీ జన్మలో చేసిన యజ్ఞదానాదిక్రియలకు, ముందు జన్మలో కలుగబోయే ఫలం' అనే అర్థం మాత్రం ఉంది. ఇదే కర్మసిద్ధాంతానికి సూచకమని చెప్పచ్చు. **'పునర్జన్మ'** అనే పదం 'సంసారంలో తిరిగి పుట్టడం' అనే అర్థంలో ఉపయోగించబడలేదని చెప్పవచ్చు కాని ఉషస్సును ఉద్దేశించిన సూక్తంలో **'పునః పునర్జాయమానా'** అనీ **(1-92-10)**, చంద్రుని గురించి చెప్పేచోట **'నవో నవో జాయమానః'** **(10-85-19)** అనీ ప్రయోగాలు ఉన్నాయి. ఈ పదాలే తరువాతి కాలంలో **'పునర్జన్మ'** అనే ఇప్పటి ప్రసిద్ధార్థంలో రూఢాలయ్యాయని చెప్పవచ్చు

## తత్త్వం

### 1. దేవతలు:

ఋగ్వేదంలో దేవతలు చాలమంది చెప్పబడ్డారు. వారిలో కొందఱు ప్రధానులు, కొందరు అప్రధానులు. అగ్ని, ఇంద్రుడు, వరుణుడు మొదలైనవారు ప్రధానులు. న్యాయమార్గప్రవర్తకుడుగా వరుణుడు అందరికంటే ప్రధానుడైనా **అతనికి** సంబంధించిన

సూక్తాలు తక్కువ. ఈ దృష్టితో చూస్తే ఇంద్రునిదే అగ్రతాంబూలమని చెప్పాలి. అతడు తనశక్తితో రాక్షసులను సంహరించి, అటు క్షత్రియులకు ఇటు సామాన్య ప్రజానీకానికి ప్రీతిపాత్రుడయ్యాడు. ఋగ్వేదంలోని సూక్తాలలో ఐదింటికి మూడుపాళ్లు ఇంద్రుడు, అగ్ని, సోముడు అనే దేవతల ప్రశస్తి కనిపిస్తుంటుంది. వారికంటే 'తక్కువ' అని చెప్పదగిన దేవతలలో సూర్యుడు, సవిత, విష్ణువు, వాయువు, రుద్రుడు మొ॥ వారు ముఖ్యులు. పురాణేతిహాసాలలో సర్వోత్కృష్టులుగా ప్రసిద్ధిచెందిన విష్ణువు, రుద్రుడు ఋగ్వేదసంహితలో అప్రధాన దేవతలుగా పరిగణించబడటం గమనించదగింది.

**వరుణుడు:**

ఋగ్వేదంలో పేర్కొనబడ్డ దేవతలలో **'ఋత'** ప్రవర్తకుడుగా కీర్తించబడినవాడు వరుణుడు. కాని నిజానికి అందరికంటే ముఖ్యమైన తత్త్వం **'ఋతం'** ఒక్కటే ఈ శబ్దానికి **'క్రమం' 'సత్యం'** అనే అర్థాలున్నప్పటికి **'యజ్ఞం'** అనేదే ప్రధానమైంది దీనినే ఋగ్వేదం **'భువనస్య నాభిః' (1-164-34)** అని వర్ణిస్తోంది. ఇక్కడ **'నాభి'** శబ్దానికి **'మూలకారణం' 'తండ్రి'** అనే అర్థం చెప్పవచ్చు ఋగ్వేదంలో చాలా స్థలాలలో **'ఋత'** శబ్దం **'యజ్ఞం'** అనే అర్థంలోనే ప్రధానంగా ప్రయోగించబడింది[1]. అగ్ని మొదలైన దేవతలు కూడ ఈ **'ఋతా'** నికి రక్షకులుగాను, ప్రవర్తకులుగాను ఉన్నట్లు ఋగ్వేదం చెబుతున్నది **(1-1-8; 1-16-3-5; 6-3-1)**. కాని అందరికంటే **'ఋత'** ప్రవర్తకత్వంలో వరుణుడే అధికుడనడం నిర్వివాదం. ఋగ్వేదంలోని ఏడవ మండలంలో **86**వ సూక్తంలో ఈ విషయం స్పష్టమవుతుంది. అన్నిటిని అతిక్రమించిన తనలోకంలో ఇతడు సహస్రస్థూణకలితమైన భవనంలో

---

1. క్వ ఋతం పూర్వ్యం గతమ్ **1-105-4.**
అగ్నే ష్పృతస్నుః త్రిః ఋతాని దీద్యత్.**10-122-6.**

నివసిస్తాడు. ఋగ్వేదంలో **1-25-81,VII-41-5** మొదలైనచోట్ల ఇతడు 'సముద్రియుడు' అని 'సముద్రంలో నివసించేవాడు ('సముద్రం **అపీచ్యః**') అనీ చెప్పబడ్డాడు (చూ.పే. 47).

**అగ్ని:**

ఋగ్వేదదేవతలలో అగ్నికున్న స్థానం విశిష్టమైంది (చూ.పే.38). ఋగ్వేదం అగ్నిసూక్తంతోనే ప్రారంభమౌతున్నది. మొత్తంమీద ఇంద్రుని తర్వాత ఎక్కువగా స్తుతించబడే దేవత ఇతడే. ఇతనిని స్తుతించే సూక్తాల సంఖ్య **200.** పవిత్రతకు, శక్తికి, తేజస్సుకు అగ్ని కాణాచి.

**ఇంద్రుడు:**

ఋగ్వేదంలో కీర్తించబడ్డ దేవతలలో ఇంద్రునిది అగ్రస్థానం. సుమారు **250** సూక్తాలలో ప్రత్యేకంగాను, **50** సూక్తాలలో మిగతా దేవతలతోను ఇతడు వర్ణించబడ్డాడు (చూ పే.35).

**విష్ణువు:**

ఋగ్వేద దేవతలలో అప్రధానుడుగా పరిగణించబడినప్పటికి పురాణేతిహాసాలలో త్రిమూర్తులలో ఒకడుగా వన్నెకెక్కినవాడు విష్ణువు. ఇతడు మూడంగలలో సమస్తలోకాలనాక్రమించాడు **(1-154-1)**. ఇది తర్వాతి పురాణగాథలలోని '**త్రివిక్రమత్వ**' నికి మూలమని చెప్పవచ్చు. ఇతని అత్యున్నతమైన పదం **(పరమం పదమ్)** మధువుకు (తేనె) (అంటే అమృతత్వం) నిధానం **(1-154-5)**. నిత్యముక్తులు విష్ణువుయొక్క పరమపదాన్ని సదా దర్శిస్తారు **(1-22-20)**. విష్ణువుకు కొండలు నివాసం అని కూడ చెప్పబడిఉంది **(1-154-2-3)**. ఇతనికి '**త్రాత**' (రక్షకుడు) అనే పేరు సార్థకం **(1-155-4)**. ఇది తర్వాతి వాఙ్మయంలో '**స్థితి**' క్రియకు సూచకమని చెప్పవచ్చు. ఇతనికి

అనేకరూపాలున్నట్లు చెప్పబడి ఉంది (7-100-6). ఇది `**అవతార**' సిద్ధాంతానికి నాంది అని చెప్పవచ్చు (చూ.పే.51).

## రుద్రుడు:

విష్ణువులాగ ఋగ్వేదంలో సామాన్యదేవతగా పరిగణించబడి, పురాణేతిహాసాల్లో '**శివుడు**'గాను, త్రిమూర్తులలో ఒకడుగాను, కీర్తించబడినవాడు రుద్రుడు. ఇతని జటాధరత్వం తరచుగా పేర్కొనబడింది (1-114-1,5; 6-55-2, 9-67-11). దేవతలందరిలోను ఇతడు చాలా భయంకరుడు ఇతడు '**రుద్రులు**' `**రుద్రియులు**' `**మరుత్తులు**' అనే గణాలకు తండ్రి. మరుత్తులు ఋగ్వేదంలో హోరుగాలికి, మెరుపులకు, జడివానలకు అధిపతులుగా చెప్పబడ్డారు. వారు రోగనివారకాలు, శక్తిప్రదాలు అయిన ఔషధాలనిస్తారు (2-33-13). వారి తండ్రి అయిన రుద్రుడు "వైద్యులకు వైద్యుడు" గా కీర్తించబడ్డాడు (2-33-4). ఇతని సంహారకశక్తి, ధనుర్బాణాలు ఋగ్వేదంలో ప్రసిద్ధాలు (2-33-10). అయినప్పటికి ఇతడు దయామయుడు కూడ. తక్కిన దేవతల కోపంనుంచి మానవులను కాపాడి శ్రేయస్సును చేకూరుస్తాడు (2-33-7; 1-114-4). (చూ.పే. 52).

ఇది స్థూలంగా ఋగ్వేదంలో పేర్కొనబడ్డ దేవతల స్వరూప స్వభావచిత్రణం ముందు పేర్కొన్నట్లు `**ఏకం సద్ విప్రా బహుధా వదన్తి**'(1-164) (తత్త్వమొక్కటే కాని విజ్ఞులు దానిని వివిధనామాలతో పిలుస్తారు) అనేదే సారాంశం.

## 2. దస్యులు :

ఈ దేవతలకు ప్రత్యర్థులు దస్యులు. వీళ్లకు రాక్షసులు, పణులు, ద్రుహులు, అరాతులు, అసురులు, యాతుధానులు, దానవులు అనే

పేర్లున్నాయి. వీళ్లు మాంసాశనులుగాను, నరభక్షకులుగాను, చోరులుగాను, యజ్ఞవిఘాతకులుగాను, మూర్ఖులుగాను, దుర్మార్గులుగాను పేర్కొనబడ్డారు (7-104-2; 10-87-2,19;10-87-16; 7-104-18, 20). వీళ్లు చీకటిలో సంచరిస్తారు. వీళ్లను అగాధమైన చీకటితో నిండిన గోతిలో త్రోసి, ఇంద్రుడు మొ॥ దేవతలు బలమైన గడియలు వేసి బిగిస్తారు (7-104-4,5,17). ఇదే తర్వాతి కాలంనాటి "నరకా"న్ని గూర్చిన భావానికి సూచకమని చెప్పవచ్చు.

### 3. మరణానంతరస్థితి :

ఋగ్వేదంలోని పదోమండలంలోని 14వ సూక్తం మరణానంతరం మనుష్యునికి చేసే సంస్కారాన్ని గూర్చి తెలుపుతున్నది. మరొక సూక్తాన్నిబట్టి మృతశరీరాన్ని పాతిపెట్టడం, దహించడం అమలులో ఉండేదని తెలుస్తున్నది (10-15-14). మరణానంతరం అగ్ని ఆ శరీరాన్ని ఊర్ధ్వలోకానికి తీసికొనిపోతాడు ఆ వ్యక్తి ఆత్మ తేజోమయలోకాన్ని చేరి, పితృదేవతలతో, యమునితో సంతోషంగా ఉంటుంది అక్కడ మరొక భవ్యమైన శరీరాన్ని ధరించి, ఏ లోపాలు లేని పరిపూర్ణతతో, అవాప్తసమస్తకాముడై, యముడు, వరుణుడు అనే రాజుల సన్నిధిలో దేవతలలో ఒకడుగా వెలుగొందుతుంటాడు (10-14-1-16). దివ్యమైన సంగీతాన్ని విని ఆనందిస్తూంటాడు (10-135-7).

### 4. స్వర్గం - నరకం :

ఋగ్వేదసంహితలో స్వర్గం ఆకాశమధ్యంలో మూడవ భువనంలో విష్ణువుయొక్క అత్యున్నతపదంలో ఉన్నట్లు చెప్పబడింది (10-15-14; 9-113-8-9; 1-154-5; 10-15-3). ఇది గొప్ప తేజోమయమైన లోకం. ఇక్కడికి వచ్చినవాళ్లకు ఆనందం, స్వేచ్ఛ వర్ణనాతీతాలు. యుద్ధాలలో

ప్రాణాలు కోల్పోయినవాళ్లు, విరివిగా యజ్ఞాలలో దక్షిణలిచ్చినవాళ్లు, తపశ్చర్యను నిష్ఠతో చేసినవాళ్లు, దానాలు చేసినవాళ్లు స్వర్గాన్ని పొందుతారు (10-154-2-5; 10-14-8).

నరకాన్ని గూర్చి ఋగ్వేదంలో స్పష్టంగా చెప్పబడలేదు. అయినా 4వ, 7వ మండలాలలో ఉన్న విషయం నరకాన్ని ప్రతిపాదిస్తున్నదని చెప్పక తప్పదు. వీటిలో దుష్కృతులు, పాపులు, అనృతులు, అసత్యులు అగాధమైన గోతిల్లో (వవ్రము) తోయబడతారని చెప్పబడింది(4-5-5; 7-104-3; 7-104-11-17).

### 5. జగత్సృష్టి :

ఋగ్వేదంలో పదోమండలంలో విశ్వసృష్టిని గూర్చిన వర్ణన ఉంది. సృష్టికి ముందు సత్తు, అసత్తు అనేవే లేవు వాయువు లేదు, ఆకాశం లేదు, మరి ఏమున్నది? ఎక్కడ ఉన్నది? ఎవరి రక్షణలో ఉన్నది? అనే ప్రశ్నలతో ఆరంభమైన 129వ సూక్తం తరువాతి కాలంనాటి సాంఖ్యాది సిద్ధాంతాలకు మూలబీజమైందని చెప్పచ్చు. ముందు జలం సృష్టించబడింది[1]. దానినుంచి వేడి ద్వారా మనస్సు ఆవిర్భవించింది[2]. సృష్టి దేనినుంచి ఆరంభమైందో చెప్పడం కష్టం[3]. విశ్వసృష్టియైన తరువాతనే దేవతలు వచ్చారు. "విశ్వసృష్టి రహస్యం ఆ పరమవ్యోమంలో ఉన్న అతనికె తెలుసు. లేదా అతనికీ తెలియకపోవచ్చు." అన్న 7వ ఋక్కును బట్టి విశ్వసృష్టి గాంభీర్యం స్పష్టమౌతున్నది.

1. అప్రకేతం సలిలం సర్వమా ఇదమ్ 10-129-3.
2. తపసః తన్మహినాజాయత అందులోనే
   మనసః రేతః ప్రథమం యదాసీత్ 10-129-4.
3. కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః 10-129-6.

**6. సాంఘిక స్థితిగతులు :**

ఋగ్వేదసంహితలో చాలవరకు దేవతల విషయాలు యజ్ఞయాగాది విశేషాలు ఉన్నాయని ముందే తెలిసికొన్నాం. అయినా అక్కడక్కడ ఆనాటి సాంఘికజీవనాన్ని గూర్చిన ఛాయలు లేకపోలేదు. ఆనాడు కూడ ఇప్పటిలాగా మనుష్యులు జూదాలాడి, సర్వస్వాన్ని కోల్పోయి, నిర్వేదంలో ఉండేవారని '**కితవసూక్తా**'న్ని బట్టి తెలుస్తున్నది **(10-34).** అలాగే వధువును వివాహానంతరం చీరసారెలతో భర్తృగృహానికి పంపే ఆచారం కూడ మరొక సూక్తంలో స్పష్టంగా తెలుస్తున్నది **(10-85).**

**7. వర్ణాశ్రమవ్యవస్థ :**

ఋగ్వేదంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే జాతుల ప్రసక్తి ఉంది **(10-90-12).** నాలుగు ఆశ్రమాలను గురించిన ప్రసక్తి స్పష్టంగా లేకపోయినా, అవి ఆనాడు పూర్తిగా లేవనడానికి వీలు లేదు యజ్ఞయాగాది నిర్వహణ, అందులో అగ్నికున్న ప్రముఖత్వం, అతనికున్న "**గృహపతి**" అనే పేరు, ఈ ఆశ్రమవ్యవస్థకు సూచకాలు అలాగే "**దంపతి**" శబ్దం కూడ. మునులు పొడుగైన జడలను పెంచుకొని, పసుపురంగు వస్త్రాలను ధరించి, తపస్సు చేయడం ఇందులో **(10-136-1,7)** సుందరంగా వర్ణించబడింది.

ఇది ఋగ్వేదసంహితలోని మతాన్ని తత్త్వాన్ని గురించిన దిఙ్మాత్ర ప్రదర్శనం.

**- యమ్.యన్.**

## 1.10 సాంఘికాచారవ్యవహారాలు

**విజ్ఞానరాశి :**

సంఘమునకును సారస్వతమునకును సన్నిహితమైన సంబంధము కలదు. అందుకు రచయిత కూడ సంఘమున ఒక సభ్యుడు అగుటయే కారణము. అతడు తెలిసియో తెలియకయో తననాటి సంఘమునందలి పరిస్థితులను తన రచనలో చేర్చుచుండును. అట్లే సత్యవ్రతులు, వశ్యవాక్కులు, విజ్ఞానసంపన్నులు అయిన ప్రాచీనమహర్షులు వీనులార వినియు, కన్నులార కాంచియు, సత్యములు అని మనసార నమ్మియు కావించిన వివిధములైన వర్ణనములలో నాటి దేశకాల పరిస్థితులు స్పష్టముగా వివరింపబడి ఉండును

ఋగ్వేదసంహిత కేవలము కర్మకాండను బోధించు మంత్ర సముదాయము మాత్రము కాదు. వింధ్యపర్వతములకును హిమాలయములకును నడుమగల భూభాగమునందలి ధర్మమును, విజ్ఞానమును, ప్రకృతి సంపదయు అందు చక్కగా ప్రతిబింబించు చుండును. అందలి వర్ణనలు అనేకములు భూమి, ఆకాశము, స్వర్గము అనువానికి సంబంధించి ఉండును. అవి యజ్ఞక్రియాపరములుగా ఉపయోగింపబడినట్లు నమ్మవలసి ఉన్నను మానవులకు ఇహపరలోక విజ్ఞానమును ఉపదేశించుటకు కూడ సమర్థములై ఉన్నవి. తరువాత లోకమున వెలసిన రామాయణము, భారతము, పురాణములు అను వాని యందలి పెక్కు వర్ణనములకు మార్గదర్శకములు అవియే.

**వర్షము - పంటలు :**

ఇంద్రుడు వృత్రాసురుని సంహరించిన వృత్తాంతము పెక్కు పురాణములలో ఉన్నది. ఇంద్రుడు దేవతలకు రాజు; వృత్రుడు

రాక్షసుడు. కొన్ని సూక్తములందు ఇంద్రుడు శూరుడు అయిన పురుషుడుగా వర్ణింపబడుట సత్యమే. కాని పెక్కు సూక్తములందు అతడు వైద్యుతజ్యోతిస్సుగను, వృత్రుడు మేఘుడుగను వర్ణింపబడినట్లు భాష్యములవలన తెలియుచున్నది మేఘముల గర్భమునందు కల జలములకును వైద్యుతజ్యోతిస్సునకును జరుగు సంఘర్షణము (రాపిడి) వలన వర్షము కలుగుచున్నది. అనగా గాలిచే ప్రేరితము అయిన విద్యుత్తు మేఘగర్భమును పగులగొట్టగా అందలి జలము వర్షరూపమును పొందుచున్నది. ఇట్టి వర్ణనములందు గల విద్యుత్తు అనే జ్యోతిస్సును ఇంద్రుడుగను, మేఘమును వృత్రునిగను కల్పించి పురాణేతిహాసకర్తలు వారికి యుద్ధము జరిగినట్లు వర్ణించిరి. నిరుక్తము ఇంద్రశబ్దమునకు భూమిపైగల ప్రాణికోటికి ఆహారపదార్థములను కలుగజేయు జలమును సమర్పించువాడు, సస్యములను పోషించువాడు అను అర్థములు ఎన్నో చెప్పుచున్నది; కాని దేవతాపరముగా అర్థము చెప్పిఉండలేదు. ఇంద్రవృత్రులను దేవాసురులుగా భావించిన ఋషులును ఒకరిద్దరు లేకపోలేదు కాని వారికి కూడ వైద్యుత జ్యోతిస్సుయొక్కయు, మేఘముయొక్కయు స్వరూపము తెలియును అనుటకు సందేహము లేదు.

**సూర్యోపాసన :**

ప్రాచీనమంత్రద్రష్టలలో పలువురు సూర్యుని పెక్కురూపములతో వర్ణించి ఉన్నారు. ఈ వర్ణనల ప్రభావము తరువాతి పురాణాదులందలి సూర్యవర్ణనముపై అధికముగా కనిపించును. సూర్యుని ఉపాసించుట వలన సర్వరోగములును శాంతించును అను నమ్మకము ఋగ్వేదము నాడే కలదు ప్రస్కణ్వుడు అను మహర్షి తాను దర్శించిన మూడుమంత్రములను జపించి చర్మరోగమును పోగొట్టుకొనెను. ఆ మూడుఋక్కులును **'తృచ'** మనుపేర భారతదేశమునందు అంతటను ప్రసిద్ధములు అయి ఆచరణలో ఉన్నవి.

ఋగ్వేదసంహితలో అందందు చెదరి ఉన్న సూర్యపరములు అయిన '60 ½ ఋక్కులను "మహాసౌరము" అను పేర ఒక్కచో సేకరించి ఉన్నారు. ఆరోగ్యము కోరువారు వానిని జపించుచు నేటికిని సూర్యనమస్కారములు చేయుచున్నారు. ఋగ్వేదమునందలి సూర్యవర్ణనలను సూక్ష్మముగా పరిశీలించినచో అప్పటి ఋషులు సూర్య మండలతత్త్వమును ఎంత గాఢముగా పరిశోధించిరో తెలియవచ్చును

**ఉషస్సు :**

ఋక్సంహితలోని వర్ణనములందెల్ల ఉషోవర్ణనలు మిక్కిలి ప్రసిద్ధములు అయినవి. అవి రెండువందలకుపైగా ఉండును అందలి సహజతాసౌందర్యములు భారతీయులకేకాక పాశ్చాత్యులకు కూడ ఆశ్చర్యము కలిగించినవి అందు పెక్కుమహర్షులు ఉత్తరధ్రువ ప్రాంతమున ఉన్నప్పుడు దర్శించినవే. మనకు ఇక్కడ ఉషస్సు కొన్ని నిమిషములు మాత్రమే కనిపించును. తరువాత సూర్యోదయము అగును మేరుప్రాంతమున ఉషస్సులు ముప్పదిదినములు ఒకదాని తరువాత ఒకటి గిరగిర తిరుగుచుండును పిదప సూర్యమండలము ఉదయించును.

కక్షీవంతుడు అను మహర్షి ఉషస్సును స్త్రీతో పోల్చి అది సూర్యునికి ప్రియురాలు అని వర్ణించెను. అతడు బాల్యము, కౌమారము, యౌవనము అనుదాని అవస్థలను కూడ సుందరముగా వర్ణించెను. ఈ ఉషస్సే ప్రాతః కాలమున '**ఉషోదేవి**' గను, మధ్యాహ్నమున '**సూర్య**' అను నామముతోడను, సాయంకాలమున '**వృషాకపాయి**' అను పేరుతోడను సూర్యుని ఆశ్రయించి ఉండునట.

**సోమరసము :**

అప్పుడు సోమలతలనుండి రసము తీయుటకై వానిని ఇప్పటి రోళ్ళవంటి రాళ్ళపై నలగగొట్టెడివారు. అప్పుడు వాని పైభాగము ఆకుపచ్చగా ఉండును. ఒక ఋక్కు అట్టి రాయి ఆకుపచ్చని నోటితో సోమపానము చేయువారిని రండు అని పిల్చుచున్నదా అన్నట్లు ఉన్నదని వర్ణించుచున్నది.

**స్త్రీ పురుషదైవారాధన :**

ఋగ్వేదమునందలి సూక్తములు దేవతాస్తుతిపూర్వకములు గాను, ప్రార్థనాపూర్వకములుగాను ఉండును. అందు ముందు ఆయా దేవతలయొక్క పౌరుషము, ఔదార్యము మున్నగు గుణములును, తరువాత వారు చేసిన సాయమును వర్ణింపబడును. పిమ్మట స్తుతించు వానికికల కోరికలను తీర్చవలెను అను ప్రార్థన కనబడును. అప్పటి ఋషులు సాధారణముగా పశురూపమైన ధనమును, ఆయువును, సంతానమును, జయమును, ఐశ్వర్యమును కోరుచుండిరి సూక్తములలో అచ్చటచ్చట యజ్ఞముల ప్రశంస కూడ ఉండును.

ఋగ్వేదమునందు సుమారు మూడువందలమంది దేవతల పేర్లు కలవు. వారిలో గొప్ప మహిమ కలవారు ఇరువదిఐదుగురు ఉందురు. అగ్ని, ఇంద్రుడు, మిత్రుడు, సోముడు, వరుణుడు అనువారు ప్రధానులు. పెక్కుసూక్తములు వీరి స్తుతులతో కూడి ఉండును. ఆయా స్థానములను, సందర్భములను బట్టి ఒక్కొక్కరికి ప్రాధాన్యము ఒసంగబడుచుండును. కొన్ని సూక్తములలో సూర్యుడే సర్వదేవతా రూపుడు అనియు కార్యవశమున ఆయా దేవతల రూపములను దాల్చుచుండును అనియు వర్ణింపబడినది. కొన్నిచోట్ల అగ్నియే ప్రధాన దైవముగాను, కొన్ని చోట్ల విరాట్పురుషుడు ప్రధానుడుగాను వర్ణింపబడి

ఉన్నాడు. పైన పేర్కొనబడిన పురుష దైవములేకాక అదితి, ఇంద్రాణి, వరుణాని మున్నగు స్త్రీదేవతలు కూడ కొందరు కలరు. అదితి దేవతల తల్లి. సాధారణముగా ఇరువురు దైవముల పేర్లతో కూడిన మిత్రావరుణులు, అగ్నీషోములు అను ద్వంద్వసమాసములే అధికముగా కనబడును. దీనిని బట్టి అప్పటివారు పై స్త్రీపురుష దైవములను ఆరాధించెడివారు అని తెలియుచున్నది.

**ఆర్యులు - అనార్యులు :**

పెక్కువేల సంవత్సరములకు పూర్వము ఆర్యులు అను ఒక జాతిజనులు మన దేశమునకు వచ్చి, వాయవ్యభాగమున ఉన్న సింధునదికి ఇరుప్రక్కల కొంతకాలము ఉండి, క్రమముగా ఆర్యావర్తమును అంతను ఆక్రమించిరి అని పాశ్చాత్యచరిత్రజ్ఞుల అభిప్రాయము. వారు తమ బాషగు సంస్కృతమును తమ సంస్కృతిని అచ్చట వ్యాపింపచేసిరి. ఋగ్వేదమునకల **'అయజ్వ, అవ్రత, అబ్రహ్మ'** అను విశేషణములను బట్టి అప్పుడు ఆర్యులకంటె భిన్నులు అయిన అనార్యులు కూడ కొందరు ఉండిరి అని తెలియుచున్నది **'కృష్ణ'** అను విశేషణమును బట్టి వారు నల్లగా ఉండిరి అని ఊహింపవచ్చును. వైదికార్యులలో ప్రత్యేకము అయిన వర్ణభేదము ఉన్నట్లు చెప్పుటకు ప్రబలములు అయిన ఆధారములు లేవు. కాని ప్రథమమండలము మున్నగువానిలో కనవచ్చు **'బ్రహ్మ, రాజ'** శబ్దములే దశమమండలము నాటికి బ్రాహ్మణ, క్షత్రియవాచకములు అయినట్లు పండితులు అభిప్రాయపడుచున్నారు.

**పశుధనము :**

ప్రాచీనకాలమందలి ఆర్యులకు గోవులే ప్రధాన ధనము. వారిని పశుధనులు అని చెప్పవచ్చును. వారి జీవితము అంతయు

గోవులతో ముడిపడి ఉండెను. దక్షిణలు, అరణములు, కానుకలు వారు గోరూపముననే ఇచ్చెడివారు. గోవు వారి ప్రత్యక్షదైవము. వారు గోరక్షణమునందు చూపిన శ్రద్ధయు, గోవులయెడ చూపుచుండిన భక్తియు అపారములు. ఋగ్వేదమునందలి గోవులను వర్ణించు ఋక్కులను పఠించినచో వారు గోధనమును సంపాదించుటయందును, వానిని రక్షించుటయందును చూపిన ఆదరాభిమానములు తేటతెల్లములు అగును.

**వ్యవసాయము:**

వారి ప్రధానవృత్తి వ్యవసాయము వారు పొలము దున్ని సేద్యము చేయుచుండిరి. వారు కృషికర్మయందు వాడిన సాధనములు కూడ కొన్ని సూక్తములలో పేర్కొనబడినవి. వానిలో **"నాగలి" "కాడి" "మేడి"** ముఖ్యములైనవి. వారు యవలు, గోధుమలు, నువ్వులు, చామలు (శ్యామాకములు), నీవారములు ( నెవరిధాన్యము), మాషములు (మినుములు) మున్నగువానిని పండించుచుండిరి. ఋగ్వేదమున ధాన్యశబ్దము ప్రయోగింపబడినది.

**ఆహారము :**

ఆర్యులు యవలు, గోధుమలు పిండిగా చేసి నేతితో కలిపి తినుచుండిరి. పేలపిండిని కూడ వాడుచుండిరి. ఆవుపాలు, పెరుగు, మజ్జిగ త్రాగుచుండిరి. ఆవునెయ్యి వారికి మిక్కిలి ఇష్టము. వారు యాగములందు ఆవునేతిని, యవలు మున్నగు ధాన్యములను పురోడాశమునకై (యాగార్థమైన అప్పము) వాడుచుండిరి. మాంసమును హవిస్సు (అగ్నియందు వ్రేల్చు ద్రవ్యము)గా ఉపయోగించి మిగిలినదానిని తినుచుండిరి. వారు ఉపయోగించెడి పానీయములలో సోమరసము ప్రధానమైనది. ఆ రసము బలమును, తేజమును,

ఆయువును వృద్ధిచేయునని వారి విశ్వాసము. సోమలతను శిలామయములైన రోళ్ళలో నలగగొట్టి దాని రసమును తీయుచుండిరి.

**లోహములు :**

ఆర్యులు లోహములను, కఱ్ఱను ఉపయోగించెడివారు అనుటకు నిదర్శనములు కలవు. ఇనుముతో పనిముట్లు చేయు కమ్మరులు, బంగారు వస్తువులను చేయు స్వర్ణకారులు, కఱ్ఱతో నాగళ్ళు మున్నగు కృషిసాధనములు చేయు వడ్రంగులు అప్పుడు ఉండిరి.

**శస్త్రములు - యుద్ధము :**

ఆర్యులకు, కృషియే ప్రధాన వృత్తి అయినను శస్త్రజీవులు కూడ కొందరు ఉండిరి రథికులు, సారథులు, గుఱ్ఱపురౌతులు (అశ్వికులు), పదాతులు అప్పుడు ఉండిరి. వారు ఆత్మరక్షణమునకును, తమపై దండెత్తి వచ్చు శత్రువులను ఎదిరించుటకును, నూతన ప్రదేశములను ఆక్రమించుటకును శస్త్రములను ఉపయోగించుచుండిరి. ఋగ్వేదమున **'దాశరాజ'** యుద్ధము వర్ణించబడినది. దానిని బట్టి అప్పటి యుద్ధవిధానము ఎంత పురోగమించి ఉండెనో తెలిసికొనవచ్చును.

**వేట :**

ఆర్యులు గుఱ్ఱపుస్వారియందును, వేటయందును మిక్కిలి నిపుణులు. వారు వేటాడీ సింహములనుపట్టి పంజరములో బంధించెడివారు, ఋగ్వేదమున **'ఒంటె'** అను అర్థమున **'రజ'** శబ్దము వాడబడినది. వారు వానిని బరువులు మోయుటకు ఉపయోగించి యుందురు. కొన్ని ఋక్కులలో ఏనుగులయు, వ్యాఘ్రములయు వర్ణనము కూడ కలదు దీనినిబట్టి వారికి ఏనుగుల వేట, పులివేట

సైతము పరిచితము అని ఊహింపవచ్చును. కస్తూరిమృగము, కృష్ణసారమృగము (నల్లని ఇఱ్ఱి), గౌరమృగము అను వానిని సూచించు పదములు ఋగ్వేదమున కలవు.

**వాణిజ్యము** ।

ఋగ్వేదమున అచ్చటచ్చట అమ్మకట, కొనుట అను వ్యాపారమును తెల్పు పదములు ఉపయోగించబడి ఉన్నవి. దీనినిబట్టి ఆర్యులు వాణిజ్యమునకూడ ఆరితేరి ఉండిరనియు, నౌకలమీద పరదేశములకు పోయి తమదేశమునందలి వస్తువులను అచ్చటికి కొనిపోయి అమ్మి, అచ్చటి వస్తువులను తమ దేశమునకు కొని తెచ్చుచుండిరనియు తెలియుచున్నది. సవ్యుడు అను ఋషి స్తోతలను వర్తకులతో పోల్చి ఉన్నాడు. దీనిని బట్టి కూడ అప్పుడు క్రయవిక్రయములు విరివిగ సాగుచుండెను అని తెలియుచున్నది

**స్త్రీలు**

ఋగ్వేదమున స్త్రీధర్మములు పెక్కుచోట్ల వర్ణింపబడి ఉన్నవి. ఈ వర్ణలనుబట్టి స్త్రీలకు అపారమైన గౌరవము ఉన్నట్లు వ్యక్తము అగుచున్నది. స్త్రీలు యజ్ఞాదికర్మలందు కూడ పురుషులవలె యాజమాన్యము వహించి తత్ఫలమునందు భాగస్వామినులు అగుచుండిరి. వారు విద్యాభ్యాసము కావించి గృహలక్ష్ములై గృహిణీ ధర్మమును చక్కగా నిర్వహించుచుండిరి. అవసరసమయములందు వారు పురుషులకు యుద్ధములలోకూడ తోడ్పడుచుండిరి అనుటకు నిదర్శనములు ఉన్నవి. స్త్రీలు ధర్మార్థకామమోక్షముల సంపాదనమున పురుషులకు తోడ్పడుచుండిరని తెలియుచున్నది.

**దానము :**

ఆకలితో ఉన్నవారికి అన్నమును, పేదలకు ధనమును దానము చేయుట ఋగ్వేదమున పెక్కుచోట్ల పొగడబడి ఉన్నది. అప్పటి జనులు సత్యపరులై, కుటిలవర్తనము లేక సంచరించుచుండిరి అనుటకు సత్యమును, ఆర్జవమును వర్ణించు ఋక్కులే తార్కాణము

**విద్యావిధానము :**

అంగిరసుడైన బృహస్పతి దర్శించిన విద్యాసూక్తమువలన అప్పటి విద్యావిధానము సూచింపబడుచున్నది. అందు "పండితులు ఒండొరులతో స్నేహము వహించి ఉందురు. వారివాక్కులు విజ్ఞానలక్ష్మికి నిలయములు. వేదవిదులతో సంచరింపక, దేవతలను ఆరాధింపక, విద్యావివేకములు లేక ప్రవర్తించువారు బ్రాహ్మణులు కారు. కేవల లౌకికవాక్కులను ఆశ్రయించువారు కర్షకులై వ్యవసాయము చేసికొందురని చెప్పబడినది.

**వివాహపద్ధతి :**

ఋగ్వేదమందలి దశమమండలమున నలువదిఏడు ఋక్కులతో కూడిన సూక్తమునందు వివాహమునకు సంబంధించిన మంత్రములు ఎన్నో ఉన్నవి. వానినిబట్టి ఆనాటి వైవాహికాచారములను సంగ్రహముగా అయినను తెలిసికొనవచ్చును. ప్రౌఢలై వర సమాగమమును కోరు కన్యలకు మాత్రమే వివాహము చేయవలయును. స్త్రీచిహ్నములు అంకురింపక రజస్వలలు కాని కన్యలు పుట్టినింట ఉండతగుదురు. దీనిని బట్టి రజస్వలలు అయిన కన్యలను పెండ్లిచేసి అత్తవారి ఇండ్లకు పంపెడివారని తెలియుచున్నది. వరుని మిత్రులుగాని, బంధువులుకాని కన్యతండ్రి యొద్దకు వచ్చి కన్యను

ఇమ్మని కోరుదురు. కన్యాదాత వరుని గుణములను, యోగ్యతను చక్కగా పరిశీలించి అతనికి పిల్లను ఇచ్చుటకు వాగ్దానము చేయును. వివాహము కన్య ఇంటిలోకాని, వరుని ఇంటిలోకాని జరుగుచుండెను. కన్య ఇంటనే జరుగవలెను అను నియమము అప్పుడు లేదు. పెండ్లికి బంధువులు, మిత్రులు అందరును వచ్చుచుండిరి. పెండ్లి అయిన తరువాత కన్యాదాత బూరుగు, మోదుగుచెట్ల కర్రలతో చేయబడి అలంకరింపబడిన రెండెడ్లబండిమీద వధువును కూర్చుండ బెట్టి అత్తవారింటికి పంపుచుండెను. కన్యకు అరణముగ ఇచ్చు గోవులను, ఇతర వస్తువులను బండివెంట పంపుచుండిరి

వివాహమునకు సూచనగా వరుడు, వధువు పాణిని గ్రహించును అందుచేతనే దానికి '**ప్రాణిగ్రహణము**' అనుపేరు వచ్చినది అది ఇప్పటికిని వాడుకలో ఉన్నది వరుడు కన్యచేయి గ్రహించి "కల్యాణీ! నీకు సౌభాగ్యమును, నాకు గార్హపత్యమును కలుగుటకును, నీవు నాతో జీవితాంతమువరకును ఉండుటకును నీ పాణి గ్రహించుచున్నాను" అని పల్కును. పెద్దలును పండితులును వధూవరులను ఆశీర్వదింతురు తరువాత వరుడు అగ్నిలో మంత్రపూర్వకముగ నేయి మొ॥ వస్తువులను హోమము చేయును. పెండ్లి వేడుక అయిన తరువాత వచ్చినవారి భోజనాదికములు జరిగిన వెనుక కన్యాదాత కూతురిని రథముపై ఎక్కించి "అమ్మా" నీవు భర్తింటిలో యజమానురాలవై, అతనికను కూలురాలవై, సంతానవతివై సుఖముగ ఉండుము" అని దీవించి పంపును. బంధువులు హితోక్తులు పలుకుదురు.

**ఆడపిల్ల - అత్తవారిల్లు :**

క్రొత్తగా పెండ్లికూతురు అత్తవారింటికి అరుగునపుడు త్రోవలో పొలిమేరలు, తోటలు, చతుష్పథములు వచ్చిన యెడల కొన్ని

మంత్రములు చదువుదురు. ఆమె భర్తింటికి చేరిన పిదప గృహ ప్రవేశమునకు అంగములైన హోమములు చేయుదురు. క్రొత్తకోడలు కట్టినచీర "కృత్య" అను ఒక దేవతయొక్క రూపము అగుటచే దానిని విడిపించివైతురు. ఆ వస్త్రమును వరుడు తాకకూడదు. ఇట్టి ఆచారము కొన్ని వర్ణములలో ఇప్పుడు కూడ కలదు. పెండ్లి అయినపుడు వరుడు కన్యను గూర్చి "అర్ధాంగీ! నీవు మంచి నడవడి కలిగి వర్తింపుము. ఎప్పుడును కోపము ప్రదర్శింపకుము. భర్తకు ఎన్నడును కీడు తలపకుము. మంచిమనస్సుతో మంగళ రూప వేషములతో ఉండుము. గోవుల మేలుకోరుచు వానిని రక్షించుటయందు శ్రద్ధ వహింపుము. వీరులు, సమర్థులు అగు కుమారులను కనుము. అత్త మామలకు సేవచేయు విషయమున అశ్రద్ధ చూపకుము. మరదులను, ఆడుబిడ్డలను ఆదరముతో చూడుము" అని పల్కును.

### స్వయంవర పద్ధతి :

ప్రాచీనకాలమున స్వయంవర వివాహములు ఎక్కువగా ఉన్నట్లు కానరాదు కాని, ఋగ్వేదమునందలి దశమమండలమున ఒక సూక్తములో 'కల్యాణియు, సుందరియు అగు వధువు జనులనడుమ కూర్చొండిన, తనకు ఇష్టుడైన ఒకని భర్తగా కోరుచున్నది' అను అర్థముగల మంత్రము కనబడుచున్నది. సాయణాచార్యులు ఇది స్వయంవరవిధానమే అని అభిప్రాయపడి ఉన్నారు. తరువాత ఈ ఆచారము రాజకన్యలకు మాత్రమే విహితమై పురాణాదులందు వర్ణింపబడినది.

### అనులోమ - విలోమ వివాహవిధానములు :

ఋగ్వేదకాలమున అనులోమ వివాహవిధానము (అగ్రవర్ణము వారు తక్కువ వర్ణమునందలి కన్యలను వివాహమాడు పద్ధతి)

ఆచరణమున ఉండెడిది. శ్యావాశ్వుడు అను బ్రహ్మర్షి రథవతి అను రాజర్షి కూతురును వివాహమాడుట ఇందుకొక ఉదాహరణము విలోమవివాహవిధానము మాత్రము (తక్కువ వర్ణమువారు ఉన్నత వర్ణములందలి స్త్రీలను పెండ్లి ఆడు విధానము) ఋగ్వేదమున కానరాదు. క్షత్రియుడైన యయాతి భార్గవ పుత్రిక అయిన దేవయానిని పెండ్లి ఆడిన కథ భారతములో ఉన్నది. ఇది పౌరాణికమే కాని వైదికము కాదు.

## మృతసంస్కారము :

ఒక గృహస్థునకు కుమారులు లేనిచో అతని పుత్రిక వారసురాలు అగును. కుమార్తె కొడుకు పుత్రప్రాయుడై మాతామహుని పరలోక క్రియలు చేయవచ్చును. ఆ కాలమున మొదట శవములను పాతి పెట్టే ఆచారము కన్పించినను, తరువాత దహనము చేయు పద్ధతియే ప్రచారమునకు వచ్చెను. శవమును శ్మశానమునకు తీసుకొనిపోవునపుడు చుట్టములు మున్నగువారితో భార్యకూడ పోవుచుండెను మైల తొలగిపోయిన రోజున దేవతలను ఆహ్వానించు క్రియతోకూడిన పితృమేధము చేయుచుండిరి. క్షత్రియుడు చనిపోయినచో అతని చేతియందలి విల్లు కర్మచేయువాడు గ్రహించి 'నీవు ఈస్థానమున ఉండుము. మేము వీరులమై పుత్రులతోడను, పౌత్రులతోడను కూడి ఈ లోకమును జయింతుము' అని పలుకుచుండెను. దీక్షితులు మరణించినపుడు మృతసంస్కారము జరిగినపిమ్మట వారి ఎముకలను మంత్రపఠనపూర్వకముగ పాతిపెట్టుచుండిరి. ఋగ్వేదమునందలి ఒక సూక్తములో పితృయజ్ఞము వర్ణింపబడినది.

## తత్త్వచింతన :

ఋగ్వేదము యజ్ఞములో ఉపయోగించు స్తోత్రరూపములైన మంత్రములతో కూడి ఉన్నమాట నిజమే అయినను తరువాత

వెలువడిన సమస్తశాస్త్రములకును, ఇతిహాసపురాణాదులకును బీజములైన వాక్యములును, వివిధవేదాంతములకు మూలములైన ఋక్కులును ఇందు గోచరించుచున్నవి. దీర్ఘతముడు అను మహర్షి సృష్టికి పూర్వమందలి అవస్థను, జీవేశ్వరుల ఐక్యమును వర్ణించి ఉన్నాడు. భువనపుత్రుడైన విశ్వకర్మ అను ఋషి, విశ్వరూపుడైన పరమేశ్వరుడు తనయందే ముల్లోకములను సృష్టించెనని తెల్పి ఉన్నాడు. ఇట్లే పూర్వజన్మము, మరణానంతర జీవితము, పరమేశ్వరోపాసన, కైవల్యము మున్నగు తత్త్వవిషయములను పెక్కు ఇహలోక విషయములను బోధించు ఋక్కులు ఋగ్వేదమున ఎన్నో కలవు.

ఋగ్వేదము ఒక కల్పవృక్షమువంటిది ఆనాటి పరిస్థితులను అది కన్నులకు కట్టినట్లు వర్ణించును ఋగ్వేదసంహితయందు ఋషుల ఆశ్రమములు, యజ్ఞవాటికలు, వనములు, చెట్లు, లతలు, నదులు, పర్వతములు మున్నగువానిని, యుద్ధములను, జయాపజయములను, కృషిగోరక్షణములను, వాణిజ్య వ్యాపారములను, తపో మహిమలను, ప్రకృతివిజ్ఞానమును, ధైర్యసాహసములను, భూగోళ విజ్ఞానమును, అరిషడ్వర్గమును వర్ణించు మంత్రములు ఎన్నో కలవు ప్రపంచమున ఆదిమవాఙ్మయమైన ఋగ్వేదమున విస్తృతమైన ఇంతవిజ్ఞానము వర్ణింపబడి ఉండుటకు అందలి మంత్రములను దర్శించిన మహర్షుల మహిమానుభవములే కారణము. అది భారతీయ సంస్కృతికి పెన్నిధానము.

- డి.వి.ఏ.

# 1. 11 కవితాసౌందర్యం

సకలవాఙ్మయబీజభూతమైన ఋక్సంహితను కవితాగవాక్షంలోంచి పరిశీలించినప్పుడు నిండుగా తీర్చిదిద్దబడ్డ కవితాసుందరి మనకందులో ప్రత్యక్షమౌతుంది. సహృదయులకు చమత్కారాన్ని అందించగల ఈ సుందరిసౌందర్యం ఎన్నోవిధాలుగా మన మనోనేత్రాల నాకర్షిస్తుంది. కొన్నిచోట్ల తియ్యదనపు మూటలవంటి మాటలతోను, వస్తుస్వరూప స్వభావాలను మన కళ్ళకు కట్టినట్లు బొమ్మలు గీచి చూపే రమణీయమైన వర్ణనలతోను, ఆనందాల అంచుల్లోకి తీసుకుపోగలిగే మధురాతిమధురమైన భావనలతోను, అందమైన అలంకారాలతోను, ఏ పటాటోపంలేని చక్కని మకుటమాణిక్యాలతోను ఇంకెన్నెన్నో రీతులతోను, నడకలతోను ఆ ఆకర్షణ చిరస్మరణీయమౌతుంది.

ఋక్సంహితలోని కవితాసౌందర్యాన్ని పైన చెప్పినట్లు సంగ్రహంగా ఇక్కడ సందర్శిద్దాం.

**1. పలుకుబళ్లు :**

ఈ సంహితలోని పలుకుబళ్లు ఎంతో సరసంగా సుందరంగా ఉంటాయి. చూడండి:

ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా ని దధే పదమ్ |
సమూఢ్హమస్య పాంసురే || **(1-22-17)**

త్రివిక్రమావతారాన్ని ధరించిన విష్ణువు ఈ జగత్తునంతా తన పాదాలతో మూడువిధాలుగా ఆక్రమించాడు. ధూళితో కూడిన ఆయన పాదాలలో భూమి, ఆకాశం, స్వర్గమనే మూడు ఇమిడి పోయాయి కథనపద్ధతి ఎంత సుందరంగా ఉందో చూడండి

తద్ విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయః |
దివీవ చక్షురాతతమ్ || (1-22-20)

శ్రీమహావిష్ణువుయొక్క పరమపదాన్ని దివ్యసూరులు ఏ అడ్డూలేని ఆకాశంలో వ్యాపించిన దృష్టినిలాగా ఎల్లప్పుడు దర్శిస్తూనే ఉంటారు. ఇక్కడ మాటలపొందిక ఎంత ముద్దుగా ఉందో గమనించండి.

## 2. వర్ణనలు:

ఇంద్రాదిదేవతలను స్తుతించే ఋక్కుల్లో సందర్భానుసారంగా వారి స్వరూప స్వభావ ప్రభావాల వర్ణనలు మనకెంతో సంతోషాన్ని కలిగిస్తాయి. ప్రథమమండలంలోని 11వ సూక్తంలో ఇంద్రుని స్వరూపస్వభావాదులు ఎంతో చక్కగా వర్ణింపబడ్డాయి. చూడండి:

ఇంద్రుడు సముద్రంలాగా అన్నిచోట్ల వ్యాపించి ఉన్నాడు. రథులలో అందఱిలో మహారథి సకలసంపదలకు అధిపతి. సన్మార్గంలో నడిచేవారిని ఎప్పుడూ రక్షించేవాడు. అతడు యుద్ధాల్లో పరాజయం ఎఱుగనివాడు ఎటువంటి శత్రువునైనా జయించగలవాడు. తనను స్తుతించేవారికి సకలసంపదలనివ్వడం అతని స్వభావం. నవయౌవనం అతనిలో ఎల్లప్పుడు ఉంటుంది. గొప్పమేధావి మహాబలసంపన్నుడు. ఇలా ఇంద్రుడికి సంబంధించిన అనేక లక్షణాలు ఈ సూక్తంలో చక్కగా అభివర్ణింపబడ్డాయి.

వేదాల్లో అగ్నికి ప్రముఖమైన స్థానం ఉంది. ఋక్సంహితలో ప్రథమమండలంలోని 12వ సూక్తం అగ్నిహోత్రుని లక్షణాలనెలా మనకు విశదీకరిస్తున్నదో చూడండి:

అగ్ని దేవదూత. యజమానికోరికతో అతడు దేవతల నాహ్వానిస్తాడు. అతడు సకలధనసంపన్నుడు. మంచిపనులను సాధించడంలో అతనికతడేసాటి. గొప్ప ప్రజ్ఞావంతుడు. ప్రజల మంచి చెడ్డలనెప్పుడూ అతడు గమనిస్తూ, యజమాని దేవతల కర్పించిన హవిస్సులను వారికి అందజేస్తాడు. అతడు సకలజన

ప్రీతిపాత్రుడు. ప్రజలతరపున దేవతలనందరినీ యజ్ఞానికాహ్వానించి వారితోపాటువచ్చి యజ్ఞవేదికనలంకరిస్తాడు. తేజస్సంపన్నుడైన అగ్ని యజమాని శత్రువులను భస్మంచేస్తాడు. ఇతడికి **'జుహువు'** ముఖంలాంటిది. యజమానుడి కుటుంబాన్ని చక్కగా కాపాడతాడు నిత్యయౌవనం కలవాడు. ఎప్పుడూ నిజమే చెబుతూ, అనేక రోగాలను పోగొడతాడు.

ఇలా అగ్నిలోని గుణగణాలనన్నింటిని పూసగుచ్చినట్లు వర్ణించుకుంటూ అతణ్ణి స్తుతి చేస్తాడు మహర్షి

**3. భావనలు:**

ఋక్సంహితలోని భావనాపటిమ నిజంగా మనల్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తుంది. అసమానతలను తొలగించుకొని ఈ సమాజాన్ని వారు ఎంత సుందరస్వప్నంగా భావించారో ఒకమాటు చూడండి:

అజ్యేష్ఠాసో అకనిష్ఠాస ఏతే ॥
సంభ్రాతరో వావృధుః సౌభగాయ ॥ [5-60-5]

వీరిలో (మరుత్తులలో) పెద్దవారని చిన్నవారని భేదభావం లేదు. అందఱు కలిసి చక్కని సోదరప్రేమతో కలసిమెలసి ఉండి మంచి సౌభాగ్యాలతో వృద్ధిపొందుతున్నారు.

ఇందులో ఆ సమాజంలో ఎంతటి ఐకమత్యం ఉన్నదనే అంశం మనకు స్పష్టమౌతుంది.

అలాగే ఆనాటికే వారిలో ఉన్న ఐకమత్యభావననొకసారి దర్శించండి :

సం గచ్ఛధ్వం సం వదధ్వం సం వో మనాంసి జానతామ్ ।
దేవా భాగం యథా పూర్వే సంజానానా ఉపాసతే ॥

(10-191-2)

మీరు కలసి ఉండండి! ఒకే మాటమీద నిలబడండి! ఒకరి నొకరు అర్థం చేసుకొని మనస్సులు కలిపి ప్రవర్తించండి! దేవతలెలా పరస్పరం విరోధం లేకుండా వారి వారి హవిస్సులను వారు పరిగ్రహిస్తున్నారో మీరు కూడా అలాగే మీ మీ సంపదలను అనుభవించండి!

**4. శబ్దాలంకారాలు:**

అర్థాపేక్షలేకుండా వింటున్నప్పుడే సహృదయులను ఆకట్టుకో జాలినవి శబ్దాలంకారాలు. ప్రయోగింపబడ్డ శబ్దాలవైచిత్ర్యమే వీటిలో వినేవారిని ఆకట్టుకొంటుంది ఇవి అనేకరకాలు. అలంకార శాస్త్రంలో 1. వృత్త్యనుప్రాస 2. ఛేకానుప్రాస 3. లాటానుప్రాస 4. యమకం 5. ముక్తపదగ్రస్తమని వాటిని ఐదురకాలుగా విభజిస్తారు. మనకు ఋగ్వేదంలో బీజభూతంగా వీటిల్లో కొన్నింటి స్వరూపం గోచరిస్తుంది.

**1. 2. యమకం - వృత్త్యనుప్రాస:**

ఈ ఋక్కులో చూడండి చక్కని యమకం వృత్త్యనుప్రాస ఎలా ఉన్నాయో!

అమినతీ దైవ్యాని వ్రతాని ప్రమినతీ మనుష్యా యుగాని ।
ఈయుషీణాముపమా శశ్వతీనామాయతీనాం ప్రథమోషా వ్యద్యౌత్ ॥
**(1-124-2)**

ఈ ఋక్కులో మొదటి రెండుపాదాలో రెండుసార్లు **'మినతీ'** అనే అక్షరసమూహం, మూడు నాలుగు పాదాలో **'తీనాం'** అనే అక్షరసమూహం రెండుసార్లు ప్రయోగింపబడి చక్కని లయను సమకూర్చింది. ఇదే యమకాలంకారం. అలాగే ఒకటి రెండు పాదాల్లో 'ని' అనే అక్షరం మూడుసార్లు ఆవృత్తమైంది. అందువల్ల ఋక్కులో చక్కని నడక కనపడుతోంది. ఇది వృత్త్యనుప్రాస. ద్వితీయ మండలంలోని పన్నెండవసూక్తంలో వృత్త్యనుప్రాసలు కోకొల్లలు.

ఇంకో చిత్రమైన వృత్త్యనుప్రాస చూడండి:

అవోచామ కపయే మేధ్యాయ వచో వన్దారు వృషభాయ వృష్ణే.

(5-1-12)

ఇందులో 'వ' అనే వర్ణం ఆరుసార్లు రావడం, అందులోను 'వృ' అని రెండుసార్లు వినపడడం 'య' అనే వర్ణం మూడుసార్లు ఆవృత్తం కావడం ఎంతో ఆహ్లాదాన్ని కలిగిస్తున్నది.

ఇంకొక వృత్త్యనుప్రాస చూడండి:

పాతా సుతమిన్ద్రో అస్తు సోమం ప్రణేనీరుగ్రో జరితారమూతీ ।
కర్తా వీరాయ సుష్వయ ఉ లోకం దాతా వసు స్తువతే కీరయే చిత్॥
గన్తే యాన్తి సవనా హరిభ్యాం బభ్రిర్వ్రజం పపిః సోమం దదిర్గాః ।
కర్తా వీరం నర్యం సర్వవీరం శ్రోతా హవం గృణతః స్తోమవాహాః ॥

[6-23-34]

ఈ ఋక్కుల్లో 'తకారం' అనేకసార్లు ఆవృత్తమై మంచి నడకను సమకూర్చింది.

### 3. లాటానుప్రాస:

ప్రథమమండలంలో 167వ సూక్తంలోని మొదటి ఋక్కులో **'సహస్రం'** అనేపదం నాలుగుసార్లు ఆవృత్తమౌతున్నది ఇది ఒక రకమైన లాటానుప్రాస. ఇదుగో చూడండి:

సహస్రం త ఇన్ద్రోతయో నః సహస్రమిషో హరివో గూర్తతమాః ।
సహస్రం రాయో మాదయధ్యై సహస్రిణ ఉప నో యన్తు వాజాః ॥

ఇందులో **'సహస్ర'** పదం ప్రతిపాదంలోను వినపడుతుంటే ఒక చక్కని ఊపు ఏర్పడి చెవికింపుగా ఉంటుంది.

వృషాసి దివో వృషభః పృథివ్యా
వృషా సిన్ధూనాం వృషభః స్తియానామ్ (6-44-21)

ఇందులో **'వృష'** అనే పదం నాలుగుసార్లు ఆవృత్తమై వినడానికి ఎంతో ఆహ్లాదాన్ని కలిగిస్తున్నది. ఇది లాటానుప్రాస ఇలాగే ఏడవ మండలంలో త్రిష్టుప్ఛందస్సులో నడిచిన **35** వ సూక్తమంతా లాటానుప్రాసలతో నిండి ఉంటుంది. **'శం నః'** అనే పదాలు, **13** ఋక్కుల్లో ప్రతిపాదంలోను ఆవృత్తమై ఒక చక్కని అందాన్ని అందిస్తున్నాయి.

ఇలాగే **'ఏష దేవః దివం పవమానః'** అనే పదాలు ప్రతి ఋక్కులోను తిరిగి తిరిగి రాగా చక్కని లాటానుప్రాసాలంకారానికి ఆశ్రయమౌతున్నది తొమ్మిదవమండలంలో మూడవసూక్తం.

**4. మకుటాలు:**

ఈ శబ్దాలంకారాలు కాక ఋగ్వేదంలో మనకు కొట్టవచ్చినట్లు కనబడేవి ఒకే మకుటంతో ఈనాటి మన శతకాలాగా కనపడే ఋక్కులు. ఇలాంటివి దాదాపు ప్రతిమండలంలోను కొద్దో గొప్పో కనపడుతూనే ఉంటాయి. బహుశా చివఱిపాదాన్ని ఒకేరకంగా చెప్పి స్తోత్రాలను, శతకాలను చెప్పటం ప్రారంభించిన వారికి ఈ ఋక్కులు స్ఫూర్తినిచ్చి ఉంటాయనుకోవడంలో తప్పు లేదేమో! కొన్ని ఇక్కడ ఉదాహరిస్తాను చూడండి!

| | | |
|---|---|---|
| 1. | మరుద్భి రగ్న ఆ గహి | (1-19) |
| 2. | ఉలూఖలసుతానామవేద్విన్ద్ర జల్గులః | (1-28) |
| 3. | ద్యుమ్నైరభి ణోనుమః | (1-78) |
| 4. | అర్చన్నను స్వరాజ్యమ్ | (1-80) |
| 5. | అప నః శోశుచదఘమ్ | (1-97) |
| 6. | ఇషం స్తోతృభ్య ఆ భర | (5-6) |
| 7. | అయం స సోమ ఇన్ద్ర తే సుతః పిబ | (6-43) |

8. ఇన్ద్రాగ్నీ తస్య బోధతమ్ (8-38)
9. అన్తి షద్భూతువామవః (8-73)
10. అథా నో వస్యసస్కృధి (9-4)
11. మదేషు సర్వధా అసి (9-18)
12. తత్ త ఆ వర్తయామసీహ క్షయాయ జీవసే (10-58)

పై పన్నెండు మకుటాలు ఆయా సూక్తాల్లో పూర్తిగా అన్ని ఋక్కుల్లోను, కొన్ని సూక్తాల్లో మాత్రం కొన్ని ఋక్కుల్లోను చివరి పాదంగా కనపడుతున్నాయి. చదివేటప్పుడు ఇవి చక్కగా చెవికింపుగా ప్రతి మంత్రంలోను వినపడుతుంటాయి

**5. అర్థాలంకారాలు :**

అర్థాలంకారాలు, అర్థం మనస్సుకు పడితేనేగాని గోచరించవు ఇవికూడా ఋక్సంహితలో అడుగడునా కనపడతాయి బహుశా ఏ అలంకారం లేని ఋక్కులే లేవేమోననిపిస్తుంది.

**(1) ఉపమ (Simile)**

ఉపమాలంకారం అలంకారాలన్నింటికి బీజంలాంటిదని, మిగతావన్నీ దీనినుంచి ఏర్పడినవేనని ఆలంకారికుల అభిప్రాయం. కనుకనే అలంకారనిరూపణంలో దానికి ప్రథమస్థానం లభిస్తున్నది

ఉపమానానికి (దేనితో పోలుస్తున్నామో అది) ఉపమేయానికి (పోల్చబడే వస్తువు) ఉచితమైన, చక్కని పోలిక కుదిరితే అది ఉపమాలంకారమౌతుంది[1].

---

1. ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీరుల్లసతి ద్వయోః ।
హృదయే ఖేలతోరుచ్చైః స్తన్వంగ్యాస్స్తనయోరివ ॥ చంద్రా.

సనః పితేవ సూనవేఽగ్నే సూపాయనో భవ ।
స చ స్వానః స్వస్తయే ॥ [1-1-9]

ఓ అగ్నిదేవా! 'కొడుకుకు మంచి చేయాలి, దగ్గఱగా ఉండి ఎప్పుడూ కాపాడాలని తండ్రి ఎలా అనుకుంటాడో, నీవుకూడా అలాగే మమ్మల్ని వెన్నంటి కాపాడి మాకు సకలశుభాలను కలిగించుమ' ని ప్రార్థిస్తున్నాడు మహర్షి. ఇక్కడ **'తండ్రిలాగా'** అని చక్కని ఉపమానాన్ని ప్రయోగించాడు ఇలాంటి ఉపమలు ఋగ్వేదంలో కోకొల్లలు. ఇక్కడ **'ఇవ'** ఉపమావాచకంగా (పోలికను తెలిపే శబ్దంగా) మనకు కనపడుతుంది. ఋగ్వేదం నాటికే **'ఇవ'** అనే దాన్ని ఉపమావాచకంగా ప్రయోగించడం ఉన్నదని మనం గుర్తించవచ్చు. ఇక్కడ పడిన ఉపమానం చాలా ఉచితమైంది అందమైంది కూడాను.

సూర్యో దేవీముషసం రోచమానాం ।
మర్యో న యోషామభ్యేతి పశ్చాత్ ॥ (1-115-2)

కుత్సమహర్షిచెప్పిన సూర్యస్తుతిపరమైన సూక్తంలోని ఋక్కు ఇది. ఇందులో ఉదయానికి ముందు సూర్యుడు ఉషస్సును అనుసరించి పోవడం, 'ఒక రసికుడు నవమోహనాంగియైన ఒక అందాలరాశి వెంట పోయినట్లు' అని చమత్కారంగా పోల్చబడింది. తెలతెలవార బోతున్నది. ఉషోదయం అయింది. ఉషస్సువెంటబడి వస్తున్నాడా! అన్నట్లు బాలభానుడు దాని వెంటవెంటనే ఉదయిస్తున్నాడు. ఈసందర్భానికి తగిన చక్కని ఉపమానం ఇక్కడ కుదిరింది.

వైదికసాహిత్యంలో చాలాచోట్ల **'న'** అనే శబ్దం ఉపమావాచకంగా ప్రయోగింపబడింది. పైఋక్కులో మనం ఇలాంటి ప్రయోగం చూడవచ్చు. లౌకికభాషలో కాలక్రమేణ ఈ ప్రయోగం తెరమరుగైంది.

వైదికభాషలోనే 'యథా' అనే దాన్ని ఉపమావాచకంగా ప్రయోగించడం ప్రారంభమైంది. ఋక్సంహితలో ఇలాంటి ప్రయోగాలు మనకు కనబడుతున్నాయి అదే ఒరవడిలో లౌకిక భాషలో ఈ ప్రయోగం ప్రవేశించింది.

ఐదవమండలంలో ఒక సూక్తం చూడండి. ఈ సూక్తంలో **'సప్తవధ్రి'** అనే మహర్షి అశ్వినీ దేవతలను స్తుతిచేస్తున్నాడు. ఇతడొక మంత్రద్రష్ట. దాయాదులు రాత్రంతా ఇతణ్ణొక పెట్టెలో వేసి తాళంపెట్టి భార్యతో కలవకుండా చేశారు. ప్రతిఉదయం దాంట్లోంచి బయటకులాగి చావచితక తన్నేవాళ్లు. ఎన్నోరాత్రులిలా గడిచాయి. అతడికి విముక్తిలేదు. చివఱకు అతడికి ఉపాయం తట్టింది. అశ్వినీ దేవతలను పెట్టెలో ఉండే స్తుతించాడు వారు వచ్చి అతణ్ణి విడిపించారు. రాత్రంతా హాయిగా భార్యతో కాలక్షేపంచేసి భయంతో తెల్లవారేటప్పటికి పెట్టెలో కూర్చున్నాడు. తరువాత భార్యగర్భవతి కాగా సుఖప్రసవం కలగాలని అశ్వినీ దేవతలను స్తుతిస్తాడు. ఆ సందర్భంలోనిది ఈ ఋక్కు.

యథా వాతః పుష్కరిణీం సమింగయతి సర్వతః ।
ఏవా తే గర్భ ఏజతు నిరైతు దశమాస్యః[1] ॥ (5-78-7)

---

1. పై ఋక్కుతో ఈ క్రింది రెండు ఋక్కులను కలిపి 'గర్భ స్రావిణ్యుపనిషత్' అంటారు దీన్ని సప్తవధ్రి మహర్షి తనభార్య సుఖప్రసవంకోసం అశ్వినీ దేవతలను స్తుతిచేస్తూ చెప్పాడని సాయణభాష్యం చెబుతున్నది. వీటిని పఠించడంవల్ల స్త్రీలకు సుఖప్రసవం కలుగుతుందని భారతీయుల విశ్వాసం

యథా వాతో యథా వనం యథా సముద్ర ఏజతి ।
ఏవా త్వం దశమాస్య సహావేహి జరాయుణా ॥
దశమాసాఞ్ఛయానః కుమారో అధి మాతరి ।
నిరైతు జీవో అక్షతో జీవో జీవన్త్యా అధి ॥ (5-78-8,9.)

ఎలా మందమారుతం పుష్కరిణినంతటిని బాగా కదిలించి వేస్తుందో, అలా నీగర్భం ఇటు అటు కదలాలి. పదిమాసాలు నీ కడుపులో ఉన్న శిశువు చక్కగా బయటకు రావాలి.

ఇక్కడ గర్భాన్ని పుష్కరిణితో పోల్చటం ఎంతో అందంగా ఉంది. పుష్కరిణిలోంచి పద్మం వికసించినట్లు శిశువు ఉత్పన్నం కావడం ఎంతో సహజంగాఉంది. ఆనాటికే పుష్కరిణి ఎంత ప్రసిద్ధమైందో ఇక్కడ మనం గమనించవచ్చు.

**(2) అతిశయోక్తి (Hyperbole)**

అతిశయమంటే ఉత్కర్ష. చదివేవాళ్ళకు ఒక చక్కని చమత్కారాన్ని అందించడమన్నమాట. ఉక్తి అంటే పలుకుబడి. అలాంటి చమత్కారం ఉండేట్టు చెప్పడాన్నే అతిశయోక్తి అంటారు లేనిదాన్ని గొప్పగా చెప్పడమే ఇందులో కనబడుతుంది. చూడండి:

యదిన్ద్ర యావతస్త్వ మేతావదహమీశీయ ।
స్తోతారమిద్దిధిషేయ రదావసో న పాపత్వాయ రాసీయ ॥ [7-32-18]

'ఓ దేవేంద్రా! నీకెన్ని సిరిసంపదలున్నాయో నీదయవల్ల నాకు కూడా అన్ని సంపదలేర్పడతాయి. అప్పుడు నీవు నీ భక్తులకు సకలైశ్వర్యాలిచ్చినట్లే నేను కూడా భగవంతుణ్ణి స్తుతించే భక్తులను పోషిస్తాను. పాపులకు ఏరకమైన సహాయం చేయను" అంటాడు మహర్షి.

ఇందులో అసంభావితమైన ఇంద్రుని ఐశ్వర్యాన్ని తను పొందగలననుకోవడం, అతనిలాగానే తానుకూడ భక్తులను కాపాడుతా ననుకోవడం అతిశయోక్తి. మానవుని ఆశాలత ఆనాడే అనలు తొడిగిందనడానికి ఈ అతిశయోక్తి ఒక చక్కని నిదర్శనం.

**(3) రూపకం (Metaphor)**

ఉపమానోపమేయాలకు అభేదాన్ని చెప్పడం రూపకం అవుతుంది. ఉదా: ముఖచంద్రుడు మొ॥. బొమ్మ గీయకముందు 'గోడ' అంటాం. గోడనిండా బొమ్మగీచిన తరువాత అడుగో 'వేంకటేశ్వరస్వామి' అంటామేగాని గోడ అనం. అంటే బొమ్మగోడను ఆవరించి దానితో ఒకటైపోయిందన్నమాట. దీన్నే రూపకం అంటారు[1]. చూడండి:

యః కుక్షిః సోమపాతమః సముద్ర ఇవ పిన్వతే [1-8-7]

సోమపానం బాగాచేయగల ఇంద్రుడనే ఉదరం సముద్రంలాగా పెరిగిపోతున్నదని ఇంద్రునికీ ఉదరానికి అభేదం చెప్పడంలో ఇక్కడ రూపకాలంకారం. కొందఱు ఇక్కడ 'ఇంద్రస్య' అని అధ్యాహారం చేసుకొని కూడా వ్యాఖ్యానం చేశారు. అప్పుడు రూపకం కాదు.

**(4) ఉత్ప్రేక్ష (Poetical fancy):**

హేతువుగానిది హేతువుగాను, వస్తువుగానిది వస్తువుగాను, ఫలంగానిది ఫలంగాను ఎక్కడ సంభావింపబడుతుందో అది ఉత్ప్రేక్షాలంకారం. ఇది కవి బుద్ధివైభవాన్ని చాటి చెబుతుంది. **'సంభావానా స్యాదుత్ప్రేక్షా'** అని దీన్ని నిర్వచిస్తారు. ఋగ్వేదం నాటికే ఈ రకమైన వాక్యభంగి మనకు బాగా కనబడుతుంది. చూడండి:

అస్యేదు భియా గిరయశ్చ దృహ్లా
ద్యావా చ భూమా జనుషస్తు జేతే । [1-61-14].

---

1. 'రూపం అస్యాస్తీతి రూపవత్' రూపవత్ కరోతీతి రూపకమ్'. ఏ అలంకారం ఉపమేయాన్ని ఉపమానరూపంతో కలసి ఉండేట్లు చేస్తుందో అది రూపకం.

యత్రోపమానచిత్రేణ సర్వధాప్యుపరజ్యతే ।
ఉపమేయమయీ భిత్తిస్తత్ర రూపకమిష్యతే ॥ చంద్రా.

'ఇంద్రుడు తమరెక్కలు నరుకుతాడేమోనన్న భయంచేత పర్వతాలు నిశ్చలంగా దృఢంగా అయిపోయినాయి భూమ్యాకాశాలు కూడ అప్పుడే ఆవిర్భవించిన ఆ ఇంద్రుని భయంచేతనే వణికి పోతున్నాయి 'అంటున్నాడు మహర్షి.

ఈ ఋక్కులో పర్వతాలు చలనం లేకుండా దృఢంగా ఉండటం, భూమ్యాకాశాలు కంపించిపోవడం ఇంద్రుని భయం వల్లనని సంభావింపబడుతోంది. ఇవాది శబ్దాలు లేకుండా కూడా ఆ సంభావనం గమ్యమౌతోంది. కాబట్టి ఇది ఉత్ప్రేక్షాలంకారం.

**(5) అర్థాన్తరన్యాసం (Corroboration):**

ఒక సామాన్యవిషయాన్ని చెబుతూ ప్రత్యేకంగా ఒక విశేష విషయాన్ని చెప్పడం, లేక విశేష విషయాన్ని చెబుతూ అది లోకంలో సామాన్యమేనని సామాన్యవిషయాన్ని వెంటనే చెప్పడం అర్థాన్తర న్యాసాలంకారం. విశేషాన్ని ముందు చెప్పి దాన్ని సామాన్యంతో సమరించడం ఈ క్రింది ఋక్కులో మనకు కనబడుతుంది. చూడండి:

మా త్వా సోమస్య గల్దయా సదా యాచన్నహం గిరా ||
భూర్ణిం మృగం న సవనేషు చుక్రుధం క ఈశానం న యాచిషత్ ||
(8-1-20)

'ఓ ఇంద్రా! ప్రభువువు, సింహంలాగా భయంకరుడవు అయిన నిన్ను ఎప్పుడూ యాచిస్తున్నాను. కనుక నీకు నామీద కోపంరావడం సహజం. అయితే యజ్ఞాలో నీకు సోమరసాన్ని అర్పించడంచేత, నీ గుణగణాలను స్తుతించడంచేత నీ కోపాన్ని పోగొడుతున్నాను. అయినా లోకంలో తన స్వామిని ఎవరు యాచించకుండా ఉంటారు? అందఱు దేవుని యాచిస్తూనే ఉంటారు' అంటూ విశేషాన్ని సామాన్యంతో సమర్థిస్తూ ఇక్కడ మహర్షి మంచి అర్థాం తరన్యాసాలంకారాన్ని ప్రయోగించాడు.

**(6) వ్యతిరేకం (Contrast or Prenity):**

ఉపమానానికి ఉపమేయానికి సాదృశ్యం చెప్పి, మళ్లా భేదం చెపితే అది వ్యతిరేకాలంకారమౌతుంది. పోలికగల రెండిటికి తేడా చెప్పడమన్నమాట చూడండి:

మూరా అమూర న వయం చికిత్వో
మహిత్వమగ్నే త్వమజ్గ దిత్సే (10-4-4)

'ఓ మహాజ్ఞానీ! చైతన్యవంతుడా! అగ్నిదేవా! మూఢులమైన మేము నీ మాహాత్మ్యాన్ని తెలుసుకోలేకపోతున్నాం నీ మహాత్మ్యం నీకుమాత్రమే బాగా తెలుసు. నీకంటే ఇతరులకెలా తెలుస్తుంది?' అని అగ్నిహోత్రుని మహత్వాన్ని స్తుతిస్తున్నాడు మహర్షి.

ఇక్కడ అగ్నిహోత్రునికి తమకు ఉన్న భేదం స్పష్టంగా గోచరిస్తున్నది. ఆయన మహాజ్ఞాని. మానవులు మూఢులు. కనుక ఆయన మాహాత్మ్యం వీళ్లు తెలుసుకోలేరు ఈ విషయాన్ని చెప్పి అది నీకుమాత్రమే తెలుసు. నీకంటే ఇతరులకెలా తెలుస్తుంది? అనడం వ్యతిరేకాలంకారమౌతున్నది.

ఇలా ఋక్సంహితలో ప్రతిసూక్తంలోను ఎన్నో పలుకుబళ్లు, వర్ణనలు, అలంకారాలు కోకొల్లలుగా మనకు కనపడతాయి. కొన్నిమాత్రం మచ్చుకు ఇక్కడ ప్రస్తావింపబడ్డాయి. ఇంకా తెలుసోకోవాలనే ఉత్సాహం కలవాళ్ళకు ఇది కేవలం మార్గదర్శకం మాత్రమే.

- ఎస్.బి.ఆర్.

## 1. 12 మండలాలు సంగ్రహసమీక్ష:

ఛందోబద్ధమైన ఋక్కులనబడే మంత్రాలసముదాయమే ఋక్సంహిత. చరిత్రకందనికాలంలో ప్రకృతిలోని అనేక పదార్థాల్ని, వాటి అద్భుతశక్తిప్రాభవాలను చూసి ఆనందించి, వాటి వెనుకగల దేవతామూర్తుల్ని, వారి తాత్త్వికస్వరూపాన్ని దర్శించిన మహర్షుల స్తోత్రసంపుటి అది. ఎవరెలా వ్యాఖ్యానిస్తే వారికలా కనపడే ఈ అర్థ విజ్ఞానకోశం అపౌరుషేయమని - ఏ వ్యక్తిచేతను తన బుద్ధిబలంతో ఆలోచించి వ్రాయబడ్డది కాదని మహనీయులైన మహర్షుల్లచేత తపశ్శక్తితో దర్శింపబడిందని మన విశ్వాసం. ఇది ఎంతో సమంజసం. కాని భాష, పదసముదాయం, ఛందస్సు, రీతి, వ్యాకరణం, భావ విశేషాలు మొ॥ వాటినిబట్టి ఇది ఒకప్పుడు ఋషులచేత రచింపబడిందై ఉండవచ్చునని కొందఱు విమర్శకుల వాదం. ఎందఱో ఋషుల అనుభవాలైన ఈ ఋక్కులు మొదట వేటికవే ముక్తకాలుగా ఉండి తరువాత ఒకచోట కూర్చబడి సంహితగా రూపొందించబడ్డాయి. సంహిత అంటే కూర్పు అని అర్థం. ఈ కూర్పులో ఓచక్కని క్రమం కనబడుతుంది.

ఋక్సంహిత రెండురకాలుగా విభజింపబడుతున్నది. మొదటిది అష్టకవిభాగం (చూ పే 9). ఈ విభాగం అధ్యయనానికి చాలా సులభంగా ఉన్నా కొత్తగా ఏర్పడింది ఆట్టే శాస్త్రీయమైందనడానికి వీల్లేదు.

రెండవది మండలవిభాగం ఇది చాలా శాస్త్రీయమైంది. చరిత్రాత్మకమైన విలువ గలది. ఋగ్వేదబ్రాహ్మణంలోనే ఋగ్వేద మండలాలను గూర్చిన ప్రసంగం ఉంది. అందువల్లనే ఈ విభాగం చాలా ప్రాచీనమైందని వెల్లడవుతోంది. ఈ విభాగం ప్రకారం ఋక్సంహిత 10 మండలాలుగా విభజింపబడింది (చూ. పే.8).

ఈ సంహితలో ప్రతిసూక్తానికి ఋషి, దేవత, ఛందస్సు మొదట్లోనే చెప్పబడుతుంది. వీటిని బాగా అర్థం చేసుకోకపోతే మండల విభాగంలోని వైశిష్ట్యం సరిగా అర్థంకాదు. ఋగ్వేదపాఠంలో గాని, పారాయణలోగాని, జపహోమాదుల్లోగాని, ఋషి దైవత ఛందస్సులను తప్పక చెప్పితీరాలి. ఇది ఋగ్వేదం ప్రత్యేకత.

ఈ సంహితలోని 10 మండలాల్లోను, 2 నుంచి 7 వరకుగల 6 మండలాలు కూర్పులోని తీరునుబట్టి స్వభావాన్నిబట్టి ఒకేరకంగా కనపడతాయి. 1,8,9,10, మండలాలు ఒక్కొక్కటి ఒక్కొక్క పద్ధతిలో అమర్చబడ్డాయి.

పై ఆరు మండలాలను 'ఋషిమండలాలు' 'వంశమండలాలు' 'కులమండలాలు' అని పిలుస్తూ ఉంటారు. దీనికి కారణం ప్రతి మండలం ఒక్కొక్క ఋషిచేతగాని లేక ఋషివంశపువారిచేత గాని దర్శించబడ్డ మంత్రాలసముదాయంగా కనబడటమే. వేఱే ఋషి దర్శించిన మంత్రం మచ్చుకొకటి కూడా ఇందులో కనబడదు. ఈ ఆరుమండలాలకు వరుసగా గృత్సమదుడు, విశ్వామిత్రుడు, వామదేవుడు, అత్రి, భరద్వాజుడు, వశిష్ఠుడు ఋషులు.

ఈ మండలాలలో ఇంకా కొన్ని సాధారణధర్మాలు సమంగా కనపడతాయి. ఉదాహరణకు - వీటిలో ప్రతి మండలంలోనూ మొదట కొన్ని సూక్తాలు అగ్నిని సంబోధిస్తున్నాయి. తరువాత గల కొన్ని సూక్తాలు ఇంద్రుని సంబోధిస్తున్నాయి. అటుతర్వాతనే ఇతర దేవతాపరాలైన సూక్తాలు కూర్చబడ్డాయి.

ఎనిమిదవ మండలపు కూర్పులోని 103 సూక్తాలలో కణ్వుడు గాని కణ్వవంశీయులైన ఋషులుగాని మూడువంతులకు పైబడిన సూక్తాలకు ఋషులుగా ఉన్నారు.

తొమ్మిదవ మండలం తన ప్రత్యేకతను స్పష్టంగా చాటి చెపుతుంది. ఈ మండలంలోని అన్ని సూక్తాలు తప్పనిసరిగా పవమాన సోమదేవతను గూర్చి సంబోధింపబడ్డాయి. అందువల్లనే దీనిని 'పవమానమండలం' అని వ్యవహరిస్తూ ఉంటారు. అయితే ఈ సూక్తాల ఋషులుమాత్రం కొత్తవారు కారు 2 నుంచి 7 వరకు గల ఋషిమండలాలకు వరుసగా ద్రష్టలైన గృత్సమదుడు మొ॥ ఋషులే ఈ సూక్తులకు కూడా ఋషులుగా ఉన్నారు. దీనిని పట్టి చూస్తే ఋషిమండలాల్లోని పవమాన సోమదేవతాకాలైన సూక్తాల్ని ఒకటిగా చేర్చి తొమ్మదవమండలంగా కూర్చారన్నది స్పష్టమౌతుంది. ఈ మండలాల్లోని సూక్తాలు ఛందోనుసారంగా అమర్చబడ్డాయి. 1-67 గాయత్రి, 68-86 జగతి, 87-97 త్రిష్టుప్, 98-114 అనేక వృత్తాలు ఇందులో మనకు కనబడుతున్నాయి.

మొదటి మండలంలో ఒక్కొక్క ఋషి దర్శించిన సూక్తాలను ఒక్క సముదాయంగా స్వీకరించి అలాంటి 14 సూక్తసముదాయాలు కూర్చబడ్డాయి. ఈ సూక్తసముదాయాలలో సూక్తాల్ని అమర్చడం అయా సూక్తాల్లో స్తుతింపబడే దేవతలననుసరించి చేయబడింది కాగా 11 సూక్తాలుగల మొదటిసూక్తసముదాయంలో, మొదటి సూక్తం అగ్నిని, రెండవది వాయువును, మూడవది అశ్వినులను, ఇంద్రుని, 4 నుంచి 11వ సూక్తం వరకు ఇంద్రుని స్తుతిస్తున్నాయి. అంటే ఋషిమండలాలను అమర్చినక్రమంలో సూక్తసముదాయాలలో సూక్తాల్ని మార్చారన్నమాట.

పదవమండలంలో సూక్త మంత్రాలసంఖ్య తప్ప మరి ఏ నియమం కనబడదు. ఈ మండలంలోగల 191 సూక్తాలలో 1నుంచి 84 వఱకుగల సూక్తాలు కొన్ని సముదాయాలుగా విభజింపబడ్డాయి. ఈ సూక్తసముదాయాలలో ముందుదానికన్నా తరువాతి సూక్త సముదాయం తక్కువ సూక్తాలు కలదిగా ఉంటుంది. 85 నుంచి

191 వరకుగల సూక్తాలు విడిసూక్తాలే. అయితే వీటిలో కూడా ముందు సూక్తంకన్నా తరువాత సూక్తంలో మంత్రాలసంఖ్య తగ్గుతూ ఉంటుంది. మొదటి మండలంలోనూ పదవమండలంలోనూ సూక్తసంఖ్య

ఖిల్య సూక్తాలనే పేరుతో 11 సూక్తాలు ఉన్నాయి. వీటిలో ఎక్కువభాగం 8వ మండలం చివరిలో చేర్చబడ్డాయి. వీటికి మండలానువాక సంఖ్యాపరిగణనంలో గుర్తింపులేదు. సాయణాచార్యులవారు ఈ సూక్తాలకు భాష్యం వ్రాయలేదు. వీటికి పదపాఠం కూడా లేదు. ఇవిగాక 10 ఆప్రీసూక్తాలు పది మండలాల్లోనూ అక్కడక్కడా కనుపిస్తాయి. సాధారణంగా ఈ సూక్తాలలో ఒక్కొక్క దానిలో 11 మంత్రాలు ఉంటాయి. ఒక్కొక్క మంత్రం ఒక్కొక్క దేవతను సంబోధిస్తుంది కాగా ఆప్రీసూక్తాలన్నిటిలో మొదటి మంత్రం అగ్నిని, రెండవది తనూనపాత్తును లేక నరాశంసుని, మూడవది ఇళను, నాల్గవది బర్హిస్సును, ఐదవది దేవియైన ద్వారను, ఆరవది ఉషాసానక్తాలను, ఏడవది దివ్యమైన హోతలను, ఎనిమిదవది సరస్వతిని, తొమ్మిదవది త్వష్టను, పదవది వనస్పతిని, పదకొండవది స్వాహాకృతిని సంబోధిస్తాయి.

ఇది స్థూలంగా ఋగ్వేదమండల స్వరూపం

ఋక్సంహితలోని విషయపరిశీలనం చాలా కష్టమైనపని ఇందులో లేనిది లేదన్నట్టుగా అన్ని విషయాలు కనబడతాయి వేదార్థాన్ని విచారిస్తూ వచ్చిన పరంపర ఏకారణాన్నో మధ్యలో విచ్ఛిన్నమవడంవల్ల చాలా వేల సంవత్సరాలవెనక ఏర్పడ్డ ఈ మంత్రాల అసలు అర్థం ఏమిటన్నది విమర్శకులకందకుండా ఉంది 'పశువులకాపరులతో సమానమైన అనాగరికులైన ఆర్యులు ప్రకృతిని, దానిలో శక్తిని చూచి అర్థంకాక, వారికి నచ్చినరీతిలో భయంకరం

ఆశ్చర్యకరమైన ప్రకృతిని భావించుకున్న తీరుకు శబ్దరూపమే ఈ మంత్రాలు' అని కొందరి వాదం. లక్ష్మణరేఖలా ఒకగీత గీసుకొని దానికి పూర్వం నాగరికత, మానసికపరిక్వత ఉండకూడదని నిర్ధారణ చేసుకొని వేదమంత్రాలను వ్యాఖ్యానించేవారి పాక్షికమైన మతం ఇది

అలాకాక 'మంత్రాల ఉచ్చారణద్వారా వాటిలోని అతి మానుషమైన శక్తివల్ల ఆయా దేవతలను సాక్షాత్కరించుకొని వివిధ యజ్ఞయాగాదులద్వారా వారిని సంతృప్తులను చేయడానికి ఉపయోగపడేవి మంత్రాలు' అని మరికొందరి భావన

'బాహ్యరూపంలో ప్రకృతి, దేవతలు అర్థంగా భాసించినా వాటి వెనక నిగూఢంగా అధ్యాత్మవిషయాలు దాచబడ్డాయి. ఆ విషయపరంగానే వేదాల్ని వ్యాఖ్యానించాల'ని మరికొందరి మతం.

కాగా ప్రతిమంత్రానికి మూడురకాలైన అర్థాల్ని వివరించవచ్చు. 1 ఆధిభౌతికార్థం, 2. ఆధిదైవికార్థం, 3. ఆధ్యాత్మికార్థం. ఉదాహరణకు - ఉషస్సూక్తంలోని ఉషశ్శబ్దానికి ప్రతి ఉదయం సాక్షాత్కరించే **'అరుణోదయ'** మని ఆధిభౌతికార్థం. మనుష్యులను నిద్రనుంచి మేల్కొలిపి జాగృతులను చేస్తూ ఉపకరించే ఉషఃకాలాధిపతియైన **'ఉషోదేవత'** అని ఆధిదైవికార్థం. మనుష్యుల అహంకార మమకారాది రూపమైన అజ్ఞానాన్ని నశింపజేసి ఆత్మస్వరూప సాక్షాత్కారానికి ఉపయోగించే **'ఆత్మతత్త్వజ్ఞానం'** అని ఆధ్యాత్మికమైన అర్థం. ఈ మూడర్థాలను స్వీకరించి సూక్తంలోని ప్రతి మంత్రానికి మూడురకాల వ్యాఖ్యానం కొనసాగించవచ్చు.

వైజ్ఞానిక రంగంలో చాలా ముందుకు పోయామన్న ఈ కాలపు విజ్ఞానానికి సమంగానో ఎక్కువగానో అనేక విషయాలు ఋఙ్మంత్రాల్లో కనపడతాయి. మనకర్థంకానివన్నీ ఆ మంత్రద్రష్టల అనాగరికతకు

తార్కాణాలనుకోవడం ఉచితం కాదేమోననిపిస్తుంది. ఈ మంత్రాలకు సంబధించిన సరైన అర్థాన్ని అవగాహన చేసుకోవడం వైజ్ఞానికంగా ఇంకా పురోగమిస్తేగాని కుదరదేమో!

ఋక్సంహితలోని విషయాలను అన్ని దృక్పథాలనుంచి పరిశీలించడం ప్రస్తుతం కానిపని. కాబట్టి అందరికీ సులభంగా అర్థమయ్యేవి, ఇంతో కొంతో దేశకాలానుసారంగా అందరికీ ఆసక్తిని పెంపొందించేవి మండలాలవారీగా కొన్ని మాత్రమే ఇక్కడ పేర్కొన బడుతున్నాయి. దీనిని కొలబద్దగా తీసుకొని వేదంలో ఉండే విషయాలు ఇంతేనని మాత్రం భ్రమపడకూడదు. సమీక్ష కోసం కొన్నింటిని మాత్రమే ఇక్కడ ప్రస్తావిస్తున్నాను.

## మొదటిమండలం

**అందరికీ వందనాలు :**

అవతలివ్యక్తిలో ఉండే గొప్పతనాన్ని గుర్తించడం, ప్రపంచంలో పరమాత్మను సందర్శించడం, ఆనాటివారి ఆలోచనలలో మనకు స్పష్టంగా కనబడుతుంది.

'పెద్దలకు-చిన్నలకు, యువకులకు -వృద్ధులకు నమస్కారం యజ్ఞాలచేత దేవతలకు ప్రీతిని కలిగించినప్పటికి, పెద్దలకు, మనకన్నా గొప్పవారికి గౌరవాన్నివ్వడంలో మాత్రం ఏ పొరపాటు లేకుండా ఉందాం! (1-27-13).

**రండి! రండి! :**

భగవంతుణ్ణి అన్వేషించడం ఆరాధించడం చక్కనిమార్గం. ఆ మార్గంలోకి అందఱు ఆహ్వానింపబడేవారు అనాడు.

'సత్యస్వరూపుడైన ఈశ్వరుని అన్వేషించేవాడికి చక్కనిమార్గం ఉంది. ఇది రాజమార్గం. ఎత్తుపల్లాలు ముళ్లులేని మార్గం.

ఓ అన్వేషులారా! ఈ వైదికవిజ్ఞానమార్గంలో ఒడుదుడుకులు లేవు. రండి!' (1-41-4).

**ఈశ్వరస్వరూపం :**

భగవంతుని స్వరూపం వాచామగోచరం అనే భావం ఋగ్వేదంనాటికి బాగా ప్రజల్లో నాటుకున్నది

'ఈశ్వరా! ఈ భూమి మఱి పదిరెట్లు పెద్దదైనా, ఈ భూమి మీది ప్రాణులన్నీ రాత్రింబవళ్లు నీ గొప్పతనాన్ని కీర్తించినా, నీశక్తిని, జ్ఞానాన్ని, పరాక్రమాన్ని పూర్తిగా వర్ణించలేవు. సర్వవ్యాపకమైన నీస్వరూపంతో భూమిని, ద్యులోకాన్ని అంతటినీ వ్యాపించి ఉన్నావు. సకలప్రపంచానికి నీవే నియంతవు. భూలోకద్యులోకాలు రెండూ కలిసినా నీస్వరూపంతో పోలవు. సముద్రం - రోదసీ కలసి కూడా నీ గాంభీర్యాన్ని అణుమాత్రంగానైనా పొందలేవు' (1-52-11,13,14).

**కన్నతండ్రి :**

దేవుడు మనల్ని ఎప్పుడూ కాపాడుతున్నాడనే నమ్మకం అందఱిలోను ఉండేది.

'కన్నతండ్రిలా ఈశ్వరుడు భూలోకద్యులోకాలలో ఉండే సమస్తప్రాణులను ఉద్ధరించడానికి రెండు చేతులనూ చాచుతున్నాడు. తననుంచే పుట్టిన ఈ రెండు లోకాలను కాపాడటమే అతని ధ్యేయం. ఎవరు తననెలా భావిస్తే అతనికి తను అలాగే భాసిస్తాడు' (1-95-7).

**కాలచక్రం :**

అనాటివారు కాలాన్ని ఎంత చక్కగానో పరిశీలించారు.

'కాలమనే నిత్యమైన చక్రానికి పన్నెండు ఆకులు (నెలలు) ఉన్నాయి. నిరంతరం తిరుగుతూ ఉండే ఈ చక్రానికి ఏడువందల ఇరవైమంది కొడుకులు **(360+360=720)** పగళ్లు, రాత్రులు) ఉన్నారు' **(1-164-11).**

**జీవుడు - దేవుడు :**

మనకు - దేవునికి ఉన్న తేడాను ఎంతో స్పష్టంగా పరిశీలించారు ఋగ్వేదద్రష్టలు.

'ఒకరిమీద మఱి ఒకరికి అత్యంత ప్రేమగల రెండు పక్షులు (జీవాత్మ పరమాత్మలు) ఎల్లప్పుడు ఒకచెట్టునే (దేహం) ఆశ్రయించి ఒకచోటనే నివసిస్తున్నాయి. వాటిలో ఒకటి (జీవాత్మ)ఆ చెట్టున కాసినఫలాన్ని (కర్మఫలాన్ని) ఆస్వాదిస్తున్నది. మఱి ఒకటి (పరమాత్మ) తినకుండానే (కర్మఫలానుభవం లేకుండా) స్వప్రకాశమై భాసిస్తున్నది' **(1-164-20).**

**ఋగ్వేదతాత్పర్యం :**

ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవడం చాలా ముఖ్యమనే భావన ఆనాడే ఉన్నది

'అన్ని కాలాల్లో అన్ని దేశాల్లో ఉండేది ఆత్మతత్త్వం. దీనినుంచే సమస్తమైన దేవతలు పుడుతున్నారు. దీనికధీనులై మసలుతున్నారు. అట్టి ఆత్మతత్త్వం తెలియనివాడికి ఋగ్వేదంవల్ల ఏమి ప్రయోజనం? ఆత్మతత్త్వాన్ని తెలిసిన వ్యక్తికే నిజమైన ఆనందం '**(1-164-39).**

**శ్రుతి :**

దేవుడు, జగత్తు వేదంపైనే ఆధారపడి ఉన్నారని ఋగ్వేదం నొక్కి చెబుతున్నది.

'అన్నిచోట్ల వ్యాపించి ఉండే ఈశ్వరుడులాగా శ్రుతి అనబడే వేదం కూడా అన్నిచోట్ల వ్యాపించి ఉంది. ఒకటి మొదలు అనంతాలైన శబ్దాలుకల ఈ శ్రుతి అనేకవిధనిగుఢార్థాలతో నిండి ఉంది. శ్రుతినుంచే సమస్త పవిత్రగ్రంథాలు పుట్టాయి. దీనివల్లనే నాల్గుదిక్కులు ప్రకాశవంతంగా ఉన్నాయి. దీనినుంచే సమస్తజగత్తుకు కారణమైన ఈశ్వరుడు ఏర్పడుతున్నాడు. ఈ జగత్తు శ్రుతివల్లనే జీవిస్తున్నది' **(1-164-41,42).**

## రెండవమండలం

**శుభాకాంక్ష :**

ఈ మండలంలో సామూహికంగా అందఱికి మంచి కలగాలనే భావం ఇలా కనబడుతున్నది.

'ఓ ఈశ్వరా! మాకు అన్నిటికన్నా శ్రేష్ఠాలైన ధనాలనివ్వు! వివేకవంతులమైన మాకు మాకర్తవ్యాన్ని తెలియజేయి. మాలో సన్నిహితుడవై ఉండు. మితిలేని ఐశ్వర్యాన్ని, ఆరోగ్యాన్ని, మధురమైన వాక్కును ప్రసాదించు ప్రతి ఒక్కరోజును మంచి రోజుగా చేయి' **(2-21-6).**

**మంచిదోవలో పెట్టే బృహస్పతి :**

'ఓ బృహస్పతీ! నీవు మమ్మల్ని సన్మార్గంలో పెట్టి కాపాడు తున్నావు. నిన్ను శరణుపొంది నీకు స్వాత్మసమర్పణం చేసికొన్న వానికి పాపం, భయం, ఆపద, నాశం, శత్రువులు, చెడుమిత్రులు ఉండరు. మా సత్ప్రవర్తనకు ప్రతిబంధకమైన అంతఃశత్రువులను నాశం చేయి. నీవు మారక్షకుడవు. మంచిమార్గంలో మమ్మల్ని చేర్చి జ్ఞానాన్ని ప్రసాదించు. జ్ఞానాన్ని పొంది నిన్ను మరింతగా సేవించగలం. పెడమార్గాన్ని పట్టిస్తున్న మా అజ్ఞానాన్ని దూరంచేసి మామార్గాన్ని నిష్కంటకం చేయి' **(2-23-4,5,6,7).**

**అన్నివైపులనుంచి అభయం :**

భగవద్భక్తుడు తన రక్షణకోసం ఆలోచించనక్కఱలేదని ఆనాటివారి దృఢవిశ్వాసం.

'సర్వేశ్వరుడు అన్నివిధాలైన ఉపద్రవాలను పోగొడతాడు. భగవంతుని అనుగ్రహం గలవాడికి ఎటువైపునుంచి ఏలాంటిభయం కలుగదు. వాడికి అన్నీ శుభాలే కలుగుతాయి. ఓ ఈశ్వరా! నీవు శత్రునాశకుడవు! మాకు అన్నివైపులనుంచి అభయాన్నివ్వు" (2-41-10,11,12).

## మూడవమండలం

ఈ మండలంలో అగ్ని మనకు సర్వస్వాన్ని ఇచ్చేవాడుగా కీర్తింపబడ్డాడు (3-1-15).

**దుష్టశిక్షణ - శిష్టరక్షణ :**

భగవంతుడు దుష్టులను శిక్షించడం, శిష్టులను రక్షించడం ఈ మండలంలో పేర్కొబడింది.

'సర్వశక్తీ! భగవంతుడా! అన్నిదిక్కులలో ఉండే క్రూరులను సమూలంగా నాశనంచేయి. ఎవడైనా సరే, మంచివాడిని రక్షించు' (3-30-17).

## నాల్గవమండలం

**సత్పురుషులు :**

ఈ మండలంలో సత్పురుషుల ప్రవృత్తిని గురించి ఒక చక్కని పరిశీలన మనకు కనబడుతుంది.

'రైతు గుఱ్ఱాలగుంపులో తను కూర్చోడానికనువైన విశాలమైన వెన్నుగలవేవి, అలాంటి వెన్నులేనివేవి అని ఎలా తెలుసుకుంటాడో అలాగే సత్పురుషులు జ్ఞానంనుంచి అజ్ఞానాన్ని విడిగా

తెలుసుకొంటున్నారు. వారు ఈశ్వరుని దర్శించడానికై ఎల్లప్పుడూ మంచిపనులే చేస్తారు. కమ్మరివాడు ఖనిజాన్ని కరిగించి శుభ్రం చేసినట్లు ఆధ్యాత్మికతత్త్వజ్ఞానంతో వారు తమను తాము పవిత్రీకరించుకొంటున్నారు. అనేకసార్లు ఆత్మప్రకాశాన్ని పొంది దానిని తమచుట్టూ ప్రసరింపజేసుకోవడానికి ఆధ్యాత్మికపరిషత్తులలో ఆత్మ విచారాన్ని సాగిస్తూ వైదికజ్ఞానాన్ని పొందుతున్నారు '(4-2-11,17).

**వైదికవిజ్ఞాన ప్రవంతి :**

వైదిక విజ్ఞానవాహినియొక్క తత్త్వం ఈ మండలంలో ఎంతో అందంగా పరిశీలించబడింది

'అజ్ఞానంచేత కప్పబడి ఉన్న జ్ఞానాన్ని దేవతలు కనుక్కున్నారు. మూడు స్వరూపాలు గల ఈజ్ఞానంలో ఒక అంశాన్ని ఇంద్రుడు, ఇంకో అంశాన్ని సూర్యుడు, మఱి ఒక అంశాన్ని ఋషులు తమ తపఃశక్తిచేత కనుగొన్నారు. పరమాత్మనుంచి ప్రవాహంలాగా వచ్చే వేదాలలో జ్ఞానమంతా దాచబడి ఉంది. ఈశ్వరానుగ్రహం లేనివారు దాన్ని కనుక్కోలేరు. ఈశ్వరానుగ్రహంచేతనే నేను తెలుసుకుంటున్నాను. ధ్యానంచేసేవాడి మనస్సునుంచి నదీప్రవాహాల్లాగా ఈ జ్ఞానాలు వేగంగా వస్తున్నాయి. స్వప్రకాశస్వరూపుడైన పరమాత్మయొక్క అలల్లాంటి ఈ జ్ఞానాలు, బోయవానినుంచి భయపడిన మృగాల్లాగా వేగంగా పరుగెత్తుతున్నాయి. పెనుతుఫానులాగా, పల్లానికి ప్రవహించే నదిలాగా వేగంగా బలంగా ఆవిర్భవిస్తున్న ఈ జ్ఞానం, యుద్ధంలో అశ్వంలాగా ప్రతిబంధకాలను ఛేదించుకొని ముందుకు సాగుతున్నది. ప్రియతమ అయిన భార్య ప్రీతితో చిరునవ్వుతో భర్తను చేరుతున్నట్లు ఈజ్ఞానప్రవాహరూపమైన వేదం ఈశ్వరుని చేరుతున్నది. ఈశ్వరుడు కూడా వేదాలపై అమితాదరాన్ని చూపుతున్నాడు. అనేక వాగలంకారాలతో ముస్తాబు చేసుకొని ఈశ్వరుని చుట్టుముట్టి ఉన్న

ఈ వేదాన్ని, అలంకరించుకొని వరుని దగ్గఱకు చేరిన కన్యగా నేను భావిస్తున్నాను. ఎనలేని విజ్ఞాన కోశమైన వేదం మాకు ఎంతో పవిత్రతను చేకూర్చాలి '(4-58-4-10).

## ఐదవమండలం

### వేదాలు ఎవరిని ప్రేమిస్తాయి?

భగవంతుని గుర్తించినవాణ్ణి వేదాలు ప్రేమిస్తాయని ఈ మండలంలో చక్కగా వివరించబడింది.

'ఎవడు ఎప్పుడూ పరమాత్మను గుర్తిస్తున్నాడో వాడిని ఋక్కులు ప్రేమిస్తున్నాయి. ఎవడు ఎప్పుడూ ఈశ్వరుని గుర్తిస్తున్నాడో వాడిని సామలు ప్రేమిస్తున్నాయి. అట్టివాడికి తను స్నేహితుడుగా ఉంటానని దేవుడు మాట ఇస్తున్నాడు. అగ్ని ఈశ్వరుని ఎల్లప్పుడూ గుర్తించాడు. కనుక వానిని ఋక్కులు ప్రేమించాయి. అగ్ని ఈశ్వరుని ఎల్లప్పుడు ప్రేమించాడు కాబట్టి వానిని సామలు ప్రేమించాయి. అగ్నికి చెలికాడుగా ఉంటానని భగవంతుడు చెప్పాడు' (5-44-14-15).

## ఆరవమండలం

### ప్రపత్తి:

భగవంతునికి భక్తుడు ఆత్మార్పణం చేయడమనేది ఈ మండలంలో మనకు స్పష్టంగా గోచరిస్తున్నది.

'భగవంతుని దివ్యగుణసంపత్తిని వింటూ, అతని దివ్యనామాన్ని సంకీర్తిస్తూ, అతని పాదాలపై వినయంతో స్వాత్మసమర్పణం చేసుకొన్న వాళ్లు తప్పక ఆయన సాక్షాత్కారంవల్ల కలిగే ఆనందాన్ని పొందుతారు' (6-1-4).

## నేను పరమాత్మను గురించి ఏం చెప్పగలను?

పరమాత్మ వాచామగోచరుడు, మనశ్శక్తికి అందనివాడనే విషయం ఆనాడు బాగా గుర్తించబడింది.

'నా హృదయంలో వెలుగుతున్న జ్యోతిస్సునుంచి నాచెవులు దూరంగా పోతున్నాయి. నా నేత్రాలు కూడా చూడలేకున్నాయి. నా మనస్సు చెదరిపోతున్నది. నేను పదార్థానికి చాలా దూరంలో ఉన్నాను. నేను అలాంటి పదార్థాన్ని గురించి ఎలా చెప్పగలను? ఏమని ఆలోచించగలను?' (6-9-6).

## సంఘం - సామాన్యమానవుడు:

ఆనాటి సంఘాన్ని గురించి, సామాన్యమానవుణ్ణి గురించి చక్కని పరిశీలన ఇందులో మనకు కనబడుతుంది

'సంఘాన్ని ప్రేమించు. గౌరవించు. ఆకలితో బాధపడే అనాథలను రక్షించు. సత్కార్యాలను చేయడానికి కావలసిన శక్తి సామర్థ్యాలు నీకు కలగాలి శాశ్వతమైన ధర్మం విలువలను పరిరక్షిస్తూ అందరికి ఉపకారం చేస్తూ జీవనం సాగించు. మూర్ఖతతో, హింసతో, రాక్షసత్వంతో మమ్మల్ని వశపరచుకొనే వ్యక్తి మమ్మల్నేమీ చేయలేడు. అన్నీ తెలిసిన ఆ పరతత్త్వం సామాన్యమానవుల్ని రక్షించేభారాన్ని స్వీకరించాలి. ఆయనకు ఏ దిశనుంచీ ఏ ఆపదా రాకుండా ఉండాలి' (6-75,9-19).

# ఏడవమండలం

## అప్పులబాధ:

అప్పులతో బాధపడటం మానవుడికి ఈనాడు కొత్తకాదు. ఆనాడు కూడా అప్పులతో బాధపడటం ఉన్నది.

'అప్పులను తీర్చే ధనం నిజంగా గొప్పవస్తువు. అంతులేని సంపదలకు మనమధిపతులం కావాలి. అప్పులేనివాడు సుఖజీవి' (7-4,7-8).

**విష్ణుస్తుతి:**

తననోటినుంచి వచ్చే ప్రతిమాట దేవుని స్తుతించేది కావాలని, ఆయన ప్రజలకు సేవచేసే శక్తిని తనకివ్వాలని ఆనాడు కోరుకున్నట్లు ఇక్కడ కనబడుతూంది.

'నీవు విశ్వరూపాన్ని ధరించినప్పుడు వర్ణించడానికి వీలు కానంతగా పెరుగుతున్నావు. ఏ ఒక్కడూ కొంచెం కూడా నీ మహత్త్వాన్ని తెలుసుకోలేడు. మాకు రెండు లోకాలు మాత్రమే తెలుసు. వాటి పైలోకాలను నీవే తెలుసుకున్నావు. ఓ విష్ణూ! వషట్కారంతో నిన్ను ఆహ్వానిస్తున్నాను. నాప్రార్థన మన్నించు. నేను పలికే ప్రతిమాట నీకొకస్తుతి అయ్యేట్లు చెయ్. నీ అనుగ్రహాన్ని నాకు శాశ్వతంగా ప్రసాదించు. విష్ణువును శరణుపొందిన మానవుడు దుఃఖాన్ని పొందుతాడా? లేదు. త్రికరణాలతో విష్ణువును సేవించే వాడు ప్రజలందఱిని సేవిస్తున్నాడు. ఓ విష్ణూ! నీవు మాకు అనేక విధాలైన సంపదలనిచ్చావు. అలాగే అతిశ్రేష్ఠమైన జ్ఞానాన్ని, స్వార్థం లేకుండా ప్రజలకు సేవచేసే శక్తిని కూడా ప్రసాదించు' (7-99-1-7, 7-100-1-2).

## ఎనిమిదవమండలం

**కళ్ళుతెరచి చూడు:**

భగవంతుడు తన విశ్వరూపాన్ని భక్తునికి ఇలా వివరిస్తున్నాడు:

'కళ్ళు తెరచి చూడు. నేను నీఎదుట ఉన్నాను. ఈ విశ్వంలోని సకలపదార్థాలు నాలో ఉన్నాయి. సత్యాన్ని దర్శించగలిగిన వాళ్ళు

స్తుతించేదంతా నా స్వరూపమే. జ్ఞానాన్ని ప్రసాదిస్తూ వారిని నేనే కాపాడుతున్నాను' (8-100-4).

## మూర్ఖులనుంచి కాపాడండి:

వివేకం కలవాళ్ళు అజ్ఞానులకు దూరంగా పారిపోవడం ఆనాటికే ఉంది.

'ఓ మిత్రావరుణులారా! ఎవడు శ్రద్ధతో విచారించడానికి ఇష్టపడడో, ఎవడు ఆధ్యాత్మికవాదంలో పాల్గొనడో, అలాంటి అజ్ఞాని బాహువులనుంచి మమ్మల్ని రక్షించండి' (8-101-4).

# తొమ్మిదవమండలం

## పవమానసోముడు:

ఆనాడు సంఘంలో ప్రసిద్ధమైన అనేక లౌకికోపమానాలతో ఇందులో పవమానసోముడు వర్ణింపబడ్డాడు.

'పవిత్రస్వరూపుడవైన సోముడా! సమస్తప్రాణులు నీనుంచి పుట్టినవే. నీవే ఈ సకలజగత్తుకు అధిపతివి మా నివాసానికి ఈ భూమిని ఈ దేహాన్ని నిర్మించింది నీవే. నీవే అందరిని పవిత్రుల్ని చేస్తున్నావు. ఐహికాముష్మికాలతో నశించని సంపదను మాకివ్వు. కొత్తగా పుట్టిన తన దూడమీద ఆవు ఎలా ప్రేమగా ఉంటుందో, అలా నీపైనే మానవులందరూ ప్రేమతో ఉండి ఆనందిస్తున్నారు.

చంటిబిడ్డ తల్లిదండ్రులచేతుల్లోకి, జారుడు ప్రియురాలిదగ్గఱకు, పెండ్లికుమార్తె వరునిదగ్గఱకు వేగంగా పరుగెత్తినట్లు పవమానసోముడు తన భక్తుల దగ్గఱకు త్వరగా పరుగెత్తి వస్తున్నాడు. సొంతంగా ఇల్లు కట్టుకొన్నవాడు అందులో నివసించాలని కోరుకున్నట్లు పవిత్ర హృదయంలో నివసించడానికి పవమానసోముడు త్వరపడుతున్నాడు' (9-36-28, 9-100-27, 9-101-14,15).

# పదవమండలం

·జూదగాడు :

జూదగాడి మనస్తత్వాన్ని ఎంతచక్కగానో వర్ణిస్తూ ఆనాటి సాంఘికజీవనాన్ని మనకన్నులకు కడుతున్నది ఈ సందర్భం

'దేవతలకు సోమంలాగా నాకు ఈ విభీతకవృక్షంలో కాసిన పాచికలు చాలా ఇష్టం నాతో నా స్నేహితులతో నాభార్యచాలా మంచిగా ఉండేది. ఆమె నన్నెప్పుడూ బాధించలేదు కానీ కేవలం జూదం మీది ప్రేమతో నేనామెను బాధించాను దూరంచేసుకున్నాను. అత్త ద్వేషిస్తున్నది. జూదంలో సర్వస్వాన్ని పోగొట్టుకునే వాడికి మిత్రులెవరూ ఉండరంటూ భార్య దగ్గఱకు రానీయడం లేదు మంచి జాతిగలదైనా ముసలిదైన గుఱ్ఱంలాగా నాబ్రతుకు నిష్ఫలమైంది జూదంలో ఓడిపోయినవాడి భార్యను ఇతరులుగూడా ఎంతో అలుసుగా చూస్తారు. తల్లి, తండ్రి, అన్నదమ్ములు 'మాకు-వాడికి సంబంధం లేదంటూ పట్టుకుపొమ్మ' ని అధికారులకు చెబుతారు ఒక్కొక్కప్పుడు ఇకమీదట జూదమాడకూడదని నిర్ణయించుకుంటాను కాని పాచికల శబ్దం వినపడగానే సంకేతశబ్దం విన్న వ్యభిచారిణిలాగా జూదమాడే చోటుకు పోతున్నాను.

ప్రతి జూదగాడు 'ఈ రోజు తప్పకగెలుస్తాను' అనుకుంటూనే ఆటలో ప్రవేశిస్తాడు పాచికలు అతని కోరికను పెంచుతాయి చివఱకు తనసొమ్మునంతా ఇతరులకిచ్చి పోతాడు. పాచికలు ద్రోహబుద్ధిగలవి. జూదగాని ఆశను రేకెత్తిస్తున్నాయి. గెలిచినవాణ్ణి కూడా తాత్కాలికంగా సంతోషపరచినా చివరకు నాశనం చేస్తున్నాయి. అవి ఎవని ఆగ్రహానికి లొంగవు. రాజులుకూడా వాటికి లొంగవలసిందే. పాచికలు భూమిమీద పడినా జూదగాని మనస్సును పైపైకి తోస్తున్నాయి. వాటికి చేతులు లేకపోయినా చేతులుగల

వాళ్ళను కూడా ఓడిస్తున్నాయి. స్వయంగా చల్లనివైనా ఆకాశంనుంచి పడిన నిప్పుకణికల్లాగా హృదయాలను కాలుస్తున్నాయి

జూదగాని భార్య, తల్లి తీరనిదుఃఖానికి గురిఅవుతున్నారు. అన్నివైపులా అప్పులే చేతిలో చిల్లిగవ్వైనాలేక రాత్రిళ్లు ఇతరుల ఇళ్లలో ప్రవేశించి దొంగతనానికి పాల్పడుతున్నాడు. జూదగాడు డబ్బుగల దంపతులను చూసి ఈర్ష్యపడుతున్నాడు సర్వస్వాన్ని కోల్పోయి, గెలిచినవానికి చేతులెత్తి నాదగ్గర ఏమీలేదని చెబుతున్నాడు.

ఓ జూదగాడా! జూదమాడకు! వ్యవసాయం చేసుకో! దానివల్లకలిగే సంపదతో తృప్తిపడు. ఇది భగవంతుడు మనకిచ్చిన తీర్పు, సందేశం. ఓ దేవతలారా! మాకు మిత్రులై ఆనందాన్నిచ్చి మమ్మల్ని రక్షించండి. ఈ పాచికలకు మళ్ళా ఎప్పుడూ మమ్మల్ని బానిసలను కానీయకండ' (10-34,1-14).

## మీరు గుర్తించలేరు :

దేవుణ్ణి గుర్తించలేకపోవడం ఆనాటికే ఉన్నది ఆ విషయంలో చేస్తున్న హెచ్చరిక ఇక్కడ కనబడుతుంది.

'ఎవడు ఈ సకలజగత్తును సృష్టించాడో వాడిని మీరు తెలుసుకోలేకపోతున్నారు మీకు ఆ పరమాత్మకు చాలా తేడాఉంది. మంచుపొరలాంటి అజ్ఞానంచేత కప్పబడ్డ మీరు ఊరికే మాట్లాడు తున్నారేగాని అయనను గుర్తించలేకపోతున్నారు' (10-82-7).

## శ్రామికుడు:

రైతులకు మంచిపంట కావాలని ప్రార్థించడం అనాడూ ఉంది.

'మేఘాలు తియ్యని నీటినిచ్చినట్లు, తేనెటీగలు మధురమైన .తేనెనిచ్చినట్లు నీవు పశువులలో పాలను సృష్టించావు. పగలంతా చెమటోడ్చి శ్రమించిన శ్రామికునకు అలాగే ధాన్యాదిరూపమైన సంపదనివ్వు' (10-106-10).

**సమాసమాజ నిర్మాణం:**

'వర్గభేదం ఉండకూడదు దరిద్రనారాయణులను సేవించాలి' అని ఈనాడు మనం అనుకునే మాటలు కొత్తవికావు. ఋగ్వేదమే ఈ వాదానికి నాంది పలికింది.

'దరిద్రుడే చస్తాడు; ధనికుడు చావడన్న నియమంలేదు. ప్రతివాడికి చావు తప్పదు. తనకున్నదాన్ని పంచియిచ్చేవాడి ఐశ్వర్యం ఎప్పుడూ తరగదు అలా చెయ్యని వాడికి మిత్రుడనే వాడుండడు కడుపు చేతపట్టుకుని కళ్లల్లో ప్రాణాన్ని పెట్టుకొని అన్నార్తుడైవచ్చిన బీదవాడికి అన్నం పెట్టక, కలిగి ఉండి తానొకడే తినే ధనికుని విషయంలో ఎవరికీ సద్భావం ఉండదు. అన్నంకోరి వచ్చిన పేదవాడి ఆకలితీర్చి తాను భుజించేవ్యక్తికి ఎప్పుడూ ఏ కొరతా రాదు అన్నివైపులనుంచి వాడికి సహాయం లభిస్తుంది. అతనికే మిత్రులు అధికంగా తోడ్పడతారు. తన తోటివారికి, బంధువులకు, సేవకులకు అన్నం పెట్టనివాడు మిత్రుడేకాడు.

ధనికుడైనవాడు తను ప్రయాణించవలసిన దూరాన్ని గుర్తుపెట్టుకొని తనధనాన్ని లేనివాడికి పంచి ఇవ్వాలి. రథంలోని చక్రం లాగా సంపదలు క్షణంలో వస్తున్నాయి; క్షణంలో పోతున్నాయి ఎవడు మానవతాహీనుడై, క్రూరుడై ధాన్యాదులను కేవలం తన ఒక్కడి కోసం దాచి ఉంచుకుంటాడో; నేను నిజం పలుకుతున్నాను - వాడు తప్పక నశిస్తాడు. ఒక సామాన్యమానవుడు తనకన్నా రెండురెట్లు

ధనం గలవాడిని ఆశ్రయిస్తాడు రెండురెట్లు ధనం గలవాడు మూడురెట్ల ధనం గలవాడిని, వాడు నాలుగురెట్ల ధనం గలవాడిని - ఇలాగే తనకన్నా గొప్పవాడిని ప్రతివాడూ ఆశ్రయిస్తున్నాడు. ఈ తత్త్వం తెలిసి ధనికుడైనవాడు గర్వపడకూడదు. చేతులు రెండూ ఒకేమాదిరిగా ఉన్నా సమానమైన పని చేయలేవు. రెండావులు ఒకేసారి ఈనినా సమానమైన పాలు ఇవ్వలేవు కవలలే అయినా ఒకేరకమైన బలం ఇద్దఱిలో ఉండదు. అలాగే అందరూ మానవులే అయినా, అందరూ దాతలు కాలేరు' (10-117-1,9)

## సమత్వం:

సమానభావం ఈనాటికంటే ఆనాడే ఎక్కువగా కోరబడినట్లు ఈమండలంలో కనబడుతున్నది.

'మన అందరి ఆశలు ఒకటిగా ఉండాలి.
మన అందరి హృదయాలు ఒకటి కావాలి.
మన అందరి ఆలోచనలు ఒక త్రాటిపై నడవాలి.
మనమందఱం ఒకటై మంచిస్నేహితులం కావాలి.
(10-191-4).

- వి.కె.ఎస్.

# ఆర్షవిజ్ఞానసర్వస్వము

## 2 రెండవ పరిచ్ఛేదం: కృష్ణయజుస్సంహిత

### యజుస్సంహిత:

'యజ్' అనే ధాతువుకు దేవపూజ, సంగతికరణ, దానాదులు అర్థం. ఆ ధాతువునుంచే 'యజుస్' అనే శబ్దం పుట్టింది. ఇది యజ్ఞయాగాది క్రియాకలాపాన్ని వివరించే వేదం కాబట్టి దీన్ని యజుర్వేదం అనడం ఎంతో సమంజసంగా ఉంది.

**నామాంతరాలు:**

ప్రాచీనులైన వైదికులు ఈ యజుర్వేదాన్ని 'అథర్వవేద' మని కూడా వ్యవహరించారని, దేవరధర్మసూత్రాన్ని పేర్కొంటూ లక్ష్మీధరుడు తన కృత్యకల్పతరువులో చెప్పాడు[1]. యాస్కుని నిరుక్తంలో ఇది **'అధ్వర్యవ'** మని చెప్పబడింది (7.3). సాయణాచార్యుడు దీన్ని **'అధ్వర్యువేద'** మని **తైత్తిరీయబ్రాహ్మణభాష్యభూమికలో** అన్నాడు[2].

---

1. వై.వా.ఇ 200.
2. తత్ర యజుషామధ్వర్యువేదేతి బహులత్వాత్ క్వచిత్ క్వచిత్ ఋచాం సద్భావేపి యజుర్వేద ఇత్యేవాఖ్యాయతే - వే. ప.19

## సంప్రదాయభేదం:

ఈ యజుర్వేదానికి '**బ్రహ్మసంప్రదాయం**' '**ఆదిత్యసంప్రదాయ**'మని రెండు సంప్రదాయాలున్నాయి. బ్రహ్మసంప్రదాయమే కృష్ణయజుర్వేదమని, ఆదిత్యసంప్రదాయం శుక్లయజుర్వేదమని **శతపథబ్రాహ్మణం** చెబుతున్నది. ఇలా యజుర్వేదం మొదట రెండు విభాగాలను పొందింది.

## ప్రచారం:

ఇందులో శుక్లయజుస్సంహిత ఉత్తరభారతంలోను, కృష్ణయజుస్సంహిత దక్షిణభారతంలోను ప్రసిద్ధిని పొందింది. [illegible] 101 శాఖలున్నాయి[1].

## భాష:

ఈ సంహితలోని భాష ఋక్సంహితభాషకు చాలా దగ్గఱలో ఉంటుంది లౌకిక సంస్కృతభాషకు దీనికి పోలికలు పెద్దగా కనబడవు

1. ఏకశతమధ్వర్యుశాఖాః -వై.వా ఇ. 201.
   యజురేకశతాధ్వకమ్ - వే ప 33.

# 2. 1 పరిచయం

యజుస్సంటే ఏమిటి?

దేవపూజకు, దేవతలకు హవిస్సులను సమర్పించడానికి ఉపయోగించే మంత్రమే యజుస్సు. ఛందోబంధంకాని, గాన యోగ్యతకాని లేకుండా కలిపి చదివే మంత్రాలు యజుస్సులు[2]. ఈ యజుస్సుల కూర్పే యజుస్సంహిత. అందులో ఒక శాఖ కృష్ణయజు శ్శాఖ.

## కృష్ణయజుర్వేదం:

కృష్ణయజుస్సంహితలో మంత్ర-అర్థవాద-బ్రాహ్మణభాగాలు కలసి ఉంటాయి. అందువల్ల విషయసాంకర్యం ఏర్పడి సంహిత అధ్యేతలకు బుద్ధివ్యామోహాన్ని కలిగిస్తుండటంవల్ల మంత్రార్థవాద బ్రాహ్మణభాగసమ్మిశ్రమనే అర్థాన్నిచ్చే 'కృష్ణ' పదం చేర్చి దీనిని కృష్ణయజుర్వేదమని పిలిచారు[1].

---

2. శేషే యజుశ్శబ్దః మీ ద 2 1.37. అని జైమిని చెప్పగా 'యా న గీతిర్నచ పాదబద్ధం తత్ ప్రశ్లిష్టపఠితం యజుః' అని శబరస్వామి తన భాష్యంలో వివరించాడు 'వృత్తగీతివర్జితత్వేన ప్రశ్లిష్టపఠితా మంత్రా యజూంషి.' అని జైమినీయన్యాయమాలావిస్తరంలో మాధవాచార్యుడు యజుస్సులను వివరించాడు. వే.ప 24.

1. ప్రతిజ్ఞాసూత్రభాష్యంలో అనన్తదేవుడు, చరణవ్యూహభాష్యంలో మహిదాసు, కృష్ణయజుర్వేదమని దీన్ని వ్యవహరించారు సాయణాచార్యులు కాణ్వసంహితా భాష్యభూమికలో రెండుచోట్ల కృష్ణయజుశ్శబ్దాన్ని ప్రయోగించాడు ప్రతిజ్ఞా సూత్రభాష్యంలో అనన్తుడి ప్రమాణాన్నికూడ ఇచ్చాడు:

**దేశం:**

యజుర్వేదం ఋగ్వేదంలాగా సింధునదీతీరంలో ఏర్పడలేదు మనువుచేత బ్రహ్మావర్తమని ప్రశంసింపబడ్డ కురుక్షేత్రంలో ఆవిర్భవించింది. దీనికే 'బ్రహ్మర్షిదేశ' మని కూడా పేరు. ఇది సింధునదీతీరానికి చాలా దూరంలో తూర్పున ఉన్నది. ఈ వేదంలో సింధునదిగాని దాని శాఖలుగాని పేర్కొనబడలేదు. ఉత్తరభారతదేశం మధ్యలో ఉన్న కురు-పాంచాలదేశాల ప్రస్తావం ఇందులో కనబడుతుంది. కురురాజ్యంలోగల కురుక్షేత్రమే దీనికి ఉత్పత్తి స్థానమని చెప్పవచ్చు. ఇది సరస్వతి, దృషద్వతి నదుల నారంభించి తూర్పు,దక్షిణంగా ఉన్న యమున వఱకు వ్యాపించి, శతుద్రి-యమునానదుల మధ్యభాగంలో ఉన్నది. దీనిని **'సిర్‌హింద్'** అని అంటారు దీనికి తూర్పున పాంచాలదేశం. ఇది **'మీరుట్'** నుంచి అలహాబాద్ వఱకు వ్యాపించి, గంగా-యమునల మధ్యలో ఉన్న **'దోయాబ్'** దేశానికి హద్దుగా ఉన్నది.

**కాలం:**

ఋక్సంహితలోని ఋక్కులు కొన్ని యజుర్వేదంలోను కనబడటంవల్ల ఇది దానికంటే నవీనమైనదనడంలో సందేహం లేదు. చారిత్రికుల నిర్ణయాన్ననుసరించి క్రీ. పూ. 1500 సం|| లోపు,

---

శుక్లం కృష్ణమితి ద్వేధా యజుశ్చ సముదాహృతమ్ ।
శుక్లం వాజసనం జ్ఞేయం కృష్ణం తు తైత్తిరీయకమ్ ॥

తత్రహేతుః:

ఆధ్వర్యవం క్వచిత్ హౌత్రం క్వచిదిత్యవ్యవస్థయా ।
బుద్ధిమాలిన్యహేతుత్వాద్యజుః కృష్ణమితీర్యతే ॥
వ్యవస్థితప్రకరణం తద్యజుః శుక్లమీర్యతే ॥ ఇత్యాది స్మృతేశ్చ

వై.వా.ఇ 201

ఋక్సంహితప్రాదుర్భావం తరువాత ఇది ఏర్పడిందనడంలో విప్రతిపత్తిలేదు. భారతీయ సంప్రదాయవిదులు ఈ కాలనిర్ణయాన్ని అంగీకరించరు

**విషయం:**

సమాజాభ్యుదయంకోసం యజ్ఞాలనాచరించడం, ఆధ్యాత్మికౌన్నత్యసంపాదనం, భౌతికవిజ్ఞానం, గణితం మొ॥ విషయాలు ఈ సంహితలో వివరింపబడ్డాయి.

**పరిశోధన - ప్రచురణ:**

కృష్ణయజుర్వేదంలోని కఠశాఖకు సంబంధించిన కాఠక సంహితను ఎల్.వి. ష్రోడర్ (L.V .Schroeder) 1900 -1910 లో లీప్జిగ్‌లో (Leipzig) సంపాదించి, ప్రచురించాడు. కొన్ని వివరణలతో ఈ సంహితను ఎస్. కీత్ (S. Keith) రాయల్ ఏషియాటిక్ సొసైటి (JRAS) ఆఫ్ గ్రేట్ బ్రిటన్ అండ్ ఐర్లండ్‌ద్వారా 1910లో ప్రకటించాడు.

కపిష్ఠలకఠసంహిత పైన ష్రోడర్ చాలా పరిశోధనలు చేశాడు[1]. కాలాపశాఖగా ప్రసిద్ధిపొందిన మైత్రాయణీయసంహితను 1881 - 1886 లో లీప్జిగ్‌లో సంపాదించి ఎల్.వి. ష్రోడర్ ప్రచురించాడు. ఇందులో కొన్ని భాగాలను ఇతడు జర్మన్ లోకి అనువదించాడు కూడ[2].

1. ఎల్.వి. ష్రోడర్ ,WZKM, 12, 362 f.
2. Indians Literatur and kultur, Leipzig 1887,PP. 110 -162.

తైత్తిరీయశాఖకు సంబంధించిన తైత్తిరీయసంహితనే **'ఆపస్తంబసంహిత'** అని కూడ అంటారు. దీన్ని 1871-1872లో ఎ. వేబర్ (A. Weber) సంపాదించి, ఇండిషె స్టుడియన్ వాల్యూం (Indische Studion Vol.) 11,12 గా ప్రకటించాడు. ఇది 1860-1899లో సాయణభాష్యంతో బిబ్లోతెక ఇండిక (Bibliotheka Indika) లోను, ఆనందాశ్రమ్ సాంస్క్రిట్ సిరీస్ (42), నిర్ణయసాగర్ ప్రెస్‌లోను ప్రచురింపబడింది. ఏ.బి. కీత్ (A.B. Keith) దీన్ని ఇంగ్లీషులో అనువదించి హార్వర్డ్ ఓరియంటల్ సిరీస్ (Harward Oriental Series =HOS) లో 18,19 వాల్యూములుగా, 1914లో ప్రకటించాడు.

యజుర్వేదాన్ని ఉవటభాష్యంతో నిర్ణయసాగర్ ప్రెస్ 1929 లోను, శ్రీపాదదామోదరసాత్వలేకర్, స్వాధ్యాయమండల్‌ద్వారా 1957లోను ప్రచురించారు.

**ఉపవేదం:**

యజుర్వేదానికి ధనుర్వేదం ఉపవేదం అది నాలుగుభాగాలుగా ఉండేది. ఇప్పుడు అభ్యసించేవాళ్లు లేక నశించిపోయింది. అందులో 1.ముక్తక 2.అముక్తక 3.ముక్తాముక్తక 4.యంత్రముక్తాలనే నాలుగు రకాల ఆయుధాలు వర్ణింపబడ్డాయి. ఇంకా బ్రాహ్మ-వైష్ణవ-పాశుపత-ప్రాజాపత్య-ఆగ్నేయాది వివిధాస్త్రాల ప్రయోగోపసంహారాల వివరణం అందులో ఉండేది.

**- ఎస్.బి.ఆర్.**

## 2. 2 శాఖలు - విభాగం

మొత్తం శాఖలు:

కృష్ణయజుర్వేదానికి మొత్తం 86 శాఖలున్నాయి. ఈ 86 శాఖల్లో ప్రచారకులను బట్టి ఉత్తరదేశీయులు, మధ్యదేశీయులు, ప్రాచ్యదేశీయులని మూడురకాలైన భేదాలున్నాయి. ఉత్తరదేశీయాచార్యులలో **'శ్యామాయని'** ముఖ్యుడు. మధ్యదేశీయాచార్యులలో **'ఆరుణి'** ప్రధానుడు. ప్రాచ్యదేశీయాచార్యులలో **'ఆలంబి'** ప్రథముడు[1].

ఈ 86 శాఖలలో పన్నెండింటిని చరకశాఖలంటారు కృష్ణయజుర్వేదాన్ని ప్రచారంచేసిన వైశంపాయనుడికే చరకుడని పేరున్నట్లు కాశికావృత్తి ఇలా చెబుతున్నది. **'చరక ఇతి వైశంపాయనస్య ఆఖ్యా'** (4-3-104). 1. చరక 2. ఆహ్వారక 3. కఠ 4. ప్రాచ్యకఠ 5. కపిష్ఠలకఠ 6. ఆష్టలకఠ 7 చారాయణీయ 8. వారాయణీయ 9. వార్తాంతరీయ 10. శ్వేతాశ్వతర 11. ఔపమన్యవ 12. మైత్రాయణీయ శాఖలే చరకశాఖలు

ఇందులోని మైత్రాయణీయశాఖనే ప్రాచీనులు కాలాపశాఖగా వ్యవహరించారు ఇది మళ్లీ 7రకాలుగా ఉన్నది. 1. మానవ 2.దుందుభ

---

1. వైశంపాయన గోత్రో௨సౌ యజుర్వేదం వ్యకల్పయత్ |
షడశీతిస్తు యేనోక్తాః సంహితా యజుషాం శుభాః ||
షడశీతిస్తథా శిష్యాః సంహితానాం వికల్పకాః |
సర్వేషామేవ తేషాం వై త్రిధా భేదాః ప్రకీర్తితాః ||
ఉదీచ్యా మధ్యదేశ్యాశ్చ ప్రాచ్యాశ్చైవ పృథగ్విధాః |
శ్యామాయనిరుదీచ్యానాం ప్రధానః సంబభూవ హ ||
మధ్యదేశ ప్రతిష్ఠాతా చారుణిః ప్రథమః స్మృతః ||
ఆలమ్బిరాదిః ప్రాచ్యానాం త్రయో దేశ్యాదయస్తు తే ||
బ్రహ్మాండ. 34-8-13. వాయు. 61-5-10.

3. ఏకేయ 4. వారాహ 5. హారిద్రకేయ 6. శ్యామ 7. శ్యామాయనీయాలని వాటి పేర్లు.

తైత్తిరీయశాఖ ఔఖేయ (ఔఖ్య) కాండికేయభేదంతో రెండు రకాలు. కాండికేయశాఖ 1. ఆపస్తంబి 2. బోధాయని 3. సత్యాషాఢీ 4. హిరణ్యకేశి 5. ఔంధేయి అని అయిదురకాలు. ఈ మొత్తం 26 శాఖలుకాక, ఇంకా [redacted] శాఖలు కృష్ణయజుర్వేదంలో ఉన్నాయి.

**ఇప్పుడు దొరికేవి:**

కృష్ణయజుర్వేదానికి గల 86 శాఖలలో [redacted] శాఖలు నశించిపోగా ఇప్పుడు నాలుగు శాఖలు దొరుకుతున్నాయి. అవి 1. తైత్తిరీయశాఖ 2. మైత్రాయణీయశాఖ 3. కఠశాఖ 4. కాపిష్ఠల కఠశాఖ. ఇందులో చివటి మూడు, చరకశాఖల్లో (3, 5,12) పేర్కొనబడ్డవే.

**మొదలు చివఱ:**

ఈ సంహిత 'ఇషే **త్వోర్జే త్వా**' అనే పలాశశాఖాచ్ఛేదన మంత్రంతో ప్రారంభమై, '**సముద్ర ఉదరమన్తరిక్షం పాయుః**' అనే అశ్వమేధాంగమంత్రంతో పూర్తవుతుంది

## సంహితావిభాగం:

**తైత్తిరీయసంహిత:**

ఈ సంహితలో 7 కాండలు, 44 ప్రపాఠకాలు, 635 అనువాకాలు ఉన్నాయి. ఇందులో వాజపేయయాగం, రాజసూయయాగం మొ॥ యాగాలు చక్కగా వర్ణింపబడ్డాయి. దీనికి భట్టభాస్కరుడు. సాయణాచార్యుడు ప్రామాణికమైన భాష్యాలు వ్రాశారు

| కాండల సంఖ్య | ప్రపాఠకాల సంఖ్య | అనువాకాల సంఖ్య |
|---|---|---|
| 1 | 8 | 140 |
| 2 | 6 | 75 |
| 3 | 5 | 55 |
| 4 | 7 | 72 |
| 5 | 7 | 120 |
| 6 | 6 | 66 |
| 7 | 5 | 107 |
| | 44 | 635 |

**మైత్రాయణీసంహిత:**

ఈ సంహితలో 4 కాండలు, 54 ప్రపాఠకాలు, 2144 మంత్రాలు ఉన్నాయి ఇందులో దర్శపూర్ణమాస-చాతుర్మాస్య-రాజసూయ-అశ్వమేధాది యాగాలు ప్రతిపాదింపబడ్డాయి.

**కఠసంహిత:**

ఇందులో 5 కాండలు 40 స్థానకాలు (అధ్యాయాలు) 13 అనువచనాలు, 843 అనువాకాలు, 3091 మంత్రాలు ఉన్నాయి. అగ్నిష్టోమ - అశ్వమేధ-కామ్యేష్టి-రాజసూయాలు ఇందులో వర్ణింపబడ్డాయి. పతంజలి మహాభాష్యం కాలంనాటికి దీనికి ఎక్కువ ప్రసిద్ధి ప్రాచుర్యాలున్నాయి. '**గ్రామే గ్రామే కాఠకం కాలాపకం చ ప్రోచ్యతే**' (4-3-101) అని మహాభాష్యంలో దీనిని గురించి పతంజలి పేర్కొన్నాడు.

**కాపిష్ఠలకఠసంహిత:**

ఇందులో ఆరు ఖండాలున్నాయి. మధ్యలో విచ్ఛేదంకల అష్టకాలుగా ఇవి విభజింపబడ్డాయి. దీనికి గల **48** అధ్యాయాల్లో **32,33,43**, అధ్యాయాలు దొరకడం లేదు. **9**వ అధ్యాయంనుంచి **24** అధ్యాయం వఱకు ప్రతి అధ్యాయం అక్కడక్కడ లోపించే ఉంటాయి కాని సంపూర్ణంగా ఉండవు. ఈ శాఖలో స్వరాంకనపద్ధతి ఋగ్వేదం లాగానే ఉంటుంది.

**- ఎస్.బి.ఆర్.**

## 2. 3.శాఖలు - దేశవ్యాప్తి

కృష్ణయజుర్వేదం కురుక్షేత్రంలో ఆవిర్భవించినా దానివ్యాప్తి భారతదేశమంతటా ఉన్నది. గ్రీకులు మన దేశంమీదకు దండెత్తి వచ్చినప్పుడు పంజాబ్ - కాశ్మీరరాష్ట్రాల్లో కఠ-కపిష్ఠల శాఖలను అధ్యయనం చేసిన పండితులెందఱో ఉన్నట్లు తెలుస్తున్నది. ఇప్పటికీ కఠశాఖ కాశ్మీరంలో బ్రతికే ఉన్నది. కానీ మన దురదృష్టంవల్ల కపిష్ఠలశాఖ పూర్తిగా అంతరించిపోయింది.

కలాపి వైశంపాయనుని శిష్యుడు ఇతడే మైత్రాయణుడు. బదరికాశ్రమసమీపంలో కలాపగ్రామం ఉన్నది ఈ కలాపి అక్కడే ఉండేవాడు ఇతడు ప్రచారంచేసిన శాఖ కాలాపశాఖ.

మైత్రాయణీయశాఖకే కాలాపశాఖ అని పేరు. మహాభాష్య కారుడైన పతంజలి ఆ రోజుల్లో కఠకాలాపశాఖలు రెండు భారతదేశ మంతటా వ్యాపించి ఉన్నట్లు చెబుతున్నాడు[1] అలాగే రామాయణం ద్వారా ఈ శాఖలు త్రేతాయుగంనాటికే అయోధ్యలో ప్రసిద్ధాలుగా ఉన్నట్లు తెలుసుకుంటున్నాం.

వేదవ్యాసుడు వైశంపాయనునికి కృష్ణయజుర్వేదాన్ని బోధించాడు. ఇతడికి చరకుడని కూడా ప్రసిద్ధి ఉన్నట్లు ఇంతకు ముందే తెలుసుకున్నాం యాజ్ఞవల్క్యుడు వైశంపాయనునికి మేనల్లుడు, శిష్యుడు కూడ తిత్తిరిమహర్షి వైశంపాయనునికి అన్న ఈ వైశంపాయనుడే కృష్ణయజుర్వేదాన్ని బహుళప్రచారంలోకి తీసుకొనివచ్చాడు.

---

1. మహా. 4-3-101.

ఆంధ్రదేశంలోనే కృష్ణయజుర్వేదం బాగా స్థిరపడింది. గోదావరి దక్షిణ ప్రాంతంలో 1. తైత్తిరీయ 2. మైత్రాయణీయ (శ్యామాయనీయ) శాఖలుండేవి. ఇప్పుడు తైత్తిరీయశాఖకు ప్రామాణికమైన పరంపర **'కోనసీమ'** అని ప్రసిద్ధిగాంచిన గోదావరీ తీరంలోనే ఉన్నది. 1.ఔఖ్య 2. ఆపస్తంబి 3. సాత్యాషాఢీ 4. శౌధేయి అనే నాలుగు శాఖలు ఆంధ్రదేశంలో కృష్ణాతీరంలోను, మాల్యాద్రిప్రాంతంలోను వ్యాప్తిని పొందాయి. 1. కాండకేయ 2. బోధాయనీయ 3. హిరణ్యకేశి శాఖలు దక్షిణదేశమంతటా వ్యాపించాయి.

చరకశాఖలని ప్రసిద్ది పొందిన 12 శాఖలు భారతదేశంలోని పశ్చిమభాగంలోను, కఠఘ్న యమున దేశంలోను, శ్వేత, క్రౌంచ ద్వీపాలలోను, గోదావరీతీరంలోను ప్రచారంలోకి వచ్చాయి.

మైత్రాయణీయశాఖకు సంబంధించిన 7 ఉపశాఖలు సౌరాష్ట్ర, కాశ్మీర, ఘుర్జర, గౌడ, ఆంధ్రదేశాల్లో వ్యాప్తిని పొందాయి

ఇలా వ్యాపించిన శాఖలన్నీ కాలక్రమేణ ఆదరించేవారు లేక అంతరించిపోయాయి. ఇప్పుడు కృష్ణయజుర్వేదంలో ప్రధానంగా ఉన్నశాఖ తైత్తిరీయశాఖ.

**- ఎస్.బి.ఆర్.**

## 2. 4 పాఠవిశేషాలు

సంహితాస్వరూపం చెక్కుచెదరకుండా ఉండటానికే అనేక రకాలైన పాఠాలేర్పడ్డాయని ఇంతకు ముందు గమనించాం. వెనక చెప్పబడ్డ (చూ.పే 16) జట మొ॥ ఎనిమిది వికృతిపాఠాలు కృష్ణ యజుర్వేదానికి కూడా ఉండేవి. అయితే వేదాధ్యయనానికి ఆదరణ లేకపోవడంవల్ల వింటుంటేనే శ్రోతలను ఆనందపరవశుల్ని చేసే జటాపాఠం, ఘనపాఠం మాత్రం ప్రచారంలో మిగిలాయి. ఘనపాఠానికి లభించిన ప్రసిద్ధిని మిగతా పాఠాలు పొందలేకపోయాయి. అందువల్ల ప్రతి వేదపండితుడు ఘనపాఠి కావాలని కృషిచేయడం మొదలు పెట్టాడు. మిగతా పాఠాలను ఆదరించే ప్రజలు లేకపోవడమే దీనికి కారణంగా మనం భావించవచ్చు.

కాని కృష్ణయజుర్వేదానికి ఇతరపాఠాలను చెప్పకూడదనే నిషేధం ఎక్కడ కనపడదు. వేదాధ్యయనానికి ఈ మధ్యకాలంలో ఆదరం తగ్గిపోవడం అనే అంశం ఇలాంటి విషయాల్లో కొట్టవచ్చినట్లు కనపడుతుంది.

ఇతరవేదాలకు ప్రచారంలో లేని **'వర్ణక్రమం'** కృష్ణయజుర్వేదానికి ఒక అసాధారణ లక్షణంగా భావించబడుతోంది. ఈ వేదంలో ప్రతి మంత్రంలోని ప్రతి అక్షరాన్ని తీసుకొని దానికి సంబంధించిన జాతి, అంగ, వర్ణసంజ్ఞా, ప్రయత్న, దేవతా, మాత్రాకాల, స్వరాదులను చెప్పడం చూస్తే శబ్దతత్త్వ పరిశోధనలో మన ప్రాచీనులు ఎంత లోతైన విచారంచేశారో మనకర్థమవుతుంది.

**- ఎస్.బి.ఆర్.**

## 2.5 మంత్రద్రష్టలగు మహర్షులు

మహర్షులు తమ మనోవ్యాపారములన్నింటిని లయింపజేసి నిర్విషయాత్మస్థితి రూపమైన సమాధిలో ప్రజ్ఞానాత్మస్ఫూర్తిచేత పరిపూర్ణమూ, నిర్మలమైన హృదయంతో తమ తపః శక్తిచేత వేదాలను దర్శించారు. మనమెన్నడూ వినని మంత్రాన్ని స్వప్నంలో ఎవరైనా ఉపదేశిస్తే మనం దాన్ని విన్నట్లు సమాధిస్థితిలో ఉన్నవారికి ఈ వేదదర్శనం కలిగిందని కృష్ణయజుస్సంహిత చెబుతోంది[1].

ప్రళయకాలంలో భగవంతునిలో లయాన్నిపొంది నిత్యసిద్ధంగా ఉన్నవేదాలను మహర్షులు తమ తపః శక్తిచేత మళ్లా పొందారని వ్యాసమహర్షి చెప్పాడు.

ఇంకా యాస్కుడు **'ఋషిర్దర్శనాత్'** అని మంత్రాలను దర్శించటంవల్ల ఋషి అవుతున్నాడని నిరుక్తంలో ప్రతిపాదించాడు పతంజలి తన మహాభాష్యంలో **'ఏకశతమధ్వర్యుశాఖాః'** అని యజుర్వేదం నూటఒక్కశాఖలు కలిగి ఉందని చెప్పాడు. వాటిలో కృష్ణయజుర్వేదం ఒకటి. యాజ్ఞవల్క్యమహర్షి కక్కివేసిన ఈశాఖను వైశంపాయన శిష్యులు తిత్తిరిపక్షుల రూపంలో స్వీకరించారు అందువల్ల దీనికి **'కృష్ణయజుర్వేద'** మనీ, **'తైత్తిరీయశాఖ'** అనీ ప్రసిద్ధి ఏర్పడింది. తైత్తిరీయశాఖను అధ్యయనంచేసే ఉఖాదిమహర్షులు, తదితరులు తైత్తిరీయులని చెప్పబడతారు. ఈ శాఖను ప్రవర్తింపచేసిన వాళ్లల్లో తిత్తిరిమహర్షి కూడా ఉన్నారు.

---

1. యామృషయో మంత్రకృతో మనీషిణః ।
అన్వైచ్ఛన్ దేవాస్తపసా శ్రమేణ ॥
సాయణాచార్యుడు ఈమంత్రానికి భాష్యం వ్రాస్తూ, మంత్రాల సంప్రదాయాలను ప్రవర్తింపచేసే వసిష్ఠాది మహర్షులు ఆ దేవవాక్కును పొందాలనుకొన్నారని వివరించాడు.

ఈ శాఖను వైశంపాయన, యాస్క, పైంగి, తిత్తిరి, ఉఖ, ఆత్రేయులనే మహర్షులు ఒకరినుంచి ఇంకొకరు పరంపరగా అధ్యయనం చేశారు.

ఈ సంహితలోనున్న మంత్రాలను మహనీయులైన ఎందరో మహర్షులు దర్శించారు. వారికి సంబంధించిన విశేషాలను తెలిపే వాఙ్మయం చాలా అరుదుగా ఉంది. ఆ పేర్లతోనే ఇతిహాస పురాణాలలోను కొందరు వ్యక్తులు మనకు కనబడుతున్నారు. సంగ్రహంగా వారికి సంబంధించిన వివరాలు కొంతవరకు ఇక్కడ పరిశీలిద్దాం.

**1. ప్రజాపతి:**

కృష్ణయజుస్సంహితలో 220 మంత్రాలను దర్శించిన ఋషి ప్రజాపతి. ఈ పేరుకల వ్యక్తి పురాణేతిహాసాలలో కనిపిస్తున్నాడు. ఇతడు భారతంలో **'దేవుడ'** నే మనువుకు కుమారుడుగా ధూమ్ర, బ్రహ్మవిద్య, మనస్విని, రతి, శ్వాస, శాండిలి, ప్రభాత అనే ఏడుగురు భార్యలు కలవాడుగా వర్ణింపబడ్డాడు ఇతనికి ధరుడు, సోముడు, అహుడు, అనిలుడు, అగ్ని, ప్రత్యూషుడు, ప్రభాసుడు అని ఎనిమిది మంది పుత్రులని మహాభారతం చెబుతున్నది.

**2. గోతముడు:**

గోతముడు 80 మంత్రాలకు ద్రష్ట (చూ. పే. 32).

**3. దీర్ఘతముడు:**

కృష్ణయజుస్సంహితలో 67 మంత్రాలకు ద్రష్ట దీర్ఘతముడు (చూ. పే. 31).

**4. పరమేష్ఠి:**

కృష్ణయజుస్సంహితలో 60 మంత్రాలను దర్శించిన ఋషి

పరమేష్ఠి. ఈ పేరుకల వ్యక్తి పురాణేతిహాసాలలో అక్కడక్కడ కనిపిస్తున్నాడు. ఇతడు బ్రహ్మయొక్క శిష్యుడు. వైదికసూక్తద్రష్ట (బృహ.) జైమినీయబ్రాహ్మణం ప్రజాపతి శిష్యుడుగా పరమేష్ఠిని వర్ణిస్తోంది.

**5. ఆత్రేయుడు:**

ఆత్రేయుడు 57 మంత్రాలకు ద్రష్ట. ఆత్రేయుడు అనే పేరుతో ఒక ఋషి పురాణేతిహాసాలలో పేర్కొనబడ్డాడు. ఇతడు ఒక నక్షత్రం నుంచి ఇంకొక నక్షత్రానికి వెళ్లటానికి శక్తికలవాడు (బ్రహ్మ.). ఇతని గురువు వామదేవుడు (భార.వన.). ఇతడు తన శిష్యులకు నిర్గుణబ్రహ్మను గురించి బోధించాడు.

**6. వామదేవుడు:**

ఇతడు కృష్ణయజుస్సంహితలోని 55 మంత్రాలకు ద్రష్టగా కనపడుతున్నాడు (చూ.పే. 30).

**7. వసిష్ఠుడు:**

కృష్ణయజుస్సంహితలోని 53 మంత్రాలను ఈ మహర్షి దర్శించాడు (చూ. పే. 27).

**8. మేధాతిథి:**

47 మంత్రాలకు ద్రష్ట మేధాతిథి. మేధాతిథి అనే పేరుగల వ్యక్తులు పురాణేతిహాసాలలో అక్కడక్కడ ముగ్గురు పేర్కొనబడుతున్నారు. అందులో మొదటివాడు రాజు. మూడవవాడు అరుంధతి తండ్రియైన ఒక మహర్షి. ఇందులో చివరి ఇద్దరికి వేదదర్శన సంబంధం ఉన్నది. ఇందులో రెండవవాడు కణ్వుని పుత్రుడుగా భారతంలో వర్ణింపబడ్డాడు. ఇతనికి దుష్యంతుడు, ప్రవీరుడనే ఇద్దరు పుత్రులు. బృహదారణ్యకంలో ఇతడు స్వాయంభువమనువు మనవలలో

ఒకడుగాను, మహాభారతంలో వానప్రస్థాశ్రమాన్ని స్వీకరించి తపస్సు ద్వారా స్వర్గాన్ని పొందిన రాజర్షిగాను వర్ణింపబడ్డాడు.

**9. మధుచ్ఛందుడు:**

కృష్ణయజుస్సంహితలో మధుచ్ఛందుడు 47 మంత్రాలకు ద్రష్ట. కౌషీతకీబ్రాహ్మణంలో, ఐతరేయఆరణ్యాకంలోను ఇతడు ఋషిగా పేర్కొనబడ్డాడు. ఐతరేయబ్రాహ్మణంలో మధుచ్ఛందుడు విశ్వామిత్రుని 51 వ పుత్రుడని చెప్పబడింది. శునఃశేపుని సోదరునిగా భావించమని విశ్వామిత్రుడు చెప్పగా, ఇతనితోపాటు ఇతని సోదరులు కూడా అంగీకరించారు.

**10. నారాయణుడు:**

నారాయణుడు 45 మంత్రాలను కృష్ణయజుస్సంహితలో దర్శించాడు. ఇతడు బ్రహ్మపుత్రుడైన ధర్ముని కుమారుడు. ధర్మునికి దక్షపుత్రికలవల్ల హరి, కృష్ణ, నర, నారాయణులు జన్మించారు అందులో నర, నారాయణులిద్దరూ ఎప్పుడూ విడిపోని సన్న్యాసులు. వీరు మహావిష్ణువు అవతారభూతులు (భార శాన్తి.). నారాయణ ఋషియొక్క తెల్లజుట్టునుంచి బలరాముడు, నల్లజుట్టునుంచి కృష్ణుడు జన్మించారని మహాభారతం పేర్కొంటున్నది

**11. కుత్సుడు:**

కుత్సుడు కృష్ణయజుస్సంహితలో 43 మంత్రాలను దర్శించాడు. ఇతడు రాజర్షియైన రురువుకు పుత్రుడు.

**12. విశ్వామిత్రుడు:**

కృష్ణయజుస్సంహితలో 33 మంత్రాలను దర్శించిన ఋషి విశ్వామిత్రుడు (చూ. పే. 29).

**13. వరుణుడు:**

వరుణుడు కృష్ణయజుస్సంహితలో, **30** మంత్రాలకు ద్రష్ట. ఈయన చాల ఇతిహాసపురాణాలలో పేర్కొనబడ్డాడు. ఇతని తల్లిదండ్రులు అదితి, కశ్యపులు (భార. ఆది.). ఇతనికి గౌరి, వరుణాని, చర్షణి అని ముగ్గురు భార్యలు. సుషేణుడు, వంది, వసిష్ఠుడు ఇతని కుమారులే. వారుణి ఇతని కూతురు. ఇతని రాజధాని శ్రద్ధావతి (దేవీ భా.). వరుణుడు రాజసూయయాగాన్ని యమునా నదీతీరంలో నిర్వహించాడు (భార. శల్య.). ఇతడు అర్జునునికి గాండీవాన్నిచ్చాడు.

**14. అంగిరసులు:**

అంగిరసులు **29** మంత్రాలకు ద్రష్టలు. **'అంగిరస'** అనేది అంగిరస వంశంలో పుట్టినవారికి వచ్చేపేరు. కృష్ణుడు, అజీగర్తి, చ్యవనుడు, అయాస్య, సంవర్త, సుధన్వలు ఈ వంశానికి చెందినవారు

**15. శునఃశేపుడు:**

కృష్ణయజుస్సంహితలో **24** మంత్రాలను శునఃశేపుడు దర్శించాడు ఈ పేరుకల వ్యక్తి పురాణేతిహాసాలలో కనిపిస్తున్నాడు ఇతని గురించి రెండువిధాలైన గాథలు ప్రచారంలో ఉన్నాయి అందులో ఒకడు అజీగర్తుని కుమారుడు. ఇతడు హరిశ్చంద్రునిచేత యాగబలిగా తీసికొనబడ్డాడు. ఇంకొకడు ఋచీకముని కుమారుడు. ఇతడు అంబరీషుని యజ్ఞబలిగా నియోగించబడ్డాడు ఇతణ్ణి భృగువంశంలో శునఃశేపుడని, గాధివంశంలో దేవరాతుడని పిలుస్తారు.

**16. అగస్త్యుడు:**

**19** మంత్రాలను దర్శించినవాడు అగస్త్యుడు (చూ. పే. 32).

## 17. జమదగ్ని:

కృష్ణయజుస్సంహితలో 19 మంత్రాలకు ద్రష్ట జమదగ్ని. ఇతడు ఋచీక సత్యవతుల పుత్రుడు. ఇతని మేనమామ విశ్వామిత్రుడు. ప్రసేనజిత్తు కుమార్తె అయిన రేణుక ఇతనిభార్య. ఒకనాడు రేణుకకు ఎండవేడి ఎక్కువైనందువల్ల జమదగ్ని కోపించగా, సూర్యుడేవచ్చి గొడుగు, పాదరక్షలు సమర్పించాడు. ఇతనికి రుమణ్వంతుడు, సుహోత్రుడు, వసు, విశ్వావసు, పరశురాముడని ఐదుగురు కుమారులు.

## 18. భరద్వాజుడు:

18మంత్రాలకు ద్రష్ట భరద్వాజుడు (చూ. పే. 28).

వైదికవాఙ్మయాన్ని పరిశీలిస్తే మహర్షులు మంత్రద్రష్టలుగా (మంత్రాలను దర్శించినవారు), మంత్రస్మర్తలుగా (మంత్రాలను స్మరించేవారు) రెండువిధాలుగా కనబడుతున్నారు. కొందరు ద్రష్టలుగా ఉంటే ప్రజాపత్యాది మహర్షులు మంత్రస్మర్తలుగా ఉన్నట్లు శుక్లయజుర్వేదానికి సంబంధించిన కాత్యాయనసర్వానుక్రమణి పేర్కొంటున్నది[1]. ఏయేకాండలలో కొన్నిమంత్రాలకు ద్రష్టలు తెలియడంలేదో అక్కడ ప్రజాపతి మొ॥ మహర్షుల్నే ద్రష్టలుగా భావించాలి

ఒక మహర్షిచేత చూడబడిన మంత్రాలన్నీ ఒకేచోట వరుసగా ఉండాలన్న నియమం లేదు సారస్వతమునిపాఠానుసారం యజ్ఞకర్మానుష్ఠానసౌకర్యం కోసం తరతమభావం ఉన్నట్లు ఈ క్రింది ఉపాఖ్యానం మనకు తెలియజేస్తోంది.

''ఒకప్పుడు నృమేధుడు, పరుచ్ఛేపుడు అనే మహర్షులకు మంత్రసామర్థ్యవిషయంలో వివాదమేర్పడింది. ఈ ఇద్దఱిలో ఎవరు

---

1. 'ఋషయో మంత్రద్రష్టారః స్మర్తారః పారమేష్ఠ్యాదయః కా.స.3

సామిధేనీమంత్రాలలో నిష్ణాతులు? అనే ప్రశ్న కలిగింది. ఎవరు మంత్రాలనుచ్చరిస్తూ, తడికట్టెలో అగ్నిని పుట్టించగలరో వారు సమర్థులని ఇద్దఱూ ప్రతిజ్ఞ చేసుకున్నారు. నృమేధుడు ప్రయత్నించాడు కాని సఫలుడు కాలేదు. పరుచ్ఛేపుడు సామిధేనీ మంత్రాలను ఉచ్చరిస్తే తడికట్టెలో అగ్నిపుట్టింది. అప్పుడు నృమేధుడు, పరుచ్ఛేపుని ఇలా ప్రశ్నించాడు. 'మహర్షీ! సామిధేనీమంత్రార్థజ్ఞానం ఇద్దఱికీ సమానం కదా! మరి తడికట్టెలో మీరెలా నిప్పును పుట్టించారు?' పరుచ్ఛేపుడు ఇలా సమాధానం చెప్పాడు. 'మంత్రార్థజ్ఞానం ఇద్దరికీ సమానమైనప్పటికీ సామధేనీఋక్కులలో ఏ పాదంలో ప్లుతశబ్దం ఉచ్చరింపబడుతుందో, ■ పాదం సారభూతమైన తేజస్సు కలది. ఆ విషయం తెలిసి ఆ ఋక్కులను ఉచ్చరించాను. కాబట్టి అగ్నిపుట్టింది. ఇక నీవో! ఆ విషయం తెలియక ఉచ్చరించావు కనుక ధూమం మాత్రమే పుట్టింది'

పై వృత్తాంతంద్వారా మంత్రార్థదర్శనంలోను తరతమభేదాలున్నాయని స్పష్టమవుతోంది. అతీంద్రియ జ్ఞానసంపన్నులైన మహర్షులు నిత్యమైన శబ్దాన్ని దర్శించి ద్రష్టలై మానవజాతికి మహోపకారం చేశారు.

- వి.ఎస్.జి.

1. తై. సం. 2-5-8.

## 2. 6 దేవతలు

ప్రపంచవాఙ్మయంలో వేదాలకు ప్రముఖస్థానం ఉంది. ఎందుకంటే అవి మానవజాతికి శ్రేష్ఠమైన జ్ఞానాన్ని ప్రసాదిస్తున్నాయి. యజుర్వేదంలో కృష్ణ శుక్లాలని రెండు శాఖలున్నాయి..

కృష్ణయజుర్వేదంలో ముఖ్యంగా కర్మకాండ వివరింపబడింది. మానవులకు తమ జీవితావసరాలను తీర్చుకోవడానికి యజ్ఞాలవసరం. కనుకనే సృష్టికర్త ముందుగా యజ్ఞాలను సృష్టించి, తరువాత మానవసృష్టి చేశాడని భగవద్గీతలో చెప్పబడింది (3-10). యజ్ఞకర్మలతో తృప్తిచెందిన దేవతలే మానవుల కోరికలను తీరుస్తారు. కాబట్టి ఆయాదేవతలను గురించి మనం తప్పక తెలుసుకోవాలి

కృష్ణయజుస్సంహితలో మొత్తం వందమందికి పైగా దేవతలున్నారు. వారిలో ముఖ్యులైన కొందఱి స్వభావ, ప్రభావాలను పరిశీలిద్దాం.

**1. అగ్ని:**

కృష్ణయజుర్వేదంలో ప్రస్తావించబడ్డ దేవతలలో అగ్నికిగల స్థానం అద్వితీయమైంది. 40 అధ్యాయాలు కల కృష్ణయజుస్సంహితలో 31 అధ్యాయాలలో అగ్ని పేర్కొనబడ్డాడు. దాదాపు ఇన్ని అధ్యాయాలలో ఇంతగా ఏ ఇతర దేవత ప్రస్తావింపబడలేదని చెప్పవచ్చు. ఈ 31 అధ్యాయాల్లో అగ్ని ప్రస్తావంకల మంత్రభాగాల్లో అతని స్వభావ ప్రభావాలు మనకు స్పష్టంగా తెలుస్తాయి

అగ్ని సత్యభాషణం మొ॥ సామాన్య ధర్మాలను చక్కగా పరిపాలిస్తూ, సత్యవ్రతాన్ని నిర్వహించేవారికి అండదండలనిస్తాడు (1-5). ఇతనికి లోకంలోని ప్రతివిషయం తెలుసు. విజ్ఞానస్వరూపుడైన ఇతడు తనను ఆరాధించేవాళ్ళకు జ్ఞానాభివృద్ధిని కలుగజేస్తాడు

(2-14). ఇతడు వస్తువులన్నింటికి అధిపతి. సంపదలకు నివాసస్థానం. కనుక ప్రజలనితడు నిరంకుశత్వాన్నుంచి కాపాడతాడు (5-9). వేదాలను కాపాడుతూ మానవుల భయాలన్నిటిని పోగొడుతూ, వారి ధర్మవర్తనాన్ని కాపాడతాడు (5-9).

లోకంలో అనేక రకాల దోషాలనితడు నాశనం చేస్తాడు ఇతరులకు ద్రోహం చేసేవారిని శిక్షించి జగత్తును రక్షిస్తాడు (1-8). శత్రువులను నాశనం చేసి, ప్రతిప్రాణికి సుఖదుఃఖవ్యవహారాలను కలిగిస్తాడు. సృష్టి స్థితులకితడే కారకుడు. ఆత్మజ్ఞానాన్ని మానసిక విజ్ఞానాన్ని కలిగించి, మనలోని అంతశ్శత్రువులను జయించడానికి, జ్ఞానాన్ని పొందడానికి కారణభూతుడవుతాడు (1-10). ప్రపంచ మంతటికి సంతోషం కలగజేయడానికి ఇతడు యజ్ఞాన్ని అంతటా వ్యాపింపచేసి వర్షాన్నిస్తాడు (2-3). ఇతరుల వస్తువులను అన్యాయంగా అపహరించే వాళ్ళను, లోకానికి వ్యతిరేకంగా ఎప్పుడూ తమ సుఖంకోసమే ప్రతిపనీ చేసేవాళ్ళను దూరంగా తరిమేస్తాడు(2-30). ప్రాతఃకాలంలో లోకంలోని వస్తువులన్నింటినీ ప్రకాశింపచేస్తున్నాడు (3-10).

భౌతికాగ్నిగా పృథివీపాలనకు కారణమై, జఠరాగ్నిగా ప్రాణుల లోను, విద్యుత్తుగా జలంలోను శక్తిని ఉత్పత్తి చేస్తున్నాడు (3-12). సూర్యుడుగా లోకాలనభివృద్ధి చేస్తూ, మానవుల రాజ్యాది సంపదలను పెంపొందింపచేస్తున్నాడు (3-14). ఈ జగత్తులోని విద్వాంసులు మంచిబుద్ధితో వివేకంతో ప్రకాశిస్తూ, తోటి ప్రజల్లో కూడా వారు వివేకాన్ని కలిగించడానికి పూనుకొనేట్లు చేస్తున్నాడు (11-41). మానవులు మంచి గుణాలను, కర్మలను సాధించడానికి అగ్ని ఎంతగానో సహాయపడతాడు (12-104). లోకానికి ధర్మ-అర్థ-కామ-మోక్షాలనే పురుషార్థాల జ్ఞానం కలిగిస్తూ (27-43), తనను గురించి తెలుసుకొన్నవారు అద్భుతకార్యాలను చేసేటట్లు చేస్తున్నాడు (29-

20). ఇతడు అన్నం మొ॥ పదార్థాలను పవిత్రం చేసి వాటిద్వారా బలాన్ని, విజ్ఞానాన్ని అభివృద్ధిచేస్తూ, మానవులు దుష్టుల సాంగత్యాన్ని చేయకుండా చూస్తున్నాడు (35-16).

ఈ దేవతను సేవించడంద్వారా ప్రజలు మంచి గృహస్థులై సోమరితనం లేకుండా గృహస్థాశ్రమవిధులను సక్రమంగా నిర్వహించ గలుగుతారు (2-27). రాత్రింబగళ్ళు అగ్నితో సంబంధముండడంవల్ల మానవులు వివేకం కలిగి జ్ఞానానికి లొంగివుంటారు. ధర్మాచరణానికి, అధర్మాన్నుంచి ధర్మాన్ని కాపాడడానికి, అగ్నివల్ల ఎంతైనా సాహాయ్యం లభిస్తుంది (4-28). అగ్నివల్ల ప్రజలు సన్మార్గంలో నడుస్తారు. అన్నిరకాలైన సంతోషాలను పొందుతారు తప్పుడు మార్గాల జోలికి పోరు (5-36).

అగ్నిని ఉపాసించడం ద్వారా మనలో కోరికలు అణిగి పోయి, మనోనిగ్రహం కలుగుతుంది భూ-ధన-ధాన్య-సంపదలు పెంపొందు తాయి. తేజస్సు పెరిగి, దేహకాంతి రెట్టింపవుతుంది. మన శత్రువులకు నాశనం కలిగి యుద్ధాలలో మనకు విజయం లభిస్తుంది. పిశాచాది గ్రహాలబాధ తొలగి అపమృత్యుభయం తీరిపోతుంది ఇతని వల్లనే రాత్రిపూట చీకట్లో కూడా మానవులు తమ స్వరూపం ఇతర వస్తువుల స్వరూపం తెలుసుకొంటూ, అనేక వ్యవహారాలు చేయగలుగుతున్నారు. అగ్నివల్ల దుఃఖాలు నశించి మనకు ఉత్తమసుఖం లభిస్తుంది.

**2. ఇంద్రుడు:**

కృష్ణయజుర్వేదం పేర్కొన్న దేవతలందరిలో ఇంద్రుడు అగ్ని తరువాత పరిగణించదగినవాడు. 29 అధ్యాయాలలో ఇతని ప్రస్తావం ఉంది.

ఇతడు ఐశ్వర్యప్రదాత అందువల్ల మానవులను పూర్ణైశ్వర్య వంతులుగా చేస్తున్నాడు. శత్రువినాశకుడు (33-65). మంచివారిని

రక్షిస్తాడు (33-27). చెడు ప్రవృత్తివల్ల ఇతరుల ప్రశంసలు పొందలేని దుష్టులను సంహరిస్తాడు. హత్యలు చేసే దుష్టులను నాశనం చేస్తాడు (33-66). ధార్మికులను రక్షించి, దుష్టబుద్ధి కలవాళ్ళను చంపుతాడు. అడవుల్లో మోసమనే భుజాలతో బ్రతికే దొంగలను చంపేస్తాడు (33-26).

ఇంద్రునివల్ల మానవులు సత్యంగా వ్యవహరించి తమ ప్రతిష్ఠను పెంచుకొని, కార్యసిద్ధిని పొందుతున్నారు. ఈ రెండింటిద్వారా మానవుడు సుఖాలను పొందడానికి సమర్థుడవుతున్నాడు (3-50). ఇతణ్ణి సేవించడంవల్ల మానవులు అన్ని విద్యలను పొంది, మంచి బుద్ధితో సకలసుఖాలను అనుభవిస్తారు (32-13). ఇతడి మైత్రివల్ల మానవుడుకూడా సూర్యుడిలాగా ప్రకాశిస్తాడు (33-24). సిరిసంపదల వల్ల కలిగే సుఖాలను మానవులు ఇతనిద్వారా పొందవచ్చు (33-23). ఇతని ఆదేశంతో చేసిన యజ్ఞంవల్ల శారీరక, మానసిక దోషాలు తొలగిపోతాయి (1-13). పరోపకారం చేసే ధర్మాత్ములైన మానవుల కోరికలు సిద్ధిస్తాయి (2-10). ఇతని వల్ల పురుషార్థసిద్ధి కలిగి సంపదలను పొందడానికి వీలు కలుగుతున్నది (33-90).

### 3. సవిత:

ఇంద్రుని తరువాత ఈ వేదంలో చెప్పుకోదగ్గ దేవత సవిత. ఇతడు 22 అధ్యాయాలలో ప్రస్తావించబడ్డాడు. ఈ అధ్యాయాలలో ఇతనికి సంబంధించిన మంత్రాలను నిశితంగా పరిశీలిస్తే ఇతని స్వభావ ప్రభావాలు మనకు బాగా తెలుస్తాయి.

ఇతని గుణకర్మ - స్వభావాలు చాల ఉత్తమమైనవి (19-85). కాబట్టి మానవుల బుద్ధులను ఉత్తమ గుణ-కర్మ-స్వభావాల్లో ప్రేరేపిస్తాడు (3-35). ఇతడు శ్రేష్ఠుడైన విద్వాంసుడు కావడం వల్ల (19-85) మానవులను మంచి విద్వాంసులుగా అనుగ్రహిస్తాడు.

అంతేకాక విద్యావిరోధులను బంధిస్తాడు కూడా (1-26). సూర్యుడు మొ॥ జగత్తును ప్రకాశింపచేస్తాడు (1-25). కాబట్టి పృథివ్యాది పదార్థాలను బంధిస్తాడు. ఉత్తమగుణాలు కల ఈ దేవత మానవుల మంచిగుణాలను ప్రకాశింపచేస్తాడు (1-26).

ఈ దేవతను సేవించడంవల్ల మానవులకు, రోగాలకు లోనుగాకుండా ఎక్కువ సంతానాన్నిచ్చే పశువులు, మంచి ఇంద్రియాలు, ఎంతో భూమి మొ॥ లభిస్తాయి (1-1). వారి సంతానం, ధనధాన్యాలు, గృహాదులు అన్ని విధాలా రక్షింపబడతాయి (33-69). సవిత అనుగ్రహం వల్ల సంతానం దుఃఖాన్ని కలిగించేదో, దొంగో, బందిపోటో కాకుండా ఉంటుంది (1-1). మానవుల వాక్కులు మధురంగా వుండేటట్లు ఈ దేవత చేస్తాడు (11-7). రాజు రోగాలనుంచి శరీరాన్ని రక్షించే ఇతని దయవల్ల ఆరోగ్యాన్నిపొంది రాజ్యపాలన చేయడానికి అర్హుడవుతాడు (33-20). ఇతణ్ణి సేవించడం వల్ల మనం సత్య విద్యాయుక్తమైన ఉత్తమబుద్ధిని పొందగల్గుతాం (22-11). సవిత మంచినడవడీని, ధర్మాసక్తిని (6-2) ఆయుష్యాన్ని మానవుల్లో పెంచుతాడు (4-25). చెడువారిని బంధించి మంచి వారికి సుఖాన్ని కలిగిస్తాడు (37-11).

**4. ప్రజాపతి:**

కృష్ణయజుస్సంహితలో 19 అధ్యాయాల్లో పేర్కొనబడ్డ ప్రజాపతిదేవతయొక్క ప్రాముఖ్యం ఆయా అధ్యాయాల్లోని మంత్ర భాగాలను చూస్తే తెలుస్తుంది.

చరాచర జగత్తు తెలిసినవాడు కావడంవల్ల విద్వాంసులకు సమస్తపదార్థాలు తెలిసేటట్లు చేస్తున్నాడు. విజ్ఞానాధిదేవతగా, మానవులకు విశేష విజ్ఞానాన్ని కలిగిస్తున్నాడు (2-21). నీతిమంతులైన

మానవులపై దయచూపడం ఇతనికి స్వభావసిద్ధం. ఇతడు మానవులను, గుఱ్ఱాలను, గోవులను, ఏనుగులను కాపాడతాడు (3-37).

ప్రజాపతి దయవల్ల శౌర్య-ధైర్య-విద్యాదులతో శత్రువులను ఎదుర్కోవడంలో మనం వెనుకంజవేయం (3-37). ఇతనివల్ల ప్రజలు వీరులు, ఉత్సాహవంతులై ధర్మవిరోధులైన వారిని జయించ గలుగుతారు (7-44). ఎన్నో సిరిసంపదలను ప్రసాదించి (7-18), ఉత్తమసంతానంతో మనం అత్యంతైశ్వర్యాన్ని పొందేటట్లు ఇతడు అనుగ్రహిస్తాడు (7-36).

**5. విద్వాంసులు:**

విద్వాంసులు అనే దేవతలు 18 అధ్యాయాలలో చెప్పబడి విద్యాప్రచారం చేసేవారుగా ప్రసిద్ధికెక్కారు.

వీరు సుఖాన్ని కలిగిస్తారు. ఎప్పుడూ సరళభావాన్నే కలిగి వుండడంవల్ల (6-12), మానవులందరూ సుశిక్షితులై సత్కర్మల నాచరించేటట్లు చేస్తారు (6-15). వీరు విద్యాప్రచారం ద్వారా సమస్త ప్రాణులకు ఆనందాన్ని కలిగిస్తారు (14-10).

అన్ని మతాలలోని మంచి సిద్ధాంతాలను కలిపి ఒకే మతంగా స్థాపించి, ప్రపంచకల్యాణానికి తోడ్పడుతున్నారు గాయత్రి మొ॥ ఛందస్సుల అర్థాన్ని వివరించి చెప్పి అందరికీ జ్ఞానాన్నందించడంతో పాటు మంచివారి సాంగత్యంలో మానవులు బుద్ధిమంతులై సత్యవర్తనులై దీర్ఘాయుష్మంతులయ్యేటట్లు చేస్తున్నారు (25-21). బాలబాలికలకు, బ్రహ్మచర్యాన్ని ఇచ్చి విద్వాంసులుగా, విదుషీ మణులుగా చేయడం వీరివల్ల జరుగుతుంది (19-39). వీరి·ద్వారా జ్ఞానాన్ని, సత్యాన్ని, సుఖాన్ని, మంచిజీవనాన్ని, మంచి మనస్సును, సద్గుణాలను, స్వాతంత్ర్యాన్ని, శాంతిని, ప్రతిష్ఠను, అదృష్టాన్ని

ఉత్తమలోకాన్ని మానవులు పొందగలుగుతారు (15-4).

### 6. విశ్వేదేవులు:

వీరు ఈ సంహితలో 17 అధ్యాయాల్లో పేర్కొనబడ్డారు

విశ్వేదేవులు సుఖానికి కారకులు (7-12) కాబట్టి సూర్యచంద్రుల్లాగా మంచిగుణాలను ప్రసాదించి, దుష్టులను శిక్షించి, సజ్జనులను సంతోషపరుస్తారు(7-16).

వీరు ఉన్నచోట ప్రజలు విద్యను, ఉత్తమ శిక్షణను, ధనాన్ని పొంది ఉంటారు(3-21). భ్రమ మొ॥ దోషాలు లేక శమదమాది గుణాలతో ప్రకాశిస్తారు (7-12). వీరు సకల ధనధాన్యాలతో ప్రజాపాలకులై శత్రువులను శిక్షిస్తున్నారు (7-17). యోగవిద్యను అభ్యసించడం ద్వారా ఆత్మబలాన్ని పెంపొందించుకోవడానికి వీరివల్ల వీలు కలుగుతున్నది (7-23) వీరి దయవల్ల సభాపతి, సేనాపతులు దివ్యగుణాలను పొంది, రాజ్యపాలనాది వ్యవహారాలను అభివృద్ధి పరుస్తున్నారు(7-22).

### 7. యజ్ఞము:

ఈ దేవత కృష్ణయజుర్వేదంలో 16 అధ్యాయాలలో ప్రస్తావించబడింది.

ఈ దేవత చాలా పవిత్రుడు(1-13). అందువల్లనే మానవుల పాపాలను తొలగించి, వారిని పవిత్రులను చేస్తున్నాడు(1-3). అంతేకాక ఇతనివల్ల ఆహారపదార్థాలు, నీళ్లు పవిత్రీకరించబడి శరీరానికి, ఇంద్రియాలకు బలాన్నిస్తున్నాయి(1-20).

ఇతనివల్ల మానవులకు మంచిగుణాలు లభిస్తాయి(1-15). ఇతడు సత్యజ్ఞానాన్ని కలిగి ఉంటాడు (1-3). కాబట్టి మానవులందరికి

జ్ఞానాన్ని, బలాన్ని కలిగిస్తాడు. ఇతనివల్ల మానవులకు ఆరోగ్యం, చురుకుదనం, ఉత్సాహం జీవితాంతం సుఖసంపదలు కలుగుతాయి (1-20). ఇతడు మన ఇళ్లలో దుష్టులనుండనీక మనకు సుఖాన్ని కలిగిస్తాడు(1-14). దుఃఖాలను రూపుమాపి ఉత్తమగుణాలను భోగాలను ఇస్తాడు (17-62). ఇతడు విద్యాప్రచారకుడు. కాబట్టి స్త్రీలకుకూడా విద్యాభివృద్ధిని కలిగిస్తాడు(37-4). కోరికలు తీర్చే వాడైనందువల్ల శాస్త్రోక్తంగా హోమం చేయబడ్డ హవిస్సు మొ॥ పదార్థాలను ఆకాశంలోకి పంపి ఇతడు వర్షంద్వారా యజమానుల కోరికలు తీరుస్తున్నాడు(17-5).

**8. సూర్యుడు:**

కృష్ణయజుర్వేదంలో 15 అధ్యాయాలలో చెప్పబడ్డ దేవత సూర్యుడు.

స్వయంప్రకాశుడైన ఇతడు ప్రాతఃకాలంలో సమస్తవస్తువులను ప్రకాశింపచేస్తున్నాడు(3-10). అన్నాదులనిస్తూ (31-20) వర్షాలద్వారా అందరి జీవనాలను పరిపాలిస్తున్నాడు (33-30). ఇతడు సర్వవ్యాపకుడై తిరిగే ప్రాణులలోను, స్థావర పదార్థాలలోను ఆత్మగా ఉండి, ఆకాశంలో భూమిలో అంతరిక్షంలోను వ్యాపించి ఉన్నాడు (7-42).

ఇతని ఉదయంవల్ల మానవుల పాపాలు నాశనమై, దుఃఖాలు రూపుమాసిపోతాయి (33-42). దుష్టులు తమ చెడ్డపనులను వదలివేస్తున్నారు (4-35). మానవులు ఈ దేవతవల్ల ఏర్పడిన విజ్ఞానం ద్వారా సృష్టిని చూస్తూ, పరాధీనులుకాకుండా స్వతంత్రులుగా సకలేంద్రియాలతో 100 సం॥ కంటె ఎక్కువగా జీవిస్తున్నారు (36-24). సూర్యుణ్ణి సేవిస్తే మానవులు ఉత్తమగుణాలతో, న్యాయ వినయాలతో ప్రవర్తించడానికి వీలవుతుంది (33-30).

**9. వాయువు:**

**40** అధ్యాయాలున్న కృష్ణయజుస్సంహితలో **13** అధ్యాయాలలో ప్రస్తావించబడిన దేవత వాయువు.

ఇతడు యుద్ధవిద్య తెలిసినవాడు. ఇతని విజ్ఞానం ద్వారా మనం వర్షాన్ని పొందుతున్నాం.

యజ్ఞాలు చేయడంవల్ల దుష్టులను తరిమివేయడమే కాక వాక్శుద్ధి సత్యం, జ్ఞానం, బలం కలుగుతాయని తెలుస్తున్నది. దుర్జనులు, ఆచారరహితులు, ఇతనివల్ల నశిస్తారు **(1-16)**. ఇతణ్ణి సేవించడంవల్ల స్త్రీ, బ్రహ్మచర్యాశ్రమంలో తాను విదుషీమణి అయి, శరీరాత్మబలాలను ఎక్కువచేసుకోవడానికి, తన సంతానానికి ఎప్పుడూ విజ్ఞానాన్ని కలిగించడానికి వీలుకలుగుతుంది **(14-24)**.

**10. సోముడు:**

12 అధ్యాయాలలో పేర్కొనబడిన దేవత సోముడు

సమస్త జగత్తును సృష్టిస్తాడు కాబట్టి, అనేకమంది పుత్రులను, రాష్ట్రాది సంపదలను మానవులు పొందేటట్లు చేస్తాడు **(3-56)**. సమస్తసుఖాలను ఇచ్చి **(3-56)** అన్నాద్యైశ్వర్యం ద్వారా కోరిన సుఖాలు లభించేటట్లు అనుగ్రహిస్తాడు **(5-7)**. మంచి మార్గంలో నడిపించి **(5-39)** సత్కర్మలు చేసేటట్లు ప్రేరేపిస్తాడు **(7-2)**. పరిపాలనలో నైపుణ్యం కలవారిని, చక్కగా యజ్ఞాలను చేసేవారిని, ఆచార్యునినుండి మంచి విద్యలనభ్యసించే సంతతిని ఈతని దయవల్ల పొందవచ్చు **(34-21)**. సూర్యుడు చీకట్లను పోగొట్టినట్లు అధికారులు అధర్మాన్ని ఇతని దయవల్ల పోగొట్టగలుగుతారు **(34-22)**.

**11. ఈశ్వరుడు:**

కృష్ణయజుర్వేదంలో 11 అధ్యాయాల్లో ఈశ్వరుడు పేర్కొన బడ్డాడు. ఇతడు జగత్తును ఉత్పత్తి చేస్తాడు. వసంతాది ఋతువులను, మాసాలను, సంవత్సరాలను, తిథులను సృష్టించాడు **(14-29)**. ఇతడు సమస్తలోకాన్ని ప్రకాశింపచేయడంవల్ల **(4-8)** మానవులు తమ పనులను సక్రమంగా చేసుకోగలుగుతున్నారు **(25-11)**. కార్యకారణరూపాల్లో ప్రపంచమంతా నిండి ఉన్నాడు.

ఇతనిని సేవించడంద్వారా దుష్టులను జయించవచ్చు **(4-8)**.

**12. బృహస్పతి:**

కృష్ణయజుర్వేదంలో [illegible] అధ్యాయాల్లో బృహస్పతి ప్రస్తావం ఉంది.

ఇతడు ప్రకృతి, ఆకాశం మొదలైన పదార్థాలకు అధిపతిగా ఉండి **(2-13)** జ్ఞానాన్ని పాలించడం ద్వారా, తను చక్కగా అధ్యయనం చేసి, సమస్తవిద్యలను ఇతరులకు చెప్పేవాడుగా, విద్యాసిద్ధిని పొందేవాడుగా మానవుణ్ణి తయారు చేస్తున్నాడు **(3-28)**.

మానవుడి అజ్ఞానాన్ని పోగొట్టి, లోకజ్ఞానాన్ని కలిగించి, అతనిచేత ఇతడు మంచిపనులను చేయిస్తున్నాడు.

**13. రుద్రుడు:**

మొత్తం 8 అధ్యాయాలలో ఈసంహితలో రుద్రుని ప్రస్తావన దొరుకుతున్నది.

ఇతడు ప్రజలకు ఉత్తమవిద్యను ఇచ్చి **(3-5)**, జ్ఞానాన్ని కలిగించి, సమస్తదుఃఖాలను పోగొట్టి, మానవులు సుఖంగా

జీవించేటట్లు చేస్తాడు (3-58). మానవుల శారీరక మానసిక రోగాలను, పశువుల రోగాలను పోగొట్టి అజ్ఞానాదులను తొలగిస్తాడు (3-59).

ఈయన దయవల్ల మంచిసంతానాన్ని పొందడానికి, రాజులు రాజ్యాదులను పొందడానికి, సువర్ణాది ధనవృద్ధి చేసుకోవడానికి వీలవుతుంది (3-63). ఇతడు అన్నిదిక్కులలో ఉన్న రాజ్యభాగాలను రక్షించి, పశువులను సంరక్షిస్తాడు (16-17). ఈ దేవత సమస్త భృత్యులను సత్కరించి మంచి శిక్షణనిస్తాడు. రాజపురుషులు ధర్మంగా రాజ్యాన్ని పాలించేటట్లు చూస్తాడు (16-26).

**14. విష్ణువు:**

7 అధ్యాయాలలో పేర్కొనబడిన దేవత విష్ణువు.

ఈ దేవత విజ్ఞానాన్ని కాపాడి (1-4), యజ్ఞరక్షణ చేస్తూ, యజ్ఞం చేసే యజమానిని రక్షిస్తాడు (2-6). అందరిలో జ్ఞానాన్ని అభివృద్ధిపరుస్తాడు (5-38). భూమి, అంతరిక్షం, సూర్యుడు అనే మూడు జగత్తులను సృష్టించి, సమస్తాన్ని రక్షిస్తాడు (34-43).

ఈయన సకల జగత్తులో వ్యాపకుడుగా ఉండడంవల్ల పరిపూర్ణసుఖాలు మానవులకు లభిస్తాయి. ఇతడు యోగజ్ఞానాన్ని కలిగిస్తాడు (5-19). ఇతడు క్షత్రియులకు శక్తిసామర్థ్యాలు కలిగించడంవల్ల (6-3) రాజ్యంలో సత్యవ్యవహారం లభిస్తుంది (6-4).

**15. పితరులు:**

ఈదేవతలు కృష్ణయజుస్సంహితలో 5 అధ్యాయాలలో ప్రస్తావించబడ్డారు.

వీరు ప్రజలను దుఃఖంనుంచి రక్షించి, వారి శత్రువులను శిక్షిస్తారు.

వీరివల్ల మానవులకు ఆనందం, విద్య, ధర్మశిక్షణ లభిస్తాయి (2-31). మానవులు అనేక విద్యలను, ధార్మికజీవితాన్ని వీరిదయవల్ల పొందుతున్నారు (2-33).

పైన పేర్కొన్న దేవతలేకాక పరమేశ్వరుడు, ద్యావాపృథువులు, మిత్రావరుణులు, వైశ్వానరుడు, వరుణుడు, యజమానుడు, ప్రాణం, లింగోక్తులు, సరస్వతి, త్వష్ట, అశ్వినులు, దంపతి, దిక్కు, మరుత్తులు, గణపతి, వసువులు, బ్రహ్మ, ఆత్మ, క్షత్రపతి, గృహపతి, గరుత్మంతుడు, జగదీశ్వరుడు, ఋతువులు, కృషీవలుడు, వీరుడు, సినీవాలి, సేనాపతి, హిరణ్యగర్భుడు మొ॥ దేవతలు ఈ సంహితలో అక్కడక్కడా పేర్కొనబడ్డారు.

ఈ దేవతలు, మానవులు చేసిన యజ్ఞాలకు ప్రీతిని పొంది వారి కోరికలను నెరవేరుస్తారు. మానవజాతిని అనుగ్రహించే ఈ దేవతల స్వరూపాదులు వేదాల్లో ఎలా ఉన్నాయో తెలుసుకోవడం ఎంతైనా అవసరం.

- టి.ఎన్.సి.

## 2.7 ఛందస్సు

వేదాంగాల్లో మూడోది ఛందస్సు. వేదార్థాన్ని తెలుసుకోడంలో వ్యాకరణాదులు ఎలా ఉపయోగిస్తాయో ఛందస్సు కూడా అలాగే ఉపకరిస్తుంది. ఆయామంత్రాలకు సంబంధించిన ఋషి-ఛందో-దైవత-బ్రాహ్మణాలను తెలిసికోకుండా చేసే అధ్యయనం, అధ్యాపనం, యజనం, యాజనం, నిష్ఫలాలని ఆర్షేయబ్రాహ్మణం చెబుతున్నది.

వేదార్థజ్ఞానానికి ఛందస్సుకు సంబంధమేమిటని సందేహం కలుగవచ్చు. వేదమంత్రాలన్నింటిలోను అర్థాన్ననుసరించి పాదవిభాగం చేయబడుతుంది. అందువల్ల వేదార్థాన్ని చెప్పవలసినప్పుడు ప్రతిపాదానికీ ముందర్థం చెప్పి, తరువాత మొత్తానికి సంబంధించిన బావార్థం చెప్పాలి. కాబట్టి పాదజ్ఞానానికి ఛందోజ్ఞానం అవసరం. ఇక నిరుక్తాన్ననుసరించి మంత్రాల దేవతానిర్ణయం ఛందస్సుపై ఆధారపడినట్లు తెలుస్తున్నది ఎక్కడ మంత్రానికి దేవతానిర్దేశం లేదో, అక్కడ ఆయా ఛందస్సును బట్టి దేవతా నిర్ణయం చేసి, తరువాతే మంత్రార్థం చెప్పాలి కాబట్టి ఛందోజ్ఞానం చాల అవసరమని తెలుతున్నది.

వేదంలో ఛందోనిర్ణయం అక్షర సంఖ్యననుసరించే చేయబడుతుంది. ఈ ఛందస్సు **'కేవలాక్షరగణనానుసారి', 'పాదాక్షరగణనానుసారి'** అని రెండురకాలు. ఈ రెండురకాలైన ఛందస్సులు కలది కృష్ణయజుర్వేదం.

**కేవలాక్షరగణనానుసారి ఛందస్సు :**

ఎక్కడ పాదవిభాగం లేకుండా మంత్రాక్షరసంఖ్యచేత ఛందోనిర్ణయం జరుగుతుందో అది కేవలాక్షరగణనానుసారి ఛందస్సు. ఇలాంటి ఛందస్సుగలవాటినే యజుస్సులని అంటారు. **అనియతాక్షర**

పాదాలు యజుస్సులని చెప్పబడ్డాయి కదా! కాబట్టి యజుర్మంత్రాలలో ఛందస్సు లేదనే చెప్పాలి కదా! అందువల్లనే పాదబద్ధచ్ఛందస్సుకు ఛందస్సును చెప్పినట్లుగా యజుస్సుకు ఛందస్సు చెప్పటం లేదు కేవలం **'యజుః ఛందః'** అనే చెప్తున్నారు. అందువల్ల యజుస్సు ఛందస్సే కాదని శంక కలుగవచ్చు. కాని **'ఓమ్'** అనే ప్రణవానికి దైవీ గాయత్రి ఛందస్సని **పింగలచ్ఛందస్సూత్రం** వల్ల తెలుస్తున్నది **తైత్తిరీయారణ్యకంలో (2-11)** ఓంకారం యజుర్మంత్రమని చెప్పబడింది. కాబట్టి యజుస్సులకు కూడా ఛందస్సున్నది.

ఇలాంటి యజుస్సులు ప్రధానంగా గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి అని ఏడు విధాలు. ఈ ఏడూ మళ్ళా ఒక్కొక్కటి దైవీ-ఆసురీ-ప్రాజాపత్యా-ఆర్షీ-యాజుషీ-సామ్నీ-ఆర్చీ-బ్రాహ్మీ అని ఎనిమిది విధాలు

దైవచ్ఛందస్సు ఒక్క అక్షరంనుండి ఏడక్షరాల వరకు క్రమంగా గాయత్రి మొ॥ పేర్లతో పిలువబడుతుంది ఆసురచ్ఛందస్సు పదిహేను అక్షరాల నుంచి ఒక్కొక్క అక్షరం తగ్గుతూ **9** అక్షరాల వరకు క్రమంగా గాయత్రి మొ॥ పేర్లతో పిలువబడుతుంది. క్రమంగా **8,12,16,20,24,28,32** అక్షరాలుండే ప్రాజాపత్యచ్ఛందస్సుకూడా గాయత్రి మొ॥ భేదాలతో పిలువబడుతోంది. ఆర్షచ్ఛందస్సంటే, పాదనియమం కల ఛందస్సుతో సమానంగా అక్షరాలు కలది అంటే దీనిలో గాయత్ర్యాదులకు క్రమంగా **24,28,32,36,40,41,48** అక్షరాలుంటాయి. రెంటికీ తేడా పాదవిభజన ఉండటం, లేకపోవడమే ఆర్షచ్ఛందోవర్గాలలో నాల్గోవంతు అక్షరాలు గలది యాజుషచ్ఛందస్సు అంటే ఈ ఛందస్సులో గాయత్ర్యాదులకు **6,7,8,9,10,11,12** అక్షరాలుంటాయి. యాజుషచ్ఛందస్సులో అక్షరాలకు రెట్టింపుగా అక్షరాలుంటే సామ్నచ్ఛందస్సని, మూడురెట్లు అక్షరాలుంటే బ్రాహ్మచ్ఛందస్సని అనబడుతుంది.

బ్రాహ్మణగ్రంథాల్లో దైవి, ఆసురి అనే రెండుభేదాలే చెప్పబడ్డాయి. కాని పింగళనాగుడు ఈ భేదాలనన్నింటిని చెప్పాడు. యజుర్వేదవ్యాఖ్యాతలు అన్ని యజుర్మంత్రాలకు ఛందస్సు చెప్పక పోయినా అక్కడక్కడ ఈ భేదాలను కూడా సూచించారు. ఉదాహరణకు భట్టభాస్కరుడు **'అగ్నే తమద్యాశ్వం నస్తోమైః'** (4-4-4-22) అనేది 24 అక్షరాల పంక్తిచ్ఛందస్సని చెప్పాడు. అంటే ఇది ప్రాజాపత్య పంక్తిచ్ఛందస్సన్నమాట.

ఈ పై ఛందోభేదాలను పరిశీలించేటప్పుడు ఒకే అక్షర సంఖ్య కల మంత్రాలు విభిన్నచ్ఛందస్సులలో కనిపిస్తాయి. ఉదాహరణకు **'దైవీ త్రిష్టుప్, యాజుషి గాయత్రీ'** ఈ రెంటికి ఆరక్షరాలే. అలాగే **'ఆసురీ బృహతీ, యాజుషి జగతీ, ప్రాజాపత్యా ఉష్ణిక్**. ఈ మూడింటికి పన్నెండేసి అక్షరాలు, ఈ విధంగా ఉన్నప్పుడు ఛందోనిర్ణయమెలా చేయాలనే శంక కలుగుతుంది ఆయా మంత్ర ప్రతిపాద్యదేవతలను పరిశీలించి ఛందోనిర్ణయం చేయాలి.

అగ్ని, సవిత, సోముడు, బృహస్పతి, మిత్రావరుణులు, ఇంద్రుడు, విశ్వేదేవులు క్రమంగా ఆయా ఛందో దేవతలు ఉదాహరణకు - **'నమోగ్నయే'** (7-5-24-2) అనే యజుస్సులో 24 అక్షరాలున్నాయి. ఇది ఆర్షీ గాయత్రియా? ప్రాజాపత్య పంక్తియా? అనే సందేహాన్ని మంత్రం అగ్నిదేవతాస్తుతిపరం కావటంవల్ల 'ఆర్షీ గాయత్రి' అని పరిష్కరించాలి. "అగ్నే తమద్యాశ్వం" (4-4-4-22) అనే మంత్రం ప్రాజాపత్యపంక్తి అనే భాస్కరనిర్ణయం ముందే చెప్పడమైంది.

ఇక వీటికి వరుసగా కొన్ని ఉదాహరణలు:

**దైవీ:** ఓమ్ భువః (1-5-11-14) ఇషేత్వా(1-1-1-1) సా విశ్వాయుః (1-1-3-5) సా విశ్వవ్యచః (1-1-3-6) దేవం గమయసి (1-1-2-19) విష్ణో హవ్యం రక్షస్వ(1-1-3-10).

**అసురీ:** దేవానాం **(1-1-2-4)** శుంధధ్వం **(1-1-3-1-)**; పృథివ్యంతరిక్షం **(7-3-12-4)**; పితాపుత్రః **(7-3-12-8)**; దేవబహిః **(1-1-2-5)**; కస్త్వా **(1-5-10-10)**; పలాయిష్యమాణాయ స్వాహా **(7-1-19-16)**.

**ప్రాజాపత్యా:** వాయవస్థోపాయవః స్థ **(1-1-1-2)**; రుద్రా స్త్వాఞ్జంతు **(7-4-20-5)**; అగ్నిస్తే**(1-1-8-13)**; ఏష [illegible] **(1-4-44-8)**; అగ్నే తమద్యాశ్వం **(4-4-4-22)** అదిత్యాస్త్వా **(3-3-3-3-)** మాతరిశ్వనో **(1-1-3-2)**. ఈ విధంగా ఆయా మంత్రాల ఛందస్సు తెలుసుకోవాలి.

## పాదాక్షరగణనానుసారి ఛందస్సు:

అక్షరసంఖ్యతో పాటు పాదవిభాగం గల ఛందస్సు ఈ రెండవ తెగకు చెందింది. ఇది ఋగ్వేదంలో ప్రసిద్ధికెక్కింది. గాయత్రి మొదలుగా చెప్పిన ఏడు ఛందస్సులు ఇందులో ప్రధానాలు ఈ ఏడింటిలో గూడ గాయత్రి, త్రిష్టుప్, అనుష్టుప్‌లే ఎక్కువ.

### 1. గాయత్రి:

ఇది సామాన్యంగా మూడుపాదాల్లో ఒక్కొక్కపాదానికి ఎనిమిది చొప్పున **24** అక్షరాలతో ఉంటుంది

అర్థాన్ని బట్టి పాదవిభాగం చేసేటప్పుడు ఒక్కొక్కపాదం అక్షరసంఖ్య తగ్గటం హెచ్చటం వల్ల ఇది అనేకరకాలుగా ఉంది. **'త్రింశద్ధామ విరాజతి'** **(1-5-3-3)** అనే మంత్రంలో మూడుపాదాలు సమానంగా ఉన్నాయి. ఇటువంటి మంత్రాలు చాలా ఉన్నాయి **'సహూసి సహమాన'** **(1-6-1-2)** అనే మంత్రంలో ఒక్కొక్కపాదానికి ఏడేసి అక్షరాలే ఉన్నాయి. అందుచేత ఇది **'పాదనిచృత్'** అని చెప్పబడుతున్నది.

'**సహస్వ పృతనాః**' (4-2-9-6) అనే చోట మొదటి పాదం ఆరక్షరాలు, మిగిలినవి ఏడేసి అక్షరాలవి. అందుచేత ఇది '**అతి నిచృత్**' అని అనబడుతున్నది.

'**తిస్రో దేవీః**' (4-1-8-9) అనే మంత్రంలో వరుసగా 6,7,8 అక్షరాలున్నాయి. కాబట్టి ఇది '**శంకుమతి**' అని '**వర్ధమాన**' అని అనబడుతున్నది.

దీనికి విపరీతంగా '**వియోజనామిమిమీధ్వమ్**' (1-7-8-8) అనే చోట 7,6,5 అక్షరాలుండటంచేత దాన్ని '**కకుద్మతి**' '**ప్రతిష్ఠ**' '**త్రిపదోపమ**', అనే పేర్లతో పిలుస్తున్నారు.

ఇక రెండే పాదాలుండి ఒక్కొక్కపాదానికి ఎనిమిదినుంచి పన్నెండువరకు అక్షరాలుంటే అది '**ద్విపదా గాయత్రి**' అని '**విశాలం**' అని, ఒకేపాదం ఎనిమిదక్షరాలతో ఉంటే '**ఏకపదా గాయత్రి**''**వివలం**' అని పిలువబడుతోంది. '**వాజినో వాజం ధావత**' (1-7-8-8) '**నిరస్తం నముచేః శిరః**' (1-8-14-5). ఈ రెండు క్రమంగా ఉదాహరణలు.

**విరాడ్గాయత్రి:** దీనికే '**అనాధృష్టమ**'ని పేరు. ఇది గాయత్రీ భేదంగాను అనుష్టుప్ భేదంగా కూడ చెప్పబడుతున్నది. దీనిలో మొత్తం ముప్పైనుంచి ముప్పైమూడు వరకు అక్షరాలుంటాయి. ఒక్కొక్కపాదానికి 10 లేక 11 అక్షరాలుంటాయన్నమాట '**ధిషణే వీడూ**' (1-4-1-6) '**అగ్నేరనీకం**' (1-4-45-4) అనే మంత్రాల్లో ఒక్కొక్కపాదంలో పదకొండక్షరాలున్నాయి.

'**అగ్నేత్వం నో అన్తమః**' (4-4-4-27) అనే మంత్రంలో రెండే పాదాలున్నాయి. ఒకటి ఎనిమిది అక్షరాలుకలది. మరొక్కటి 12 అక్షరాలు కలది. అందువల్ల ఇది '**ద్విపదా విరాట్**' అని పిలువబడు తున్నది.

**'విశ్వమస్మాత్'** (1-2-1-7) **'ఉస్రావేతం'**(1-2-8-8)మొదలైన మంత్రాల్లో ఒకటే పాదం. దానికి 10లేక 11అక్షరాలు. అందువల్ల ఇది **'ఏకపదా విరాట్'** అని అనబడుతోంది.

**2. ఉష్ణిక్ :**

దీనికి కూడా మూడే పాదాలు. మొత్తం 28 అక్షరాలు. మూడుపాదాల్లో అక్షరాలు సమానంగా ఉండటం సంభవించదు. కాబట్టి కేవలం **'ఉష్ణిక్'** అని పిలవబడేది లేదనే అనాలి.

**'ఏమాఅగ్నన్నాశిషో'** (1-6-4-14) అనేచోట మొదటిపాదంలో పన్నెండు, మిగిలినవానిలో ఎనిమిదేసి అక్షరాలున్నాయి. దీనికి **'పురఉష్ణిక్'** అని పేరు.

మధ్యపాదంలో 12 అక్షరాలు, మిగిలిన రెండింటిలో ఎనిమిదేసి ఉంటే **'కకుప్'** అని అనబడుతుంది. **'అపం న పాదాశు'** (1-7-7-9) అనేది ఉదాహరణం.

చివరిపాదంలో 12, మిగిలినవానిలో ఎనిమిదేసి ఉండే **'ప్రజాం యోనిం'** (1-1-10-6) అనే మంత్రం **'పరాఉష్ణిక్'** అనబడుతుంది.

ఇక మొదటి రెండుపాదాల్లో పదకొండేసి అక్షరాలు, చివరి పాదంలో ఆరక్షరాలు ఉంటే అది **'తనుశిరా'** అని అనబడుతుంది **'అజాసి రయిష్ఠా'** (3-4-2-8) దీనికి ఉదాహరణం.

మధ్యపాదంలో అక్షరాలు తక్కువ, మిగిలినపాదాల్లో ఎక్కువగా ఉంటే **'పిపీలికామధ్య'** అని, మూడుపాదాల్లో అక్షరసంఖ్య క్రమంగా పెరిగితే, **'శంకుమతి'** లేదా **'వర్ధమాన'** అని అనబడుతుంది **'తన్నస్తురీపమద్భుతం'** (4-1-8-10) **'మిత్రైతాముఖాం'** (4-1-6-14) అనే ఈ రెండు క్రమంగా ఈ రెంటికి ఉదాహరణలు. ఈ ఉష్ణిక్ ఛందస్సులో మంత్రాలు తక్కువే.

**3. అనుష్టుప్ :**

దీనికి నాల్గుపాదాలు. సామాన్యంగా పాదానికి ఎనిమిది అక్షరాలు. మొత్తం 32 అక్షరాలు. ఇందులో కొద్దిగా గురులఘు నియమం కూడా ఉన్నట్లు కనిపిస్తుంది. 5,7 అక్షరాలు గురువులు, 6 వ అక్షరం లఘువుగా ఇందులో ఉండాలి. **'యాని ధర్మే కపాలాని'** (1-1-7-12) **'ఆశానాం సౌమనసం'** (1-1-10-7) ఇత్యాదులు చాల ఉదాహరణలు దొరుకుతాయి.

ఇక ఈ ముప్పైరెండక్షరాలు మూడుపాదాల్లో సర్దుకొన్నప్పుడు ఏర్పడే భేదాలను బట్టి 'త్రిపద **అనుష్టుప్**'లు చాలా రకాలు. మధ్యపాదంలో ఎనిమిది, మిగిలిన రెండింటిలో పన్నెండేసి ఉంటే దానిని **'మధ్యేజ్యోతి' 'పిపీలికామధ్య'** అనే పేర్లతో పిలుస్తారు. **'ఇచ్ఛుష్మో అగ్నే'** (1-6-2-10) దీనికి ఉదాహరణం.

చివరిపాదంలో ఎనిమిది, మిగిలిన రెండింటిలో పన్నెండేసి ఉండే **'యాస్తే అగ్నే'** (5-7-6-8) అనేది **'కృతి'** అని పిలువబడుతున్నది

మూడుపాదాలలో వరుసగా 9,10,13 అక్షరాలుంటే దానిని **'నష్టరూపి'** అంటారు. **'యాస్తే అగ్నే'**(4-2-9-13) దీనికి ఉదాహరణం.

'ఇంద్రః ప్రాణో' (1-3-10-2) అనే మంత్రంలో ముప్పై రెండక్షరాలు అర్థానుగుణంగా ఆరుపాదాలుగా విభజింపబడ్డాయి. దీన్ని **'షట్పదానుష్టుప్'** లేదా **'మహాపదపంక్తి'** అని పిలుస్తారు.

**4. బృహతి:**

నాల్గుపాదాల్లో 36 అక్షరాలు గలది. దీనిలో మంత్రాలు ఎక్కువగానే ఉంటాయి. **'ప్రదాతారం'** (1-7-13-9) అనే మంత్రంలో నాల్గుపాదాలు సమంగా ఉన్నాయి. కాబట్టి ఇది బృహతి.

ఇక పాదాల్లోని అక్షరాల హెచ్చు తగ్గులను బట్టి ఇది కూడ చాల రకాలు. రెండవపాదంలో 12 అక్షరాలు, మిగిలిన మూడింటిలో ఎనిమిది అక్షరాలుంటే **'న్యంకుసారిణి'** **'ఉరోబృహతి'** 'స్కన్ధోగ్రీవి' అని పిలువబడుతుంది. **'ఆవర్తన వర్తయ'** **(3-3-10-3)** దీనికి ఉదాహరణం.

**'కదాచన స్తరీరసి'** **(1-5-6-14)**. **'అమాను పక్వమైరయ'** **(1-6-12-9)** అనే మంత్రాల్లో మూడవపాదంలో **12** అక్షరాలు, మిగిలిన పాదాల్లో ఎనిమిదేసి అక్షరాలు ఉండటంచేత **'పథ్యా బృహతి'** అని పిలువబడుతున్నది.

**'భూమిర్భూమ్నా'** **(1-5-3-1-)** అనేది **'ఉపరిష్టాద్బృహతి'** దీనిలో చివరిపాదంలో పన్నెండు అక్షరాలు.

మొదటి రెండుపాదాల్లో ఎనిమిదేసి అక్షరాలు, మిగిలిన రెండింటిలో పదేసి ఉంటే **'అస్తార బృహతి'** అని అనబడుతుంది **'త్వష్టీమతీతే'** **(1-2-5-14)** అనేది దీనికి ఉదాహరణం.

ఇక నాలుగుపాదాలలోను అక్షరసంఖ్య భిన్నంగా ఉంటే **'విషమపదబృహతి'** అని అంటారు. **'దేవావసవ్యా'** **(2-4-8-1)** దీనికి ఉదాహరణం.

ఇక మూడే పాదాలుండి , ఒక్కొక్కపాదం 12 అక్షరాలు కలది ఐతే **'మహాబృహతి'** **'సతోబృహతి'** **'విరాడూర్ధ్వబృహతి'** అని పిలువబడుతుంది. **'అత్యన్యానగాం'(6-3-3-2)** అనేమంత్రంలో మూడుపాదాలు పన్నెండక్షరాలవి

ఇందులోనే మధ్యపాదంలో అక్షరాలు ఎక్కువగా ఉంటే **'యవమధ్య మహాబృహతి'** అవుతుంది. **'మీఢుష్టమ శివతమ'(4-5-10-10)** అనేది దీనికి ఉదాహరణం.

ఇలాంటి పన్నెండక్షరాల పాదాలు నాలుగు, లేదా రెండు పన్నెండక్షరాలవి, రెండు పది అక్షరాలవి ఉంటే **'చతుష్పదా సతోబృహతి'**. ఇది **'యత్తేసోమ' (1-4-1-5)** అనే మంత్రంలో ఉంది.

అర్థానుగుణంగా 36 అక్షరాలను ఐదుపాదాలుగా విభజిస్తే **'పంచపదా బృహతి'** అవుతుంది **'యాతేప్రాణాన్' (1-3-9-5)** అనే మంత్రంలో సమపాదాలలో ఆరేసి, విషమపాదాలలో ఎనిమిదేసి అక్షరాలున్నాయి. **'పరేతః పితరః సోమ్యాః' (1-8-5-9)** అనేచోట నాల్గవపాదం ఆరక్షరాలది, మిగిలినవి ఎనిమిదక్షరాలవి

ఇక **'కదాచన స్తరీరసి' (1-4-22-1)** అనే మంత్రంలో ఒక పాదం పన్నెండక్షరాలు కలది. మిగిలినవి ఆరేసి అక్షరాలు కలవి. అందుచేత ఇది **'పంచపదా పథ్యాబృహతి'** అని అనబడుతుంది.

**5. పంక్తి :**

నాలుగుపాదాల్లో నలభై అక్షరాలుండేది పంక్తిచ్ఛందస్సు నాల్గుపాదాల్లో సమానంగా అక్షరాలుంటే **'విరాట్‌పంక్తి'**. **'చతుష్పాద పంక్తి'** అని అనబడుతుంది ఉదా -**'యే దేవా' (6-4-11-3)**.

మొదటి రెండు పాదాలలో 12 చొప్పున మిగిలిన రెండింటిలో ఎనిమిదేసి ఉంటే **'ప్రస్తారపంక్తి'** అంటారు. **'ఘృతస్య ధారాం' (2-3-10-6)** దీనికి ఉదాహరణం.

రెండుమూడు పాదాల్లో పన్నెండు చొప్పున ఒకటి నాల్గు పాదాల్లో ఎనిమిదేసి ఉంటే **'విస్తార పంక్తి'** అవుతుంది. ఉదా- అగ్నే తవ **(4-2-7-5)**

మొదటి రెండు పాదాలలో ఎనిమిదేసి మూడు నాల్గులలో పన్నెండేసి అక్షరాలుంటే **'ఆస్తారపంక్తి'** అవుతుంది. ఉదా- **'మిత్రద్రవః' 'సహస్రసా' (1-7-8-12)**.

సమపాదాల్లో పన్నెండు, విషమపాదాల్లో పది చొప్పున ఉంటే **'సతః పంక్తి'**. ఉదా- **'అయం నరః' (2-4-8-5)**.

ఇక నాలుపాదాల్లో అక్షరాలు సమంగా లేకపోతే **'విషమపద పంక్తి'** అవుతుంది. ఉదా- **'దేవాస్య' (2-4-8-3-)**.

**'సుసంధృశం' (1-8-5-9)** అనే మంత్రంలో ఎనిమిదేసి అక్షరాలు గల ఐదు పాదాలుండటం వల్ల ఇది **'పథ్యాపంక్తి' 'పంచపదా పంక్తి'** అనే పేర్లతో పిలువబడుతుంది.

**6. త్రిష్టుప్ :**

ఈ ఛందస్సులో మంత్రాలు ఎక్కువగానే ఉన్నాయి. మొత్తం నలభైనాల్గు అక్షరాలు. నాలుగు పాదాలు. సమంగా నాలుగు పాదాలు ఉంటే 'త్రిష్టుప్' అంటారు ఉదా- **'ధా అసి స్వధా అసి' (1-1-9-24)**.

మొదటిపాదంలో ఎనిమిది, మిగిలిన మూడింటిలో 12 చొప్పున అక్షరాలుంటే **'పురస్తాత్ జ్యోతి'** అనబడుతుంది. ఉదా - **'మయి గృహ్ణామ్యగ్రే' (5-7-9-1)**.

రెండవపాదం కాని మూడవపాదం కాని ఎనిమిదక్షరాలదై యుండగా, మిగిలినవి 12 చొప్పున ఉంటే **'మధ్యేజ్యోతి'** అనబడుతుంది ఉదా- **'దేవభాగ మూర్ధస్వతీః' (1-1-1-5)**.

మొదటి రెండింటిలో పదేసి, మిగిలిన రెండింటిలో పన్నెండేసి అక్షరాలుంటే **'అభిసారిణి'** అనబడుతుంది. **'పైషాన్'(7-3-11-5)** అనేది దీనికి ఉదాహరణం.

దీనికి విపరీతం, అంటే మొదటి రెండు పాదాల్లో పన్నెండేసి, మిగిలిన రెండింటిలో పదేసి ఉంటే **'జాగతీ త్రిష్టుప్'** అంటారు ఉదా- **'సప్త తే' (1-5-3-14)**.

మొదటి మూడు పాదాల్లో పదకొండేసి అక్షరాలుండి, నాల్గవ పాదంలో అక్షరసంఖ్యానియమం లేకపోతే **'విరాట్ త్రిష్టుప్'** అనబడుతుంది. **'అప్యాయతాం ధ్రువా'(1-6-5-1)** ఉదాహరణం.

ఒక్కొక్కపాదానికి పదకొండు చొప్పున రెండు పాదాలుంటే **'ద్విపదాత్రిష్టుప్'** అని, పాదానికి పదకొండక్షరాలలో ఒకేపాదం ఉంటే **'ఏకపదా త్రిష్టుప్'** అని అంటారు. **'యం త్వా' (1-3-5-9) 'రుద్రస్య హేతిః' (1-1-1-6)** అనేవి క్రమంగా ఉదాహరణాలు. ఏకపదా త్రిష్టుప్‌లు చాలా- ఉన్నాయి.

**7. జగతి :**

ఇది నాలుగు పాదాల్లో **48** అక్షరాలు కల ఛందస్సు. అన్ని పాదాలు సమంగా ఉంటే **'జగతి'** అని పిలువబడుతుంది. ఉదా- **'అయమిహ' (1-5-5-4).** మొదటిపాదంలో మాత్రం ఎనిమిది అక్షరాలుంటే **'పురస్తాత్‌జ్యోతి'** అని, చివరిపాదంలో మాత్రం ఎనిమిది అక్షరాలుంటే **'ఉపరిష్టాత్‌జ్యోతి'** అని పిలువబడుతుంది. **'అగ్నినేంద్రేణ' (7-3-11-6) 'ప్రైషానాస్సమిధేనీః' (7-3-11-5)** అనే రెండు మంత్రాలు క్రమంగా ఉదాహరణలు.

ఒక పాదం పన్నెండక్షరాలది, మిగిలిన నాల్గుపాదాలు ఎనిమిదక్షరాలవి అయితే **'పంచపదా'** అనబడుతుంది. ఉదా- **'యజ్ఞో బభూవ' (1-6-6-14).**

ఎనిమిదేసి అక్షరాలు కల ఆరు పాదాలుంటే **'షట్పద'** ఉదా- **'యే దేవాః' (2-4-8-10).** మొత్తం **48** వర్ణాలు కల్గి ఎనిమిది పాదాలుంటే **'వృద్ధపదా'** అని అంటారు. ఉదా- **'సం త్వమగ్నే' (1-5-5-19).**

రెండే పాదాలుండి పాదానికి పన్నెండక్షరాలుంటే **'ద్విపద'**, ఒకే పాదం పన్నెండక్షరాలు కలది ఉంటే **'ఏకపదా'** అని చెప్పబడుతున్నది. **'ఇష్టే వ పక్వముప' (7-3-11-4)** అస్మాక మగ్నే(1-5-11-7) క్రమంగా ఉదాహరణలు.

**అతిచ్ఛందస్సు:** అతిజగతి నుంచి అభికృతి వరకు కల ఛందస్సును అతిచ్ఛందస్సంటారు. ఇందులో మంత్రాలు మచ్చుకు కనబడతాయి.

**అతి జగతి:** మొత్తం 52 అక్షరాలు ఐదుపాదాలుగా గాని, ఆరు పాదాలుగా గాని విభజింపబడతాయి. 'చిత్రం జూహూమి' (5-5-4-7) అనేది 'పంచపదా **అతిజగతి**'. 'ప్రచ్యవస్వ' (1-2-9-1) అనేది **'షట్పద'**.

**శక్వరి:** అతిచ్ఛందస్సులలో కొంచం ఎక్కువగా కనపడేది ఇదే. మొత్తం 56 అక్షరాలు. ఏడుపాదాలు. ఒక్కొక్కసారి ఆరు పాదాలో కూడా ఉంటుంది. **'ఇన్ధానాస్త్వా'** (1-5-5-18) అనేది 'సప్తపది' అయితే **'వేదోఽసి విత్తిరసి'** (1-6-4-23) అనేది 'షట్పద'

**అష్టి:** మొత్తం 64 అక్షరాలు. ఐదు లేక ఆరుపాదాలుంటాయి. **'పురోవాతో'** (2-4-7-4) **'అభిత్యం దేవం'**(6-1-9-9) ఉదాహరణలు

**అభికృతి:** 100 అక్షరాలు, పన్నెండు పాదాలు. **'ఈదృజ్ చ అన్యాదృజ్ చ'**(4-6-5-15) ఉదాహరణం.

ఈ విధంగా రెండువిధాల ఛందస్సులు కృష్ణయజుర్వేదంలో కనిపిస్తున్నాయి. గాయత్రి మొదలైనవాటి ప్రభేదాలు ఇందులో ఇవ్వబడినవి మాత్రమే గాక ఇంకా కూడ ఉన్నాయి. కృష్ణయజుర్వేదం లో నా దృష్టికి వచ్చిన వాటినే ఇక్కడ ఇచ్చాను. ఇతర వేదాల్లో ఇంకెన్నో భేదాలు కూడ ఉన్నాయి. వాటిప్రసక్తి ఇక్కడ ప్రకృతం కాదు గదా!

- ఎన్.ఎస్.ఆర్.

## 2. 8 వైశిష్ట్యం

**వేదోఒఖిలో ధర్మమూలమ్'** అని పెద్దల వాక్యం. అనగా లోకంలోని సకలధర్మాలకు వేదం పునాదిలాంటిది. ఆ వేదాన్ని ఆశ్రయించే అనేక కాలాల్లో అనేకధర్మాలు ప్రజలకు క్షేమాన్ని కలిగించడానికి ఆవిర్భవించాయి. కనుకనే ఈ జగత్తంతా వేదంమీద ఆధారపడిందని చెబుతారు (వేదమూల మిదం జగత్).

లోకం క్షేమంకోసం ఏర్పడిందే యజ్ఞభావన. ఈ యజ్ఞానికి సంబంధించిన విశేషాలను ఇతర వేదాలు వివరించినప్పటికీ యజుర్వేదం సంపూర్ణంగా యజ్ఞస్వరూపాన్ని, యజ్ఞోపకరణాలను, యజమానిని అనేక కోణాల్లోంచి పరిశీలించి, వాటికి సంబంధించిన అనేక విషయాలను విపులంగా మనకు తెలియజేస్తుంది. అంటే యజ్ఞనిర్వహణలో యజుర్వేదం చాలా ముఖ్యమైన పాత్రను నిర్వహిస్తున్నదని భావం

పరమేశ్వరుని ఉచ్ఛ్వాసనిశ్వాసాలే వేదాలని అవే ఉద్ఘోషిస్తున్నాయి. ఆయన వేదంద్వారానే ప్రపంచాన్నంతా రక్షించదలచి, మనకు హితమైనమార్గాన్ని అందులో ఉపదేశిస్తున్నాడు. ఉదాహరణకు- మనకు కావలసిన ఆహారపదార్థాలు ఎలా లభిస్తాయో, వర్షాలెలా కురుస్తాయో, వర్షజలంలో ఉండే శక్తిని ఎన్నివిధాల ఉపయోగించుకోవచ్చో, ఇవన్నీ ఈ సంహితలో ఎంతో చక్కగా ప్రతిపాదింపబడ్డాయి.

కృష్ణయజుర్వేదానికి గల తైత్తిరీయ - మైత్రాయణీయశాఖలలో తైత్తిరీయశాఖ చాల విశిష్టమైనది. ఇది 9 శిక్షాగ్రంథాలతోను, ఎందరో వైయాకరణులు పరిశీలించిన ప్రాతిశాఖ్యమనే వ్యాకరణంతోను, ఛన్దస్సుతోను, నిరుక్తంతోను, జ్యోతిశ్శాస్త్రంతోను, కల్పసూత్రాలతోను సంపూర్ణంగా ఉండి ఎంతో చక్కగా ప్రకాశిస్తున్నది. ఇంతేకాక, వర్ణ, స్వర, మాత్రా, అంగ, స్థాన, కరణ, ప్రయత్న, దేవతాసహితమైన

వర్ణక్రమపద్ధతితోను, హ్రస్వ, స్వరవిన్యాసములతోను, ఇతర వేదముల కంటే విశిష్టమై భాసిస్తున్నది.

ఈ వేదశాఖాపరంపర ఎలా ఏర్పడిందో పరిశీలిస్తే దీని విశిష్టత మనకు అర్థమౌతుంది. వైశంపాయనుడు పైంగియైన యాస్కునికి ఈ శాఖను మొదట ఉపదేశించాడు. యాస్కుడు తైత్తిరిమహర్షికి, అయన ఉఖమహర్షికి, అతడు ఆత్రేయమహర్షికి క్రమంగా ఈ శాఖను ఉపదేశించి ప్రచారంలోకి తెచ్చారు. ఆత్రేయుడీశాఖను బహుళ ప్రచారంలోకి తేవడంవల్ల దీనికి 'ఆత్రేయీ' అనే ప్రసిద్ధి ఏర్పడింది[1]. దీనిని పఠనపాఠనాది ప్రచారంలోకి తీసుకువచ్చిన మహర్షులు అసాధారణ తపస్సంపన్నులు, తపస్వికులవందితులు. కాబట్టి ఈ శాఖకు ఇంత మహత్త్వం ఏర్పడింది. ఈ మహర్షి పరంపరలో తిత్తిరిమహర్షి మధ్యమణిగా ఉండి ఈ శాఖకు ఇంత ప్రసిద్ధిని కలిగించడంవల్ల దీనికి తైత్తిరీయశాఖ అనే ప్రశస్తి కలిగింది.

ఈ శాఖలోగల ఇంకొక వైశిష్ట్యమేమిటంటే ఇందులో బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్ర, వరుణ, వాయు, సూర్య, అగ్ని, మొ॥ దేవతల అనుగ్రహాన్ని పొందడానికి వారి ఉపాసనారూపాలైన యజ్ఞయాగాలు, ఆయా దేవతల మంత్రాలు ఎంతో చక్కగా ప్రతిపాదింపబడ్డాయి. ఆ యజ్ఞయాగాదులను అనుష్ఠించడానికి కావలసిన ఎన్నోవిషయాలు చాల వివరంగా ఇందులో ఉపదేశించబడ్డాయి. యథావిధిగా ఈ వేదంచెప్పిన యజ్ఞయాగాదులను, జపాలను, తపస్సులను, హోమ హవనాదులను భయభక్తి విశ్వాసాలతోచేసి, వారివారి కోరికలను

---

1. వైశమ్పాయనో యాస్కాయైతాం శాఖాం ప్రాహ పైంగయే ।
యాస్కః పైంగిస్తిత్తిరయే ఉఖాయ ప్రాహ తిత్తిరిః ॥
ఉఖ శ్శాఖామిమాం ప్రాహ ఆత్రేయాయ యశస్వినే ।
తేన శాఖా ప్రణీతేయమాత్రేయీతి చ ప్రోచ్యతే ॥

ఎందఱో సంపాదించుకున్నారు. మన ఇతిహాసాన్ని పరిశీలిస్తే అలాంటి మహానుభావులెందఱో మనకు కనిపిస్తారు.

ఈ వేదంలో చెప్పబడ్డ ఉపాసనలవల్ల కేవలం లోకాంతరంలో సుఖాన్ని అనుభవించడం మాత్రంకాక, ఈ లోకంలో కూడా ఎన్నో సుఖాలను అనుభవిస్తూ, చక్కని జీవితాన్ని గడపటానికి అవకాశం ఉంది.

ఉదా:- సృష్టికర్తయైన బ్రహ్మను ఉపాసించడంవల్ల మనకు మంచి ఆహారపదార్థాలనిచ్చి, వాటిద్వారా శరీరంలో శక్తిని కలిగించి అవిచ్ఛిన్నమైన వంశాన్ని కలిగిస్తాడు.

యజ్ఞస్వరూపుడు, జగత్పరిపాలకుడైన శ్రీ మహావిష్ణువు మనం ఆచరించే యజ్ఞోపాసనకు సంతసించి యజ్ఞఫలమైన మనకోరికను సిద్ధింపచేస్తాడు.

సర్వమంగళస్వరూపుడైన రుద్రుణ్ణి ఉపాసించడంవల్ల చక్కని జ్ఞానాన్ని, సకలశుభాలను అనుగ్రహిస్తాడు. వారి వారి ఉపాసనా పరాలైన మంత్రాల్లో ఈ విశేషాలను వివరిస్తుంది ఈ సంహిత.

ఈ సంహితలోని ఇంకొక వైశిష్ట్యమేమంటే మన చుట్టూ ప్రకృతిగా ఉన్న అగ్ని, వాయువు, జలం వీటిస్వరూప, స్వభావ ప్రభావాలను ఎంతో చక్కగా ప్రతిపాదించడం. చూడండి:

యజ్ఞాలలో మనం అగ్నిహోత్రుని ద్వారా హవిర్భాగాలను ఆయా దేవతలకు పంపి వారి అనుగ్రహంగా వర్షాన్ని పొంది సుఖజీవనం చేస్తున్నాం. అంతేకాదు; ఆహారపదార్థాన్ని అనేకదశల్లో పక్వం చేయడానికి కూడా మనకు అగ్ని కావాలి. కాని ఆ అగ్నిని చాలా జాగ్రత్తగా సేవించాలని అలా కాకపోతే అది మనల్ని సర్వనాశనం చేస్తుందని ఈ వేదం సోదాహరణంగా ఇలా వివరిస్తున్నది.

అగ్ని పెద్దపులి లాంటిది. తన వాడియైన పంజాతోను పళ్ళతోను ఇతరజంతువులను చంపి తినే పెద్దపులి తనపిల్లలను వాటితోనే పెంచి కాపాడుతుంది. అలాగే అగ్నికూడా తనను భక్తితో ఉపాసించే భక్తుల్ని చల్లగా కాపాడుతుంది. అశ్రద్ధ చేసే వారిని దహించి నాశనం చేస్తుంది. ఈ అగ్ని జలంలో బడబాగ్నిగాను, కడుపులో జఠరాగ్నిగాను ఉండి మనకు అనేకరకాలుగా ఉపకారం చేస్తున్నది. పగలంతా సూర్యుడు మనకు వెలుగునిచ్చి అస్తమించగా, రాత్రిపూట అగ్ని మనకు వెలుగునిస్తుంది. కాబట్టి వీరిద్దరిని ఉపాసించమని ఈ వేదం వారికి సంబంధించిన మంత్రాల నుపదేశిస్తున్నది.

సూర్య-చంద్రగమనాలను బట్టి మనకు కాలవివేకం కలుగుతున్నది. అహోరాత్రాలు, పక్షాలు, మాసాలు, ఋతువులు, అయనాలు, సంవత్సరాలు, వీటి విభాగం, తిథి వార నక్షత్రయోగ కరణాల మంచి చెడ్డలనుబట్టి శుభాశుభ సమయాల నిర్ణయం, ఇవన్నీ సూర్యునివల్ల కలుగుతున్నాయి. మంచికాలంలో యజ్ఞయాగాదుల్ని అనుష్ఠించి సత్ఫలితాలను పొందాలంటే కాలనిర్ణయం కావాలి కనుక ఆరోగ్యంకోసం సూర్యోపాసన, తేజస్సుకోసం ధనంకోసం అగ్న్యారాధనం ప్రతినిత్యం చేయాలని ఈ వేదం నొక్కివక్కాణిస్తున్నది

వాయువు అనుగ్రహం లేకపోతే జీవనమే లేదు. మన శరీరం, మనస్సు ఆరోగ్యంగా ఉండాలంటే వాయుదేవత దయ ఎంతైనా అవసరం. ప్రాణాయామం సూర్యోపాసనలో చాలా ముఖ్యమైనది. [redacted] ప్రాణాయామం ద్వారా వాయువును ఉపాసించి ఆయన అనుగ్రహం పొందాలి.

నీరు ప్రాణాధారమైనది. జలం లేకపోతే ప్రపంచమే లేదు. జలాధిపతి వరుణుడు. వరుణోపాసనకు ఈ వేదంలో చాలా ప్రాధాన్యం ఉంది. వరుణదేవతాకమైన **'వారుణమంత్రాలు'** ఈ వేదంలో 42 అనువాకాల్లో చెప్పబడ్డాయి. అందువల్లనే [redacted] అనావృష్టి ఏర్పడ్డప్పుడు

తైత్తిరీయశాఖను పూర్తిగా అధ్యయనం చేసి వారుణమంత్రరహస్యాన్ని తెలుసుకున్న యజుర్వేద పండితులచేత వరుణజపం చేయించడం, వెంటనే కుంభవృష్టిగా వర్షం పడడం మనం గమనిస్తూనే ఉన్నాం.

ఇలాంటి జలం మనకు ఎనిమిదిరకాలైన ఫలాలను ఇస్తున్నది. శుద్ధజలంవల్ల తేజస్సు, బ్రహ్మవర్చస్సు, అలలతో ప్రవహించే జలంవల్ల బలం, వీర్యం, జలాశయాలమధ్యలో ఉండే జలంవల్ల పుష్టి, సంతానోత్పాదకశక్తి, యజ్ఞాంతంలో యజమాని, అధ్వర్యుడు, ఋత్విక్కులు అవబృథస్నానంచేసిన జలంవల్ల ఆయువు, దీర్ఘాయుష్యం మనకు కలుగుతున్నాయని ఈ వేదం తెలియజేస్తున్నది. నీటిపైన ఎన్నో పరిశోధనలు చేసే శాస్త్రజ్ఞులు దీనిలో ఉన్న సంతానోత్పాదకశక్తిని, ఆయుష్యాన్ని వృద్ధిచేసే శక్తిని ఇంకా గుర్తించినట్లు కనబడటం లేదు. ఇలా నేటి శాస్త్రజ్ఞులకు కూడా ఇంకా అవగాహన కాని ఎన్నో విజ్ఞాన విశేషాలను కూడా ఈ వేదం ప్రతిపాదిస్తున్నది.

సామాన్యమానవుని బుద్ధికి గోచరించని ఎన్నో విజ్ఞాన విశేషాలను ఈ వేదం వివరిస్తున్నది. పక్షులు రాత్రిపూట భూమిమీద వాలవు. చెట్లపై గూళ్లలో నివసిస్తాయి. ఏమిటి కారణం? ఈ భూమి అగ్నిమయం. రాత్రిపూట పక్షులకు ఇది అగ్నిమయంగా కనబడుతుంది. మానవులకు అలా కనబడదు. భూమిలో ఉండే ఈ లక్షణాన్ని పక్షులు కనిపెట్టగలవు. అదీ రాత్రిపూటే. అందుకే చీకటిపడితే నేలమీద వాలవు. ఆహా! ఎంత రహస్యాతిరహస్యాల్ని ఈ వేదం వివరిస్తున్నది[1].

ఈవేదం ప్రాజాపత్య, సౌమ్య, ఆగ్నేయ, వైశ్వదేవ, స్వాయంభువాలనే పేరుతో అయిదు విధాలుగా విభాగం చేయబడింది. వీటిల్లో

1. సర్వా వా ఇయం వయోభ్యో నక్తం దృశే దీప్యతే తస్మాదిమాం వయాగ్ంసి నక్తం నాధ్యాసతే. తై. సం. 5.6.4.4.

అగ్నిహోత్రయాగం నుంచి సత్రయాగం వఱకు కావలసిన మంత్రాలు విడివిడిగ చెప్పబడ్డాయి. హవిర్యాగం, ఆధానం, పశుబన్ధం, అగ్నిష్టోమం, ఉక్థ్యం, అతిరాత్రం, జ్యోతిష్టోమం, సర్వతోముఖం, వాజపేయం, అశ్వమేధం, సర్వపృష్ఠాప్తోర్యామం, (అగ్నిచయనం) (గరుడచయనం) సత్రయాగం (వేయి సం॥ చేయదగినది) ఇందులో చక్కగా ఉపదేశింపబడ్డాయి.

దర్శపూర్ణమాసేష్టి అన్నియాగాలకు ప్రకృతి. ఒక్కొక్క కోరిక గలవాడు ఒక్కొక్క ఇష్టిని నియమంతో చేసి వాడి అభీష్టాన్ని నెరవేర్చుకుంటాడు. ఈ వేదంలో ఎన్నోఇష్టుల ఉపదేశం కనబడుతోంది

వర్ణ, స్వర, మాత్రా, కాలాదినియమాలతో స్వరభంగం లేకుండా ఇందులో చెప్పబడ్డ మంత్రాలను యథావిధిగా ఉచ్చరించి ఆయా ఫలితాలను పొందవచ్చు. నియమాలను ఉల్లంఘించి స్వేచ్ఛగా పఠిస్తే సాఫల్యం లేకపోగా వైఫల్యం తప్పక కలుగుతుంది. పెద్దపులి దగ్గఱ, అగ్ని దగ్గఱ ఎంత జాగ్రత్తగా ఉండాలో అంతకంటే ఎక్కువ జాగ్రత్తగా ఈ వేదమంత్రాల పఠనపాఠనాల్లో కూడా ఉండాలని వేదం ఉద్ఘోషిస్తున్నది.

కృష్ణయజుర్వేదం అనేక కోణాల్లోనుంచి చాలా విశిష్టమైనది ఒకనాడు అన్నివేదాలు దీని తరువాతనే గౌరవస్థానాన్ని పొందాయి దానికి కారణం ఇహ-పరలోకాలలో సుఖశాంతులను ప్రసాదించే యజ్ఞప్రతిపాదనమేనని భావించవచ్చు.

- ఎమ్.వి.ఆర్.

## 2. 9 మతం - తత్త్వం

పున్నమి వెన్నెల్లాగా, మల్లికల పరిమళంలాగా ఋగ్వేదంలో వెల్లివిరిసిన దేవతా ప్రశంసలకు, ప్రార్థనలకు యజుర్వేదంలో ఒక నిర్దిష్టమైన ఏర్పాటు, వినియోగం, సార్థక్యం ఏర్పడ్డాయి. ఒక్క ఋగ్వేదానికేకాక సామవేదానికి అథర్వవేదానికి కూడ యజుర్వేదం పవిత్రమైన సంగమ స్థానంగా మారింది. ఇది వైదికార్యుల భావనా సర్వస్వానికి చతుష్పథంగా (నాలుగు రాజమార్గాల కూడలి) రూపొందింది. దీనికి మూలకారణం యజ్ఞమనే ప్రక్రియను సమగ్రంగా, సమర్థంగా, సకలాభీష్టసాధనంగా, పరమరమ్యంగాను వారు ప్రతిష్ఠించుకోవడమే అని అనక తీరదు.

యజ్ఞమే బ్రహ్మ, యజ్ఞమే విష్ణువు, యజ్ఞమే రుద్రుడు, యజ్ఞమే సకలదేవతలు - అదే వైదికులకు పెన్నిధి. యజ్ఞవేదిక దేవేంద్రునికి స్వారాజ్యపీఠం. అగ్నిదేవునికి సువర్ణసింహాసనం. సోమునికి విలాస భవనం. వరుణునికి విశ్రాంతిస్థానం. దేవగణాలకు దివ్యక్షేత్రం. కర్మఠులకు స్వర్గసోపానం. యజ్ఞవేదిక సుప్రతిష్ఠితమైతే సర్వం సుప్రతిష్ఠితమవుతుంది - ఇదీ వైదికుల విశ్వాసం. కాగా యజ్ఞం - యజ్ఞవేదిక - ఈ రెండూ కృష్ణయజుస్సంహితకు ముఖ్యప్రాణాలు.

కృష్ణయజుస్సంహిత ప్రతిపాదించే మతం కర్మకాండపై ఆధారపడి ఉంది. ఆనాటి కర్మలలో యజ్ఞం చాలా ముఖ్యమైంది మరి. యజ్ఞాచరణాన్ని గురించి తెలుసుకుంటే కర్మస్వరూపం స్పష్టపడుతుంది. యజ్ఞమంటే ఏమిటో కొంచెం తెలుసుకుందాం. **'దేవతలను పూజించడం'** అని ఆ పదానికి అర్థం. **'దేవతలను గురించి - వారి తృప్తికై - ఏదో ఒక వస్తువును అగ్నిలో హోమం చేయడం'** అని తాత్పర్యం. మూలభూతమైన ఈ అంశాన్ని తీసుకుని ఆర్యులు యజ్ఞమనే ఒక కర్మకలాపాన్ని సిద్ధం చేసుకున్నారు. యజ్ఞం అనేది **'ఒక మనోహరమైన వైదికనాటకం'** అని నేటి పరిభాషలో చెప్పవచ్చు.

యజ్ఞంచేసే వ్యక్తికి **'యజమానుడు'** అని పేరు. చేయించేవారు ఋత్విక్కులు_అంటే నేటి ఉత్తమ పురోహితులవంటివారు. ముఖ్యంగా వీరు నలుగురు. హోత, ఉద్గాత, అధ్వర్యుడు, బ్రహ్మ అని వీరి పేర్లు. యజ్ఞంలో ఋగ్వేదమంత్రాలను హోత చదువుతాడు. సామవేద మంత్రాలను ఉద్గాత గానం చేస్తాడు. యజుర్వేద మంత్రాలను అధ్వర్యుడు పఠిస్తాడు. అథర్వవేద మంత్రాలను బ్రహ్మ ఉచ్చరిస్తాడు. ఈ నలుగురిలోను అధ్వర్యునిది అగ్రస్థానం. యజ్ఞాన్ని అంతను ఏ పొరపాటు లేకుండా జరిపించేవాడు అతడే. పూచీ అంతా అతనిదే. ఏ మాత్రం పొరపాటు జరిగినా ప్రాయశ్చిత్తం చేసుకుంటూ ఉండాలి వీరు కాక చిన్నచిన్న పనులు చేసే ఋత్విక్కులు చాలామంది ఉంటారు. ఆగ్నీధ్రుడు, ప్రతిప్రస్థాత, నేష్ట, ఉపద్రష్ట, మొ॥ వారిపేర్లు. అవసరాన్నిబట్టి కొన్ని కొన్ని యాగాలలో పదిహేడుగురు వరకు ఋత్విక్కులు పాల్గొంటారు

శాస్త్రోక్తమైన పద్ధతిలో వేదికను తయారు చేస్తారు. వేదికకు ఎన్నో కొలతలు. ఎన్నో స్వరూపాలు (సందర్భాన్ని బట్టి) ఉంటాయి. **'అరణి'** అనే ఒక సాధనంతో మథనంద్వారా (రావి, జువ్వి కర్రలతో రాపిడిచేసే విధానం) అగ్నిని పుట్టించి, మంత్రాలతో దానిని వేదికలో ప్రతిష్ఠించి, ప్రజ్వలింపజేస్తారు. **"దక్షిణాగ్ని"**, **"గార్హపత్యం,"** **"ఆహవనీయం"** అని ముఖ్యంగా అగ్ని మూడు విధాలు. మంత్రాలు ఉచ్చరిస్తూ **"అగ్నయే స్వాహా" "ఇంద్రాయ స్వాహా"** - అనే రీతిని స్వాహాకారాలు చేస్తూ, అగ్నిలో హోమాలు జరుగుతాయి. నెయ్యి, పాలు, పెరుగు, సోమరసం, వప మొ॥ హోమద్రవ్యాలు. వీనిలో "వప" అనేది ముఖ్యమైంది. అది మేకపిల్లయొక్క గుండెకాయకు దగ్గరగా ఉండే ఒకానొక చర్మపుముక్క.

దేవతలందరికీ అగ్ని నోరువంటివాడు (**"అగ్నిర్వై దేవానాం ముఖమ్"**). ఆయా దేవతలను ఉదేశించి హోమం చేసిన పదార్థాలను

అతడు వారికందిస్తాడు. వారు తృప్తిపడి యజమానుడు కోరిన కోరికలు చెల్లిస్తారు. అగ్నికికూడా హోమభాగాలు కొన్ని ఉంటాయి. ఇంద్రుడు, వరుణుడు, సోముడు, ఆదిత్యుడు, వాయువు మొ॥ వారు దేవతలు. వీళ్ళల్లో ఇంద్రునికి అగ్రతాంబూలం. సిరి, సంపద, బలం, ఆరోగ్యం, మొదలుగా యాగఫలితాలు ఎన్నోవిధాలుగా ఉన్నా ప్రధానమైన ఫలం మాత్రం స్వర్గం. అది సమస్త సుఖాలకు, సకలభోగాలకూ ఆలవాలం. అందువల్లనే కాళిదాస మహాకవి కుమారసంభవకావ్యంలో (2వ సర్గ) "**వేదం విధించే కర్మ యజ్ఞమని, దానిఫలం స్వర్గమనీ**" వర్ణించాడు.

యజ్ఞాలు అనేక విధాలు. ఒకరోజున చేసేవి కొన్ని. రెండు, మూడు, నాలుగు - ఈ విధంగా పన్నెండు రోజులవరకు జరిగించేవి మరి కొన్ని. ఒక సంవత్సరం మొదలు పన్నెండు సంవత్సరాలవరకు ఆచరించే యాగాలు కూడా కొన్ని ఉన్నాయి. వాటిని "**సత్రయాగాలు**" "**దీర్ఘసత్రాలు**" అని అంటారు. అగ్నిష్టోమం, జ్యోతిష్టోమం, వాజపేయం, పౌండరీకం, రాజసూయం, అశ్వమేధం మొ॥ ప్రసిద్ధమైన యాగాలపేర్లు.

సామాన్యంగా ఊరికి బయట ఒక చక్కని శాలను నిర్మించి అందులో యజ్ఞాన్ని జరిపిస్తారు. చిత్రవిచిత్రమైన ప్రక్రియలతోను, మంత్రాల నాదాలతోను, పరమపవిత్రమైన భావనలతోను మైమరపించేదిగా నడుస్తుంది యజ్ఞకర్మ.

పురోడాశభక్షణం, సోమపానం, పశ్వాలంభనం అనే ముఖ్యమైన మూడు సన్నివేశాలు చాలా యజ్ఞాలలో తప్పనిసరిగా ఉంటాయి. "**పురోడాశం**" అన్నది వరిపిండితో - లేక - గోధుమపిండితో తయారుచేసే "**చలిమిడి**" వంటి భక్ష్యం. దేవతలకు నివేదనచేసి దీనిని తింటారు. సోమలత గొప్ప మహిమగల ఒకానొక తీగ. '**తిప్పతీగ**' అని కొందరు, "**కాడచెముడు**" అని మరి కొందరు అంటూ ఉంటారు. ఏదయినా ఆనాడు ఆర్యావర్తంలో ముఖ్యంగా హిమాలయప్రాంతాలలో

ఇది విరివిగా దొరికేది. దీనిని చితకగొట్టి రసం పిండి వడబోసి, దేవతలకు నివేదించి యజమానుడు ఋత్విక్కులు మొ॥ వారు త్రాగుతారు. ఇదే సోమపానం.

సోమపానం చేసిన యజమానిని **'సోమపీథి'** అని అంటారు. సోమరసం దేవతలకు మిక్కిలి ప్రీతికరమైన రసాయనం అమృతం కంటే కూడా గొప్పదిట. సోమలతను పూజించడం, తీసుకురావడం, చితకగొట్టడం మొ॥ పనులన్నీ మంత్రపూర్వకంగాను నాటకీయంగాను జరుగుతాయి. **'పశ్వాలంభనం'** కూడా ఈ విధంగానే జరుగుతుంది కొమ్ములు మొలవని మేకపిల్లను తీసుకువచ్చి ఒక కొయ్యకు (దీనికి **'యూపస్తంభం'** అని పేరు) కట్టి, మంత్రాలతో చంపుతారు. తరువాత దానిని కోసి ఆయాభాగాలను ముఖ్యంగా వపను హోమం చేస్తారు

యజ్ఞం చేసిన వ్యక్తిని **"సోమయాజి"** అని పిలుస్తారు. ఆయా యాగవిశేషాలను బట్టి **"దీక్షితులు"**, **"చయనులు"**, **"వాజపేయయాజి"** **"మహావ్రతయాజి"** మొ॥ బిరుదులతో వ్యవహరించడం కూడా జరుగుతుంది సోమయాజికి వైదిక సమాజంలో ఎనలేని గౌరవం- మర్యాద లభిస్తుంది యజ్ఞం అంటే సారాంశం ఇదే.

కృష్ణయజుస్సంహితలోని కాండాలన్నీ ఈ విధమైన యజ్ఞ ప్రక్రియలను, వాటికుపయోగించే మంత్రాలను విశదం చేస్తున్నవి కేవలం యాగాలేగాక **"సంధ్యావందనం"** మొ॥ నిత్యకర్మలు (ప్రతిదినం చేయాల్సినవి), ఎన్నో కామ్యకర్మలు (ఆయా కోరికలు సిద్ధించడం కోసం చేసేవి), **"నిషిద్ధ కర్మలు"**న్ను (చేయకూడనిపనులు) ఇందులో అన్నివివరాలతోను ఉన్నాయి. ఇంతెందుకు? ఆర్షసంప్రదాయంలో శాఖోపశాఖలుగా వ్యాపించిన సకలకర్మకలాపానికిన్ని (గృహ్యకర్మలు, ధర్మకార్యాలు, వ్రతాలు, నోములు, నిషలు, మొ॥) ఈ సంహిత పరమమూలం. అందుచేతనే దీనిని గోడగాను ఇతర వేదాలను గోడపై చిత్రించిన చిత్రాలుగాను వర్ణించి, యజుర్వేదం ఋక్సామాథర్వ

వేదాలకు మూలాధారం. అది లేకపోతే వీటికి ప్రయోజనం సున్న అని భాష్యకర్త సాయణాచార్యుడు వక్కాణించాడు.

కృష్ణయజుస్సంహిత ప్రతిపాదించిన మతం **'కర్మమార్గం'** అని ఘంటాఘాటంగా చెప్పవచ్చు కర్మయే భక్తి- కర్మయే ఉపాసన- కర్మయే జ్ఞానం- కర్మవల్లనే ముక్తి అన్న విషయాన్ని ఈ సంహిత చాటి చెపుతుంది.

ఆధునికులైన విమర్శకుల చూపుతో పరిశీలిస్తే ఈ పరిణామానికి కారణం ఈవిధంగా తోస్తుంది:- ఇంద్రుడు, అగ్ని, వరుణుడు, ఆదిత్యుడు మొ॥ దేవతలను తమ ప్రతిభావైభవంతో ఛందోబద్ధంగాను, మనోహరంగాను ఆర్యులు మొదట వర్ణించుకున్నారు. కొంతకాలం అయిన తరువాత ఆ వర్ణనలకు మధురమైన సంగీతాన్ని జోడించి పాడుకుని ఆనందించారు తరువాత అంతతో సంతృప్తి చెందక భక్తిని జ్ఞానాన్ని రంగరించి కర్మామార్గాన్ని స్థాపించుకుని వానికి వినియోగాన్ని సంపాదించుకున్నారు ఈ తీరే తుదకు యజ్ఞంగా మార్పుచెంది స్థిరపడింది.

యజ్ఞవిధానంలో గంభీరమైన సంకేతవాదం కూడా కనిపిస్తుంది. సర్వకారణుడైన విరాట్‌పురుషుని పశువుగా బంధించి దేవతలు యజ్ఞం చేశారని, అతని ఆయా అవయవాలే ఈ ప్రపంచంగా రూపొందిందనిన్నీ పురుషసూక్తం చెపుతుంది. ఈ సృష్టినంతటినీ ఒక యజ్ఞంగా భావించిన మహాభావన అది. దేశకాలాతీతమైన ప్రతీకోపాసన అది. మహర్షులే చేయగలిగిన విశ్వసంభావనమే అది. అంతేగాని వెర్రిమొర్రి ఆలోచన మాత్రం కాదు.

ఏపనీ చేయకుండా మానవుడు క్షణకాలం కూడా ఉండలేడు. ప్రతినిత్యం ఏదోపని జరుగుతూనే ఉంటుంది. ఊపిరి ఆడడం కూడా ఒకపనే గదా! ఆ పనిని అడ్డు, అపు లేకుండా విడిచిపెడితే వినాశానికి దారి తీస్తుంది. సక్రమమైన మార్గంలో ఉంచితే అది

నియమం అవుతుంది. నియమాన్ని గట్టిపరుస్తే దీక్ష అవుతుంది. దీక్షను దేవతాపరంగా తీర్చిదిద్దితే యజ్ఞంగా రూపొందుతుంది. మానవులు దేవతలను గౌరవిస్తే, వారు వీరిని సంరక్షిస్తారు. ఈ విధంగా యజ్ఞం వల్ల జన్మకు సార్థక్యం ఏర్పడుతుంది. ఇహపరాలు రెండూ సిద్ధిస్తాయి, కర్మమార్గం యొక్క రహస్యం ఇదే. భగవద్గీతలోని కర్మయోగం అంతా ఈ అంశాన్నే సుబోధంగా చూపించింది.

ఈ సందర్భంలో **పశ్వాలంభనం** (యజ్ఞంలో పశువును చంపడం) గురించి కొన్ని మాటలు చెప్పాల్సి ఉంది. వాస్తవంగా అది వేద విహితమైన కర్మయే. ఒకప్పుడు గొర్రె, ఎద్దు, ఆవు-చివరకు మానవుడు కూడా యజ్ఞపశువుగా ఉపయోగపడేవాడు. దీనికి చాలా ఆధారాలున్నాయి. క్రమంగా మేకమాత్రమే స్థిరపడింది. **'యజ్ఞంలోని వధ-వధ కానే కాదు. అది స్వర్గదాయకం'** అన్న శాసనం కూడా ఉంది. ఆనాటి ఆచారాల మంచిచెడ్డల విషయంలో ఇప్పుడు మనం వాదోపవాదాలు చేసుకోవడం, తీర్పులు చెప్పుకోవటమున్ను అనవసరం. అది గతం. గతం గతమే గదా! కాని చాలాకాలం తరువాత వైదిక సమాజంలో కూడా సంస్కరణలు జరిగాయి. రామానుజులు వైదిక యజ్ఞాన్ని ఇంచుమించు రద్దుచేశారు. మధ్వాచార్యులు వాస్తవమైన పశువును రద్దుచేసి, ఆ స్థానంలో **పిండితో** చేసిన పశువును ప్రవేశపెట్టారు. దయానందసరస్వతి, శ్రీపాదదామోదరసాత్వలేకర్ మొ॥ నవీన పండితులు వేదంలోని గో, అజ, అశ్వ, నర మొ॥ పదాలకు అర్థం మార్చివేసి, ఆ పదాలు ఆయా ఓషధులను ధాన్యాలను బోధిస్తాయని వ్యాఖ్యానించారు. ఇవన్నీ యజ్ఞం పశుహింసలేకుండా జరగడానికి దోహదం చేస్తాయి.

ఇంతటితో ఈ చర్చ ముగించి కృష్ణయజుస్సంహితలోని తత్త్వాన్ని గురించి కొంచెం ముచ్చటించుకుందాం - సృష్టిరహస్యాన్ని జీవసత్యాన్ని అన్వేషించి, ఇదీ వాస్తవం అని నిర్ణయించే రీతిని తత్త్వం అంటారు. తత్త్వవిచారం వైదికార్యులకు వెన్నతో పెట్టిన విద్యే. కర్మలు, ఆచారాలు, వృత్తులు, ప్రవృత్తులు, భావనలు మొ॥

నిత్యజీవన విధానాలు వేరువేరుగా కనిపించినా పూలమాలలోని దారంలాగా 'అంతర్గతమైన తత్త్వం ఒకటే' అనే చూపు - నిశ్చయమూ వారికి తొలినుంచీ ఉన్నాయి. ఋగ్వేదంలోని **'ఏకం సత్ విప్రాః బహుధా వదంతి'** (1-164-46). (సృష్టిలో ఉన్నది ఒక్కటే. జ్ఞానులు దానినే అనేక నామరూపాలతో పిలుస్తూ ఉంటారు.) అనే తత్త్వమే వేదరాశి అంతటిలోను కూడా వినిపిస్తూ ఉంటుంది.

ఈ సంహితవిషయం కూడా అంతే. ఇందులోని నాలుగవ కాండంయొక్క అయిదవ ప్రపాఠకానికి 'రుద్రప్రశస్తి' అని పేరు. 'నమః' అనే పదం పదేపదే వినిపిస్తుంది గనుక దీన్ని నమకము లేక శ్రీ రుద్రనమకం అని పిలుస్తారు. ఇందులో పదకొండు అనువాకాలను పఠిస్తూ టెంకాయనీరు, పాలు, పెరుగు, తేనె, చెరుకురసం, మొ॥ పలు పదార్థాలతో రుద్రదేవునికి అభిషేకం చేస్తారు. ఇదే అతి ప్రసిద్ధమైన 'రుద్రాభిషేకం' సకలపాపభంజకం-సకలకామసంపాదకం. వైదికసంప్రదాయంలో దీనికున్న ప్రశస్తి ఇంతా అంతా కాదు. పైగా ఈ నమకం, సంహిత అంతకు కేంద్రంగా కనిపిస్తుంది. ఇది కూడా పైపైకి ఒక కర్మగానే కనిపించినా, అభిజ్ఞులు దీన్ని కర్మ, భక్తి, జ్ఞానం అనే మూడింటియొక్క కూడలి అని, పరతత్త్వ ప్రతిపాదకం అనిన్నీ వర్ణిస్తారు. శివుని విశ్వరూపునిగాను, విశ్వకారణునిగాను, విశ్వవ్యాపకునిగాను, ఏకేశ్వరునిగాను తీర్చిదిద్దిన భావనలు నమకంలో కొల్లలుగా ఉన్నాయి. అందువల్ల **'పరమసత్యానికి'** శివుడనే పేరును ఉపయోగించినట్లు అనుకోవచ్చును.

కాగా సర్వకారణమైనది ఒక్కటే. దాని వైభవమే సృష్టి అంతా అనే అద్వయభావనను 'అగ్ని, హోమం, హవిస్సు, యజమానుడు, ఋత్విక్కు - తుదకు యజ్ఞం అంతా బ్రహ్మమే 'అన్నతత్త్వచింతనను కృష్ణయజుస్సంహిత ప్రతిపాదించిందని వ్యాఖ్యానం చేయడం సమంజసం - అదే పెద్దలు చెప్పింది కూడా.

**- ఏ.ఎస్.ఎస్.**

## 2.10 సాంఘికాచార వ్యవహారాలు

భారతీయసంస్కృతికి వేదాలు పునాదివంటివి. ఈ నాటి మన సమాజంలో ఏమారుమూలనైన ఒక చక్కని సంప్రదాయం, ఉదాత్తమైన సంస్కృతి కనబడుతున్నదంటే దానికి మూలం అనాటి సంఘం, వారి ఆచారవ్యవహారాలు. ఇక్కడ ఆచారమనే పదం ఆచరణరూపమైన విస్తృతార్థంలో ప్రయోగింపబడుతున్నదే కాని ప్రచారంలో ఉన్న బాహ్యశుద్ధి అనే సంకుచితార్థంలో కాదు.

వేదాలలో యజ్ఞవ్యవస్థను వర్ణించేది యజుర్వేదం. కృష్ణ-శుక్లభేదంతో ఇది రెండురకాలు. హౌత్రానికి, ఆధ్వర్యవానికి ఉపయోగించే మంత్రాలు, వాటికి వ్యాఖ్యానరూపమైన బ్రాహ్మణ వాక్యాలు ఇందులో ఉండటంవల్ల దీన్ని కృష్ణయజుర్వేద మన్నారు[1]. కేవలం ఆధ్వర్యకాండ కలది శుక్లయజుర్వేదం.

అనాటి సంఘం యజ్ఞమనే ప్రధానలక్ష్యానికభిముఖంగా నడుస్తుండేది. ఈ యజ్ఞనిర్వహణకు ప్రధానంగా నల్గురు వ్యక్తులు కావాలి. వారే 1. హోత 2. అధ్వర్యుడు 3. ఉద్గాత 4. బ్రహ్మ

**1. హోత :**

యజ్ఞంలో ఏసమయంలో ఏదేవతను ఆహ్వానించి స్తుతించాలో ఆ దేవతనప్పుడు ఆహ్వానించి స్తుతిస్తాడు. ఆ స్తుతులనే ఋక్కులంటారు. వాటి సమూహమే గదా! ఋగ్వేదం.

**2. అధ్వర్యుడు :**

యజ్ఞానుష్ఠానానికవసరమైన మంత్రభాగాలను పఠించేవాడు అధ్వర్యుడు. యజ్ఞంలో ఉపయోగంకోసం ఇతడు పఠించే మంత్ర భాగాలే యజుస్సులు. వాటి కూడిక యజుర్వేదం.

1. మన్త్రబ్రాహ్మణయోర్వేదనామధేయమ్ వే. ప. 3.

**3. ఉద్గాత :**

యజ్ఞంలో ఆయా సమయాల్లో ఇతడు ఉచ్చైస్వరంతో కొన్ని మంత్రాలను గానం చేస్తాడు మన్త్రభాగాలే సామవేదంగా ప్రసిద్ధిని పొందాయి.

**4. బ్రహ్మ :**

యజ్ఞనిర్వహణలో ఇతడు చాల ముఖ్యుడు. యజ్ఞనిరీక్షకుడు.

కృష్ణయజుస్సంహితకాలంలో సంఘాన్ని యజ్ఞం ఎంతగానో ప్రభావితం చేసిందని చెప్పడానికి ఆధారాలు కనబడుతున్నాయి. ఈ సంహితలో గల ఇతిహాసాలు, పురాణాలు, కల్పాలు, గాథలు, నరాశంసలు వీటినధ్యయనం చేస్తే అనాడు కర్మానుష్ఠానంపైన ప్రజలకెటువంటి శ్రద్ధ ఉన్నదనే విషయం మనకు స్పష్టమౌతుంది[1].

ఆనాటి ప్రజల జీవనవిధానం చాలా పవిత్రమైంది. వారివారి వృత్తులను బట్టి వారి ఆచరణం, లోకవ్యవహారం ఉన్నట్లు కనబడుతుంది సంఘంలో ఆనాడు చాతుర్వర్ణ్యవ్యవస్థ ఉన్నట్లు తెలుస్తున్నది సంతాన, రాష్ట్ర, స్వరాజ్య, చక్షుః, శత్రునాశ, స్వర్గ కామనలతో ఆయా ఇష్టులను చేసి ప్రజలు ఫలితాలను పొందే వారు. సోమ, రుద్ర, అగ్ని, మొ॥ దేవతలను ఆరాధించడం ఎక్కువగా ఉండేది.

దర్శపూర్ణమాసాదియాగాలను చేయడానికి పెరుగు, పాలు, నెయ్యి ఎంతో అవసరం. దానికై ఆవులను పోషించేవారు. ఆనాడు గోధనమే చాల గొప్పధనంగా భావింపబడేది. పాలు పితికిన తరువాత

1 1. ఇతిహాసాలు: 'దేవాసురాస్సంయత్తా ఆసన్' మొ॥ ఈ ఇతిహాసాలు ప్రజలలో కర్మానుష్ఠానం పైన శ్రద్ధను కలిగిస్తాయి

2. పురాణం: జగత్తుయొక్క పూర్వావస్థనుంచి సృష్టిప్రతిపాదకాలైన వాక్యాలను వర్ణిస్తుంది.

ఆవులను అడవికి తోలేవారు. అలా తోలడానికి (పాలాశదండం) మోదుగకఱ్ఱను ఉపయోగించేవారు[2].

ఆనాటి ధర్మం యాగానుష్ఠానమే. వాటివల్ల వెంటనే ఫలం లేకపోయినా ఎంతో శ్రమకోర్చి చేసిన యాగంవల్ల ఒక అపూర్వం (అదృష్టం) కలుగుతోందని దానివల్ల జీవితాంతంలో స్వర్గాదిఫలం అనుభవిస్తామని వారికి దృఢవిశ్వాసం ఉండేది. దీనివల్ల వారికిగల ఓర్పు, సంప్రదాయంపైన నమ్మకం మనం గ్రహించవచ్చు. అప్పటి కప్పుడు ఫలితం కలగాలనే నేటి మనస్తత్వానికి అది పూర్తి విరుద్ధం కదా!

లేగదూడలు అడవికి నడచి వెడతాయి కాబట్టి **'వాయవః'** అని, తిరిగి యజమాని ఇంటికి వస్తాయి కాబట్టి **'ఉపాయవః'** అని పిలవబడ్డాయి. అవి వాయుదేవతాకాలు కావడం అలా పిలవడానికి కారణం ఆనాటి ప్రజలు ప్రభువులచేత రక్షింపబడ్డారు. రాజుకు ప్రజలకు మధ్యగల స్వామిభృత్యభావానికి ఆనాడు ఎంతో ప్రాధాన్యాన్ని ఇచ్చారు **(1-1-1)**.

ఆనాటి వారి ఆలోచనలు ఎంత సున్నితమైనవో మనకు ఈ క్రింది ఉదాహరణలో స్పష్టంగా తెలుస్తుంది. అధ్వర్యుడు యజ్ఞం కోసం దర్భలు కోయడానికి అడవికి వెళ్ళాడు. దర్భలను చూచేసరికి అతడికి జాలి కలిగింది. కాని యజ్ఞానికి అవి తప్పనిసరి గదా!

---

3. కల్పాలు: అరుణకేతుకచయనప్రకరణంలో `కల్పోఽథ ఊర్ధ్వం' అని చెప్పబడింది
4. గాథలు: "యమగాథాభిః పరిగాయతి" అనే వాక్యరూపంలో ఉండే మంత్రవిశేషాలు.
5. సరాశంసలు: మనుష్యవృత్తాంతాన్ని ప్రతిపాదించే ఋక్కులు.
2. నేటికీ ఉపనయనసమయంలో మోదుగకఱ్ఱను బ్రహ్మచారికివ్వడం సంప్రదాయం.

వాటితో ఇలా అంటున్నాడు—'ఓ దర్భల్లారా! దేవతలను ఆరాధించ డానికి మీరు తప్పనిసరిగా కావాలి. నేను నా ఇల్లు కప్పుకోవడానికి మిమ్మల్ని కోయడం లేదు. నా స్వలాభం కోసం మీకు బాధ కలిగించడంలేదు. రాజాజ్ఞకు లోబడి భృత్యుడు గ్రామాల్లో ప్రజల దగ్గఱ డబ్బును వసూలు చేసి రాజుకు సమర్పించినట్లు, యజ్ఞం కోసం మిమ్మల్ని ఛేదిస్తున్నాను. మళ్ళా వర్షానికి మీరు శాఖోప శాఖలుగా విస్తరించాలి. అలా మీరు ఎదగడానికి అనుకూలంగానే కోస్తున్నాను'

ఈ మాటలవల్ల ఆనాటివారి అహింసాభావం, నిస్స్వార్థ ప్రవృత్తి మనకు గోచరిస్తాయి. అంతేకాదు; తిరుగాడే ప్రాణుల్లో లాగానే వాళ్లు స్థిరంగా పెరిగే లతావృక్షాదుల్లో సైతం చైతన్యాన్ని చూడగలిగారని, మనకంటే లోతైన దృష్టి, దయార్ద్రమైన హృదయం వారికున్నాయని తెలుస్తున్నది దేవతలకర్పించడం కోసం (బర్హిర్లవనం) దర్భలను, తులసీ పుష్పాదులను కోయడం తప్పుకాదని స్వప్రయోజనాలకోసమో లేక ఏప్రయోజనం లేకుండానో గడ్డి మొక్కలు. తీగలు మొ॥ వాటిని తుంపడం వాటిని బాధించడమేననే సత్యం వారికి బాగాతెలుసని అర్థమవుతున్నది(1-1-2).

ఆనాటి సంఘంలో స్త్రీకి ఎంతో గౌరవస్థానమున్నది. పురుషుడు స్త్రీతోకూడి యజ్ఞాన్నాచరించవలెనే గాని ఒంటరిగా చేయడానికి అధికారంలేదు. కనుకనే అర్ధాంగి అనే పదం సార్థకమైంది. స్త్రీకి స్వతంత్రంగా యజ్ఞంచేసే అధికారం లేదు. భర్తద్వారా ఆమెకు కూడా యజ్ఞానుష్ఠానాధికారం సంక్రమిస్తున్నది. యజ్ఞంచేసే సమయంలో అనేక సాహాయ్యాలను యజమానికి, అతని భార్య చేయాలి. దీనివల్ల భార్యాభర్తల మధ్య సన్నిహిత సంబంధం పెరిగి వారి స్నేహం దృఢతరమయ్యే అవకాశం ఉన్నది. భార్యపైన భర్తకు, ఇతర కుటుంబసభ్యులకు చక్కని గౌరవం పెరుగుతున్నది. కలసి యజ్ఞాలు

చేసే సంప్రదాయం ప్రస్తుతం నశించినా పురుషులు స్త్రీని గృహలక్ష్మిగా భావించడం ఏకపత్నీవ్రతులై మంచిసంతానాన్ని పొంది సుఖంగా జీవనాన్ని గడపటం ఆనాటి ఆచార ప్రభావమేనని చెప్పకతప్పదు (1-1-10).

ఆనాటి స్త్రీలకు భర్తృవియోగం భరింపరానిది. వాళ్లు తమ సర్వస్వాన్ని వదలివేయడానికైనా సిద్ధపడేవాళ్లు గాని భర్తతో వియోగాన్ని పొందడానికి ఇష్టపడేవాళ్లుగాదు. భార్య శరీరంలాంటిదని, భర్త అందులోని ఆత్మలాంటివాడనే భావన మనకు ఈ వేదంలో గోచరిస్తుంది. ఈ సహజీవనంకోసం వాళ్లు అగ్నిదేవుని ప్రార్థించడం కూడా కనబడుతుంది. దీన్నిబట్టి ఆనాటి దాంపత్యబంధానికి వాళ్లెంత విలువనిచ్చారో మనం అర్థంచేసుకోవచ్చు (1-1-10).

అన్న-ధన సమృద్ధిని కోరినవాళ్లు 'ఇంద్రాగ్నేష్టి'ని చేసి ఇంద్రాగ్నిదేవతల అనుగ్రహంవల్ల అన్నసమృద్ధిని, ధనసమృద్ధిని పొందేవారు(1-1-14)..

వంశం వృద్ధిపొందాలనే కోరిక ఆనాటివారిలో తీవ్రంగా ఉండేది గుణవంతుడైన కుమారుడు కలగాలని మాత్రమే కోరక, మంచి మనుమడుకూడా కలగాలనే ప్రార్థన మనకీ విషయాన్ని తెలియజేస్తుంది నిజమే! ఎన్ని సిరిసంపదలు వంశవృద్ధితో సమానమౌతాయి? (1-3-11).

యజ్ఞాచరణంవల్ల ముసలితనం రాదు ఆయుష్యం పెరుగుతుంది. ఈ రహస్యం ఆనాటివారికి బాగా తెలుసు. కాబట్టే వారు ఎప్పుడూ యజ్ఞాల నాచరిస్తూ మంచిపటుత్వంతో ఎన్నో వేల సంవత్సరాలు జీవించేవాళ్లు. ఒకప్పుడు సర్పాలు ముసలితనం పోగొట్టుకోవడానికి మార్గమేమిటని ఆలోచన చేశాయి. అప్పుడు కద్రువ పుత్రుడైన 'కపర్ణిరుడు' 'భూమిర్భూమ్నా' అనే మంత్రసమూహాన్ని

దర్శించాడు. మంత్రప్రభావంవల్ల సర్పాలన్నీ ముసలిశరీరాల్ని విడిచిపెట్టి కోమలమైన శరీరాల్ని పొందాయి. ఇందువల్లనే 'భూమి సర్పాలకు రాణి' అని వేదం చెబుతున్నది. ఈ మంత్రాలతోనే అగ్న్యాధానం చేస్తారు అలా ఆధానం చేయబడ్డ అగ్ని, ముసలితనం లేకుండా నిత్యయౌవనంతో ప్రకాశిస్తాడు. మహర్షులు కూడా అగ్నిలాగానే యజ్ఞానుష్ఠానంవల్ల ముసలితనాన్ని పొందకుండా ఉన్నారు **(1-3-11)**.

విధివిహితమైన సమయంలో కర్మానుష్ఠానం చేయాలనే నిష్ఠ, అలా చేయకపోవడం తప్పనే భయం ఆనాటి ప్రజల్లో కనబడేది. ప్రభాతకాలంలో సంధ్యావందనం చేస్తూ సూర్యోదయం కోసం ఎదురుచూసేవారు. సూర్యోదయం కాగానే అర్ఘ్యప్రదానం చేసేవారు. ఒక హేమన్తంలో సూర్యోదయం ఆలస్యంగా అయేటప్పటికి కాలాతిక్రమణంవల్ల ప్రత్యవాయం ఏర్పడుతుందేమోనని **'పారమశీయ'** అనే మంత్రంతో సూర్యుణ్ణి ప్రత్యక్షం చేసుకొన్నారు**(1-5-7)**.

ఆనాటి సంఘంలో చేపలు పట్టడమే వృత్తిగాగల జాలరులున్నట్లు, మత్స్యహింస పాపం కాదని ఈ క్రింది వృత్తాంతంద్వారా తెలుస్తున్నది

హవ్యాన్ని దేవతలకు చేరవేసే అగ్ని సోదరుల్లు ముగ్గురు చనిపోయారు. అగ్నికి, తను కూడా అలాగే అవుతానేమోనని భయం వేసింది. ఎవరికీ కనపడకుండా నీళ్లల్లో దాక్కున్నాడు. దేవతలకు అగ్నిజాడ మత్స్యం చెప్పగా అగ్ని చేపలనిలా శపించాడు. 'జాలరులు వలలతోపట్టి మిమ్మల్ని చంపుతారు. ప్రజలు ఎప్పుడు చంపాలనుకుంటే అప్పుడే మిమ్మల్ని చంపుతారు'కాబట్టి అగ్నిశాపంవల్ల చేపలు చనిపోతున్నాయని, దానివల్ల పాపం లేదని తెలుసుకోవాలి[1] **(2-6-6)**.

1. **కొన్ని ప్రాంతాల్లో వైదికుల్లో మత్స్యభుక్కులుండటానికి కారణం మత్స్యహింస హింసకాదనే ఈ సిద్ధాంతంవల్లనే నేమో!**

యజ్ఞయాగాదులనాచరించడంవల్ల ఎప్పుడో స్వర్గం లభించడం కాకుండా ఇప్పుడే ఈ జన్మలోనే అనేక లౌకిక ప్రయోజనాలను పొందచ్చు. తారకలందఱు తమ భర్తకు వచ్చిన క్షయవ్యాధిని **'ఆదిత్యేష్టి'** ద్వారా పోగొట్టడం ఇక్కడ గమనింపదగిన విషయం.

ప్రజాపతికి ముప్ఫై మూడుమంది కూతుళ్లు. అందులో ఏడుమంది కృత్తికలు. మిగతావాళ్లు తారకలు. చంద్రుడు రోహిణి మీద చూపుతున్న మోజుకు మిగతావాళ్లు అసూయపడి తండ్రితో చెప్పారు అతడు అందఱిని సమానంగానే చూస్తానని చంద్రునిచేత ప్రతిజ్ఞ చేయించాడు. కొన్నాళ్లకు ప్రతిజ్ఞాభంగం చేసిన చంద్రుడికి క్షయవ్యాధి వచ్చింది. రాజైన చంద్రుడికి వచ్చింది కాబట్టి **'రాజయక్ష్మ'** అని; పాపంవల్ల రావడం చేత **'పాపయక్ష్మ'** అని, భార్యానిమిత్తంగా వచ్చింది కాబట్టి **'జాయేన్య'** అని తరువాత దానికి పేర్లువచ్చాయి తారకలంతా కలిసి ఆదిత్యేష్టి చేసి చంద్రుని క్షయవ్యాధిని పోగొడతారు కాబట్టి ఎంత భయంకరవ్యాధులనైనా ఆనాటివాళ్లు యజ్ఞానుష్ఠానంతో పోగొట్టుకొనే వాళ్లని మనం దీనివల్ల తెలుసుకోవచ్చు (2-3-5).

మాసవ్యవహారం ఆనాడు ఇంకోరకంగా ఉండేది. ఇప్పుడు మనం చైత్రం, వైశాఖం అని మాసాలను వ్యవహరిస్తున్నాం. ఆనాటి వ్యవహారం ఇలా ఉండేది (4-4-11).

| | | | | |
|---|---|---|---|---|
| మధు - | మాధవమాసం - | చైత్ర | - వైశాఖాలు | - వసంతఋతువు |
| శుక్రం - | శుచి - | జ్యేష్ఠ | - ఆషాఢాలు | - గ్రీష్మర్తువు |
| నభం - | నభస్యం - | శ్రావణ | - భాద్రపదాలు | - వర్షర్తువు |
| ఇషం - | ఊర్జం - | ఆశ్వయుజ | - కార్తికాలు | - శరదృతువు |
| సహం - | సహస్యం - | మార్గశిర | - పుష్యాలు | - హేమంతఋతువు |
| తపం - | తపస్యం - | మాఘ | - ఫాల్గుణాలు | - శిశిరఋతువు |

ఈనాటికీ చాలా ప్రసిద్ధంగా ఉన్న సర్పపూజ కృష్ణ యజుస్సంహిత నాటికే ఎంతో ప్రచారంలో ఉన్నది. సర్పాలకు నమస్కారం చేస్తే అవి మన జోలికి రావని భారతీయుల విశ్వాసం. అన్ని రకాలైన సర్పాలను ఆరాధించటం ఆనాటి సంఘంలో కనబడుతున్నది **(4-2-8).**

ఆనాటికే మనదేశంలో వ్యవసాయం బాగా వృద్ధిపొందింది. పంటలు కోసివేసిన తరువాత ఆ నేలను తగలబెట్టడం ఆనాటి కృషీవలునికి తెలుసు. అలా తగలబెట్టడం వల్ల క్షేత్రగతమైన ఎన్నో దోషాలు నశిస్తాయి. తరువాతనే భూమిని దున్ని రైతు పంటను వేసేవాడు. అలాంటి భూమిలో సస్యం ఎంతో సమృద్ధిగా ఎదిగేది **(5-2-5).**

శత్రువులమీద దండయాత్రలు చేసేటప్పుడు రాజులు విజయం కోసం '**ఉపసద్ధోమం**' చేసి యుద్ధరంగంలో ప్రవేశించేవారు. ఉపసద్ధోమం చేసి అగ్ని-సోమ-విష్ణు దేవతాకమైన బాణంతో దేవతలు రాక్షసుల పురభేదనం చేశారు. శత్రుపురాన్ని భేదించేవి కాబట్టి ఈ ఆహుతులకు '**ఉపసత్తు**' లనే పేరు ఏర్పడింది **(6-2-3).**

■ సమాజంలో వైద్యం చేసే వాడికి వైదికులలో తగినగౌరవం లేదని తెలుస్తున్నది. అశ్వినీదేవతలు వైద్యులు కాబట్టి, వీరికి అగ్నిష్టోమ యాగంలో హవిస్సులనివ్వడానికి వీల్లేదు వీళ్లల్లో హవిర్దానానికి తగిన పవిత్రత లేదు. బహిష్పవమానస్తోత్రంచేత వీరిని పవిత్రీకరించి ఆశ్వినగ్రహణం చేయబడింది.

అగ్ని, ఉదకం, బ్రాహ్మణుడు, వీరియందు అదృష్టోపకార జనకమైన శక్తిఉన్నది. కాబట్టి లౌకిక వైద్యులు కూడ బ్రాహ్మణుని, ఉదకాన్ని, మండే అగ్నిని దగ్గఱలో ఉంచుకొని చికిత్సచేసేవారు

అలా చేయడం వల్ల అశ్వినీదేవతల అనుగ్రహం కలుగుతుందని వారి విశ్వాసం, అశ్వినీదేవతల దయవల్లనే ఆనాటి వైద్యులు రోగులకు ఆరోగ్యాన్ని త్వరగా కలిగించగలిగే వారు **(6-4-9-)**.

సంఘంలో గౌరవస్థానాన్ని, మంచి కీర్తి ప్రతిష్ఠలను పొందడానికి కూడ ఆనాడు యజ్ఞాచరణం సహకరించేదని తెలుస్తున్నది

బృహస్పతి దేవగురువైన ఉదంతం మనకీ విషయాన్ని తెలియ జేస్తున్నది ఒకప్పుడు బృహస్పతి విషయంలో దేవతలకు విశ్వాసం లేదు. వారందరు తనపై విశ్వాసంతో ఉండటానికి ఏం చేయాలా? అని అతడాలోచించాడు. చివరకు '**చతుర్వింశతిరాత్రమ**'నే యాగాన్ని చేశాడు. ఇరవైనాలుగు రాత్రింబవళ్లలో ఈ యాగాన్ని చేయాలి ఈ యాగంచేసిన తరువాత అతడు దేవతలందరి విశ్వాసాన్ని చూరగొన్నాడు వారికి గురువయ్యాడు. అధికారుల విశ్వాసాన్ని పొందాలంటే ఈ యాగం చేయాలి. ఈ యాగం చేసిన వారిపై ప్రభువులకు మంచి గౌరవం, విశ్వాసం ఏర్పడతాయి **(7-4-1)**.

ఒక్కొక్క ఫలం కోసం ఒక్కొక్క యాగం ఈ వేదంలో చెప్పబడ్డా ఆనాటి ప్రజలలో సామూహిక శ్రేయస్సును, లోక కల్యాణాన్ని పొందాలనే ఆకాంక్ష లేకపోలేదు అందరికీ మంచి కలగాలనే ఆలోచన వారిలో ఉన్నది.

రాష్ట్రంలో వర్ణవిభేదాలు లేకుండా అందరు కలసి మెలసి స్నేహంగా జీవించాలి. అధ్యయనం చేసి బ్రాహ్మణుడు బ్రహ్మ వర్చస్సుతో ప్రకాశించేటట్లు జన్మించాలి. క్షత్రియుడు బాణాదుల్ని ప్రయోగించడంలో నేర్పరి, మహారథిగా పుట్టాలి. పుష్కలంగా పాలనిచ్చే గోవులీరాష్ట్రంలో ఏర్పడాలి. వృషభాలు భారాన్ని వహించే శక్తికలవిగా పుట్టాలి. మంచి వేగంతో పరుగెత్తగల గుర్రాలకు ఈ దేశంలో

కరువుండకూడదు. ఈ యజమానికి జయశీలుడైన కుమారుడు కలగాలి. మాప్రజల కెప్పుడు వర్షంకావాలో అప్పుడు మేఘాలు వర్షించాలి. మారాష్ట్రం సస్యసంపన్నమై కరువు కాటకాలు లేకుండా ఉండాలి. ప్రజలంతా సుఖంగా బ్రతకాలి. ఎన్నో సిరిసంపదలను మేము పొందేటట్లు, పొందినవాటిని చక్కగా కాపాడుకొనేటట్లు యజ్ఞపురుషుడు మమ్మల్ని అనుగ్రహించాలి (7-5-18).

ఇలాంటి భావనలతో వారు సమసమాజాన్ని, అందరికీ శ్రేయస్సును కోరే సంఘాన్ని నిర్మించుకొన్నారు. వారి ఆచరణ, ఆలోచన మనకు ఆదర్శమైతే, అందరికీ మంచి కలుగుతుంది.

- జి.ఎస్.ఆర్.

## 2.11 కవితాసౌందర్యం

ఋగ్యజుస్సామాథర్వాలని ప్రసిద్ధిచెందిన వేదాలలో యజుర్వేదం రెండవది ఉద్దేశానుసారం ఋగ్వేదమే ముఖ్యమై మొదటి స్థానాన్ని పొందినా, క్రియాప్రధానమైన యజ్ఞానికి యజుర్వేదమే ఊపిరివంటిది

యజుర్వేదంలో ముఖ్యంగా యజ్ఞం చేసేటప్పుడు ఉచ్చరించ వలసిన మంత్రాలు అధికంగా ఉన్నాయి. యజ్ఞం చేయడానికి కావలసిన వివిధవస్తువులను గురించిన మంత్రాలూ ఉన్నాయి ఉదాహరణకు- యజ్ఞంకోసం పాలు కావాలి. పాలు తీయడానికి ఆవు. దూడ అవసరం. దూడను ఆవునుంచి దూరం చేయడానికి ఒక కర్ర, దూడను కట్టడానికి పలుపు, గుంజ కావాలి. వీటికి ప్రత్యేకంగా మంత్రాలున్నాయి. ఇక సోమరసాన్ని తీయడానికి తగినపాత్ర, సోమలతను నలగగొట్టడానికి రెండు రాళ్ళు, ఆ రసాన్ని వడపోయ డానికి జల్లెడవంటి సాధనం. రసాన్ని పట్టడానికి పాత్ర మొ॥ నవి కావాలి

హవిస్సుగా అగ్నిలో అర్పించడానికి పురోడాశం (పిండిరొట్టె) ముఖ్యం దీనికి కావలసిన పిండిని తయారుచేయడానికి ధాన్యం అవసరం. ఈ ధాన్యాన్ని దంచి, పొట్టును వేరుచేయడానికి రోకలి, రోలు, చేట మొదలైన సాధనాలూ ఆవశ్యకాలు ఇవికాక క్షురకర్మకు కత్తి కావాలి. ఈ వస్తువులన్నీ యజ్ఞానికి ముఖ్యమైనవే. కాబట్టి వీటిని సంబోధించే సంక్షిప్తగద్యభాగాలూ ఈ వేదంలో ఉన్నాయి ఇవికాక రొట్టెను కాల్చడానికి, పిండిని మూకుటిపై పఱచేడానికి, ప్రధానయాజకుడు తక్కిన అనుచరులకు ఆయా పనులు చేయమని తగిన ఆజ్ఞలను ఇవ్వడానికి విడివిడిగా గద్యరూపాలైన భాగాలిందులో ఉంటాయి. ఇలాంటి అనేక గద్యభాగమంత్రసంకలనమే యజుర్వేదమని

చెప్పచ్చు. వీటితోపాటు యజ్ఞాలకు తదవాంతరక్రియలకూ సంబంధించిన అనేక వివరణలు, వ్యాఖ్యానాలు, ఉపాఖ్యానాలు కూడ ఈ వేదంలో చోటుచేసుకొన్నాయి. ఈ విధంగా యజ్ఞానికి సంబంధించిన మంత్రాలు, ఇతర విషయాలూ కలిసి ఉన్న వేదభాగాన్ని కృష్ణయజుర్వేదమనీ ప్రాజ్ఞులు వ్యవహరిస్తున్నారు. శుక్ల, కృష్ణ యజుర్వేదాలకు భేదమీ విషయంలోనే.

## కృష్ణయజుర్వేదంలోని కవిత:

కృష్ణయజుర్వేదంలోని కవితాసౌందర్యం ప్రస్తుతం. ఈ వేదంలో మంత్రాలతోపాటు ఇతరభాగాలూ మిశ్రితాలై ఉన్నాయని ముందే తెలుసుకున్నాం. యథార్థంగా యజ్ఞసంబద్ధాలైన క్రియాకలాపాలను గూర్చిన ఈ వేదంలో కవితకు ప్రాధాన్యం లేదనే చెప్పవచ్చు అయినా మంత్రద్రష్టలైన మహర్షుల ముఖకమలాలనుంచి వినిర్గతాలైన సూక్తులు కొన్ని అప్రయత్నంగానే కావ్యలక్షణాలను సంతరించుకొన్నాయి. అలాంటి భాగాలను సేకరించి స్థాలీపులాకన్యాయంగా వాటిలోని కవితాసౌందర్యాన్ని సంగ్రహంగా పరిశీలిద్దాం.

కావ్యానికి అందాన్ని చేకూర్చేవి అలంకారాలు. అవి శబ్దగతాలు, అర్థగతాలు అని రెండువిధాలు. కృష్ణయజుర్వేదంలో శబ్దాలంకారాలు, అర్థాలంకారాలు కూడ తఱచుగా ప్రయోగించబడ్డాయి. ఈ క్రింది ఉదాహరణలు ఈ సందర్భంలో పేర్కొనవచ్చు

### 1. శబ్దాలంకారం - అనుప్రాస:

కావ్యానికి సౌందర్యాన్నాపాదించే వాటిల్లో మొదట పేర్కొనదగింది అనుప్రాసనునే శబ్దాలంకారం. వర్ణాలను అవృత్తిచేస్తే ఒక కొత్త అందమేర్పడుతుందన్న విషయం మంత్రద్రష్టలైన మహర్షుల

మనీషకు గోచరమే. అందులోను సహజంగా అప్రయత్నంగా వస్తేనే ఈ వర్ణావృత్తి శోభనాపాదిస్తుంది. లేకుంటే కృత్రిమాలంకారంలాగా విరసతను కలిగిస్తుంది. సహజసుందరాలైన అనుప్రాసలీ కృష్ణయజుర్వేదంలో చాల ఉన్నాయి. మచ్చుకు కొన్ని:

ఇంద్రాయాధ్యక్షాయాను త్వా మాతా మన్యతామను పితాఽనుభ్రాతా
స గర్భ్యోఽను సఖా సయూథ్యః (1-2-4)

సోమక్రయణీహోమాది సందర్భంలో పఠించబడ్డ ఈ భాగంలో 'స' అనే వర్ణమావృత్తమైంది.

ప్రజాస్త్వామను ప్రాణితి ప్రజాస్త్వమను ప్రాణన్తు(1-2-6)

ఇది సోమోన్మానప్రకరణ వాక్యం. ఇక్కడ 'ప్రజా' 'ప్రాణ' శబ్దాలు ఆవృత్తాలైనాయి.

ప్రాచేవీర్మాయాః సహతే దురేవాః
శిశీతే శృఙ్గే రక్షసే వినిక్షే (1-2-14).

ఇది కామ్యేష్టి యాజ్యాయైన పురోఽనువాక్య. ఇక్కడ 'శ' 'వర్ణం' క్ష' వర్ణం ద్విరావృత్తాలై అనుప్రాసకు లక్ష్యాలవుతున్నాయి

పూర్ణాదర్వి పరాపత సుపూర్ణా పునరాపత ।
వస్నేవ విక్రీణావహా ఇషమూర్జం శతక్రతో ॥ (1-8-4)

ఇది చాతుర్మాస్యసంబద్ధమైన సాకమేధపర్వాన్ని గూర్చిన మంత్రం. ఇందులో 'పూర్ణా' 'పత' శబ్దాలావృత్తాలు.

యః పావకః పురుతమః పురూణి
పృథూన్యగ్నిరనుయాతి భర్వన్ (1-3-14).

ఇది కామ్యేష్టియాజ్యా పురోఽనువాక్య. ఇందులో 'ప' వర్ణావృత్తి స్పష్టం.

హంసశ్శుచిషద్ వసురన్తరిక్షసద్
హోతావేదిషద్ అతిథిర్దురోణసద్ ।
నృషద్వరసదృతసద్ వ్యోమసద్
అబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్.॥

రథవిజయసందర్భంలో పఠింపబడే ఈ మంత్రంలో 'సద్' 'జా' వర్ణాల ఆవృత్తి- అనుప్రాసకు తావలమై ఉన్నది. ఈ మంత్రమే అనేకార్థాలంకారాలకు దృష్టాంతమని ఉత్తరత్ర స్పష్టం అవుతుంది.

**2. అర్థాలంకారాలు:**

**(1)** ఉపమ:

అనేకార్థాలంకారాలకు బీజభూతమనదగిన ఉపమాలంకారానికి కృష్ణయజుర్వేదంలో అనేక నిదర్శనాలున్నాయి. వాటిలో కొన్ని ప్రస్తుతం ఉదాహరింపబడతాయి.

వయముత్వా పథస్పతే రథం న వాజసాతయే
ధియే పూషన్నయుజ్మహి **(1-1-14)**

ఇది కామ్యేష్టియాజ్యాకు చెందిన పురోఽనువాక్య. 'పందెంలో గెలుపును సాధించే రథంలాగా మేము మా ప్రార్థనలకు నిన్ను పూన్చాం' అని ఈ మంత్రానికి అర్థం. ఇందులో ఉపమాలంకారం స్పష్టంగా చెప్పబడింది.

క్షేత్రస్య పతే మధుమన్తమూర్మిం ధేనురివ పయో అస్మాసుధుక్ష్వ
మధుశ్చ్యుతం ఘృతమివ సుపూతం ఋతస్యనః పతయో మృడయన్తు
**(1-1-14).**

పై సందర్భంలోనిదే ఈ మంత్రం. 'ఓ క్షేత్రపతీ! తేనెతో నిండిన తరంగాన్ని, ఆవు క్షీరాన్ని మాపై ప్రవహింపచేయి. ధర్మానికి అధిపతులైన దేవతలు దయతో, పరిశుద్ధమైన నేయిలాగా తేనెలుచిల్కే

వస్తువిశేషాన్ని అనుగ్రహింతురు గాక!' అని దీని భావం. ఇందులోను క్షీరానికీ, మధుతరంగానికీ కల ఉపమానం హృద్యమైంది

ఘృతం పీత్వా మధు చారుగవ్యం
పితేవ పుత్రమభిరక్షతాదిమమ్ (1-3-14)

పూర్వోక్తసందర్భంలోనిదే ఈ మంత్రం కూడ. 'ఆస్వాదనీయమైన ప్రశస్తమైన ఘృతాన్ని స్వీకరించి, తండ్రి తన పుత్రునిలాగా, దేవత ఈ యాజకుని రక్షించుగాక!' అని అర్థం. తండ్రి పుత్రుని రక్షించడానికి, దేవత యాజకుని రక్షించడానికి ఔపమ్యం చెప్పబడింది

త్ర్యంబకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనమ్।
ఉర్వారుకమివ బంధనాత్ మృత్యోః ముక్షీయమాఽమృతాత్ ॥ (1-8-6)

సాకమేధంలో త్ర్యంబకహవిస్సును గూర్చిన సందర్భంలోనిదీ భాగం. 'తొడిమనుంచి దోసపండును (ఉర్వారుకం) తొలగించినట్లు నన్ను మృత్యువునుంచి విడిపించు అమృతత్వంనుంచి తొలగించకు' అనే అర్థంగల ఈ భాగంలో మృత్యువుకు, తొడిమకు, మంత్రపాఠకునకు ఉర్వారుకానికి గల ఉపమానోపమేయ భావం చాల రమ్యంగా ఉండి, సహృదయ హృదయాహ్లాదకంగా ఉంది.

రుద్రో వా ఏష యదగ్నిః; స యథా
వ్యాఘ్రః క్రుద్ధః తిష్ఠత్యేవం వా ఏషః (5-5-7-4)

'అగ్ని నిజంగా రుద్రుడే. కోపించిన పులిలాగా అతడుంటాడు' ఇందులో అగ్నికి, పులికి సామ్యం చెప్పబడింది. ఇందులో ఉపమా వాచకం 'యథా' శబ్దం. ఇంతకుముందిచ్చిన ఉదాహరణాల్లో 'ఇవ' శబ్దం ఉపమావాచకంగా ప్రయుక్తమైంది.

అగ్నిని ప్రజ్వలింపచేయడమంటే నిద్రిస్తున్న పులిని లేపడం లాంటిది, అని చెప్పే ఈ క్రింది భాగంలో కూడా ముందటి ఉపమానం ఆవృత్తమైంది.

అథో ఖల్వాహుః న చేతవ్యేతి; రుద్రో వై ఏష యదగ్నిః ।
యథా వ్యాఘ్రగ్ం సుప్తం బోధయతి తాదృగేవతత్ ॥ (5-4-10-5)

అనేది ప్రస్తుత మంత్రభాగం.

యత్సంయానీరుపదధాతి ।
యథాప్సు నావా సంయాత్యేవమ్ ॥(5-3-10-1)

'ఒక విశిష్టమైన ఉపధానం చేసినవాడు నీటిలో నావప్రయాణం చేసినంతగా సుఖపడతాడు. అనే భావంకల పైభాగంలో కూడ ఉపమాలంకారం ప్రయుక్తమైంది.

యథా ధ్సారీయతి మే ఆఖుః ఇయతి
నావరోత్స్యామితి ఉపావస్పజతి (6-4-11-3)

'వేటగాడు తాను జంతువుపై బాణాన్ని ప్రయోగించాలని మాటులోనుంచి గురి తప్పరాదనే నిశ్చయంతో ఎలా సరిగా లెక్క చూచి బాణాన్ని ప్రయోగిస్తాడో అలానే' అనే అర్థంకల ఈ వాక్యంలో చక్కని ఉపమాలంకారం ప్రయుక్తమైంది. 'ఆఖు' శబ్దం వేటగాడు పొంచి ఉండే 'గోతి'కి పేరు (చూ అష్టా.3-3-125.వార్తికం1). ఇలాంటివే అనేక ఉపమోదాహరణాలను చూపవచ్చు.

(2) రూపకం:

ఉపమానోపమేయాలకభేదాధ్యవసాయం ప్రధానధర్మంగా కల రూపకాలంకారానికి కూడ కృష్ణయజుర్వేదంలో చాల దృష్టాంతాలు ఉన్నాయి. మచ్చుకు కొన్ని:

అగ్నే త్వం పారయా నవ్యోఽస్మాన్ స్వస్తిభిరతిదుర్గాణి విశ్వా ।
పూశ్చ పృథ్వీ బహులాన ఉర్వీ భవాతి తోకాయ తనయాయ శం యోః॥
(1-1-14)

'ఓ అగ్నీ! నీవు మాకోసం విశాలమై, దృఢమైన దుర్గంగా మారు' అనే భావంకల ఈ మంత్రంలో అగ్నికీ దుర్గానికీ కల రూపకం స్పష్టం.

మఖస్య శిరోఽసి సంజ్యోతిషా జ్యోతిరఙ్క్తామ్ ।(1-1-12)

ఆఘార సమయంలో పఠింపబడే ఈ పంక్తిలో 'నీవు మఖానికి శిరస్సువు' అనడంలో రూపకం ఉంది.

**(3)** శ్లేష :

హంసశ్శుచిషద్ వసురన్తరిక్షసద్ ॥
హోతావేదిషదతిథిర్దురోణసద్॥
నృషసద్వరసద్ ఋతసద్ వ్యోమసద్ ।
అబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్॥ **(1-8-15)**

రథవిజయసందర్భంలో పఠితమైన ఈమంత్రం శ్లేషాలంకారానికి చక్కని ఉదాహరణం. ఈ విషయం భట్టభాస్కరుల వ్యాఖ్యానంనుంచి స్పష్టమౌతుంది. ఈ మంత్రాన్ని వ్యాఖ్యానించడానికి ముందు భట్టభాస్కరులిలా వ్రాస్తున్నారు.

'అధ్యాత్మం, అధిదైవం అధియజ్ఞం చాధికృత్య త్రేధేమం మంత్రం వ్యాచక్షతే; తత్ర ప్రకరణానురూపోఽర్థవిశేషో గ్రహీతవ్యః'

ఈ మంత్రాన్ని అధ్యాత్మ, అధియజ్ఞ, అధిదైవపరాలుగా మూడు విధాలుగా వ్యాఖ్యానిస్తారు. సందర్భానుసారంగా ఆయా అర్థవిశేషాలను గ్రహించాలి. దీన్నిబట్టి ఇక్కడ శ్లేషాలంకారమనడం స్పష్టం. భట్టభాస్కరులిచ్చిన మొదటి అర్థం:

**(1).హంస=ఆత్మ**. ఈ ఆత్మకే **'శుచిషత్'** (శుచియైన స్థలంలో ఉండేవాడు), **'వసుః'** (నివసించేవాడు లేక వరిష్ఠుడు), **'అన్తరిక్షసత్**;

(హృదయాకాశంలో ఉండేవాడు), **'హోతా'** (అహ్వానించేవాడు లేక దేవతలను రప్పించేవాడు). **'వేదిషత్'** (యాగార్థం వేదిపై కూర్చునేవాడు) **'అతిథి'** (ఎల్లప్పుడూ సంచరించేవాడు లేక తిథికృతాలైన విశేషాలు లేనివాడు), **'దురోణసత్'** (గృహాదులలో ఉండేవాడు), **'నృషత్'** (ప్రాణుల శరీరాలలో [redacted] రూపంగా ఉండేవాడు) **'వరసత్'** (ఫలభోక్తగా ఉండేవాడు), **'ఋతసత్'** (ఋతంలో అంటే యజ్ఞంలోగాని సత్యంలో గాని ప్రతిష్ఠితుడైనవాడు), **'వ్యోమసత్'** (వివిధరక్షణలలోగాని తృప్తిలోగాని లగ్నమైనవాడు), **'అబ్జాః'** (శరీరంనుంచి పుట్టినవాడు - శుక్లశోణితసంయోగోత్పన్న శరీరాభిప్రాయం), **'గోజాః'**(గోవులపై దయతో వాటిని పాలించేవాడు), **'ఋతజాః'**(యజ్ఞార్థం ఆవిర్భవించినవాడు), **'అద్రిజాః'**(పర్వతాదులలో ఆవిర్భవించగలవాడు), **'ఋతమ్'** (సత్యస్వరూపుడైనవాడు),**'బృహత్'** (బ్రహ్మ) అని.

ఇలాగే భాస్కరులు **'హంస'** శబ్దానికి అధిదైవపరంగా **'ఆదిత్యుడు'** అనే అర్థాన్ని ప్రతిపాదించి, అన్ని విశేషణాలను అన్వయించారు. ఆ తరువాత అధియజ్ఞపరంగా **'రథం'** అనే అర్థాన్ని సమర్థించారు

**(4.)** ఉల్లేఖం:

**'బహుభిర్బహుధోల్లేఖాదేకస్యోల్లేఖితా మతా'**

అని లక్షితమైన ఉల్లేఖాలంకారానికిగూడ పైన శ్లేష కుదా హరించిన మంత్రాన్నే దృష్టాంతంగా ఇవ్వవచ్చు. ఒకే వస్తువునుగాని వ్యక్తినిగాని అనేకులు అనేకవిధాలైన కారణాలచేత అనేకవస్తువులుగా భావిస్తే ఉల్లేఖం ద్యోతకమవుతుంది. ఈ దృష్టితో చూస్తే 'హంసశ్శుచిషత్' అనే మంత్రంలో ప్రతిపాదింపబడ్డ అనేక అర్థాలున్న 'హంస' శబ్దం కూడ ఉల్లేఖానికి దృష్టాంతం అవుతుంది. ఎందుకంటే **ఆత్మ** (మొదటి అర్థం)యే శుచియైన స్థలంలో ఉండే వాడుగా, వరిష్ఠుడుగా, అంతరిక్షంలో ఉండేవాడుగా, హోతగా, ఇలా అనేక

విధాలుగా భావింపబడుతున్నాడు. ఇట్లే ఆదిత్యరథరూపాలైన అర్థాలతో గూడ ఉల్లేఖం స్పష్టం. **'బహుభిః బహుధోల్లేఖాత్'** అనడంలో ఒకే వస్తువును ఒకే వ్యక్తి వివిధ కోణాలనుంచి చూడటంవల్ల అనే వ్యాఖ్యానం శిష్టసమ్మతమే. ఇక్కడ ఒకేవ్యక్తి ఆత్మ, రథ, సూర్యాదులను వివిధకోణాలనుంచి చూసి వివిధాలుగా ఉల్లేఖించడం ప్రస్తుతం

**(5) లోకోక్తి:**

లోకోక్తికి ముఖ్యమైన లోకవృత్తాంతదర్శనమనే లక్షణం ఈ క్రింది మంత్రంలో స్పష్టంగా ద్యోతకమవుతున్నది. 'నీవు నాకిస్తే నేను నీకిస్తాను' అనడం లోకంలో పరిపాటి.

దేహి మే దదామి తే నిమే ధేహి నితే దధే ।
నిహారమిన్నిమేహరా నిహారం నిహరామి తే ॥ (1-8-4)

'పరస్పరం భావయన్తః శ్రేయః పరమావాప్స్యథ' (భగవద్గీత 3-11) అన్నట్లు ఇక్కడ ఉపకారప్రత్యుపకారిత్వం స్పష్టం. ఈ మంత్రాన్ని వ్యాఖ్యానించిన భట్టభాస్కరులు 'లోకవృత్తాంత నిదర్శనమే' అని పేర్కొనడం గమనింపదగింది.

ఇలా స్థాలీపులాకన్యాయంగా కృష్ణయజుర్వేదంలోని కవితా సౌందర్యానికి, అలంకారదృష్టితో కొన్ని ఉదాహరణలు ఇవ్వబడ్డాయి. ముందు ఉపోద్ఘాతంలో పేర్కొన్నట్లు యజ్ఞక్రియానిరూఢమైన ఈ వేదంలో కవితాసౌందర్యాన్ని గురించి అన్వేషించడం అంత ఫలప్రదమైన కార్యంకాదు. అయినా మంత్రద్రష్టలైన మహర్షుల ముఖకమలాలనుంచి వెలువడిన వాక్కులకు అప్రయత్నపూర్వకంగానే కావ్యసౌరభం అలవడిందని చూపడమే ఈ వ్యాస ప్రధాన లక్ష్యం.

**- ఎమ్.ఎన్.**

## 2. 12 అధ్యాయాలు - సంగ్రహ సమీక్ష

వేదజ్ఞానం అంతులేనిది. మానవుల జీవితం సుఖమయం చేయడానికి భగవంతునిచేత ప్రసాదించబడ్డ జ్ఞానభాండాగారమే వేదం. కేవలం మూలం మాత్రమే గాక అర్థాన్ని కూడ తెలిసికోవడం వల్ల జ్ఞానవృద్ధి అవుతుంది. మనమెంత తెలిసికొన్నా అది సముద్రపునీళ్ళను బిందెతో తీసికొన్నంత మాత్రమే ఉంటుంది. గంటను ఒకసారి మ్రోగించి విడిస్తే అది చాలాసార్లు మ్రోగుతున్నట్లు సంస్కృతశబ్దం ఒకసారి ప్రయోగింపబడి చాలా అర్థాలను ఇస్తూ ఉంటుంది. కనుకనే చాలామంది చాలా విధాలుగా సమన్వయించి వేదాలకు అర్థాలు చెప్పారు. ఎవరు చెప్పినా లోకానికి ఉపయోగించే విషయాలే చెప్పారు. ప్రస్తుతం కృష్ణయజుర్వేద తైత్తిరీయ సంహితలోని విశేషాలను సంక్షిప్తంగా తెలుసుకోవడానికి ప్రయత్నిద్దాం.

తైత్తిరీయ సంహిత 7 కాండలుగాను, 44 ప్రపాఠకాలుగాను 635 అనువాకాలుగాను ఉన్నది. ప్రపాఠకాలను అధ్యాయాలని, అనువాకాలను ప్రశ్నలని కూడా వ్యవహరిస్తారు. మూలాన్ని పరిగణించేటప్పుడు కాండలను అష్టకాలని, భాష్యంలో అష్టకాలను కాండలని అనడం కనబడుతుంది. ఈ సంహితలో ముఖ్యంగా యజ్ఞసంబంధమైన విషయాలున్నాయి. యజ్ఞంద్వారా దేవతలను పూజించడం, సమాజాన్ని ఒకచోట కలపడం, దానం చేయడం జరుగుతుంది. ప్రాచీనకాలంలో యజ్ఞసంస్థలుండేవి. మన అస్తిత్వానికి కారణమైన భగవంతుణ్ణి వాటిద్వారా సేవించడం జరిగేది. ప్రజలు ఒకచోట చేరి తమలో ఐక్యతను, ధార్మికజీవితాన్ని అలవాటు చేసుకొనేవాళ్ళు: దానం చేయడం ద్వారా దారిద్ర్యం తొలగింపబడి, సంపద ఒకచోట కేంద్రీకరింపబడక, ప్రజలందరికీ సుఖజీవనం గడపడానికి ఉపయోగపడేది.

మానవ జీవితమే ఒక యజ్ఞం. కర్తవ్యపాలన అనే అగ్నిలో జీవితాన్ని హోమం చేయడమే యజ్ఞం. తనలోనున్న దుర్గుణాలను అగ్నికి ఆహుతి చేయడమే యజ్ఞం. ప్రతి మానవునికి నిత్యజీవితంలో ముందుకు పోవాలంటే యజ్ఞభావన అవసరం. ప్రపంచంలో అభివృద్ధిచెందే అన్నిదేశాల్లోను ఈ భావన స్ఫుటంగా కనబడుతుంది. చెడునుంచి మంచికి, కష్టాలనుంచి సుఖాలకు, చీకటినుంచి వెలుగుకు పోవాలంటే ఈ యజ్ఞభావన చాలా అవసరం. తన సుఖంకోసం ఇతరులను పీడించడం కాక, ఇతరుల సుఖంకోసం తాను కష్టపడటం, త్యాగం చేయడం భారతీయ జీవనలక్ష్యం. మనదేశంలో పూర్వంనుంచి అతిసామాన్య వ్యక్తికూడ ఇతరుల జీవితం సుఖవంతం చేయడానికి తాను కష్టపడడం కనబడేది రాజు, సేనాని, పండితుడు శాస్త్రజ్ఞుడు, వ్యాపారి, కర్షకుడు - ఇలా ప్రతివ్యక్తి ఇతరుల కోసం తాను కష్టపడేవాడు. పరోపకారమే ధర్మంగా ఉండేది శిబి, దధీచి లాంటి మహనీయుల జీవితాలు ఆదర్శాలుగా ఉండేవి.

యజ్ఞంలో పశుహింస ఉంటుందనే భావం ఎక్కువగా ప్రబలి ఉంది. అది అత్యవసరం కాదని దీన్ని చదివితే తెలుస్తుంది. యజ్ఞాన్ని **"అధ్వరము"** అని కూడ అంటారు. **"ధ్వర"** ధాతువుకు **"హింస"** అని అర్థం. అధ్వరమంటే హింసలేనిదని అర్థం. అధ్వరశబ్దం ఈ విషయాన్నే తెలియజేస్తుంది.

ప్రకృతి అంతా ప్రత్యక్షంగాను, పరోక్షంగాను ఉండే అనేక శక్తులచేత నడపబడుతూ ఉంది. వాటినే దేవతలుగా పిలుస్తాం. ఉదాహరణకు సూర్యుడు, చంద్రుడు, అగ్ని, భూమి, నీరు, గాలి మొదలైనవి. అవి అన్నీ సంతులనంగా **(Balance)** ఉంటే జీవితం సుఖమయమవుతుంది. అది తొలగిపోతే బాధలు తప్పవు. అందుకే మన పూర్వులు ప్రకృతిలోని శక్తులను సేవించేవారు, ఆరాధించే

వారు. ప్రస్తుతం శాస్త్రజ్ఞులు ప్రకృతిని జయిస్తున్నామనుకుంటూ ముందుకు పోతున్నారు. దీని ఫలితమేమవుతోంది? ఒక ప్రక్క సుఖసాధనాలు సమకూరుతున్నా చాల దేశాల్లో వాతావరణంలోను, నీటిలోను కాలుష్యం ఏర్పడింది. అది నేడు ప్రాణుల అస్తిత్వానికే ప్రమాదకరమైన సమస్య అయి కూర్చుంది. దాన్ని పోగొట్టడానికి విశ్వప్రయత్నాలు చేస్తున్నారు.

మన పూర్వులు యజ్ఞాలద్వారా ప్రాణీకోటి సుఖజీవనానికి పాటుపడేవాళ్ళు. అగ్నితో నెయ్యి మొ॥ పదార్థాలను హోమం చేసేవాళ్ళు. అవి నీళ్ళను, వాతావరణాన్ని కాలుష్యం పోగొట్టి స్వచ్ఛంగా చేస్తాయి. సకాలంలో వర్షాలు కురవడానికి ఉపయోగ పడతాయి. తను తనకోసమే బ్రతకడం పశులక్షణం. ఇతరులకోసం బ్రతకడం దైవత్వం. దాన్ని సాధించడానికి ఈ యజ్ఞాలు బాగా ఉపయోగపడేవి. అక్కడి విజ్ఞానులు చెప్పే ధార్మిక విషయాలు వినడంద్వారా మనశ్శాంతి కలిగేది. ప్రజలు ధర్మంగా జీవించే వాళ్ళు. ఈ భూమే ఒక యజ్ఞకుండం. మానవ జీవితమే యజ్ఞమయం. ఈ విషయాలు ఈ వేదంలో విపులంగా చెప్పబడ్డాయి. ఇక ఈ కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహితలోని విషయాలను సంక్షిప్తంగా కాండ క్రమంలో ఇక్కడ పరిశీలిద్దాం:

**మొదటి కాండ:**

మొదటికాండలో ఎనిమిది ప్రపాఠకాలు, నూటనలభై అనువాకాలు ఉన్నాయి. ఈ కాండలో దర్శపూర్ణమాసయాగ మంత్రాలు, సోమయాగాంగమైన దేవయజన స్వీకారం,. సోమ క్రయణం, ఆతిథ్యేష్టి చెప్పబడినాయి. హవిర్ధానం, సామిధేని, యాజ్యాపురోనువాక్యామంత్రాలు, వైసర్జనహోమం, పశ్వంగయూపచ్ఛేదనం, యూపస్థాపనం,

యూపస్తంభానికి పశువును బంధించే ఉపాకరణం మొ॥ కర్మలు వివరింపబడినాయి.

తరువాత సోమలతాగ్రహణం, సోమాభిషవం, కొయ్యతో చేసిన "అంతర్యామిపాత్ర"లో సోమరసాన్ని నింపడం, దక్షిణను స్వీకరించ డానికి అర్హతలు, అవభృథం చెప్పబడినాయి. సోమయాగం ఇంతటితో పూర్తవుతుంది.

ఇంకా ఈ కాండలో అశ్రవణం, ఇడాప్రశంస, అన్వాహార్య విధి, వాజపేయమంత్రాలు, ఉజ్జితిమంత్రాలు వివరింపబడ్డాయి. తరువాత రాజసూయయాగం చెప్పబడింది. ఇందులోని ప్రధాన కర్మలైన సౌత్రామణి, సాకమేధం, మహాపితృయజ్ఞం, త్ర్యంబక పురోడాశలు, ఇంద్రతూర్యం, ఇధ్మీయం, అపామార్గం, ప్రతిరోజు ఆచరించవలసిన రత్నిహవిస్సులు, దేవసూహవిస్సులు, జల సంస్కారమంత్రాలు, పది సంసృపహవిస్సులు, దశపేయం, రాజు శ్రమనివారణం కోసం చేసే అవేష్టులు మొదలైనవి నిరూపింప బడినాయి.

## రెండవ కాండ:

ఈ కాండలో ఆరు ప్రపాఠకాలు, డెబ్బై అయిదు అనువాకాలు ఉన్నాయి.

ఇందులో అగ్ని పాపాలను పోగొడతాడని, పవిత్రీకరిస్తాడని, ప్రకాశాన్ని కలిగిస్తాడని, ఆయనని ఆరాధించిన వారికి ప్రాణాలను, వాక్కును, ఆయుష్యాన్ని ఇచ్చి రక్షిస్తాడని, గుడ్డివాడు కూడా అతని

దయవల్ల చూడగల్గుతాడని చెప్పబడింది. అగ్ని మన కోరికల్ని తీరుస్తాడని, సిరిసంపదల్ని, శత్రువిజయాన్ని కలిగిస్తాడని చెప్పబడింది. యుద్ధానికి వెళ్ళేవాడు ఆదిత్యచరువును, పశువుల్ని కోరేవాడు ఇంద్రచరువును, బ్రహ్మవర్చస్సు కోరేవాడు, అన్నం కోరేవాడు, సంపద కోరేవాడు, పాపపీడితుడు, శత్రుభీతుడు, బందీ అయినవాడు, అశ్వమేధాది మహాయజ్ఞఫలం పొందగోరేవాడు, గ్రామాధిపత్యం కోరేవాడు, రాజ్యభ్రష్టుడు ఇంద్రుని ప్రీతికోసం ఏకాదశపురోడాశాల్ని నిర్వాపం చెయ్యాలి

అగ్ని సర్వదేవతాస్వరూపుడు, విష్ణువు సర్వయజ్ఞస్వరూపుడు. మానవులు అగ్నినేత్రంతోను, దేవతలు యజ్ఞనేత్రంతోను చూస్తున్నారు. ఘృతం తేజస్సు. నేత్రంకూడా తేజస్సే. తేజోరూపమైన నెయ్యివల్ల తేజోరూపమైన నేత్రం వృద్ధి చెందుతుంది.

సరిసమానులతో అభిప్రాయభేదం ఏర్పడ్డప్పుడు సంజ్ఞానేష్టిని ఆచరించాలి. యజమాని దాంతో ఇంద్రసదృశుడౌతాడు. సమానులు అతని పెద్దరికాన్ని అంగీకరిస్తారు. సమానుల్లో అతడు విశిష్టుడౌతాడు. బంగారం అగ్నిసంబంధం కలది. అందువల్ల బంగారం కావాలనుకొనేవాడు అగ్నిని ఆరాధించాలి. పశు సంపద కావాలనుకొనేవాడు ఇంద్రాగ్నులను యజించాలి. అగ్ని పశువుల నిస్తాడు. ఇంద్రుడు వాటిని వృద్ధిచేస్తాడు.

పెరుగు, తేనె, నెయ్యి, నీరు, వేయించిన బియ్యం వీటిని పంచద్రవ్యాలంటారు. ఈ అయిదు హవిస్సులు పశురూపాలు. ఈ పంచద్రవ్యరూపమైన హవిస్సు ప్రజాపతిదేవతాకం. పశువులు ప్రజాపతి

సంబంధమైనవి. కనుక ప్రజాపతి యజమానికి పశుసంపదను అనుగ్రహిస్తాడు.

ఈ కాండలో ప్రజాపతి తన ముప్పై ముగ్గురు కుమార్తెలను చంద్రునికిచ్చి వివాహం చేయడం, చంద్రుడు రోహిణిపైన విశేషానురాగం చూపించడం, అతడికి క్షయవ్యాధి రావడం చెప్పబడింది. ఆదిత్యదేవతాకమైన చరువును నిర్వాపంచేసి అతనికి రోగనివృత్తి కలిగించడం ఇందులో పేర్కొనబడింది. క్షయవ్యాధిని ఆదిత్యదేవతాకయాగంతో పోగొట్టవచ్చునని దీనిద్వారా తెలుస్తున్నది. భూలోకం కంటె అంతరిక్షం, దానికంటె స్వర్గలోకం పెద్దవని ఇందులో చెప్పబడింది.

మనుష్యులు అగ్నినేత్రంతో చూస్తున్నారు. కంటిరెప్ప వాలడం లేవడం వల్ల మానవుల దృష్టి అనిత్యమౌతున్నది. అగ్నికూడా జ్వలించడం, చల్లారడంవల్ల అనిత్యం. అనిత్యత్వ సామ్యంచేత మానవుడి దృష్టికి అగ్నికి సంబంధం ఉంది. దేవతలు సూర్యుని దృష్టితో చూస్తారు. సూర్యునిలాగా దేవతల దృష్టికూడా అనిమేషం. అందువల్ల దేవతల దృష్టి సూర్య సంబంధమైనది.

ఒకసారి ఇంద్రుడు వృత్రుని రూపాన్ని చూసి భయపడ్డాడు. అతని భయం పోగొట్టడానికి విష్ణువు తన రూపాన్ని మూడుగా విభజించాడు. వాటిలో ఒకరూపాన్ని భూలోకంలో; రెండవదాన్ని అంతరిక్షంలో మూడవదాన్ని ద్యులోకంలోను స్థాపించాడు.

మిత్రావరుణదేవతాకమైన "**ఆమిక్షాయాగం**" అమావాస్యనాడు చేయాలి. దేవతలకు ఆమిక్ష వశమైంది. ఈ యాగం చేసిన యజమానికి కూడా ఆమిక్ష వశమౌతుంది. దేవతల సాక్షాత్కారం కలుగుతుంది.

గొప్పగొప్ప పదవులు లభిస్తాయి. కోరినకోరికలు సిద్ధిస్తాయి. మానవులు స్తుతిప్రియులు, పితరులు నమస్కార ప్రియులు, దేవతలు యజ్ఞప్రియులు. ఆఘారం యజ్ఞానికి మకుటం లాంటిది. ధ్రువం యజ్ఞానికి ఆత్మ. సమిద్యాగంవల్ల ఈ లోకంలో ప్రతిష్ఠ లభిస్తుంది.

నీళ్లలోనే సత్యమున్నది. నీళ్ళలోనే సమస్త దేవతలున్నారు. గోవు పాదం పెట్టినచోట ఘృతం వెలువడింది. అందువల్ల అది ఘృతపది అయింది. పాలు చేపుతున్న గోవులు దూడల్ని వదిలిపెట్టవు. అలాగే సమస్త దేవతలు మమ్మల్ని వదిలిపెట్టకుండా ఉండాలి. ఇలాంటి ప్రార్థనలతో ఈ కాండ పూర్తవుతున్నది.

**మూడవ కాండ:**

ఈ కాండలో రథంతరసామ, బృహత్సామల ప్రశంస ఉంది. రథంతరసామ భూలోకరూపం, వర్తమానరూపమని, బృహత్సామ ద్యులోకరూపం, భవిష్యద్రూపమని పేర్కొనబడింది. రథంతరసామ పరిమిత శ్రేయోరూపం, బృహత్సామ అపరిమిత శ్రేయోరూపం. ప్రాతస్సవన, మాధ్యందినసవన, సాయంసవనాల ప్రస్తావం ఇక్కడ కనబడుతున్నది.

సినీవాలి చక్కని చేతులు కలది. అందమైన వేళ్ళు కలది. మానవుల్ని ప్రోత్సహించేది. యజ్ఞాచరణకు ప్రేరణనిచ్చేది. అలాంటి సినీవాలిని ఋత్విజులు హవిస్సులతో యజిస్తారు. చంద్రకళ కనిపించే అమావాస్యకు **"సినీవాలి"** అనిపేరు.

పొగలు కారుమబ్బుల్ని కలిగిస్తాయి. అవి నీటిని మోసుకొస్తాయి. రెక్కలు చాచినట్లు కన్పిస్తాయి. మబ్బులు సూర్యకిరణాలను కప్పేసి

ద్యులోకానికి ఎగురుతాయి. ఇవి పొగనుంచి పుడుతున్నాయి. నీటిని పీల్చుకుంటున్నాయి. నెయ్యిలాగా వర్షం కురిసి నేలను తడుపుతున్నాయి. ధూమం బంగారు రంగుగల అగ్నికేశాలలాగా ఉంది. అది మేఘమై, మేఘంలోని మెరుపై ఆకాశరూపంలో కనబడుతున్నది. అది గాలిలాగా వేగంగా కదులుతూ విద్యుత్కాంతుల్ని విరజిమ్ముతున్నది. ధూమరూపంలో ఉన్న ఆ మేఘం మాకోసం వర్షించాలి. పొద్దుపొడుపు కనిపించకుండా మబ్బులు దట్టంగా కమ్ముకురావాలి. పంటభూములు బాగా పండాలి. నీటికోసం తపించే భూములు సస్యశ్యామలాలు కావాలి.

అగ్ని పరిశుద్ధుడు. సముద్రంలో ఉంటాడు ఐశ్వర్యానికి భోగం లాంటివాడు. సముద్రంలో ఉండే అగ్నిని అంతట యజిస్తున్నాం. మేఘాలలాగా అందరు అతణ్ణి అపేక్షిస్తారు. సూర్యుడు కిరణకేశి. లోకాలన్నింటిని ప్రకాశింపజేస్తూ అతడు తెలుసుకుంటున్నాడు. రాత్రింబవళ్లు ఎడతెగక సాగిపోతున్నాయి. రాత్రిపూట సూర్యుడు నల్లని బట్ట కప్పుకొని దాటి పోతున్నాడు. రాత్రి అయిపోయిన తరువాత నల్లని బట్టను విడిచేసి తెల్లటిబట్టలు కట్టుకొని ఉదయిస్తున్నాడు.

మనం చేసే ద్యులోకానికి సంబంధించిన పాపాలనుంచి సూర్యుడు రక్షిస్తాడు. అంతరిక్షానికి సంబంధించిన పాపంనుంచి వాయువు రక్షిస్తాడు. పృథివికి సంబంధించిన పాపంనుంచి అగ్ని రక్షిస్తాడు. పితృదేవతలకు సంబంధించిన పాపాలనుంచి యముడు రక్షిస్తాడు. తోటి మానవుల విషయంలో చేసే పాపాలనుంచి సరస్వతి రక్షిస్తుంది. ద్యులోకానికి నమస్కారం. పృథివికి నమస్కారం.

సోమరసాన్ని సేవిస్తే దీర్ఘాయుష్యం, సుఖం, ధనసమృద్ధి, మంచి వర్చస్సు, మంచి సంతానం, కలుగుతుందని ఈ కాండలో చెప్పబడింది. "నాకు మేధను, సంతానాన్ని, తేజస్సును కలిగించ" మని అగ్నిని ప్రార్థించడం కనపడుతుంది.

"మనస్సులో తియ్యని ఆలోచనలుంచుతాను. మధురమైన ఫలాలనిచ్చే పనులనే చేస్తాను. తియ్యగా మాట్లాడతాను. తియ్యగా చెబుతాను. దేవతలను తియ్యగా స్తుతిస్తాను. మధురమైన నా వాక్కును దేవతలు రక్షించాలి. పితృదేవతలు ఆనందించాలి" అనే భావనలు ఈ కాండలో కనపడుతున్నాయి.

ఈ కాండలో ప్రకృతికి సంబంధించిన నిత్య సత్యాలు ప్రతిపాదించబడినాయి. నీరు నిజమైన ఔషధం. అది చికిత్స చేస్తుంది. నీటినుంచే ఓషధులు పుడుతున్నాయి. ఆ ఓషధులే మనకు అన్నంగా ఏర్పడుతున్నాయి. ప్రజలు ప్రజాపతిననుసరించి పుడుతున్నారు. ఋతమే సత్యం, యజ్ఞం. మేఘాల గర్భాలలో జలం ఏర్పడుతున్నది. అది ఆకాశంనుంచి అధోముఖంగా ఓషధులపై కురుస్తున్నది. సూర్యుడు చంద్రసంబంధమైన జలాలను తన కిరణాలతో పీలుస్తున్నాడు. అవే పర్వతంలాంటి మేఘంగా ఏర్పడుతున్నాయి. పూర్వం ద్యావాపృథువులు కలిసి ఉండేవి. వాయువు ఆ రెంటిని విడదీశాడని, అప్పుడు పుట్టిన ధ్వనే వాక్కు అయిందని ఇందులో చెప్పబడింది.

సకలప్రాణులకు అధిపతి అగ్ని. లోకపాలకులకు అధిపతి ఇంద్రుడు. పృథివికి అధిపతి యముడు. అంతరిక్షానికి అధిపతి వాయువు. దివికి అధిపతి సూర్యుడు. నక్షత్రాలకు చంద్రుడు, బ్రాహ్మణులకు బృహస్పతి, సత్యానికి మిత్రుడు, నీటికి వరుణుడు,

ప్రవాహాలకు అధిపతి సముద్రుడు, సామ్రాజ్యాలకు అధిపతి అన్నం. అలాగే సోముడు ఓషధులకు, సూర్యుడు అనుజ్ఞలకు, రుద్రుడు పశువులకు, త్వష్ట రూపాలకు, విష్ణువు పర్వతాలకు, మరుత్తులు గణాలకు అధిపతులని వాళ్లంతా లోకాన్ని రక్షించాలని ఈ కాండలో పేర్కొనబడింది.

**నాలుగవకాండ:**

ఈ కాండలో ఏడు ప్రపాఠకాలు, డెబ్బైరెండు అనువాకాలు ఉన్నాయి. అగ్ని స్తుతితో ఈ కాండ మొదలౌతున్నది. అగ్ని పూజ్యుడని, ఓషధులకు జఠరాగ్నిరూపుడని, సముద్రంలో పుట్టిన వాడని, వర్షప్రదాత అని స్తుతి చేయబడింది. అగ్ని నీళ్ళలోను, రాతిరాపిడివల్ల, అరణ్యాలలోను పుడతాడని వర్ణింపబడింది.

అగ్ని మానవుల మనస్సుకు, మేధకు ప్రేరణ కలిగిస్తాడని, వారి చిత్తాలకు, జ్ఞానానికి అతడే ప్రేరణ అని, వాక్కుకు, విధృతికి కూడా అతడే ప్రేరకుడని వివరించబడింది. మరణశీలుడైన మానవుడు విశ్వాత్మకుడు, జగన్నాథుడైన భగవంతుని అనుగ్రహాన్ని అర్థించాలని ఈ కాండ తెలియజేస్తున్నది.

అగ్ని మొదట ద్యులోకంలోను, రెండోసారి భూలోకంలోను, మూడవసారి సముద్రగర్భంలోను జన్మించాడని, మూడు జన్మల్లోను మానవుల్ని అనుగ్రహించాడని, కనుక మానవులు అగ్నిని ప్రజ్వలింపజేసి జీవితాంతం అతనిని ఆరాధించాలని ఇందులో చెప్పబడింది. అగ్నిహోత్రుడు ద్యులోకంలో తేజోరూపంలోను, భూలోకంలో యజ్ఞరూపంలోను, సముద్రంలో బడబానలంగాను, మానవుల్లో జఠరాగ్నిగాను ఉన్నట్లు పేర్కొనబడింది.

ఈ కాండలో వ్యవసాయానికి సంబంధించిన ప్రస్తావన ఉంది. రైతులు దేవతల సుఖం కోరేవాళ్లని, కర్షకులు తోలుతాళ్లకు బొక్కెనలు కట్టి ఊటబావుల్లో నీళ్లు తోడేవాళ్లని, నాగళ్లతో పొలాలు దున్నేవాళ్లని, ఎద్దులను ఎక్కువ కష్టపెట్టకుండా తోలేవాళ్లని ఇందులో చెప్పబడింది. పర్జన్యుడు మధురజలాన్ని వర్షించాలని, నాగేటిచాలు, సూర్య-వరుణ-ఇంద్ర-అగ్ని-పూష-ఓషధులు ప్రజల కోర్కెలను తీర్చాలని ఆకాంక్షించేవారు. నాగేటిచాలును మధుర ఘృతంతో తడిపేవాళ్ళు. బలాన్నిచ్చేనీటితో చాళ్లను నింపేవాళ్లు.

ఆనాటి ప్రజలు ఓషధులను తల్లులుగా భావించేవాళ్లు. ఓషధులు గుఱ్ఱాలలాగా జయించే స్వభావంకలవి. గుఱ్ఱాలు యుద్ధాల్లోను, పంటలు పెరగడంలోను గెలుపు కలిగిస్తాయి. ఓషధి దేవతలు తల్లుల్లాగా మానవులకు అన్నం పెట్టి పోషిస్తున్నాయి. ఆకలి తీరుస్తున్నాయి. రాజులంతా కలసి శత్రువులపై యుద్ధానికి వెళ్లినట్లు ఓషధులు రోగాలపై యుద్ధం చేస్తాయి. రోగాలను పోగొడతాయి. ఓషదులు ఆకులు కలవి, ఆకలి తీర్చేవి. రోగంలాంటి ఆకలిని దూరం చేస్తాయి. "మేం ఎవరిలో ప్రవేశిస్తే ఆ జీవి నశించడు" అని దివినుంచి భువికి దిగివచ్చే జలబిందురూపాలైన ఓషధు లంటున్నాయి. ఆకాశంనుండి భూమిపైన పడిన వర్షబిందువులే ఓషధులుగా పుడుతున్నై. నీటిలో ఓషధులన్నీ ఉన్నాయి.

ఆనాటి వారు సుమధురమైన ప్రకృతిని ఇలా భావన చేశారు. యజ్ఞాన్ని కోరేవారికి "వాయువులు మధురరసాన్ని అంతట చిమ్ముతున్నాయి. ఔషధులు మధురరసంతో కూడినవి కావాలి. రాత్రి మధురమైంది కావాలి. ప్రభాతాలు మధురమైనవై సుప్రభాతాలు

కావాలి. భూమిపైన ఉండే రజస్సు మధురం కావాలి. పితృ స్థానీయమైన దివి మధురమైంది కావాలి. మహనీయాలైన ద్యావాపృథువులు మాకు యజ్ఞఫలాన్ని సమకూర్చాలి."

ఈ కాండలో ఐదోప్రపాఠకంలో "శతరుద్రీయం" ఉంది. దీన్నే "నమక" మంటారు. ఈశ్వరుని విశ్వరూపభావన ఇందులో సాక్షాత్కరిస్తుంది.

ఆరో ప్రపాఠకంలో విశ్వసృష్టికి సంబంధించిన జిజ్ఞాస కనబడుతుంది. "పరమాత్మ ద్యావాపృథువులను సృష్టించినప్పుడు ఎక్కడ నిలబడ్డాడు? ఏది ఉపాదానమైంది? సర్వద్రష్ట విశ్వకర్మ భూమిని ఏకాలంలో సృష్టించాడు? ఎప్పుడు ద్యావాపృథువుల్ని ఆచ్ఛాదించాడు? పరమేశ్వరుడు ఏ అరణ్యంనుంచి ఎలాంటి చెట్లను తెచ్చి ఈ ద్యావాపృథువుల్ని నిర్మించాడు? అరణ్యమేది? ఆ చెట్లేవి? విద్వాంసులారా! వాటిని గురించి ఆలోచించండి. అడగండి పరమేశ్వరుడు భువనాలను ధరించినప్పుడు ఎక్కడ నిలబడ్డాడు? ఆవిషయాన్ని కూడా అడగండి." అని పేర్కొన బడింది.

ఈ కాండలో పితృదేవతల ప్రస్తావం కూడా ఉంది. పితృ దేవతలు ఆపదలో సాయం చేస్తారని, గంభీరులని, విచిత్రమైన సేనలు కలవాళ్లని, బాణబలం కలవాళ్లని, ఎవరికి లొంగని వీరాధివీరులని, అంతట విస్తరించినవాళ్లని, అనుగ్రహం కలవాళ్లని, వేదపరులని, శాంతమూర్తులని చెప్పబడింది. అశ్వవర్ణనం అశ్వాల విశిష్టత కూడా ఇందులో వివరింపబడింది.

ఏడో ప్రపాఠకంలో **"చమకం"** ఉంది. పంచభూతాలు, అష్ట దిక్కులు, ఆరు ఋతువులు, సమస్త ప్రకృతి మాకు మంచిని కలుగజేయాలనే శుభకామన ఇందులో ప్రధానాంశం.

"ఈ భౌతికాలైన సిరిసంపదలకు మనం యజమానులం కాదు. కేవలం ధర్మకర్తలం మాత్రమే. యజమానుడు పరమేశ్వరుడే." ఈ భావనతో మనం జీవించాలి. అప్పుడు పరస్పరం హెచ్చుతగ్గులు గాని, ధనికుడు, దరిద్రుడనే భేదంగాని మనమధ్యలో రాదు. అందరిలోను స్నేహసౌహార్దాలకు కొరత ఉండదు. ఇలాంటి భావాలతో ఈ వేదం యజ్ఞమయ, స్నేహమయ జీవనాన్ని సాగించమని ప్రబోధిస్తోంది.

**ఐదవ కాండ:**

ఈ కాండలో ఏడు ప్రపాఠకాలు, నూట ఇరవై అనువాకాలు ఉన్నాయి.

ఈ కాండలో అశ్వమేధవిధి నిరూపించబడింది. ఒకప్పుడు చతుర్ముఖ బ్రహ్మ కనుగుడ్డు ఏదో వ్యాధితో ఉబ్బిపోయింది. అది భూమిపైపడి అశ్వంగా ఆవిర్భవించింది. అది పైనుంచి పడటంవల్ల దానినుంచి పుట్టిన ప్రాణికి "అశ్వమ"నే పేరేర్పడింది. దేవతలు దీనికి ప్రతిక్రియ ఏమిటని ఆలోచించి అశ్వమేధయాగాన్ని ఆచరించి బ్రహ్మ నేత్రాన్ని సర్దుబాటు చేయడం జరిగింది. ఈ అశ్వమేధ యాగానుష్ఠానంవల్ల ఉపపాతకాలు, మహాపాతకాలు అన్నీ నశిస్తాయి. అందువల్లనే ఇప్పుడు దేవతలుగా ఉన్నవాళ్లు ఇంతకుముందు

మనుష్యజన్మలో ఈ అశ్వమేధయాగాన్ని ఆచరించి గోవధరూపమైన ఉపపాతకాన్ని బ్రహ్మహత్యారూపమైన మహా పాతకాన్ని పోగొట్టుకున్నారని చెప్పబడింది.

"భగవంతుడా! నావాక్కు ముఖంలో స్థిరంగా ఉండాలి. నాసికారంధ్రాల్లో ప్రాణం సుస్థిరంగా ఉండాలి. కనుగుడ్లలో చక్షురింద్రియం స్థిరంగా ఉండాలి. చెవులలో శ్రోత్రేంద్రియం స్థిరంగా ఉండాలి అనేకరకాల పనులుచేసే శక్తి నా భుజాల కుండాలి. నా తొడలకు నడిచే శక్తి స్థిరంగా ఉండాలి. అలాగే అన్ని అవయవాలు హింసలేనివై ఉండాలి. నా శరీరం హింసా రహితంగా ఉండాలి. నా సాష్టాంగదండప్రణామాన్ని అందుకొని నీవు నన్ను హింసించకుండా ఉండు!" ఇలాంటి ప్రార్థనలు ఈ కాండలో ఉన్నాయి.

"మనం చేసిన పాపాలన్నిటిని నశింపజేసి వ్యాధులవల్ల, దొంగలవల్ల బాధలేకుండా నూరు సంవత్సరాలు సుఖంగా జీవించేటట్లు ఇంద్రుడొక్కడే చేయగలడు. అందువల్ల ఆయనకు నమస్కరిస్తున్నాను" అనే ప్రార్థన ఇందులో కనబడుతున్నది.

**ఆరవకాండ:**

ఆరోకాండలో ఆరు ప్రపాఠకాలు, అరవై ఆరు అనువాకాలు ఉన్నాయి.

రాజులు శత్రువులపైన దండయాత్రలు చేస్తుంటారు. విజయం సంపాదించడానికి యుద్ధరంగంలో ప్రవేశించేముందే వాళ్లు **"ఉపసద్హోమం"** చేసేవాళ్లు. దేవతలు ఉపసద్హోమంచేసి అగ్ని

దేవతాకమైన, సోమదేవతాకమైన, విష్ణుదేవతాకమైన బాణాలను ప్రయోగించి రాక్షసుల పురభేదనం చేశారు. పురాలను .భేదించేవి కనుక ఈ ఆహుతులు "**ఉపసత్తు**"లని పిలువబడినట్లు ఈ కాండ వివరిస్తున్నది.

కొందఱు వ్యక్తుల్లోను, కొన్ని వస్తువుల్లోను మన అదృష్టాన్ని పెంచే శక్తి ఉంటుంది. అలాంటివాటిల్లో అగ్ని-ఉదకంతోపాటు-బ్రాహ్మణుడు కూడా ప్రశస్తమైన వాడు అందువల్లే రోగులను పరీక్షించి చికిత్స చేసేటప్పుడు వైద్యుడు దగ్గఱలో నిప్పును నీళ్లను బ్రాహ్మణ్ణీ ఉంచుకోవడం మంచిదని ఈ కాండ తెలియజేస్తున్నది అగ్నిని దగ్గఱ పెట్టుకొని చికిత్స చేయడంవల్ల అశ్వినీదేవతల అనుగ్రహం తప్పక కలుగుతుందని ఆనాటివారి నమ్మకం.

**ఏడవ కాండ:**

ఏడో కాండలో ఐదు ప్రపాఠకాలు, నూట ఏడు అనువాకాలు ఉన్నాయి.

వసంతాది ఋతువులు భిన్నంగా ఏర్పడక ముందు కాల స్వరూపం సంవత్సరాత్మకంగా ఒక్కటిగా ఉండేది. ప్రజాపతి ఋతువులను సృష్టించాలని సంకల్పించి పంచరాత్రయాగాన్ని అనుష్ఠించాడు. తరువాత వసంతాది ఋతువులను అయిదింటిని సృష్టించాడు. ప్రవాహణుని కొడుకు ప్రావాహణి. ప్రావాహణి అయిన బబరుడు పంచరాత్రయాగాన్ని అనుష్ఠించి సభలో చక్కగా మాట్లాడి పండితులచే ప్రశంసింపబడి "**వాచస్పతి**" అనే బిరుదును

సంపాదించాడని ఈ కాండ పేర్కొంటున్నది. ఈ పంచరాత్ర యాగంలో 1. (త్రివృత్ స్తోమం) అగ్ని ష్టోమం 2. పంచదశస్తోమం 3. (సప్తదశస్తోమం) ఉక్థ్యం 4. (పంచవింశేన ఏకేన స్తోమేన) అగ్నిష్టోమం 5. విశ్వజిత్ అనే అయిదు యాగాలు అయిదు రోజులలో ఆచరింపబడతాయని చెప్పబడింది.

ఈ కాండలో కూడా అశ్వమేధయాగస్వరూపం వివరింప బడింది షడ్రాత్ర, సప్తరాత్ర, అష్టరాత్ర, నవరాత్ర, దశరాత్ర, ఏకాదశరాత్ర, ద్వాదశరాత్రాది యాగాలు సంవత్సరసత్రం సవిస్తరంగా చెప్పబడినాయి.

శతతంతువీణ ఈ కాండలో పేర్కొనబడింది. అత్తికొయ్యతో చేసిన వీణాదండం అతిమథనం చేసిన పదిదారాలను తిరిగి ఒక్కొక్కదాన్ని అతిమథనం చేయడంవల్ల మౌంజిదారాలు నూరు అవుతాయి నూరు దారాలుకల వాణాన్ని శతతంతువీణ అంటారు పది ఇంద్రియాలు పదినాడులతో ప్రవర్తించడం వల్లనే శతసంఖ్య ఏర్పడుతున్నది. దీన్నే సాంకేతికంగా ఇక్కడ శతతంతువీణ అని పేర్కోవడం జరిగింది.

- యు.వి.ఆర్.

# ఆర్షవిజ్ఞానసర్వస్వము

## 3 మూడవ పరిచ్ఛేదం: శుక్లయజుస్సంహిత

### 3.1 పరిచయం

యజుర్వేదంలో ఒక ప్రధానశాఖ శుక్లయజుశ్శాఖ. కృష్ణ యజుర్వేదంలాగా ఇదికూడా యజ్ఞయాగాదులనాచరించడానికి ఉపయోగపడుతుంది (యజుశ్శబ్దనిర్వచనం చూ. పే. 134). శుక్లయజు శ్శాఖ ఆదిత్యసంప్రదాయానికి చెందింది.

**శుక్లయజుస్సంహిత:**

ఈ సంహితలో యజ్ఞక్రియల్లో ఉపయోగింపబడే మంత్రాలు, అర్థవాదాలు మాత్రమే ఉన్నాయి. ఇందులో కృష్ణయజుస్సంహితలో లాగా బ్రాహ్మణభాగాలు కలిసి ఉండవు. అవి వేఱే బ్రాహ్మణ గ్రంథాలుగానే ఉన్నాయి. అందువల్ల ఇందులోని విషయాలు విడివిడిగా ఉండి పాఠకులకు బుద్ధివ్యామోహాన్ని కలిగించకుండా విశదంగా ఉంటాయి. కనుకనే ఈ వైశద్యాన్ని తెలియచేసే **'శుక్ల'** పదాన్ని చేర్చి దీన్ని **'శుక్లయజుర్వేదమని'** అన్నారు.

ఈ సంహితకు **'మాధ్యన్దినపాఠం' 'కాణ్వపాఠ'** మని రెండు పాఠాలు ఉన్నాయి. ఈ రెండింటికీ పెద్ద తేడా లేదు. గద్యాత్మకమైన

అర్థవాదభాగాలను పఠించడంలో మాత్రం కొద్ది తేడా కనిపిస్తున్నది. ఇందులో 'వాజసనేయిసంహిత' అని పిలువబడేది మాధ్యన్దినపాఠం.

ఈ వాజసనేయిసంహితలో సగభాగం పద్యాత్మకమైంది. అర్థవాదరూపమైన మిగతా సగం గద్యాత్మకమైంది. అందులో సుమారు 700 మంత్రాలు ఋగ్వేదంనుంచి తీసుకోబడ్డాయి. ఇవి సుమారు ఆ సంహితలో 4వ వంతు మంత్రాలై ఉంటాయి.

**దేశం:**

దేశం విషయంలో కృష్ణ శుక్ల యజుశ్శాఖలకు పెద్దగా తేడా లేదు. **(చూ. పే.135).**

**కాలం:**

కృష్ణయజుస్సంహిత ఏర్పడ్డ కొంతకాలానికి దానిలో బుద్ధివ్యామోహం కలిగించే బ్రాహ్మణభాగాలను తీసివేసి కేవలం మంత్రార్థవాదభాగాలతో ఈ శుక్లయజుస్సంహితను రూపొందించి ఉంటారు. కాబట్టి ఇది కృష్ణయజుస్సంహితకు తరువాత ఏర్పడిందేనని చెప్పవచ్చు

**విషయం:**

శుక్ల-కృష్ణశాఖల్లో ప్రతిపాదింపబడ్డ విషయాలు సమానమైనవే.

ఋగ్వేదంలో అంతగా ప్రాధాన్యంలేని ప్రజాపతికి ఈ వేదంలో చాలా ప్రాధాన్యత వచ్చింది. రుద్రునికి, విష్ణువుకు ఋగ్వేదంకంటే ఇందులో ప్రాధాన్యత కనబడుతుంది. విష్ణువే యజ్ఞమనే భావం ఈ సంహితలో బాగా పెరిగింది. తరువాత లౌకికవాఙ్మయంలో ప్రస్తావింపబడ్డ సురలోక సుందరీమణులైన అప్సరసలు ఇందులో చమత్కారంగా ప్రశంసింపబడ్డారు.

మానవులందఱు బలవంతులు, ఓజస్వంతులు, తేజశ్శాలులు కావాలని యజుర్వేదం ఉపదేశిస్తుంది[1]. సమాజంలో ప్రతివాడు సరస్వతిని- అంటే విద్యను, ఇడను- అంటే రాష్ట్రాన్ని, భారతిని- అంటే సంస్కృతిని ఈ మూడు శక్తులను పెంచుకోవాలని ఈ వేదం ఉపదేశిస్తున్నది[2].

**ప్రచురణ:**

మహీధరుని భాష్యంతో శుక్లయజుశ్శాఖకు సంబంధించిన వాజసనేయిసంహిత ప్రథమభాగం, **1852** లో బెర్లిన్‌లో ఏ. వేబర్ **(A. Weber)** ప్రకటించాడు. దీనికి ఆర్.టి.హెచ్. గ్రిఫ్ఫిత్ **(R. T. H. Griffith)** చేసిన ఆంగ్లానువాదం **1899** లో బెనారస్‌లో ప్రకటించబడింది.

**ఉపవేదం:**

దీనికి ఉపవేదం ధనుర్వేదం. (వివరాలకు చూ. పే. **137**).

**- ఎస్.బి.ఆర్.**

1. తేజో౽సి తేజో మయి ధేహి వీర్యమసి వీర్యం మయి ధేహి ।
బలమసి బలం మయి ధేహ్యోజోస్యోజో మయి ధేహి ।
మన్యురసి మన్యుం మయి ధేహి సహో౽సి సహో మయి ధేహి ॥
శు.సం. **19-9.**

2. తిస్రో దేవీర్హవిషా వర్ధమానా ఇన్ద్రం జుషాణా జనయో న పత్నీః ।
అచ్ఛిన్నం తన్తుం పయసా సరస్వతీడా దేవీ భారతీ విశ్వతూర్తిః ॥
శు.సం.**20-43.**

## 3.2 శాఖలు - విభాగం

### మొత్తం శాఖలు:

శుక్లయజుస్సంహితలోని శాఖలను గురించి ఎన్నో మతభేదాలు కనబడుతున్నాయి. ప్రతిజ్ఞాపరిశిష్ట-వాయు (6-61) బ్రహ్మాండ పురాణాల్లోను (6-35), చరణవ్యూహాల్లోను, సాయణభాష్యంలోను ఎన్నో తేడాలు గల పేర్లు చెప్పబడ్డాయి. కాని ఈ సందర్భంలో ప్రతిజ్ఞా పరిశిష్టంలో ఇచ్చిన విభాగం బాగున్నదనిపిస్తుంది దాన్ననుసరించి 1. జాబాల 2. బౌధేయ 3. కాణ్వ 4. మాధ్యందిన 5. శాపేయ 6. తాపాయనీయ 7. కాపోల 8. పౌండ్రవత్స 9. ఆవటిక 10. పరమావటిక 11. పారాశర (రీయ) 12. వైనతేయ (వైరేయ) 13. వై(వే)ధేయ 14. కౌన్తేయ (కాత్యాయనీయ) 15. బైజావాపభేదంతో 15 ప్రధానశాఖ లున్నాయని, ఇవిగాక ఔఢేయ, గాలవశాఖలను కూడ కలిపి 17 శాఖ లంటారు కొందఱు ఇవే పేర్లు ఇతరగ్రంథాల్లో కొంచెం మార్పుతో పేర్కొనబడ్డాయి. వీటిలో కొన్నింటికి ఉపశాఖలు కూడా ఉన్నాయి

పైన పేర్కొనబడ్డ జాబాలశాఖకు 26 ఉపశాఖలున్నాయి. గాలవశాఖను ఒప్పుకొనే వారి పక్షంలో దాని ఉపశాఖలు ఇరవైనాలుగు

### ఇప్పుడు దొరికేవి:

శుక్లయజుస్సంహితలో ప్రస్తుతం దొరికేవి రెండు శాఖలు. 1. కాణ్వశాఖ 2. మాధ్యందినశాఖ. ఈ రెండుశాఖలో కాణ్వశాఖ దక్షిణభారతంలోను మాధ్యందినశాఖ ఉత్తరదేశంలోను ప్రచారంలో ఉన్నది.

### సంహితావిభాగం:

కాణ్వసంహితలో 40 అధ్యాయాలు, [redacted] అనువాకాలు, 2086 మంత్రాలు ఉన్నాయి.

మాధ్యందిన సంహితలో 40 అధ్యాయాలు 303 అనువాకాలు, 1975 మంత్రకండికలు, 3,988 మంత్రాలు, 29,625 శబ్దాలు, 88,875

అక్షరాలు ఉన్నాయి. ఇలా మాధ్యందిన సంహితకంటే కాణ్వసంహితలో 111 మంత్రాలు, 25 అనువాకాలు ఎక్కువగా కనపడతాయి.

| అధ్యాయం | మంత్రకండికలు | మంత్రాలు | అధ్యాయం | మంత్రకండికలు | మంత్రాలు |
|---|---|---|---|---|---|
| 1 | 31 | 137 | 21 | 61 | 61 |
| 2 | 34 | 95 | 22 | 34 | 267 |
| 3 | 63 | 79 | 23 | 65 | 83 |
| 4 | 37 | 82 | 24 | 40 | 40 |
| [redacted] | 43 | 150 | 25 | 47 | 50 |
| 6 | 37 | 117 | 26 | 26 | 62 |
| 7 | 48 | 140 | 27 | 45 | 45 |
| 8 | 63 | 150 | 28 | 46 | 50 |
| [redacted] | 40 | 117 | 29 | 60 | 60 |
| 10 | 34 | 139 | 30 | 22 | 177 |
| 11 | 83 | 122 | 31 | 22 | 22 |
| 12 | 117 | 129 | 32 | 16 | 16 |
| 13 | 58 | 132 | 33 | 97 | 97 |
| 14 | 31 | 165 | 34 | 58 | 58 |
| 15 | 65 | 136 | 35 | 22 | 28 |
| 16 | 66 | 280 | 36 | 24 | 24 |
| 17 | 99 | 106 | 37 | 21 | 55 |
| 18 | 77 | 89 | 38 | 28 | 75 |
| 19 | 95 | 120 | 39 | 13 | 116 |
| 20 | 90 | 100 | 40 | 17 | 17 |
| | 1,211 | 2,585 | | 764 | 1,403 |

మొత్తం [redacted] అధ్యాయాలు, 1975 మంత్రకండికలు, 3,988 మంత్రాలు.

- ఎస్.బి.ఆర్.

## 3. 3 శాఖలు - దేశవ్యాప్తి

శుక్ల యజుశ్శాఖలు 15 ఉన్నా అందులో ముఖ్యమైనవి కాణ్వ-మాధ్యందినశాఖలు. ఇందులో మాధ్యనినశాఖకే వాజసనేయిసంహిత అని పేరు. దీనికి ప్రవర్తకుడు వాజసనేయ యాజ్ఞవల్క్యుడు. ఇతడు పశ్చిమ భారతదేశంలోని సౌరాష్ట్రంలో ఉన్న ఆనర్తరాజ్యంలో ఉండేవాడు. దీనికి రాజధాని చమత్కారపురం ఈ పురానికి సమీపంలో యాజ్ఞవల్క్యుని ఆశ్రమం ఉండేదని చారిత్రికులు చెబుతారు. జనకునిపై గల ప్రీతితో ఇతడు మిథిలలో కూడా ఉండేవాడు. కనుక ఇతని శిష్యులద్వారా మొదట సౌరాష్ట్ర-మిథిలా దేశాల్లో ఈ శాఖ ప్రచారంలోకి వచ్చి ఉండవచ్చు.

తరువాత ఈ శాఖ చాలా విస్తృతమైన వ్యాప్తిలోకి వచ్చింది ప్రస్తుతం కాశ్మీర్, పంజాబ్, రాజపుత్రస్థాన్, గుజరాత్, మహారాష్ట్ర, మద్రాస్, బెంగాల్. బీహార్ మొ॥ ప్రాంతాల్లో శుక్లయజుశ్శాఖ బాగా వ్యాప్తిలో ఉన్నది.

కాణ్వశాఖ దక్షిణదేశంలో ఎక్కువగా వ్యాపించింది. కాణ్వ శాఖకు పాంచరాత్రానికి దగ్గఱ సంబంధం ఉంది[1]. పాంచరాత్రంలో ప్రస్తావింపబడ్డ ఏకాయనశాఖ కాణ్వశాఖేనని కొందఱంటారు. కాని ఏకాయన వేదం ఋగాది విభాగానికి ముందున్న వేదస్వరూపమేనని పాంచరాత్రికులు భావిస్తున్నారు. పాంచరాత్రాగమంలో నాలుగు వేదాల్లోని మంత్రాలు ఉండటం ఈ భావానికి సాహాయ్యకారి. ఈ కాణ్వశాఖకు ప్రవర్తకుడు కణ్వుడు. మధ్యభారతంలో ఉన్న మాలినీ నదీతీరంలో ఈయన ఆశ్రమం ఉండేది.

ఈయన ప్రచారంలో ఈ శాఖ ఉత్తరభారతంకంటే దక్షిణ భారతంలో ఎక్కువగా వ్యాపించింది.

- ఎస్.బి.ఆర్.

1. చూ. జయా. I. 109. 16.

## 3. 4 పాఠవిశేషాలు

శుక్లయజుర్వేదానికి సంహితా-పద-క్రమపాఠాలతో బాటు మిగత ఎనిమిది వికృతిపాఠాలు కూడా ఒకప్పుడు ప్రచారంలో ఉండేవి. కాని కాలక్రమేణ మొదటి-చివఱ వికృతులైన జటా-ఘన పాఠాలు తప్ప ఇతరపాఠాలు బహుళంగా ప్రచారంలో లేవు. ఉత్తరభారతంలో ప్రసిద్ధిపొందిన ఈ వేదంలో జటాపాఠులు, ఘనపాఠులు అక్కడక్కడ మనకు లభిస్తున్నారు. మిగత పాఠాలు విని ఆదరించేవాళ్లు లేక దాదాపు అంతరించిపోయాయి.

పాఠాలుండటం అంతరించిపోవడమనే విషయం కేవలం అధ్యయనం చేసేవాళ్లమీద ఆధారపడి ఉంటుంది. వాళ్ల జీవితా లెప్పుడు వేదాధ్యయనం మీద ఆధారపడినవో, ప్రజలాదరించే ప్రక్రియలను నేర్చుకోవడం, ప్రదర్శించడం పరిపాటిగా ఏర్పడింది. కనుకనే ఇలాంటి అపురూపమైన వైదికప్రక్రియలు ఎన్నో కాలగర్భంలో కలిసిపోతున్నాయి. ఇప్పటికైనా జాగ్రత్తపడకపోతే ముందు ముందు మనవారసులకు ఈ పేర్లనుగూడా అందించలేని దుస్థితిరావడం తథ్యమనిపిస్తుంది.

**- ఎస్.బి.ఆర్.**

## 3. 5 మంత్రద్రష్టలగు మహర్షులు

శుక్లయజుర్వేదంలో యజ్ఞాల కర్మకలాపాన్ని నిర్దేశించే వచన భాగాలు (యజుస్సులు), ప్రార్థనలు (ఋక్కులు) ఉన్నాయి. ఇవి ఛందోబద్ధాలై మంత్రాలనబడుతూ ఉత్తమసాహిత్యశిల్పంతో నిండి ఉన్నాయి, ప్రతిమంత్రానికి ద్రష్టయైన ఋషి, ఛందస్సు, అధిదేవత ఉన్నారు. ఈ విషయాలను కాత్యాయనుని 'సర్వానుక్రమణి' చక్కగా చర్చించింది. మంచి సంప్రదాయంచేత రక్షింపబడి, మనకు లభించిన ఈ అనుక్రమణి ప్రామాణికమైంది.

ఋషి అతీంద్రియద్రష్టయైన ప్రజ్ఞాశాలి అంటే సామాన్య మానవునికి ఏవిధంగాను కనిపించని మంత్రాలనబడే శబ్దరాశిని జ్ఞాననేత్రంద్వారా సందర్శించి, వెల్లడించిన మహామహుడు. ఈ శుక్లయజుస్సంహితలోని మంత్రాలను దర్శించి, వెల్లడించిన ఋషుల సంఖ్య 221. వీళ్లల్లో ఏకకుటుంబీకులు, సగోత్రీకులు, గురుశిష్యులు జంటకవులు, స్త్రీలు కూడా ఉన్నారు. ఈ ఋషులందరు దార్శనికులైన మహాకవులు. వారి ప్రతిభ సర్వతోముఖమైంది వారికి సత్యాన్ని సూటిగా స్పష్టంగా దర్శించే శక్తి, దాన్ని సమగ్రంగా వర్ణించే సామర్థ్యం ఉంది. వారికి మార్గదర్శకమైన రచనలు లేవు. పూర్వుల వల్ల, పూర్వరచనల వల్ల ఏర్పరచుకొన్న అభిప్రాయాలూ లేవు స్వీయప్రతిభతో సత్యాన్ని, దేవతలను సందర్శించి, వర్ణించి కవులయ్యారు. వారు ద్రష్టలుగ, మహర్షులుగ గౌరవింపబడుతున్నారు.

**'కవిర్మనీషి పరిభూః స్వయంభూః'** అని పరమాత్మపరంగా ఉన్న కవిశబ్దం, ఆయన సాక్షాత్కారం పొందిన ఋషిపరంగా రూఢిని పొందింది. వేదవాఙ్మయంలో ఋషులే కవులు. కాబట్టి **'కవయః క్రాంతదర్శినః'** (కవులు దూరపు దృష్టి గలవారు). **'నా నృషిః కురుతే**

**కావ్యమ్'** (ఋషి కానివాడు కావ్యాన్ని రచించలేడు) అనే లోకోక్తులు ఏర్పడ్డాయి.

**1. ప్రజాపతి :**

శుక్లయజుస్సంహితలో అధిక సంఖ్యాకాలైన మంత్రాలను దర్శించిన మహర్షి ప్రజాపతి. ఇతడు ఈ సంహితలో 1401 మంత్రకండికలను దర్శించి **'అమితర్షి'** (ఎక్కువ మంత్రాలను దర్శించిన ఋషి)గా గౌరవింపబడుతున్నాడు. (చూ. పే. 145)

**2. దధ్యంగుడు :**

ఈ సంహితలో 103 మంత్రకండికలను దర్శించిన ఋషి దధ్యంగుడు. ఇతని తండ్రి అథర్వుడు. ఒకసారి ఇంద్రుడు ఇతనికి **'మధువిద్య'**ను నేర్పి ఇతరులెవ్వరికైనా ఉపదేశిస్తే తల పగిలిపోతుందని చెప్పాడు. ఆసమయంలో అశ్వినీదేవతలు మధువిద్యను నేర్చుకోదలచి, దధ్యంగుని తలను నరికి గుఱ్ఱపుతలను అతికించి మధువిద్యను నేర్చుకొన్న తరువాత తిరిగి తలను అతికించారు.

**3. యాజ్ఞవల్క్యుడు :**

శుక్లయజుస్సంహితకు ప్రవర్తకుడు యాజ్ఞవల్క్యమహర్షి. ఇతడు ఈ సంహితలో 81 మంత్రకండికలను దర్శించాడు. ఈ మహర్షి వాజసని, బ్రహ్మరాతుడు అనే నామాంతరాలు కల దేవరాతుని కుమారుడు. యాజ్ఞవల్క్యుడు పైలుని శిష్యుడైన బాష్కలుని వల్ల ఋగ్వేదాన్ని, జైమిని వల్ల సామవేదాన్ని, మహాముని ద్వారా అథర్వవేదాన్ని, వైశంపాయనుని వల్ల యజుర్వేదాన్ని అధ్యయనం చేశాడు. విధివైపరీత్యంచేత యాజ్ఞవల్క్యుడు గురువైన వైశంపాయనునితో వివాదపడి యజుర్వేదాన్ని పరిత్యజించాడు. తరువాత ఈ మహర్షి

ఉగ్రతపస్సుచేసి సూర్యుణ్ణి సంతోషపఱిచాడు. సూర్యుడు వాజి (అశ్వ) రూపంలో ప్రత్యక్షమై ఈయనకు శుక్లయజుర్వేదాన్ని బోధించాడు. ఇతడు వాజసని కుమారుడు కావటంచేత ఈ శాఖకు **'వాజసనేయి సంహిత'** అనే పేరు కలిగింది. యాజ్ఞవల్క్యుడు రాజర్షియైన జనకునికి సమకాలికుడు జనకునిచేత ఇతడు చాలా గౌరవాలను పొందాడు.

**4. పరమేష్ఠి:**

ఈయన ఈ సంహితలో 59 మంత్రకండికలను దర్శించాడు (చూ. పే.**145**)

**5 . నారాయణుడు:**

ఈ సంహితలో **44** మంత్రకండికలకు ద్రష్ట ఈ మహర్షి (చూ. పే.**147**).

**6. వరుణుడు:**

వాజసనేయి సంహితలో **35** మంత్రకండికలను ఈ మహర్షి దర్శించాడు (చూ పే. **147**)

**7. బృహస్పతి:**

ఈ సంహితలో **34** మంత్రకండికలకు ద్రష్ట బృహస్పతి. ఇతడు అంగీరసపుత్రుడు. కొన్ని పురాణాలు బృహస్పతి తల్లి **'వసుద'** అని, ఇంకొన్ని **'శ్రద్ధ'** అని పేర్కొంటున్నాయి. బృహస్పతి అగ్ని పుత్రుడుగా కూడా భాగవతంలో చెప్పబడ్డాడు. ఇతడు దేవగురువు. తార ఇతని భార్య. వానరజాతిలోని తారుడు బృహస్పతి పుత్రుడే (రామా. బాల.). ఉత్తరరామాయణంలో కుశధ్వజుడు బృహస్పతి పుత్రుడుగా పేర్కొనబడ్డాడు. దేవీభాగవతం ఇతణ్ణి శుకమహర్షికి గురువుగా చెబుతుంది. దేవతల ప్రతిచర్య వెనుక బృహస్పతి ఆలోచన తప్పకుండా ఉంటుంది. ఇతడు పదునైన బుద్ధి కలవాడు.

**8. వివస్వతుడు:**

ఈ సంహితలో 28 మంత్రకండికలను ఇతడు దర్శించాడు. ఇతడు అదితి కశ్యపుల పుత్రుడు. వివస్వతుని భార్య విశ్వకర్మ పుత్రికయైన సంజ్ఞ. ఇతని పుత్రుడే వైవస్వతమనువు. సూర్యవంశం ఇతనితోనే ప్రారంభమయింది. యమ-యమిలు కూడా ఇతని సంతానమే. వివస్వతుడు వేదాల్లో చెప్పినరీతిగా ఒకసారి యజ్ఞం చేసి, కశ్యపప్రజాపతికి దక్షిణగా దక్షిణదిక్కును ఇచ్చినందువల్ల దానికి అప్పటినుంచి **'దక్షిణదిశ'** అనే పేరు ఏర్పడింది (భార. ఉద్యో.). వివస్వతుడు 28 మంది ప్రజాపతులలో ఒకడు. సాత్వత ధర్మాన్ని మహావిష్ణువుద్వారా నేర్చుకొని తన పుత్రుడైన వైవస్వతునికి త్రేతాయుగంలో బోధించాడు (భార.) అశ్వినీకుమారులు, నాసత్యదస్రులు వివస్వతుని పుత్రులు. వీళ్లు సంజ్ఞయొక్క నాసికనుంచి జన్మించారు (భార.).

వీళ్లుగాక ఇంకెందరో మహర్షులు ఈ సంహితను దర్శించారు. కొందరు స్త్రీలూకూడా ఈ సంహితను దర్శించటం గొప్పవిశేషం

**స్త్రీలు:**

ఉశన **(13-52).** ఈమె భృగువు భార్య. ఒక స్త్రీఋషి **(3-6-8)** గౌరీవీతి **(33-28-64)** చైలకి **(3-9)** జయ **(18-71)** ప్రాదురాక్షి **(26-6)** భరద్వాజపుత్రి **(34-32).**

మేధ **(33-92).** ఈమె ధరణీదక్షుల కుమార్తె. రమ్యాక్షి **(26-45)** లోపాముద్ర **(17-11)** అగస్త్యుని భార్య. లౌగాక్షి **(26-2)** వసుశ్రుత **(3-2)** వారుణి **(3-31-33)** విదర్భి **(20-55,66)** విశ్వవార **(33-12)** వృష **(15-41)** శిరింబిఠ **(35-18).** ఈమె భరద్వాజుని కుమార్తె. సర్పరాజ్ఞి **(3-6-8).** ఈమె కద్రువ, నాగమాత, సునీతి **(33-21)** ఆసురి **(3-37)** హైమ **(19-10)** మొదలైనవాళ్లు ఈ మంత్రాలను దర్శించిన స్త్రీలు. వీళ్లు **'బ్రహ్మవాదినులు'** అని గౌరవింపబడేవారు.

**జంటకవులు:**

ఇద్దఋద్దఋ ఈ సంహితలో కొన్ని మంత్రకండికలను దర్శించినట్లు తెలుస్తోంది. ఇంద్ర-బృహస్పతులు 9 వ అధ్యాయంలో 1-34 మంత్రాలను దర్శించారు ఇందులో వాజపేయయాగం వివరించ బడింది. ఇంద్రాగ్నులు 13-22,23; 14-11-22 మంత్రాలకు ద్రష్టలు శ్రుతకక్ష, సుకక్షలు 33-35 మంత్రాలను దర్శించారు. అరుణత్రసదస్యులు 22-18 మంత్రాలను, పురుమీఢాజమీఢులు 27-30, 33-19 మంత్రాలను దర్శించారు. అశ్వినీదేవతలు 10-31-34 రాజసూయయాగగత సౌత్రామణీ మంత్రాలకు ద్రష్టలు.

తృతీయచితిమంత్రాలకు (14 అధ్యాయం) ఇంద్ర, అగ్ని, విశ్వకర్మలు ఋషులు. శతరుద్రీయహోమమంత్రాలకు (16 అధ్యాయం) పరమేష్ఠి దేవప్రజాపతులు ఋషులుగ వున్నారు సుతంభరవిశ్వామిత్ర విశ్వరూపులు 22-15 మంత్రాలను దర్శించారు. 28 వ అధ్యాయంలోని సౌత్రామణీ అంగభూతకర్మల మంత్రాలకు ప్రజాపతి, అశ్వి, సరస్వతి ఋషులు. సప్తర్షులు17-79 మంత్రాలకు ద్రష్టలు. మయోభువులు11-18 మంత్రాలను దర్శించారు

ఈ విధంగా విస్తృతమైన ఋషిసంఘంచేత, కవిసమాజంచేత ఏకకుటుంబీకులు, సగోత్రీకులు, గురుశిష్యులు, మిత్రులు, స్త్రీలు మొ॥ వారిచేత ఈ శుక్లయజుర్వేదసంహిత దర్శించబడింది. దార్శనికులైన మహర్షులద్వారా ఈజ్ఞానం మనకు సురక్షితంగా లభించటం అది అవిచ్ఛిన్నమై శాశ్వతమైన భారతీయసంస్కృతికి మూలసంపద కావటం మనకు గర్వకారణం.

**- కె.వి.ఆర్.**

# 3. 6 దేవతలు

ఋగ్వేదంలో ఏకదేవతావాదం ఉన్నప్పటికి అనాటి ఆర్యులకు బహూదేవతావాదమే సమ్మతమని చెప్పాలి. కాని యజుర్వేదకాలానికి వారి దృక్పథం పూర్తిగా మారింది. 'ఈశావాస్యమిదం సర్వం'(40-1) అని సర్వం ఈశ్వరునిచేత అధిష్ఠితమని, ఈశ్వరస్వరూపమని, ఈశ్వరుడొక్కడే అనే భావన ఆనాటికి వారిలో బాగా స్థిరపడింది. ఈశ్వరుడే అగ్ని-ఇంద్ర-వరుణ-మిత్ర -రుద్రాదినామాలతో పిలువ బడుతున్నాడని, యజ్ఞమే సర్వమని, యజ్ఞమే ఈశ్వరస్వరూపమని వారి విశ్వాసం. అట్టి సర్వేశ్వరుని వివిధ కల్యాణగుణాలను ఆధారంగా జేసికొని వివిధనామాలు ఏర్పడ్డాయి. ఆయుఃకారకత్వాదులవల్ల అగ్ని అని, బలవీర్యాదులనివ్వడంవల్ల ఇంద్రుడని, మంచివారిని రక్షించడం వల్ల మిత్రుడని, దుర్జనులను శిక్షించడంవల్ల వరుణుడని, ఓజస్సును ఇవ్వడంవల్ల బృహస్పతి అని, వృష్టిని కలిగించడంవల్ల సవిత అని, ధనాన్నికలిగించడంవల్ల బ్రహ్మ అని ఆ సర్వేశ్వరుడే పిలువబడుతున్నాడు (37-12). ప్రజాపతి, పరమేష్ఠి, హిరణ్యగర్భుడనే పేర్లతో సర్వేశ్వరుడే పిలువబడ్డాడు. అగ్ని, పృథివి, వాయువు, అంతరిక్షం, ఆదిత్యుడు, ద్యులోకం, జలాలు, వరుణుడు వీరు ఎనిమిదిమంది ఆత్మస్వరూపులు, భూతోత్పత్తికి సాధనభూతులు (26-1). ఋగ్వేదంలో దేవతలు మొత్తం ముప్పైముగ్గురైతే ఇందులో ప్రజాపతితో కలిసి ముప్పైనల్గురు (8-54-59).

ఈ వేదంలో యజ్ఞానికున్న ప్రాముఖ్యం మరి దేనికీ లేదు. దేవతలు కూడా యజ్ఞంవల్లనే రాక్షసులను జయించారట. ఒకప్పుడు దేవతలు రాక్షసులతో యుద్ధానికి తలబడుతూ ఇలా ఆలోచించారట- "ఈ భూమిలో ఉత్కృష్టమైన దేవయజనస్థలాన్ని చంద్రునిలో దాచి రాక్షసులతో యుద్ధం చేద్దాం. యుద్ధంలో పరాజయం కలిగితే అ

దేవయజనస్థలంలో యాగంచేసి మళ్లా దైత్యులను ఓడిద్దాం". అలాగే దేవయజనస్థలాన్ని చంద్రునిలో దాచారట. అదే ఇప్పటికీ చంద్రునిలో నల్లగా కన్పిస్తోందట (1-28).

యజ్ఞమంటే దేవతలకు ప్రీతి ఎక్కువ. యజ్ఞాలకు వచ్చేటప్పుడు వారు తమ తమ రథాలపైన ధన ధాన్య కనకవస్తువాహనాదులను తీసికొని వచ్చి, యజ్ఞంలో యజమానిచేత సత్కరింపబడి హవిస్సులను తీసికొని, ధనాదులను యజమానికి ఇచ్చిపోతారట. రథాలులేని దేవతలు హవిస్సులను తమభుజాలపై మోసుకొని పోతారట (8-18). అగ్నినుంచి వచ్చే ధూమమే దేవతల నాహ్వానిస్తుందట (12-106). యజ్ఞం సర్వవిధపాపాలను పోగొడుతుందని వారి నమ్మకం (3-45).

ఈ వేదం యజ్ఞప్రధానమైంది కాబట్టి అగ్నిహోత్రుడే చాలా మంత్రాల్లో స్తుతింపబడ్డాడు. తరువాతి స్థానం సవితది రుద్రులకు ఋగ్వేదంలోగల ప్రాధాన్యం మళ్లా ఇందులో వచ్చింది. స్థావర జంగమరూపమైన ఈ జగత్తులో అణువణువు రుద్రరూపంగా వర్ణింప బడింది (16 అ.) ప్రజాపతి, విష్ణువుకంటే తేడాగా కన్పించినా. గుణాలవల్ల కారకత్వంవల్ల ఒక్కరే అని చెప్పాలి. దేవతలందరిలోను ప్రజాపతే ముఖ్యుడు. మిగిలిన దేవతలు అంత ఎక్కువగా వర్ణింపబడలేదనే చెప్పాలి. అయితే ఋగ్వేదంలో ఆయా దేవతల విషయంలో కన్పించని కొన్ని స్వభావవిశేషాలు ఇందులో కన్పిస్తాయి. కాబట్టి కొందరు దేవతల స్వరూపస్వభావాలను కొంచెం పరిశీలిద్దాం

**1. అగ్ని:**

అగ్నికి ద్యులోకం తండ్రి. పృథివి తల్లి (3-6). ఈతడు మథించడంవల్ల, వర్షధారలనుంచి విద్యుద్రూపంలోను, రాళ్ళ ఒరిపిడి

వల్ల, ఓషధుల రాపిడివల్లను పుడుతున్నాడు (11-27). మొట్టమొదటి సారిగా ఇతణ్ణి మంథనంవల్ల పుట్టించినవాడు అథర్వాణమహర్షి (11-32). అథర్వాణమహర్షి పుత్రుడైన 'దధ్యజ్' అనే వాడు వృత్రాసుర నాశకునిగా అగ్నిని ప్రజ్వలింపజేసాడు (11-33). ఋషులలో మొదటివాడైన అంగిరసుడుగా అగ్నే పుట్టాడు (34-12). దేవతలలో కూడా ముందు పుట్టినవాడగ్నే (34-12).

మొట్టమొదటగా అగ్ని దివినుండి అగ్నిరూపంలో పుట్టాడు. రెండవసారి పురుషరూపంలో బ్రహ్మనుండి పుట్టాడు. మూడవసారి నీటిలో పుట్టాడు (12-18) మొదట ద్యులోకంలో సూర్యుడుగా, రెండవసారి ప్రసిద్ధవహ్నిగా, మూడవసారి బడబానలంగా అతడు పుట్టినట్లు ఇంకోచోట వర్ణింపబడింది(12-19). ఈతని శరీరం ఘృతం. హిరణ్యం తేజస్సు (4-17).

ఒతడు పర్జన్యునిలా గర్జిస్తాడు భూమిని ఆస్వాదిస్తాడు. పుట్టిన వెంటనే భూమిని ప్రకాశింపచేస్తాడు ప్రకాశంచేత ద్యావాపృథువుల మధ్యలో శోభిస్తాడు (12-6). ఇతడు గరుత్మంతునితో పోల్చబడ్డాడు. త్రివృత్ స్తోమం శిరస్సట. గాయత్రమనే సామ నేత్రం. బృహద్రథన్తర సామలు రెక్కలు. పంచదశస్తోమలు ఆత్మ గాయత్రి మొదలైన ఇరవైఒక్క ఛందస్సులు హృదయాది అవయవాలు యజుస్సులే పేర్లు. వామదేవ్యమనే సామ శరీరం. యజ్ఞాయజ్ఞియమనే సామతోక. అగ్నులే డెక్కలట(12-4).

అగ్ని సర్వదేవతాస్వరూపుడు. ప్రాణులకు అగ్నిగా విజ్ఞానాన్నిస్తాడు. వాయురూపంతో ప్రాణులలో సంచరిస్తాడు. ఆకాశాన్ని, భూమిని, తేజస్సుతో నింపే సూర్యుడు, అంతరిక్షంలో ఉన్న ఇంద్రుడు (12-23). ఇతడు జఠరాగ్నిరూపుడై మనం తిన్న ఆహారాన్ని

జీర్ణంచేయడం వల్ల ప్రాణులకు హితుడు. జనులకు అతిథి. దేవతలకు ముఖం. (7-24). ఇతడు గాయత్రి అనే ఛందస్సు కధిపతి. గృహపతి ఇతడే (10-9). ఇతని ముఖం "అపాంనపాత్" అనే పేరుకలదై జలాల్లో ప్రవేశించిందట (8-24). ప్రయత్నప్రయోగలక్షణుడుగ, మేధామనోలక్షణుడుగ, దీక్షాతపోలక్షణుడుగా, వాక్పశులక్షణుడుగాను వర్ణింపబడ్డాడు(4-7). వాగింద్రియమే అగ్నియట (4-11). ఇతడు భూతాలన్నింటిలోను ప్రత్యేకంగా నివసిస్తున్నాడు. (11-23) దేవతలందరి హవిస్సులను గ్రహిస్తాడు (11-25) భూలోకపాలకుడు (3-12). అగ్నిరథం దుర్జేయం (3-36). ఆహవనీయాగ్నిని భృగు వంశీయులైన మునులు అరణ్యాలలో ప్రకాశింపచేశారు (3-15).

తెలిసినవి, తెలియనివి, దేవకృతాలు, మనుష్యకృతాలు, పితృ కృతాలు, ఆత్మకృతాలు అయిన అన్నిరకాల పాపాలను ఇతడు పోగొడతాడు (8-13). ఈతడు నిధిపాలకుడు (8-17). యజ్ఞానికి దేవతలను పిల్చుకొని రావడం, మరల వారిని తిరిగి వారివారి స్థానాలకు పంపడం ఇతని విధి (8-19).

ఈతనికి భువఃపతి, భువనపతి, భూతపతి అని ముగ్గురు సోదరులు. వీరు వషట్కారానికి భయపడి భూమిలో ప్రవేశించారు. ఆ దుఃఖంచేత అగ్ని నీళ్లల్లో మునిగిపోయాడు. అతనికోసం వెతుకుతున్న దేవతలు చివరకు నీళ్లల్లో అతనిని పట్టుకొన్నారు అప్పుడు భయపడిన అగ్ని తన వీర్యాన్ని జలాలలో వదలగా త్రిత, ద్విత, ఏకత అనే పేర్లుకల దేవతలు పుట్టారు. దేవతలు అగ్నిని ఓదార్చి మరల అతనిని యజ్ఞాధికారంలో ఉంచారు. అగ్ని సోదరులైన ముగ్గురిని వేదిపైనుండే దక్షిణపశ్చిమోత్తరపరిధులకు అధిపతులుగా చేశారు(1-23-2,3).

ఒకప్పుడు దేవతలకు భయపడి రాక్షసులు ద్యులోకంలో బంగారుపురాన్ని, అంతరిక్షంలో వెండినగరాన్ని, భూలోకంలో లోహపురాన్ని నిర్మించారట. వాటిని అగ్ని తగులబెట్టాడట. అప్పుడు మూడు పురాలలోను అగ్నికి ముగ్గురు కొడుకులు పుట్టారు. వాళ్లు 'హిరణ్యాకాయుడు', 'రజతకాయుడు', 'లోహకాయుడ'ని ప్రసిద్ధి పొందారట (5-8).

ఈ అగ్నికి చాల పేర్లు ఉన్నాయి. 1. వీతిహోత్రుడు (హోమాన్ని అభిలషించేవాడు 2-4) 2. కవి, క్రాంతదర్శనుడు (భూతభవిష్య ద్వర్తమాన విషయజ్ఞానం కలవాడు 2-4) 3. వాజజిత్తు (అన్నాన్ని జయించినవాడు 2-7). 4. హోత, దూత (2-9) 5. యజ్ఞగోప్త, దీప్తిమంతుడు, సత్యప్రతిష్ఠాపయిత (3-23) 6. విశ్వవేదుడు (3-40) 7. ఋషిపుత్రుడు, అభిశస్తిపావా (అభిశాపాలనుండి రక్షించేవాడు; 5-4) 8. ఆశుశుక్షణి (అంధకారాన్ని పోగొట్టేవాడు11-27) 9. సహస్యుడు, సహసస్పుత్రుడు (ఒలంచేత పుట్టినవాడు11-26) 10. ఉశిక్ (అందఱిచేత కోరబడేవాడు12-29) 11. పావకుడు (12-24) 12. అరతి (దుష్టులలో ప్రీతిలేనివాడు12-24) 13. సుమేధా (మంచిబుద్ధి కలవాడు) అమృతుడు, భరిభృత్ (జగత్తును భరించేవాడు 12-24) 14. నివేశనుడు (యజమానిని స్వగృహంలో అట్టిపెట్టేవాడు 12-66) 15. సంగమనుడు (ధనాలను పొందించేవాడు) సత్యధర్ముడు (అవశ్యం జరిగే ఫలితాలుకల అగ్నిహోత్రాదిధర్మాలు కలవాడు 12-66) 16. చిత్రశ్రవుడు (అనేక రకాలైన ధనాలు కలవాడు 15-31) 17. శోచిష్కేశుడు (జ్వాలలే కేశాలుగా కలవాడు) పురుప్రియుడు (చాలమంది యజమానులు ప్రియులుగా గలవాడు15-31) 18. స్వధర్ముడు (మంచి యజ్ఞాలు కలవాడు 15-32) 19. తిగ్మజంభుడు వజ్రమయాలైన కోరలు కలవాడు 15-37) 20. సుభగుడు (మంచి ఐశ్వర్యం కలవాడు 3-40).

ఇలాంటి అగ్ని పుత్రపశులాభంకోసం, నేత్రరక్షణకోసం (2-14,16) వజ్ర-బంధన, దుర్భోజనపీడానివృత్తికోసం (2-20), అన్నంకోసం, గృహంకోసం (2-20), రాక్షస సంహారంకోసం (2-30), ఆయుర్దాయానికి వర్చస్సుకు (3-17), ధనానికి, పుష్టికి (3-19), ఈతిబాధలు, రోగాలు పోవడానికి (11-47), ఇష్టలాభానికి (12-7), మేధకు (12-7), సర్వవిధపాపనివారణకు (8-13) ప్రార్థింపబడుతున్నాడు.

అగ్నిని సేవించే యజమానులు మేధావులై యజ్ఞఫలాన్ని పొందాలనుకొని జ్ఞానకర్మసముచ్చయంచేత రవిమండలాంతర్గతమైన దేవయానమార్గాన్ని నిర్మించారట(12-28).

2. ప్రజాపతి:

మనోవాగభిమానియైన దేవత ప్రజాపతి (4-4). ఇతడు సర్వదేవతాప్రియుడు (4-26). ఇతనికంటే గొప్పవాడు లేడు (22-5). అంతర్యామిగా ఇతడు అన్ని భూతాలను ఆవేశించాడు. తననుండి పుట్టిన అగ్ని సూర్యవాయ్వాదిరూపంలోనున్న ప్రకాశాన్నిధరిస్తాడు. ప్రజలతో రమించు షోడశకళాపరిపూర్ణుడైన శరీరోపాధివిశిష్టుడీతడు (8-36).

ఈతడే సృష్టిసంహారాలలో సమర్థుడు (10-20). యజ్ఞాది కర్మస్వరూపాన్ని నిర్ణయించి భూలోకంలో ప్రవర్తింపజేశాడు (11-1). స్వర్గకాములను అగ్నికార్యంలో ప్రోత్సహిస్తాడు (11-5). ఋత్విగ్యజమానాదులందఱు ఈతనివలన కల్గినవారే. ఇతనినే ఇతర దేవతలందరూ అనుసరిస్తారు (11-5). ఇతడే ముల్లోకాలను భరిస్తాడు (13-4). ఇతడు సప్తదశాక్షరచ్ఛందస్సుతో సప్తదశస్తోమాన్ని జయించాడు (9-34).

ప్రజాపతియే సముద్రంలో బడబానలంగా ఉన్న అగ్నిని ప్రకాశింపజేశాడట. అలాగే వర్షరూపంలోనున్న జలాలలో విద్యుత్తుగాను, ద్యులోకంలో సూర్యునిగాను ప్రకాశించాడు (12-20). హిరణ్యపురుషరూపమైన బ్రహ్మాండంలో గర్భరూపంలో ఉన్న ఇతడు హిరణ్యగర్భుడని పిలువబడుతున్నాడు. సర్వజగత్సృష్టికి ముందే ఇతడు శరీరాన్ని ధరించాడట. ఇతని తరువాత పుట్టిన వారందరికీ అంటే సర్వజగత్తుకే ఇతడీశ్వరుడైనాడు(13-4). ఇతడు వాక్కుతో ప్రజలను పుట్టించాడు (13-45).

ఇతడే పృథివిని సముద్రజలాలపై విస్తరింపజేశాడు. అందువల్లనే భూమికి **'పృథివి'** అని పేరు వచ్చింది (13-17) ప్రజాపతి, ప్రాణాలు కలిసి అన్నాన్ని సృష్టించారట (13-54). విశ్వేదేవులు ఇతని పుత్రులు (33-77). ఇతడు నిధిరక్షకుడు (8-17). అనేకవిధాలుగా రక్షించేవాడవటంచేత ఇతడు **'వ్యోముడ'** ని పిలువబడుతున్నాడు(14-23). ఇతనికి 12 నెలలు, 5 ఋతువులు, 3 లోకాలు, ఆదిత్యుడు మొత్తం ఇరవైఒక్క అవయవాలట (14-23). అగ్ని-పృథివి-వాయువు-అంతరిక్షం-ఆదిత్యుడు-ద్యులోకం-జలాలు-వరుణుడు వీరు ప్రజాపతిస్వరూపులు. భూతోత్పత్తికోసం ప్రజాపతి ఈ రూపాలను ధరించాడు (26-1).

**3. విష్ణువు:**

యజ్ఞానికి అధిష్ఠాత ఐన దేవత విష్ణువు (6-4). యజ్ఞమే విష్ణువుగా కీర్తింపబడింది. ఇతని విక్రమణం వర్ణింపబడింది. ముల్లోకాల యందీతని విక్రమణం వల్ల శత్రువులు నశిస్తారు (5-15). ఇతడే రోదసిని విభజించి స్తంభింపచేశాడు. పృథివిని స్వతేజోరూపమైన ప్రకాశాలచేత ధరించాడు (5-16). మూడులోకాలను చేసినదీతడే (5-18). ఇతడే అగ్నివాయుసూర్యులను అప్రమత్తులుగా చేశాడు. (6-4). ఇతడు ఇంద్రునకు వృత్రవధాదులలో స్నేహితుడు. ఈతడు

కూడ నిధిపాలకుడుగా వర్ణింపబడ్డాడు (8-17). ఇతడు అగ్ని వాయ్వాదిరూపాలను పొందాడట (34-43). వరాహరూపుడైన ఇతడు పృథ్విని ఉద్ధరించాడట(37-5).

ఇలాంటి విష్ణువుయొక్క విజ్ఞానానందఘనమైన పరమపదాన్ని వేదాంతవిజ్ఞానరహస్యజ్ఞులైన పండితులు చూడగలరు. ద్యులోకమధ్య గతమైన ఆదిత్యమండలమే ■ పరమపదం (6-5). బ్రహ్మలక్షణమైన ఇతని పరమపదాన్ని జ్ఞానకర్మసముచ్చయాన్ని పాటించేవారు పొందగలరు (34-44).

ఇతడు శుద్ధిచేసేవాడు కాబట్టి **'మృగ'** మని, భయంకరుడు కాబట్టి **'భీముడ'** ని వరాహాద్యవతారాలచే భూమిపై చరించడంవల్ల **'కుచరుడ'** ని, దేహమందతర్యామిగా నుండటంవల్ల **'గిరిష్ఠుడ'** ని (5-20), ప్రాణాలలో, యజ్ఞాలలోను ఉండటంవల్ల అంటే వాటికి అధిష్ఠాత కావడంచేత **'శిపివిష్టుడ'** ని(8-55), సంసారాన్ని నాశనం చేసేవాడవటంవల్లను **'నరంధిషుడ'**ని (8-55), తనపై ప్రీతికలవారిని రక్షించేవాడు కాబట్టి **'అప్రీతపా'** అని పిలువబడుతున్నాడు.

**4. ఇంద్రుడు:**

ఈతడు ప్రధానదేవతగా స్తుతింపబడ్డాడు(7-15). బృహత్సామ ప్రియుడు (7-22). త్రిష్టుప్ఛందోభిమాని (8-47). ఇతడు కోరికలను వర్షిస్తాడు. వర్ధమానుడు, అకుత్సితమైన ఐశ్వర్యం కలవాడు, ద్యులోకంలో పుట్టినవాడు, ప్రశాసకుడు, స్వధర్మచ్యుతుని అవమానించే వాడు, ఉగ్రుడు, వజ్రాయుధుడు, బలాన్నిచ్చేవాడు, సత్సంగతిని, మంచిబుద్ధిని, ఐశ్వర్యాన్ని కలుగజేసేవాడు (8-15). ఇతడు గొప్ప కీర్తికలవాడు (10-9). సముద్రంలాగా వివిధగతులు కలవాడు. గొప్పబలం కలవాడు. రథికులందరిలో శ్రేష్ఠుడు. అన్నదాత (12-

56). ఇతడు స్తుతించినవారికి కోరినవిచ్చేవాడు. అందుచేత 'గిర్వణుడు'ని పిలువబడుతున్నాడు (34-16). ప్రజాకారకుడు (27-12). యజ్ఞంలో ఇతడు పుట్టాడట (33-80). పూతికలు ఇతని తేజస్సులట (37-6). సర్వవాక్కులు ఇతనిని స్తుతిస్తున్నాయి (12-56). ఇతడు హింసకుడు కాడు. హవిస్సును ఇచ్చిన యజమానిని సేవిస్తాడు (3-34). ఇంద్రాగ్నులు ద్వంద్వదేవతలుగా స్తుతింపబడ్డారు (2-15, 3-13).

ఈతడు చతురంగబలాలతో వృత్రాసురుని సంహరించాడు. నానారూపాలతో చోరాదిప్రజాపీడకులను సంహరిస్తాడు (33-26). అహివధ, శాంబరవధ, గోవిమోచనం- ఈ మూడు ఇంద్రుని మహా కార్యాలు (33-63). వృత్రవధలో మరుత్తులు, జలాలు ఇతనికి సహాయపడ్డారు (1-13, 3-46). మరుత్తులు ఇంద్రునకు ఆప్తస్నేహితులు. వారికి నమస్కరించినా ఇంద్రుడు సంతోషిస్తాడు (3-46). ఇంద్రుడు వృత్రాసురుని చంపేటప్పుడు వృత్రాసురుని నల్లగ్రుడ్డు '**త్రికకుత్**' పర్వతం పైబడి కాటుకగా మారిందట (4-3). ఇంద్రుని కుడిభుజం, సహస్రభారం, శతతేజం (1-24). అన్ని తిథుల్లోను దంచబడ్డ సోమానికి ఇంద్రుడే అధిపతి (7-38).

పాత్రాదుల్లో ఉంచబడ్డ సోమరసాన్ని, పశువులను రక్షించమని ఈతడు వేడుకొనబడుతున్నాడు (7-4). వీర్యాన్నివ్వమని, యజ్ఞవిరోధులైన శత్రువులను నాశనం చేయమని ప్రార్థింపబడుతున్నాడు (2-8, 2-10).

**5. సవిత - సూర్యుడు:**

ఇతడు స్వయంభువు. ఇతనికి ఏడు రశ్ములు. నాల్గు దిక్కులకు నాలుగు రశ్ములు. క్రింద, పైన రెండు. మరొక రశ్మిమండలాంతర్గతుడైన హిరణ్యగర్భుడనే పరమపురుషుడు (2-26). ఇతడే సూర్యుడు. యజ్ఞ

వేదిలో తూర్పుదిక్కుకు సంరక్షకుడు (2-5). ఇతడు దానాది గుణయుక్తుడు. ద్యావాపృథువుల మధ్యనుండేవాడు. మేధావి, సత్ప్రసవుడు, వివిధరమణీయధనదాత, సర్వజనప్రియుడు, బుద్ధిని వ్యాపించియుండేవాడు, క్రాంతదర్శి, ఆత్మమయాలైన బుద్ధిప్రకాశాలు కలవాడు, సాధుసంకల్పుడు, హిరణ్యపాణి (4-25). దేవమనుష్యులకు నేత్రం, స్థావరజంగమజగత్తునకు ఆత్మ (7-25).

ఇతడు హిరణ్యపాణియైన ఉదంతమిది- రాక్షసులు ప్రాశితమనే ఆయుధమును విసరగా ఇతని చేతులు తెగినవట. అపుడు దేవతలు బంగారు చేతులు చేయించి అతికించారట (1-16). ఇతడు హిరణ్యజిహ్వుడు (33-69). అందరినీ మేల్కొల్పి కర్మలయందు ప్రేరేపించే సూర్యుడు అందుచేత అందరికి హితుడు (33-39,40). ఇంత ప్రదేశములో ఉన్నదని కాని, ఇంత కాలములో ఉన్నదని కాని చెప్ప వీలులేని ఇతని మరియొక రూపమే విజ్ఞానానందఘనమైన ఆత్మ (33-38).

ఇతడు దృష్టికారకుడు (37-12). కిరణవిస్తరణసంహారణాలలో సమయానుగుణంగా వివిధకిరణాలను ధరించుటలోను సామర్థ్యము గలవాడు (33-37). ఉదయతాపప్రకాశాదిరూపమైన అనుగ్రహాన్ని ప్రాణులపైన కలుగజేస్తూ, ఎప్పటికీ తన పనిని తప్పడు (8-3). పాపులుకూడ ఆదిత్యోపాసనచేత సుమతులవుతున్నారు (8-4). ఆదిత్యుడైన ఇతడు మనుష్యాదులకోసం జలాలచేత అంతరిక్షాన్ని పృథ్విని తడుపుతున్నాడు (13-5). ఈతడు నిధిపాలకుడు (8-17). ఇతడు ఆరక్షరముల ఛందస్సుతో ఋతువులను జయించెను (9-32). మూడులోకాలను ఇతడు ప్రకాశింపజేస్తాడు, సప్తసముద్రాలను కొలుస్తాడు. అనర్ఘాలైన రత్నాలను ఇస్తాడు (34-34). మిత్రావరుణుల కార్యక్రమానికి అనుకూలంగా సూర్యుడు ముందుగా ఉదయిస్తాడు (33-38). సూర్యకిరణాలకు **'వృష్టివని'** అని పేరు.

ఇతడు శీఘ్రంగా నడిచేవాడు కావటంచేత **'తరణి'** అని, అందరికీ దర్శనీయుడు కాబట్టి **'విశ్వదర్శతుడ'** ని, ప్రకాశం కల్గియుండటంచేత **'జ్యోతిష్కృత్'** అని పిలువబడుతున్నాడు **(33-36)**. ఇతడు అన్నప్రదాత కూడ **(8-7)**.

వర్చస్సుకోసం, దృష్టికోసం, మంచిజ్ఞానంకోసం ఇతడుపాసింపబడుతున్నాడు **(2-26,22-9, 37-12)**. శత్రువులను అసంఖ్యాక బంధనాలతో అంధతామిస్రనరకంలో బంధింపుమని ఇతడు వేడుకొనబడుతున్నాడు**(1-25)**.

**6. మిత్రావరుణులు :**

వీళ్లిద్దరు ఆదిత్యపుత్రులుగను **(3-33)**, చిరజీవనానికై జ్ఞానజ్యోతినిచ్చే వారుగాను **(3-33)**, ఈతిభాధలు భయం లేకుండా ప్రజలను పాలించేవాళ్ళుగాను **(3-31)**. వర్ణింపబడ్డారు ప్రాణం, ఉదానం అనే వాయువులు రెండూ వీరిద్దరికి ప్రతీకలు **(4-11)**. వీరుభయులు ధృతవ్రతులు **(10-9)**. వీరు రాత్రి చివరిభాగంలో ఉదయిస్తారు. ఇందులో వరుణుడు దుర్జన శిక్షకుడు. మిత్రుడు సజ్జనపాలకుడు. వీరిద్దరి కార్యసంపాదనకోసం సూర్యుడు దయిస్తున్నాడు. వీరుభయులు హిరణ్యరూపులు, పాపపుణ్యాలను పరిగణించేవారు **(10-16)**. వాగింద్రియం మైత్రావరుణం **(7-27)**.

మిత్రుడు మనుష్యులకు ధారకుడు. సనాతనుడు. చిత్రవిచిత్రాలైన కర్మలచే చిత్రవిచిత్రంగా కీర్తింపబడేవాడు. దానశీలి **(11-62)**. ఇతడు నవాక్షరఛందస్సుతో త్రివృత్ స్తోమాన్ని జయించాడు **(9-33)**.

వరుణుడు ద్యులోకాన్ని అంతరిక్షాన్ని స్తంభింపజేశాడు. భూమివిస్తారాన్ని కొలిచాడు **(4-30)**. ఈతడే వనాల్లో ఉన్న చెట్లపైదాకా

ఆకాశాన్ని వ్యాపింపజేశాడు. అశ్వాలలోను, పురుషులలోను వీర్యాన్ని పెంపొందింపజేశాడు. ఆవులలో పాలను, మనుష్యులహృదయాలలో క్రతుసంకల్పంగల మనస్సును, ప్రజలలో జఠరాగ్నిని, ద్యులోకంలో సూర్యుని, పర్వతంలో వల్లీరూపాన సోముని స్థాపించాడు. ఇతడే పరబ్రహ్మలక్షణుడు (4-31). తన కిరణాలతో జగత్తునావరించేవాడు కాబట్టి '**వరుణుడు**'ని పిలువబడుతున్నాడు (4-35). మిత్రుడీతని నేత్రం (4-35). ఈతడే సూర్యమార్గాన్ని విశాలంగాను, గమన యోగ్యంగాను చేశాడు (8-23). ఈతడు చెడ్డపనులు చేసేవాళ్లను దండిస్తాడు (8-23). దశాక్షరచ్ఛందస్సుతో విరాడభిమాని అయిన దేవతను జయించాడు (9-33). రాజసూయానికీతడు ద్రష్ట (9-35).

చిరజీవనంకోసం, జ్ఞానజ్యోతికోసం, అభయంకోసం, సుఖ సంతోషాలకోసం వీరుభయులు ప్రార్థింపబడ్డారు (3-31,33).

**7. సోముడు :**

సోముడు ప్రకాశవంతమైనవాడు ఆహ్లాదకరుడు అమృతమయుడు (4-26). ఇతడు ఇంద్రుని ఎదుఱుగా ఉంచుకొని యజమానికోరినవాటిని ఇస్తాడు (7-12). దేవతలకే ప్రభువట. ప్రథమ బృహస్పతియట (7-15). ఇతడు హరితవర్ణుడు. అనుష్టుప్ ఛందస్సంటే ఈతనికిష్టం (8-47). ఈ పవమానుడే సూర్యుని పుట్టించాడట (22-18). ఓషధులను పుట్టించాడట. అంతరిక్షాన్ని విస్తరింపజేశాడట (34-24). ఇతడు యజమానులకు గవాశ్వసంపదను, వీరులైన పుత్రులను కలుగజేస్తాడు (34-21). దేవతలకు హవిస్సైన ఇతడు మూడులోకాల్లో మూడు రూపాలను ధరించాడట (6-33). గాయత్రియే శ్యేనరూపం దాల్చి, సోముని భువికి తీసికొని వచ్చిందట (5-1). ఈ సోముడు శ్యేనరూపంలో దుర్జనుల్ని శిక్షిస్తాడు (4-34).

ధృవసదుడు, నృషదుడు, మనస్సదుడు, అప్సుషదుడు, ఘృతసదుడు, వ్యోమసదుడు, పృథివీసదుడు, అంతరిక్షసదుడు, దివిసదుడు, దేవసదుడు, నాకసదుడు, అని సోముడు పిలువ బడుతున్నాడు. **(9-2)**

సోమలతను ఛేదించి తలపాగా చుట్టి, ఒకచోట రంధ్రం పెడతారట. దానిద్వారా సోమదేవత ఊపిరి పీల్చుకొంటుందని వారి విశ్వాసం **(4-25)**. హోమార్హమైన సోమాన్ని రక్షించే దేవతలు ఏడుగురు, స్వానుడు (ధ్వనిచేసేవాడు), భాజుడు (ప్రకాశించేవాడు) అఙ్ఘారి (పాపాలను పోగొట్టేవాడు), బంభారి (విశ్వాన్ని భరించేవాడు), హస్తుడు (ఎల్లప్పుడు సంతోషంగా ఉండేవాడు) సుహస్తుడు (మంచిచేతులు కలవాడు), కృశానుడు (దుర్బలులను జీవింపజేసేవాడు) **(4-27)**

సోమయాగంలో సోమసంకల్పం నుంచి అవభృథం వరకు సోమునకు ముప్పైనాలుగు అవస్థలు. ఆయా అవస్థలకు తగ్గట్టు సోమునికి ముప్పైనాలుగు పేర్లు చెప్పబడ్డాయి. అవి_యజమానిచేత సోమయాగం కోసం సంకల్పింపబడ్డ సోముడు **'పరమేష్ఠి'** అని, సంకల్పప్రకాశకమైన వాక్యగతుడు **'ప్రజాపతి'** అని, అభిముఖ్యం పొందినప్పుడు **'అంధుడ'**ని, సంభజనంలో **'సవిత'** అని, దీక్షితుడైన తరువాత **'విశ్వకర్మ'** అని, సోమక్రయణియైన గోవును తీసికొని వచ్చిన తరువాత **'పూష'** అని, క్రయ విక్రయ వ్యవహారానికై తీసుకొనిరాబడి **'ఇంద్రామరుత్త'**ని, కొనబడుతున్నపుడు **'అసురుడ'**ని, కొనబడినవాడై **'శిపివిష్టవిష్ణువ'**ని, యజమాని ఒడిలోకి చేరిన సోముడు **'నరంధిషవిష్ణువ'**ని, బండిపై తెచ్చి దింపబడినప్పుడు **'సోముడ'**ని, మంచెపైన ఉంచబడినప్పుడు **'వరుణుడ'**ని, అగ్నీధ్రమం దుంచబడినప్పుడు **'అగ్ని'** అని, హవిర్ధానం (హవిస్సుపెట్టే అర)

లో ఉంచబడి '**ఇంద్రుడ**'ని, చిన్నముక్కలుగా చేయటానికి తీసుకొని పోబడేటప్పుడు '**అథర్వుడ**'ని, ముక్కలుగా కోయబడి '**విశ్వేదేవుడ**'ని, అప్యాయనం చేసేటప్పుడు '**ఆప్రీతపయనవిష్ణువ**'ని, పిండబడేవాడై '**యముడ**'ని, పాత్రలలో భరింపబడువాడై '**విష్ణువ**'ని, వడకట్టబడు వాడై '**వాయువ**'ని, వడకట్టబడిన తరువాత క్షీరమిశ్రితుడై '**శుక్రుడ**'ని, సక్తుమిశ్రితుడై '**మంథి**'యని, గ్రహపాత్రలలో గ్రహింపబడి '**విశ్వేదేవుడ**'ని, హోమార్థమై గ్రహింపబడి '**అసువ**'ని, హోమం చేయబడుతూ '**రుద్రుడ**'ని, హోమశేషాన్ని ప్రసాదంగా తీసికొని పోబడుతూ '**వాతుడ**'ని, భక్షణార్థమై కోరబడుతూ '**నృచక్షా**' అని, భక్షింపబడుతూ '**భక్షుడ**'ని, భక్షింపబడినవాడై '**నారాశంసుడ**'ని, అవబృథంకోసం తీసికొనబడి '**సింధువ**'ని, జలాభిముఖంగా తీసికొని పోబడుతూ '**సముద్ర**'మని, నీళ్లలో కలుపబడ్డ తరువాత '**సలిల**' మని, సోముడు పిలువబడుతాడు.[1]

## రుద్రుడు :

ఋగ్వేదంలో కంటే యజుర్వేదంలో ప్రాముఖ్యాన్ని సంపాదించినవారిలో రుద్రుడొకడు. జగత్తులోని అణువణువు ఈతని రూపంగానే వర్ణింపబడింది. అందువల్లనే ఈతడు బహురూపుడు. ఒక్కొక్కచోట బహువచనంలోను, ఒక్కొక్కచోట ఏకవచనంలోను ఇతడు వర్ణింపబడ్డాడు, రుద్రుని కృపవల్లనే అన్నం తినగల్గుతున్నామని అప్పటిజనుల విశ్వాసం **(3-58)**.

1. ఈ పేర్లన్నీ ప్రాయశ్చిత్తం కోసం చెప్పబడ్డాయి. ఆయా అవస్థల్లో ప్రాయశ్చిత్తం చేయాలంటే ఆయా పేర్లతో మంత్రాలనూహించి హోమం చేస్తూచేయాలి

ఇతడు గొప్ప వైద్యుడు (3-59). మూజవత్పర్వతమితని నివాసం చర్మవసనుడు. ధనుస్సు, అంకుశం, ఖడ్గం, బాణాలు ఆయుధాలుగా కలవాడు (3-16.16-19). ఈతడు మేఘంలో ఉండి వర్షాన్నిస్తాడు. కైలాసంలో ఉండి సుఖాన్నిస్తాడు. పర్వతనివాసియైన సర్వజ్ఞుడు. అందువల్ల 'గిరిశస్తుడ'ని పిలువబడుతున్నాడు. ఈతని శరీరం మంగళప్రదం; అభీకరం; పుణ్యఫలప్రదం. ఇతడు నీలగ్రీవుడు, సహస్రాక్షుడు, జటాబన్దం కలవాడు (16-8-20).

శుక్లయజుర్వేదంలో 16 వ అధ్యాయం పూర్తిగా రుద్రునికే వినియోగింపబడింది. ఈ రుద్రుడే హిరణ్యబాహువు, సేనాని, దిశాధిపతి, హరితకేశుడు, పశుపతి, పీతరక్తవర్ణుడు, మార్గపతి, నీలకేశుడు, సజ్జనపతి, కపిలుడు, అన్నపాలకుడు, సంసారనివర్తకుడు, జగత్పాలకుడు క్షేత్రపాలకుడు, వనపాలకుడు, సారథి, ఎఱ్ఱని స్థపతి, వృక్షపతి, భూమండలవిస్తారకుడు, ఓషధులరాజు, వణిక్కు, ఉచ్చైర్ఘోషుడు, సేనారక్షకుడు, సర్వలాభప్రాపకుడు గుప్తచరపతి, చోరపతి, అరణ్యపతి ఈవిధంగా సర్వజగత్తునకు వివిధరూపాలలో ఇతడు అధిపతి

ఈ రూపవైవిధ్యమే బహురుద్రత్వానికి హేతువు. ప్రపంచంలో క్రూరప్రవృత్తిగల వారందరికీ ఈతడే ప్రశాసకుడు. అందువల్లనే ఇతడు క్రూరుడుగా స్తుతింపబడ్డాడు (11-15). ఇతడు 'త్ర్యంబకుడ'ని కూడ పిలువబడుతున్నాడు (3-60). అశని, పశుపతి, భవుడు, శర్వుడు, ఈశానుడు, మహాదేవుడు, ఉగ్రుడు, రుద్రుడు అని అనేక రూపాలలో ఉండేవాడు (39-8,9).

సర్వరోగనివృత్తికి, అభ్యుదయనిశ్శ్రేయసాలనుండి పతనం కాకుండా చేయటానికి ఇతడు ప్రార్థింపబడుతున్నాడు (3-60). ఈతని సోదరి అంబికయట (3-57). ఇతనికి ఎలుకను బలి ఇస్తారట (3-57).

**9. అశ్వినులు :**

వీరు యజ్ఞంలో ఋత్విక్కులు (7-11). దేవతల అధ్వర్యులు (1-10). శ్రోత్రేంద్రియాధిదేవతలు (7-27). దేవచికిత్సకులు (12-74). వీరి రథం బంగారంతో చేయబడింది (21-31). వీళ్లిద్దరిలో ఒకనికి దస్రుడని, ఇంకొకనికి నాసత్యుడని పేరు (33-58). వీరు దర్శనీయులు వర్షకారకులు (34-29). ఇంద్రుని పరాక్రమాన్ని ఒకప్పుడు నముచి అనే రాక్షసుడు త్రాగేశాడు. అప్పుడు నిస్తేజుడైన ఇంద్రునకు అశ్వినులు వజ్రాన్నిచ్చి ఆ రాక్షసుని చంపించి, అతని ఉదరమునుంచి సురతో కలిసి వెలువడిన సోమాన్ని శుద్ధిచేసి ఇంద్రునకిచ్చి అతణ్ణి వీర్యవంతుణ్ణి చేశారట(10-33). వీరి వాక్కు అర్థప్రకాశకమై, సత్యమై, సుందరమై ఉంటుంది(7-11).

ఇంతవరకు ప్రధానంగా వచ్చిన దేవతలను గురించి చర్చించాం ప్రధానులైనా అంత ఎక్కువగా వర్ణింపబడని వారిని గూర్చి టూకీగా తెలుసుకుందాం.

**10. వాయువు :**

ఈతడు సర్వవ్యాపి, ఆత్మరక్షకుడు, ఆకాశపుత్రుడు, అన్నింటిని చేసే సామర్థ్యం కలవాడు, బలవంతుడు (5-5). ప్రాణవాయువుకే **'వాచస్పతి'** అని పేరు (7-1). ఇతడు విశ్వాన్ని ఆచ్ఛాదించే సామర్థ్యం గలవాడగుటచేత **'విశ్వవారుడ'**ని, ప్రథమవషట్కారయుతమై అన్యదేవతాసంబంధంలేని సోమాన్ని త్రాగేవాడవటంచేత **'శుచిపుడ'**ని, మూడు లోకాలను వ్యాపించియుండటంచేత **'త్రివృత్'** అని (14-23), నాల్గు దిక్కులచేత స్తుతింపబడటంచేత **'చతుష్టోమ'** (14-23) మని కూడా పిలువబడ్డాడు. ఈతని తేజస్సు ఉత్సాహం (1-24). వాయువాహనాలైన మృగాలు అసంఖ్యాకాలు(7-7).

**11. మరుత్తులు :**

శుక్రజ్యోతి మొ॥ ఏడేసిమంది ఒక్కొక్క గణంగా, ఏడు గణాల్లో ఉండే వాళ్లే మరుత్తులు (3-44). వీరు పృశ్నిమాతరులని పిలువబడుతున్నారు (25-20). పృశ్ని, అనగా ద్యుదేవత. మరుత్తులు సప్తాక్షరచ్ఛందస్సుతో సప్తపశుగణాలను జయించారు (14-23). వీరు ఇంద్రునితో సహభోజనానికి ఆహ్వానింపబడ్డారు. వీరు ఇంద్రునికి ఆప్తమిత్రులు (3-46).

**12. ద్యావాపృథువులు :**

వీరు ద్వంద్వదేవతలు. సామాన్యంగా దేవతలకు తల్లి దండ్రులుగా స్తుతింపబడ్డారు (3-6,25-20). భూమి సుఖాలనివ్వటం చేత **'భూః'** అని, విశ్వాన్ని ధరించి పోషించేది కాబట్టి **'విశ్వధాయి'** (13-18) అని, ప్రజాపతిచేత సముద్రంలో విస్తరింపజేయబడటం చేత **'పృథివి'** (13-17) అని పిలువబడుతున్నది. ఈ పృథివి సుఖరూపమైందిగా, కంటకరహితమైందిగా, మంచి ఆశ్రయమైందిగా కావాలని ప్రార్థింపబడుతున్నది (35-21). వీరిద్దరు లోకానికి మంగళాన్ని కలిగించేవారు (10-9).

**13. అదితి :**

ఈమె దేవమాత (21-5). శుభాన్నిస్తుంది (10-9). ఈమె పదహారు అక్షరాల ఛందస్సుతో షోడశస్తోమాన్ని జయించిందట (9-34). ఈమెకు **'తువిక్షత'** (బహుక్షతములనుండి రక్షించునది) **'అజరన్తీ'** (వార్ధక్యం లేనిది) **'ఉరూచి'** (బహుగమనస్వభావం గలది) **'సుప్రణీతి'** (అందరిచేత సేవింపబడేది) **'అదితి'** (దీనురాలు కానిది) అనే పేర్లు సార్థకాలు.

**త్వష్ట :**

ఈతడు ధనాలనిచ్చేవాడు. శరీరంలోని అంగలోపాలను సరిచేసే స్వభావం గలవాడు (8-14). ఇతడు పశువృద్ధికారకుడు (6-7). [redacted]

(ఛేదింపబడిన) పశ్వంగాలలో ఏకత్వాన్ని సంపాదిస్తాడట **(6-20)**.

**అబ్దేవతలు: (జలములు)**

వీరు సుఖంకోసం, బ్రహ్మసాక్షాత్కారంకోసం **(11-50,51)** సర్వవిధ పాపనివృత్తికోసం **(6-17)**, యజ్ఞనిర్వహణకోసం **(6-13)** స్తుతింపబడ్డారు.

**14. చంద్రుడు:**

ఈతడు కాంతిస్వరూపుడు కావటంచేత '**భాంతుడ**'ని పిలువబడుతున్నాడు. **(14-23)**. ఇతడు మరల మరల పుడతాడట **(23-10)**. ఇతడు మనసస్పతి **(2-21)**. విద్యుత్తువలె ప్రకాశం కలిగి గుండ్రంగా ఉండటంచేత '**జ్యోతిర్ధరాయువు**' అని పిలువబడుతున్నాడు **(7-16)**. ఇతడు గ్రీష్మాంతంలో జలాలను వర్షిస్తాడట **(7-16)**.

**15. బృహస్పతి:**

కన్ను, బుద్ధి, మనస్సుల వ్యాకులతను పోగొట్టుమని ఈతడు ప్రార్థింపబడుతున్నాడు.

**16. సినీవాలి:**

ఈ దేవత విస్తృతమైన కేశజాలం గలది. దేవతల సోదరి. సంతానంకోసం ఈమె స్తుతింపబడుతున్నది **(34-10)**. ఈమె కలకంఠ కూజితాది విలాసాలు కలది. ఈమె '**అదితి**'హస్తాలలో '**ఉఖ**'ను ఉంచుతుందట **(11-56)**.

ఈ సంహితలో ఇలాగే పూష **(1-10,34-41)**, ఉషస్సు **(34-31)**, అర్యముడు **(3-31)**, విశ్వేదేవులు**(4-11)**మొ॥ దేవతలు స్మరింపబడ్డారు.

**- కె.వి.ఆర్.కె.**

## 3.7 ఛందస్సు

వేదాలలోని మంత్రాలన్నీ ఛందోబద్ధాలు. కాబట్టి వేదాలను తెలుసుకోవడానికి ఛందోజ్ఞానం తప్పనిసరి. అందుకనే ఛందస్సు ఒక వేదాంగంగా పేర్కొనబడింది. వేదానికి 'ఛందః' అనే సార్థక నామధేయం ఇందువల్లనే కలిగింది.

వేదాల్లోని మంత్రాలకు పాదవిభజనంచేసి ఆ పాదాలకు గురులఘు అక్షరసంఖ్యను బోధించే శాస్త్రం ఛందస్సు, ఇది మహేశ్వరుని చేత చెప్పబడింది. శివునివల్ల నందీశ్వరుడు, అతనివల్ల సనత్కుమార, అగస్త్య, బృహస్పతి, ఇంద్ర, వాసుకి, పింగళులనే వాళ్లు సంప్రదాయ క్రమంలో ఈ శాస్త్రాన్ని నేర్చుకున్నారు పింగళునిచేత వ్రాయబడ్డ ఛందశ్శాస్త్రానికి '**ఛందోవిచితి**' అని పేరు. పింగళుడు వేదమంత్రాల ఛందస్సును లౌకికచ్ఛందస్సును కూడ వివరించాడు. పింగళుని ఛందశ్శాస్త్రానికి హైలర్షి హలాయుధుడు వ్యాఖ్యలను రచించారు వైదికచ్ఛందస్సు ఋక్ప్రాతిశాఖ్యలో కూడ వివరింపబడి ఉంది. కాత్యాయనుని '**సర్వానుక్రమణి**' లో (5వ అధ్యాయం) శుక్లయజుర్వేద వాజసనేయిసంహితలోని ఛందస్సు సమగ్రంగా వివరింపబడింది.

మంత్రం ఒకటినుండి ఎనిమిది పాదాలవఱకు ఉంటుంది. ఒకపాదంలో 5 నుండి 12 అక్షరాలవఱకు ఉంటాయి. అక్షరమంటే ఒక అచ్చు. హల్లుతోకూడిన అచ్చు అనుస్వారంతో కూడిన అచ్చు. పాదపూరణంకోసం పదవిభజన చేయడం పనికిరాదు. అక్షరాల సంఖ్యలో ఎక్కువగాని తక్కువగాని ఉన్నప్పుడు వాటిని తగినరీతిలో ఉచ్చరించాలి. చూడండి:

**'వర్ధమానం స్వేదమ్'** (ఋ. సం.1-1-8).

ఇది గాయత్రీపాదం. కాని ఏడు అక్షరాలే ఉన్నాయి. కనుక **'స్వేదమ్'** బదులుగ **'సువిదమ్'** అని ఉచ్చరించి ఎనిమిది అక్షరాలుగా

లెక్కించాలి. సంధ్యక్షరాలు రెండు అచ్చులుగా ఉచ్చరింపబడతాయి. ఉదా 'జ్యేష్ఠ' అనేపదం 'జ్యయిష్ఠ' అని ఉచ్చరింపబడుతుంది. కొన్ని సందర్భాల్లో స్వరభుక్తి ఒక అక్షరంగా గ్రహింపబడుతుంది. ఉదా: **'ఇంద్ర'** అనే పదం **'ఇందర'** అని ఉచ్చరింపబడుతుంది. ఎనిమిది అక్షరాలు కల పాదాంతంలో షష్ఠి బహువచన ప్రత్యయమైన **'అమ్'** **'అఅమ్'** అని ఉచ్చరింపబడుతుంది

వేదమంత్రాలు వివిధచ్ఛందస్సులలో ఉన్నాయి. మంత్రాలలోని అక్షరసంఖ్యను బట్టి వాటికి వేర్వేరు పేర్లు కలిగాయి. వాటిలో ముఖ్యమైనవి గాయత్రి (24 అక్షరాలు), ఉష్ణిక్ (28), అనుష్టుప్ (32), బృహతి (36), పంక్తి (40), త్రిష్టుప్ (44), జగతి (48) అనే ఏడు ఛందస్సులు, (చూ.పే.58).

ఇవికాకుండా **'అతిచ్ఛందస్సులు'** అని పిలువబడుతున్న మరొక ఏడు ఛందస్సులు ఉన్నాయి. వీటికి **'యజుస్సులు'** అనే పేరుకూడ ఉంది. ఇవి అన్నీ వాజసనేయిసంహితలో ప్రయోగింపబడ్డాయి. అవి అతిజగతి (52), శక్వరి (56), అతిశక్వరి (60), అష్టి (64), అత్యష్టి (68), ధృతి (72), అతిధృతి (76). ఇవికాక మరొక ఏడు **'అతిచ్ఛందస్సులు'** శుక్లయజుర్వేదంలో ప్రయోగింపబడ్డాయి. అవి కృతి (80) ప్రకృతి (84), ఆకృతి (88), వికృతి (92), సంకృతి (96), అభికృతి (100), ఉత్కృతి (104).

శుక్లయజుర్వేదవాజసనేయి సంహితలోని ఛందస్సులు, వాటి విశేషాలను కొన్నింటిని ఇక్కడ గమనిద్దాం. ఈ ఛందస్సులలో గాయత్రి ప్రధానమైంది.

1. **గాయత్రి:** [illegible] పాదాలు. 8+8+8=24 అక్షరాలు.
   1. తత్సవితుర్వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి
      ధియో యో నః ప్రచోదయాత్ (3-35).

2. **గాయత్రి ఉష్ణిక్ గర్భ:** 6+7+11=24 అక్షరాలు.
ఋతశ్చ సత్యశ్చ, ధ్రువశ్చ ధరుణశ్చ,
ధర్తా చ విధర్తా చ విధారయః (17-82).

3. **గాయత్రీబృహత్యౌ మధ్యేఽవసానహీనే:** (3-8-17).

4. **గాయత్రీ అవసానహీనా:** (5-35).

5. **పాదనిచృత్ గాయత్రి:** (7+7+7=21) అక్షరాలు
అమూర్యా ఉప సూర్యే, యాభిర్వా సూర్యః సహ,
తా నో హిన్వంత్వధ్వరమ్ (6-24)

[redacted]. **ప్రతిష్ఠాగాయత్రి:** 8+7+6=21 అక్షరాలు.
త్వమగ్నే వ్రతపా అసి, దేవ [redacted] మర్త్యేష్వా.
త్వం యజ్ఞేష్వీడ్యః (4-16)

7. **స్వరాట్ గాయత్రి:** 8+8+10=26 అక్షరాలు.
సముద్రస్య త్వాఽవకయాగ్నే పరివ్యయామసి పావకో
అస్మభ్యం శివో భవ (17-4).

8. **పదపంక్తిగాయత్రి:** 5+5+5+5+6=26 అక్షరాలు.
ఏభిర్నో అర్కైర్భవా నో అర్వాఙ్ స్వర్ణజ్యోతిః అగ్నే
విశ్వేభిః సుమనా అనీకైః (15-46).

9. **విరాట్ శంకుమతి గాయత్రి:** (12-73) దీన్ని మహీధరుడు
**'ఆర్షీగాయత్రి'** అని పేర్కొన్నాడు.

10. **గాయత్రీ శంకుమతి:** 8+8+5=21 అక్షరాలు.
యుక్తేన మనసా వయం
దేవస్య సవితుః సవే
స్వర్గ్యాయ శక్త్యా (11-2).

**11. ఏకపదా గాయత్రి:**
అగ్నిర్జ్యోతిర్జ్యోతిరగ్నిః స్వాహా (3-9).

**12. ద్విపదా గాయత్రి:**
శం న ఇంద్రాపూషణా వాజసాతౌ శమింద్రాసోమా
సువితాయ శం యోః (36-11).
ఉదు త్యం జాతవేదసం దేవం వహంతి కేతవః
దృశే విశ్వాయ సూర్యగ్ం స్వాహా (7-41).
ఇక్కడ మూడవ పాదంలో 7అక్షరాలే ఉన్నాయి 'ఉ'
నిపాతం పాదపూరణం కోసమే ఉచ్చరింపబడుతున్నది.

2. **ఉష్ణిక్** : మూడుపాదాలు 8+8+12=28 అక్షరాలు లేక నాలుగు పాదాలు 7+7+7+7=28 అక్షరాలు.

1. త్ర్యాయుషం జమదగ్నేః
కశ్యపస్య త్ర్యాయుషమ్.
యద్దేవేషు త్ర్యాయుషం
తన్నో అస్తు త్ర్యాయుషమ్ (3-62).

2. 8+10+10=28 అక్షరాలు.
ప్రాగపాగుదగధరా
క్సర్వతస్త్వాదిశ ■ ధావంతు
అంబ నిష్పర సమరీర్విదామ్ (6-36).

3. 8+8+14=30 అక్షరాలు (11-59)

4. 19+10=29 అక్షరాలు (12-57)

5. 14+15=29 అక్షరాలు (12-59). దీన్ని మహీధరుడు
**ఆర్షీఉష్ణిక్** అని పేర్కొన్నాడు.

6. 10+9+9=28 అక్షరాలు (17-80).

7. 18+12=30 అక్షరాలు (38-12). దీన్ని మహీధరుడు 'స్వరాట్ ఉష్ణిక్' అని వ్యవహరించాడు.

8. ఉష్ణిక్ విషమపాద:
అగ్నే స్వాహా కృణుహి జాతవేత ఇంద్రాయ హవ్యమ్
విశ్వేదేవా హవిరిదం జుషంతామ్ (27-22).

9. పుర ఉష్ణిక్: 12+8+8=28 అక్షరాలు.
అప్స్వంతరమృతమప్సు భేషజమపాముత
ప్రశస్తిష్వశ్వా భవత వాజినః (9-6).

10. వర్ధమానా ఉష్ణిక్: 6+7+8+9=30 అక్షరాలు.
కోఽసి కతమోఽసి, కస్యాసి కో నామాసి
యస్య తే నామామన్మహి యం త్వా సోమేనాతీతృపామ (7-29).

11. అనుష్టుప్ గర్భోష్ణిక్:
పితుం ను స్తోషం మహో ధర్మాణం తవిషీమ్
యస్య త్రితో వ్యోజసా వృత్రం విపర్వమర్దయత్ (34-7).

12. పరోష్ణిక్: 8+8+12=28 అక్షరాలు (18-54).

13. కకుమ్మతి పరోష్ణిక్: (14-22).

14. కకుభ్: 8+12+8=28 అక్షరాలు.
భేషజమసి భేషజం గవేఽశ్వాయ పురుషాయ భేషజమ్
సుఖం మేషాయ మేష్యై (3-59).

3. అనుష్టుప్: నాలుగు పాదాలు 8+8+8+8=32 అక్షరాలు.

1. అయమగ్నిః పురీష్యో రయిమాన్ పుష్టివర్ధనః
అగ్నే పురీష్యాభి ద్యుమ్నమభి సహ ఆయచ్ఛస్వ (3-40).

2. **పూర్ణరూపా అనుష్టుప్: 9+11+12=32** అక్షరాలు.

రూపేణ వో రూపమభ్యాగాం తుథో వో విశ్వవేదా విభజతు ఋతస్య పథా ప్రేత చంద్రదక్షిణా **(7-45).**

ఇక్కడ మూడుపాదాలే ఉన్నాయి. ఐనా **32** అక్షరాలుండటం వల్ల పూర్ణ.

3. **పిపీలికామధ్యాకృతి అనుష్టుప్:**

అజీజనో హి పవమాన సూర్యం విధారే శక్మనా పయః గోజీరయా రంహమాణః పురంధ్యా **(22-18).**

4. **అనుష్టుప్ విరాట్ ఛందః:**

అషాఢాఽసి సహమానా సహస్వారాతీః సహస్వ పృతనాయతః సహస్రవీర్యాఽసి సా మా జిన్వ **(13-26).**

5. **ఏకపదా విరాట్: 10** అక్షరాలు.

జుషాణో అప్తురాజ్యస్య వేతు స్వాహా **(5-35).**

6. **ద్విపదా విరాట్: 20** అక్షరాలు **(2-21).**

యుక్త్వాయ సవితా దేవాన్ స్వర్యతో ధియా దివమ్ బృహజ్జ్యోతిః కరిష్యతః సవితా ప్రసువాతి తాన్ **(11-3).**

ఇక్కడ **8+7+8+8=31**అక్షరాలు కనుక ఏకఊన అనుష్టుప్.

7. **ఏకాధికానుష్టుప్: 8+9+8+8=33** అక్షరాలు.

సుజాతో జ్యోతిషా సహ శర్మ వరూథమాసదత్స్వః వాసో అగ్నే విశ్వరూపం సం వ్యయస్వ విభావసో **(11-40).**

ఇక్కడ రెండవపాదంలో **9** అక్షరాలున్నాయి. కనుక ఏకాధికానుష్టుప్.

**4. బృహతి**: 4 పాదాలు. **8+8+12+8=36 అక్షరాలు.**

1. కదాచన స్త్రరీరసి, నేంద్ర సశ్చసి దాశుషే
ఉపోపేన్ను మఘవన్ భూయ ఇన్ను తే,
దానం దేవస్య పృచ్యత (8-2).

2. **పురస్తద్ బృహతి:** 12+8+8+8=36 అక్షరాలు.
పరి మాగ్నే దుశ్చరితాద్బాధస్వా మా సుచరితే భజ ఉదాయుషా
స్వాయుషోదస్థామమృతాం అను(4-28).

3. **పిపీలికామధ్యా బృహతి:** 13+9+14=36 అక్షరాలు లేక
13+8+13=34 అక్షరాలు.
పృథివ్యా అహముదంతరిక్షమారుహమంతరిక్షాద్దివ
మారుహం దివో నాకస్య పృష్ఠాత్ స్వర్జ్యోతిరగామహమ్ (17-67).

4. **న్యంకుసారిణి బృహతి:** 8+12+8+8=36 అక్షరాలు.
అయమగ్నిర్గృహపతిర్గార్హపత్యః ప్రజాయా వసువిత్తమః అగ్నే
గృహపతేఽభి ద్యుమ్నమభి సహ ఆయచ్ఛస్వ (3-39).
దీనికే స్కందగ్రీవా, ఉరోబృహతీ అనే పేర్లున్నాయి. ఇందులో
8+12+9+8=37 అక్షరాలు కూడా ఉంటాయి.

5. **పథ్యాబృహతి:** 8+8+12+8=36 అక్షరాలు.
శ్వాత్రా స్థ వృత్రతురో రాధోగూర్తా అమృతస్య పత్నీః
తా దేవీర్దేవత్రేమం యజ్ఞం నయతోపహూతాః సోమస్య పిబత
(6-34).
ఇక్కడ 8+9+12+9=38 అక్షరాలుండడంవల్ల ద్వ్యధికా అంటే
రెండక్షరాలు ఎక్కువ గలది.

6. **ఉపరిష్టాత్ బృహతి:** 8+8+8+12=36 అక్షరాలు.
ఊర్ధ్వ ఊ షుణ ఊతయే తిష్ఠా దేవో న సవితా
ఊర్ధ్వో వాజస్య సవితా యదంజిభిర్వాఘద్భిర్విహ్వయామహే
(11-42).

7. **ఊర్ధ్వా బృహతి:** 12+12+12=36 అక్షరాలు (4-33).

8. **సతో బృహతి:** 12+8+12+8=40 అక్షరాలు (12-108)

9. **విపరీతా బృహతి:** 8+12+8+12=40 అక్షరాలు (6-33)

10. **మహాబృహతి:** 12+8+8+8+8=44 అక్షరాలు (19-72).

11. **మహాబృహతీ త్రిష్టుప్:** (12-8).

12. **ఏకోన ఊర్ధ్వబృహతి:** 10+13+12=35 అక్షరాలు.
ఉస్రావేతం ధూర్షాహౌ యుజ్యేథామనశ్రూ అవీరహణౌ బ్రహ్మచౌదనౌ స్వస్తి యజమానస్య గృహాన్ గచ్ఛతమ్ (4-33).

5. **పంక్తి:** ఐదుపాదాలు. 8+8+8+8+8=40 అక్షరాలు.

1. భవత నః సమనసౌ సచేతసావరేపసౌ
మా యజ్ఞం హింసిష్టం మా యజ్ఞపతిం జాతవేదసౌ
శివౌ భవతమద్య నః (5-3).

2. **పంక్తి విరాట్:** 10+10+10+10=40 అక్షరాలు.
ఉత్థామ మహతే సౌభగాయాస్మాదాస్థానాద్ ద్రవిణోదా వాజిన్ వయం స్యామ సుమతౌ పృథివ్యా అగ్నిం ఖనంత ఉపస్థే అస్యాః(11-21).

3. **పంక్తి త్రిష్టుప్ :** (8-6).

4. **మహా పంక్తి:** (3-18).

5. **త్ర్యవసానా మహాపంక్తి:** (3+43).

6. **ప్రస్తార పంక్తి:** 12+12+8+8=40 అక్షరాలు (8-43).

7. **ఆస్తార పంక్తి:** 8+8+12+12=40 అక్షరాలు (4-23).

8. విష్టార పంక్తి: 8+12+12+8=40 అక్షరాలు (12-160).

9. సంస్తార పంక్తి: 12+8+8+12=40 అక్షరాలు (36-12).

10. ఏకాధికా పంక్తి: 8+7+8+9+9=41 అక్షరాలు
దేవీరాపో అపాంనపాద్యో వ ఊర్మిర్హవిష్య ఇంద్రియావాన్
మదింతమః తం దేవేభ్యో దేవత్రా దత్త శుక్రపేభ్యో
యేషాం భాగ స్థ స్వాహా (6-27).
'స్వాహా' అనేది యజుస్సు.

6. త్రిష్టుప్ : 4 పాదాలు. 11+11+11+11=44 అక్షరాలు.

1. యా తే ధామాని హవిషా యజంతి
తా తే విశ్వా పరిభూరస్తు యజ్ఞమ్
గయస్ఫానః ప్రతరణః సువీరో౽
వీరహా ప్రచరా సోమ దుర్యాన్ (4-37).

2. విరాడ్రూపా త్రిష్టుప్ : (11-27).

3. యవమధ్యా త్రిష్టుప్ : (16-51).

4. పురస్తాజ్జ్యోతి త్రిష్టుప్ : (17-74).

5. మధ్యేజ్యోతి త్రిష్టుప్ : (12-65).

6. ఉపరిష్టాజ్జ్యోతి త్రిష్టుప్ :
ఋతావానం మహిషం విశ్వదర్శతమగ్నింసుమ్నాయ దధిరే
పురో జనాః శ్రుత్కర్ణం సప్రథస్తమం త్వా గిరా దైవ్యం
మానుషాయుగా (12-111).

7. మహాబృహతీ త్రిష్టుప్ : (12-8).

8. పంక్తి త్రిష్టుప్ : (8-61).

**7. జగతి:** నాలుగుపాదాలు. **12+12+12+12=48 అక్షరాలు.**

1. అగ్నె నయ సుపథా రాయే అస్మాన్
విశ్వాని దేవ వయునాని విద్వాన్
యుయోధ్యస్మజ్జుహురాణమేనో
భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ **(40-16).**

2. **మహాపంక్తి జగతి:** 6 పాదాలు. **8+8+8+8+8+8=48** అక్షరాలు.
ఏజతు దశమాస్యో గర్భో జరాయుణా సహ
యథాఽయం వాయురేజతి యథా సముద్ర ఏజతి
ఏవాయం దశమాస్యో అస్రజ్జరాయుణా సహ **(8-28).**

3. ఏకోనా జగతి: **(3-15).**

**8. అతిచ్ఛందస్సులు:**

1. **అతిజగతి: 52** అక్షరాలు **(9-39).**
2. **శక్వరి:** [illegible] అక్షరాలు **(34 -51).**
3. **అతిశక్వరి: 60** అక్షరాలు **(19-76).**
4. **అష్టి: 64** అక్షరాలు **(19-48).**
5. **అత్యష్టి: 68** అక్షరాలు **(4-1).**
6. **ధృతి: 72** అక్షరాలు **(16-64).**
7. **అతిధృతి: 76** అక్షరాలు **(11-9).**
8. **కృతి: 80** అక్షరాలు **(12-4).**
9. **ప్రకృతి: 84** అక్షరాలు **(5-7).**

10. **ఆకృతి:** [redacted] అక్షరాలు **(15-64).**

11. **వికృతి: 92** అక్షరాలు **(21-61).**

12. **సంకృతి:** [redacted] అక్షరాలు. ఈ సంహితలో ప్రయోగించబడలేదు.

13. **అభికృతి: 100** అక్షరాలు **(27-45).**

14. **ఉత్కృతి: 104** అక్షరాలు **(14-6).**

**9. యజుస్సులు:**

1. ఇషేత్వా

2. ఊర్జేత్వా-దైవీ అనుష్టుప్ (3 అక్షరాలు).

3. వాయవస్థ-దైవీబృహతి (4 అక్షరాలు).

4. దేవో వః సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణ అప్యాయధ్వమఘ్న్యా ఇంద్రాయభాగం ప్రజావతీ రనమీవా అయక్ష్మా మా వస్తేన ఈశత మాఘశంసో ధ్రువా అస్మిన్ గోపతౌ స్యాత బహ్వీః (యజుస్సు).

5. యజమానస్య పశూన్ పాహి-యాజుషీబృహతి. 9 అక్షరాలు (1-1).

ఇలా వాజసనేయిసంహితలోని 1-1 లో ఇన్ని ఛందస్సులు ఉన్నాయి. శుక్లయజుర్వేద కాలంనాటికే ఇలా ఛందస్సు శైలూషి లాగా అనేక భంగిమలతో నడయాడనేర్చింది. వాజసనేయిసంహితను దర్శించిన మహర్షుల బహుముఖసామర్థ్యం ప్రశంసనీయంగా ఉంది. ఛందోరచనలో వాళ్లు పాటించిన సౌలభ్యం ఆదర్శప్రాయం.

**ఛందస్సు ప్రయోజనాలు :**

కవిత్వానికి సౌందర్యాన్ని కలిగించేది ఛందస్సు. వచనం కంటె ఛందోబద్ధమైన రచన గుర్తుంచుకోవడానికి చాలా అనుకూలంగా ఉంటుంది. నియమపూర్వకమైన విచ్ఛేదం ఉండటంవల్ల ఇది ధారణకు ఎంతో వీలుగా ఉంటుంది. మంత్రజపాలలో ఆయా మంత్రాల ఛందోవిశేషజ్ఞానం ఎంతో ఆవశ్యకం. ఛందోజ్ఞానం లేకుండా చేసే జపాదులు ఫలించవు. ఛందోబద్ధంగా ఉండటం చేతనే వేదాలు లిఖితరూపంగా లేకపోయినప్పటికీ శ్రుతులనబడుతూ అనాదినుంచి స్వస్వరూపాన్ని కోల్పోకుండా చక్కని స్వరూపంతో చెక్కు చెదరకుండా స్థిరంగా ఉండగల్గాయి.

**-కె.వి.ఆర్.**

## 3. 8 వైశిష్ట్యం

అనాదినుంచి భారతీయులు ఆధ్యాత్మికతత్త్వజిజ్ఞాస చేస్తూ ఉన్నారు. వేదాలు వీరికి పరమప్రమాణాలు. అందులో యజుర్వేదం భిత్తిస్థానీయం. అంటే ఇంటికి గోడలాగా యజ్ఞక్రియలలో ఉపయోగించే ప్రధానవేదం. అందులోను యాజ్ఞికులలో ప్రధానుడైన అధ్వర్యుడుపయోగించే వేదం. కాబట్టి **'అధ్వర్యువేద'** మని పేరు పొందింది. ఈ యజుర్వేదం శుక్లయజుర్వేదమని, కృష్ణయజుర్వేదమని రెండు రకాలుగా ప్రచారంలో ఉన్నది. దక్షిణదేశంలో కృష్ణయజుర్వేదం, ఉత్తరదేశంలో శుక్లయజుర్వేదం బహుళ ప్రచారంలో ఉన్నాయి.

శుక్లయజుర్వేదసంహితకు వాజసనేయిసంహిత అని పేరు. ఈ సంహితలో యజ్ఞప్రక్రియకుపయోగించే మంత్రాలు కూర్చబడ్డాయి. కృష్ణయజుర్వేదంలో మంత్రాలన్నీ సంహితాభాగంలోను బ్రాహ్మణ గ్రంథం వేరుగాను ఉన్నది.

ఈవాజసనేయిసంహితలో రెండు శాఖలు ప్రచారంలో ఉన్నాయి. 1. మాధ్యందినశాఖ 2. కాణ్వశాఖ. రెండుశాఖల్లోను మంత్రాలన్నీ ఇంచుమించు సమానంగా ఉన్నా పాఠప్రవచనాల్లో తేడా ఉన్నది. మంత్రపాఠంలో రెండుశాఖలకు ముందువెనుకల్లో తేడా ఉన్నాయి. పఠనక్రమంలో తేడాలున్నాయి. పాఠభేదం గద్యాత్మకమైన అర్థవాదభాగంలోనే ప్రత్యేకంగా కనబడుతుంది. పద్యాత్మకభాగంలో అనగా ఋక్కులనబడేమంత్రాల్లో కనపడదు.

ఈ శుక్లయజుర్వేదంలో నలభై అధ్యాయాలున్నాయి. అందులో మొదటి పద్దెనిమిది అధ్యాయాలు వేఱుగా ఉన్న బ్రాహ్మణభాగంలో వ్యాఖ్యానింపబడ్డాయి. మిగిలిన ఇరవైరెండధ్యాయాల్లో పదిహేడు

అధ్యాయాలకు బ్రాహ్మణభాగం విరళంగాను, ఐదుఅధ్యాయాలకు బ్రాహ్మణభాగం లేకపోవడం కన్పడుతుంది. ఇది గాక, చివఱి ఇరవైరెండధ్యాయాలు కృష్ణయజుర్వేదంలో బ్రాహ్మణారణ్యక భాగాలుగా కన్పడుతున్నాయి కాత్యాయనుని '**కృష్ణయజుర్వేదానుక్రమణిక**' లో **26** వ అధ్యాయం నుంచి **35** వ అధ్యాయం వఱకు పది అధ్యాయాలు ఖిలభాగమని చెప్పబడింది.

వాజసనేయిసంహితలోని నలభై అధ్యాయాల్లోను మొదటి ఇరవై అధ్యాయాలు యజ్ఞప్రక్రియకుపయోగించేవి. **26** వ అధ్యాయం మొదలు **29** వ అధ్యాయంవఱకు మొదటి ఇరవైఅయిదధ్యాయాలకు వ్యాఖ్యాన రూపంగా కనపడతాయి. **30** నుంచి **39** వ అధ్యాయం వఱకు ఉన్న తొమ్మిది అధ్యాయాలు నరమేధ, పితృయజ్ఞ, విశ్వజిద్యాగాది విషయాలను ప్రతిపాదిస్తున్నాయి. నలభైయవ అధ్యాయం '**ఈశావాస్యోప నిషత్తు**' శుక్లయజుర్వేదంలో ఋక్కులు చాలా చెప్పబడ్డాయి. అంతేకాదు యజ్ఞాలలో ఏసందర్భంలో ఏ ఋక్కుపఠించాలో చక్కగా వర్ణించబడింది. కాబట్టి శుక్లయజుర్వేదసంహితలు రెండింటిలో ఇంచుమించు నాలుగవభాగం ఋఙ్మంత్రాలు, మిగిలిన మూడు వంతులు అర్థవాదరూపంగా గాని యజ్ఞక్రియాబోధకంగా గాని కనపడుతుంది.

ఇంతవఱకు మనం శుక్లయజుర్వేద స్వరూపాన్ని గురించి తెలిసికొన్నాం. ఈ వేదం యజ్ఞక్రియాస్వరూపాన్ని బోధిస్తుందని చెప్పబడింది. యజ్ఞమంటే దేవతలకు హవిర్భాగాలనిచ్చే క్రియా కలాపం. పరమేశ్వరుడొక్కడే ఐనా వర్షం ఇచ్చేటప్పుడు ఇంద్రుడని, అపమృత్యువును జయించటానికి మృత్యంజయుడు లేక రుద్రుడని, లోకసృష్టికి కారకుడై సూర్యుడుగాను, ఈ ప్రకారం మిత్రావరుణులని, అగ్ని అని అనేక దేవతాస్వరూపాలు కలవాడుగా చెప్పబడుతున్నాడు.

ఆయా దేవతలను హవిర్దానంచేత ఆరాధించే క్రియాకలాపమే యజ్ఞం. ఈ యజ్ఞాలు ఏడు పాకయజ్ఞాలని, ఏడు హవిర్యజ్ఞాలని, ఏడు సోమయజ్ఞాలని వైదికసంప్రదాయం.

ఇలా దేవతారాధనాప్రధానంగా కృష్ణయజుర్వేదం లాగా శుక్లయజుర్వేదమున్నప్పటికీ, ఐహికజీవితసంబంధమైన విషయాల కోసం కూడ దేవతారాధనం చెప్పబడింది. అనావృష్టి సందర్భంలో వర్షంకోసం వరుణ జపాదులు, శత్రుజయంకోసం విహవ్యమంత్రాలు, జయలు, రాష్ట్రభిత్తులు, అభ్యాతానములనే మంత్రాలు ఉపదేశించ బడ్డాయి. ఈ ప్రకారం ఐహికజీవితోపయోగం కోసం చెప్పబడ్డ మంత్రాలు చాలా ఉన్నాయి. మానవజీవితానికి ఐహికాముష్మికాలు రెండూ ముఖ్యమైనవే. ఆయా వేదాల సంహితాభాగాలు చాలావఱకు ఐహికోపయోగంకోసం, ఆరణ్యకోపనిషద్భాగాలు ఆముష్మికంకోసం ఉద్దేశింపబడ్డాయి

నవీనులకు వేదాల విషయంలో ఒక సందేహం కలుగవచ్చు. అతీంద్రియసత్యాలను ఉపనిషన్ముఖంగా ప్రతిపాదించడంలో వారి కాక్షేపం లేదుగాని, ఐహికజీవితంలో పుత్రసంపత్తికోసం, పశు సంపత్తికోసం, అర్థసంపత్తికోసం అలాగే అనావృష్టి లేకుండా వర్షం కోసం, యుద్ధంలో జయంకోసం, శత్రునాశంకోసం ప్రార్థనలు చేసే ఈ వేదమంత్రాలు నిజంగా ఆయా ఇష్టసిద్ధిని కలిగిస్తాయా? అని, కాని 'More things [redacted] wrought by prayer than the world dreams of ' అని ఒక పాశ్చాత్యకవి చెప్పినట్లు, అల్పశక్తికల మానవుడు, సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వాది గుణాలుకల పరమేశ్వరుని ఆరాధించాలని, ఆ ఆరాధన కేవలం లౌకికభాషలోగాక గొప్పశక్తికల దివ్యమంత్రాల ద్వారా ఆరాధిస్తే తప్పక ఫలితం ఉంటుందని మహర్షుల తాత్పర్యం. వేదాలలో విశ్వాసంలేని బౌద్ధచార్వాకాదులు హేళనాపూర్వకంగా

ఇలా ఆక్షేపిస్తారు. ఒకడు ఒకనదికి ఇవతలిబడ్డున ఉండి 'ఓ పరమేశ్వరా! నన్ను అవతలిఒడ్డుకు తీసికొని పొమ్మని ప్రార్థిస్తే ఆ ప్రార్థన సిద్ధిస్తుందా?' అని. దానికి ఇది సమాధానం- (గామానయ దేవదత్త!) దేవదత్తా! ఆవుని తీసికొనిరా! అని శబ్దప్రయోగం చేయగానే దేవదత్తుడు ఆవును తీసికొని వస్తున్నాడు కదా! లౌకికశబ్దానికే అంతటి శక్తి కన్పడుతుండగా స్వరచ్ఛందోబద్ధమై మహర్షులచేత దర్శింపబడిన ఈ వైదిక మంత్రాలకు ఆ శక్తి ఎందుకుండకూడదు? కాబట్టి మంత్రోచ్చారణలో స్వరవర్ణాదిలోపం[1] లేని మంత్రాలు శబ్దప్రధానాలై శక్తిమంత్రాలై ఆయుధాల్లాగా పనిచేస్తాయని మహర్షులు చెప్పారు.

మంత్రాలు మహర్షులచేత దర్శింపబడ్డాయని సంప్రదాయం. మహర్షులు తీవ్రతపోనిష్ఠలో నుండగా ఆ మంత్రాలు శ్రుతిగోచరాలైనాయి. అందుచేతనే వేదాలకు శ్రుతులు అనే పేరేర్పడింది ఈ యజుర్వేదంలో చెప్పబడ్డ విహవ్యమంత్రాలు చాలా ప్రసిద్ధాలు అవి ఈ వేదానికొక విశిష్టతను చేకూర్చాయి. వాటి ప్రభావాన్ని వివరించే ఈ సంఘటన గమనించదగింది.

"విశ్వామిత్రజమదగ్నీ వసిష్ఠేనాఽస్పర్ధేతాం.
స ఏతజ్జమదగ్నిర్విహవ్యమపశ్యత్
యద్విహవ్యగ్ం శస్యతే. ఇంద్రియం
వీర్యం యజమానో భ్రాతృవ్యస్య వృఙ్క్తే."

---

1. మంత్రో హీనః స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో న తమర్థమాహ।
స వాగ్వజ్రో యజమానం హినస్తి యథేంద్రశత్రుం స్వరతోఽపరాధాత్॥
వృత్రాసురుడు 'ఇంద్రశత్రుర్వర్ధస్వ' అని ప్రార్థనచేస్తూ స్వరం తప్పుగా పలకడంవల్ల ఇంద్రునిచేత సంహరింపబడ్డాడు. కనుక స్వరవర్ణాది లోపాలతో మంత్రాలనుచ్చరిస్తే ఆ మంత్రశబ్దం వజ్రమై యజమానిని సంహరిస్తుంది. పా.శి. 52.

ఒకప్పుడు విశ్వామిత్ర జమదగ్ని మహర్షులు వసిష్ఠునితో స్పర్ధపడ్డారు. అప్పుడు జమదగ్ని మహర్షి తపోనిష్ఠాబలంతో 'విహవ్య' మనే మంత్రాన్ని దర్శించాడట. విహవ్యమంత్రాన్ని జపించినవాడు శత్రువుయొక్క ఇంద్రియబలాన్ని, వీర్యాన్ని సంహరించగలడట. ఇటువంటి లౌకికాలౌకిక ప్రయోజనాలను చేకూర్చే విశిష్టమంత్రాలుగల సంహిత శుక్ల యజుస్సంహిత. ఇది బహుముఖమైన వైశిష్ట్యం కలది.

- డి.ఏ.ఎస్.

## 3.9 మతం - తత్త్వం

**మతం :**

మతం అనేపదం మను=అవబోధనే అనే ధాతువునుంచి ఏర్పడింది. ఇష్టమైన సిద్ధాంతానికి మతం అనే వ్యవహారం ఉంది. కొందఱు సంప్రదాయమనే అర్థంలో మతశబ్దాన్ని ప్రయోగిస్తున్నారు. మతమంటే 'శ్రద్ధ' అని 'ధర్మ' మనికూడ ఇంకొందఱి అభిప్రాయం. ప్రస్తుతం దీనికి సమానంగా Religion[1] అనే ఆంగ్లపదం ఉపయోగింప బడుతున్నది.

ఎవరెలా చెప్పినా దుఃఖనివృత్తికోసం సుఖప్రాప్తికోసం ఒక మార్గం మంచిదని నమ్మి, శ్రద్ధతో విశ్వాసంతో కొంతమంది దాన్ని అనుసరిస్తూ చేసుకున్న నిర్ణయానికే మతమనిపేరు. మొదట్లో అది మూలపురుషుడి సదభిప్రాయమే అయినా, కాలక్రమేణ జనసామాన్యం చేత ఆదరింపబడి, ఆ మార్గాన్ననుసరించే వారికందఱికీ అభిమతంగా పరిణమిస్తుంది. ఇక దాంట్లో దేశకాల పరిస్థితులను బట్టి ప్రధానలక్ష్యం చెడకుండా ఎన్నెన్నో మార్పులు చేర్పులు ఏర్పడుతుంటాయి. మఱి ఈనాడు లోకంలో ఎంతగానో విస్తరించిన మతాలకు సంప్రదాయాలకు శుక్లయజుర్వేదంలో ఎలాంటి మూల సిద్ధాంతాలు దొరుకుతాయని, అందులోని కొన్ని అంశాలను అవలోకిస్తూ ఇక్కడ సంగ్రహంగా పరిశీలిద్దాం.

అనాటివారు తమకోరికలను నెరవేర్చుకోవడానికి, జీవితంలో విజయాన్ని సాధించడానికి యజ్ఞాన్ని ప్రధానసాధనంగా భావించారు.

1. ఈ పదం **Religore** అనే పదం నుంచి ఏర్పడిందని లాక్టాంటియస్ ప్రభృతులు, **Relegere (=to observe or pay attention)** అనే పదం దీనికి మూలమని సిసిరో మొ॥ వారు అభిప్రాయపడుతున్నారు.

శుక్లయజుర్వేదంలో ఈ దృష్టి మనకు ఎక్కువగా కనపడుతున్నది. కనుకనే అప్పటివారి జీవితం యజ్ఞమయంగా గోచరిస్తుంది.

యజ్ఞాలు అనేకాలు. అందులో ఒకో యజ్ఞం ఒకో పద్ధతిలో ఆచరింపబడుతుంది. ప్రతియజ్ఞంలోను ప్రధానదేవతలు, అప్రధాన దేవతలు ఎందఱో ఉంటారు. విభిన్న ప్రయోజనాలనుద్దేశించి ఆయాదేవతలను ఆరాధించడం ఆనాటి సముదాచారంగా కనపడుతుంది. యజ్ఞాలను వదిలేస్తే ఆనాటివారి మతతత్త్వవిశేషాలను మనం గ్రహించడం కష్టతరం. అయినా సందర్భవశాన అక్కడక్కడ కనబడుతున్న కొన్నిఅంశాలను బట్టి వారి మతతత్త్వభావనలను అర్థం చేసుకోవచ్చు.

'మతమనే పదానికి కాలభేదాన్ననుసరించి అర్థభేదం లేకపోలేదు. అయినా ఆనాటివారికి సంబంధించిన 1. యజ్ఞయాగాలు 2. దేవతలు 3. కోరికలు 4. ఆచారాలు 5. ప్రార్థనలు 6. ఆలోచనలు అనే అంశాలను పరిశీలిస్తే వారి మతస్వరూపం మనకు కొంతకు కొంత విశదమవుతుంది.

**1. యజ్ఞయాగాలు:**

ఆనాటిజీవనసరణిలో కొట్టవచ్చినట్లు కనపడే ప్రధానోద్యమం యజ్ఞానుష్ఠానం. యజ్ఞాలు ఆనాటి మానవజీవితాన్ని చాలావఱకు ప్రభావితం చేసినట్లు తెలుస్తుంది. శుక్లయజుస్సంహితలోగల 40 అధ్యాయాలలో ముందు చెప్పబోయే 12 ప్రధానకర్మలు ముఖ్యంగా పేర్కొనదగినవి: 1. దర్శపౌర్ణమాసలు 2. అగ్నిహోత్రయాగం 3. సోమ యాగం 4. వాజపేయం 5. రాజసూయయాగం 6. అగ్నిచయనం 7. సౌత్రామణి 8. అశ్వమేధం 9. పురుషమేధం 10. సర్వమేధం 11. పితృమేధం 12. ప్రవర్గ్య.

వాళ్ల అర్హతను ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ వైదిక కర్మలను ఆనాటివారనుష్ఠించేవారు. ఈ యజ్ఞయాగాలను తమ జీవితసర్వస్వంగా వారు భావించారనే విషయం వాజపేయయాగానికి సంబంధించిన ఒక మంత్రంలో ఎంత స్పష్టంగానో మనం తెలుసుకోవచ్చు. చూడండి:

"ఈ వాజపేయ యజ్ఞానుష్ఠానంద్వారా నాకు మంచి ఆయుష్యం కలగాలి ఈ యజ్ఞం నాకు చక్కని ప్రాణాన్ని, దృష్టిని, వినికిడిని, వీపును, విష్ణుజ్ఞానాన్ని కలిగించాలి. మేము జగత్పితయైన ప్రజాపతి సంతానం. ఓ దేవతాలారా! మేము స్వర్గాన్ని పొంది మరణరహితమైన అమృతత్వాన్ని సాధించాం" (9.21).

దీనివల్ల వారు యజ్ఞాన్ని ఎలా సకలార్థసాధనంగా భావించారో వారి జీవితాల్లో యజ్ఞానికి గల స్థానమేమిటో మనం స్పష్టంగా తెలుసుకోవచ్చు.

**2. దేవతలు:**

దేవతలను గురించిన ప్రస్తావనలో ఈ సంహితనుంచి మనం తప్పకుండా తెలుసుకోవలసిన విశేషం ఒకటుంది. అంబిక రుద్రుని పత్ని అని లోకప్రసిద్ధి. కాని ఇందులో అంబిక రుద్రుని చెల్లిగా అభివర్ణింపబడింది (3.57). అంతేకాదు; రుద్రుడు, అంబిక కూడ చాల క్రూరులైన దేవతలుగ పేర్కొనబడ్డారు. రుద్రుడు తన చెల్లెలైన అంబికతో కలసి విరోధులను నాశనం చేస్తాడు.

ఈ సంహితలో అక్కడక్కడ ఆయాదేవతల స్వరూపస్వభావాలు వ్యక్తిగతంగా చక్కగా వర్ణింపబడ్డాయి. అంతేకాక సాముహికంగా దేవతలందరి సహజప్రవృత్తి ఎలా ఉంటుందో, వారినుంచి

ఆనాటివారు ఏమి ఆశించారో కూడ ఇలా ఈ సంహిత ఎంతో చక్కగా వివరిస్తున్నది:

"మనకు సకలశుభాలను ఇచ్చే దేవతల మంచిబుద్ధి మనపై ఎప్పుడూ ప్రసన్నంగా ప్రసరించాలి వారు ఋజుప్రవృత్తికలవారు యోగ్యుడైన యజమానిని వారభిమానిస్తారు మనకు కావలసిన సంపదలనన్నింటిని వారనుగ్రహించాలి మన వాళ్లందఱికీ మంచి ఆయుష్యాన్ని వారు తప్పక ఇస్తారు" (25.15).

ఇలాంటి ఉద్దేశ్యాలతో దేవతలనారాధించడం ఆనాటి పరిపాటి అని మనం తెలుసుకోవచ్చు.

ఇంద్రాదిరూపాల్లో ఉన్న పరమాత్మ మనకు మంచిని కలిగించాలని లోకక్షేమంకోసం ఇంద్రాదిదేవతలను స్తుతించడం ఈ వేదంలో మనకు పదేపదే కనబడుతుంది.

"ఇంద్రుడు గొప్పకీర్తికలవాడు అతడు మనకందఱికీ శుభాన్నికలిగించాలి ఈ విశ్వమే తన సర్వస్వమైన పూష మనకు శుభాన్ని కలిగించాలి హింసింపబడని రెక్కలుగల గరుత్మంతుడు, దేవగురువైన బృహస్పతికూడ మనకు మంచిని కలిగించాలి" (25.19).

### 3. కోరికలు:

ఆనాటివారి కోరికలను బట్టికూడ మతపరంగా వారి మనస్తత్త్వాన్ని మనం కొంతవఱకు అర్థం చేసుకోవచ్చు. యజమాని ప్రధానయాగాన్ని శ్రద్ధగా నిర్వహించాడు. హోత అతణ్ణి ఆశీర్వదిస్తున్నాడు. అప్పుడు యజమాని ఇలా జపిస్తున్నాడు:

"ఇంద్రరూపియైన పరమేశ్వరుడు నాలో వీర్యాన్ని కలిగించాలి. దైవమానుష సంపదలు, ధనవంతులు నన్నెప్పుడు సేవించాలి సత్యమైన ఆశీస్సులు మనకు లభించాలి. పృథివి మనచేత ఆహ్వానింపబడింది. ఆమె ఈ జగత్తుకు నిర్మాత. మనచే తల్లిలాగా భావించబడ్డ పృథివి, యజ్ఞంలో మిగిలిపోయిన హవిస్సును తినడానికి నాకనుజ్ఞనివ్వాలి" (2.10).

ఈ కోరికలను గురించి లోతుగా ఆలోచిస్తే ఎలాంటి ధార్మిక ప్రవృత్తి వారిలో ఉండేదో మనకర్థమవుతుంది.

సత్యం అగ్నిహోత్రుని ఉపాసించే ఆనాటివారు "ఈ సమిధలతో నీవు బాగా పెరిగి, మమ్ములను గూడ బాగా వృద్ధికి తీసుకురావాలి. నీదయపల్లమేము మాసంతానాన్ని, పశుధనాదులను అభివృద్ధి చేసుకుంటాం" (2.14) అని ప్రార్థించేవారు. వారి అభివృద్ధి అంతా అగ్నిహోత్రుని దయవల్లనే కలుగుతుందనే నిశ్చయం ఇందులో మనకు స్పష్టమవుతుంది.

వారిలో ఎక్కువమంది సత్యవృత్తికలవారైనా యజ్ఞప్రక్రియకు విరోధులను వారు ద్వేషించారు. తమ శత్రువులను అగ్నీషోములు నాశనం చేయాలని వారు కోరారు (2.15).

అశ్వినీదేవతలలాగా రోగహీనుడు, సుందరుడైన పుత్రుడు కలగాలని వారు పితరులను కోరేవారు. అలాంటి పుత్రుణ్ణి తన భార్య గర్భంలో ధరించేటట్లు చేయమని యజమాని కోరిక (2-33). పితృదేవతల అనుగ్రహంవల్ల సత్సంతానం కలుగుతుందనే విశ్వాసం ఆనాటికే ఉంచని దీన్నిబట్టి తెలుస్తుంది.

సహజంగా మానవజీవితంలో ప్రతివాడు ఏమేమి కావాలను కుంటాడో ఆనాడు అవన్నీ యజ్ఞంద్వారానే సిద్ధిస్తాయనే గట్టి విశ్వాసం ఉండేది. శుక్లయజుస్సంహితలోని 18 వ అధ్యాయంలో 27 మంత్రకండికల్లో ఈ క్రిందివిధంగా వారి కోరికలు మనకు కనపడతాయి:

ఇతరులకు అన్నం పెట్టే అవకాశం, మంచిసంకల్పం, మంచి మాట, మంచి శబ్దాలను వినే అవకాశం, జ్ఞానకర్మేంద్రియాలను చక్కగా ఉపయోగించుకొనే నేర్పు, జయించే సామర్థ్యం, పరలోక విశ్వాసం, పిల్లలను కని వారిని చక్కగా పెంచేశక్తి, ప్రతిబంధకాలను

తొలగించుకొని బాగాపంటలు పండించగలశక్తి, ప్రియమైన సత్యమైన వాక్కు, ఆకలి, కార్యనిర్వహణసామర్థ్యం, అసాధ్యమైన పనులు చేయగల నిశ్చయం, అగ్నిహోత్రాది కర్మలను చేసే శక్తి, ఇష్టాలను సాధించుకొనే ఉపాయం మొ॥ వ్యక్తిగతమైన కోరికలు యజ్ఞం ద్వారా వారు సిద్ధింపచేసుకొనేవారు.

అన్నం, పరిశుద్ధి, ధ్యానం, చక్కనిజ్ఞానం, ప్రాణాలు, మంచి మనస్సు, లోకజ్ఞానం, శ్రవణేంద్రియం, ఓజస్సు, బలం, పరమాత్మజ్ఞానం, ఆరోగ్యమైన శరీరం, ఐహిక ఆముష్మికసుఖాలు, రక్షణ, దృఢమైన అవయవాలు, మంచిజీవనం, దీర్ఘాయుష్యం, ప్రశస్తి, అధికారం, మానసిక-బాహ్యాకోపాలు, మహత్వం, వంశాభివృద్ధి, విద్యాదులచే గొప్పదనం, సత్యం, సంతానం, ముందు కలగబోయే సంతతి, ఋగాద్యధ్యయనం, మంచిపుణ్యాం, ధాతుపుష్టి, ఆరోగ్యం, శత్రువులులేకపోవడం, అభయం, ఆనందం, మంచిశయ్య చక్కగా స్నానసంధ్యాదులు చేసుకొనే ప్రాతఃకాలం, యజ్ఞదానాధ్యయనాలను నిర్వహింపగలిగే సుదినం, క్షేమం, ధైర్యం, అందరితో మంచితనం, గౌరవం, వివేకం, తెలివితేటలు, బంధువర్గం, సౌభాగ్యం, లౌకికమైన శుభం, ఇతరలోకాలకు సంబంధించిన శ్రేయస్సు, కీర్తి, చాలినంత సంతతి, ఇష్టప్రాప్తి, హితం మొ॥ సామాజికమైన కోరికలు వారికుండేవి.

అగ్న్యాదిదేవతలు, ముల్లోకాలు, సంవత్సరాలు, ఋతువులు, నక్షత్రాలు, యజ్ఞపాత్రలు, నియమాలు, తపస్సు, ఇండ్లు, పొలాలు, మొ॥ సంపదలు, అన్నధనసమృద్ధి, గోసువర్ణాదిసంపద, పాలు, పెరుగు, నెయ్యి, తేనె, బంధువులతో కలసిచేసేభోజనం, పానీయం, మామిడి మొ॥ చెట్లసమృద్ధి, బంగారం, ముత్యాలు, మణులు, ఐశ్వర్యం, సంపద, ఏనుగులు, గుఱ్ఱాలు మొ॥ జంతువృద్ధి, ధాన్యవృద్ధి, భూత

భవిష్యత్వర్తమానాలలో సకలసంపదలు, మంచి దేశం, యజ్ఞసమృద్ధి, యజ్ఞఫలం, వ్రీహి యవ మాష తిలముద్గ గోధూమ మసూరాలనే ధాన్యాలు, శనగలు, గ్రామాల్లో అరణ్యంలో దొరికే గడ్డిధాన్యాలు, శిలలు, మన్ను, గిరులు, పర్వతాలు, ఇసుక, పూలు లేకుండా పండ్లనిచ్చే పనస మొ॥ వృక్షాలు, బంగారం, వెండి, ఇనుము, రాగి, సీసం, ఇత్తడి, తగరం, వర్షం, ఆవులు, గేదెలు, దున్నలు, మేకలు, గొఱ్ఱెలు, గాడిదలు, ఒంటెలు మొ॥ గ్రామ్యపశువులు, ఇలాంటి దేశసౌభాగ్యానికి సంబంధించిన కోరికలనుగూడ వారు యజ్ఞాలను చేసి సాధించుకొనేవారు (18.1-27).

అశ్వమేధయాగం సుప్రసిద్ధమైంది. అందులో యాగాశ్వాన్ని వదిలే సందర్భంలో అధ్వర్యువు ఇలా కోరుతున్నాడు:

> "మాదేశంలో యజ్ఞానుష్ఠాన తత్పరుడు, వేదాధ్యయనశీలుడు అయిన బ్రాహ్మణుడు, శూరుడు, బాణప్రయోగంలో నేర్పరి, శత్రువులను జయించేవాడు, మహారథి[1] అయిన క్షత్రియుడు పుట్టాలి పుష్కలంగా పాలనిచ్చే ఆవు, బాగా బరువుమోయగల ఎద్దు, వేగంగా పరుగెత్తగల గుఱ్ఱం, చక్కనిరూపం మంచిగుణాలుగల అందమైన స్త్రీ, శత్రువులను జయించే యోధుడు, ఈ దేశంలో పుట్టాలి. ఈ యజమానికి సభలో బాగా గౌరవింపబడే సమర్థుడైన కుమారుడు కలగాలి. ఈదేశంలో పంటలకవసరమైనప్పుడల్లా పర్జన్యుడు వర్షించాలి. ఓషధులన్నీ ఫలవంతాలు కావాలి. మాకెప్పుడూ యోగం క్షేమం[2] కలగాలి" (22.22).

ఈ కోరికల్లో వ్యక్తిగతమైన సమాజపరమైన అభ్యుదయాలు సాధించుకోవడానికి వారు భక్తితో విశ్వాసంతో వివిధయజ్ఞాలను

---

1. ఒంటరిగా ఉండి కూడ వెయ్యిమందిని జయించగలవాడు `మహారథి'
2. కొత్తదాన్ని పొందడం `యోగం', పొందినదాన్ని కాపాడుకోవడం `క్షేమం'

సాధనాలుగా ఉపయోగించేవారని, దేశభక్తికి, విశాలదృక్పథానికి ధార్మికప్రవృత్తికి అనాడు లోటులేదని మనం తెలుసుకోవచ్చు.

**4. ఆచారాలు:**

పశువుల్లో ఎక్కువ సత్వగుణం కలది ఆవు. హిందువుల్లో గోపూజ సనాతనమైన ఆచారం. అనాటినుంచి ఈనాటివఱకు భారతీయులకు గోవు ఆరాధనీయమైంది. సకలశుభాలను ఇచ్చే గోవులను పూజించడం, తద్వారా అనేకప్రయోజనాలను పొందడమనే ఆచారం ఈ సంహితలో మనం చాలాచోట్ల చూడవచ్చు. అగ్న్యుపస్థాన సందర్భంలో ఒక మంత్రం చూడండి:

> "ఓ గోవులారా! పాలు నెయ్యి మొ॥ ఆహారాన్నిస్తున్నారు కాబట్టి మీరు అన్నస్వరూపలు. మీ అనుగ్రహంవల్ల నేను ఆహారాన్ని పొందుతాను మీరు పూజింపదగినవారు[1] మిమ్ములను పూజించి నేను కూడ ఈ సమాజంలో గౌరవాన్ని పొందుతాను. మీలో పదిరకాల వీర్యాలున్నాయి[2]. మీ సేవ మమ్మల్ని వీర్యవంతుల్ని చేస్తుంది. మీరు బలరూపులు మీఅనుగ్రహంవల్ల మేమూ బలవంతులమౌతాం. మీపాలు, నెయ్యి మొ॥ వాటిద్వారా మేమనేక ధనధాన్యాలను పొందుతాం" **(3.20).**

పెండ్లికాని కన్యలు ఆరోజుల్లో మంచిభర్త దొరకడంకోసం దివ్యమైన సువాసనలుగల త్రినేత్రుణ్ణి స్తుతిచేస్తూ ఆరాధించడం ఒక ఆచారం:

---

1. (గౌర్నపదా స్ప్రష్టవ్యా) 'గోవును కాలితో తాకరాదు' అని ధర్మశాస్త్రం.
2. ఆవుకు సంబంధించిన పది వీర్యాలు: 1ప్రతిధుక్=అప్పుడే పితకిన గుమ్మపాలు 2. శృతం=వేడిపాలు 3. శరః=పాలపై తెట్ట (మీగడ) 4.దధి=తోడుపెట్టినపాలు 5. మస్తు=బాగాతోడుకోనిపాలు 6. ఆతంచనం =గడ్డపెరుగు 7. నవనీతం=వెన్న 8. ఘృతం= నెయ్యి 9. ఆమిక్షా=గోదావరి 10. వాజినం=గోదారిరసం. మహీ. 3.20.

"నీదయవల్ల నాకు పెండ్లై నా పుట్టింటివారినుంచి విడిపోయి, మళ్లీ భర్తనుంచి ఎన్నటికి విడిపోకుండా, ఆ గోత్రంతో ఆయన ఇంట్లోనే సుఖంగా ఉంటాను[1]"

ఆనాడు గోవును పూజకు మాత్రమే కాక సోమయాగానికి కావలసిన సోమలతను కొనడానికి వినిమయద్రవ్యంగాను, యాగదక్షిణ గాను వినియోగించడం సర్వసాధారణమైన ఆచారం(4.19).

**5. ప్రార్థనలు:**

మంచి ఆహారాన్నివ్వమని పృథివిని ప్రార్థించడం శుక్ల యజుర్వేదంలో కనబడుతుంది. అగ్న్యాధానం చేసిన యజమాని అనేక నక్షత్రాలతో విస్తరించిన ఆకాశంలాగా తానుకూడా ఎంతో విశాలమైన భావనకలవాణ్ణవుతానని ఆశించాడు. పుత్రపశుధన ధాన్యాలతో బహుకుటుంబిని కావాలని పృథివిని ప్రార్థించాడు (3.5).

అగ్నిని భూర్భువస్స్వర్లోకస్వరూపిగ వారు ఆరాధించారు త్రిలోక స్వరూపియైన అగ్నిని బంధువులకోసం, భృత్యులకోసం, మంచి పుత్రులకోసం ప్రార్థించేవారు. అగ్నిదయవల్ల తమ కుమారులు మంచినడవడితో వీరులుగ ఉండాలని వారాశించారు. సువర్ణాది భాగ్యాలకు లోటులేకుండా ఉండాలని వారి కోరిక(3.37).

శారీరకమైన అనారోగ్యాలకు గురైనప్పుడు వారు తమకు తెలిసిన ఏవో మందులను మాకులను వాడడమే గాక ఆ బాధలను పోగొట్టే ఓషధులను అనుగ్రహించవలసిందిగ రుద్రుణ్ణి ప్రార్థించేవారు. రుద్రుడు ఓషధిలాగా సకలవ్యాధులను పోగొట్టే దేవత. కనుక వారి ఆవులకు, గుఱ్ఱాలకు, కుటుంబానికి, మేకలకు, గొఱ్ఱెలకు అనారోగ్యాలనన్నింటిని.

---

1. త్ర్యంబకం యజామహే సుగన్ధిం పతివేదనమ్ ।
ఉర్వారుకమివ బన్ధనాదితో ముక్షీయ మాముతః ॥ 3.60.

పోగొట్టే ఓషధులను ఇవ్వమని, సుఖాన్ని[1] కలిగించమని అయన ప్రార్థింపబడేవాడు (3.59). బాధలు పోవడానికి భౌతికమైన సాధనాలు మందులు. కాని భగవదనుగ్రహం అభౌతికసాధనమనే వివేకం వారికున్నది.

రాగద్వేషాల ప్రభావానికి లోబడకపోవటం అంత సులభసాధ్యం కాదు. కాని వాటిప్రభావాలకు లోబడి ఇలా చెడుపనులు చేస్తున్నామని గ్రహించడం వివేకం. 'నన్ను చెడుదోవలు పట్టనీయకు! ఎప్పుడూ మంచిపనులు చేస్తూ, దీర్ఘాయుష్యంతో మంచిగా ఉండేటట్లు అనుగ్రహించు! ఈ యజ్ఞయాగాలనాచరిస్తూ సోమాది దేవతలను అనుసరించి ఉండడానికి సిద్ధంగా ఉన్నాను" (4.20); అని అగ్నిని ప్రార్థించడం వారి వివేకానికి చక్కని నిదర్శనం. అగ్ని తమను మంచిదోవలోనే పెడతాడనే విశ్వాసం వారి ప్రార్థనలో కొట్టవచ్చినట్లు కనపడుతోంది.

పాపభీతి ఆనాటివారిలో హెచ్చుగా కనబడుతుంది. తమను పాపాలనుంచి విముక్తులను చెయ్యమని వారు అగ్ని వాయు సూర్యులను ప్రార్థించడం చూస్తే, ధార్మికప్రవృత్తిపై మొగ్గుచూపే వారి జీవితాలను మనం ఊహించుకోవచ్చు. వారి ప్రార్థనలను చూడండి:

> "దేవతలకు చేసిన అపరాధాలవల్ల మాకు కలిగిన పాపాన్ని అగ్ని పోగొట్టాలి మాకు ఇతరంగా కలిగే పాపాలు, విఘ్నాలుకూడా అయన దయవల్ల పోవాలి. రాత్రింబగళ్లు చేసిన అన్ని పాపాలనుంచి వాయువు మమ్మల్ని విడిపించాలి. మేము మెలకువలో, నిద్రలోను ఏయే పాపాలు చేశామో వాటినుంచి సూర్యుడు మమ్మల్ని విడిపించాలి. మానవుల విషయంలో పితృదేవతల విషయంలో మేము చేసిన పాపాన్నికూడ సూర్యుడే పోగొట్టాలి" (20.4-17).

1. (సు హితం ఖేభ్యః ప్రాణేభ్య ఇతి సుఖమ్) ప్రాణాలకు హాయినిస్తుంది కాబట్టి 'సుఖ' మనబడుతుంది

**ఆలోచనలు :**

తమ ఆరాధ్యదేవతల అనుగ్రహంవల్ల తమను పాలించే దేశపు మహారాజు సమ్రాట్టై సకలప్రజాధిపత్యాన్ని పొందాలనీ, అందుకు వీలుగా అతడికి శత్రువులు లేకుండా పోవాలని వారు భావించేవారు **(9.40)**. లోకానికి కల్యాణం జరగాలనే శుభకామన వారిలో ఎక్కువగా కనబడుతుంది. 'మానవులకు, పశువులకు, తమ గ్రామస్తులకు ఈ లోకంలోని ప్రాణులందరికీ ఏ ఉపద్రవాలు లేక సకలసమృద్ధులు కలిగి సుఖంగా ఉండేటట్లు చేయమని' సర్వశక్తియైన భగవంతుణ్ణి వారు ప్రార్థించేవారు **(17.48)**.

ఆనాటి ప్రభువులు ధర్మానికి ప్రతీకలు వారు లోకాన్ని ధర్మోన్ముఖంగా చేసే వారు. పట్టాభిషిక్తుడైన రాజు **'జంఘాభ్యాం పద్భ్యాం ధర్మోస్మి, విశి రాజా ప్రతిష్ఠితః' (20.9)** అని ప్రతిజ్ఞ చేసే వాడు. "నాశరీరంలోని ప్రతి అవయవం ధర్మస్వరూపమే. నేను ఈ శరీరంతో ప్రజలలో ధర్మాన్ని కాపాడతాను. అలాచేసి వారి అభిమానానికి పాత్రుడనౌతాను"అని ఆనాటి రాజులలో ధర్మదీక్ష ఉండేది.

"మంచినే వినాలనీ, మంచినే చూడాలనీ, స్థిరమైన అవయ వాలతో మంచి సంతానంతో దేవతలను నిరంతరం స్తుతిస్తూ వారిని ఆరాధించడం కోసమే జీవించాలనే వారి భావన ఎంతో విలక్షణమైనది. దీనివెనుక ఉన్న సంస్కారం ఎంతో ఉదాత్తమైంది **(25.21)**. స్వర్గం, అంతరిక్షం, తల్లి, తండ్రి, కొడుకు, దేవతలు, మనుష్యులు, ఇప్పటికీ పుట్టిన, ఇకముందు పుట్టబోయే ప్రాణులందఱు ఎప్పుడూ దైన్యంలేకుండా ఉండాలనే వారి ఆలోచన మనకెంతో స్ఫూర్తినిస్తుంది **(25.23)**.

'తనకున్నదాన్ని ఇతరులకివ్వడం, వారితో కలసి సంతోషంగా తాను అనుభవించడం ఎంతో గొప్ప విషయం. ఎంతో తియ్యని ఇలాంటి మాటను లోకంలో నాలుగు వర్ణాలవారికి, ఆత్మీయులకు చివరకు శత్రువులకు కూడ చెప్పగలిగినవారు దేవతలచేత ప్రేమించబడతార' ని ఆనాటివారి దృఢవిశ్వాసం(**26.2**).

ఇంతవరకు చూపిన ఉదాహరణలద్వారా ఆనాటివారి మతస్వరూపాన్ని ఇలా సంగ్రహంగా మనం తెలుసుకోవచ్చు. అనేక దేవతలను స్తుతించినా, ఈ నామరూపధారియైన ఒకే పరతత్త్వాన్నే వారారాధించారు. పుణ్యపాపాలపైన, పునర్జన్మపైన విశ్వాసం కలిగి, ఇహపరలోక సుఖసాధనాలుగా యాగాలను అనుష్ఠించారు. లోక కల్యాణాన్ని ఆకాంక్షించి మంచి ఆచారవ్యవహారాలతో ధార్మిక జీవితాన్ని గడిపారు.

**తత్త్వం :**

తత్త్వమంటే సత్యమనీ, యథార్థమని అర్థం. కేవలం భౌతికసుఖాలకు మాత్రం దాసులుగాక భారతీయులు ఈ ప్రపంచం, సృష్టి, జీవితం, మరణం, ప్రకృతి, మనస్సు, పరతత్త్వం, దాని మహిమ మొ॥ వాటి యథార్థస్వరూపమేమై ఉంటుందని వాటి తత్త్వాన్వేషణ చేశారు. ఈనాడు మనకు దొరుకుతున్న అనేక తాత్త్వికసూత్రాలకు, సిద్ధాంతాలకు వేదాలలోనే బీజప్రాయంగా పునాదులు పడ్డాయి. ఈ విశేషాలను శుక్లయజుస్సంహితలో మనం ఎంతవరకు గ్రహించవచ్చో ఇక్కడ విశ్లేషణ చేసి చూద్దాం.

**1. పరతత్త్వం :**

ఇంద్రుడు, సవిత, మిత్రావరుణులు, సోముడు, రుద్రుడు మొ॥ దేవతల నీ సంహిత ఆయాసందర్భాలలో ప్రస్తావించినా, ఈ నామరూపాలలో ఉండే పరతత్త్వం వారి దృష్టి కందనిది కాదు.

'భువనస్య పతయే స్వాహా అధిపతయే స్వాహా' (9.20), 'ఈశా వాస్యమిదం సర్వమ్' (40.1) అనే చోట్ల ఈ భావన స్పష్టంగా కనబడుతుంది. 'భువనపతి' అంటే జగత్పరిపాలకుడని, 'అధిపతి' అంటే సర్వలోకప్రభువని మహీధరుడు వివరించాడు[1].

వేదాలన్నింటిలోను జగన్నిర్వాహకుడుగ ప్రసిద్ధుడైన పరమేశ్వరుడే తన ప్రీతికోసం యజ్ఞాన్ని నియోగిస్తున్నాడని (1.6) చెబుతూ ఇంద్రుడు మొ॥ దేవతల కంటే అతీతమైన పరతత్త్వాన్ని ఈ సంహిత ప్రతిపాదిస్తున్నది. పరబ్రహ్మ విజ్ఞానానన్దస్వభావుడు. ఆయన తత్త్వం నిత్యం, సత్యం, శాశ్వతం. దానికంటె భిన్నమైందంతా అశాశ్వతమైంది. ఈ తత్త్వాన్ని ఆనాటివారు గుర్తించారు (10.22). ప్రపంచం స్థావరజంగమాత్మకమని, దీనికి అధిపతి సర్వజ్ఞుడైన పరమాత్మ అని వారు చక్కగ గుర్తించారు (ఈశానమస్య జగతః స్వర్దృశమీశానమిన్ద్ర తస్థుషః 27.35).

2. భగవంతుని దయ - మహిమ :

భగవంతుని దయలేకుండా ఏ ఒక్కపనిని మానవుడు సాధించలేడు. ఈ సత్యాన్ని వారు బాగా గుర్తించారు కర్మపాలకుడైన స్వామి ఇచ్చిన శక్తివల్లనే ఈ కర్మలను సాధించగలిగామని, నిజానికి తమ తరపున ఈ పనులను సాధించినవాడు ఆయనేనని, కార్యసిద్ధి కలిగిన తరువాత మళ్లా ఇదివఱకటి మానవులమే అయినామని వారి అనుభూతి (2.28). సర్వశక్తియైన భగవంతుని మహిమను తమ అశక్తతను వారు ఎంతో బాగా గుర్తించారు.

పరాత్పరుడు పరమైశ్వర్యసంపన్నుడు. ఆయన తనను ఆరాధించిన వారి దగ్గఱకు వెంటనే వచ్చి వారిని సేవిస్తాడు.

---

1. భువనస్య పతయే జగతః పాలయిత్రే. అధిపతయే సర్వలోకానాం స్వామినే మహీ. 9.20.

వారికి సకలశుభాలను కలిగిస్తాడు. భక్తులపైన ఆయనకు అనుగ్రహమే కాని ఆగ్రహమెప్పుడూ రాదు (3.34). భగవంతునిలో ఈ తత్త్వాన్ని ఆనాడే గుర్తించారు. దేవుని మహిమ అన్ని వేదాల్లోను కీర్తింపబడు తోంది. దానిని విప్రు[1]లెప్పుడో తెలుసుకున్నారు(11.4).

ఆనాటివారు **'మాయ'** అనే పదాన్ని ప్రయోగించారు. కాని అది నేటి వేదాంతులు చెప్పే మాయమాత్రం కాదు. శుక్లయజుస్సంహితలో **'మాయ'** అంటే **'బుద్ధి'** అని అర్థం. **'న మాయయా భవస్యుత్తరో మత్'** (23.52).

**3. జీవితం - మరణం:**

లోకంలో భయాలన్నింటిలోకి మృత్యుభయం చాల పెద్దది. దాన్ని ఏ జీవి తప్పించుకోలేడు. ఆనాటివారు దీనికి అపవాదం కారుగాని, తాము అపమృత్యువు పాలు కాకుండా ఉండేటట్లు అనుగ్రహించమని వారిలా త్రినేత్రుణ్ణి ప్రార్థించేవారు:

> 'పండిన దోసకాయ ఎలా తీగనుంచి ఎవరి ప్రయత్నం లేకుండా అలా తేలిగ్గా ఊడిపోతుందో, అలా నేను అపమృత్యువు బారినుంచి తప్పించుకొని స్వచ్ఛందంగా, అనాయాసంగా మరణించాలి స్వర్గంనుంచి గాని, మోక్షంనుంచి గాని, తిరిగి నేను పతితుణ్ణి కాకూడదు' (3.60).

అనాయాసమరణం కోరేవారు త్ర్యంబకానుగ్రహం కోసం ఎప్పుడూ స్మరించే ఈ మంత్రం చాల ప్రసిద్ధమైంది.[2]

---

1. (విశేషేణ ప్రాతి పూరయతి దక్షిణాన్నదానాదినా జనానితి విప్రః) దక్షిణలను అన్నాన్ని, అనేక దానాలను ఇచ్చి జనుల కోరికలను తీర్చేవాడు కాబట్టి విప్రుడని పేరు. మహీ. **11.4.**

2. త్ర్యంబకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనమ్ ।
ఉర్వారుకమివ బన్ధనాన్మృత్యోర్ముక్షీయ మాఽమృతాత్ ॥ **3.60.**

మానవ జీవితం గాలిబుడగలాగా అశాశ్వతమైందని తెలిసికొని, వారు పూర్ణాయుష్యం కోసం దేవతల నాశ్రయించారు. తమకు నూరు సంవత్సరాలు వచ్చేవఱకు దేవతలను రక్షణనిస్తూ దగ్గఱే ఉండమని కోరారు. అప్పుడు వారికి వార్ధకం వస్తుందట. తమ వార్ధకదశలో వారి పిల్లలు సంతానం కలిగి తండ్రులై ఉండాలిట. అంతవఱకు దైవానుగ్రహంవల్ల పూర్ణాయుష్యంతో ఉండాలని వారి ప్రార్థన (25.22). ఆనాడు శతవృద్ధుకూడా ముసలితనం లేకుండా బాగా ఆరోగ్యంగా ఉండేవాడని, నూరు సంవత్సరాలకు ముసలితనం వచ్చేదని దీన్ని బట్టి తెలుస్తుంది.

**4. సృష్టి :**

ఈ జగత్తు ఎలా పుట్టింది? ఎప్పుడు పుట్టింది? దేనినుంచి పుట్టిందని తత్త్వశాస్త్రాల్లో ఇప్పటికీ సిగపట్లు పడుతూనే ఉన్నారు శుక్లయజుస్సంహిత యజ్ఞస్వరూపుడైన ప్రజాపతినుంచి ఈ జగత్తు పుడుతున్నట్లు స్థిరంగా ఉన్నట్లు స్పష్టంగా చెబుతున్నది[1] (1.6).

భగవంతునికంటే ఇతరులెవ్వరు భూత-భవిష్య-ద్వర్తమాన కాలాల్లో విభిన్న నామరూపవిశిష్టమైన ఈ విశ్వాన్ని సృష్టించడానికి, నడపడానికి, సంహరించడానికి సమర్థులు కాదని వారు తెలుసుకున్నారు (10.20).

**5. ప్రకృతితత్త్వం:**

తమతమ పనుల్లో అలసిపోయిన ఇంద్రియాలు కొంతసేపు ఏ పనీ చేయకుండా ఉండడమే నిద్ర. నిద్రాసమయంలో మనస్సు, ప్రాణాలు, ఆయుష్యం, జీవుడు, చక్షురింద్రియం, శ్రోత్రేన్ద్రియం, ఈ శరీరంలో ఉండకుండా ఎక్కడికో పోయి, నిద్ర మెలకువ వచ్చిన

1. యజ్ఞాదుత్పత్తిః స్థితిశ్చ జగతః ఉవ. 1.6.

వెంటనే మళ్ళా వచ్చాయని, అవి చెడ్డపనులు చేసి పాపం సంపాదించకుండా ఉండేటట్లు కాపాడమని, శరీరపాలకుడైన అగ్నిని ప్రార్థించడం కనబడుతుంది. సుషుప్తిదశలో మానవప్రకృతి ఎలా ఉంటుందో మళ్ళా జాగ్రదవస్థలో అదెలా మారుతుందో వారు బాగా గుర్తించారని మనం దీన్నుంచి గ్రహించవచ్చు (4.15).

బాహ్యప్రకృతిలో ప్రధానభాగం జలం. ఈ జలంలో ఉన్న ధర్మాలననుసరించి ఇవి అర్దేత, ఓజస్వతి, పరివాహిణీ, నివేష్య, సూర్యత్వచస, మాన్ద మొ॥ పదిహేడు రకాలుగా ఉన్నాయని వారు జలతత్త్వాన్ని వివరించారు వాటి స్వభావ పరిశీలనాన్ని ఇంతచక్కగా ఆధునికులు చేయగలరా! అనేటట్లుంటుంది ఆ వివరణ (10.3-4).

"సూర్యుడు ఇతరులపై ఆధారపడకుండా స్వతంత్రంగా తిరుగుతున్నాడు. చంద్రుడు క్షీణిస్తూ, పెరుగుతూ ఉన్నాడు శైత్యానికి ఔష్ణ్యమే మందు ఈ భూమండలం ఎంతో విశాలమైంది. అందఱు మొదట స్మరించేది వర్షం అశ్వమేధమే పెద్దపక్షి. ఎప్పుడూ తడిసేది భూమి. రూపాలనన్నింటిని మింగేసేది రాత్రి", అని ప్రశ్నోత్తరికలలో ప్రకృతిగతమైన నిత్యసత్యాలను ఎన్నింటినో వారు చాటి చెప్పారు (23.9-12).

**'అజ'** అనే శబ్దాన్ని 'మాయ' అనే అర్థంలో ఈ సంహిత ప్రయోగిస్తున్నది. మాయ విశ్వాన్ని మింగేస్తుంది (మహీ.23.56). 'ఆకాశం భూమి ఉదకమనే ధనంకోసం వాయువును పుట్టిస్తున్నాయి. ఈ రెండూ సంయుక్తాలై ఉన్నా, ఇవి పుట్టించిన వాయువు లేకుండా ఈ జగత్తు నిలవదు' (27.24). ఇలాంటి రహస్యాతిరహస్యమైన భౌతిక తాత్త్వికవిశేషాలను ఈ సంహిత ఎన్నింటినో బోధిస్తున్నది. శాస్త్రాల్లోను ఆధునిక పరిశోధనలోను నిష్ణాతులైనవారు ఇలాంటి నిత్యసత్యాలపై ఎంతో పరిశోధన జరపవలసి వుంది.

**6. మనస్తత్త్వం:**

మనస్సుకు సంకల్పశుద్ధి, ధారణాశక్తి, దీక్ష చాల ముఖ్యమైనవి ఇవి మనోభిమాని దేవతయైన అగ్నివల్లనే కలుగుతాయన్న సత్యాన్ని వారు గ్రహించారు (4 7).

'ఈ భూమి మనకు తల్లి. జగత్తు ఈమె వల్లనే ఏర్పడింది ఈమెను, తోటి జీవులను మేము హింసించం ఈ పృధివి, తోటి మానవులు నన్ను హింసించకుండా ఉండాలి' (పృథివి మాతర్మా మా హిగ్ంసీర్మో అహం త్వామ్' (10.23).

భూదేవిపైన మాతృభావం, ఇతరులను బాధించకుండా, తను ఇతరులవల్ల బాధపడకుండా జీవించాలనే కోరిక ఆనాటికే ప్రబలంగా ఉంది

మనస్సు చంచలమైంది దాన్ని బాహ్యవిషయాలనుంచి మరల్చాలి. మంచి జ్ఞానాన్ని వివేకాన్ని సంపాదించాలనే భావం వారిలో ఉంది (11.2). ఇందులో మనస్సుయొక్క చాంచల్యమనే తత్త్వం వారి దృష్టికందిందని మనం తెలుసుకోవచ్చు

ఇలా శుక్లయజుస్సంహిత యజ్ఞప్రధానమైందైనా ఆయా సందర్భాల్లో మహర్షులు విశదపరచిన విశేషాలను దృష్టిలో పెట్టుకొని, ఆనాటివారి అభిమతాలను, ధార్మిక తాత్త్విక భావనలను మనం కొంతకు కొంత సంగ్రహంగా తెలుసుకోవచ్చు. ఇంతకంటే విస్తరంగా తెలుసుకోవాలంటే ఈ విశేషాంశాలకుగల ఉవటమహీధరభాష్యాలు అవశ్యపఠనీయాలు.

- ఎస్.బి.ఆర్.

## 3.10 సాంఘికాచార వ్యవహారాలు

శుక్లయజుర్వేదాన్ని పరిశీలిస్తే ఆనాటి ప్రజల సాంఘికాచార వ్యవహారాలు, రాజకీయ పరిస్థితులు. జీవన పద్ధతుల గురించి మనకెన్నో విషయాలు తెలుస్తాయి విజ్ఞాన విషయంలోగాని, రాజకీయంలోగాని, వ్యవసాయంలోగాని, వాణిజ్యంలోగాని, నేటి ప్రజలకు నాటి ప్రజలు ఏ మాత్రం తీసిపోరని స్పష్టమవుతుంది దీనినే మరింత విపులంగా పరిశీలిద్దాం

దేశం :

శుక్లయజుర్వేదాన్ని అనుసరించి అప్పటి ప్రజలు నివసించే ప్రదేశంలో సూర్యరశ్మి బాగా ప్రసరించేది (6-3). నదులు, జలాశయాలు సమృద్ధిగాగల దేశమది (6-22) ఉద్యానవనాలు, అరణ్యాలు, పర్వతాలు, జలపాతాలు ■ దేశంలో ఎన్నో ఉన్నాయి (11-29,8-48). నదీసంగమస్థానాల్లో కూడ అప్పటి జనులు నివసించారు (26-15). సముద్రంవరకు వ్యాపించిఉన్న దేశంలో వారు నివసించారు (8-25). కాబట్టి ఐతిహాసికులు చెబుతున్నట్లు వింధ్యపర్వతాల దాకా ఉత్తర భారతదేశమంతా వారి నివాసం అని చెప్పవచ్చు.

ప్రజలు :

ఆ కాలంలో, ఆ దేశంలో నివసించిన ప్రజలు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, అతిశూద్రులని ఐదు జాతులుగా విభజింప బడ్డారు. అతిశూద్రులే నిషాదులుగా కూడ వ్యవహరింపబడేవారు. ఆటవికులు ఈ జాతికి చెందినవారని భావింపవచ్చు. శరీరావయవాలలో శిరస్సు ప్రధానమైనట్లు, ■ జాతులలో బ్రాహ్మణజాతి ముఖ్యమైందిగా ఉండేది. అధ్యాపనం వీరి ముఖ్య కర్తవ్యము. యజ్ఞాలను నిర్వహించడం,

ఆధ్యాత్మిక బోధనలు చేయడం వారి కర్తవ్యాలు. ప్రజలను అన్నివిధాల రక్షించడం, సుఖాలను కలుగజేయడం క్షత్రియజాతి కర్తవ్యం ధనాధిపతులై కృషి, వాణిజ్యాలను చేస్తూ ధనాలను నిలువచేసి యజ్ఞాది కర్మలకు అవసరమైనప్పుడు ఇవ్వడం వైశ్యజాతి కర్తవ్యం. లోహాలను కరగించి పాత్రలు మొ॥ వాటిని తయారుచేయడం, వడ్రంగం, కుమ్మరం, మొ॥ వృత్తులను చేస్తూ పై వర్ణాలవారిని ఉపచరించడం శూద్రజాతి కర్తవ్యం. నిషాదులు గూడ పరిచరణాది వృత్తులనే చేసేవారు **(14-9)**. స్వదేశాభిమానం, స్వజాత్యభిమానం వారిలో ఎక్కువగా ఉండేది.

విద్యాదానం చేత ప్రజలను రక్షించే మహాత్ములు దైవగుణాలు కలవాళ్ళుగాను, శ్రేష్ఠులుగాను, విద్వాంసులుగాను కీర్తింపబడ్డారు వారికి మంచి మననశక్తి, ధారణాశక్తి కలిగేటట్లు వారు ఎల్లప్పుడు మంచి ప్రవర్తన కలిగి ఉండాలని ప్రార్థనలు చేయబడేవి **(3-55)**.

**ఆశ్రమాలు :**

బ్రహ్మచర్యం, గార్హస్థ్యం (గృహస్థాశ్రమం), వానప్రస్థం, సన్న్యాసం అనే నాల్గు ఆశ్రమాలను అప్పటి జనులు అనుసరించేవారు. ఉపనయనమైన వటువు విద్యాభ్యాససమయంలో బ్రహ్మచర్యం అవలంబించేవాడు విద్యాభ్యాసం గురుకులంలో జరిగేది. అందులో గురువులు జీవనానికి, సుఖప్రాప్తికి అవసరమైన విద్యను వారివారి ధారణాశక్తిననుసరించి బోధించేవారు **(7-36,38)**. గురువులు శిష్యులను చేతులతో, కొరడాలతో శిక్షించేవారు **(25-40)**. విద్యాభ్యాససమయంలో నదీసంగమప్రదేశాల్లో కొండచరియల్లో ధ్యానధారణాదులను ఆచరించి సంపూర్ణ వ్యక్తిత్వాన్ని పొందేవారు **(26-15)**. శమదమాదులను అలవాటు చేసుకొనేవారు.

విద్యాభ్యాసం పూర్తయిన తరువాత స్నాతకవ్రతమాచరింపబడేది. అందులో బ్రహ్మచారికి అచ్ఛాదకవస్త్రాన్ని, సువర్ణకుండలాలను, శిరోవేష్టనాన్ని (తలపాగ), పదత్రాణాన్ని (చెప్పులు), ఆతపత్రాన్ని (గొడుగు) ఇతర ఆభరణాలను బహూకరించేవారు (25-39). ఇలాంటి ఆచారమిప్పటికీ ఉన్నది వివాహానికి పూర్వాంగంగా స్నాతకవ్రతం ఆచరిస్తున్నారు కదా!

స్నాతకబ్రహ్మచారినే విద్వాంసుడుగా స్వీకరించేవారు (25-37). తండ్రితాతలు గల స్నాతకబ్రహ్మచారులను, వేదశాస్త్రజ్ఞులను, సువర్ణాది దక్షిణలతో పూజించేవారు (7-46). వ్రతంచేత దీక్ష, దీక్ష వల్ల దక్షిణ, దక్షిణవల్ల శ్రద్ధ, శ్రద్ధవల్ల సత్యప్రాప్తి కలుగుతుందని వారి విశ్వాసం (19-30). నాల్గు వర్ణాలవారికి వారివారి యోగ్యత ననుసరించి విద్యాభ్యాసముండేది (26-2).

స్నాతకుడైన బ్రహ్మచారి, పెద్దల అనుమతితో తనకనుకూలవతి, శీలవతి, రూపవతి అయిన కన్యను వివాహమాడి గృహస్థాశ్రమంలో అడుగు పెట్టేవాడు. వినయం, న్యాయంగా ప్రవర్తించడం, శాంతి, స్వయంప్రకాశం (అందం), అధికారంగల స్త్రీ భార్యగా ఎన్నుకోబడేది (14-13). ఆమె పురుషుడికి జీవనజ్యోతిగాను (14-17), గృహస్థాశ్రమ నియమాలను పాలించే యోగ్యతకలదిగాను (14-27), సంపదకు కీర్తికి కారణమైనదిగాను (15-9) కీర్తింపబడింది. గృహస్థాశ్రమంలో ఉండే స్త్రీలు ఇళ్లను అలంకరించడంలోను, వంట చేయడంలోను తమ శరీరాన్ని చక్కగా అలంకరించుకోవడంలోను నేర్పుకలవారు (8-19). సంతతిని పెంపొందించడమే గృహస్థాశ్రమం ముఖ్యోద్దేశ్యం. గర్భవతియైన స్త్రీ గర్భం ఎనిమిది మాసాల్లో వరుసగా పొందే కలల-బుద్బుద-పిండ-కఠినాది అవస్థలుకూడ ఇందులో వర్ణింపబడ్డాయి (8-30). బిడ్డలను స్తన్యం (చనుబాలు)తో పెంచేవారు (8-51).

· నదీనదాలు సముద్రాన్ని ఆశ్రయించినట్లు, అన్ని ఆశ్రమాలు గృహస్థాశ్రమాన్ని ఆశ్రయించి ఉన్నాయి **(8-25)**. బ్రహ్మచారులకు, సన్న్యాసులకు భిక్షనివ్వటం, అతిథిసత్కారం, ధర్మాచరణం, యజ్ఞయాగాదులను నిర్వర్తించడం, గృహపోషణం, పశుపోషణం మొ.. అనేకవిధులు గృహస్థాశ్రమంలో నిర్వహింపవలసి ఉండేవి సుఖ, శాంతి, గతి, స్ఫూర్తులనబడే నాల్గుధర్మాలు ఈ ఆశ్రమంలో తప్పక పొందాల్సినవి **(9-31)**.

మూడవ ఆశ్రమం వానప్రస్థం. తమ సంతానం విద్యాభ్యాసం ముగిసిన తరువాత కుమారులకు, కుమార్తెలకు వివాహం చేసి, కుటుంబభారాన్ని కుమారులకు వప్పగించి వయసుమళ్ళిన తల్లిదండ్రులు వానప్రస్థాశ్రమం స్వీకరించేవారు. స్నేహబంధాల నతిక్రమించి అత్యున్నతస్నేహం నిష్పక్షపాతప్రవృత్తి కలిగి ఉండి, శరణుపొందిన వారికభయమిచ్చి రక్షించడం, త్యాగబుద్ధిని అలవాటు చేసుకోవడం, ధర్మవర్తన ఈ ఆశ్రమం నిర్వహించేవారి కర్తవ్యాలు **(14-10)**. వనాలలో, నదీసంగమప్రదేశాలలో, పర్వతప్రాంతాలలో ధ్యానం, ధారణ మొ॥ ఆధ్యాత్మికచింతనతో వీరు కాలక్షేపం చేసేవారు **(26-15)**.

పైమూడు ఆశ్రమాల నవలంబించేవారు శిఖతో ఉండేవారు. ఆఖరి ఆశ్రమం సన్న్యాసాశ్రమం. అన్ని సంగాలను పరిత్యజించి, తలనున్నగా గొరిగించుకొని **(16-59)**, సత్యాసత్యవివేచనం చేయటం, చేయించడం, వీరికి ముఖ్యకర్తవ్యంగా ఉండేది **(14-10)**. తాము తపస్సుచేత తెలిసికొన్న సత్యాన్ని లోకంలో ప్రచారం చేసేవారు. ఆధ్యాత్మికతత్త్వాలను, సంసారం అసారతను, ఆత్మ అమృతత్వాన్ని వీరు జనులందఱికి బోధించి, జనుల మరణభయాన్ని పోగొట్టేవారు. వైరాగ్యభావనను కలుగజేసి జనులను ధర్మవర్తనులుగా తీర్చిదిద్దేవారు **(40-అ.)**.

యోగాభ్యాసం చేసే యోగీశ్వరులు మాత్రం జడలు కట్టిన కేశాలు కల్గిఉండేవారు. వారి కేశాలు సింహం కేసరాలతో పోల్చబడేవి (19-92).

## సాంఘికపరిస్థితులు:

ఇప్పటిలాగానే అప్పుడు కూడ సంఘంలో అనేక ప్రవృత్తులుగల మనుష్యులుండేవారు అనేక వృత్తులతో వారు జీవనం చేసేవారు. స్వార్థపరులు, ఉద్దండులు, దుష్టులు (5-24), జారులు, చోరులు, బందిపోట్లు, వంచకులు (16-23; 4-34), లోభులు మొ॥ వారు చాలా మంది జనులను బాధించేవారు.

కుటుంబంలో పెద్ద యజమాని అని పిలువబడేవాడు సమిష్టి కుటుంబంలో తండ్రే పెద్ద. తల్లి యజమానురాలుగా పిలువబడేది కుటుంబసభ్యుడేదైనా పని చేయాలంటే ఇతర కుటుంబసభ్యుల అనుమతి తీసుకోవలసి వచ్చేది (4-20). దినకృత్యాలలో సహాయానికై దాసదాసీజనులుండేవారు. గృహయజమాని దాసితో సంగమించినా, గృహయజమానురాలు దాసుని కలిసినా వంశక్షయమౌతుందని అప్పటివారి విశ్వాసం (20-30,31).

జూదం, సురాపానం మొ॥ దురభ్యాసాలప్పుడు కూడా ఉన్నాయి. సుర, సోమం అనే రెండువిధాల మద్యాలు వారు సేవించేవారు (19-7). దానశీలురైన పురుషులు సంఘంలో గౌరవింప బడేవారు (3-30).

బలవంతులైన కొందరు కొంతమందిచేత వెట్టిచాకిరీ చేయించు కొనేవారు (8-44). సామాన్యంగా విజాతీయుల నీ విధంగా ఉపయోగించుకొనేవారు.

దైవికాలైన యజ్ఞయాగాదులను, పైతృకాలైన తర్పణ శ్రాద్ధాదులను ఆ సమయంలో కూడ ఆచరించేవారు (19-37). మాతా పితృసేవయే ముఖ్యమని వారి ఆలోచన (12-107).

కొంతమంది వేషాలను మార్చుకొని భయంకరమైన ఆకారాలతో తిరుగుతూ జనుల్ని భయపెట్టి అన్నాదులను ఆర్జించేవారు (2-30). వీరు దస్యులని, అసురులనీ పిలువబడ్డారు

**రాజకీయపరిస్థితులు :**

అప్పటిప్రజలు సంపూర్ణ స్వాతంత్ర్యం కలవారు (9-12). ఆనంద ప్రదాలైన ఆందోళనలను వారు చేసేవారు (6-27). ఇలాంటి ఆందోళనలకు నాందీప్రస్తావన యజ్ఞాలలో జరిగే సభలలో జరిగేది (6-26). తమ తమ అభిప్రాయాలను రాజులకుగాని, విద్వాంసులకు గాని తెలియజేయడానికి యజ్ఞశాలలే తగిన ప్రదేశాలు. యజ్ఞాలలో సమావేశమైన విద్వాంసుల ముందు జనులు తమ తమ సమస్యలను ఉంచేవారు అక్కడ విద్వాంసులందరు ఆయా విషయాలను చర్చించి తగిన పరిష్కారమార్గాలను చెప్పేవారు (6-26).

రాష్ట్రం ఒక బలమైన గుఱ్ఱంగా వర్ణింపబడింది (9-14). గుఱ్ఱానికి మెడలో, నడుములో, ముఖంలో ఎలా బంధాలుంటాయో, అలాగే రాష్ట్రానికి గూడ పరిపాలనాపరాలైన నియమాలు ఉంటాయి. బంధాలుగల అశ్వమే నిర్ణీత ప్రదేశానికి వేగంగా సురక్షితంగా చేరుతుంది. అలాగే నియమాలుగల రాష్ట్రమే శీఘ్రంగా అభివృద్ధి పొందుతుంది.

రాష్ట్రానికి (దేశం) సర్వాధికారిని రాష్ట్రపతి అని, రాజని అంటారు. ఈ రాజును ప్రజలు ఎన్నుకొనేవారు (6-6). తరువాత ఒక శుభముహూర్తంలో విద్వాంసులచేత సేకరింపబడ్డ స్ఫూర్తిదాయకాలైన

జలాలతో అతణ్ణి అభిషేకించేవారు (101). రాజగురువు పురోహితు డనబడేవాడు అతడభిషేకసమయంలో సభాసదుల నుద్దేశించి "ఓ రాజసభాసదులారా! ఈ రాష్ట్రపతిని గొప్పక్షాత్రధర్మం కోసం, మంచి ఐశ్వర్యం కోసం, పెద్ద సామ్రాజ్యం కోసం, రాజకీయ పరాక్రమం కోసం ఏకగ్రీవంగా అభిషేకించండి. ఈ తండ్రి కొడుకును ఈ తల్లికొడుకును, ఈ ప్రజల కొరకై అభిషేకించండి. ఇతడు ఈ ప్రజలకు, సభాసదులైన మీకు, సౌమ్యగుణంకల బ్రాహ్మణులకు రాజౌతాడు" అని పలికి వారి అనుమతితో రాజును అభిషేకించేవాడు (9-40). రాష్ట్రశక్తి రాజు, పురోహితుడు అనే వీళ్లిద్దరిలోను విభక్తమై యున్నట్లు వర్ణింపబడింది (10-2) ఈరాజు సనాతన రాజనియమాల ననుసరించి పాలించేవాడు (9-25). ప్రజలకు రాజు బిడ్డవలె అత్యంతప్రియుడు (10-7).

రాజుకు సహాయకులుగా ఉండటంకోసం ప్రజలలో ముఖ్యులైనవారు రాజ్యాధికారులుగా ఎన్నుకోబడేవారు (9-3). ఈఅధికారులు మొత్తం 27 మంది ఉండేవారు. వీరు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులనే మూడు వర్ణాలకు ప్రతినిధులుగా ఉండేవారు (9-7). 'రాజార్యసభ' 'విద్యార్యసభ' 'ధర్మార్యసభ' అనే మూడు సభలుండేవి అందులో ఒక్కొక్కసభలో తొమ్మిదిమంది సభ్యులుండేవారు (9-30) ఈ సభలలో రాష్ట్రోన్నతికోసం అనేక (యోజనలు) ప్రణాళికలు వేయబడుతుండేవి (9-13).

ముఖ్యమంత్రి, న్యాయమంత్రి, అర్థమంత్రి, పురోహితుడు, విదేశమంత్రి, విద్యామంత్రి, ఉద్యోగవ్యాపారమంత్రి, సేనామంత్రి అనే మంత్రులుండేవారు (9-27). సేనామంత్రే సేనాపతి అనిగూడ పిలువబడేవాడు. అతడు రాజుకు కోశాన్ని (ధనాన్ని), సేనను సంపాదించి పెట్టేవాడు (9-5). భూసేన, జలసేన, అని సైన్యం రెండు రకాలుగా ఉండేది (20-41).

రాజు మీసాలతో (20-5) నీలలోహితమైన (నలుపు, ఎరుపు మిశ్రమం) శరీరం కలవాడై (16-47) ఉండేవాడు.

రాష్ట్రపతియైన రాజే ఇతర అధికారులను వారివారి యోగ్యతల ననుసరించి ఆయాస్థానాలలో నియోగించేవాడు. విద్యాప్రచారమే రాజుల ప్రథమ కర్తవ్యంగా ఉండేది. ద్వితీయకర్తవ్యం సంస్కృతిని ప్రచారం చేయడం, ప్రజలకు సుఖాలను కలుగజేయడం, శత్రువులనుండి, దొంగలనుండి ప్రజలను రక్షించడం. అంతిమ కర్తవ్యం, దేశానికి ధనధాన్య సమృద్ధిని కలుగజేయడం (6-2).

రాష్ట్రానికి మంగళకరాలైన యజ్ఞాలను నిర్వర్తించడం కూడ రాజవిధులలో ఒకటి. పన్నులద్వారా ధనాన్ని సేకరించి, యజ్ఞాలను నిర్వహింపచేయడం రాజుపని. యజ్ఞాలకోసం అవసరమంటే, ప్రజలందరు కావలసిన ధనాన్ని సమర్పించేవారు (6-11).

నదులను జలాశయాలను బాగుచేయించడం (6-22), చిన్నచిన్న బాటలను, పెద్దపెద్ద బాటలను వేయించడం, బావులు, కాలువలు, చెరువులు, సరస్సులు, తటాకాలు త్రవ్వించడం, నదులకు ఆనకట్టలు కట్టించడం (16-37) శరణు పొందినవారిని రక్షించడం, అరణ్యాలను ఓషధులను రక్షించడం (6-28), వనాలలో, నదులలో, పర్వతాలలో రహస్యస్థావరాలలోనుంచి ఇతరులకు కీడుచేసే దొంగలను, బందిపోట్లను, సంఘవ్యతిరేకులను, శత్రువులను దండించడం (11-79, 16-21) రాజు కర్తవ్యం. ఇటువంటి కర్తవ్యపాలనకై గూఢచారులుండేవారు (16-20). ఆయా ప్రకృతి సంపదలను రక్షించడానికి, అయా రక్షకులు ఉండేవారు. వనసంరక్షకులు, ఓషధిసంరక్షకులు, సరిహద్దుప్రాంతసంరక్షకులు ఉండేవారు (16-19). ప్రతి గ్రామానికి గ్రామాధికారులుండేవారు. వారు తలపాగా ధరించేవారు (16-22). రాష్ట్రం చుట్టూ అగడ్తలను త్రవ్వించేవారు. కోటలను కట్టుకొనేవారు. (16-35).

## యుద్ధాలు:

అనాడు శత్రువులవల్ల ఉపద్రవమెక్కువగా ఉండేది సామాన్యంగా సంవత్సరకాలమంతా దండయాత్రలతోనే గడిచేది (10-11,12-13). రాష్ట్రంలో అంతర్గత శత్రువులను శిక్షించడానికి ఆయా ఋతువులలో ఆయా దిక్కులలో జైత్రయాత్ర నిర్వహించేవారు. రాజ్యవిస్తరణకాంక్ష ఎక్కువగా అప్పటి ప్రజలకు, రాజుకూ ఉండేది. అందువల్ల యుద్ధాలు గూడ దినచర్యలైనాయి.

రాజులు యుద్ధానికి తరలి వెళ్లేటప్పుడు మంత్రి కుడిప్రక్క ఉండేవాడు. సేనాపతులు తమతమ సేనలతో ముందు నడిచేవారు (17-40). విద్వాంసులు వేదఘోష చేస్తుండగా యుద్ధానికి బయలుదేరేవారు (17-41). సేనలో అశ్వికులు, రథికులు, మహారథులు కూడ ఉండేవారు (16-26). వారు శిరస్త్రాణాలను, లోహకవచాలను ధరించేవారు అక్కడక్కడ తాత్కాలిక నివాసాలకై శిబిరాలను (డేరాలను) వేసికొనేవారు దుందుభి మొదలైన వాద్యాలను యుద్ధసమయంలో ప్రయోగించేవారు (16-35). ధనుస్సులు, కత్తులు, బాణాలు మొదలైన ఆయుధాలనుపయోగించేవారు(16-12). అగ్నికూడ ఆయుధంగా ఉపయోగపడేది (16-54,5-37). సైన్యాధికారులందరూ భేదనీతిలో నేర్పరులు (16-34). సంగ్రామంలో అమాత్యుని ఆజ్ఞలు శిరసావహింప బడేవి (9-9).

సైనికులు యుద్ధాలలోనే గాక దేవకార్యాలు నిరాటంకంగా నెరవేరడానికి, వాని రక్షణ కార్యక్రమంలో గూడ ప్రవర్తించేవారు (9-16). విజయాన్ని పొందిన రోజులలో మనోహరాలైన ఉత్సవాలు జరిపేవారు (9-20). వేదజ్ఞులే అమాత్యులుగా ఉండేవారు (9-11).

**కృషి (వ్యవసాయం):**

వ్యవసాయం అప్పటి ముఖ్యావృత్తులలో ఒకటి. నాగలికి ఎద్దులను కట్టి భూమిని దున్నడం (12-67), ఎత్తుపల్లాలు లేకుండ భూమిని చదును చేయడం (12-69), బంజరుభూములను సాగులోనికి తేవడం (16-33) వారికి తెలుసు. విత్తనాలు నాటడం (12-68), పండిన చేలను కోయడం, ధాన్యాన్ని గడ్డినుండి వేరుచేయడం, ధాన్యాన్ని దంచి బియ్యం చేయడం గూడ వారికి తెలుసు(19-6).

యవలు, వ్రీహులు, ఖల్వములు, ప్రియంగువులు, అణువులు, శ్యామాకములు, నీవారములు, గోధుమలు, మసూరములు, మినుములు, నువ్వులు, పెసలు, శనగలు మొ॥ పంటలను పండించేవారు (18-12).

వ్యవసాయానికి నీటిని చెరువుల్లో, తటాకాల్లోను నిలువచేసేవారు. నదులకు కట్టలు కట్టి నీటిని నిలువజేయడంకూడ వారికి తెలుసు, చిన్నచిన్న కాలువలను త్రవ్వి, నదుల, తటాకాల నీటిని వ్యవసాయ క్షేత్రాలకు తెచ్చుకొనేవారు (16-37).

**వాణిజ్యం:**

వాణిజ్యం వస్తు వినిమయరూపంగా జరుగుతుండేది (3-49). స్వదేశవిదేశ వాణిజ్యాలు రెండూ అప్పుడు కూడా ఉన్నాయి జలమార్గాలగుండా సరుకును చేరవేయటానికి చిన్న పెద్ద నౌకలను వారుపయోగించారు (16-42).

**ప్రయాణసాధనాలు:**

గుఱ్ఱాలచేత, ఎద్దులచేత లాగబడే బండ్లు భూప్రయాణానికి ఎక్కువగా ఉపయోగపడేవి (14-10). రాజులకు ప్రయాణసాధనాలుగా,

యుద్ధసాధనాలుగా రథాలుపయోగపడేవి (16-27). నీటిలో ప్రయాణానికి చిన్న, పెద్దనౌకలు ఉపయోగింపబడేవి (16-42). గుఱ్ఱం, ఒంటె మొదలైన జంతువులు గూడ ప్రయాణసాధనాలుగా ఉపయోగింపబడేవి.

## వృత్తులు:

వడ్రంగం, రథాలు చేయడం, కుమ్మరం, కమ్మరం, వేట, వస్త్రాలను నేయడం మొ॥ అనేక వృత్తులలో జనులు జీవించేవారు. కుక్కలకు శిక్షణనివ్వడం, దాస్యం, గృహాదిసంరక్షణం మొదలైనవి గూడ అప్పటి జనులచేత వృత్తులుగా గ్రహింపబడేవి (16-27). శిల్పం కూడ ఆనాడు ప్రసిద్ధిగాంచింది. రహస్యస్థావరాలను నిర్మించడం, గుహలను తయారుచేయడం, చక్రాదులను నిర్మించడం, అందమైన శయనాగారాలను తయారుచేయడం, అనేక రకాలైన ఇళ్లను నిర్మించడం మొదలైన శిల్పాలలో వారు నేర్పరులు (16-45). కట్టెలను కొట్టి జీవించేవారూ అప్పుడు ఉన్నారు (16-46)

ఉన్నినిచ్చే గొఱ్ఱెలను పెంచి వాటి రోమాలతో దారం తయారుచేసేవారు. అలాంటి దారాలతో నేసిన ఉన్నిదుస్తులను ధరించేవారు (13-50).

## లోహాలు - వస్తువులు:

బంగారం, ఇనుము, సీసం, తగరం, వెండి మొ॥ లోహాలతో తయారుచేయబడిన పాత్రలను, వస్తువులను, వారుపయోగించేవారు (18-13). మట్టిపాత్రలను కూడ ఉపయోగించారు యజ్ఞపాత్రలు కొయ్యతో చేయబడేవి (18-21). బంగారం, వెండి ఆభరణాల నుపయోగించేవారు.

**వైద్యం:**

ఆనాడు ఆయుర్వేదం ఎక్కువ ప్రచారంలో ఉంది వాజీకరణానికి, స్వస్థతకు, సౌమ్యతకు, ఉత్సాహం పెరగడానికి, ప్రాణశక్తిని పెంపొందించడానికి అనేకాలైన ఔషధాలు **(12-81)** ప్రచారంలో ఉండేవి. అలాంటి ఓషధులు కొన్ని పండ్లుండేవి, కొన్నిపండ్లులేనివి, కొన్ని పూలుకలవి, మరికొన్ని పూలులేనివి **(12-89)**. అశ్వత్థపలాశవృక్షాలు ఓషధులకు నిలయాలుగా చెప్పబడ్డాయి **(12-79)**. వాత, పిత్త, శ్లేష్మరోగాలకు, క్షయవ్యాధికి బాగా చికిత్స జరుగుతుండేది **(12-85,87)**. కఫరోగం, అర్శరోగం, శ్లీపదాదిరోగాలు, ముఖపాకం, క్షతాలు మొ॥ చాలా రోగాలకు కూడ చికిత్స జరుగుతుండేది **(12-97)**. రోగనివారణానికి చాల రకాలైన ఓషధుల పరస్పర గుణ, వీర్య, విపాకాదులననుసరించి వాటిని కలిపేవారు **(12-93)**.

భస్మాలు కూడ అప్పుడు మంచి ప్రచారంలో ఉన్నాయి **(21-36)**. చెడుక్రిముల బారినుంచి పదార్థాలను రక్షించడం వారికి తెలుసు. అన్నింటిని వేడిచేసి భద్రపరచేవారు **(21-43,44)**. శరీరంలోని ప్రతి అవయవం, దానిస్వరూపం, దాని ప్రత్యేకమైన క్రియ మొ॥ విశేషాలన్నీ అప్పటి వైద్యులకు తెలుసు **(19-82-90)**. సూర్యరశ్మిలో ఉండి సూర్యకిరణస్నానాన్నాచరించడం, దాని గుణ దోషాలు ఆనాటి వాళ్లకు తెలుసు **(8-48)**. అన్ని ఓషధులు అగ్ని స్వరూపాలని వారి విశ్వాసం**(12-104)**.

**విజ్ఞానాలు:**

నేటిలాగా నాడు కూడ పలువిధాలైన విజ్ఞాన శాస్త్రాలుండేవి. ఆయా శాస్త్రాల్లో నిపుణులుండేవారు. కూపవిద్య, జలగర్తనిర్మాణం, అభ్ర (ఖగోళ) విజ్ఞానం, ఆతప (సూర్యరశ్మి) విజ్ఞానం, మేఘవిజ్ఞానం,

విద్యుద్విజ్ఞానం, వర్షవిజ్ఞానం, వర్షనివారణం, వాత (గాలి) విజ్ఞానం, గృహనిర్మాణం, సికతా (ఇసుక, మట్టి) విజ్ఞానం, ప్రవాహవిజ్ఞానం, అంతర్జలవిజ్ఞానం, శంఖాదినిధివిజ్ఞానం, అదృశ్యతత్త్వవిజ్ఞానం, దృశ్యతత్త్వవిజ్ఞానం, పృథివీవిజ్ఞానం, బడబానలవిజ్ఞానం, సోమా ద్యోషధీవిజ్ఞానం, నౌకానిర్మాణవిజ్ఞానం మొదలైన అనేక విజ్ఞానాలు ఆనాడు ఉన్నాయి (16-35-46)

**సంఖ్యామానం - గణితం:**

ఇలాంటి విజ్ఞానాల్లో విశేషించి పేర్కొనదగింది గణితం ఇప్పటి సంఖ్యామానాన్ని మించిన సంఖ్యామానం అప్పుడు ప్రచారంలో ఉంది ఇప్పుడు మన సంఖ్యామానం కోటివరకే పెద్దసంఖ్య కోటియే కాని అప్పుడో లక్షకోట్లవరకు సంఖ్యామానం ఉండేది అప్పటి సంఖ్యలు దశ (10) శత (100) సహస్ర (1,000) అయుత (10,000) నియుత (1,00,000) ప్రయుత (10,00,000) అర్బుద (1,0 0,00,000) న్యర్బుద (10,00,00,000) సముద్ర (1,00,00,00,000) మధ్య (10,00,00,00,000) అంత (1,00,00,00,00,000) పరార్ధం (10,00,00,00,00,000) లు. ఇందులో నియుతం లక్షకు, అర్బుదం కోటికి, పరార్ధం లక్షకోట్లకు సమానం (17-2). కూడిక, తీసివేత, గుణకారం, భాగహారం మొ॥ గణిత ప్రక్రియలన్నీ వారికి బాగా తెలుసు (13-24,25). వివిధ వేదీ నిర్మాణంలో వారు కుశలురు కాబట్టి జ్యామితి (Geometry) గణితంలో కూడ వారు నిపుణులనే చెప్పవచ్చు.

**పశువులు - పక్షులు, జలచరాలు - కీటకాలు:**

పశుసంపదే ఆనాడు గొప్ప ధనంగా భావింపబడేది. గ్రామ్యాలైన ఏడు పశుజాతుల అభివృద్ధికై వాళ్లు ప్రార్థనలు చేసేవారు (9-32).

గుఱ్ఱం, ఆవు, మేక, గొఱ్ఱె, కుక్క, ఒంటె, ఎనుము (గేదె), గాడిద మొ॥ జంతువులు పోషింపబడేవి గుఱ్ఱాలు, ఎద్దులు అనేక రకాలుండేవి (20-52;20-78).

సింహం (24-31), పులి (24-30), ఏనుగు (24-30), లేడి (24-27), దుప్పి (24-27), కృష్ణమృగం (24-27), ఇతరమృగవిశేషాలు (పృషత్, కురంగ, న్యంకు, సరస్వత, గౌరమృగాలు) (24-28), అడవిదున్న 924-28), గవయమృగం (13-49), పిల్లి (24-31), నక్క (24-32), ఎలుగుబంటి (24-36), కుందేలు (24-38), ఖడ్గమృగం (24-40), అడవిపంది (24-40),వివిధాలైన ఎలుకలు (ఆఖు, కశ, మాంధాలసాలు) (24-38), ముంగిస (24-26), వానరం (24-30), ఋషభమృగం (24-30), తోడేలు (4-34), మొ॥ అనేక వనచరాలు వారికి తెలుసు.

హంసలు, కొంగలు, సారసపక్షులు, నీటికాకులు, చక్రవాకాలు (24-22), కోళ్లు, గుడ్లగూబలు, నీలకంఠాలు, నెమళ్లు, పావురాలు (24-23), లవ-కౌలిక-గోషాద-కులీక-పారుష్ణ-సీచాపు జతు-సుపర్ణ-క్రౌంచపక్షులు (24-24,25), నల్లకాకులు (24-25), కపింజల-కలవింక-తిత్తిరి-వర్తిక-కకర-వికకరపక్షులు (24-20), గోరువంక (24-33), చిలుక (24-33), గ్రద్ద (24-34), డేగ (24-30), కోయిల (24-37) మొ॥ పక్షులు చాలా ఉండేవి

అనేక సర్పాలు (24-31), రకరకాలైన చేపలు (24-34-36), మొసలి (24-35), పీత (24-35), తాబేలు (24-37), కప్పలు (24-21), మొ॥ జలచరాలు, దోమలు, తుమ్మెదలు (24-29), క్షుద్రాలైన కీటకాలు (24-31), ఘుణకీటము (11-74) మొ॥ కీటాలు ఇతరక్రిములు గూడ అప్పటి జనులకు తెలుసు.

కరబూజా (3-60), బదరీ (రేగు) (91-22)మొ॥ పళ్లను వాళ్లు తినేవారు.

**ఆధ్యాత్మిక భావనలు:**

ఋగ్వేదంలో దశమమండలంలో ప్రవచింపబడ్డ 'ఏకేశ్వరవాదమే' ఇందులోను సమర్థింపబడింది శుక్లయజుస్సంహితలోని 12,23,40 అధ్యాయాల్లో తత్త్వవిచారం చేయబడింది

సర్వాంతర్యామియైన పరమాత్ముడొక్కడే. అతడు ఉత్పత్తి నాశరహితుడు విశ్వనియంతయైన పరమాత్ముడే. ఆయా ప్రదేశాల్లో సూర్యునిగా, అగ్నిగా చంద్రునిగా, ఇంద్రునిగా తెలియబడుతున్నాడు (12-14). సర్వాంతర్యామియైన పరమాత్ముని స్వరూపాన్ని తెలిసికోవడంవల్ల, జీవాత్మకు మృతిలేదని తెలిసికోవడంవల్లనూ మానవునికి మరణభయం తొలిగిపోతుంది అలాంటి మానవుడు ముక్తికోసం ప్రయత్నిస్తాడు ఇలాంటి బోధనలు 40వ అధ్యాయంలో చేయబడ్డాయి. దీనికే 'ఈశావాస్యోపనిషత్తు' అని పేరు.

సర్వేశ్వరుని సంతోషపెట్టడానికి యజ్ఞాలనాచరించాలి. యజ్ఞక్రియలచేత సంతుష్టుడైన (సంతృప్తిచెందిన) పరమాత్మ ఐహిక ఆముష్మిక సుఖాలనిస్తాడని వారి భావన. యజ్ఞమే అన్నిటిని సాధించిపెడుతుందని వారి విశ్వాసం, మానవప్రయత్నసాధ్యాలు కానివన్నీ యజ్ఞక్రియలవల్ల సాధ్యాలని వారి ఆలోచన (37వ అధ్యాయం). మహావైద్యులచేత నయం చేయబడని రోగాలు కూడ యజ్ఞమంత్రాలచేత నశిస్తాయని వారి నమ్మకం (5-23). శత్రువుల బారినుంచి తమను రక్షించుకోవడానికి, పాపాలు పోగొట్టుకోవడానికి, పుష్టి, సంపద, సంతతి, రోగాదిబాధావిముక్తి మొదలైన వాటికి యజ్ఞం తప్ప వేరే గతిలేదని వారి భావన (1-1).

**3. భరద్వాజుడు:**

29 దశతుల్లో కొన్ని మంత్రాలను భరద్వాజుడు దర్శించాడు (చూ. పే.28).

**4. మేధాతిథి:**

మేధాతిథి 29 దశతుల్లో కొన్ని మంత్రాలను దర్శనం చేశాడు (చూ.పే.146).

**5. కణ్వుడు:**

సామసంహితలోని 29 దశతుల్లో కొన్నిమంత్రాలకు ద్రష్ట కణ్వుడు. ఇతడు తన సామానికి ఆధారం దొరక్క ఆలోచిస్తుండగా ఒక పిల్లి తుమ్మును విన్నాడు. ఆ శబ్దం ఆధారంతో సామబుుక్కును చెప్పాడని బ్రహ్మపురాణంలో చెప్పబడింది. శకుంతలను పెంచినవాడుగ ఈయనకు చాల ప్రసిద్ధి. ఇతడు కశ్యపవంశంలో జన్మించడం చేత కాశ్యపుడని కూడా పిలువబడ్డాడు. ప్రాచీన భారతదేశంలోని ఋషికుటుంబాలలో కణ్వుని వంశం చారిత్రికప్రసిద్ధిని పొందింది. ఇతని తండ్రి మేధాతిథి అని మహాభారతం (భార.శాన్తి.208) చెబుతున్నది. ఇతని ఆధ్వర్యవంలోనే దుష్యంతుని పుత్రుడైన భరతుడు '**గోవితత**' అనే యాగం చేశాడు (భార.అది.)

**6. విశ్వామిత్రుడు:**

29 దశతుల్లో కొన్ని మంత్రాలను దర్శనం చేసినవాడు విశ్వామిత్రుడు (చూ.పే.29).

**7. గోతముడు:**

గోతముడు 20 దశతులలో కొన్ని మంత్రాలకు ద్రష్టగా ఉన్నాడు (చూ.పే.32).

**8. శునఃశేపుడు:**

17 దశతుల్లో కొన్ని మంత్రాలకు ద్రష్ట శునఃశేపుడు (చూ.పే.148).

**9. సౌభరి:**

సౌభరి 13 దశతుల్లో కొన్ని మంత్రాలను దర్శించాడు. ఇదే పేరు కల వ్యక్తులు ఇంకొందరు పురాణేతిహాసాల్లో ఉన్నారు. ఒక సౌభరి తండ్రి సోభరి ఇతడు నీటిమధ్యలో కూర్చొని తపస్సు చేసుకొనేవాడు. మత్స్యరాజుయొక్క భోగాలను చూసి తాను వాటిని అనుభవించాలనుకున్నాడు. మాంధాత దగ్గఱికి వెళ్లి, అతని కుమార్తెలను తన కిమ్మని కోరాడు వృద్ధుడైనందువల్ల, కుమార్తె లంగీకరిస్తే వివాహం చేయగలనని అతడు చెప్పగా, తన దివ్యశక్తితో సుందరరూపాన్ని పొంది, వారిని వివాహమాడి, బంగారుమందిరాలను నిర్మించుకొని, భోగాలను అనుభవించాడు. కాని చివరికి తన తప్పిదాన్ని విచారించి తపస్సుచేసి పరబ్రహ్మను పొందాడని విష్ణుపురాణం, భాగవతం (9 వ స్కంధం) చెబుతున్నాయి.

ఇంకొక సౌభరి వింధ్యపర్వతంమీద ఆశ్రమాన్ని నిర్మించుకొన్నాడు. యుధిష్ఠిరుని అశ్వమేధయాగకాలంలో అర్జునుడు ఇతని ఆశ్రమాన్ని దర్శించాడు. ఆ సమయంలో ఉద్దాలకునిచేత శపింపబడ్డ చండీవృత్తాంతం సౌభరి అర్జునునికి చెప్పాడు (జై.అశ్వ.)

**10. జమదగ్ని:**

జమదగ్ని 13 దశతుల్లో కొన్ని మంత్రాలకు ద్రష్ట (చూ.పే.148).

**11. ప్రస్కణ్వుడు:**

ఇతడు సామసంహితలో 13 దశతుల్లో కొన్ని మంత్రాలను దర్శించాడు. ఈ పేరుకల వ్యక్తులు ఇద్దఱు పురాణేతిహాసాల్లో

ఉన్నారు. అందులో ఒకరు మేధాతిథిపుత్రుడు. ప్రస్కణ్వవంశంలోని రాజులు అందరూ బ్రాహ్మణులుగా మారిన క్షత్రియులు (శ్రీ. భా.9). ఇంకొక ప్రస్కణ్వుడు కణ్వముని కుమారుడు

**12. నృమేధుడు:**

నృమేధుడు 13 దశతుల్లో కొన్ని మంత్రాలకు ద్రష్ట. ఇతడు సుమేధునితో కలిసి కొన్ని మంత్రాలను దర్శించాడు. పంచవింశ బ్రాహ్మణంలో ఇతడు ఒక అంగిరసుడుగా వర్ణించబడ్డాడు.

**13. ప్రాగాథుడు:**

ఇతడు ఈ సంహితలో [illegible] దశతుల్లో కొన్ని మంత్రాలకు ద్రష్ట

**14. కశ్యపుడు:**

సామసంహితలో 7 దశతుల్లో కొన్ని మంత్రాలకు ద్రష్ట కశ్యపుడు. ఇతడు మరీచి పుత్రుడు. సంతానంకోసం **'కశ'** మనే మద్యాన్ని సేవించడంతో ఇతనికీపేరు వచ్చింది. ఇతడు దక్షపుత్రికలైన అదితి, దితి, దనువు, కాల, అనాయువు, సింహిక, క్రోధ, పృథ, విశ్వ, వినత, కపిల, కద్రువలను వివాహం చేసికొని దేవతలను, దానవులను, నరులను, మృగాలను, వృక్షాలను, సంతానంగా పొందాడు. ఇతడు బ్రహ్మవాది మరియు ప్రజాపతి, దేవర్షి. ఆదిత్యులు, మరుత్తులు, రుద్రులు ఇతని సంతానమే (బృ.II. 27-104). బ్రహ్మయొక్క అంశయే కశ్యపుడు (భార.). కశ్యపునికి **'అరిష్టనేమి'** అనే మరోపేరు ఉందని మహాభారతం చెబుతున్నది. కుబేరుని ఏడుమంది గురువులలో ఇతడు ఒకడు (భార.అను.).

**15. రేభుడు:**

ఇతడు 5 దశతుల్లో కొన్ని మంత్రాలను దర్శించాడు.

**16. అత్రి :**

అత్రి 4 దశతుల్లో కొన్ని మంత్రాలకు ద్రష్ట. ఇదే పేరు కలవారు ఇద్దఱు పురాణేతిహాసాల్లో కనిపిస్తున్నారు. అందులో ఒకడు బ్రహ్మకళ్లనుంచి పుట్టినవాడు (శ్రీ.భా.). ఇతని పుత్రుడే చంద్రుడు (శ్రీ.భా.) సప్తర్షుల్లో ఒకడు (భార.శాన్తి.). ఇతనికి దత్తాత్రేయుడు, చంద్రుడు, దుర్వాసుడు, ప్రాచీనబర్హి అనే పుత్రులు ఉన్నారు. సోముడనే రాజుయొక్క రాజసూయయాగానికి ఇతడే ఋత్విక్కు (భార.శల్య.). ఇంకొక అత్రి శుక్రాచార్యుని పుత్రుడుగా పేర్కొనబడ్డాడు (భార.ఆది.).

**17. వాలఖిల్యులు :**

వీరు 3 దశతుల్లో కొన్ని మంత్రాలకే ద్రష్టలైనప్పటికి చాలా ముఖ్యులు. వాలఖిల్యుల తల్లిదండ్రులు సంతతి, క్రతులు. వీరు 60,000 మంది. సూర్యుని కీర్తిస్తూ ఉదయించినప్పటి నుంచి, అస్తమించేవరకు పక్షులరూపంలో ఎదురుగానే ఉండేవారు. వీరు తపస్సుద్వారా ఋషులైనారు. వీరే కొన్ని సంహితలకు ద్రష్టలయ్యారు. సూర్యలోకంలో నివసిస్తారు (బృ.II.3.25.4). సావర్ణవంశానికి చెందిన వారు (వా.పు.). వాలఖిల్యులు దర్భలకొనలనుంచి జన్మించారని, వారుణియజ్ఞంలో వారికి అన్నిరకాల అధికారాలు వచ్చాయని, పుణ్యా, సుమతి అనే ఇద్దరు వారి సోదరీమణులని చెబుతారు. వీరు అంగుష్ఠప్రమాణ దేహులు. తలక్రిందులుగా తపస్సు చేసేవారు. నిత్యబ్రహ్మచారులు (భార.). వేదాలను, శాస్త్రాలను సూర్యుని రథంలో కూర్చొనే నేర్చుకొన్నారు (కంబరామా.ఉత్తర.).

పైన వివరించిన ఋషులేకాక ఇరింబిఠి, వత్సుడు, ఉశనసుడు, ప్రయోగుడు, విరూపుడు, శంయుడు, భర్గుడు, త్రితుడు, దీర్ఘతముడు, శ్రుతకక్షుడు, గోషూక్త్యశ్వసూక్తులు, కుసీదుడు, విందుడు, పురుహన్మలు, అంగిరసుడు, గౌరీవీతి, సుకక్షుడు, సుదీతి పురుమీఢులు, ఆయుఙ్క్ష్వాహి,

గోపవనుడు, సింధుద్వీపుడు (అంబరీషుడు), తృణపాణి, మనువు, ఉత్కీలుడు, శ్యావాశ్వుడు, వామదేవుడు, ఉపస్తుతుడు (వార్ష్ణి హవ్యుడు), బృహదుక్థుడు, త్రిశిరసుడు (త్వాష్ట్రుడు), బుధగావిష్ఠిరులు, వత్సప్రి, పాయు, గయుడు, మృక్తావహాద్వితుడు, వసూయవోఒత్రయః, పూరుడు, మారీచుడు, అగ్ని (తాపసుడు), సోమాహుతి, విశ్వమనసుడు (వైయస్యుడు), ఋజిష్వుడు, హర్యతుడు, ఇంద్రమాతలు (దేవజాములు), ప్రియమేధుడు, సుకక్షుడు, త్రిశోకుడు, కణ్వుడు (ఘౌరుడు), గోధ, గృత్సమదుడు, పూతదక్షుడు, ఆంగిరసుడు, పరుచ్ఛేపుడు, ఆత్రేయుడు, పర్వతుడు, కాణ్వుడు, అవస్యుడు, సంవర్తుడు, అమహీయుడు, పరాశరుడు, శాక్త్యుడు మొ॥ ఋషులు మంత్రద్రష్టలుగా అక్కడక్కడా సామసంహితలో పేర్కొనబడ్డారు.

- టి.ఎస్.

## 4. 6 దేవతలు

ఏదైనా ఒక దేవతను వర్ణించి స్తుతించే మంత్రాన్ని ఋక్కు అంటారు. అది ఛందోబద్ధమై ఉంటుంది. అటువంటి ఋక్కుల సముదాయమే ఋగ్వేదం. సంగీతాన్ని కూర్చి పాటగా పాడే ఋక్కును **'సామ'** అని చెపుతారు. సామల సముదాయం సామవేదం. సామవేదంలోని మంత్రాలన్నీ ఋగ్వేదంలోనివే **(డెబ్బై అయిదు మంత్రాలు మాత్రం వేరుగా ఉన్నాయి.)** ఇంచుమించు **1050** మంత్రాలు సామవేదంలో కూడా ఉన్నాయి. కాగా ఋగ్వేదంలోని దేవతలే సామవేదంలో కూడా కనిపిస్తారు. అయినా అగ్ని, ఇంద్రుడు, సోముడు, అనే దేవతలకు సామవేదంలో అత్యధికంగా ప్రాముఖ్యం ఉంది. ఉషస్సు, విష్ణువు, ఆదిత్యుడు మొ॥ వారు అక్కడక్కడ స్తుతింపబడ్డారు.

సామవేదంలో ముఖ్యమైన దేవతలను గురించి, ఎదురు బదురుగా ఉన్న మఱికొందఱు దేవతల గురించి సంగ్రహంగా తెలుసుకుందాం.

**1. అగ్ని:**

ఇతని స్థానం భూమి. ఇతడు ప్రత్యక్షదైవం. జ్వాలారూపుడు. యజ్ఞవేదిక ఇతనికి పవిత్రాసనం. ఇతడు దేవతలందరికి దూత. వారిని పిలిచి కూర్చోబెట్టి హవిస్సులను (అన్నం, నెయ్యి, పాలు మొ॥ వస్తువులు) వారికందిస్తాడు. తేజస్సు, బలం, ఆయుర్దాయం, ఆరోగ్యం మొ॥ లాభాలను మానవులకు సమకూరుస్తాడు. వైదికదేవతలలో ఇంద్రుని తరువాత అగ్నికే ప్రాధాన్యం.

**విశేషాలు:**

భరద్వాజమహర్షి అగ్నిని ఈ విధంగా స్తుతించాడు:

1. అగ్నిదేవా! నేనుచేసే స్తుతులకు సంతసించి, దేవతలకు హవిస్సులను అందించడానికి, స్వయంగా తినడానికి ఈ యజ్ఞానికి దయచేయి! ఈ దర్భాసనం మీద కూర్చో!

2. అగ్నీ! దేవతలందరినీ పిలిచి యజ్ఞానికి తీసుకొనివచ్చే వాడవు నీవే. ఆ పని చేయడానికి దేవతలు యజమాని (యాగం చేసేవాడు) ద్వారా నిన్ను పురమాయించారు సుమా! (పూ.1.1.1-2).

మరొక ఋషి ఇలా అంటాడు:

1. అగ్నిదేవా! మానవులు (యాగం చేసేవారు) బలం చేకూరడానికి నిన్ను స్తోత్రం చేస్తూ ఉంటారు. కాబట్టి నేనుకూడా నిన్ను స్తుతిస్తాను. నాకు బలమిచ్చి నా శత్రువులను తుదముట్టించు (పూ.1.3-2).

సౌభరి, ఉత్కీలుడు అనే ఋషులు ఈ విధంగా అన్నారు:

1. అంతటా నిండి ఉన్న ఓ అగ్నీ! ఎవరు నిన్ను భక్తితో ఆరాధిస్తారో, ఎవరు నీకు శ్రద్ధతో హవిస్సును అందిస్తారో, వారికి వేదజ్ఞుడు, ధనవంతుడు, అందరినీ, ఆదరించేవాడు, అయిన పుత్రుడు తప్పక కలుగుతాడు.

2. అగ్నిదేవుడు బలాన్ని, ఆరోగ్యాన్ని, ధనాన్ని మంచి సంతానాన్ని, గోవులను ఇవ్వడానికి సమర్థుడు. అతడు పాపాలను కూడా నశింపచేస్తాడు (పూ.1.6.4-6).

వేరొకచోట ఆత్రేయుడైన గయుడనే ఋషిస్తుతి ఇలా ఉంది:

1. అగ్నిదేవా! ధగధగ మెరిసే బంగారాన్ని మాకు ప్రసాదించు. ఇతరులను కన్నుకుట్టే ఐశ్వర్యాన్ని మాకిచ్చి, మాకు అన్న వస్త్రలోపం కలుగకుండా చూడు (పూ.1.9.1).

ఇంకోచోట భరద్వాజమహర్షి అగ్నిని ఈ విధంగా సంభావించాడు:

1. అగ్నిదేవుడు తీక్ష్ణమైన తన తేజస్సుతో ప్రపంచాన్ని బాధించే రాక్షసులను మట్టుపెట్టుగాక! మాకు ఎల్లప్పుడు ధనాన్ని ఇచ్చుగాక!

2. అగ్నిదేవుడు స్వర్గానికి శిరోమణి భూలోకానికి ప్రభువు. మానవులందరికి ఆప్తబంధువు. లోకయాత్రకై ఆవిర్భవించిన మహానుభావుడు. క్రాంతదర్శి. ధగధగ మెరిసేవాడు. అర్చించే వారికి చక్కని అతిథి అందరిని రక్షించేవాడు. ఇటువంటి దేవుని సృజించి దేవతలు లోకానికి ఉపకారం చేశారు (ఉ.8.3.1).

**2. ఇంద్రుడు:**

ఇతనిస్థానం ఆకాశం. వైదికదేవతలందరకు ఇతడు తల మానికం. దివ్యరూపుడు సోమపానమంటే ఇతనికి మహాప్రీతి. ఇతనికి అమోఘమైన వజ్రాయుధం ఉంది దధీచి ఎముకలతో అది తయారయింది దీనితో ఇంద్రుడు వేలకొలది రాక్షసులను సంహరిస్తాడు వర్షాన్ని, కాంతిని లోకానికి ప్రసాదించడం, సకలైశ్వర్యాలను మానవులకు కలుగచేయడం ఇతని ముఖ్యకార్యాలు. ఇతనికి బంగారు రథం సలక్షణమైన గుఱ్ఱాలు ఉన్నాయి. ఇంద్రుడులేని యజ్ఞం అంటూ ఉండదు. కనుకనే **'దేవరాజు'** అనే ఇతని బిరుదం సార్థకం.

**విశేషాలు:**

మధుచ్ఛందసుడనే ఋషి ఇంద్రుని ఇలా స్తుతించాడు:

1. ఓ ఇంద్రా! గౌరవాస్పదమైంది, అందరిని జయించటానికి ఉపయోగించేది, శత్రునాశానికి పనికివచ్చేది, మిక్కిలి విస్తారమైంది అయిన ధనాన్ని మా సంరక్షణకోసం తీసుకురావయ్యా!

కొద్దిపాటి ధనంకోసం, కొల్లలుగా ధనం కోసం కూడా మేము ఎల్లప్పుడు ఇంద్రుని కొలిచి ఆహ్వానిస్తూ ఉంటాం. **అతడు** మాకు సాయం చేస్తాడు. వజ్రాయుధంతో **అతడు మా శత్రువులను** చెండాడుతాడు (పూ.2.2.56).

శ్రుతకక్షుడనే ఋషి వేరొకచోట ఇలా అన్నాడు:

1. ఓ ఋత్విక్కులారా! ఇంద్రుడు సోమరసాన్ని మిక్కిలి ప్రీతితో త్రాగుతాడు. మన శత్రువులను సంహరిస్తాడు. అతడు జ్ఞానరాశి, ధనరాశులను కూడా సమకూరుస్తాడు. అతణ్ణి బాగా స్తోత్రం చెయ్యండి (పూ.2.5.1-1).

గోతముడు ఇంద్రుని వజ్రాయుధాన్ని గురించి ఇలా చెప్పాడు:

1. ఒకప్పుడు రాక్షసులు విజృంభించి ఋషులను హింసించారు. బాధలుపడి చనిపోయిన ఋషులలో దధీచి ఒకడు. అతని ఎముకలు చాలా శక్తిగలవి. వానితో ఇంద్రుడు వజ్రాయుధాన్ని తయారు చేయించి ఎనిమిదివందల పదిమంది రాక్షసులను తునాతునకలు చేశాడు (పూ.2.7.5).

విశ్వామిత్రుడు మొ॥ కొందరు ఋషులు ఇంద్రుణ్ణి గూర్చి ఇలా చమత్కరించారు:

1. ఇంద్రా! స్తోత్రాలు నీకు ఆనందాన్ని కలిగిస్తాయి. నీవు అన్నపతివి (అందరకు అన్నం కలిగించేవాడు). నీకు సొగసైన గుణాలు ఉన్నాయి. సోమరసం అంటే నీకు చాలా ఇష్టం.

2. ఇదిగో! సోమరసం సిద్ధంగా ఉంచాం. రా! వచ్చి ఆస్వాదించు. సోమరసం ఉంటే నిన్ను ఇతరమైన హవిస్సులు ఆకర్షించవు అందమైన భార్య అందుబాటులో ఉన్నప్పుడు ఆమె భర్తను అన్యస్త్రీలు ఆకర్షింపలేరు గదా! (పూ.2.12.4.5).

వసిష్ఠుడు, రేభుడు అనే ఋషులు ఈ విధంగా ప్రశంసించారు:

1. ఇంద్రా! తండ్రి తన కుమారునికి ధనాన్ని, జ్ఞానాన్ని ఏ విధంగా ఇస్తాడో, ఆ విధంగానే నీవు మాకు జ్ఞానాన్ని, ధనాన్ని ఇయ్యి. అందరిచే గౌరవింపబడే మహానుభావా! యజ్ఞంలో మాకు చక్కని ఆత్మప్రకాశాన్ని అనుగ్రహించు (పూ.3.3.7).

దేవాతిథి మొ॥ ఋషులు వేరొకచోట ఇలా స్తుతించారు:

1.ఇంద్రా! నీకు మిత్రుడైన వానికి అశ్వాలు, రథాలు, గోవులు, సౌందర్యం ధనం, అన్నం కోకొల్లలుగా లభిస్తాయి. మేము నీ మైత్రిని కోరుతూండటం అందువల్లనే. మేము ఆహ్లాదకరమైన ప్రశంసలను నీకు వినిపించడానికి సభలలో పాల్గొంటూ ఉంటాం (పూ.3.5.5).

వేరొక చోట ఇంద్రుని ప్రశంస ఇలా ఉంది:

1. ఇంద్రుడు శీఘ్రగామి. మదించిన ఆబోతులాగా భయంకరుడు. శత్రువులను సంహరించేవాడు. జనులను ఆకర్షించేవాడు. ఏమరుపాటు లేకుండా కార్యాలను సాధించేవాడు. అవసరంవస్తే విరుచుకుపడతాడు. అసహాయశూరుడు వందసైన్యాలను ఒక్కడే జయించగలడు.

2. మానవులారా! ధీరుడు, శూరుడు, సమర్థుడు, ఎదురు లేనివాడు, యోధాగ్రణి. జయశీలుడు అయిన ఇంద్రుని ఆరాధించండి. అతని సాయంతో శత్రువులను జయించండి (ఉ.22.1-2)

**3. సోమం:**

దీని స్థానం భూమి. వాస్తవంగా ఇది ఒకానొక లత. ఉత్తర భారతదేశపు పర్వతాలలో విశేషంగా దొరుకుతుంది. **'మూజవం'** అనే కొండమీద బాగా పెరుగుతుందని ప్రతీతి. రాతిపలకలతో చితక్కొట్టి దీని రసాన్ని పిండుతారు. దాన్ని వడబోస్తారు. వడబోసిన సోమరసానికి **'పవమానం'** అని పేరు. లతను, రసాన్ని అధిదేవతగా భావించిన దేవుణ్ణి కలిసి ఏకంగా **'సోమం'** లేక **'పవమానం'** అని వ్యవహరించడం వైదిక ఋషుల ఆచారం. సోమరసం ఇంద్రునికి, దేవతలకు అమందానందాన్ని కలుగజేస్తుంది. కనుకనే యజ్ఞంలో దీనికి ప్రముఖమైన స్థానం ఏర్పడింది. దేవతలకు సమర్పించిన తరువాత యజ్ఞం చేసేవారు కూడా సోమాన్ని పానం చేస్తారు.

అలా చేసిన వ్యక్తిని **'సోమపీథి'** అంటారు. ఈ బిరుదు గొప్ప వైదికగౌరవాన్ని కలుగజేస్తుంది. సోమాన్ని దేవతగా భావించిన వైదికఋషుల భావనలు మనోహరంగా ఉంటాయి. సామవేదంలో ఎక్కువగా ప్రసక్తమైన దేవతలలో సోమం మూడవది.

**విశేషాలు:**

మధుచ్ఛందసుడు మొ॥ ఋషులు సోమాన్ని గురించి ఇలా అన్నారు:

1. ఓ సోమమా! నీ రసం చాల గొప్పది మంచి ప్రభావం గలదై, ద్యులోకంలో ప్రకాశిస్తూ ఉంటుంది. భూలోకవాసులమైన మేము ఆ రసాన్ని స్వీకరిస్తాం

2. సోమమా! ఇంద్రుడు త్రాగడానికి అనువుగా పిండబడ్డ నీవు, మంచి రుచిగాను, మత్తును కలిగించేదిగాను ప్రసరించాలి.

3 నీవు మా కోరికలు తీరుస్తూ, ధారగా ద్రోణకలశంలోకి (కూజావంటి పాత్ర) రావాలి. తరువాత నీ శక్తితో మాకు ధనాన్ని కలుగజేస్తూ ఇంద్రుణ్ణి సంతోషపెట్టాలి.

4. ఉల్లాసాన్నికలిగించే సోమమా! నీవు గొప్పగా తియ్యగా ఉండి కలశంలోకి ప్రవేశించాలి. అలా అయితే ఇంద్రునికి యజ్ఞంలోకి రావడానికి ప్రోత్సాహం కలుగుతుంది.

5. పాపాలను పోగొట్టే సోమమా! బలాన్ని, సంతోషాన్ని కలిగించే దానవై నీవు ప్రసరించాలి. ఇంద్రుడు, అతని మిత్రుడు వాయువు ఆస్వాదించడానికి నీవు రావాలి (పూ.5.1.1-3.6.8).

ప్రతర్దనుడనే ఋషి ఈ విధంగా ప్రశంసించాడు.

1. పిండబడుతున్న సోమరసం పాత్రల్లోకి చేరుతుంది. అది బుద్ధివైభవాన్ని కలుగజేస్తుంది. ద్యులోకాన్ని, భూలోకాన్ని, అగ్నిని.

సూర్యుణ్ణి ప్రకాశింపజేస్తుంది. ఇంద్రుణ్ణి, విష్ణువును సంతోషపెడుతుంది. దాని సామర్థ్యం గొప్పది (పూ.5.6.5).

పరాశరుడు సోమరసాన్ని పొగడినతీరు:

1. పరమ పూజ్యమైంది సోమరసం. అది అద్భుతమైన పనులను చేస్తుంది నీళ్ళను పుట్టిస్తుంది. దేవతలను సేవిస్తుంది. ఇంద్రునికి బలాన్ని, సూర్యునికి కాంతిని కలుగజేస్తుంది (పూ.5.7.10):

ఋణవుడనే ఋషి కొనియాడిన తీరు:

1. ఋత్విక్కులు పిండిన సోమరసం ధనాన్ని, గోవులను, భూములను, మంచిమనుష్యులను కూడా సంపాదించి పెడుతుంది (పూ.5.10.5).

**4. ఉషస్సు:**

స్త్రీ రూపంగా వర్ణింపబడిన దేవత. ఈమె స్థానం అంతరిక్షం. సూర్యోదయానికి ముందుగా కనిపించే అరుణకాంతి ప్రవాహాన్ని వైదికఋషులు రూపురేఖలు తీర్చిదిద్ది అతిసుందరంగా వర్ణించారు.

**విశేషాలు:**

అజమీఢుడు, గోతముడు మొ॥ ఋషులు ఉషస్సును ఇలా వర్ణించారు:

1. రాత్రియొక్క చివరిభాగంలో చీకటిని పోగొడుతూ సూర్యుని కుమార్తె అయిన ఉషస్సు అందరికి కనిపిస్తుంది. ఆమె అన్ని ప్రాణులకు ప్రేరణ కలిగించి, ఆయా పనులను చేయిస్తుంది. ఎన్నో లాభాలను చేకూరుస్తుంది. ఉషస్సు అందరికి చెల్లెలు వంటిది.

2. పంచకళ్యాణి గుఱ్ఱంలాగా ఎన్నో రంగులను కూర్చుకుంటూ ఉషస్సు అశ్వినీదేవతలతో పాటు యజ్ఞంలో స్తోత్రాలను పంచుకుంటుంది.

**3.** ఉషోదేవీ! నీవు అశ్వినీదేవతలకు స్నేహితురాలవు. రంగు రంగుల కాంతులను రంగరిస్తావు. ధనాన్ని ఇవ్వగలశక్తి గలదానవు.

**4.** సిరిసంపదలు గల దేవీ! మాకు సంపదలను ఇయ్యి. వానితో మేము మా పుత్రులను పౌత్రులను కూడ పోషించుకుంటాం.

**5.** ధగధగ మెరిసె ఉషోదేవీ! నీకు గోసంపద ఉంది. అశ్వసంపద ఉంది. మృదుమధురమైన మాట నీ సొమ్ము. చీకటిని పోగొట్టి ధనం లాభించే పనికి మమ్ముల్ని ప్రోత్సహించు

**6.** ఉషోదేవీ! నీకు ఐశ్వర్యం ఉంది ఎఱ్ఱని గుఱ్ఱాలను కూర్చుకొని రథం ఎక్కి మాకు సకల సౌభాగ్యాలను తీసుకురా! **(ఉ.19.1-3).**

సత్యశ్రవసుడనే ఋషి ఉషస్సును గూర్చి ఇలా అన్నాడు:

**1.** ఉషోదేవీ! నీవు గొప్ప తేజస్సుగలదానవు. నేటి మా యజ్ఞంలో ధనలాభానికి మమ్ముల్ని ప్రోత్సహించు సొగసైన జన్మగలదానా! సత్యప్రియమైన మాటలు గలదానా! మాపై కరుణ ఉంచు.

**2.** సూర్యపుత్రీ! ఇదివఱకు లాగానే ఇవాళ కూడా చీకటిని పారదోలు. మాకు ధనాన్ని ఇచ్చే దేవతవు నీవే. ఈ సత్యశ్రవుని అనుగ్రహించు **(ఉ.19.3.1-2).**

కుత్సఋషి ఉషస్సును ఈ విధంగా భావించాడు:

**1.** నక్షత్రాలు, చంద్రుడు మొ॥ వాని కాంతి కన్న ఉషః కాంతి చాల గొప్పది అది ప్రపంచాన్ని అంతనూ విచిత్రంగా ప్రకాశింప చేస్తుంది. రాత్రిచివరభాగం ఉషస్సుకు పుట్టిల్లు అయినట్లుగానే, ఉషస్సు చివరిభాగం సూర్యునికి పుట్టిల్లు అవుతుంది.

2. తెల్లని కాంతులు గల ఉషస్సు ఉదయించింది. ఆవుతో పాటు దూడ వచ్చినట్లు ఆమెతో పాటు సూర్యుడు వచ్చాడు. రాత్రిమెల్లగా తప్పుకుంది. రాత్రి, ఉషస్సు కూడా సూర్యునికి చుట్టాలే. వీటికి నాశం లేదు. అవి మరల మరల వస్తూనే ఉంటాయి.

**5. సూర్యుడు:**

అంతరిక్షం ఇతని స్థానం. ప్రత్యక్షదైవం. వాయుమండలం చేత ప్రేరేపింపబడి లోకాలను పాలిస్తూ ఉంటాడు హిరణ్యా స్వరూపుడు. ఏడు గుఱ్ఱాలులాగే బంగారు రథంలో విరామం లేకుండా ప్రయాణం చేస్తూ ఉంటాడు. ఇతడు దేవతలందరకూ కన్నువంటి వాడు. చరాచరాత్మకమైన సృష్టికంతకూ ఇతడు ఆత్మ. ఆరోగ్యాన్ని, తేజస్సును, బలాన్ని ప్రసాదిస్తాడు.

**విశేషాలు:**

'విభ్రాట్' అనే ఋషి సూర్యుని ఈ విధంగా వర్ణించాడు:

1. యజమానికీ ధనాన్నీ, ఆయుర్దాయాన్ని ఇస్తూ బాగా ప్రకాశించె సూర్యుడు సోమరసమనే తేనెను అధికంగా త్రాగేడు. ఇతడు వాయువుచేత ప్రేరేపింపబడి సంచరిస్తూ జనాన్ని రక్షిస్తాడు. ధగధగ ప్రకాశిస్తూ ఉంటాడు.

2. సంచారశీలి, మహాతేజస్వియైన సూర్యభగవానుడు ఉదయించి భూలోకాన్ని ఆకాశాన్ని కూడ ఒక్కసారిగా వ్యాపించాడు. అతని గమనం ఆశ్చర్యకరం.

3. చక్కగా ప్రకాశిస్తున్న సూర్యకాంతి ప్రాణుల్లో ప్రాణ వాయువు రూపంగా సంచరిస్తూ ఉంటుంది. భూమ్యాకాశాలకు దీప్తిని కలుగజేస్తుంది. లోకం యొక్క జీవనాడి సూర్యుడే.

4. సూర్యుడు ముప్పై ముహూర్తాలను (ఒక పగలు) ప్రకాశింపజేస్తాడు. వేదమంత్రాలన్నీ అతణ్ణే స్తోత్రం చేస్తాయి. అతని మహిమ గొప్పది.

5. కాంతిపుంజమైన సూర్యుడు ఉదయించగానే నక్షత్రాలన్నీ రాత్రితోపాటు దొంగల్లాగా దూరంగా పారిపోతాయి.

6. భగభగ మండుతున్న అగ్నిజ్వాలల్లాగా సూర్యుని కిరణాలు క్షణాల్లో ప్రపంచాన్ని వెలుగుతో నింపుతాయి.

7. సూర్యదేవా! నిన్ను ఆరాధించేవారికి నీవు ఆరోగ్యాన్ని ఇస్తావు. నిన్ను చూసేవారి పాపాలన్నీ నశిస్తాయి. చంద్రుడు మొ॥ గ్రహాలకు నీవే కాంతిని ప్రసాదిస్తావు. ప్రపంచానికంతనూ వెలుగు నీవే. నీవే పరమాత్మవు ప్రపంచమంతా నీ స్వరూపమే. నిన్ను తెలుసుకుంటే మోక్షం సిద్ధిస్తుంది

8. అందమైన ఏడు గుఱ్ఱాలులాగే రథంమీద కూర్చుని సూర్యుడు యజ్ఞగృహానికి వస్తాడు అందరు అతనికి హవిస్సులను అందియ్యాలి (పూ 6.14.13).

**6. విష్ణువు:**

ఇతని స్థానం కూడా అంతరిక్షమే. సర్వవ్యాపకుడుగాను, త్రివిక్రముడుగాను ఇతణ్ణి వర్ణిస్తారు విశ్వశక్తికి విష్ణువు సంకేతం.

**విశేషాలు:**

వైదికఋషులు విష్ణువును ఈ విధంగా ప్రశంసించారు:

1. విష్ణువు ప్రపంచాన్ని అంతనూ మూడు పాదాలతో ఆక్రమించాడు. ధూళి ధూసరితమైన ఇతని పాదంలోనే జగత్తు అంతా ఇమిడి ఉంది

2. విష్ణువును ఎవరూ హింసించలేరు. అతడు సర్వరక్షకుడు. ధర్మప్రవర్తకుడు. తన మూడు పాదాలతో విశ్వాన్ని ఆక్రమించాడు.

3. ఋత్విక్కులారా! విష్ణువుయొక్క లోకపాలనాది కర్మలను పరిశీలించండి. వాటిని బట్టి మీరుకూడా కర్మాచరణంలో ఉత్సాహాన్ని పొందండి. విష్ణువు ఇంద్రునికి మంచి మిత్రుడు.

4. ఆకాశం వైపు ప్రసరించిన చూపు విశాలంగా చూడగల్గినట్లు, విద్వాంసులు విష్ణువుయొక్క స్థానాన్ని ఎల్లప్పుడు ఏకాగ్రంగా చూడగలుగుతారు.

5 స్తోత్రాలు చేస్తూ, ప్రమాదాలు లేనివారై, మేధావులు విష్ణువుయొక్క పరమ పదాన్ని ప్రకాశింపచేస్తూ ఉంటారు. వివరించి చెపుతారు.

6. విష్ణువు భూమినుంచి ఆకాశం వరకు వ్యాపించి ఉన్నాడు. కాబట్టి భూమి మీదుండే మమ్మల్ని విష్ణువు మొ॥ దేవతలు రక్షింతురు గాక! (ఉ.18.2.)

**7. ఋతువులు:**

వైదిక సంప్రదాయం ప్రకారం రెండేసి నెలలు ఒక ఋతువు అవుతుంది. ఒక్కొక్క ఋతువులో ప్రకృతి ఒక్కొక్క తీరులో అలంకరించుకొని మనోహరంగా కనిపిస్తుంది ఈ అంశాన్ని కూడా వైదిక ఋషులు స్పృశించారు.

వామదేవుడనే ఋషి ఋతువులను ఇలా భావించాడు:

వసంతం (చైత్ర - వైశాఖ మాసాలు) ఎంతో రమ్యంగా ఉంది. గ్రీష్మం (జ్యేష్ఠ - ఆషాఢాలు) సుందరంగా ఉంది. వర్షఋతువు (శ్రావణ - భాద్రపదాలు) మనోహరం. తరువాత వచ్చే శరదృతువు (ఆశ్వయుజ - కార్తీకాలు) మరీ సుందరంగా ఉంటుంది. హేమంతం (మార్గశిర - పుష్యాలు) శిశిరం కూడా (మాఘ - ఫాల్గుణాలు) ఆహ్లాదాన్ని కలిగిస్తాయి.

**8. పురుషుడు:**

ఋషులు ద్రష్టలు. ప్రపంచమంతా వారికి ముంజేతి కంకణం. వారి దివ్యదృష్టికి గోచరం కానిది ఏదీ ఉండదు. అనంతచైతన్యాన్ని వేరు వేరు రూపాలతో, స్వభావాలతో, ప్రభావాలతోను ఆరాధించిన ఋషులు విశ్వాన్ని అంతను సమిష్టిభావనతో (ఒకే ఒక రూపమనే భావం) భావించి విశ్వరూపాన్ని దర్శించి విశ్వపురుషుడుగా వర్ణించేరు. **'ఏకం సత్'** (ఉన్న వస్తువు ఒక్కటే) **'విప్రా బహుధా వదంతి'** (జ్ఞానులు ఆ వస్తువును ఎన్నో తీరులలో వ్యాఖ్యానిస్తారు.) అన్న వైదిక వాక్కుయొక్క భావం ఇదే.

విశ్వపురుషవర్ణనం ఈ విధంగా జరిగింది:

1. విశ్వపురుషునికి లెక్కలేనన్ని శిరస్సులు, అనంతమైన నేత్రాలు, అసంఖ్యాకమైన పాదాలు ఉన్నాయి. అతడు ఈ బ్రహ్మాండంలోనే కాక మిగతా చోట్ల కూడా వ్యాపించి ఉన్నాడు.

2. విశ్వపురుషుడు త్రివిక్రముడు (మూడుపాదాలు గలవాడు.) అతని ఒక అంశ మాత్రమే మాయగా ఈ సృష్టి అంతా కనిపిస్తుంది. సహజంగా అతనికి ఎటువంటి బంధమూలేదు. చేతనాలు, అచేతనాలు, చరాలు, అచరాలు గల ప్రపంచమంతా అతడు వ్యాపించి ఉన్నాడు.

3. జరిగింది, జరుగుతున్నది, జరుగబోయేది అంతా విరాట్ పురుషుడే. అతణ్ణి నాలుగు అంశలుగా భావిస్తే వాటిలో ఒక అంశ మాత్రమే ఈ సృష్టి. మిగిలిన మూడు అంశలూ తమ కాంతితో వెలుగొందుతున్నాయి.

4. ఈ ప్రపంచమంతా విశ్వరూపుని మహిమకు నిదర్శనం. ఇంతటి మహిమగల మహాపురుషుడు ఎంతటివాడో వర్ణించటం కష్టం. అతడు అమృతత్వాన్ని దేవత్వాన్ని అనుగ్రహించడానికి సమర్థుడు. ప్రాణుల కర్మభోగం కోసం, కేవలం నిమిత్తమాత్రంగా అతడు ప్రపంచ రూపంతో కనిపిస్తున్నాడు (పు.6.4.3.6).

**- ఏ.ఎస్.ఎస్.**

# 4. 7 ఛందస్సు

శిక్ష, వ్యాకరణం మొదలైన ఆరు వేదాంగాలలో ఛందశ్శాస్త్రం ఒకటి. అది వేదపురుషుడికి పాదస్థానంగా చెప్పబడింది. ఛందస్సుకు సంబంధించిన అనేక గ్రంథాలు పూర్వం ప్రచారంలో ఉండేవి. అందులో చాలా గ్రంథాలు కాలగర్భంలో కలిసిపోయాయి.

**'ఋక్ప్రాతిశాఖ్యం'** మొదలైన కొన్ని ప్రాచీనగ్రంథాలలో ఇతర విషయాలతోపాటు ఛందోరీతులు గూడా నిరూపింపబడ్డాయి. పింగళుడూ, జయదేవుడూ వీరిద్దరూ **'ఛందస్సూత్రం'** అనే పేరుతో రచించిన రెండు గ్రంథాలు వైదిక - లౌకిక ఛందస్సులను విపులంగా నిరూపిస్తున్నాయి. అందులోనూ పింగళుని గ్రంథమే ఛందశ్శాస్త్రాల్లో పరమప్రామాణికంగా ఆదరింపబడుతున్నది.

'అక్షరపరిమాణమే ఛందస్సు' (**యదక్షరపరిమాణం తచ్ఛందః ఋక్ సర్వానుక్రమణి 2-6**) అని కాత్యాయనుడు ఛందశ్శబ్దానికి నిర్వచనం చెప్పాడు. ఇందువల్ల అక్షరసంఖ్యా పరిమితితో గూడిన పాదాల పరిమితిని బట్టి ఛందస్స్వరూపం గ్రహింపబడుతుందని తెలుస్తున్నది. **'అక్షరేణ మిమతే సప్తవాణీః' (1.164.24)** అన్న ఋగ్వేదవచనమే పై నిర్వచనానికి మూలం.

ఛందస్సుపేరు వినగానే ఆ మన్త్రంలో ప్రయోగించిన అక్షరాలసంఖ్య మనకు తెలియాలి అలా తెలియకపోతే అక్కడ ప్రయోగింపబడ్డ ఛందస్సంజ్ఞ గౌణమె గాని ముఖ్యం కాదు అని గ్రహించాలి.

**'మాత్రికచ్ఛందస్సు'**, **'అక్షరచ్ఛందస్సు'** అని ఛందస్సు రెండు రకాలు. అక్షరాలతోపాటు గురులఘురూపాలైన మాత్రలను గూడా లెక్కపెట్టవలసిన ఛందస్సును **'మాత్రికచ్ఛందస్సు'** అంటారు.

మాత్రలతో నిమిత్తం లేకుండా అక్షరసంఖ్యను మాత్రమే గణించవలసిన ఛందస్సు **'అక్షరచ్ఛందస్సు'** అనబడుతుంది. వైదికచ్ఛందస్సులన్నీ అక్షరచ్ఛందస్సులే. ఉదాహరణకు సామవేదంలోని ప్రథమమంత్రం ఇది: .

అగ్న ఆయాహి వీతయే ।
గృణానో హవ్య దాతయే ।
విహోతా సత్సి బర్హిషి । (సా. సం **1.1.1**)

ఈ ఛందస్సును **'గాయత్రి'** అంటారు. ఇందులో మూడు పాదాలూ, ఒక్కొక్క పాదానికి **8** చొప్పున **3X8=24** అక్షరాలూ వుంటాయి. **'అగ్నిమీళే పురోహితం'** అన్న ఋగ్వేద ప్రథమమంత్రం గూడా గాయత్రీచ్ఛందస్సే. ఛందస్సులలో గాయత్రి చాలా ప్రశస్తం. అందుకే భగవానుడు **'గాయత్రీ ఛందసామహమ్'** (భ గీ **10-35**) అని తన విభూతిగా గాయత్రిని పేర్కొన్నాడు

అధికభాగం ఋగ్వేదంలోని మంత్రాలే సామవేదంలో సంగ్రహించబడ్డాయి. కాబట్టి ఋగ్వేదచ్ఛందస్సుల పరిశీలనవల్ల సామవేదచ్ఛందస్స్వరూపం గూడా గోచరిస్తుంది. పైన ఉదాహరింపబడిన సామవేద ప్రథమ మంత్రం ఋగ్వేదాంతర్గతమే (ఋ సం **6.16.10**).

**24** అక్షరాలు గల **'గాయత్రి'** మొదలు, **104** అక్షరాలు గల **'ఉత్కృతి'** అనే ఛందస్సు వరకూ మొత్తం **21** ఛందస్సులు వేదాలలో ప్రయోగింపబడ్డాయి. ఇందులో ఒక ఛందస్సుకంటే మరొక ఛందస్సులో క్రమంగా నాలుగేసి అక్షరాలు ఎక్కువగా వుంటాయి. ఛందస్సుల పేర్లతో సహా అక్షరసంఖ్యాక్రమం ఈ దిగువ సూచించినట్లు ఉంటుంది:

| ప్రథమ సప్తకం | ద్వితీయ సప్తకం | తృతీయ సప్తకం |
|---|---|---|
| (1) గాయత్రి - 24 | (8) అతిజగతి - 52 | (15) కృతి - 80 |
| (2) ఉష్ణిక్ - 28 | (9) శక్వరి - 56 | (16) ప్రకృతి - 84 |
| (3) అనుష్టుప్ - 32 | (10) అతిశక్వరి - 60 | (17) ఆకృతి - 88 |
| (4) బృహతి - 36 | (11) అష్టి - 64 | (18) వికృతి - 92 |
| (5) పంక్తి - 40 | (12) అత్యష్టి - [redacted] | (19) సంకృతి - 96 |
| (6) త్రిష్టుప్ - 44 | (13) ధృతి - 72 | (20) అతికృతి - 100 |
| (7) జగతి - 48 | (14) అతిధృతి - 76 | (21) ఉత్కృతి - 104 |

పై పట్టికలో '**కృతి**' మొదలు '**ఉత్కృతి**' వరకూగల తృతీయ సప్తకంలోని ఛందస్సులు ఋగ్వేద (శాకల) సంహితలో కనిపించవు. యజుర్వేదంలో ఇవి కనిపిస్తాయి.

'**గాయత్రి**' మొదలు '**అత్యష్టి**' వరకూ గల 12 రకాల ఛందస్సులు సామవేదంలో విరివిగా ఉపయోగింపబడ్డాయి. ఆయా ఛందస్సులలో ఎన్నో అవాంతర భేధాలు ఉన్నాయి. ఈ భేదాలలో గూడా అనేకం మనకు సామవేదంలో కనిపిస్తాయి ఒక్క పూర్వార్చికంలోనే మూడుకాండల్లోనూ కలిపి గాయత్రి ఇంచుమించు 200 సార్లు ప్రయోగింపబడింది. బృహతి 120 సార్లు ప్రయుక్తమయింది. ఇతరచ్ఛందస్సులు అంతకంటే తక్కువసార్లు ప్రయోగించబడ్డాయి

**1. గాయత్రి:**

గాయత్రిలో పాదనిచృత్, అతిపాదనిచృత్, వర్ధమానా, ప్రతిష్ఠా, వారాహీ, నాగీ, త్రిపాద్ విరాట్ ఇత్యాదిగా అనేక భేదాలున్నాయి. **ఉదాహరణకు** - పాదానికి 11 అక్షరాల చొప్పున మూడు పాదాలుండే ఛందస్సును 'త్రిపాద్ విరాట్' అంటారు. ఈ క్రింది సామవేదమంత్రం ఈ గాయత్రీ భేదానికి చెందిందే:

అగ్నిం నరో దీధితిభిరరణ్యో
ర్హస్తచ్యుతం జనయత ప్రశస్తమ్ ।
దూరేదృశం గృహపతి మథవ్యుమ్ । (సా.సం.1.7.10)

**2. ఉష్ణిక్ :**

ఉష్ణిక్ ఛందస్సులో **'కకుబుష్ణిక్'**, 'పుర ఉష్ణిక్' ఇత్యాది భేదాలున్నాయి. మూడు పాదాల్లోనూ 8+12+8=28 చొప్పున అక్షర సంఖ్య ఉంటే **'కకుబుష్ణిక్'** అంటారు. అలాకాక 12+8+8=28 అక్షరాలు చొప్పున ఉంటే **'పురఉష్ణిక్'** అనబడుతుంది. కకుబుష్ణిక్ ఉదాహరణ:

యో న ఇదమిదం పురా
ప్రవస్య ఆనినాయ తమ వస్తుషే ।
సఖాయ ఇంద్ర మూతయే ॥ (సా.సం.5.2.2)

లౌకిక సమవృత్తచ్ఛందస్సులలో ప్రతిదానికీ నాల్గుపాదాలుంటాయి అందువల్ల గాయత్రిలోని 24 అక్షరాలూ 6 అక్షరాలుగల నాలుగు పాదాలుగానూ, ఉష్ణిక్‌లోని 28 అక్షరాలూ 7 అక్షరాలుగల నాలుగు పాదాలుగానూ విభజింపబడి **'తనుమధ్యా' 'మదలేఖా'** ఇత్యాది సంజ్ఞలతో వ్యవహరింపబడుతున్నాయి. లౌకిక ఛ్ఛందోభేదాల స్వరూపం **'వృత్తరత్నాకరా'**ది గ్రంథాలలో విశదంగా నిరూపింపబడింది.

**3. అనుష్టుప్:**

అనుష్టుప్ ఛ్ఛందస్సులలో 4 పాదాల ఛందస్సులేకాక త్రిపాద్ అనుష్టుప్పులు గూడా వేదాలలో ప్రయోగింపబడివున్నాయి. ఆయా పాదాలలోని అక్షరసంఖ్యను బట్టి **'పురస్తాజ్జ్యోతి'**, **'ఉపరిష్టాజ్జ్యోతి'** ఇత్యాదిగా చాలా అనుష్టుప్ భేదాలున్నాయి.

ఆదికావ్యమైన రామాయణంలో అధికంగా అనుష్టుప్పే ప్రయుక్తమయింది. పురాణవాఙ్మయంలో ఎక్కువభాగం ఈ ఛందస్సులోనే వ్రాయబడింది. లౌకికానుష్టుప్పుల్లో ప్రతిపాదంలోనూ [redacted] వ అక్షరం లఘువుగా వుండాలి, (పంచమం లఘు సర్వత్ర) ఇత్యాదినియమాలు తర్వాతికాలంలో ఏర్పడ్డాయి.

**4. బృహతి :**

బృహతీచ్ఛందస్సులో గూడా పాదసంఖ్యలోనూ, అక్షర సంఖ్యలోనూ వున్న భేదాన్ననుసరించి అనేకభేదాలు ఏర్పడ్డాయి. సాధారణ బృహతీచ్ఛందస్సుతోపాటు, **'సతోబృహతీ'**, **'ఉపరిష్టాత్ బృహతీ'**, **'స్కంధోగ్రీవి బృహతీ'** మొదలైన భేదాలు సామవేదంలో ప్రయోగింపబడ్డాయి.

**5. పంక్తి :**

పంక్తిచ్ఛందస్సులో **'విష్టారపంక్తి'** వంటి అవాంతర భేదాలు, 6 త్రిష్టుప్‌లో **'విరాట్‌స్థానా'** వంటి భేదాలూ సామసంహితలో అరుదుగా కానవస్తాయి. **'జగతి'** మొదలైన తరువాతి ఆరు ఛందస్సులలో కొన్నింట ఐదుపాదాలు, మరికొన్నింట ఏడు పాదాలుగూడా వుంటాయి. ఆయా పాదాలలోని అక్షరసంఖ్యా విషయంలో అనేకమతభేదాలున్నాయి. ఆయా భేదాలకు తగిన లక్ష్యాలు ఋగాదివేదాలలో అక్కడక్కడా కానవస్తాయి.

పైన పేర్కొన్న 12 రకాల ఛందస్సులేకాక వివిధచ్ఛందస్సుల సమ్మేళనంవల్ల ఏర్పడే ప్రగాథచ్ఛందస్సులు గూడా సామవేదంలో విరివిగా వాడబడ్డాయి. ఇలాంటి ప్రగాథలు ఉత్తరార్చికంలోనే ఎక్కువగా కనిపిస్తున్నాయి.

విషమా బృహతీ + సమా సతో బృహతీ, విషమా కకుప్ + సమా సతో బృహతీ, బృహతీ + సతో బృహతీ, అనుష్టుప్ + గాయత్రీ (అనుష్టుమ్ముఖః ప్రగాథః), ఇలాంటివి సామసంహితలో ప్రయోగింపబడిన ప్రగాథలు.

## ప్రగాథలంటే ఏమిటి?

**ఋక్ప్రాతిశాఖ్యం, ఋక్సర్వానుక్రమణి, నిదానమాత్రం** మొదలైన ప్రాచీన గ్రంథాలలో ప్రగాథచ్ఛందస్సుల వివరణ లభిస్తున్నది. రెండు లేక మూడు ఛందస్సులు ఇందులో ప్రగ్రథనం చేయబడుతాయి కాబట్టి వీటికి ప్రగాథలను వ్యవహారం కల్గింది[1].

గాయత్రికంటే తక్కువసంఖ్యగల అక్షరాలతో గూడిన ఛందస్సులు (1) ఉక్తా (2) అత్యుక్తా (3) మధ్యా (4) ప్రతిష్ఠా (5)సుప్రతిష్ఠా అని ఐదు ఉన్నాయి వీటిలో క్రమంగా 4,8,12,16,20 చొప్పున అక్షరసంఖ్య ఉంటుంది. ఈ ఐదు ఛందస్సులను '**ప్రాక్గాయత్రీ పంచకం**' అని వ్యవహరిస్తారు. ఋగ్వేదంలోగానీ, సామవేదంలోగానీ ఈ ఛందస్సులు ప్రయోగింపబడలేదు. అథర్వ వేదంలోని 20వ కాండలో వీటిని ప్రయోగించడం జరిగింది. లోకంలో ఇవి ప్రయోగార్హాలా, కాదా అన్నవిషయంలో మతభేదాలున్నాయి వృత్తరత్నాకరం - తృతీయాధ్యాయంలో ఇవి అవాంతరభేదాలతో సహా మొదటనే నిరూపింపబడ్డాయి.

1. 'ద్వే ఋచౌ ప్రగ్రథనేన త్రిస్రః క్రియన్తే.స ప్రగ్రథనాత్ ప్రకర్ష గానాద్వా ప్రగాథ ఇత్యుచ్యతే' అని కాశికాకారుని నిర్వచనం

అక్షరసంఖ్యానియమాన్ని పాటించే వైదికచ్ఛందస్సులలో ఎక్కడైనా ఒక పాదంలో అక్షరసంఖ్య తగ్గితే వ్యూహంతో దాన్ని పూర్తిచేసికోవాలని ఛందశ్శాస్త్రకారులు సూచించారు

లౌకిక సంస్కృతకావ్యాలలో ప్రయోగింపబడిన వివిధ ఛ్ఛందస్సులకు మూలం వైదికచ్ఛందస్సులే. గ్రీకు లాటిన్ భాషలలోని ఛందస్సులు గూడా వైదికచ్ఛందస్సులతో అనేకవిధాల సామ్యం కలిగివున్నాయి.

- ఎస్.ఎల్.ఎన్.

## 4. 8. వైశిష్ట్యం

**'వేదానాం సామవేదోఽస్మి'** (భ.గీ.10-22) అని భగవంతుని మాట. ఇందువల్ల ఇతరవేదాలకులేని భగవద్విభూతిరూపమైన ప్రాశస్త్యం సామవేదానికున్నదని స్పష్టమవుతున్నది. మహాభారతంలోని అనుశాసనపర్వంలో కూడా **'సామవేదశ్చ వేదానాం'** (14-317) అన్న ప్రశంస కనిపిస్తున్నది.

సామవేద ప్రశస్తికి ముఖ్యకారణం అందలి గాన స్వరూపమే. వృక్షానికి పుష్పం శోభ కల్గించినట్లే గానమయమైన సామవేదం వేదవాఙ్మయానికంతటికీ అపూర్వమైన సౌందర్యం కల్గిస్తున్నది. అందువల్లనే **'సామవేద ఏవ పుష్పం'** (3.3.1) అని ఛాందోగ్యం ఈ వేదాన్ని పుష్పంతో పోల్చింది

ఋక్కులకూ, సామవేదానికీ ఉన్న సంబంధం అత్యంత సన్నిహితం. **'యా ఋక్ తత్సామ'** అన్న ప్రమాణాన్ని బట్టి ఋక్సంగ్రహమే సామవేదమని తెలుస్తున్నది. **'సమాహమస్మ్యృక్ త్వం'** (అ.సం.14.2.71) అని అథర్వవేదం ఋక్ సామలను దంపతులుగా వర్ణించడం కూడా ఉంది.

**'సా చ అమశ్చేతి తత్సామ్నః సామత్వం'** అని సామశబ్దం నిర్వచింపబడింది. **'సా'** అంటే ఋక్కు **'అమః'** అంటే స్వరం. ఋక్కుతో సంబంధపడిన షడ్జాదిస్వరం ఎక్కడ ఉంటుందో అదే సామ. ఇతరవేదాలు కేవలం మంత్రమయాలు. సామవేదం ఋక్కుల నాశ్రయించి వున్నా ప్రధానంగా గానమయం. కేవల మంత్రాలకూ, కేవల గానానికీ సామసంజ్ఞ లేదు గానాత్మకమైన మంత్రాలకే, పేరు చెల్లుతుంది. **'గీతిషు సామాఖ్యా'** (మీ.ద.2.1.36) అన్న జైమిని సూత్రంలోని ఆంతర్యం ఇదే.

సామసంహితలో 105 మంత్రాలు తప్ప తక్కినవన్నీ ఋగ్వేదమండలాలనుండీ స్వీకరింపబడినవే అందులోనూ ఆరణ్యాక మహానామ్న్యార్చికాలను వదిలిపెట్టి లెక్కవేస్తే సామవేదంలోని స్వతంత్ర మంత్రాలు 76 మాత్రమే కనపడతాయి. ఋగ్వేదంలోని ఎనిమిది, తొమ్మిది మండలాలనుండే ఎక్కువ మంత్రాలు ఇందులో పరిగ్రహింపబడ్డాయి యజుర్వేదం లాగా సామవేదానికి కూడా యజ్ఞక్రియలోనే ఎక్కువ ఉపయోగం కాబట్టి సోమయాగక్రియకు అవసరమైన పఠనక్రమాన్ని అనుసరించే పై మంత్రాలన్నీ ఇందులో కూర్చబడ్డాయి

**విభాగం:**

సామవేదంలో పూర్వార్చికం, ఉత్తరార్చికం అని రెండు విభాగాలున్నాయి. 'ఆర్చిక' మంటే ఋక్కులసమూహం అని అర్థం.

పూర్వార్చికంలోని మొదటి పన్నెండు దశకాలలో అగ్నిని స్తుతించే మంత్రాలూ, చివరి పదకొండు దశకాలలో సోమస్తుతిచేసే మంత్రాలూ, మధ్యలోని 36 దశకాలలో ఇంద్రస్తుతిపరాలైన మంత్రాలూ చేర్చబడ్డాయి. దైవతకాండవిభాగాన్ననుసరించి వీటిని ఆగ్నేయకాండం ఇంద్రకాండం, పావమానకాండం అంటారు.

**స్వరచిహ్నాలు:**

ఉదాత్తాది స్వరాలను గుర్తించడంలో ఋగ్వేద సామవేదాలకు తేడా ఈ క్రింది విధంగా పాటింపబడుతున్నది.

ఋగ్వేదంలో అధోరేఖతో నిర్దేశింపబడే అనుదాత్తస్వరం సామవేదంలో '3' అన్న సంఖ్యతో గుర్తింపబడుతుంది. ఋగ్వేదంలో అనుదాత్తానికంటే పరమైన ఉదాత్తానికి ఎలాంటి చిహ్నమూ వుండదు.

సామవేదంలో అది '1' అన్న అంకెతో నిర్దేశింపబడుతుంది. ఋగ్వేదంలో ఊర్ధ్వరేఖతో గుర్తింపబడే స్వరితస్వరం సామవేదంలో '2' అన్న అంకెతో నిర్దిష్టమవుతుంది.
ఉదాహరణకు:

1 1
అగ్న ఆయాహి వీతయె (ఋ.సం 6 16.10)

23 1 2 3 1 2
అగ్న ఆయాహి వీతయే (సా సం.1.1.1)

ఈ విధంగా స్వరచిహ్నాలను ప్రదర్శించడంలో రెండు వేదాలకూ భేదమున్నా, ఉదాత్తాదిస్వరాలలో మాత్రం ఎలాంటి భేదమూ లేదు.

సామవేదంలోని పై చిహ్నాలు స్వరాన్ని నిర్దేశించటాని కుపయోగించేవే కాని గాన నిర్దేశకాలు కావు గానవిధానం సామగాన గ్రంథాలలో నిరూపించబడివున్నది. సామగానానికి ముఖ్యకారణ భూతాలైన మంత్రాలు మాత్రమే సామవేదంలో పై స్వరచిహ్నాలతో సంగ్రహింపబడ్డాయి

**శాఖలు :**

వ్యాకరణ మహాభాష్యంలో పతంజలి సామవేదానికి వెయ్యి శాఖలున్నాయని చెప్పాడు. మరికొందరు పతంజలివచనం సామ సంహితలోని గానవైవిధ్యాన్ని మాత్రమే సూచిస్తుందిగాని శాఖా భేదాన్ని సూచించదని చెబుతున్నారు. '**వర్త్మన్**' శబ్దానికి '**మార్గం**', అని అర్థమే గాని '**శాఖ**' అని అర్థం లేదని వారి అభిప్రాయం. ఏది ఎలా ఉన్నా ఇతర వేదాలకంటే సామవేదానికి శాఖాభేదాలు చాలా ఎక్కువ అన్న విషయంలో సందేహం లేదు.

సామతర్పణవిధిలో **(1)** రాణాయన **(2)** శాట్యముగ్ర్య **(3)** వ్యాస **(4)** భాగురి **(5)** ఔలుండీ **(6)** గౌల్గులవి **(7)** భానుమానౌ

పమన్యవ (8) కారాటి (9) మశకగార్గ్య (10) వార్షగవ్య (11) కుథుమ (12) శాలిహోత్ర (13) జైమినులు అనుబడే పదముగ్గురు సామగాచార్యులు పేర్కొనబడ్డారు.

కాలక్రమంలో ఇందలి అనేకశాఖలు లోపించాయి. పై శాఖలో మనకిప్పుడు (1) రాణాయనీయ (2) కౌథుమీ (3) జైమినీయాలనే మూడు శాఖలకు సంబందించిన సంహితలు మాత్రమే లభిస్తున్నాయి.

రాణాయనీయ - కౌథుమశాఖలలో గణనాపద్ధతిభేదమే కాని మంత్రభేదం లేదు ఒకవర్గంవారు ప్రపాఠక-అర్ధప్రపాఠక-దశతీ-భేదాలతో మంత్రాలను పరిగణిస్తే మరొక శాఖవారు అధ్యాయాలు, ఖండాలు అనే భేదంతో లెక్కిస్తారు. ఒక్కొక్కచోట మాత్రం స్వరభేదమూ, పాఠభేదమూ కనిపిస్తాయి.

ఉదాహరణకు- కౌథుమీయులు **'హాఉ'** అని ఉచ్చరిస్తే రాణాయనీయులు **'హావు'**అంటారు. **'రాఇ' 'రాయి'** అనే చోట గూడా ఇంతే. **'నో' 'ణో'** ఇలాంటి ఉచ్చారణ భేదాలు గూడా వున్నాయి. జైమినీయ సంహితలో మాత్రం పాఠభేదాలు ఎక్కువగా గోచరిస్తాయి.

## స్వర ప్రయోగం:

**7** స్వరాలూ, **3** గ్రామాలు, **21** మూర్ఛనలూ, **49** తానాలూ ఇవన్నీ కలిసి స్వరమండలమవుతుందని నారదీయశిక్ష పేర్కొంటున్నది[1].

ఈ స్వరమండల పరిధిలోనే ఉద్గాతలు సామగానం చేస్తారు అలా చేసేటప్పుడు వికారం, విశ్లేషణం, వికర్షణం, అభ్యాసం, విరామం, స్తోభం అనే ఆరు సామవికారాలను వాళ్లు ఉపయోగిస్తారు.

1. సప్త స్వరాస్త్రయో గ్రామాః మూర్ఛనాస్త్వేకవింశతిః ।
   తానా ఏకోనపంచాశదిత్యేతత్స్వరమండలమ్ ॥

గానసమయంలో వర్ణాలకు ద్విరుక్తి, దీర్ఘీకరణం మొదలైన మార్పులు ఈ సామవికారాలను ఆశ్రయించే జరుగుతాయి.

సామగానంలో సప్తస్వర ప్రయోగం సాధారణంగా అవరోహ క్రమాన్ని అనుసరించి వుంటుంది నారదీయశిక్షలో సామస్వరనిర్ణయం చేయబడింది:

యః సామగానాం ప్రథమస్స వేణోర్మధ్యమః స్వరః ।
యో ద్వితీయస్స గాంధారస్తృతీయస్త్వృషభః స్మృతః ॥
చతుర్థః షడ్జ ఇత్యాహుః పంచమో ధైవతో భవేత్ ।
షష్ఠో నిషాదో విజ్ఞేయః సప్తమః పంచమః స్మృతః ॥

పై స్వరాలను గమనించి స్వరనిపుణులైనవారు సామగానం చేస్తారు.

సామగానానికి సంబంధించిన గానగ్రంథాలు (1) గ్రామగానం (2) ఆరణ్యకగానం (3) ఊహగానం (4) ఊహ్యగానం అనే పేర్లతో ప్రసిద్ధిచెందాయి. శాఖాభేదాన్ననుసరించి గానసంఖ్యలో గూడా భేదాలున్నాయి.

సామగానంలో నైపుణ్యం సంపాదించటానికి గట్టి పరిశ్రమ అవసరం. అందుకే ఋగ్వేదం (5.44.14) సోమరులు సామగానంలో ప్రావీణ్యం సంపాదించలేరని చెబుతున్నది.

**- ఎస్.ఎల్.ఎన్.**

## 4.9 మతం - తత్త్వం

మనం వద్దనుకున్నా మానవజీవనవిధానంలో ఏదో ఒక వైపునుండి కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది మతం అసలు మతమంటే ఏమిటి? మౌలికంగా దీని అర్థపరిధి ఎంత? అనే విషయాన్ని తప్పకుండా ఆలోచించాలి (చూ.పే.272).

నేను మతరహితుణ్ణనో, మతాతీతుణ్ణనో లోకుల మతి చెడగొట్టడానికి మాట్లాడినా 'మతం' అనే శబ్దానికి గల విస్తృతార్థ పరిధిలోనుంచి. మానువుడెవడూ తప్పించుకోలేడు. అది మానవ జీవనానికి జీవనాడికావడమే దానికి కారణం. మఱి ఈనాడు చిలవలు పలవలుగా విస్తరించిన మతమహావృక్షానికి వేళ్లు వేదాలలో తప్పనిసరిగా ఉండి ఉంటాయి కదా! కాబట్టి సామసంహితలో ఆనాటి వారి మతదృక్పథం ఏ కొంచెమైనా ప్రతిబింబిస్తుందేమో! సంక్షిప్తంగా విశ్లేషణచేసి చూద్దాం

ఆనాటి జీవనం యజ్ఞాయాగాలతో బాగా ముడిపడి ఉన్నది. కనుక ఆయా యజ్ఞసందర్భాల్లో వాళ్లు వ్యక్తీకరించిన భావపరంపరే ఈ పరిశీలనకు ప్రధానంగా ఉపయోగపడుతుంది. ఉపాసనా ప్రధానమైనది సామవేదం. యజమాని తన ఉపాసనకు అంగంగా చేసిన దేవతాస్తుతులు. వాటిల్లో తొంగిచూసే కొన్ని కోరికలు, ఆయా సమయాలో వారనుసరించిన ఆచారాలు. వారి లక్ష్యాలను సాధించుకోవడానికి చేసిన ప్రార్థనలు, ప్రసంగవశాన వ్యక్తమైన ఆనాటివారి ఆలోచనలు. వారి మత సర్వస్వాన్ని మనముందుంచు తున్నాయి.

**యజ్ఞయాగాలు:**

సామసంహితలో గల పూర్వోత్తరార్చికల విషయవిభాగాన్ని బట్టి దేవతాస్తుతి, యజ్ఞానుష్ఠానం అనే విషయాలకు ఆనాడు గల

స్థానం ఏమిటో మనం అర్థం చేసుకోవచ్చు. చూడండి: ఆగ్నేయ-ఐన్ద్ర-పవమాన-ఆరణ్యకపర్వాలుగా పూర్వార్చికం విభజింపబడింది. వీటినే కాండలని కూడా అంటారు. అగ్ని, ఇంద్ర, పవమానస్తుతులు మనకందులో ముఖ్యంగా కనబడతాయి. ఉత్తరార్చికం దశరాత్ర సంవత్సం-ఐకాహ-అహీన-సత్ర-ప్రాయశ్చిత్త-క్షుద్రాలుగా విభజింప బడింది. ఈ విషయవిభాగం నాటివారికి దేవతలపైన యజ్ఞయాగాలపైన గల శ్రద్ధను తెలియజేస్తున్నది. తమ భౌతికావసరాల కోసం, సుఖజీవనంకోసం వారు యజ్ఞాలను చక్కని సాధనంగా రూపొందించు కున్నట్లు ఎన్నో చోట్ల మనకు కనపడుతుంది. చూడండి:

> "ఓ సోమదేవా! నీవు చాల బలవంతుడివి మా అభీష్టాలను పర్షించగల వాడివి. సిద్ధంగా ఉన్న అనేక సుఖాలను మా కనుగ్రహించు! నీవు మాకు పశుధనాన్ని సకలైశ్వర్యాలను, వీరులైన పుత్రులను చక్కని ఆహారపదార్థాలను ఇవ్వు!" (ఉ 3.1.4-5).

> 'ఓ అగ్నీ! దేవతలకు మంచి హవిస్సుల నిచ్చేటట్లు భూమిని ప్రేరేపించు! మాకు గోసంపదను, ఐశ్వర్యాన్ని, ప్రసాదించు! నీకు యజ్ఞమంటే ఇష్టం మేము నీ ద్వారా దేవతలను ప్రసన్నులను చేసుకోవాలని ఈ యజ్ఞంలో స్తుతిస్తున్నాం వారిని మా ప్రతినిధిగా నీవే ఆహ్వానించు!" (ఉ 14.3.10-13).

**ఆచారాలు:**

ఆనాడు ఎన్నో ఆచారాలున్నట్లు సామసంహితద్వారా మనం తెలుసుకుంటున్నాం. ఆచారమంటే శౌచం; పరిశుభ్రత అన్న మాట సూర్యోదయమయ్యేటప్పటికి చక్కగా స్నానంచేసి సూర్యోపాసనాది నిత్యకర్మలను చేస్తూ బాహ్యపరిశుద్ధితోపాటు ఆంతరపరిశుద్ధిని కూడ ఆనాటివారు పొందినట్లు, దానిద్వారా వారు ఎన్నోవిఘ్నాలను పోగొట్టుకున్నట్లు ఈ సంహితలో కనబడుతుంది (పూ.4.5.6).

## ప్రార్థనలు:

సామసంహితలోని ప్రార్థనల్లో వారి మనస్తత్వం మనకు స్పష్టమౌతుంది. అందులో ఒక విశ్వకుటుంబ భావన కనబడుతుంది. చూడండి:

'యజ్ఞాలు చేయడానికి నెయ్యి కావాలి పుష్కలంగా పాలుంటేనే గాని అది లభించదు. కాబట్టి ఓ మిత్రావరుణులారా! మా గోవులలో క్షీరవృద్ధి నివ్వండి! అంతే కాదు; మాకు మధురానుభవం కల పరలోకాన్నికూడ ప్రసాదించండి (పూ.2 11.7).

వంశవృద్ధి కావాలని ఎవరు కోరుకోరు? 'ఓ ఆదిత్యులారా! మా పుత్రపౌత్రులకు దీర్ఘాయుస్సునిచ్చి కాపాడండి' అనే వారి ప్రార్థనలో తమసంతతి అవిచ్ఛిన్నంగా ఉండాలనే భావన కనపడుతుంది (పూ. 4-5-5).

'ఓ ఆదిత్యులారా! రోగాలను మాకు దూరంగా ఉంచండి! మమ్మల్ని బాధించే శత్రువులను మా దగ్గఱికి రానీయకండి; దూరంగా తరిమివేయండి! పాపాలనుంచి మమ్మల్ని విముక్తుల్ని చేయండి! (పూ.4.5.7).

పై ప్రార్థనలో భౌతికవిషయాలతోపాటు, ఆధ్యాత్మికమైన పాపవిముక్తికూడా ఉండటం గమనించదగిన విషయం.

ముల్లోకాల్లో ఐశ్వర్యానికి ఇంద్రుడిది పెట్టింది పేరు. అలాంటి ఇంద్రుడితో సమానమైన ఐశ్వర్యం కలగాలని, ఆ ధనాన్ని సామగానం చేసేవారికి పుష్కలంగా ఇవ్వడానికి ఉపయోగిస్తామే కాని వ్యర్థకార్యాల్లో వినియోగించమని, ఇంద్రుణ్ణి ప్రార్థించడం ఈ సంహితలో కనబడుతుంది. ఇందులో వారి ఔదార్యం, ఆత్మపరిశీలన మనకు గోచరిస్తున్నాయి (పూ.3.8.8).

**దేవతలు:**

సోమయాగానికి ఎందఱో దేవతలు ఆహ్వానింపబడేవారు. అందులో రక్షణకోసం ప్రధానంగా రాజైన సోముడు, వరుణుడు, అగ్ని, విష్ణువు, సూర్యుడు, బ్రహ్మ, బృహస్పతి ఈ యాగానికి విచ్చేయాల్సని వారిని ఆహ్వానించడం కనబడుతుంది (పూ.1.10.1).

దేవతల అనుగ్రహంపైన ఆనాటివారి వ్యవహారాలన్నీ ఆధార పడినాయి. వారు తమ రక్షణభారాన్ని దేవతలకే అప్పగించేవారు. చూడండి:

> "ఓ దేవతలారా! మీ మహిమలు మా కర్థం కావు. మీరు మా కందించే రక్షణలు అమేయమైనవి మమ్మల్ని ఎప్పుడూ రక్షించమని ప్రార్థిస్తున్నాం" (పూ.2.3.4)

**ఆలోచనలు:**

సత్యం సర్వశ్రేయమనే భావం ఆనాటికే ఉంది. సత్య సంరక్షణం గొప్ప ఉద్యమం, దాని ప్రభావం ఇంతా అంతా కాదు. పరమాత్మ అనుగ్రహం కూడా సత్యాన్ని ఆశ్రయించే ఉంటుంది. ఇలాంటి భావనలను ఈ సంహిత మన కందిస్తున్నది. చూడండి:

> "ఓ ఉపాసకులారా! భగవంతుడు సత్యాన్ననుసరించేవారికి అన్ని కోరికలను తీరుస్తాడు. ఆయనను స్తుతించండి! లోకకల్యాణాన్ని కలిగించమని ప్రార్థించే భక్తుల కోరికలను త్రోసిపుచ్చడు. వారి ననుగ్రహిస్తాడు" (ఉ. 10.10.14).

**కోరికలు:**

జీవుడికి భగవంతుడికి ఉన్న సంబంధం ఈనాటిది కాదు; ఏనాటిదో! అలాంటి బంధాన్ని కొంచెం జ్ఞాపకం చేసుకొని నన్ను రక్షించమని భక్తులు దేవుణ్ణి కోరడం సామసంహితలో మనం చూడవచ్చు:

"ఓ పరమాత్మా! మన ఇద్దరి సనాతన సంబంధాన్ని కొంచెం జ్ఞాపకం పెట్టుకో! అభివృద్ధికి అడ్డం వచ్చే దుర్మార్గుల్ని నా మార్గం నుంచి తొలగించు! నీవు శత్రువులకు సంతాపాన్ని కలిగించేవాడివి. కనుక లోక కల్యాణానికి భంగం కలిగించే దుష్టులను, లోకకంటకులను నాశనం చెయ్యి!" (16.4.20).

'నాకు నీవే దిక్కు. నీవు కోరికలను మన్నించాలి' అని పరమాత్మను శరణువేడటం అప్పటికే ఉంది. శరణాగతి ఈనాటిది కాదు మరి. చూడండి:

"ఓ సర్వేశ్వరా! నేను నీ సేవకుడను. నిన్నే శరణు పొందుతున్నాను. అనేక సిరిసంపదలను, చక్కని కుటుంబాన్ని అనుగ్రహించమని కోరు తున్నాను" (పూ.1.11.1).

దరిద్రమంటే అందరికీ బాధే. దాన్ని మాకు రాకుండా చూడమని వారు ఇలా కోరుతున్నారు:

"ఓ స్వామీ! మాకు సంతానాన్ని సంపదలను ఇవ్వు! చెడ్డ కలలాగా దుఃఖాన్నిచ్చే దారిద్ర్యాన్ని మాకు దూరంగా ఉంచు!" (పూ.2.3.7)'

ఇలా అనేకమైన అంశాలపై అభివ్యక్తమైన ఆనాటివారి భావాల ద్వారా వారి మతవిధానాన్ని కొంతకు కొంత మనం గ్రహించవచ్చు. ఇది సంక్షిప్త చిత్రణ మాత్రమే. ఇంకా విశేషాలు తెలుసుకోవాలనే ఉత్సాహం కలవారు సంహితను ఆమూలాగ్రం పరిశీలించవచ్చు.

**తత్త్వం:**

ప్రపంచసృష్టి, జీవితం, మరణం, మోక్షం, మానవాతీతమైన పరబ్రహ్మ, ఆయన కల్పించిన మాయ, ఆయన మహిమలు, దయ మొ॥ విషయాల యథార్థస్వరూపాన్ని తత్త్వమంటారు. కొన్ని నియమనిబంధనలతో దాన్ని విచారించే శాస్త్రమే తత్త్వశాస్త్ర మనబడుతుంది. ఈనాడు ఎంతో విస్తృతస్వరూపంలో అది మనకు

లభ్యమౌతున్నది. సామసంహితలో బీజభూతంగా ఈ తత్త్వచింతన ఎంతవఱకు లభిస్తుందనే అంశాన్ని ఇక్కడ సంగ్రహంగా చర్చించుకుందాం.

**మరణం:**

మరణం సర్వసహజమని వారు భావించారు. మరణానన్తర స్థితిని గురించి వారు ప్రేతాత్మనిలా సంభోధించడం చూస్తే వారి సూక్ష్మదృష్టి మనకాశ్చర్యాన్ని కలిగిస్తుంది. చూడండి:

> "ఓ మృతపురుషుడా! ఈ అగ్ని నీలో ఒక అంశ. నీవీ అంశతో కలిసి బాహ్యాగ్నిలో కలిసిపో! వాయువుకూడా నీ అంశ. దానితో కలిసి బాహ్యవాయువులో చేరిపో! ఆదిత్యునినుంచి మనకాత్మలాభం కలిగింది. తిరిగి దేహప్రాప్తికోసం శుభరూపాన్ని పొంది దేవతలకు కూడా జనకుడైన సూర్యునిలో ప్రవేశించు!" (పూ.1.7.3).

**జీవితం:**

'జీవితం శాశ్వతం కాదు' అని వారికి బాగా తెలుసు. కాబట్టి బ్రతికి ఉండగానే భగవంతుని సేవించాలనే దీక్ష వారిలో ఉండేది.

> "ఓ ఋత్విజులారా! యజ్ఞాధిపతి, హోత, రుద్రుడు, సమస్తాహారాలనిచ్చే మహారాజు, బంగారుకాంతిగలవాడైన పరమాత్మను జీవించి ఉండగానే ఉపాసించండి!" (పూ.1.7.7).

**మోక్షం:**

ఈ పాపపంకిలమైన సంసారంనుంచి మమ్ములను విముక్తులను చేయమని భగవంతుణ్ణి ప్రార్థించడం కనపడుతుంది (పూ.4.5.7). ఉపాసకులకు మోక్షాన్నివ్వడంలో భగవంతుడు ఎంతో దయతో ఉంటాడనే విశ్వాసం వారికి దృఢంగా ఉంది (పూ.1.2.2).

## పరబ్రహ్మ:

అగ్ని సమదృష్టి కలవాడు కావడంచేత దిక్కులన్నింటికి ప్రభువుగా కీర్తింపబడ్డాడు (ఉ. 8.6.2). సకల కల్యాణగుణపూర్ణుడైన భగవంతుడికి అభిముఖంగా ఆయన అనుగ్రహాన్ని సంపాదించమని మానవులను సంబోధించడం చూస్తే, భగవద్వైముఖ్యం పనికిరాదని, సేవించి ఆయన దయకు పాత్రులు కావడం ముఖ్యమని వారు భావించినట్లు తెలుస్తున్నది (పూ.3.1.1).

స్థావరజంగమాత్మకమైన ఈ ప్రపంచానికి అధిపతి ఉన్నాడని, ఆయన సర్వజ్ఞుడని గుర్తించి ఆయనకు పదేపదే వారు నమస్కరించారు (ఉ.1.4.1).

## మనస్తత్త్వం:

భగవంతుడే నా తల్లి తండ్రి సమస్తమూ అని తరువాత కాలంలో ఏర్పడిన భావనకు బీజం ఈ సంహితలో మనం ఇలా చూడవచ్చు.

> 'ఓ పరమాత్మా! నీవు మా తండ్రికంటె గొప్ప ఐశ్వర్యం కలవాడివి. నన్ను మన్నించకపోయినా నా సోదరుని కంటే గొప్పవాడివి. నీవు నా తల్లిలాగా చల్లని మనసుతో నాకు అన్నాన్ని సంపదలను అనుగ్రహించు! (పూ.3.1.10).

తల్లి ఎప్పుడూ తన బిడ్డ క్షేమాన్నే కోరుతుంది. కాబట్టి అలా నాపై దయ చూపమని అనడంలో వారి మనస్సెంత పరిపక్వమైందో మనం ఊహించుకోవచ్చు. ఈ సంహితలో 'మాయ' అనే పదం ప్రయోగింపబడింది. కాని నేటివారుపయోగించే అర్థంలో మాత్రం కాదు 'ఉపస్సు'ని అక్కడ దాని అర్థం (ఉ.4.5.16).

## భగవంతుని దయ:

ఆనాడే భగవదనుగ్రహాన్ని వారు చక్కగా గుర్తించినట్లు తెలుస్తున్నది. చూడండి:

> "ఓ పరమాత్మా! నీవు దయామయుడవు. అకారణంగా ఎవరినీ శిక్షించవు. హింసించటం నీ స్వభావం కాదు. దానశీలురకు, పరోపకారులకు నీవు మంచి ప్రతిఫలాన్నిస్తున్నావు. నీ కరుణాకటాక్షానికి హద్దులు లేవు. (పూ 3.7.8).

దేవుని కృప ఇంతటిదని చెప్పడానికి వీలుకాదు. మన సౌకర్యాలకోసం రక్షణకోసం ఆయన ఎంతో చక్కని సూర్యాది లోకాలను ఏర్పాటుచేశాడు అని సామసంహిత ప్రతిపాదిస్తున్నది. (పూ.1.1.10).

నీవు తప్ప మమ్ములను కాపాడేవాడెవ్వడూ లేడని భగవంతుని అనన్యగతిగా ఆశ్రయించడం ఈ సంహితలో కనపడుతుంది. చూడండి:

> "ఓ స్వామీ! నీ తేజస్సును మాకిచ్చి ఉపాసకుణ్ణి ప్రశంసిస్తావు నీ కంటె వేరే ఎవ్వరూ మమ్మల్ని సుఖపెట్టలేరు కనుక మేము ఈ స్తోత్రంతో నిన్నే కరుణించమని ప్రార్థిస్తున్నాం" (పూ 3.2.5)

సామసంహితలో మతతత్త్వపరమైన ఇలాంటి సందర్భాలెన్నో ఉన్నాయి. ఇవి కేవలం మార్గదర్శకాలు, ప్రోత్సాహజనకాలు మాత్రమే. సమగ్రంగా అంశాలను లోతుకు పోయి చర్చించే అవకాశం ఇక్కడలేదు. ఉత్సాహం కలవారు మూలగ్రంథాన్ని పరామర్శించవచ్చు. ఈ కోణంలో ఎంతో పరిశోధన జరగవలసి ఉంది.

- ఎస్.బి.ఎల్.

## 4. 10 సాంఘికాచారవ్యవహారాలు

ఏవో కొన్ని మంత్రాలు తప్పిస్తే సామవేదమంతా ఋగ్వేద మంత్రాలతోనే నిండి వుంది. సామసంహితలో ఋగ్వేద మంత్రాలు గాని, యజార్వేదమంత్రాలుగాని గానబద్ధం అవడం ఈ వేదంలోని ప్రత్యేకత. విషయవివేచనం దృష్ట్యా పరిశీలిస్తే సామవేదంలోని సాంఘికాచార వ్యవహారాలకు సంబంధించిన భావాలు ఋక్సంహితలో పేర్కొనబడ్డ భావాలకు పూర్తిగా భిన్నాలుకావు అయినా అవి ప్రత్యేక ప్రతిపత్తిని సంతరించుకొన్నాయి. సామసంహితలో ప్రస్తావించబడ్డ విషయాల్ని బట్టి ఆనాటి సాంఘికాచారాదుల్ని ఎంతవరకు గుర్తించడానికి వీలుందో చూద్దాం.

మంత్రద్రష్టలైన మహర్షులకు మంత్రాలు కొన్ని గానరూపంలోను, మరికొన్ని పాఠరూపంలోను గోచరించాయి. ఇతరవేదాల్లో పాఠరూపాన్ని దాల్చిన మంత్రాలు సామంలో గానాకృతిని పొందాయి. అదే సామవేద మంత్రాలు ప్రకటించే ప్రత్యేక విశేషం. పాఠానికి స్తోత్రం అని, గానానికి శస్త్రం అని పేరు. ఈ శస్త్రాలు అందరూ కలసి పాడాలని నిర్దేశింపబడింది. ఇందులో ఒకవిశేషం ఉంది. గానావశ్యకతను గుర్తించిన మహర్షులు గొంతెత్తి అంతా కలసి పాడాలనే నియమం విధించడంలో ఒక గొప్పసాంఘిక దృష్టిని ప్రదర్శించారు. అంతా కలసి పాడటం అనే భావంలో విషయం ద్యోతకం అవుతుంది. గానమంత్రానికి మనస్సుయొక్క చంచలస్వభావాన్ని ఛేదించి మనస్సుకు ఏకాగ్రత కూర్చి గానానుభవంలో ముంచెత్తగల శక్తిఉంది. కనుక శస్త్రం అన్నది గాన మంత్రానికి సార్థకనామమే అవుతుంది.

మంత్రద్రష్టలు వారు స్తుతించిన దేవతల్ని ఏ దృక్పథంతో చూచారో, ఏయే బాంధవ్యాల రూపంలో వారికి ఆ దేవతలు

గోచరించాతో మనం అర్థం చేసుకొంటే సాంఘికవిషయాల్లో ఆనాటివారి ఆలోచనలు మనకు కొంతవరకు అవగతం అవుతాయి.

ఇంద్రుణ్ణి వర్ణించే సందర్భంలో (ఉ.2.2.1) అతణ్ణి సర్వ సంశ్లాఘనీయుడు, సర్వబంధువు అన్నారు. అదేకాక అతణ్ణి ప్రభువుగాను, మిత్రునిగాను, తండ్రిగాను, పోషకునిగాను, తల్లిగాను పోల్చుకొన్నారు. ఈ పోలికలవల్ల సమాజంలో ఉన్న ఆప్యాయతతో కూడిన అనుబంధాల్నే దేవునికి అనువర్తింపజెయ్యడం మనకి కన్పిస్తుంది. ఇంద్రునిపట్ల వారికిగల శ్రద్ధాభక్తులు అనన్యాలు. అచంచలమైనవి. ఎన్ని ధనరాసులు శుల్కంగా ఎరచూపినా ఇంద్రుని వదులుకోమని వారి పూనిక (పూ.1.3.6).

కొన్నిమంత్రాలలో త్యాగధనులైన అప్పటి ఋషుల స్వరూపస్వభావాలు వర్ణింపబడ్డాయి. ఈ ఋషులు పరసహనం కలవారు (పూ.1.1.1), ఫలాపేక్షలేనివారు (పూ.1.2.5), దేవుణ్ణే జీవిత పరమార్థంగా, గమ్యంగా ఎంచుకొన్నవారు (ఉ.2.2.1). అతణ్ణి ధారణనిమిత్తమై ఆశ్రయించినవారు. ఒక్కొక్కప్పుడు దేవుడివ్వగలిగిన ధనం ఈ లోకంలోనే లేదనుకొన్నవారు (ఉ.2.8.6). అంటే వీరు మోక్షకాములన్నమాట. అదీకాక ఆనాటి ఋషులు ఔదార్యసంపన్నులు. వారు ఒకవేళ ధనం కోరినా ఎక్కువగా పరులకు దానం చెయ్యడం కోసమే దాన్ని కోరేవారు (పూ.1.3.1). వారి కోరికలో భోగాభిలాషకంటె త్యాగనిరతే ఎక్కువగా కన్పిస్తుంది. ఒక రకంగా చెప్పుకోవాలంటే త్యాగభోగాలు రెంటికీ విలువగల సమాజం వారిది. ఆనాటి సాంఘికాచారాల్ని, విలువల్నిబట్టి దానం చెయ్యనివాడు లోకశత్రువుగా చూడబడేవాడు.

వేదఋషులు కొత్త కొత్త మంత్రాలు వింటూ వుండేవారు. (పూ.1.12;2.10;3.10.) అంటె ఋషులు నవనవోన్మేషంగా కొత్త

స్తుతులను దర్శించేవారన్నమాట. వాటిని అటు దేవతలు. ఇటు ప్రజలు ఆమోదిస్తూ వుండేవారు.

లోభి మానవవిరోధి. అతడే రాక్షసుడు. దానం చెయ్యని వారి దుర్గతి ఒక మంత్రంలో (ఉ.2.9.5) వర్ణింపబడింది. దానంచేసే వారు దేవతలకు ప్రియులు (పూ.1.1.4). దానశీలుణ్ణి అన్నం రక్షిస్తుంది. దానహీనుణ్ణి అన్నం భక్షిస్తుంది. (పూ.1.6.1).

అప్పటివారి పద్ధతుల్లో సోమలతను ప్రతివారి యింట్లోను పెంచే ఆచారం ఉండేది. దాన్ని రాతితో నూరి, రసం పిండి, గొర్రె బొచ్చుతో నేసిన వస్త్రంలో వడకట్టేవారు (ఉ.2.6.6). దాన్ని ఆవు పాలతో, తేనెతో, పిండితో కలిపి సేవించేవారు. దానిరంగు ఇదమిత్థమని లేకుండా పచ్చన (పూ.1.4.12) అనీ, బూడిదరంగు కలదనీ (ఉ.2.5.4), ఎర్రరంగుదనీ (ఉ. 2.5.4), తెల్లనిదనీ, విచిత్రరూపాలు కలదనీ (ఉ.2.2.6) రకరకాల వర్ణనలు కన్పిస్తున్నాయి.

అతిథి అంటే ఎంతో గౌరవం అప్పటివారికి. అతిథి సత్కారం అందరూ కావిస్తూ వుండేవారు. పుత్రుడు కలగగానే యజ్ఞం చెయ్యడం నాటి ఆచారం (పూ.1.1.9).

యుద్ధం హింసాత్మకం అని గుర్తింపబడింది. హింసించే యుద్ధాలను నువ్వు హింసించు ఇంద్రా! అనే వేడికోలులో ఈ భావం స్ఫురిస్తుంది (పూ.1-2-2).

తరువాత తరువాత ఏర్పడిన అస్పృశ్యతా దురాచారానికి సామసంహితలో ఆధారం కనపడదు. అప్పటి నిషాదులకు అస్పృశ్యత అనేది లేదు. వారుకూడా సోమరసాన్ని దేవతలకు సమానంగా అర్పిస్తూవుండేవారు (ఉ.2-3-5;7-3.).

సంహితలో అప్పటి భౌతిక సంపదను గురించిన వివరాలు కొన్ని మనకు దొరకుతున్నాయి. అధికమైన వస్త్రోత్పత్తి జరుగుతున్నట్లు ఒకచోట ఉదాహరింపబడింది (ఉ. 2.7.3). డేగ, గుర్రం, గాడిద, ఎద్దు, పంది, మేక, గొర్రె, హంస, ఆవు, నెమలి, పావురం పేర్కొనబడ్డాయి. తోలుసంచులు, తోలుచాపలు, పీణ, నగలు, బండ్లు, కొయ్యరథాలు, మర్రికర్రలు, బంగారం - వీటిని కూడా పేర్కొనడం జరిగింది

యజ్ఞం అప్పటివారి జీవితంలో అంతర్భాగంగా ఉంది అది అందరికోసం అని ఒకచోట చెప్పబడింది. (పూ.1.4.3). దానిలో అగ్నికి అమిత ప్రాధాన్యం ఉంది. యాగార్హులైన దేవతలనందరినీ పిలుచుకొనివచ్చే అగ్ని ఋత్విక్కులచేత ప్రతిష్ఠింపబడేదని వారి భావన (పూ.1.1.1).

ఆ అగ్నిని ప్రార్థించేటప్పుడు కూడా వారి సాంఘికాచారాలు వారి జీవితవిధానపు రీతులు తొంగిచూస్తూ వుంటాయి. ఒకచోట అగ్ని అతిథిలా అందరిచేత పూజింపబడేవాడని, స్నేహితునికి ప్రీతికలిగించేవాడని అభివర్ణించారు. ఆ సందర్భంలోనే రథంలాగా ధనంతో నిండివున్నవాడని కూడా స్తుతించారు. ఈ ఉపమానాలలో సంఘంలో బంధుత్వంతో బాటు స్నేహానికి కూడా సముచితస్థానం కన్పిస్తుంది. ఇంకో సందర్భంలో అగ్నిని ప్రియమిత్రునితో పోల్చారు (పూ.1.1.4).

దేవతలను ఉద్దేశించి చేసిన ప్రార్థనల్లో అనేకచోట్ల శత్రువుల నుంచి రక్షణ కోరబడింది. ఆ శత్రువులు మనుష్యులైనా అయివుండవచ్చు లేదా అసురులైనా కావచ్చు. ఒకచోట అగ్నిని-ఉద్దేశించిన స్తుతివాక్కులు అక్కచెల్లెండ్రలా అతని గుణాలను

ప్రకటిస్తూ అతణ్ణి సేవిస్తూ ఉన్నాయని పేర్కొనడం జరిగింది (పూ.1.1.2). ఇక్కడ కుటుంబసంబంధమైన ప్రేమానుబంధాలను గురించి సూచన వుంది.

మరొకచోట రథానికి సాధువులైన అశ్వాలను పూన్చమని, వేగవంతాలైన అవి పూర్తిగా రథభారాన్ని మొయ్యగలవని దేవుని స్తుతి సందర్భంలో చేసిన వర్ణన కనబడుతుంది. ఆనాటివారు ఉపయోగించే రథాలను, రథాశ్వాలను గురించి చేసిన ప్రసంగమే ఇది అని అనుకోవచ్చు.

ఇంకొకచోట ఎత్తిపట్టుకొన్న జండాలు వర్ణితాలైనాయి (పూ.1.1.3). అప్పటి సంపత్తిలో ముఖ్యమైంది గోధనం. అనేకచోట్ల గోలాభం కలగడానికి ఎలుగెత్తి స్తుతించారు (పూ.1.1.3).

మంచి గృహవసతితో కూడిన అనేకవిధాలైన ధనసంపత్తి ఇమ్మని ఒక ప్రార్థన ఉంది ఇంకొకచోట 'నీతిమార్గంలో పలువురు కోరతగింది, కీర్తి కలిగించేది అయిన ధనాన్ని మాకివ్వాలి' అనే ప్రార్థన కన్పిస్తుంది (పూ 1.1.4). అంటే న్యాయమార్గంలో సమకూరేది, పేరు ప్రతిష్ఠలు తెచ్చే ధనమే కావాలి వారికి. వక్రమార్గాల్లో లోకనింద్యమైన ధనసముపార్జనపట్ల ఆనాటి వారికి ఆసక్తి లేదు. అది వారికి నింద్యం - హీనమైంది కూడా.

దివోదాసు అనే రాజు ప్రసక్తి కన్పిస్తుంది. దానివల్ల ఆనాడుకల రాచరికపు వ్యవస్థ కూడా మనకు అర్థం అవుతుంది. (పూ.1.1.5). భూమిని లోకమాతగా పేర్కొనడం జరిగింది.

సామర్థ్యం, సౌభాగ్యం, గోధనం, మంచిసంతానం, కావల్సినంత సంపత్తి వారు కోరుకొనే కోరికలు.

దేవతలను గురించి, వారు చేసే స్తోత్రాలు రథనిర్మాణంతో పోల్చారు (పూ.1.1.7). అగ్నిని గురించి వారు చేసిన స్తుతి అప్పటి వారి కోర్కెలను, వాటి పరిపూర్తిని సూచిస్తుంది. ఆ స్తుతి ఇలా ఉంది. 'ఓ అగ్నీ! స్తోత్రాలచేత (ఋషి) యజ్ఞంచేత నీ వద్దనుండి కోర్కెలను మేఘాలనుండి ఉదకాలు పుట్టిస్తున్నట్లు పుట్టిస్తున్నాడు.' అంటే కోరికలు దైవశక్తినుండే ఉద్భవిస్తున్నాయని స్ఫురిస్తుంది (పూ.1.1.7). వారు గోసంపదనే కాకుండా కొడుకుల్ని, మనవల్ని కూడా కోరుకునేవారు (పూ.1.1.8). అగ్నిని గృహానికి మేలుచేసే వాడుగా పేర్కొన్నారు (పూ.1.1.8). యజమానియొక్క కోరికలు సఫలం కావడానికి అగ్ని సర్వవిధాలా ప్రార్థింపబడ్డాడు.

కుటిలులైన, దుష్టాభిప్రాయాలుగల దొంగ అయిన శత్రువుని దూరంగా తొలగించుమని, సత్పురుషులను పాలించమని అగ్నిని ప్రార్థించారు (పూ.1.1.11). ఋషులు తాము క్రొత్తగా చేసిన స్తోత్రాలను విని మాయావంతులు, కర్మవిఘ్నం కలిగించేవారు అయిన రాక్షసుల్ని పూర్తిగా భస్మం చెయ్యమని కోరారు (పూ.1.1.11).

'ఇంద్రునికోసం అంతా కలసి స్తోత్రం గానం చెయ్యండి' (పూ.1.2.1) అన్న వాక్యం అనాటి సామూహిక ప్రార్థనాభిలాషకు ప్రతీక. 'ఇంద్రుడిచ్చే అశ్వంకోసం, .ఆవుకోసం, ఇంటికోసం ఇంద్రస్తోత్రం బాగా గానం చెయ్యి.' వర్షం కురిపించే ఇంద్రుడు స్తుతించే వారికి ధనదాత అన్నారు ఒకచోట (పూ.1.2.1).

ఇంద్రుణ్ణి ఉద్దేశించి "నిన్ను కోరే స్నేహితులమైన మేం నీవే ప్రయోజనంగా స్తుతిస్తున్నాం" అన్నమాట ఇంద్రునివంటి దైవాన్ని స్నేహితునివలె చూసేవారని సూచిస్తుంది (పూ.1.2.5).

'మంచిరూపంతో పనిచేసే ఇంద్రుణ్ణి, బాగా పాలిచ్చే ఆవును పాలు పితకడానికి అభిముఖంగా నిల్చి పిల్చినట్లు పిలుస్తున్నాం' అని ఒకచోట పేర్కొనబడింది (పూ.1.2.5). దీనివల్లమనకు తెలిసేది వారి దైవప్రార్థన ప్రయోజనసిద్ధికోసం కావించేదనీ, దానివల్ల వారు తమకు కావలసినవి సంపాదించుకొనేందుకు ప్రయత్నించేవారని. పాలు పితుక్కునే ఆవుని పిలవడంలో ఉద్దేశం పాలను తీసుకోవడానికి కదా! అలాగే సకల ఐశ్వర్యాలకోసమే దేవుని ప్రార్థించడం.

దానం కుడిచేత్తో ఇవ్వాలనే సంప్రదాయాన్ని యీ మంత్రం చెబుతుంది- 'మేం మెచ్చదగిన, సంపాదించదగిన, పుచ్చుకొనదగిన ధనాన్ని మాకివ్వడం కోసం వెంటనే నువ్వుదాన్ని కుడిచేత్తో పట్టుకో (పూ.1.2.6).

మరోచోట 'ఇంద్రా! పూర్వం మాకిచ్చినట్లే గోవుల్ని, అశ్వాల్ని, రథాల్ని, అధికధనాన్ని ఇవ్వడానికి రా!' అనే ప్రార్థన (పూ.1.2.8) ఉంది. 'గొప్పవైన మా భయాల్ని త్రోసిపారెయ్యి. తరిమికొట్టు. నిన్నెవరూ కదలించలేరు' అని వారు దేవుని భయాపహర్తగా ఉగ్గడించడం జరిగింది. ఇంద్రుణ్ణీ, పూషదేవుణ్ణీ సఖ్యానికీ, సుఖానికీ, అన్నానికీ ప్రార్థించడం కన్పిస్తుంది.

సామసంహిత పరికిస్తే స్థూలంగా మనకు అర్థమయ్యే విషయాలు ఇవి:

ఆనాటి వారికి జీవితావసరాలు సంపాదించుకోవాలనే తపన ఉండేది. సుఖజీవనాన్ని, సంతోషప్రదమైన జీవయాత్రనూ వారు కోరుకొనేవారు. అవి సమకూరడానికి అగ్నిని, ఇంద్రుణ్ణి, పూషమొదలైన ఇతరదేవతల్ని ఆశ్రయించేవారు. అగ్నిహోత్రవిధి వారి నిత్య కర్మానుష్ఠానంలో నైమిత్తిక కార్యకలాపాల్లో అంతర్భాగంగా వుండేది.

వారి కోరికల్లో అన్నం, ధనం, యిల్లు, వాకిలి, ఆవులు, గుర్రాలు, ఆరోగ్యం, సంతానం, సుఖం, శత్రువులనుండి రక్షణ మొదలైనవి కన్పిస్తాయి. 'మాతా నాస్తి పితా నాస్తి నాస్తి బంధు స్సహోదరః- అర్థం నాస్తిగృహం నాస్తి' అని ఆ తరువాత భారతీయ సమాజంలో ప్రచారంకావింపబడ్డ విరాగభావాలకు, నైరాశ్యానికి సామసంహితలో ఎలాంటి బీజాలు కన్పించవు. చక్కని సామాజిక జీవనాన్ని, కుటుంబ అనుబంధాల్ని కోరుకున్న రోజులవి. కుటుంబ సౌభాగ్యాన్ని వారెంతగానో వాంఛించారు. అందుకోసం ఆర్ద్రమైన అనుబంధాల్ని పెంచుకొని ఆనందించారు. మానసిక వికాసాన్నీ, తృప్తినీ పొందారు. అభ్యుదయ నిశ్శ్రేయసాలు రెండూ రెండుకళ్ళుగా చూసినరోజులవి. నిజానికి యివాళకూడా మనం ఆ కోరికలన్నీ కోరుకొంటూనే వున్నాం. సహజమైన మానవస్వభావానికి సంబంధించిన కోరికలవి. వాటిలో ఎంతో అర్థం - పరమార్థం కూడా వున్నాయి.

**- డి.ఎస్.బి.**

## 4.11 కవితాసౌందర్యం

ఒక వస్తువులోని సౌందర్యం మనం చూసే చూపును బట్టి అనుభూతిలోకి వస్తుంది. పలుకుబళ్ళు, రీతులు, వృత్తులు, భావాలు, భాష, శబ్దార్థాలంకారాలు వగైరా అన్నింటిలో ఉండే అనురూప్యాన్ని బట్టి ఆ రచనలోని కవితాసౌందర్యాన్ని మనం అవలోకించవచ్చు. ఇలాంటి పరిశీలన చేయడానికి కావ్యాల్లో అవకాశం ఎక్కువగా ఉంటుంది. అలా అని వైదికవాఙ్మయంలో ఆ అందచందాలు తక్కువ అని అనడానికి వీల్లేదు. లౌకికసాహిత్యానికి ఇందులోను అది ఒక అడుగు ముందే ఉంది. ఇప్పుడు ఎంతగానో పెరిగిన లౌకిక వాఙ్మయానికి ప్రాచీన వైదికవాఙ్మయం పునాది లాంటిది.

కేవలం వైదికకర్మానుష్ఠానానికే పరిమితమై, యజ్ఞయాగాల్లో అక్కడక్కడ చదివే మంత్రాలుగానే ■ వాఙ్మయాన్ని సంకుచిత భావంతో చూడటం సరైన పనికాదు. అందులోని సాహిత్యపరమైన సౌందర్యాన్ని మనం సందర్శించవలసిన అవసరం ఎంతైనా ఉంది. చరిత్రకందని కాలంలోనే భారతీయుల భావనలు ఎంతో మృదువైనవి, సరసమైనవని పాశ్చాత్యులు ఎంతగానో ప్రశంసించిన తరువాత కూడా మనం వేదాల్లో ఏముంది? అని నిట్టూరుస్తూ కళ్ళు తెరవక పోవడం విచారకరం.

ఏవో కొద్ది మంత్రాలు తప్ప సామసంహిత అంతా ఋక్కుల మయమే. కాబట్టి పలుకుబళ్ళు, ఇతరభావనలు మళ్ళా ఇక్కడ ప్రస్తావించవలసిన పనిలేదు. వివరాలు ఆ సంహితనుంచే గ్రహించవచ్చు (చూ.పే.98). చమత్కారావహంగా ఉండే కొన్ని శబ్దార్థాలంకారాలను పరిశీలిస్తూ, ■ సంహిత సౌందర్యస్రవంతిలో కొద్దిబిందువులను మాత్రం ఇక్కడ మనం అనుభూతికి తెచ్చుకుందాం.

### 1. శబ్దాలంకారాలు:

శబ్దాలు ప్రబంధబాహ్యస్వరూపాన్ని తీర్చిదిద్దుతాయి. ఒక దివ్యసుందరమూర్తిలో కనబడే అందచందాలు, వంపుసొంపుల వయ్యారాలు ఒక చూపులోనే అందఱిని ఆకట్టుకొన్నట్లు మృదు మధురంగా, చక్కని ఊపుతో ప్రయోగింపబడ్డ శబ్దపరంపర చెవిని బడినంతమాత్రానే శ్రోతలను ఆకర్షిస్తుంది. శబ్దపరమైన ఈ ఆకర్షణ ఈనాడు మనకు కొత్తకాదు. వేదకాలంనాటికే అది మానవుల అనుభూతికి అందింది. మిగత సంహితల్లో లాగానే సామసంహితలో కూడ మనకు ఇలాంటి శబ్దాలంకారాలు కుప్పలు తెప్పలుగా కనపడుతున్నాయి.

#### (1) వృత్త్యనుప్రాస:

ఒకే హల్లు అనేకమార్లు వస్తే సామాన్యంగా అది వృత్త్యను ప్రాస అవుతుంది.

ఈ క్రింది మంత్రంలో 'య' 'త' అనే అక్షరాలు అనేకసార్లు ఆవృత్తిని పొంది చక్కని వృత్త్యనుప్రాస ఏర్పడింది. చూడండి:

సఖాయ [redacted] ని షీదత పునానాయ ప్ర గాయత |
శిశుం న యజ్ఞైః పరి భూషత శ్రియే ॥ (ఉ.4.12.1)

అలాగే ఈ క్రింది మంత్రాల్లో 'స' 'ర' 'వ' మొదలైన అక్షరాలు ఎన్నో సార్లు ఆవృత్తాలై చెవికింపైన చక్కని వృత్త్యనుప్రాసను సంతరిస్తున్నాయి. అంతేకాక 'వాజ్యక్షాః' 'సహస్ర' అనే పదాలు రెండుసార్లు ప్రయోగింపబడి చక్కని లాటానుప్రాసను కూడా మనకందిస్తున్నాయి. చూడండి:

ప్ర వాజ్యక్షాః సహస్రధార స్తిరః పవిత్రం వి వారమవ్యమ్|
స వాజ్యక్షాః సహస్రరేతా అద్భిర్మృజానో గోభిః శ్రీణానః ॥(ఉ.4.12.1.2)

ఒక్క వృత్త్యనుప్రాస మాత్రం కాక, ఇటు లాటానుప్రాస అటు ఛేకానుప్రాస కూడా ఒకే మంత్రంలో ఇమిడి వినేవాళ్లకు ఎంతో ఆనందాన్నందించే ఈ క్రింది మంత్రం శబ్దాలంకారప్రస్తావంలో మనం తప్పక చూడదగింది:

ఇమా ఉ త్వా సుతే సుతే నక్షన్తే గిర్వణో గిరః ।
గావో వత్సం న ధేనవః ॥ (పూ.3.1.8)

ఇందులో `సుతే సుతే' అనటంలో లాటానుప్రాస, **`గిర్వణో గిరః'** అనటంలో ఛేకానుప్రాస, మూడవపాదంలో `వ' అనే అక్షరం మూడుసార్లు ఆవృత్తం కావడంలో వృత్త్యనుప్రాస, ఇలా ఈ సామలో అనుప్రాసత్రయం మన చెవులకు విందు చేస్తున్నది.

**(2) లాటానుప్రాస:**

అర్థభేదం లేకుండా తాత్పర్యభేదం మాత్రముండేటట్లు ఒక పదం రెండుసార్లు ప్రయోగింపబడితే అది లాటానుప్రాస అనే శబ్దాలంకారం అవుతుంది.

ఇలాంటివే కాక ఇంకా అనేకరకాల లాటానుప్రాసలు సామసంహితలో అడుగడుగునా కనపడతాయి. సంగ్రహంగా కొన్నింటిని మాత్రమే ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

యజ్ఞా యజ్ఞా వో అగ్నయే గిరా గిరా చ దక్షసే ।
ప్రప్ర వయమమృతం జాతవేదసం ప్రియం మిత్రం న శంసిషమ్ ॥
(పూ.1.4.1)

ఈ మంత్రంలో **`యజ్ఞా యజ్ఞా'** అని **`గిరా గిరా'** అని రెండు సార్లు ఒకే పదం అర్థబేదం లేకుండా ప్రయోగింపబడటం ఒక విధమైన లాటానుప్రాస. అలాగే **`పాహి'** అనే పదం నాలుగుసార్లు

ప్రయోగింపబడి ఈ క్రింది మంత్రానికి ఎంత చక్కని ఊపును తీసుకువచ్చిందో ఒకసారి గమనించండి:

పాహి నో అగ్న ఏకయా పాహ్యూత ద్వితీయయా ।
పాహి గోర్భిస్తిసృభిరూర్జాం పతే పాహి చతసృభిర్వసో ॥ (పూ 1.4.2)

అర్థభేదం లేకుండా 'భద్ర' పదాన్ని, 'వృష' పదాన్ని చాలా సార్లు ప్రయోగిస్తూ వినడానికి ఎంతో హాయిని కలిగించే ఈ సామ మంత్రాలు ఎంత సుందరంగా ఉన్నాయి!

భద్రో నో అగ్నిరాహుతో భద్రా రాతిః సుభగ భద్రో అధ్వరః ।
భద్రా ఉత ప్రశస్తయః ॥ (పూ.2.2.5)
వృషా సోమ ద్యుమాం అసి వృషాదేవ వృషవ్రతః ।
వృషా ధర్మాణి దధ్రిషే ॥ (పూ.6.2.8)

ఇలాగే ఒకే పదాన్ని చాలాసార్లు ప్రయోగిస్తూ లాటాను ప్రాసల నందించే మంత్రాలను ఎన్నింటినో మన మీ సంహితలో చూడవచ్చు[1].

మహామనీషులైన మహర్షుల అలౌకిక దర్శనానికందిన మంత్రాలలో ఏనాడో ఇన్ని అలంకారాలు ఇమిడి ఉండడం నిజంగా మన భాగ్యవిశేషం.

**(3) ఛేకానుప్రాస:**

విభిన్నమైన అర్థాలుగల రెండక్షరాలు మధ్యలో వ్యవధానం లేకుండా వెంటవెంటనే ప్రయోగింపబడితే అది ఛేకానుప్రాస

---

1. హథో వృత్రాణ్యార్యా హథో దాసాతి సత్పతీ ।
హథో విశ్వా అప ద్విషః ॥ (ఉ.2.8.8)
ఇందులో 'హథ' అనే పదం మూడుసార్లు ప్రయుక్తమై వినడానికి ఎంతో ఇంపుగా ఉంది.

అవుతుంది. ఈ క్రిందిమంత్రంలో 'ఇన్ద్ర' పదం మూడుసార్లు ప్రయుక్తమై లాటానుప్రాస అమరగా, దానికి 'అర్కేభిరర్కిణః' అని ఛేకానుప్రాసం ఎంత సౌందర్యాన్ని సంతరిస్తున్నదో చూడండి:

ఇన్ద్రమిద్ గాథినో బృహదిన్ద్ర మర్కేభిరర్కిణః ।
ఇన్ద్రం వాణీరనూషత ॥ (పూ 3.1.5)

ఇలాగే వృత్త్యనుప్రాసతో కలసిన లాటానుప్రాసలు కూడా ఈ సంహితలో ఎన్నో ఉన్నాయి[1].

ఎన్నో పదాలు అర్థభేదం లేకుండా ఒకే వరుసలో అలాగే ప్రయోగింపబడటం ఈ క్రింది మంత్రంలో స్పష్టంగా కనబడుతుంది.

తరత్ స మన్దీ ధావతి ధారా సుతస్యాన్ధసః ।
తరత్ స మన్దీ ధావతి ॥ (పూ 6.2.4)

'జనితా' అనే పదాన్ని ఏడుసార్లు ప్రయోగిస్తూ శ్రోతలను అట్టే ఆకర్షిస్తున్న ఈ క్రింది మంత్రం ఎంత వీనులవిందు చేస్తున్నదో గమనించండి :

సోమః పవతే జనితా మతీనాం జనితా
దివో జనితా పృథివ్యాః ।
జనితాగ్నేర్జనితా సూర్యస్య
జనితేన్ద్రస్య జనితోత విష్ణోః ॥ (ఉ.3.6.1)

1. శచీభిర్నః శచీవసూ దివా నక్తం దిశస్యతమ్ ।
మా వాం రాతిరుపదసత్ కదాచనాస్మద్రాతిః కదాచన ॥ (పూ.3.10.5)
ఇందులో 'శ' అనే అక్షరం మూడుసార్లు ఆవృత్తికావడం వృత్త్యనుప్రాస కాగా, రాతి, కదాచన, అనే పదాలు మళ్లామళ్లా ప్రయోగింపబడటం లాటానుప్రాస.

**(4) యమకం:**

అర్థభేదంతో అక్షరాల సమూహం మళ్లామళ్లా ప్రయోగింపబడితే అది యమకమనే శబ్దాలంకారం. అక్షరసమూహం ఆవృత్తి కావడంతో మధ్య వ్యవధానం ఉండటమే ఛేకానుప్రాసకు దీనికి భేదం

ఇలాంటి యమకాలు ఈ సంహితలో ఎక్కువగా కనపడవు ఈ క్రింది మంత్రం చూడండి:

అంజతే వ్యంజతే సమంజతే క్రతుం రిహన్తి మధ్వాభ్యంజతే ।

ఇక్కడ 'అంజతే అనే పదం వ్యవధానంతో నాలుగుసార్లు ప్రయోగింపబడి చక్కని యమకశోభను సంతరించింది. ఇలాగే లాటానుప్రాసతో కలిసిన యమకప్రయోగం చూడండి:

పన్యంపన్యమిత్ సోతార ఆ ధావత మద్యాయ ।
సోమం వీరాయ శూరాయ ॥ (పూ.2 3.9)

'**వాత**' అనే అక్షరసమూహం వ్యవధానంతో రెండుసార్లు ప్రయుక్తమై యమకంగా, ఏర్పడగా 'భు' అనే వర్ణం ఆవృత్తమై వృత్త్యనుప్రాసగా మంచి ఆకర్షణను కలిగించిన ఈ క్రిందిమంత్రం పరిశీలించండి:

వాత ఆ వాతు భేషజం శమ్భు మయోభు నో హృదే ।
ప్ర న ఆయూంషి తారిషత్ ॥ (పూ 2.9.10)

**2. మకుటాలు:**

తరువాతకాలంలో ఎంతగానో విస్తరించిన శతకవాఙ్మయానికి బీజాలు ఋగ్వేదంలో లాగానే సామవేదంలో మనకు కనబడతాయి చాలా మంత్రాల చివరిపాదాలు ఒకేరకమైన వాక్యాలతో పూర్తికావడం ఇక్కడ గమనార్హం. సామసంహితలో ఇలాంటి మకుటాలు గల మంత్రసమూహాలు సుమారు ఆరు కనబడతాయి. దశతిలో

ఎన్ని మంత్రాలు ఒకే మకుటంతో ఉన్నాయనేది అంత ముఖ్యమైన విషయంకాదు. కాని ఒకే రకమైన వాక్యాన్ని ఆవృత్తి చేస్తూ ఏకొన్ని మంత్రాలు నడిచినా అదొక ప్రత్యేకమైన శోభను కలిగిస్తుందనడంలో అతిశయోక్తి లేదు ఆ మకుటాలనారింటిని ఇక్కడ ఉదాహరిస్తున్నాను చూడండి:

1. అథా సో పస్యసస్పృధి ఉ 4.2.1-10
2 తరత్స మన్దీ ధావతి ఉ.4.2 1-4
3 వసు స్పార్హం తదా భర ఉ 4.3 1-3
4. ఇన్ద్రాగ్నీ తస్య బోధతమ్ ఉ 4.3.1-3
5. మదేషు సర్వదా అసి ఉ 4.6.1-3
6 పా స్తమా పురుస్పృహమ్ ఉ.4.9.10

**3. అర్థాలంకారాలు:**

అలంకారశాస్త్రంలో ఎన్నెన్నో అర్థాలంకారాలు చెప్పబడ్డాయి. వేదకాలంనాటికే ఈ అలంకారాలకొక స్వరూపం ఏర్పడింది. కాకపోతే ఇన్ని వైవిధ్యాలు ఆనాడు లేకపోవచ్చు. కాలక్రమేణ మానవుడు తన బుద్ధిబలంతో అలంకారశాస్త్రంలో ఎన్నో విలక్షణమైన విభాగాలను చేశాడు. సామసంహితలో ఎన్నో అర్థాలంకారాలున్నాయి. మచ్చుకు కొన్నింటినిమాత్రం సంగ్రహంగా ఇక్కడ పరిశీలిస్తాం.

**1. ఉపమ:**

ఆనాటికీ ఈనాటికీ ఉపమాలంకారం అలంకారాలన్నింటికీ మూలభూతమైందనడంలో ఎవరికీ అభిప్రాయభేదం లేదు. అలాంటి ఉపమలు ఈ సంహితలో ఎన్నో కనబడతాయి;చూడండి:

తం వః సఖాయో మదాయ పున్యామభి గాయత ।
శిశుం న హవ్యైః స్వదయన్త గూర్తిభిః ॥ (ఉ 4.6.1)

ఈ సామలో చక్కని ఉపమాప్రయోగం కనబడుతోంది.

"ఓ ఋత్విక్కులారా! మీరు సోమదేవతను చక్కగా స్తుతిచేయండి! అని చెప్పి, అనేకాలంకారాలతోను, పాలతోను చిన్నపిల్ల వానిని సంతోషపెట్టి ప్రసన్నుణ్ణిగా చేసుకున్నట్లు ఈ దేవతను యజ్ఞాలతోను, హవిస్సులతోను, స్తుతులతోను ప్రసన్నుణ్ణిగా చేసుకోండి" అనే భావంకల ఈ సామలో "**శిశుం న**" అనే పదాలద్వారా రమణీయమైన ఉపమానాన్ని అందించారు. ఇక్కడ '**న**' అనేది ఉపమావాచకం.

సం వత్స ఇవ మాతృభిరిన్దుర్హిన్వానో అజ్యతే।
దేవావీర్మదో మతిభిః పరిష్కృతః ॥ **(ఉ.4.6.2)**

లేగదూడను తల్లి ఆవు ఆప్యాయంగా నాలుకతో నాకుతూ తడిపివేస్తుంటుంది. దేవరక్షకుడు, మదకరుడు, బాగా అలంకరించుకొన్న ఈ సోముడు అలాగే మన నాలుకలపైనుంచి పుట్టిన స్తుతులచేత తడిపి వేయబడుతున్నాడు. చూడండి. ఉపమానం ఎంత అర్థంగా ఉందో!

**2. మాలోపమ:**

ఉపమేయం ఒకటిగానే ఉండి ఉపమానాలు మాత్రం మాలలాగా ఒకటికంటే ఎక్కువగా ఉంటే అది మాలోపమ. ఈ క్రింది మూడుసామలలో ఎలాంటి మాలోపమలున్నాయో ఒక్కసారి పరిశీలించండి:

ప్ర స్వానాసో రథా ఇవార్వన్తో న అవస్యవః।
సోమాసో రాయే అక్రమః ॥ **(ఉ.4.8.4)**

హిన్వానాసో రథా ఇవ దధన్విరే గభస్త్యోః।
భరాసః కారిణామివ ॥ **(ఉ.4.8.5)**

రాజానో న ప్రశస్తిభిః సోమాసో గోభిరంజతే।
యజ్ఞో న సప్త ధాతృభిః ॥ **(ఉ.4.8.6)**

ఈ మూడు సామల్లోను ఉపమేయం సోమరసం. అది ప్రతి సామలోను రెండు ఉపమానాలతో పోల్చబడింది. కనుక ప్రతిసామ మాలోపమకు లక్ష్యమవుతున్నది. చూడండి:

చప్పుడు చేస్తూ వస్తున్న రథాల్లాగా గుఱ్ఱాల్లాగా సోమలతలో నుంచి పిండబడే సోమరసాలు వస్తున్నాయి.

యాగభూమికి తరలి వస్తున్న రథాల్లాగా, సంభారాలను మోసుకువస్తున్న ఋత్విక్కుల్లాగా, ఋత్విక్కుల భుజాలపై సోమరసాలు ధరింపబడ్డాయి.

మంచిస్తుతులచే రాజుల్లాగా, ఏడు హోత్రాలచేత యజ్ఞంలాగా సోమరసాలు ఆవుపాలచేత సంస్కరింపబడుతున్నాయి.

ఈ ఉపమానాలు పరిశీలిస్తే ఎంతో లోతైన భావన వాటివెనుక ఉన్నట్లు మనకర్థమవుతుంది.

**3. ఉల్లేఖం:**

ఒకే వస్తువు అనేక విధాలుగా చెప్పబడితే అది ఉల్లేఖాలంకార మౌతుంది. ఒకరకమైన ఉల్లేఖం ఈ క్రింది సామలో కనబడుతుంది:

> బ్రహ్మా దేవానాం పదవీః కవీనా
> మృషిర్విప్రాణాం మహిషో మృగాణామ్ ।
>
> శ్యేనో గృధ్రాణాం స్వధితిర్వనానాం
> సోమః పవిత్రమత్యేతి రేభన్ ॥ (ఉ.3.6.2)

'సోముడు దేవతలకధిపతి, కవుల్లో శ్రేష్ఠుడు, విప్రుల్లో ఋషి, మృగాల్లో మహిషం, పక్షుల్లో డేగ, శస్త్రాల్లో స్వధితి అనే కత్తి' అని అనేక విధాలుగా చెప్పడం వల్ల ఇది ఒక ఉల్లేఖాలంకారమౌతుంది.

**4. స్వభావోక్తి:**

జాతి గుణ క్రియాదులు ఉన్నవి ఉన్నట్లే చక్కగా వర్ణింప బడటమే స్వభావోక్త్యలంకారం. ఈ సామలో చూడండి ఎంత చక్కని స్వభావోక్తి కనపడుతుందో!

అయం దక్షాయ సాధనోఽయం శర్ధాయ వీతయే ।
అయం దేవేభ్యో మధుమత్తరః సుతః ॥ (ఉ. 4.6.3)

ఈ సోమరసం బలానికి సాధనం. దేవతలకు రుచికరమైన ఆహారం ఇది మంచి వేగాన్ని కలిగిస్తుంది. చక్కగా పిండబడ్డ ఈ రసం మధురాతిమధురంగా ఉండి దేవతలను మైమరపిస్తుంది ఇలా సోమరసస్వభావం చక్కగా వివరింపబడటం వల్ల ఇది స్వభావోక్త్యలంకారమని చెప్పవచ్చు.

సామసంహితలో ఉన్న చాలా మంత్రాలు కొద్ది తేడాలతో ఋక్సంహితలోను దొరుకుతాయి. ఇక్కడ పేర్కొన్న మంత్రాలు సామసంహితలోను ఉండటంచేత వీటిని ఆ సంహితలోనివిగానే ఉదాహరించడం జరిగింది.

ఇలాగే సామసంహితలో కవితాసామగ్రి ఎంతగానో మనకు దొరుకుతుంది. నిజంగా సామగానం ఎంతో హాయినిస్తుంది సామగానంకంటే మధురమైంది సోమపానం. సోమపానంకంటే అతి మధురమైంది సామకవితా సౌందర్యామృతరసపానం. ఒక్కసారైనా ఆ సౌందర్యాన్ని అనుభూతిలోకి తెచ్చుకోలేకపోతే ఈ జన్మకు పరమార్థం శూన్యం.

**- ఎస్.బి.ఆర్.**

## 4. 12 ఆర్చికలు - సంగ్రహసమీక్ష

సామవేదసంహితలు ఒకప్పుడు అనేకములుండెనని చెప్పుదురు. పురాణములందు ఈ సంహితలు సహస్రముగా పేర్కొనబడినవి. "సహస్రాధ్వా సామవేదః" అని సర్వానుక్రమణిలో తెల్పబడియున్నది. అయినను కౌథుమిశాఖ, రాణాయనీయశాఖ, జైమినీయశాఖ అను మూడు మాత్రమే మనకిప్పుడు దొరకుచున్నవి. కొందరీ సంహిత ఏడు శాఖలైనదనియు. వానిలో కడపటి రాణాయనీయశాఖ మరి తొమ్మిది శాఖలుగా విస్తరిల్లినదనియు. అందు కౌథుమిశాఖ ఘూర్జరదేశమునందును, జైమినీయశాఖ కర్ణాటదేశమందును, రాణాయనీయశాఖ మహారాష్ట్ర ఆంధ్రదేశములందును ఎక్కువగా వ్యాపించినవనియు చెప్పుచున్నారు.

వీనిలో మిక్కిలి ప్రసిద్ధమైన కౌథుమిశాఖ రెండు భాగములుగా విభజింపబడినది. ఈ భాగములకు 'ఆర్చిక' లని పెరు. ఆర్చిక అనగా ఋక్కుల సమూహము. మొదటిదానికి పూర్వార్చిక అనియు, రెండవదానికి ఉత్తరార్చిక అనియు పేర్లు

పూర్వార్చిక ఆరు ప్రపాఠకములుగా విభజింపబడినది. ఒక్కొక్క ప్రపాఠకము మరల రెండేసి అధ్యాయములుగాను, ఒక్కొక్క అధ్యాయము అయిదేసి దశతులుగను విభజింపబడినవి. దశతి అనగా పది ఋక్కుల సమూహము. ఆరవప్రపాఠకము నందలి రెండవ అధ్యాయమున నాలుగుదశతులు మాత్రమే ఉన్నవి. ఈ విధముగా పూర్వార్చికలో మొత్తము ఆరు ప్రపాఠకములు, పన్నెండు అధ్యాయములు, ఏబదితొమ్మిది దశతులు ఉన్నవి. కొన్నిదశతులలో పూర్తిగా పది ఋక్కులు లేనికారణమున కాబోలు పూర్వార్చిక యందలి మొత్తము ఋక్కుల సంఖ్య 585 గా చెప్పబడినది.

**ఉత్తరార్చిక**లో తొమ్మిది ప్రపాఠకములున్నవి. మొదటి అయిదు ప్రపాఠకములందును రెండేసి అధ్యాయములును, చివరి నాల్గు ప్రపాఠకములందును మూడేసి అధ్యాయములును కలవు. మొత్తము అధ్యాయముల సంఖ్య 22. ఋక్కుల సంఖ్య 1218. కొందరు పరిశీలకులు దీనికి ఏబదియైదు మంత్రములతో కూడిన **ఆరణ్యక కాండమును**, పదిఋక్కులతో కూడిన **మహానామ్న్యార్చికను** చేర్చియుండిరి. ఈ విధముగా మొత్తము ఋక్కులసంఖ్య 1875 అగును. కొందరు మొత్తము ఋక్కులసంఖ్య 1810 యే అనియు అందుండి పునరుక్తములను తొలగించినచో మొత్తము 1549 ఋక్కులుండుననియు చెప్పుచున్నారు దీనిలో 75 తప్ప మిగిలిన వన్నియు ఋగ్వేదసంహిత యందలివే. ముఖ్యముగ అవి 8-9 మండలమునుండి గ్రహింపబడినవి.

ఇందలి పెక్కు ఋక్కులు గాయత్రీచ్ఛందమునందును, కొన్ని గాయత్రి, జగతీ పాదములతో కూడిన ప్రగాథచ్ఛందము నందును కలవు. ఈ ఛందములలోని గేయములన్నియు మొదటి నుండియు గానమున కుద్దేశింపబడినవే. ఋగ్వేదమునలేని 75 ఋక్కులును, కొన్ని ఇతరసంహితలనుండియు, కొన్ని వివిధ కర్మకాండ గ్రంథములనుండియు గ్రహింపబడినవి

వానిని దర్శించిన ఋషులు శ్రుతర్షి, తృణపాణి, వార్షహవ్యుడు, ముక్తవాహద్వితుడు, అయజీక్వాహి మున్నగువారు. ఇంక సామ వేదసంప్రదాయప్రవర్తకులనేకులు. వంశబ్రాహ్మణమను గ్రంథము రెండు ఋషిపట్టికలిచ్చినది. మొదటిదానిలో 62 గురును రెండవదానిలో 15 గురును కనవత్తురు. వీరుగాక సామగాచార్యులు సామగానప్రవచన కర్తలు మరికొందరు కలరు.

ఋగ్వేదమునుండి గ్రహింపబడిన ఋక్కులుకూడ అందలి-క్రమముననుసరించికాక అవి ఉపయోగింపవలసిన మతకర్మల

కనుగుణముగా సేకరింపబడినవి. ఈ ఋక్కులకును మనకిప్పుడు లభించు ఋగ్వేదమునందలి ఋక్కులకును కొన్ని పాఠభేదములు కన్పించును. పాడునప్పుడు కొన్ని అక్షరములను దీర్ఘీకరించుటచేతను, పునరుక్తము చేయుటచేతను, అధికముగా చేర్చుటచేతను, ఋత్విజుల సౌకర్యమునకై ఏర్పడిన స్వరభేదములచేతను అవి మార్పు చేయబడి ఉన్నవి

పూర్వార్చికయందలి ఋక్కులక్రమము ననుసరించు గాన గ్రంథములు రెండు కలవు. వీనికి **'గ్రామగేయగానగ్రంథము'** **'అరణ్యగానగ్రంథము'** అని నామములు. **'ఊహగానము'** **'ఊహ్యగానము'** అను నామములుగల మరిరెండు గానగ్రంథములు ఉత్తరార్చికయందలి ఋక్కులననుసరించున్నవి. ఉత్తరార్చికయందలి ఋక్కులు పూర్వార్చికయందలి ఋక్కులకంటె ఎక్కువ సక్రమముగా నుండి త్రిపదములుగా కూర్చబడినవి. వీనియందలి మొదటిపాదము సాధారణముగా పూర్వార్చికయందుండిన ఋక్కుయొక్క పునరుక్తి గానే గోచరించును.

యజుర్వేదమునందలి మంత్రములవలెనే సామవేదమునందలి ఋక్కులును సోమయాగసందర్భమున పఠించుట కుద్దేశింపబడినటివే. ఋగ్వేదమునందలి ఉపయోగింపబడిన సందర్భమునకును ఇందలి సందర్భమునకును సాదృశ్యముండదు. వాని ప్రాముఖ్యము ప్రత్యేకకర్మలకు సంబంధించియుండుటచే వానిలో ఒండొంటికి అంతరమైన సంబంధమంతగా కనిపించదు. స్వరముల విషయమున కూడ వీనికిని ఋగ్వేదమునందలి వానికిని చాల భేదము గోచరించును. అందుచే సామవేదమును సోమయాగ సందర్భమున ఉద్గాతలను ఋత్విజులు పఠించు ఋక్కుల సముదాయము అని చెప్పవచ్చును.

పైని పేర్కొనబడిన గానగ్రంథములందలి ఋక్కులసంఖ్యను వానిని గానముచేయు విధానమును అనుసరించి పెంపొందింపవచ్చును

(పూర్వార్చికయందలి మొదటి 12 దశతులును అగ్నికిని, చివరి దశతులు సోమునికిని, మధ్యనున్న 36 దశతులును సోమపాయి అయిన ఇంద్రునికిని సంబోధింపబడినవి). ఉత్తరార్చికలో పునరుక్తము చేయబడిన పూర్వార్చికయందలి ఋక్కులకును ఋగ్వేదమునందలి ఋక్కులకును సన్నిహితతరసంబంధము కనిపించును. ఋగ్వేదము నందలి ఋక్కులచే ప్రత్యేకముగా ప్రభావితములైన ఉత్తరార్చిక యందలి యితర ఋక్కులతో సామరస్యము కల్పించుటకై అవి అట్లు మార్చబడి ఉండునని ఊహింపవచ్చును.

పూర్వార్చికయందలి ఋక్కులకును ఋగ్వేదమునందలి వానికిని ఎక్కువభేదముండుటకు అవి మొదట ఋగ్వేదమునుండి సంగ్రహింపబడిన తరువాత స్వతంత్రమును ప్రత్యేకమునైన సంప్రదాయమును అనుసరించి పఠింపబడి ఉండుటయే కారణమై ఉండును. శతపథ బ్రాహ్మణమునందలి ఉత్తరభాగము వెలసినప్పటికే సామవేదపూర్వార్చికయందలి భాగములు ప్రచారమునందు ఉండెననుటకు సూచనలున్నవి. యజుర్వేదమునందలి తైత్తిరీయ వాజసనేయసంహితలకంటె సామవేదము ప్రాచీనతరమనుటకు వాజసనేయమునందు ఋగ్వేదమునందలి ఋక్కులకంటె భిన్నములైన పాఠములుగల సామవేదభాగములు కనిపించుటయే నిదర్శనము.

ఋగ్వేద సామవేదములందలి ఋక్కులలోని పాఠభేదములకు వాని ఉపయోగమునందలి భేదమే హేతువు. సామవేదమునందలి ఋక్కుల ప్రధానప్రయోజనము సంగీతమే; పూర్వోత్తరార్చికలు రెండును ఆ సంగీతమును బోధించుటకే ఉద్దేశింపబడినవి. ఉద్గాతయైన ఋత్విజుడుగా ఉండగోరు పండితుడు ఆర్చికలద్వారా ముందా సంగీతమును నేర్చుకొనవలయును. అప్పుడే అతడు యాగసమయము నందు పాడవలసిన విధమున వానిని గానముచేయజాలును. పూర్వార్చికయందలి 585 ఋక్కులందును వివిధరాగము లిమిడి ఉన్నవి.

సామమను పదము సాధారణముగా వేదమునకే వాడబడు చున్నను రాగము లేక గానము అనియే దాని నిజమైన అర్థము. వేదతత్త్వవేత్తలు ఋక్కునకును గానమునకునుగల సంబంధము తెల్పుచు ఋక్కునుండియే గానము పుట్టినదని చెప్పుదురు. దీనినిబట్టి ఋక్కును రాగమునకు యోని అనియు వారు తెల్పుదురు. ఏదైన ఋక్కును వివిధ రాగములతో పాడుటకును, పెక్కుఋక్కులను ఒకేరాగమున పాడుటకును అవకాశమున్నను కొన్నిఋక్కులను ప్రత్యేక రాగములకే యోనులని వర్ణింతురు. పూర్వార్చికయందలి 585 ఋక్కులను వివిధములైన (సుమారు రెట్టింపు 1170) రాగములలో పాడవచ్చును.

ఉత్తరార్చికలో 400 మంత్రములున్నవి. ఒక్కొక్కమంత్రమున మూడేసి ఋక్కులుండును. వీనినుండియే యాగసమయములందు పాడబడు స్తోత్రములను ఎన్నుకొందురు. పూర్వార్చికలోని ఋక్కులు కొన్ని ఛందఃక్రమమును అనుసరించియు, కొన్ని అవి ఉద్దేశింపబడిన ఇంద్రాగ్ని సోమాది దేవతలను అనుసరించియు కూర్పబడియుండ, ఉత్తరార్చికయందలి ఋక్కులు ముఖ్యములైన యాగముల క్రమమును బట్టి కూర్పబడినవి. ఒక్కొక్క స్తోత్రమున సాధారణముగా మూడేసి ఋక్కులుండును. అవి పూర్వార్చికలో బోధింపబడిన రాగమును అనుసరించి గానము చేయబడును. ఒక విధముగా ఉత్తరార్చికలో స్తుతిపూర్వకములైన ఋక్కుల పాఠములుండుననియు, వానిని గానము చేయు రాగములంతకు ముందే నిర్ణయింపబడి ఉండుననియు భావింపవచ్చును. దీనినిబట్టి పూర్వార్చిక కంటె ఉత్తరార్చిక అర్వాచీనమని తెలిసికొనవచ్చును. కాని పూర్వార్చికలోని కొన్ని రాగములు ఉత్తరార్చికయందలి మంత్రములలో ఉపయోగింపబడవు. అట్లే ఉత్తరార్చికయందలి కొన్ని స్తోత్రములను పాడుటకనువైన రాగములు పూర్వార్చికలో కనబడవు. సాధారణముగా ఉద్గాత ముందు పూర్వార్చికను అధ్యయనముచేసి తరువాత ఉత్తరార్చికను నేర్చుకొనును.

పూర్వోత్తరార్చికలు రెండింటను పండితులు పఠించుక్రమమును అనుసరించి పదపాఠములుండును. ప్రాచీనకాలమున వానిని మౌఖికముగా కాని జంత్రముల ద్వారా కాని నేర్పెడివారు. తరువాత గానగ్రంథములు వెలువడి ఉండును. అందు ఎచ్చట అక్షరములను దీర్ఘము చేయవలెనో, ఎచ్చట పునరుక్తములు చేయవలయునో, ఎచ్చట స్తోభములనబడు **'హెూయి, హావ,** అను పదములను చేర్చవలయునో తెల్పబడును. గానస్వర నియమములను అనుసరించి గానము చేయబడుటచే సామగానము వీనుల విందుగా ఉండును.

నారదశిక్షలోని కొన్నిశ్లోకములు, సామము నందలి స్వరములు భారతీయ సంగీతశాస్త్రము నందలి సప్తస్వరములకు సరిపడుచున్నవని తెల్పుచున్నవి. సామమునందలి ప్రథమ స్వరము మధ్యమమునకును (మ), ద్వితీయస్వరము గాంధారమునకును, (గ), తృతీయస్వరము ఋషభమునకును (రి), చతుర్థస్వరము షడ్జమునకును (స), పంచమస్వరము ధైవతమునకును (ధ), షష్ఠస్వరము నిషాదమునకును (ని), సప్తమస్వరము పంచమమునకు (ప), సరిపడును. సామమునందలి ప్రథమాది స్వరములు సంగీత శాస్త్రమునందలి సప్తస్వరములకును సరిపడు క్రమము క్రింద సూచింపబడుచున్నది.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| మ | గ | రి | స | ధ | ని | ప |

ఇవే స రి గ మ ప ధ ని అను సప్తస్వరములు. వీనిని సామగాన పద్ధతిని అనుసరించి పాడవచ్చుననుటకు పెక్కు ఉదాహరణములను చూపవచ్చును. గేయసామములు కొన్ని మంత్రద్రష్టలనుబట్టియు, కొన్ని గానస్వరకర్తలను బట్టియు, కొన్ని విషయప్రాధాన్యమును బట్టియు పేర్కొనబడుచున్నవి. **'నౌధసము,' 'వామదేవ్యము', 'కాలేయము'** అనునవి. మంత్రద్రష్టలను బట్టియు, **'గౌతమసంపర్కము'**

మున్నగునవి స్వరకర్తలను బట్టియు, 'లోకద్వారము' మొదలగునవి విషయమును బట్టియు ఏర్పడిన నామములు. పాడునప్పుడు ఉద్గాతలు కొందఱు స్వరములను కరచాలనముచే కాని అంగుళీచాలనముచే కాని సూచించుచుందురు.

సామవేద మంత్రములను గానము చేయువిధానమును సూచించు గేయగాన గ్రంథములు నాలుగున్నవి: 1. గ్రామగేయగానము (గ్రామములో పాడుట కనువగు ఋక్కులిందుండును. గ్రామమనగా సమూహము అను అర్థము గ్రహించి కొందరు ఇవి సామూహిక గానమునకు ఉపయోగపడునని చెప్పిరి). 2. అరణ్యాగానగ్రంథము. (ఇందలి ఋక్కులు హానికరములు అగుటచే గ్రామములందు కాక అరణ్యమున గానము చేయదగినవి). 3. ఊహగానగ్రంథము 4.ఊహ్యాగాన గ్రంథము (యాగ సందర్భమున గానము చేయవలసిన సామముల క్రమము వీని యందు ఉండును). ఇందు ఊహగానము గ్రామగేయగానమునకును, ఊహ్యాగానము అరణ్యాగానమునకును సంబంధించినవని వింటర్‌నిడ్జ్ పండితుని అభిప్రాయము.

పరిచితములైన రాగములు లేక గానవిధానములు అనేకములు ఉండెననియు ప్రాచీనకాలముననే వానికి ప్రత్యేక నామములు స్థిరపడె ననియు తెలియుచున్నది. కర్మకాండకు సంబంధించిన గ్రంథములలో ఈ నామములతో అవి పేర్కొనబడుటయే కాక వానికి వివిధ సాంకేతికార్థములు కూడ ఈయబడినవి. బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు అనువానియందలి సాంకేతి కత్వమునకును, మార్మికత్వమునకును వీనికిని సంబంధమున్నది. వానిలో 'బృహత్సామరథంతరములు' ముఖ్యములైనవి. ఋత్విజులు కాని, పండితులుకాని ఈ రాగములను స్వయముగా కనిపెట్టి ఉండలేదు. వానిలో ప్రాచీనములైనవి మతమునకును జాతీయోత్సవము లకును సంబంధించినవై ప్రజలలో ప్రచారము పొంది ఉండును

సామగాన రాగముల ఛాయలు '**స్తోభములు**' అనబడు ఉత్సాహరావములందు కనిపించును. బ్రాహ్మణకాలమున సైతము సామగానములలో ఇంద్రజాలశక్తి కలదని విశ్వసింపబడుచుండెను.

సామవేదమునకు సంబంధించిన సామవిధానబ్రాహ్మణము అను కర్మకాండను తెలుపు గ్రంథము ఒకటి కలదు. అందలి ఉత్తర భాగము ఇంద్రజాలమునకు సంబంధించి ఏ సామమంత్రములు ఇంద్రజాల ప్రయోజనమునకై ఉపయోగపడునో తెల్పుచున్నది. కొన్ని స్మృతులలో సామవేదధ్వని వినబడగానే ఋగ్వేద యజుర్వేదముల అధ్యయనము మానివేయవలెనని చెప్పబడుటచూడ సామమంత్రములకు ఇంద్రజాల శక్తికలదను విశ్వాసము తరువాత కూడ కొనసాగి ఉండెనని తెలియుచున్నది. ఆపస్తంబసూత్రములలో కుక్కలు, గాడిదలు, తోడేళ్ళు, నక్కలు, గుడ్లగూబలు కూయునప్పుడును, వాద్యగాన ధ్వనులును, రోదన ధ్వనులును వినిపించునప్పుడును సామగానధ్వనులు చెలగునప్పుడును వేదాధ్యయనమును ఆపవలెనను నియమము చెప్పబడినది.

ఈ విధముగా భారతదేశమునందలి ఇంద్రజాల, యాగ, సంగీత చరిత్రములపై సామవేదసంహితకు అధికప్రభావము ఉన్నట్లు గోచరించుచున్నది. కాని ఈ విషయమున తగినంత పరిశోధన జరిగి ఉండలేదు. ప్రాచీన భారతమున సర్వతోముఖ ప్రచారము పొందిన సామవేదము ఇప్పుడు నామమాత్రావశిష్టమై ఉండుట సంతాపకారణము. కాని శ్రౌతమునకు ఉపయోగించు సామగానము మాత్రము అచ్చటచ్చట వినవచ్చుచుండుట సంతోషింపవలసిన విషయము.

ఇపుడు పూర్వోత్తరార్చికల స్వరూపమును సంగ్రహముగ సమీక్షింతము.

## పూర్వార్చిక

పూర్వార్చికమునందు 6 ప్రపాఠకములున్నవి. ఇందు ప్రధానముగ అగ్ని-ఇంద్ర-సోమదేవతలు స్తుతింపబడిరి. అగ్ని మొదటి 12 దశతులలోను, ఇంద్రుడు ఆ పైని [redacted] దశతులలోను, సోముడు చివరి 11 దశతులలోను వరుసగ స్తుతిచేయబడిరి.

### మొదటి ప్రపాఠకము

ఇందు 10 దశతులు గలవు. ఇది ప్రధానముగ అగ్నిస్తుతి పరమైనను బ్రహ్మణస్పతి, ఇంద్రుడు, పూష, అంగిరసుల స్తుతులు కూడ ఇందులో ఉన్నవి.

**అమరులగుదుముగాక!**

> అతిథిసమానుడు, పూజ్యుడు అగు అగ్నిని ప్రాతఃకాలమున స్తుతిజేయుచున్నాము అతడు అందరికీ సంపదలనిచ్చును. హవిస్సులద్వారా అమరుడగు అతని నుపాసించి మానవులమగు మనము కూడ అమరులమగుదుముగాక! (పూ 1.9.5)

### రెండవ ప్రపాఠకము

దీనిలో కూడ 10 దశతులున్నవి అగ్ని, ఇంద్రుడు, సవిత మొ॥ దేవతలు వీటిలో స్తుతింపబడిరి

**దోషములను పోగొట్టుగాక!**

> యజమానుల దోషములను పోగొట్టుటకు సవితను స్తోత్రము చేయుడు (పూ.2 9 3)

### మూడవ ప్రపాఠకము

ఇందు ఇంద్రుడు, వరుణుడు, అశ్వినులు, మరుత్తులు,

ఆదిత్యుడు, సూర్యుడు మొ॥ దేవతల స్తుతులు 10 దశతులలో కన్పడుచున్నవి.

**మంచి సోదరుని ప్రసాదించుము:**

ఇంద్రుడు మహాదాత. మేము అతనిని స్తుతించుచున్నాము అన్నప్రాప్తికి మేమాతనిని ఆశ్రయించుచున్నాము ఓ ఇంద్రా! అన్నప్రాప్తికై మాకు బలవంతుడైన మంచి సోదరుని ప్రసాదించుము. (పూ 3.1.6).

## నాలుగవ ప్రపాఠకము

ఇంద్రుడు, ఉషస్సు, అగ్ని, విశ్వేదేవులు, ద్యావాపృథువులు మొ॥ దేవతల స్తుతిపరములగు 10 దశతులుగల ప్రపాఠకమిది.

**వ్యర్థమైన ఖర్చు వద్దు!**

ఓ ఇంద్రుడా! నీవు ధనపతివి. నాకు దాన్ని అనుగ్రహించు! సామగానముతో నిన్ను స్తోత్రముచేయు స్తోతకు నేను దానిని సమర్పించగలను వ్యర్థమైన ఖర్చులు చేయకుండా నన్ను కాపాడు! (పూ.4.2.8)

## అయిదవ ప్రపాఠకము

దీనిలో గల 10 దశతులలో ఇంద్రుడు, ఆదిత్యుడు, మరుత్తులు, విశ్వేదేవులు, అశ్వినులు, సోముడు, పవమానుడు, అగ్ని, సూర్యుడు, సవితల స్తుతులున్నవి.

**నన్ను స్నేహితునిగా భావించుము!**

ఓ సోముడా! నీవు చాలా గొప్పవాడవు. నీవు మా మనసును, అంతరాత్మను, మా పనులను మంగళమయముగ చేయుము. నిన్నుస్తుతిచేయు నన్ను నీ స్నేహితునిగా భావించుము (పూ 5.4.4).

## ఆరవ ప్రపాఠకము

ఇందులో తొమ్మిది దశతులు మాత్రమే కలవు. పవమానుడు, సోముడు, ఇంద్రుడు దీనిలో స్తుతింపబడినారు.

**బ్రహ్మతేజస్సును పెంపొందించుము!**

ఓ పరమేష్ఠి! స్వర్గతేజస్సుకు సమానముగా నా శరీరములోని బ్రహ్మతేజస్సును పెంపొందించుము. యజ్ఞములకు నేను సంపాదించు హవిస్సులను గూడా సమృద్ధిగా పెంచుము! (పూ.6.12.1).

## ఆరణ్యక కాండము

ఇది ఆరవ ప్రపాఠకములోని మూడవభాగముగా నున్నది. దీనిలో 5 దశతులు కలవు. పూర్వార్చికమునందు స్తుతింపబడిన దేవతలందఱు ఇందును ప్రసక్తమగుదురు. అన్న దేవతస్తుతి ఇందు గల విశేషము.

**అన్నమే పరబ్రహ్మ:**

"అన్నదేవత దేవతలందఱిలో ముఖ్యుడు సత్యస్వరూపుడు అయిన బ్రహ్మయొక్క పూర్వస్వరూపము అన్నముతో అతిథులను సంతృప్తిపరచగలము. ప్రాణులను కాపాడవచ్చును. ఇతరులకు ఏ కొంచెము పెట్టని లోభి వారి అన్నమునుకూడ తానే తినుచున్నాడు"

(పూ 6.10.9)

## మహానామ్న్యార్చిక

ఇందులో పది సామలున్నవి. ఇంద్రాదిదేవతల స్తుతులు ఇందలి ప్రధాన విషయము.

**భగవంతుని స్మరింపుడు:**

పరమేశ్వరుడు సర్వసమర్థుడు మనకు విజయమును అనుగ్రహించు ■ దేవుని ఎల్లప్పుడు స్మరించవలెను జ్ఞాన-కర్మ-శక్తియుతుడు, సత్య స్వరూపుడు అయిన అయన మనలోని ద్వేషభావములను పోగొట్ట గలడు. (మహా.6).

## ఉత్తరార్చిక

ఇందు తొమ్మిది ప్రపాఠకములలో ఇంద్రుడు, అగ్ని మొ॥ దేవతల స్తుతులున్నవి.

### మొదటి ప్రపాఠకము

ఇందలి 12 దశతులలో అగ్ని, మిత్రావరుణులు, ఇంద్రుడు, పవమానసోముల స్తుతులున్నవి.

**జ్ఞానమును ప్రసాదించుము:**

> ఓ అగ్నీ! నీవు మాలోని అజ్ఞానమును తొలగించి, జ్ఞానమును ప్రకాశింపచేయుటకు యజ్ఞమునకు విచ్చేయుము! దివ్య గుణములను అనుగ్రహించుము. నీవు నా హృదయమున విరాజిల్లుము (ఉ 1.2 1).

**ఐశ్వర్యమును అనుగ్రహించుము:**

> స్తుతిచేయు వారందరికి పశు-ధనములను ఇచ్చు ఇంద్రుడు మనకు కూడా ఐశ్వర్యమును అనుగ్రహించుగాక! అతడు గొప్ప ఐశ్వర్యప్రదాత కదా! (ఉ 1 7.3).

### రెండవ ప్రపాఠకము

ఈ ప్రపాఠకమునందు పవమానుడు, సోముడు, అగ్ని, మిత్రావరుణులు, ఇంద్రుడు 12 దశతులలో స్తుతింపబడినారు

### మూడవ ప్రపాఠకము

ఈ ప్రపాఠకమునందు 14 దశతులున్నవి. వాటియందు పవమానుడు, సోముడు, అగ్ని, ఇంద్రాగ్నులు స్తుతింపబడినారు.

## నాలుగవ ప్రపాఠకము

13 దశతులున్న ఈ ప్రపాఠకమునందు పవమానుడు, సోముడు, అగ్ని, ఆదిత్యుడు, ఇంద్రుడు, విశ్వేదేవుల స్తుతులున్నవి.

**అభయ మొసంగుము!**

బాణప్రయోగము శత్రునాశనము అను రెండు కర్మలు సోమునిద్వారా సిద్ధించుచున్నవి. ఓ సోముడా! శత్రువులను నాశనముచేసి యాజ్ఞికులకు అభయమునొసంగుము (ఉ 4 6.3).

## ఐదవ ప్రపాఠకము

ఇందుగల 12 దశతులలో పవమానుడు, సోముడు, అగ్ని, ఇంద్రుడు స్తుతింపబడినారు.

## ఆరవ ప్రపాఠకము

**పాపములనుండి విముక్తి:**

మిత్రాదిదేవగణములు మమ్ము రక్షించుగాక! యజ్ఞస్థానమునందున్న అగ్ని మమ్ము రక్షించుగాక! నేను పాపములనుండి ముక్తుడనైతిని (ఉ 6 1.2).

## ఏడవ ప్రపాఠకము

ఇందులోని 11 దశతులలో ఇంద్ర-పవమాన-సోమ-అగ్ని-విశ్వేదేవుల స్తుతులున్నవి.

**కర్తవ్యనిర్వహణకు అగ్ని అనుగ్రహము:**

అగ్ని ఐశ్వర్యదాత అతడు కర్తవ్యనిర్వహణము నందలి ప్రతిబంధకములను తొలగింపగలడు కనుక ఉత్తమకర్మలద్వారా ఆయనను స్తుతిచేయుడు! (ఉ 7.3.2).

## ఎనిమిదవ ప్రపాఠకము

13 దశతులున్న ఈ ప్రపాఠకములో అగ్ని, ఇంద్రుడు, విష్ణువు, వాయువు, పవమానుడు, సోముడు మొ॥ దేవతల స్తుతులున్నవి

## తొమ్మిదవ ప్రపాఠకము

ఈ ప్రపాఠకమునందలి 9 దశతులలో పవమానుడు, సోముడు, ఇంద్రుడు, అగ్ని, మరుత్తులు, సూర్యుడు మొ॥ దేవతల స్తుతులున్నవి.

**శత్రువులను తరిమివేయుడు:**

> ఓ వీరులారా! ఇంద్రుడు దేవతల శత్రువులను నాశనము చేయగలడు. విజయుడు, అవిచలుడు, వర్షకుడు అయిన  ఇంద్రుని కృపతో విజయమును పొంది శత్రువులను తరిమివేయుడు (ఋ 9 9 2).

**- డి.వి.ఎ.**

# ఆర్షవిజ్ఞానసర్వస్వము

## 5 ఐదవపరిచ్ఛేదం: అథర్వసంహిత

### 5.1 పరిచయం

**వేదత్వప్రతిపత్తి:**

ఋగ్యజుస్సామలనే మూడు వేదాలు 'త్రయి' అనే పేరుతో చాలాకాలం ప్రసిద్ధిని వహించాయి. అప్పట్లో అథర్వవేదానికి వేదత్వాన్ని అంగీకరించినట్లు లేదు. ఋగాదివేదాల్లాగా యజ్ఞకలాపంలో ఈ వేదం ఉపయోగించబడకపోవటమే దీనికి కారణం. ఇందులో చెప్పబడ్డ విషయాలు మానవుడు ఈ లోకంలో సుఖంగా బ్రతకడానికి ఉపయోగించేవే కాని పరలోక సుఖాన్ని పొందడానికి యజ్ఞాచరణాన్ని ప్రోత్సహించేవి కావు. పై పెచ్చు వ్యాధులను. శత్రువులను భూతాలను. క్రూరమృగాలను, మాయావులను నివారించడానికి స్తంభన, మోహన-మారణాది ప్రయోగాలు చేయడానికి ఇందులోని మంత్రాలు ఉపయోగపడుతున్నాయి. కాబట్టి మొదట్లో దీన్ని మిగతా వేదాలతో సమానంగా ఒక వేదంగా అందఱు అంగీకరించలేదు. తరువాత కొంతకాలానికి యజ్ఞనిర్వాహకుడైన బ్రహ్మ అథర్వ వేదాధ్యయనం

చేసినవాడై ఉండాలనే నియమాన్నంగీకరించి యజ్ఞాలలో దీనికి ఉపయోగాన్ని కల్పించి అథర్వవేదాన్ని కూడ ఒక వేదంగా అంగీకరించి వేదాలు నాలుగు అని ప్రకటించారు. ఇలా అనడంలో అభిప్రాయభేదం లేకపోలేదు

**అథర్వవైశిష్ట్యం :**

వేదక్రమాన్ననుసరించి అథర్వవేదం నాలుగవదైనప్పటికీ, దాని మహత్త్వంలో అది చివరిదికాదు వేదాలు నాలుగు, సమానమైన ప్రభావం కలవేకాని ఏరకమైన తారతమ్యం వాటిమధ్యలో చెప్పడానికి వీల్లేదు యజ్ఞనిర్వహణానికి 'బ్రహ్మ', '**అధ్వర్యుడు**', '**హోత**', '**ఉద్గాత**' అని నల్గురు ఋత్విక్కులు కావాలి వారిలో అతిముఖ్యుడైన బ్రహ్మ ఆ స్థానాన్ని నిర్వహించడానికి అథర్వవేదం తప్పక తెలుసుకొని ఉండాలి. అథర్వవేదానికి మూలభూతుడైన అథర్వఋషి ఈ యజ్ఞప్రక్రియకు మూలభూతుడు అతడే దీన్ని లోకానికి చాటి చెప్పాడు. ఈ విషయం ఋగ్వేదంలోను అథర్వవేదంలోను చెప్పబడింది[1].

హోతగా యజ్ఞంలో వ్యవహరించేవాడు ఋగ్వేదం అధ్యయనం చేసి ఉండాలి. అధ్వర్యుడు యజుర్వేదంలో నిపుణుడై ఉండాలి. ఉద్గాత సామవేదంలో నిష్ణాతుడై ఉండాలి. మరి బ్రహ్మ అథర్వవేదంలో ప్రవీణుడై ఉండాలి అంటూ మూడు వేదాలు బాగాతెలిసినవాడే బ్రహ్మపదవికి అర్హుడని వైదికవాఙ్మయం ఉద్ఘోషి

1 యజ్ఞైరథర్వా ప్రథమః పథస్తతే ఋ సం 1.83.5.

అగ్నిర్జాతో అథర్వణా. అక్కడే 10 21 5

త్వామగ్నే పుష్కరాదధ్యథర్వా నిరమన్థత అక్కడే 6 16.13.

అథర్వాణం పితరం దేవబన్ధుం మాతుర్గర్భం పితురసుం యువానమ్. -
య ఇమం యజ్ఞం మనసా చికేత ప్రణో వోచస్తమిహేహ బ్రవః.
అ సం 7.1.2.1

స్తున్నది[1]. అంతేకాదు, మిగతా ముగ్గురు ఋత్విక్కులు చేసిన పొరపాట్లను ఎక్కడికక్కడ బ్రహ్మ పరిహరిస్తూ యజ్ఞానికి అంతరాయం రాకుండా కాపాడాలి[2].

అథర్వసంహిత - నామాంతరాలు:

అథర్వవేదానికి '**అథర్వాంగిరసః**' అనే ప్రాచీననామధేయం ఉన్నట్లు దాని ద్వారానే (10.7.20) తెలుస్తున్నది. భూర్జపత్రాల్లో దొరికిన అథర్వసంహిత ప్రారంభంలో కూడ ఆ పేరే వ్రాయబడిఉంది. '**అథర్వులు**' '**అంగిరసులు**' అనే రెండుపదాలను ఈపదం చెబుతుంది. బ్లూంఫీల్డ్ (bloomfield) అనే పాశ్చాత్య పండితుడు అథర్వశబ్దం వేదంలో ఉన్న మంగళకరమైన భాగాన్ని, అంగిరసశబ్దం అమంగళకరమైన ఆభిచారికభాగాన్ని చెబుతున్నదని అంటాడు. కాలం గడిచేకొద్దీ '**అథర్వ**' అనే పదంతోనే ఈ వేదం వ్యవహారంలోకి వచ్చింది బ్రాహ్మణాల్లో అథర్వశబ్దానికి మంగళకరమైన భాగంగా ప్రయోగాలు కనపడుతున్నాయి దీనికి '**అథర్వవేదం**' అనే వ్యవహారం మొట్టమొదట ధనకు సూత్ర గ్రంథాల్లోనే కనపడుతుంది. సూత్రకాలంనాటికి ఇది త్రయితో సమానంగానే పరిగణింపబడుతోంది.

ఇంకా అథర్వవేదానికి 'భృగ్వంగిరసః' అని 'బ్రహ్మవేదః' అని రెండు పేర్లున్నాయి ఇందులో మొదటిది అథర్వవేదంలోని యజ్ఞకాండంలో కనబడుతుంది రెండోది ఋగ్వేదానికి సంబంధించిన

---

1. యదృచైవ హౌత్రం క్రియతే, యజుషాధ్వర్యవం సామ్నోద్గీథం వ్యారబ్ధా త్రయీ విద్యా భవత్యథ కేన బ్రహ్మత్వం క్రియతే? ఇతి త్రయ్యా విద్యయా ఇతి బ్రూయాత్ ఐ బ్రా 5 5 8 1

" బ్రహ్మా సర్వవిద్యః సర్వం వేదితుమర్హతి ని 1 3.3

2. త్రయాణామపరాధస్తు బ్రహ్మా పరిహరేత్సదా వే బా భూ. **63.**

గృహ్యసూత్రంలో పేర్కొనబడింది. చూలికోపనిషత్తులోను వాయు పురాణంలోను అథర్వవేదం '**భృగువిస్తర**' మని పేర్కొనబడింది.

అథర్వవేదానికి తరువాతి కాలంలో '**నిగద**'[1] మని, 'బ్రహ్మ'[2] అని, '**అథర్వ**' మని, '**ఛందః**'[3] అని నాలుగుపేర్లు ఏర్పడ్డాయి.

**దేశం :**

ఈ సంహితకు యజ్ఞంలో ప్రాధాన్యం లేకపోవడంవల్ల, ఆ రంగంలో దీనికి ప్రచారం తక్కువ. అయితే పైప్పలాదశాఖ కాశ్మీర దేశంలో దొరకడంవల్ల కాశ్మీరదేశంలో దీని ప్రాదుర్భావాన్ని ఊహించవచ్చు ఈ సంహితను సుమన్తుడు తన శిష్యుడైన కబంధునికి బోధించాడు కబంధుడు మద్రదేశానికి సంబంధించినవాడు శరతల్పగతుడైన భీష్ముని సమీపంలో పైప్పలాదుడు, సుమన్తుడు ఉన్నట్లు భారతం (46.6 10) పేర్కొంటున్నది. కనుక కురుక్షేత్రప్రాంతం దీనికి ప్రచారభూమి అని అనుకోవడంలో తప్పులేదు. ఇతరరాష్ట్రాల్లో అక్కడక్కడ ఈ సంహిత నధ్యయనం చేసినవాళ్లు ఉండేవాళ్లు. లౌకిక విషయాలను ప్రతిపాదించడంవల్ల వైదికులు కొంతకాలం దీన్ని పరిగ్రహించకపోవడంవల్ల ఇతర వేదాల్లాగా దీనికి యజ్ఞంతో ముడిపడి ఎక్కడా ప్రచారం జరగలేదు. కాని ఇతరంగా ఇది జగత్ప్రసిద్ధమైంది.

**కాలం :**

ఋక్సంహితలోని విషయాలు కొన్ని అథర్వసంహితలోను అనువదింపబడినట్లు కనపడటంవల్ల ఇది ఋక్సంహితాప్రాదుర్భా

---

1 నిగదో వా చతుర్థం స్యాద్ధర్మవిశేషాత్. మీ. ద 2 1 38.

2. తమృచశ్చ సామాని చ యజూంషి చ బ్రహ్మ చ. గో. బ్రా.

3. ఋచః సామాని ఛందాంసి పురాణం యజుషాం సహ అ.సం. 17.7.28.

వానికి తరువాత ఏర్పడిందని పండితులు అభిప్రాయపడుతున్నారు. ఇందులో 20 కాండలు ఒకే కాలంలో ఏర్పడినవి కావని, విభిన్న కాలాలకు సంబంధించినవని కొందరి అభిప్రాయం. మొదటి 13 కాండలు ఏకకాలంలో ఏర్పడ్డాయని మిగతావి [illegible] తరువాత చేర్చబడ్డాయని కొందరు పరిశోధకులు అనుకొంటున్నారు. చివరి రెండు కాండలు బాగా నవీనమైనవని వారి భావన. కాని శతపథ బ్రాహ్మణంలోను (11.13.14), తైత్తిరీయ బ్రాహ్మణంలోను, ఛాందోగ్యోప నిషత్తులోను అథర్వవేదప్రస్తావం ఉంది కాబట్టి వాటికంటే ఈ సంహిత ప్రాచీనమని వారి నిర్ణయం. సాంప్రదాయికులు ఇలాంటి కాలనిర్ణయాలను అంగీకరించరు.

**విషయం :**

అథర్వసంహిత ఆధ్యాత్మిక-ఆధిభౌతిక-ఆధిదైవిక విషయాలను వివరిస్తున్నది. ఈ సంహితలో శారీరకచికిత్సకు సంబంధించిన సూక్తాలు 144 ఉన్నాయి. ఈ సూక్తాల్లో మానవశరీరానికి సంబంధించిన ప్రతి అవయవం యొక్క స్వరూపమూ పేరుపేరునా అభివర్ణింపబడింది. 244 సూక్తాలలో రాజ్యానికి, రాజధర్మానికి సంబంధించిన అనేక విషయాలు చర్చింపబడ్డాయి. సమాజంలో ఉండే అనేక విషయాలతో సమాజస్వరూపం 75 సూక్తాల్లో వివరింపబడింది. ఆధ్యాత్మికవిశేషాలు విపులంగా [illegible] సూక్తాల్లో విశదీకరింపబడ్డాయి. ఇంకా యజ్ఞ యాగాదులను గురించి, దేవతలను గురించి కూడా ఇందులో ఎన్నో విశేషాలు చెప్పబడ్డాయి. ఇతర సంహితలకంటే ఇందులో ఈశ్వరాస్తిత్వవాదం స్పష్టంగా కనబడుతోంది. ఇలా విభిన్నమైన అనేక విషయాల సమగ్రస్వరూపం మనకీసంహితలో కనబడుతుంది.

**సాయణభాష్యం :**

అథర్వవేదానికి సాయణుడు వ్రాసిన భాష్యం సమగ్రంగా కాక అక్కడక్కడ మాత్రమే కనబడుతుంది. పాశ్చాత్యపండితులైన విట్నీ (Whitney) రోథ్ (Roth) లు ప్రకటించిన పాఠానికీ, సాయణుని పాఠభేదాలకు కొన్ని చోట్ల తేడా కనబడుతుంది.

**గద్యపద్యసమ్మిశ్రం :**

అథర్వసంహితలో చాలాభాగం ఛందోబద్ధమైన పద్యాలలో ఉన్నప్పటికీ అందులో కొన్ని గద్యభాగాలు కూడా చోటుచేసుకున్నాయి. 15,16 కాండల్లో 50 సూక్తాలకుపైన, ఇతరకాండల్లో అక్కడక్కడా సుమారు 30 సూక్తాలు గద్యంలోనే కనపడుతున్నాయి. వీటిలో ఛందోనియమాలు ఎక్కువగా పాటింపబడినట్లు కనపడదు. అందుకనే సామాన్యచ్ఛందోనియమాలతో వీటిని విభాగం చేయడం కష్టం.

**భాష :**

అథర్వసంహితలోని భాష ఋక్సంహితలోని భాషకంటే నవీనమైనది. కాని ఇందులో పునరుక్తులతోను ఐంద్రజాలిక విషయ ప్రధానంగాను ఉన్న శైలి మాత్రం దీని ప్రాచీనతను తెలియజేస్తున్నది. ఈ శైలిని గమనించినప్పుడు ఇది ఋగ్వేదంకంటే ప్రాచీనమైనదా? అనే భావంకూడా కలగటం సహజం. అయితే ఇది బ్రాహ్మణ గ్రంథాలకంటే ప్రాచీనమైనదనుకోవడంలో తప్పులేదు.

**అథర్వవేదం - వైదికవాఙ్మయం :**

ఋగ్వేదబ్రాహ్మణాలు ఎక్కడా అథర్వవేదాన్ని పేర్కొనేవు. శతపథబ్రాహ్మణంలోను, తైత్తిరీయబ్రాహ్మణంలోను, తైత్తిరీయా రణ్యకంలోను, ఛాందోగ్యోపనిషత్తులోను ఈవేదం పేర్కొనబడటంవల్ల

అప్పటికే ఒక స్వరూపాన్నిపొందీ ఉండేదని భావింపబడుతున్నది. పతంజలి మహాభాష్యం నాటికి అథర్వవేదం సుస్థిరమైన ప్రతిష్ఠను పొందగలిగింది. కాబట్టే పతంజలి **'అథర్వాదిః వేదః'** అని అథర్వవేదాన్ని ప్రథమవేదంగా పేర్కొన్నాడు. శుక్లయజుర్వేదానికి సంబంధించిన కాత్యాయన శ్రౌతసూత్రం అథర్వవేద ప్రస్తావమే చెయ్యలేదు. ఋగ్వేదానికి సంబంధించిన శాంఖాయన-అశ్వలాయన - శ్రౌతసూత్రాలు ఒకసారి మాత్రం ఈ వేదాన్ని పేర్కొంటున్నాయి.

ఋగ్వేదబ్రాహ్మణాలుగాని, కొన్ని శ్రౌతసూత్రాలుగాని, అథర్వవేద ప్రస్తావం చేయకపోవడానికి కారణం దానిమీద అప్రామాణ్యబుద్ధితో గాదు. అందులో శ్రౌతప్రక్రియకు ప్రాధాన్యం లేకపోవడంవల్లనే. యజ్ఞ సంబంధం ఎక్కువగా ఉండి అభిచారం తక్కువగా గలవి ఋగ్యజుస్సామలైతే, అభిచారం ఎక్కువగా ఉండి యజ్ఞసంబంధం తక్కువగా ఉన్నది అథర్వవేదం. వైదికులు అభిచారాన్ని అధర్మంగా పరిగణించలేదు సరిగదా! కొంతవఱకు ధర్మమేనని ఒప్పుకున్నారు[1].

ఇలా వైదికవాఙ్మయమంతా అథర్వవేదాన్ని ప్రశంసిస్తున్నప్పటికీ లౌకికవ్యవహారాన్ని వివరించే ధర్మశాస్త్రగ్రంథాలు మాత్రం అథర్వవేదం చెప్పే అభిచారకర్మలను తీవ్రంగా ఖండించి, అథర్వవేదాన్ని మొట్టమొదటగా నిందించాయి హింసను నిందించడానికి బయలుదేరిన ధర్మశాస్త్రాలు ఒకరకంగా హింసాత్మక కర్మలను బోధించే అథర్వవేదాన్ని నిందించడంలో ఆశ్చర్యం లేదు అథర్వవేదం చెప్పే కొన్ని అభిచారకర్మలు ఘాతుకమైనవని ధర్మశాస్త్రాలు ఉద్ఘోషించాయి. అందువల్లనే అథర్వవేదానికి కొంచెం తక్కువభావం, అది బోధించిన ఆచారాలకు ధర్మరహితత్వం రానురాను ప్రచారంలోకి వచ్చింది.

---

1. చూ.వై.సా. చ. 232.

**అభిచారం - నింద :**

విష్ణుస్మృతిలో అథర్వవేదం చెప్పిన మారణమనే అభిచార ప్రయోగం చేసేవారు ఏడువిధాలైన (ఉపాంశుఘాతుకులు) చడిచప్పుడు కాకుండా చంపేవారిలో ఒకరుగా చెప్పబడ్డారు. వైద్యులు, జ్యోతిష్కులు కూడ అవైదికులనే ధర్మశాస్త్రనిర్ణయం. ధర్మశాస్త్రాలు ఇన్నిరకాల అథర్వవేదాన్ని నిందించినా, అవే ధర్మశాస్త్రాలు (మనుస్మృతి) శత్రువులను నాశనం చేయడానికి పరంపరగా వచ్చిన పరమాయుధం అథర్వవేదమని దీన్ని ప్రశంసించడం కూడ కనబడుతుంది.

**ప్రచురణ :**

కాశ్మీరపాఠమనే ప్రసిద్ధిగల పైప్పలాదశాఖను మొదట్లో ఎమ్. బ్లూమ్‌ఫీల్డు (M.Bloomfield), ఆర్. గార్బె స్తుత్‌గార్త్ (R. Garbe stutgarth) అనేవారు 1901 లో '**ది కాశ్మీరియన్ అథర్వవేద**' అని ప్రచురించారు[1]. ప్రామాణికపాఠమైన శౌనకశాఖను డబ్ల్యు.డి. విట్నీ (W.D.Whitney) ఆర్. రోత్ (R.Roth) లు 1856లో చక్కగా సంపాదించి బెర్లిన్‌లో ప్రకటించారు. ఈ పాఠాన్నే సాయణభాష్యంతో మనదేశంలో శంకర్ పి. పండిట్ (Sankar P. Pandit) 4 భాగాలుగా బొంబాయిలో 1895-1898 లో ప్రచురించారు ఈ ప్రచురణలో చూపబడ్డ పాఠభేదాలు, విట్నీ, రోత్ పాఠంతో ఏకీభవించడంలేదు. అథర్వవేదానికి పూర్తిగా ఆంగ్లానువాదం దొరుకుతున్నది. 1895 లో ఆర్.టి.హెచ్. గ్రిఫ్ఫిత్ (R.T.H. Griffith) చేసిన అనువాదం మొదటిది. విట్నీ చేసిన అనువాదం (సి.ఆర్.లాన్‌మన్ (C.R.Lanman)

---

1. ఈ కాశ్మీరపాఠంలో 1,2,4,10 అధ్యాయాలను వివరణతో లి రాయ్ కర్ బారెట్ (Le Roy Carr Barret) మరియు ఎఫ్. ఎడ్గార్టెన్ (F. Edgerton) అనే పాశ్చాత్యపండితులు జె.ఎ.ఒ.ఎస్.లో 26,30,32,34,35,37,40-48 భాగాలలో 1906-1923 మధ్య ప్రకటించారు.

సంపాదించినది) రెండవది. ఇది 1905 లో కేంబ్రిడ్జిలో ప్రకటింప బడింది. శ్రీపాద దామోదరసాతవలేకర్. స్వాధ్యాయమండల్‌ద్వారా 1958 లోను, హోషియార్‌పూర్‌లోని విశ్వేశ్వరానన్దవైదిక అనుసంధాన సంస్థద్వారా 1960-64 మధ్యకాలంలోను ఈ వేదం ప్రకటింపబడింది.

**ఉపవేదం :**

రాజనీతి తంత్రాలను, అర్థతంత్రాలను, కృషివాణిజ్యాలను, సమాజనిర్మాణాన్ని సాంగంగా ప్రతిపాదించే అర్థవేదం అథర్వవేదానికి ఉపవేదం. దీన్ని ఆశ్రయించే బృహస్పతి అర్థశాస్త్రం, చాణక్యుని అర్థశాస్త్రం, శుక్రాచార్యుని శుక్రనీతి మొ॥ గ్రంథాలు ఏర్పడ్డాయి. కొందఱు శిల్పవేదం దీనికి ఉపవేదం అంటారు.

**- ఎస్.బి.ఆర్.**

## 5. 2 శాఖలు - విభాగం

**మొత్తంశాఖలు :**

అథర్వవేదానికి సంబంధించిన శాఖలను గురించి అభిప్రాయ భేదం ఉన్నది. పతంజలి తన మహాభాష్యంలో '**నవధాఽఽథర్వణో వేదః**' అని అథర్వవేదానికి తొమ్మిదిశాఖలున్నట్లు పేర్కొన్నాడు. అథర్వణపరిశిష్టచరణవ్యూహం 1. పైప్పలాద 2. స్తౌద 3. మౌద 4. శౌనకీయ 5. జాజల 6. జలద 7. బ్రహ్మవద 8. దేవదశ 9. చారణావైద్యులనే పేర్లతో అవి తొమ్మిదని చెబుతున్నది. చరణ వ్యూహంయొక్క ఇంకొక పాఠం ప్రకారం 1. పిప్పల 2. శౌనక 3. దామోద 4. తోత్తాయన 5. జాబాల 6. కునఖి 7. బ్రహ్మపలాశ 8. దేవదర్శి 9. చారణవిద్యలనే పేరుతో అవి తొమ్మిది. పాంచరాత్రంలో సుప్రసిద్ధమైన అహిర్బుధ్న్యసంహిత అథర్వవేదానికి అయిదు శాఖలున్నట్లు పేర్కొంటున్నది[1].

**ఇప్పుడు దొరికేవి :**

అందులో పైప్పలాద-శౌనకశాఖలు రెండు మాత్రమే ఇప్పుడు లభిస్తున్నాయి. అథర్వవేదపరిశిష్టంలో పైప్పలాదమంత్ర శబ్దంతో స్మరింపబడిన శాఖకే '**పైప్పలాదశాఖ**' అనే ప్రసిద్ధి ఏర్పడింది. ఈ శాఖకు సంబంధించిన, భూర్జపత్రాల్లో వ్రాయబడ్డ ఒకే ఒక వ్రాతప్రతి కాశ్మీరదేశంలో దొరకడంవల్ల దీనికి '**కాశ్మీరపాఠ**' మనే గుర్తింపు కలిగింది. దీనిలో ఎన్నో పాఠభేదాలు, మార్పులు, చేర్పులు, మనకు కనబడతాయి.

---

1. సామ్నాం శాఖాః సహస్రం స్యుః పంచశాఖాహ్యథర్వణామ్ । 12-9
అథర్వాంగిరసో నామ పంచశాఖా మహామునే.॥ అహి.సం. 20-21

రెండవది శౌనకశాఖ. దీన్ని ప్రామాణికపాఠంగా అందరు అంగీకరిస్తారు.

**మొదలు - చివర :**

ఈ సంహిత **'యేత్రిషప్తాః పరియన్తి'** అనే వాచస్పతి దేవతాకమైన మంత్రంతో మొదలై **'వనాయ్యం తదశ్వినా కృతం'** అనే అశ్వినీ దేవతాక మంత్రంతో పూర్తవుతుంది.

**సంహితావిభాగం :**

అథర్వసంహిత ఇరవై కాండలుగ విభజింపబడింది. అందులో 20వ కాండ తరువాత చేర్చబడినట్లు 19వకాండ కూడా మూలానికి సంబంధించింది కానట్లు పాశ్చాత్యపండితుల అభిప్రాయం[2]. ప్రతికాండం ప్రపాఠకాలుగా, అనువాకాలుగా, దశతులుగా, సూక్తాలుగా విభాగం చేయబడింది. ఈ సంహితలో (శౌనకశాఖ) 736 (730?) సూక్తాలు, 5918 మంత్రాలు ఉన్నాయి. అందులో సుమారు 1200 మంత్రాలు ఋగ్వేదంనుంచి యథాతథంగా తీసుకోబడ్డాయి. అందులో చాలాభాగం పది-ఎనిమిది-ఒకటవ మండలాల్లోనుంచి, కొద్దిభాగం ఇతరమండలాల్లో నుంచి పరిగ్రహింపబడ్డాయి. ఇరవయ్యో కాండలో 143 ఋగ్వేదసూక్తాలున్నాయి. అందులో 12 సూక్తాలు తప్పమిగతా సూక్తాల్లో ఋగ్వేదంలో ఉన్న (అనుపూర్వి) క్రమం కనపడదు. ఇతరకాండల్లో ఉన్న మంత్రాలు ఎంతో మార్పుచేయబడ్డాయి.

2. చూ M. Winternitz HIL I - 121

| కాండసంఖ్య | సూక్తసంఖ్య | మంత్రసంఖ్య | కాండసంఖ్య | సూక్తసంఖ్య | మంత్రసంఖ్య |
|---|---|---|---|---|---|
| 1 | 35 | 153 | 11 | 10 | 367 |
| 2 | 36 | 207 | 12 | 5 | 304 |
| 3 | 31 | 231 | 13 | 4 | 188 |
| 4 | 40 | 324 | 14 | 2 | 139 |
| 5 | 31 | 376 | 15 | 18 | 220 |
| 6 | 142 | 454 | 16 | 9 | 103 |
| 7 | 123 | 186 | 17 | 1 | 30 |
| 8 | 10 | 293 | 18 | 4 | 283 |
| 9 | 10 | 313 | 19 | 72 | 456 |
| 10 | 10 | 350 | 20 | 143 | 941 |

- ఎస్.బి.ఆర్.

## 5. 3 శాఖలు - దేశవ్యాప్తి

అథర్వవేదాన్ని మొదట సుమన్తుడు తన శిష్యుడైన కబన్ధునికి రెండుశాఖలుగా ఉపదేశించాడు. అతడా రెండు శాఖలను పథ్యదేవదర్శులకు బోధించాడు. ఈ కబంధుడు మద్రదేశానికి సంబంధించిన వాడని ప్రతీతి. వాళ్లిద్దఱిద్వారానే మిగత శాఖలన్నీ ప్రచారంలోకి వచ్చాయి. పథ్యుడు జాజలి-కుముదాది-శౌనకులనే తన ముగ్గురు శిష్యులకు అథర్వసంహితను బోధించాడు. శౌనకుడు మళ్లా సైన్దవాయన-బభ్రులనే వారికీ ఈ వేదాన్ని అధ్యాపనంచేశాడు. దేవదర్శుడు కబంధునిద్వారా తనకు లభించిన ఈ విజ్ఞానాన్ని మోద, బ్రహ్మబల, పిప్పలాద, శౌష్కాయనులకు నేర్పాడు. తరువాత శౌనకుడు సైన్ధవాయన, బభ్రులకు బోధించగా, మంజుకేశుడు సైన్దవాయనుని నుంచి ఈ సంహిత నధ్యయనం చేశాడు. ఇలా అథర్వసంహిత ఒకప్పుడు దేశమంతటా వ్యాపించింది.

కాలంగడిచేకొద్దీ సమాజం నిరాదరణకు గురైన ఈ వేదానికి సంబంధించిన ఏడుశాఖలు నశించిపోయి శౌనకీయ-పైప్పలాదశాఖలు రెండుమాత్రం మిగిలాయి. అందులో పైప్పలాదశాఖ వ్రాతప్రతి ఒకే ఒకటి కాశ్మీరదేశంలో దొరికింది. దీనిని బట్టి కాశ్మీర ప్రాంతంలో పైప్పలాదశాఖ ప్రచారంలో ఉండి ఉండేదనే ఊహకు అవకాశం ఉన్నది.

మిగత రాష్ట్రాల్లో అక్కడక్కడ ప్రచారంలో కనపడుతున్నశాఖ శౌనకశాఖ. ఈ శౌనకుడు నైమిశారణ్యవాసి అక్కడినుంచే ఈ శాఖ దేశమంతటా వ్యాపించింది. పైప్పలాదశాఖకంటే శౌనకశాఖ నిర్దుష్టమైనది కాబట్టి అది దేశమంతటా బహుళ ప్రచారాన్ని పొందగలిగింది.

పైప్పలాదశాఖప్రతి భూర్జపత్రాల్లో శారదాలిపిలో వ్రాయబడి, కాశ్మీర్‌లో - దొరికింది. కాశ్మీర్ మహారాజు రణవీర్‌సింగ్ ద్వారా దీని ప్రతినే రుడాల్ఫ్‌రాథ్ సంపాదించాడు. దీనిఫోటో కాపీ 1901 లో బాల్టిమోర్ నగరంనుంచి ప్రచురింపబడింది. తరువాత ఈ సంహితకు దేవనాగరిలిపిలో రెండు ప్రతులేర్పడ్డాయి. అందులో ఒకటి ఇప్పటికీ పూనాలోని భండార్కర్ పరిశోధనాలయంలోను, ఇంకోటి బొంబాయిలోని రాయల్ ఏషియాటిక్ సొసైటీలోను భద్రంగా ఉన్నాయి.

**- ఎస్.బి.ఆర్.**

## 5.4 పాఠవిశేషాలు

త్రయి అనబడే ఋగ్యజుస్సామలకంటే అథర్వవేదానికి సంప్రదాయాలలో కొన్ని తేడాలున్నాయి. ఋగ్యజుర్వేదాలకు సంహితా పద క్రమపాఠాలు, జటాది వికృతిపాఠాలు ఉన్నాయి. అయితే ప్రచారంలో అన్నీ మనకు కనపడటం లేదు. కానీ సామవేదానికి గానమే ప్రధానమైన లక్షణం కావడంవల్ల పదపాఠం మాత్రమే మిగిలింది. అథర్వవేదానికి వీటన్నింటికి విరుద్ధంగా సంహితాపాఠం మాత్రమే ఉన్నట్లు తెలుస్తుంది. ఒకప్పుడు పద క్రమ-పాఠాలు ఉండేవేగాని ఇప్పుడు అలాంటివి అధ్యయనంలో కనపడవు. కిరాతార్జునీయంలో వసిష్ఠుడు అథర్వవేదానికి పదపాఠాన్ని చేసినట్లు ఇలా పేర్కొనబడింది. 'కృతపదపంక్తి రథర్వణేవ వేదః '(కిరాత. 10.10). మల్లినాథుడు తన వ్యాఖ్యలో వసిష్ఠుడు అథర్వసంహితకు పదానుపూర్విని రచించాడని స్పష్టంచేశాడు[1]. అథర్వనిధిగ వసిష్ఠుణ్ణి కాళిదాసు పేర్కొనడాన్ని మనం ఇక్కడ స్మరించాలి[1]. వికృతి పాఠాలు ఈ వేదానికున్నట్లు ఏ ఆధారాలు కనపడటం లేదు.

ఇతర వేదాలకంటే అధ్యయనంలో ఇంతటి మార్పు ఇందులో ఉండటం గమనార్హం. ఈ విషయంపైన ఇంకెంతో పరిశోధన జరగవలసి ఉంది.

- ఎస్.బి.ఆర్.

---

1. అథర్వణా వసిష్ఠేన కృతా రచితా పదానాం పంక్తిరానుపూర్వీ యస్య స వేదః చతుర్థవేద ఇత్యర్థః. అథర్వణస్తు మంత్రోద్ధారో వసిష్ఠకృత ఇత్యాగమః మల్లినాథ వ్యాఖ్యా. కిరాత. 10 10

1. అథాథర్వనిధేస్తస్య. రఘు. 1 59

## 5. 5 మంత్రద్రష్టలగు మహర్షులు

అథర్వవేదానికి పూర్వం **'అథర్వాఙ్గిరసః'** అనే పేరు ఉండేది అథర్వుడు, అంగిరసుడు అనేవారి వంశాలకు చెందిన ఇరవైమంది ఋషులు ఈ వేదంలోని అధిక సంఖ్యాకాలైన మంత్రాలను కనుక్కోవడంచేత దీనికి ఆ పేరువచ్చింది. అథర్వునికి నామాంతరం భృగువు అథర్వుడు, అంగిరసుడు కూడా స్వయంభువు అయిన బ్రహ్మ శరీరం నుంచి జన్మించారు స్వయంభుబ్రహ్మ ఈ ఇద్దఱిచేత తపస్సు చేయించగా, వారినుంచి ఇరవైమంది అథర్వాంగిరసులు పుట్టారు. మళ్లా వాళ్లచేత తపస్సు చేయించి, ఆ ఋషులద్వారా స్వయంభుబ్రహ్మ కొన్ని మంత్రాలను కనుగొన్నాడు. మంత్రాలకే **'అథర్వాంగిరసములు'** అనిపేరు అని సాయణాచార్యుడు వ్రాసి ఉన్నాడు

**'ఋషి'** అనేపదానికి 'ద్రష్ట,' అంటే సామాన్యులు చూడలేని విషయాలను తన తపోబలం చేత చూడగలిగినవాడు, అని అర్థం. వేదానికి సంబంధించినంతవరకు **'ఋషి'** శబ్దానికి-తన తపోబలం చేత వైదికమంత్రాలను కనుగొని వాటిని యథాతథంగా, తనకు గోచరించిన విధంగా, తరువాతివారికి అందజేసినవాడు, అని అర్థం. ఋగ్యజుస్సామవేదాలలోని వివిధమంత్రాలను కనుగొన్న ఋషులు ఎందఱో ఉన్నట్లే అథర్వవేదాన్ని దర్శించిన మహర్షులుకూడా చాలా మంది ఉన్నారు.

నేడు అధికప్రచారంలో ఉన్న అథర్వవేద శౌనకీయశాఖలోని **736** సూక్తాలలో **5,918** మంత్రాలు ఉన్నాయి. ఈ వేదం **20** కాండలుగా విభజింపబడింది. ఇరవయ్యోకాండలో ఉన్న ఋక్కులన్నీ ఋగ్వేదంలో కూడా ఉన్నాయి. ఇవి కాకుండా మిగిలిన కాండల్లో ఉన్న ఏడువంతులలో ఒకవంతు ఋక్కులు కూడా ఋగ్వేదంలో ఉన్నవే.

ఈ రెండు వేదాలలోనూ సమంగా ఉన్న ఋక్కులకు సంబంధించి నంతవరకు ఋషులు కూడా తుల్యులే అయివుండాలని భావించడం సహజం. కాని. కొన్ని ఋక్కులఋషులు వేరువేరుగా చెప్పబడి ఉన్నారు. ఈ వేదానికి సంబంధించిన ఋషుల నామధేయాలు మాత్రమే కాని, వీరి వైయక్తిక చరిత్రనుగూర్చి మనకేమీ తెలియదు. కొందరు వసిష్ఠ, వామదేవ, విశ్వామిత్రాదుల కథలు పురాణాల్లో కనబడినా ఈ వేదంలో మాత్రం వారిని గూర్చిన విశేషాలు ఎక్కువగా లభించవు.

**1. అథర్వుడు :**

ఈ సంహితలో **148** సూక్తాలను దర్శించిన ఋషి అథర్వుడు. ఇతనినే అథర్వణుడనీ అంటారు ఇతడే అథర్వవేదానికి మూల పురుషుడు. ఇతడు బ్రహ్మ ముఖంనుంచి పుట్టాడు. కర్దమపుత్రికయైన శాంతి ఇతని భార్య. ఈమెకే **'చిత్తి'** అనే పేరున్నది. కాని కొన్ని పురాణాలలో చిత్తి రెండవ భార్యగా చెప్పబడింది. భాగవతం అథర్వుణ్ణి వసిష్ఠపుత్రునిగా పేర్కొంటున్నది అథర్వుడే అంగిరసుడని కొన్ని పురాణాలు చెబుతున్నాయి. ఈ పేరుగల ఋషి మహాభారతంలో వేదపాఠకుడుగా వర్ణింపబడ్డాడు. ఒకసారి భృగుమహర్షి శాపంవల్ల అగ్ని సముద్రంలో దాక్కొంటే దేవతల కోరికపై అథర్వుడు అతన్ని కనుక్కొన్నాడు. ఇతడు బ్రహ్మద్వారా బ్రహ్మవిద్యను తెలిసికొని మొట్టమొదట అగ్నిని భూమిపైకి తీసికొనివచ్చాడు.

**2. భృగువు :**

**30** సూక్తాలను దర్శించిన మహర్షి భృగువు. ఇతడు బ్రహ్మయొక్క కుమారుడు. భృగువంశానికి మూలపురుషుడీతడే. ఈ వంశీయులను భార్గవులని అంటారు. బ్రహ్మ చర్మంనుంచి పుట్టిన భృగువు దక్షయజ్ఞ

వాటికలో మరణించాడు ఇతడే తిరిగి వరుణుని బ్రహ్మయజ్ఞ స్తమయంలో అగ్ని నుండి పుట్టినందువల్ల ఇతనికి రెండు జన్మలున్నట్లు పురాణాలు పేర్కొంటున్నాయి. ఇంద్రపదవినుంచి నహుషుని తొలగించడానికి అగస్త్యునికి భృగువే సలహా ఇచ్చాడని ప్రతీతి.

**3. వసిష్ఠుడు :**

వసిష్ఠుడు అథర్వసంహితలో 14 సూక్తాలను దర్శించాడు (చూ. పే.27).

**4. విశ్వామిత్రుడు :**

ఈ సంహితలో 13 సూక్తాలకు ద్రష్ట విశ్వామిత్రుడు (చూ పే.29).

**5. శౌనకుడు :**

10 సూక్తాలను దర్శించిన ఋషి శౌనకుడు. ఇతణ్ణి '**ఋగ్వేదానుక్రమణి**' '**అరణ్యకం**' '**ఋక్ప్రాతిశాఖ్య**'లకు కర్తగా పేర్కొంటారు. ఆశ్వలాయనాచార్యులు ఇతని శిష్యుడు. కాత్యాయన, పతంజలి, వ్యాసులుకూడా ఈ కోవకు చెందినవారే. ఇతని అసలు పేరు '**గృత్సమదుడు**' శునకుని కుమారుడైనందువల్ల ఇతనికాపేరు వచ్చిందని అంటారు.

**6. శుక్రుడు :**

అథర్వసంహితలో [illegible] సూక్తాలను దర్శించిన మహర్షి శుక్రుడు. ఈ పేరుకల వ్యక్తి విష్ణుపురాణంలో వసిష్ఠుని పుత్రుడుగా పేర్కొనబడ్డాడు. వసిష్ఠునికి, ఊర్జకు కలిగిన ఏడుమంది పుత్రులలో ఇతడు ఒకడు.

**7. అంగిరసుడు :**

8 సూక్తాలకు ద్రష్ట అంగిరసుడు. ఇతడు బ్రహ్మ మానసపుత్రుడు. అంగిరసునికి శుభ, స్మృతి, శ్రద్ధ, దేవసేన, వసుద అని ఐదుగురు భార్యలు. బృహత్కీర్తి, బృహజ్జ్యోతి మొ॥ ఏడుగురు కొడుకులు. భానుమతి, సినీవాలి, రాకా మొ॥ ఎనిమిదిమంది కూతుళ్లు ఉన్నారు. ఒకసారి అంగిరసుడు తపస్సు చేస్తున్న ధ్రువుణ్ణి ఆశీర్వదించినట్లు విష్ణుపురాణం పేర్కొంటున్నది అంగిరసుని గౌరవించని కారణంగా అగ్ని శపించబడ్డాడు. తత్ఫలితమే అగ్ని నుంచి పొగరావడం (భార. అను.). ఒకప్పుడు సముద్రపునీటిని త్రాగి, దాహం తీరక క్రొత్తగా నీటిని సృష్టించి, ఆ నీటిని కూడా త్రాగిన మహనీయుడు అంగిరసుడు.

**8. శునఃశేపుడు :**

8 సూక్తాలను దర్శించిన ఋషి శునఃశేపుడు (చూ.పే.148).

**9. గోతముడు :**

7 సూక్తాలను దర్శించిన ఋషి గోతముడు (చూ.పే.32).

**10. ప్రస్కణ్వుడు :**

ఇతడు అథర్వసంహితలో 6 సూక్తాలను దర్శించాడు. ఈ పేరుకల వ్యక్తులు ఇద్దఱు ఇతిహాసాలలో పేర్కొనబడ్డారు. అందులో ఒకరు మేధాతిథి కుమారుడు. ఇంకొకరు కణ్వుని కుమారుడు.

**11. వామదేవుడు :**

5 సూక్తాలను దర్శించిన ఋషి వామదేవుడు (చూ.పే.30).

**12. మధుచ్ఛందుడు :**

ఇతడు 5 సూక్తాలకు ద్రష్ట (చూ.పే.147).

**13. భరద్వాజుడు :**

ఇతడు అథర్వసంహితలో 4 సూక్తాలను దర్శించాడు (చూ పే.28).

**14. అగస్త్యుడు :**

ఈ సంహితలో 4 సూక్తాలను దర్శించిన మహర్షి అగస్త్యుడు (చూ పే 32).

**15. సౌభరి :**

సౌభరి అదర్వసంహితలో 2 సూక్తాలను దర్శించాడు (చూ పే 350).

**16. మేధాతిథి :**

ఇతడు 2 సూక్తాలకు ద్రష్ట (చూ.పే.146).

**17. జమదగ్ని :**

ఇతడు అథర్వసంహితలో ఒక సూక్తం దర్శించాడు (చూ.పే.148).

పైన పేర్కొనబడిన ఋషులేకాక, అంగిరః ప్రచేతసుడు, అజమీళ్హుడు, అథర్వాకృతి, అథర్వాచార్యుడు, అథర్వాంగిరసుడు, అథర్వణభృగువు, అప్రతిరథుడు, అయాస్యుడు. అశ్వసూక్తిగోషూక్తులు ఇరింబిఠి, ఉచ్ఛోచనుడు, ప్రశోచనుడు, ఉద్దాలకుడు, ఉన్మోచన ప్రమోచనలు, ఉపరిబభ్రవుడు, ఋభువు, కపింజలుడు, కబంధుడు, కలి, కశ్యపుడు, కాణుడు, కాంకాయనుడు, కురువు, కృష్ణుడు, కౌరుపథి, కౌశికుడు, గరుత్మంతుడు, గవ్యుడు, గార్గ్యుడు, గృత్సదుడు, గోపథుడు,

చాతనుడు, జగద్బీజ పురుషుడు, జాటికాయనుడు, త్రిశోక్యుడు, దేవాతిథి, ద్రవిణోదస్సు, ద్రుహ్వణుడు, నారాయణుడు, నిర్భతీయుముడు, నృమేధుడు, నోధా, పతివేదనుడు, పరుచ్ఛేపుడు, పార్వతుడు, పురుహన్మ, పురుమీళ్ఢుడు, ప్రజాపతి, ప్రత్యంగిరసుడు, ప్రమోచన ప్రశోచనులు, ప్రియమేధుడు, బభ్రుపింగళుడు, బాదరాయణి, బృహస్పతి, బృహచ్ఛుక్రుడు, బృహద్దివోథర్వుడు, బ్రహ్మ, బ్రహ్మర్షి, బ్రహ్మస్కందుడు, భగుడు, భర్గుడు, భాగలి, భార్గవుడు, భార్గవవైదర్భి, భృగు ఆథర్వణుడు, భృగ్వంగిరసుడు, భృగ్వంగిరాబ్రహ్మ, మయోభువు, మాతృనామ, మాయు, మారీచకశ్యపులు, మార్ష్టి-మార్ష్ట్యుడు, మృగారుడు, మేధ్యాతిథి, యముడు, యయాతి, రేభుడు, వత్సుడు, విరూపుడు, వీతహవ్యుడు, వృషాకపి, వేనుడు, శక్తి, శశికర్ణుడు, శిరింబిఠుడు, శంతాతి, శంభు, శంయువు, శ్రుష్టి, సవిత, సావిత్రీసూర్య, సింధుద్వీపుడు, సుకక్షుడు, (సుతకక్షుడు), సుకీర్తి సుశబ్దుడు, సౌదాసుడు కూడా అథర్వసంహితలో సూక్తాలను, సూక్తాలలో కొన్ని మంత్రాలను దర్శించారు.

అథర్వవేద సూక్తాలన్నింటినీ, వాటి ఉపయోగాలను బట్టి కొన్ని గణాలుగా విభజించి, వాటికి ప్రధానఋషిని చెప్పడం కూడా సంప్రదాయసిద్ధంగా ఉంది. ఆగణాలు ఇవి

1. శంతాతీయగణం-శంతాతి ఋషి 2. భైషజ్యగణం-అథర్వుడు, 3,4. రుద్రగణ-రౌద్రగణాలు-అథర్వుడు, 5. శాంతిగణం - బ్రహ్మ, 6. కృత్యాప్రతిహరణగణం - శుక్రుడు, 7. చాతనగణం - చాతనుడు, 8. మాతృనామగణం - మాతృనామ 9. వాస్తోష్పతిగణం - బ్రహ్మ, 10. పాప్మహగణం - బ్రహ్మ, 11. తక్మనాశనగణం -

భృగ్వంగిరసుడు, 12. దుఃస్వప్ననాశనగణం - యముడు, 13. ఆయుష్య గణం - బ్రహ్మ, 14. వర్చస్యగణం - అథర్వుడు, 15,21. స్వస్త్యయన - అభయ, అపరాజిత - శర్మవర్మ - దేవపురీయ - చిత్రాగణ పాత్నీవతగణాలు - అథర్వుడు, 22. ఆదిత్యగణం - బ్రహ్మ, 23. పాంచపత్యగణం - అథర్వుణుడు 24. సలిలగణం - బ్రహ్మ, 25. విశ్వకర్మగణం - అథర్వణుడు, 26. అర్ధముత్థాపనగణం - అథర్వుడు 27. రాజ్యాభిషేకగణం - బ్రహ్మ, 28. అంహోలింగగణం- అథర్వుణుడు.

- పి.ఎస్.ఆర్.

## 5. 6 దేవతలు

ఋగ్వేదం, సామవేదం, యజుర్వేదం ఈ మూడింటిలో ఉండే ప్రధానదేవతలందరి ప్రసక్తి అథర్వవేదంలో ఉంది. అంతేకాదు, ఈ వేదం ప్రజాజీవితాన్ని వారి ఆచారవ్యవహారాలను, నమ్మకాలను ప్రతిఫలించడంవల్ల అంతవఱకు కేవలం యజ్ఞయాగాదులకు మాత్రమే పరిమితమైన ఈ దేవతలు అథర్వవేదంలో ఆనాటి ప్రజాజీవితంలో కూడా పాలుపంచుకొని, వారి కష్టనష్టాలను తొలగించే వారుగాను, వారికి ఐహికసంపత్తిని ఒనగూర్చేవారుగానూ స్తోత్రం చేయబడ్డారు. ఇందులో ఆనాటి ప్రజల విశ్వాసాలు గూడ చోటు చేసుకున్నాయి. వశీకరణ, మారణ, వ్యామోహనాది తంత్రవిద్యల్లోను, సంపత్కరాలు, పుష్టికరాలు అయిన మంత్ర విద్యల్లోను, పిశాచాలు, కృత్యలు, ఓషధులు, మొ॥ వాటిని ఉపయోగిస్తూ, ప్రార్థిస్తూ, వాటికి సహకారంగా, ప్రోద్బలకంగా ఉత్తేజకారకంగా వేదదేవతలనుకూడా ప్రార్థించటం, ఆవాహనచేయటం అథర్వవేదంలో కనిపిస్తుంది. అందువల్లనే ఈ వేదంలో చాలచోట్ల మనోహరాలు, ఆనందదాయకాలైన దేవతా స్వరూపాలు కనిపిస్తున్నా, ■ దేవతలనే మరికొన్నిచోట్ల క్షుద్రవిద్యలకు ఉపస్కారకంగా ప్రార్థించటంవల్ల, అథర్వవేదం అంతా కేవలం ఒక **'తంత్ర ప్రక్రియాసాధన'** అనే అపోహ కలుగుతున్నది. కాని, ప్రతి దేవతకు ఈ వేదంలో ఒక శుభకరమైన రూపం, అమంగళకరమైన ప్రార్థన గూడ ఉండటం మనం గమనించవచ్చు. అథర్వవేదంలో గల కొన్ని దేవతాస్వరూపాలను పరిశీలిస్తే ఈ విషయం ప్రస్ఫుటమౌతుంది.

### 1. ఇంద్రుడు :

అథర్వవేదంలో 156 సూక్తాల్లో ప్రముఖంగా స్తుతింపబడ్డవాడు ఇంద్రుడు. ధనప్రదాతగా వర్షాన్ని ఇచ్చేవాడుగా, శత్రువులపై విజయం

సిద్ధించటానికి కారకుడుగా ఇంద్రుడిని స్తోత్రం చేస్తారు ఈ వేదర్షులు. ఇతడు వరుణుడు, సోముడు మొ॥ దేవతలతోపాటు సంపదలను వృద్ధిచేస్తాడు (1.2.3). ధనంజయుడు అని కూడ ఇతణ్ణి పిలుస్తారు (3.14.2). శచీపతి అయిన ఈ ఇంద్రుడు మాఘకృష్ణాష్టమినాడు (ఏకాష్టకా) పుట్టాడు (10.12). వాణిజ్యంలో లాభాలు రావటానికి, గోసంపదను అభివృద్ధిచేయటానికి ఇతడు దోహదం చేస్తాడు (3.3.5). ఇంద్రుని వజ్రాయుధం నీళ్లలో ఉన్న రాక్షసులను చంపుతుంది. (2.1.4). సర్వరాజుల్లో ప్రథముడైన వృత్రాసురుణ్ణి చంపిన ఇంద్రుడు సోమపానం చేసేవాడు. శక్రుడు, మఘవాన్ అనే నామాంతరాలుగల ఇంద్రుడు బలాన్ని, వీర్యాన్ని ప్రసాదించగలడు (2.1.5). శత్రుసంహారానికి బయలుదేరేటప్పుడు ఇంద్రుణ్ణి ప్రశంసించాలి (5.4.5). అగ్ని మొ॥ దేవతలలాగా ఇంద్రుడుగూడ శత్రువులను భ్రమింపజేసి పెడమార్గాన్ని పట్టించగలడు (3.1.1). ఇందువల్ల శత్రువులు రాష్ట్రంలో ప్రవేశించకుండా చేయగలడు (3.1.1, 2.3.). భూమిని దున్నేటప్పుడు నాగటిచాలును ఇంద్రుడు ఏర్పరుస్తాడు (3.4.2). రాక్షసబాధా నివృత్తికోసంగూడ ఇంద్రుడు సహాయంచేస్తాడు (3.5.1). పట్టపుటేనుగుకు ఇంద్రుడు వర్చస్సును కలిగిస్తాడు (3.5.2). దక్షిణదిక్కుకు అధిపతి ఇంద్రుడని అథర్వవేదం చెబుతున్నది. ఈ దిక్కునుంచి వచ్చే శత్రువులను ఇంద్రుడు సంహరిస్తాడు (3.6.2).

ఉపనయనంలో బ్రహ్మచారి పాపాలను ఇంద్రుడు తొలగిస్తాడు (3.6.6). వృషభోత్సర్జనంలో సర్వదేవతాస్వరూపుడు, విశ్వాన్ని జయించినవాడు, విశ్వాన్ని భరించేవాడయిన ఇంద్రుడు వృషభాన్ని రక్షించుగాక! అని కీర్తింపబడతాడు. అభిచారికకర్మలు చేయటానికి, సహాయం చేయటమే కాకుండా (3.4.4, 3.2.1) ఇతరులు అలాంటి ప్రయోగాలను చేస్తే వాటినుంచి రక్షిస్తాడు (4.4.4). అన్నీతెలిసిన పరాక్రమవంతుడు ఇంద్రుడు. ఇతని లోకంలో నివసించాలని

సోమయాగం చేసినవారు వాంఛిస్తారు. ఈయనతోనే సర్వవైదిక కర్మలూ ప్రారంభమయ్యాయి. ఈయన యుద్ధాలను చేయిస్తాడు (5.5.4). శత్రురాజులపై గల కోపం ఇంద్రుని దయవల్ల ఓజస్సును పొందుతుంది (5.7.2). ఇతని ఖడ్గాలు భయంకరాలైన పిశాచాదులను నాశనం చేస్తాయి (4.8.2). సర్వఫలాలను ఇచ్చే ఓషధులను బ్రహ్మ ఇంద్రుడికి ఇచ్చాడు. అవి పుష్టిని కలుగజేస్తాయి. ఇంద్రుడు సమస్తసుఖాలను ఇస్తాడు (5.1.3). మనల్ని ద్వేషించే శత్రువులను ఇంద్రుడు మృత్యువువైపు తీసుకుపోతాడు (5.2.3). ఇంద్రునికి కవచం, సేన కూడ అగ్నియే (5.2.1). పట్టణాల్లోను, గ్రామాల్లోనూ గల శిలలను, మట్టిని ఇంద్రుడు రక్షిస్తాడు. జ్వరాలను కలుగజేసే క్రిములను నాశనం చేస్తాడు (5.2.3).

**2. అగ్ని :**

సమస్త వైదికసాహిత్యంలో ప్రధానదేవత అగ్ని. అథర్వవేదంలో [illegible] సూక్తాల్లో స్తుతింపబడ్డ అగ్నికి ఈ ప్రాధాన్యం కనిపిస్తుంది. రాక్షసులను, దస్యులను పారద్రోలటానికి అగ్నిని స్తోత్రం చేయటం జరిగింది. "దేవశత్రువులు దేవతలకిచ్చే హవిస్సులను దొంగిలిస్తారు. కాబట్టి ఓ పరమేష్ఠీ! జాతవేదా! అగ్నిదేవా! ఇంద్రుడు హర్షించేటట్లుగా తన పరాక్రమంతో ఈ శత్రువుల శిరస్సులను ముక్కలు చేసేట్లుగా, అతని దగ్గర అందరూ నిన్ను స్తుతించేట్లుగా నీ పరాక్రమాన్ని ప్రదర్శించు. నీ వీరత్వాన్ని మాకందరకు చూపించు" ఈ విధంగా దేవతలందరూ అగ్నిదేవుని ప్రార్థిస్తారు. ఈ అగ్ని బృహస్పతి చెప్పినవిధంగా నడుచుకుంటూ అగ్నిష్టోమకర్మలో హవిస్సును రక్షిస్తాడు (1.2.1,2) హవిస్సు అగ్నితాపంవల్ల అగ్నితోనే పుట్టింది (4.3.4). సోమునితో మరుద్దేవతలతో పాటు అగ్నిదేవుడు గూడ శత్రువులను శాసిస్తూ ఉంటాడు (1.4.4;2.4.2). సేనాసంక్రమసమయంలో అగ్ని కూర్చునిఉండి రక్షిస్తూ ఉంటాడు (3.6.2). శత్రువులకు భ్రమకలిగిస్తూ

ఉంటాడు (3.1.1). అగ్ని ఆయుర్భాగ్యాన్ని కలుగజేస్తాడు (2.3.3.). ఉపనయన సమయంలో వటువు పుష్టికోసం అగ్నిని పార్థిస్తారు (3.2.5). వటువు ప్రాణాన్ని అగ్ని రక్షిస్తూ ఉంటాడు (3.6.6). అతణ్ణి ఎప్పుడూ కాపాడుతూ ఉంటాడు (3.2.2).

చాలాకాలం వరకు వివాహం కాకుండా ఉన్న స్త్రీ, పతిలాభం పొందటానికి అగ్ని సహాయం చేస్తాడు (2.6.5). బాలగ్రహాది దోషాలవల్ల, అధికసంభోగాది దోషాలవల్లవచ్చే శారీరక క్షయపీడితులకు శతాయుస్సును ఇవ్వవలసిందిగా మిగతా దేవతలతో పాటు అగ్నిని గూడ ప్రధానంగా ప్రార్థించడం జరుగుతుంది (3.3.1). వాణిజ్యంలో లాభానికి, వ్యాపారంకోసం ఇతరదేశాలకు వెళ్లినపుడు బాధలు కలుగకుండా చూడటానికి, అగ్నిని శరణుపొంది ఆయన అనుగ్రహాన్ని ఇలా కోరాలి. "జాతవేదుడు మాకు వృద్ధిని, బలాన్ని కలిగించు గాక! ఆయన దయవల్ల మాకు నష్టం రాకుండా ఉండు గాక!" (3.3.5). మేధావృద్ధికి గూడ అగ్నిస్తోత్రం ఉంది (3.4.1). స్వగృహంలోను, పశుశాలల్లోను, రాక్షసాది బాధానివృత్తి కోసం చేసే హోమంలో పాల్గొనే దేవతలందరిలో అగ్నిని జ్యేష్ఠుడుగా కీర్తించారు అథర్వఋషులు (3.5.1).

శాంత్యుదకాలను అభిమంత్రించేటప్పుడు 'అగ్ని ఈ ఉదకంలో ప్రవేశించుగాక! ఏ అగ్నివల్ల దేవతలు అమృతాన్ని పొందారో, ఏ అగ్నివల్ల ఓషధులు పెరుగుతాయో, ఆ అగ్నిని హవిస్సుతో తృప్తి పరుస్తాము (4.5.3). అగ్ని తన తేజస్సును అన్నివైపులకు ప్రసరింప చేసినట్లుగా, ఈ ఉదకం అందరినీ రక్షించుగాక!' (4.7.3) అని ప్రార్థించటం జరుగుతుంది. భూమికి అగ్నికి అవినాభావ సంబంధం ఉన్నది. భూమి ఆవుగాను, అగ్ని దూడగాను వర్ణింపబడ్డాయి (4.7.4). అగ్ని ఇంద్రునికి నివాసం. అతడు ఇంద్రునికి క్షేమకరుడు.

కవచంవంటివాడు (5.2.1). ఈ విధంగా దృష్టిదోషం (దిష్టి) పోగొట్టే కర్మలో అగ్ని వర్ణింపబడ్డాడు. దృష్టిదోషోపహతుణ్ణి అగ్ని, ఇంద్రుణ్ణి రక్షించినట్లుగా రక్షిస్తాడట.

కామ్యకర్మల్లోగూడ అగ్నిస్తోత్రం ఉంటుంది. "ఓ అగ్నీ! దేవతలకు సహాయం చేసినట్లుగా, నీవు మనుష్యులకు గూడ సహాయంచేయాలి" అని అగ్నిని ప్రార్థించటం జరుగుతుంది. అదేవిధంగా అభిచారకర్మలో **'కృత్య'** ను నాశనం చేసేటప్పుడు ఓ అగ్నీ! నీలో దగ్ధమవుతున్న ఈ రాక్షసులను సంహరించు (5.3.4) అని అగ్నిని వేడుకుంటారు. గోధనాన్ని దొంగలు తోలుకుపోయినప్పుడు వాటిని తిరిగి పొందటానికి చేసే ప్రార్థనలో 'వరుణుడు, మిత్రుడు మొ॥ వారితో పాటు అగ్ని కూడ తన హస్తాలతో గోవులను మరలించుకొని వచ్చుగాక!' అని ఆర్తులు ప్రార్థిస్తారు (5.4.2,3).

### 3. సూర్యుడు-ఆదిత్యుడు-మిత్రుడు :

ఋగ్వేదంలో వర్ణింపబడిన మిత్రుడే తరువాత సూర్యుడుగా, పూషగా, ఆదిత్యుడుగా అథర్వవేదంలో అభివర్ణింపబడ్డాడు ఇంద్రాదిదేవతలలాగా, ఈయన ధనాన్ని ఇచ్చేదేవతగా వర్ణింపబడ్డాడు (1.2.4). పూష్ణరూపంలో సుఖప్రసవాన్ని కలుగజేసేవాడుగా (1.2.5), ఆదిత్యరూపంలో వాతపిత్తాదిరోగాలను నివారించేవాడుగాను స్తోత్రం చేయబడ్డాడు (1.3.1). సూర్యరూపంలో కామెర్లరోగాన్ని పోగొడతాడు (1.5.1.). సవితృరూపంలో సర్వశస్త్రబాధలను నివారిస్తాడు (1.5.5). మిగతా దేవతల్లాగా సూర్యుడు కూడ మనం ద్వేషించేవారిని, మనలను ద్వేషించేవారిని నశింపచేస్తాడు (2.4 4) చౌలం, కేశఖండనం మొ॥ స్మార్తకర్మల్లో మిత్రరూపంలో కుమారుని రక్షింపవలసిందిగా సూర్యుని ప్రార్థించటం జరుగుతుంది (2.5.2). వడదెబ్బ కొట్టినవారికి సూర్యుడు వర్చస్సును ఇస్తాడు సవితృరూపంలో ధనాన్ని, బలాన్ని ఇస్తాడు.

త్వష్టృరూపంలో సంతానాన్ని ఇస్తాడు (2.5.3). ఉదయిస్తున్న ఆదిత్యుడు గోవులకు రోగాలను కలిగించే క్రిములను చంపుతాడు (2.6.1.). అభిచారకర్మలో అశ్వత్థవృక్షాన్ని పార్థించేటప్పుడు సూర్యునినుంచి మిత్రరూపంలో సహాయాన్ని అభ్యర్థించడం జరుగుతుంది. ఉపనయనంలో వటువును మిత్ర, సవితృ, త్వష్టృరూపంలో రక్షిస్తాడు (3.2.3). బాలగ్రహశాంతికీ, క్షయ, కుష్ఠు మొ॥ రోగాల నివారణకు సవితృరూపంలోను, సూర్యరూపంలోనూ అనుగ్రహిస్తాడు (3.3.1;5.2.4). గృహ, గోష్ఠాదుల్లో రాక్షసబాధను హిరణ్యపాణియైన సవిత తొలిగిస్తాడు (3.5.1). జూదంలో పాచికలను వేసేటప్పుడు 'ఈ పాచికలు సూర్యకిరణాలులాగా ఉన్నాయి' అని వర్ణించడం జరిగింది (4.7.7). దేదీప్యమానుడై, మేఘాలనుంచి విడువబడ్డ సూర్యుడు, ఉపనయనానంతరం వటువుని, ఆచార్యుణ్ణీ రాక్షసబాధనుంచి రక్షిస్తాడు (4.2.4).

**4. సోముడు - చంద్రుడు :**

అగ్నిషోమాత్మకమైన క్రతువులో సోముడొక ప్రధానదేవత. సోమలత యజ్ఞాంగమైన ప్రధానద్రవ్యం. సోముడే ఒక ప్రత్యేకదేవతగా అథర్వవేదంలో ప్రస్తుతింపబడ్డాడు. కులపాంసని (కులాన్ని అపవిత్రంచేసేది) అయిన స్త్రీకి కష్టనష్టాలు కలుగజేయవలసిందిగా సోముని ప్రార్థించటం జరుగుతుంది (1.3.3). ఈయన అవివాహితయైన స్త్రీకి సౌభాగ్యాన్ని ప్రసాదిస్తాడు (2.6.5). ఈ సందర్భంలో సోముని రాజుగా అభివర్ణించింది అథర్వవేదం. వాణిజ్యంలో లాభంకోసం చేసే ప్రార్థనలో గూడ ఇంద్రుడు, ప్రజాపతి మొ॥ దేవతలతోబాటు సోముని ప్రసక్తికూడ ఉన్నది (3.3.5). గృహగోష్ఠాదుల్లో రాక్షసబాధా నివృత్తికోసం సోముడు కూడా సహాయం చేస్తాడు (3.5.1). శత్రుసంహారానికి వెళ్తూ ఉన్న సేనానివహాన్ని సోముడు ఉత్తరంవైపు నుంచి రక్షిస్తాడు (3.6.1).

కుష్ఠువ్యాధినివారణకు ఇచ్చే మందు సోముని సఖిగా వర్ణింపబడింది (5.1.4). గోహరణం జరిగినప్పుడు ఆ గోవులను తిరిగి పొందే ప్రయత్నంలో పఠించే మంత్రంలో సోముడు అందరికీ రాజుగానూ, వేదాన్ని అభ్యసించేవారిలో ప్రథముడుగానూ వర్ణింపబడ్డాడు వరుణుడు, అగ్ని మొ॥ ఇతరదేవతల సహాయంతో సోముడు కూడ, దొంగిలింపబడ్డ గోధనాన్ని తిరిగి తేగలడు (5.4.2,3). శత్రువుల సంహారానికి బయలుదేరేటప్పుడు మోగించే భేరిని ఇంద్రాది దేవతలతోబాటు సోముడు కూడ రక్షించగలడు (5.4.5).

**5. ఉదకం :**

ఈదేవతలు 19 సూక్తాలలో స్తుతింపబడ్డారు. ఉదకాలను తల్లులుగాను, దేవతలుగాను, వాటి అనుగ్రహంవల్ల గోసంపద వృద్ధిపొందీ ఆజ్యాది హవిస్సులు సమకూరేటట్లుగాను, ఓషధులు పెంపొంది సర్వరోగాలూ నివారింపబడునట్లుగాను స్తోత్రం చేశారు అథర్వఋషులు (1.1.4,5,6). ఉదకాలకు రాజు వరుణుడు. వాటిని శరీరశుభ్రతకోసం అభ్యర్థించాలి (1.6.5). వంశపరంపరగా వస్తున్న కుష్ఠు, క్షయ మొ॥ రోగాలశాంతికి ఉదకాలలో ఉన్న భగవతి **'తారక'** దేవతనుప్రార్థించాలి. ఈ దేవత మూలానక్షత్రాధిదేవత అని సాయణ భాష్యం చెబుతున్నది. అగ్ని వాయ్వాదిదేవతల్లాగా ఉదకం గూడ తమను ద్వేషించేవారిని నాశనం చేస్తుంది అని భావించారు అథర్వఋషులు (2.5.6).

**6. మరుద్దేవతలు :**

మరుత్తు (వాయువు) నుంచి సూర్యుడు పుట్టాడు. పృథివి గూడ పుట్టింది (4.5.5) అని అథర్వవేదం చెబుతున్నది. ఈ మరుత్తులు వర్షాన్ని కలిగిస్తాయి. ఇవి కొత్తవిత్తనాలను రక్షిస్తాయి. (3.3.2).

**7. వాచస్పతి - బృహస్పతి :**

విద్యలను నేర్చుకోవడానికి, నేర్చిన విద్యలను పోషించుకోవడానికి ఉపాసింపవలసిన దేవతగా ప్రధానంగా వాచస్పతి అథర్వవేదం మొదటి సూక్తంలో వర్ణింపబడ్డాడు. "ఓ వాచస్పతీ! నీవు మూడు, ఏడు రూపాలలో ప్రపంచాన్ని నిలబెడుతున్నావు. మాకు గూడ అట్టి బలాన్ని ప్రసాదించు. నావిద్యనంతా దివ్యమైన మనస్సుతో నాలోనే ఉండనివ్వు(అంటే) మేము చదివిన చదువులను మరచిపోకుండా ఉందుము గాక!" అని ప్రార్థిస్తున్నారు అథర్వఋషులు (1.1.1,2). ఈయన బృహస్పతి రూపంలో గోసంతతిని అభివృద్ధి చేస్తాడు (2.4.9). నూతనగృహనిర్మాణానికి భూమిని బాగుచేసేటప్పుడు, ■ భూమిని రక్షించవలసిందిగా బృహస్పతిని అభ్యర్థిస్తారు (3.3.2). అభిచారకర్మలో కూడా ఈయన ప్రశంస ఉంది. ఈ కర్మసంబంధమైన హవిస్సులో ఈయనకు కూడ భాగమున్నది (3.4.5).

శత్రుజయం కోసం సాగే సేనానివహాన్ని ఊర్ధ్వదిశలో బృహస్పతి రక్షిస్తాడు. ఈ వాచస్పతి లేక బృహస్పతి మొదట జన్మించిన దేవతగా (ప్రథమజో దేవః), సర్వవిఘ్ననివారకుడుగా, సమ్రాట్, కవి, ఆథర్వణుడు, పరబ్రహ్మ రూపంగా భావింపబడ్డాడు (4.1.1). ఈయనే అనిర్వచనీయమైన దేవుడు (కస్మై దేవాయ హవిషా విధేమ) హిరణ్యగర్భస్వరూపుడు (4.1.2). 'బ్రహ్మణస్పతీ! రాష్ట్రాన్ని వృద్ధిపొందించు, శత్రువులనుంచి, దస్యులనుంచి నా రాష్ట్రాన్ని రక్షించు' అని రాజు వాచస్పతిని ప్రార్థిస్తాడు (1.6.1).

**8. రుద్రుడు :**

ఈ దేవత 11 సూక్తాల్లో స్తుతింపబడ్డాడు. సంతాననష్టం కలుగుతూఉన్న స్త్రీకి సంతతి నిలవాలని భూతపతియైన రుద్రుణ్ణి ప్రార్థిస్తారు (3.3.4). సభవివాదంలో జయానికి ఒక ఓషధిని (బహూశః

వాక్పటిమ కోసరమేమో) తింటూ ఈ ఓషధిని ఇంద్రుడు, గరుత్మంతుడు, రుద్రుడు తిన్నారు అని స్తోత్రం చేయాలి (2.5.1). వడదెబ్బ గొట్టినవారికి ఇచ్చేగంజిని అభిమంత్రించేటప్పుడు 'దీన్ని రుద్రుడు సృష్టించాడు' అనే ప్రశంస ఉన్నది (2.5.7). పశుసంక్షేమంకోసం చేసే యజ్ఞంలో పశుపతియైన రుద్రునకు ప్రధాన భాగం ఉన్నది (2.6.3). పట్టపుటేనుగును అభిమంత్రించేటప్పుడు దానికి వర్చస్సు కలుగజేయమని ప్రార్థింపబడే దేవతల్లో రుద్రుడు ఒకడు. సమస్త పాపాలనుంచి రక్షించమని వివిధదేవతలను వేడుకొనే మంత్రాలలో రుద్రదేవతాకమైనదిగా కూడా ఒకటి ఉన్నది. ఈ సందర్భంలో భవ, ఈశ్వరరూపాల్లో రుద్రుని ఈ విధంగా ప్రార్థిస్తారు: "మీరు జ్ఞానస్వరూపులు. ద్విపాద్ చతుష్పాద్ జీవస్వరూపులు, మీ అంశలు సమస్త అభిచారకృత్యలను నాశనం చేస్తాయి. పూతనాది ప్రయోగాలను వజ్రాయుధంతో సంహరించండి. ఎవరు సమస్తకర్మలకు ముందరే పుట్టారో, ఎవరు యుద్ధాలను నడిపిస్తారో అట్టి భవేశ్వరులు మమ్ము రక్షించుదురుగాక! (4.6.3). బ్రహ్మద్వేషులను చంపటానికి రుద్రునకు నేను ధనుస్సు నందజేస్తున్నాను" (4.6.5) అని జాతకర్మ ప్రక్రియలో చెప్పబడింది. ఈయన సమస్త జగత్తులకు మూలం; ఈయన ఈశానుడు, మహాదేవుడు (15.1.1).

**9. వరుణుడు :**

ఇతడు అథర్వసంహితలో 10 సూక్తాల్లో స్తుతింపబడ్డాడు. ఇంద్రుడిలాగా వరుణుడు కూడ ధనాన్ని ఇచ్చే దేవతగా ప్రస్తుతింపబడ్డాడు (1.2.3). ఈయన గూడ సమస్త ఆభిచారిక క్రియలను నాశనం చేసి, రోగాలను పోగొట్టి, ఆయుర్వృద్ధిని కలుగజేస్తాడు (1.3.4). అభిచారికక్రియలకు కావలసిన సామగ్రిని సమకూర్చుకోవటానికి సహాయం చేస్తాడు. స్త్రీలకు సౌభాగ్యాన్ని ప్రసాదిస్తాడు(1.4.1).

క్షయ కుష్ఠాది రోగాలకు చేసే శాంతిపాఠాదిప్రక్రియలలో 'వరుణుని పాశంనుంచి నిన్ను విడిపిస్తున్నాను' అనే పల్లవి కనిపిస్తుంది (2.2.5). వడదెబ్బవల్ల బాధపడేవారికి ఇచ్చే గంజిని అభిమంత్రించే టప్పుడు వరుణుడి ప్రస్తావన గూడా ఉన్నది ఆభిచారికకర్మ చేసేటప్పుడు. ఇతరదేవతలతో పాటు వరుణుడు కూడా సాయం చేస్తాడు (3.2.1). శత్రుసేనలు తమ రాష్ట్రంలో ప్రవేశించినపుడు వాటిని నిరోధించటానికి రాజులు వరుణుడి సహాయం అభ్యర్థిస్తారు (3.1.3). నదీప్రవాహాన్ని దాటేటప్పుడు నదిని ప్రార్థిస్తూ, నదులన్నీ వరుణప్రేరితాలని వర్ణింపబడింది. సేనానివహాన్ని వరుణుడు పడమటవైపు రక్షిస్తాడు (3.6.2). వరుణుడి పాశాలు అనృతం చెప్పే శత్రువును ఛేదిస్తాయి. సముద్రం, రోదసి అంతా వరుణుడిదే. అందువల్ల శత్రువు చేసే పాపాలు ఆయనకు తెలుసు. తన నలభైతొమ్మిది పాశాలతో వరుణుడు శత్రువును బాధించగలడు (4.4.1).

పౌష్టికకర్మలో ఆయా ఓషధులను మంత్రయుక్తంగా భుజించేటప్పుడు వరుణుని ప్రశంస ఉన్నది (5.1.7,8). సర్వసంపత్తులు పొందటానికి చేసే కర్మలో అంగంగా క్షీరాన్నాన్ని భుజించేటప్పుడు ఈ విధంగా వరుణుని ప్రశంస చేయాలి: 'వరుణా! నీవు నా స్నేహితుడివి. నేను చేసిన సర్వపాపాలను పోగొడతావు. నేను చేసే ఈ స్తోత్రాలు విశ్వమంతా సర్వమానవుల్లో వ్యాపించుగాక! నేను ఎలాంటి పాపాన్ని చేయకుందును గాక!' (5.3.1). గోవులను ఇతరులు దొంగిలించినపుడు అవి తిరిగి రావటానికి చేసే ఆభిచారిక కర్మలో వరుణదేవుడు తిరిగి ఆ గోవులను తోలుకురాగలడనే విశ్వాసం వ్యక్తమవుతుంది (5.4.2,3). 'బ్రాహ్మణుల గోవులను తస్కరించిన వారెవ్వరూ బ్రతకరు' అని వరుణుడు చెప్పాడు (5.4.4). ఈ విధంగా

వరుణుడు అగ్ని ఇంద్రాదులలాగానే పౌష్టిక, ఆభిచారిక క్రియలలో మానవులకు సహాయం చేసే దేవతగా భావింపబడ్డాడు.

## 10. పర్జన్యుడు - భూమి :

పర్జన్యుడు అంటే మేఘం. మేఘం వర్షించి భూమిని ఫలవంతం చేస్తుంది. అందువల్ల మేఘం తండ్రిగాను, భూమిని తల్లిగాను వర్ణించి స్తోత్రం చేయటం జరిగింది. ఈ సందర్భంలో ఉద్భవించిన శరాన్ని (రెల్లు లేక దర్భ - నామసామ్యంచేత బాణం) కూడ స్తోత్రం చేశారు అథర్వఋషులు (1.1.1,2). ఈ మంత్రాలను దర్భలను బాణాలుగా ప్రయోగించటానికి ఉపయోగించేవారు. దీనిలో ఇంద్రుని సాహాయ్యం కూడా అర్థించటం ఉన్నది. ఈ పర్జన్యుడినే తరువాత సూక్తాల్లో మిత్రదేవుడుగాను, సూర్యుడుగాను, వరుణుడుగాను, భావించడం జరిగింది. ఉపనీతుడైన వటువును అనంతాలైన వర్షాలను ఇచ్చే పర్జన్యుడు రక్షిస్తాడు (3.6.6). పర్జన్యునితో బాటు, విద్యుత్తును, పిడుగును కూడ ప్రార్థించటం జరిగింది (3.6.6).

## 11. ద్యావాపృథువులు - అంతరిక్షం :

వేదర్షులు వీటికి కూడా దేవతాత్వం ఆపాదించారు. ఇవి కూడ అభిచారకృత్యం నుంచి కాపాడతాయి (2.3.2). 'ఓ ద్యావాపృథువులారా! అంతరిక్షదేవతలారా! మీరు యోజనాలకొద్దీ వ్యాపించి, అమృతం, హవిస్సులు దేవతలకు పోయే మార్గాన్ని సుగమం చేస్తారు. వనస్పతులను మానవులను రక్షిస్తారు. మీరు లేకుండా అగ్ని లేదు. ఆజ్యాహుతులను రక్షింతురుగాక!' అని పార్థించడం ఉన్నది (3.3.2). ఇవి వడదెబ్బ కొట్టినవానికి తేజస్సును కలుగజేస్తాయి (2.5.3). శత్రువులను జయించి స్వరాజ్యంలో

ప్రవేశించినవాడికి శుభపరంపరలను కలుగజేస్తాయి (3.1.3). యజ్ఞంలో హోమం చేసే పశువుయొక్క వివిధభాగాలను ఇవి స్వీకరిస్తాయి (3.6.4).

**12. విశ్వకర్మ :**

ఈ దేవత అథర్వసంహితలో ఒక సూక్తంలో స్తుతింపబడ్డాడు. ఈయనను యజ్ఞపతిగా వర్ణించింది అథర్వవేదం. ఈయన యజ్ఞస్వరూపం తెలిసినవాడు. యజ్ఞగురువైన బృహస్పతి కూడా ఈయనే (2.6.4).

**13. గరుత్మంతుడు - సుపర్ణుడు :**

సమస్త విషాలను హరించటానికి గరుత్మంతుడు సమర్థుడు (4.2.1). సభావివాదంలో జయాన్ని ఇచ్చే ఓషధిని తిన్న వారిలో ఈయన గూడ ఒకడు (2.5.1).

వీరుగాక అథర్వవేదంలో ఇంకా అనేకులైన దేవతల ప్రసక్తి ఉంది. గంధర్వులు, పితృదేవతలు, ఇంద్రాణి, అదితి, విష్ణువు, మొ॥ దేవతల స్తోత్రాలున్నాయి. మన్మథుడిని (కాముడిని) తను ప్రేమించిన స్త్రీని వశం చేసుకోడానికి సాయం చేయవలసిందిగా ప్రార్థించడం ఉన్నది (3.2.5; 6.13.1-8). యముడు శత్రుసంహారంలో తోడ్పడుతాడు (1.1.4). కాలం సమస్త జగత్తులకు మూలం (19.5.3,4). పరబ్రహ్మ తత్త్వం కూడా సమస్తలోకాలకు మూలంగా, ఆధారంగా కూడా వర్ణింపబడింది (10.1.2-6; 10.2.11.8).

ఈ విధంగా అథర్వవేదంలో దేవతలు యజ్ఞాంగంగాను, మానవుల ప్రాకృతికదైవిక వాంఛలను పూర్తిచేసే వారు గాను, చివరకు పరబ్రహ్మ స్వరూపులై సమస్త లోకాలకు మూలంగాను, ఆధారంగాను

భావించబడ్డారు. ఈ వేదాన్నంతా పరికిస్తే మానవుని ప్రవర్తనలో నీచాతినీచమైన భావన, మహోన్నతమైన భావన, ఈ రెంటికి ప్రతీకలుగా దేవతామూర్తులు కన్పిస్తాయి మనఃప్రవృత్తిలో వివిధరూపాలు, మలుపులు, వాటిని ప్రకృతిలో సాధించటానికి దైవసహాయం అభ్యర్థించటం కూడ గోచరిస్తుంది.

పాశ్చాత్యులు భావించినట్లు అథర్వవేదం కేవలం అభిచార కర్మకు సంబంధించింది మాత్రమే కాదు. తాంత్రికప్రక్రియలకు ఎక్కువ స్థానం ఉన్నప్పటికీ ఉన్నతమైన భావనాపరంపర, శాస్త్రీయమైన దృక్పథం ఈ వేదంలో ప్రముఖంగా కన్పిస్తుంది. ఇందులోని దేవతారూపాలు కలగాపులంగంగా ఉన్న ఈ చిత్తవృత్తికి స్వరూపాలే.

- సి.ఎమ్.ఎస్.

# 5.7 ఛందస్సు

అర్థాన్ని తెలుసుకోకుండా వేదాన్ని పఠించడం వల్ల కలిగే ఫలం అసంపూర్ణంగా ఉంటుంది. వేదమంత్రాలు అనేకచ్ఛందస్సులలో ఉండటంవల్ల వేదార్థజ్ఞానాన్ని పొందాలంటే ఛందశ్శాస్త్రజ్ఞానం అత్యవసరమవుతుంది. ఛందశ్శాస్త్రపరిచయం లేకపోతే, యజన-యాజన, అధ్యయన-అధ్యాపనాది వైదికకర్మలలో పొరబాటు రావడానికి అవకాశముంది. ఇలాంటి దోషాలవల్ల కలిగే అనర్థాలు అనేకాలని వేదమే చెబుతున్నది[1].

ఛందశ్శాస్త్రజ్ఞానం చాలా అవశ్యకమని పాణినీయశిక్షలో ఇలా స్పష్టంగా చెప్పబడింది:

ఆర్షం ఛందశ్చ దైవత్యం వినియోగం పునః పునః ।
వేదితవ్యం ప్రయత్నేన బ్రాహ్మణేన విశేషతః ॥

ఛంధశ్శాస్త్రం చతుర్దశవిద్యలలో ఒక విలక్షణమైన విద్యగా పేర్కొనబడింది[2]:

పై శ్లోకంలోని **'అంగాని'** అనే పదంలో వేదాంగాలు చెప్పబడుతున్నాయి. ఈ వేదాంగాలు శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం అని ఆరు. ఈ అంగాలు ఆరు

---

1. యో హ వా అవిదిత ఆర్షేయచ్ఛందో దైవత బ్రాహ్మణేన మంత్రేణ యజతి, యాజయతి వాఽధ్యాపయతి వా స్థాణుం వర్చతి. గర్తే వా పాత్యతే. ప్రమీయతే పాపీయాన్ భవతి. తస్మాదేతాని మంత్రే మంత్రే॰ విద్యాత్ వే. భా. భూ. 8.

2. అంగాని వేదాశ్చత్వారః మీమాంసాన్యాయవిస్తరః ।
ధర్మశాస్త్రం పురాణం చ విద్యాహ్యేతాశ్చతుర్దశ ॥ వి.పు.

అవయవాలని, వేదం అవయవి (అవయవాలు కలది) అని పాణినీయశిక్ష ప్రతిపాదించింది[1].

వేదశరీరానికి ఛందస్సు పాదాలు కల్పం హస్తాలు, జ్యోతిషం కళ్లు, నిరుక్తం చెవులు, శిక్ష ఘ్రాణం, వ్యాకరణం నోరు వంటివి. మానవశరీరంలో కరచరణాద్యవయవాలకెంత ప్రాధాన్యమివ్వబడుతోందో, వేదశరీరంలో శిక్షాదిషడంగాలకంత ప్రాధాన్యమివ్వవలసిఉంది.

**'ఛందః పాదౌ తు వేదస్య'** అని చెప్పబడినందువల్ల, ఛందస్సుతో సంబంధంలేని వేదశరీరం, పాదాలులేని మానవశరీరం లాంటిదని గ్రహించాలి. మానవశరీరంలో పాదాలకుగల ప్రాధాన్యం చాల ఎక్కువ. పాదాలు లేని మానవుని ప్రయాస అనుభవంతోనే తెలియవలసింది. ఇక వేదశరీరానికి పాదస్థానీయమైన ఛందశ్శాస్త్రం యొక్క ఉత్పత్తి వైదికచ్ఛందస్సుల లక్షణాలు, అందులోని భేదాలు, ఉదాహరణలు, అథర్వసంహితలోని ఛందోవిశేషాలు ఇక్కడ పరిశీలిద్దాం.

సమస్తవిద్యలకు అధినాథుడైన ప్రమథనాథుడు ఈ ఛందశ్శాస్త్రాన్ని నందికేశ్వరునికి ఉపదేశించినట్లు, అగస్త్యుడు ఇంద్రుడు, వాసుకి, పింగళుడు, బృహస్పతి, సనత్కుమారుడు మొదలైనవాళ్లు నందికేశ్వరుని ద్వారా ఈ శాస్త్రోపదేశాన్ని పొందినట్లు తెలుస్తుంది.

ప్రస్తుతం లభిస్తున్న ఛందశ్శాస్త్రగ్రంథాలలో పింగళాచార్యుని చేత రచించబడ్డ **'పింగళచ్ఛందస్సూత్రం'** ప్రాచీనమైందని గుర్తించబడుతున్నది. దీనిలోని సూత్రాలు వేదమంత్రాలలోని పాదవిభాగాన్ని

---

1. ఛందః పాదౌ తు వేదస్య హస్తౌ కల్పోఽథ పఠ్యతే ।
జ్యోతిషామయనం చక్షుః నిరుక్తం శ్రోత్రముచ్యతే ॥
శిక్షా ఘ్రాణం తు వేదస్య ముఖం వ్యాకరణం స్మృతమ్ ।
తస్మాత్ సాంగ మధీత్యైవ బ్రహ్మలోకే మహీయతే ॥

అక్షరసంఖ్యానియమాన్ని ప్రతిపాదిస్తున్నాయి. ఈ శాస్త్రంలో కొన్ని వర్ణాల సముదాయాలకు కొందరు దేవతలతో సామ్యం చెప్పబడింది. ఉదాహరణకు లఘు గురు లఘు (ISI) రూపమైన 'జ' గణానికి సూర్యునితోను, గురు లఘు గురు (SIS) రూపమైన 'ర' గణానికి అగ్నితోను, లఘు లఘు గురు (IIS) రూపమైన 'స' గణానికి వాయువుతోను సామ్యం కల్పించబడింది. అక్షరాల సముదాయానికే 'గణం' అని వ్యవహారం.

ఛందోలక్షణాలు బ్రాహ్మణ గ్రంథాలలో చెప్పబడి ఉన్నప్పటికీ విశేషంగా శాంఖాయన శ్రౌతసూత్రాలలోను, ఋగ్వేద ప్రాతిశాఖ్యంలోని చివరి మూడు పటలాల్లోను, సామవేదనిదానసూత్రంలోను వివరించ బడ్డాయి. వైదికకాలానికి తరువాతదైన **'పింగళచ్ఛందస్సూత్రం'** వైదికచ్ఛందస్సులతోబాటు లౌకిక వృత్తలక్షణాలను కూడ సూచిస్తున్నది.

గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి అనేవి ఏడు వైదికచ్ఛందస్సులు.

**1. గాయత్రి :**

సాధారణంగా ఈ ఛందస్సులో మూడుపాదాలు ఉంటాయి. ఒక్కొక్కపాదంలో ఎనిమిది అక్షరాలు. మొత్తం అక్షరాల సంఖ్య **3X8=24**.

అప్సుయో యన్త్యధ్వభిర్జా
మయో అధ్వరీయతామ్
పృఞ్చతీర్మధునా పయః (1-4-4-1)

ఈ అక్షరాల సంఖ్యలోని హెచ్చు తగ్గుల ననుసరించి గాయత్రీ చ్ఛందస్సు పాదనిచృత్, అతిపాదనిచృత్, నాగీ, వారాహీ, వర్ధమానా, ప్రతిష్ఠా మొదలైన భేదాలను పొందుతున్నది.

**2. ఉష్ణిక్ :**

ఈ చందస్సులోనూ మూడే పాదాలు ఈ మూడు పాదాలలో ఎనిమిది అక్షరాలతో ఉండే పాదాలు రెండు పన్నెండక్షరాలతో ఉండే పాదం ఒకటి మొత్తం అక్షరాల సంఖ్య **8+8+12=28.**

తం తే మదం గృణీమసి
వృషణం పత్సు సాహసిమ్ ।
ఉ లోకకృత్నుమద్రివో హరిశ్రియమ్ ॥ **(20-5-61-1)**

మళ్ళా అక్షరబేదాన్ని బట్టి ఇది కకుప్ - పురఉష్ణిక్ - పరోష్ణిక్ - మొ॥ ప్రబేదాలను కలిగి ఉంది ఏడక్షరాలతో ఉన్ననాలుగు పాదాలకు కూడ ఉష్ణిక్ అనే వ్యవహారం ఉంది

**3. అనుష్టుప్ :**

నాలుగు పాదాలతో ఉండే ఈ ఛందస్సులో ఒక్కొక్క పాదంలో ఎనిమిది అక్షరాలుంటాయి మొత్తం అక్షరాల సంఖ్య **4X8=32**

యే త్రిషప్తాః పరియన్తి
విశ్వా రూపాణి బిభ్రతః
వాచస్పతిర్బలా తేషాం
తన్వో అద్య దదాతు మే ॥ **(1-1-1-1)**

ఎనిమిది అక్షరాలతో ఒకపాదం, పన్నెండక్షరాలతో రెండు పాదాలు మొత్తం మూడు పాదాలతో **32** అక్షరాలతోనే వేరొక అనుష్టుప్ చందస్సుకూడ ఉంది

**4. బృహతి :**

ఈ ఛందస్సులో పన్నెండక్షరాలు ఉండే పాదమొకటి, ఎనిమిది అక్షరాలు కల పాదాలు మూడు ఉంటాయి మొత్తం అక్షరాల సంఖ్య **12+8+8+8=36.**

యది కర్తం పతిత్వా సంశశ్రే యది
వాశ్మా ప్రహృతో జఘాన
ఋభూరథస్యేవాంగాని
సం దధత్ పరుషా పరుః. (4-3-12-7)

పథ్యా, న్యంకుసారిణీ, ఉపరిష్టాత్ బృహతి, పురస్తాత్ బృహతి, మహాబృహతి మొదలైన అవాంతరభేదాలిందులో కనిపిస్తున్నాయి.

**5. పంక్తి :**

రెండుపాదాలు పన్నెండక్షరాలతోను, రెండుపాదాలు ఎనిమిది అక్షరాలతోను ఉన్న ఛందస్సు **'పంక్తి'** అని పిలువబడుతోంది. మొత్తం అక్షరాల సంఖ్య **12+12+8+8=40**.

భూమిర్మాతా౽దితిర్నో జనిత్రం భ్రాతా
౽న్తరిక్షమభిశస్త్యా నః ద్యౌర్నః పితా
పిత్ర్యాచ్ఛం భవాతి జామి
మృత్వా మావ పత్సి లోకాత్ ॥ (6-12-120-2)

సతఃపంక్తి - ఆస్తారపంక్తి - ప్రస్తారపంక్తి - విస్తారపంక్తి - సంస్తారపంక్తి - అక్షరపంక్తి - పదపంక్తి మొ॥ ఇందులోని అవాంతరభేదాలు.

**6. త్రిష్టుప్ :**

ఇందులో పన్నెండక్షరాలతో ఒకపాదం, ఎనిమిది అక్షరాలతో నాలుగు పాదాలు మొత్తం 5 పాదాలుంటాయి మొత్తం అక్షరాల సంఖ్య **12+8+8+8+8=44.**

ఇంద్రో రాజా జగతశ్చర్షణీనా
మధిక్షమి విషురూపం
యదస్తి తతో దదాతి
దాశుషే వసూని చోదద్
రాధ ఉపస్తుతశ్చి దర్వాక్ ॥ (19-1-4-1)

పురస్తాత్ జ్యోతి - మధ్యేజ్యోతి - మొదలైనవి ఇందులోని భేదాలు.

**7. జగతి :**

ఈ ఛందస్సులో ఒక్కొక్కపాదానికి ఎనిమిది అక్షరాల చొప్పున ఆరు పాదాలుంటాయి. మొత్తం అక్షరాల సంఖ్య **6×8=48.**

నం తా నశన్తి నదభా
తి తస్కరో నాసామామి
త్రో వ్యధిరా దధర్షతి ।
దేవాంశ్చ యాభిర్యజతే
దదాతి చ జ్యోగిత్తాభిః
స చ తే గోపతిః సహ ॥ **(4-5-21-3)**

ఇందులో జ్యోతిష్మతి, పురస్తాత్ జ్యోతి, మధ్యేజ్యోతి మొ॥ భేదాలున్నాయి.

అథర్వవేదం ఋగ్వేదంలాగా పూర్తిగా ఛందోమయం కాక గద్యపద్యాత్మకమై ఉంది ఛందోమయమైన భాగాల్లో ఋగ్వేదంలో ఉపయోగించబడ్డ ఛందస్సులే వాడబడ్డాయి. స్వల్పసంఖ్యలో ప్రస్తారపంక్తి, పురస్తాత్ బృహతి, విరాట్, అతిజగతి, మొదలైన నూతనచ్ఛందస్సులు స్వీకరించబడ్డాయి. ఈ వేదంలో పూర్తిగా ఛందోబద్ధాలు కానటువంటి కొన్ని మంత్రాలు, గద్యమా? పద్యమా? అనే సంశయాన్ని కలిగిస్తుంటాయి. ఛందస్సు సందిగ్ధంగా ఉన్నప్పుడు **'అగ్ని'** దేవతకు సంబంధించినదైతే ఆ మంత్రంలోని ఛందస్సు **'గాయత్రి'** అని లేక 'సవితృ' దేవతకు సంబంధించినదైతే **'ఉష్ణిక్'** అని వ్యవస్థను కల్పించుకోవలసి ఉంటుంది. ఛందస్సులకు దేవతలతోను, స్వరాలతోను, వర్ణాలతోను, గోత్రాలతోను సంబంధాన్ని ఛందశ్శాస్త్రజ్ఞులు ఇలా చెబుతున్నారు:

| ఛందస్సు | దేవత | స్వరము | వర్ణము | గోత్రము |
|---|---|---|---|---|
| గాయత్రి | అగ్ని | షడ్జ | సిత | అగ్నివేశ్య |
| ఉష్ణిక్ | సవిత | ఋషభ | సారంగ | కాశ్యప |
| అనుష్టుప్ | సోమ | గాంధార | పిశంగ | గౌతమ |
| బృహతి | బృహస్పతి | మధ్యమ | కృష్ణ | అంగిరస |
| పంక్తి | మిత్రావరుణులు, | పంచమ | నీల | భార్గవ |
| త్రిష్టుప్ | ఇంద్ర | ధైవత | లోహిత | కౌశిక |
| జగతి | విశ్వదేవ | నిషాద | గౌర | వసిష్ఠ |

మొత్తంమీద తరువాత లౌకికసాహిత్యంలో అనేకరకాలుగా వికాసపరిణామాలను పొందిన ఈ ఛందస్సు మౌలికస్వరూపాన్ని ఈ సంహితలో కొంతకు కొంత మనం గ్రహించవచ్చు. జ్ఞాపకశక్తి మీద, మానవుడి మనస్తత్త్వంమీద ఈ ఛందస్సుకున్న ప్రభావాన్ని గురించి ఇంకా ఎంతో పరిశోధన జరగవలసిఉంది.

- ఎస్.బి.ఎస్.

## 5. 8 వైశిష్ట్యం

మానవనాగరికతకు సంబంధించిన చరిత్రలో, అథర్వవేదానికి కూడా ఋగ్వేదానికున్నంత ప్రాధాన్యం ఉందని విమర్శకుల అభిప్రాయం. గోపథబ్రాహ్మణంలో అథర్వవేదం ఉత్పత్తిని గురించి ఒక కథ చెప్పబడి ఉంది. సృష్టికర్తయైన బ్రహ్మ, తీవ్రమైన తపస్సు చేసి, తన తపఃప్రభావంచేత **'అథర్వుడు' 'అంగిరసుడు'** అనే పేర్లు కల ఇద్దఱు ఋషులను సృష్టించాడు. అథర్వునికే **'భృగువు'** అని మరొక పేరు. ఈ ఇద్దఱు ఋషులు దర్శించిన వేదభాగానికే తరువాత కాలంలో **'అథర్వవేదం' 'అథర్వాంగిరోవేదం' 'భృగ్వంగిరోవేదం'** అనే పేర్లు ఏర్పడ్డాయి.

ఈ వేదంలోని మంత్రాలను **'బ్రహ్మాణి'** అని కూడా పిలుస్తారు. బ్రహ్మ సాక్షాత్కారాన్ని గురించిన వృత్తాంతం ఇందులో విశేషంగా వర్ణింపబడింది. యజ్ఞంలో ప్రధానపాత్రను వహించే నలుగురు ఋత్విక్కులలో బ్రహ్మస్థానాన్ని నిర్వహించేవారికి ఈ వేదంతో సంబంధం ఎక్కువ. పై కారణాలవల్ల అథర్వవేదానికి **'బ్రహ్మవేదం'** అనే వ్యవహారం కూడ ఏర్పడింది.

యజ్ఞాదులలో అథర్వవేదానికి కల ప్రాధాన్యం ఋగ్వేదంలో **'యజ్ఞైరథర్వా ప్రథమః పథస్తతే' (1.83.5)** అనే ఋక్కులో చెప్పబడింది. తైత్తిరీయసంహితలో అథర్వవేదం **'ఆంగిరస'** శబ్దంతో ఇతరవేదాలతో కలిపి పేర్కొనబడింది. సామవేదం, వేదాలు నాలుగని చెప్పినట్లు **'పాహి నో ఏకయా' (4.36)** అనే మంత్రంవల్ల తెలుస్తున్నది.

ఋగ్యజుస్సామవేదాల్లాగానే అథర్వవేదానికి సంహిత - బ్రాహ్మణం అనే విభాగాలున్నాయి. ఈ వేదానికి సంబంధించిన శౌనకీయ, పైప్పలాద, జామల, తోత్తాయన, దామోద, చరణవిద్యా, దేవదర్శి, బ్రహ్మపాలాశ, కునరవా అనబడే తొమ్మిదిశాఖలలో ప్రస్తుతం

లభించేవి మొదటి రెండు మాత్రమే. ఇతరవేదాల్లాగా ఈ వేదానికి గూడ సాయణాచార్యుని భాష్యం లభిస్తున్నది. అథర్వవేద సంహితలో ఇరవై కాండలు ఉన్నాయి. ఈ కాండలు ప్రపాఠకాలుగా, ప్రపాఠకాలు అనువాకాలుగా, అనువాకాలు సూక్తాలుగా విభజింపబడ్డాయి. ఇందులో ఋగ్వేదంలోని ఛందస్సులతోబాటు, పురస్తాత్ బృహతి, ప్రస్తారపంక్తి మొదలైన నూతనచ్ఛందస్సులు కూడా గ్రహింపబడ్డాయి. గద్యపద్యమయమై ఉన్న ఈ వేదంలోని సూక్తాలు ఏడువందల ముప్పై ఆరు. మంత్రాలు సుమారుగా ఆరు వేలు. ఈ మంత్రాలలో దాదాపు పన్నెండువందలు ఋగ్వేదం నుంచి స్వీకరింపబడ్డాయి.

ప్రస్తుతం లభిస్తున్న ఇరవైకాండల్లో మొదటి పదమూడు కాండలు మాత్రమే, ప్రారంభంలో ఉన్నట్లు, కొందరు పండితులు అభిప్రాయపడుతున్నారు. అథర్వప్రాతిశాఖ్యంలో పందొమ్మిది, ఇరవై కాండల ప్రస్తావనే లేకపోవడంచేత ప్రాతిశాఖ్యోత్పత్తి తరువాత కాలంలో చివరి రెండు కాండలు జతచేయబడ్డాయని నిర్ణయించ బడింది. ముఖ్యంగా ఇరవయ్యో కాండంలో ఇంద్రస్తుతిపరాలైన సూక్తాలు లభించడం విశేషం. ఈ సూక్తాలు యథాతథంగా ఋగ్వేదంనుంచి స్వీకరింపబడ్డాయి.

ఋగ్యజుస్సామవేదాలు ప్రారంభంనుంచే యజ్ఞసంబంధాన్ని పొంది ఉన్నందువల్ల ఈ మూడు వేదాల ప్రామాణ్యవిషయంలో సందేహానికవకాశమే లేదు అథర్వవేదానికి యజ్ఞసంబంధం మొదట్లో లేని కారణంవల్ల ప్రామాణ్యా విషయంలో మతభేదాలు బయలుదేరాయి. 'త్రయో వేదా అజాయంత, ఋగ్వేద ఏవాగ్నేరజాయత యజుర్వేదో వాయోః, సామవేద ఆదిత్యాత్' (ఐ. బ్రా. 5-32), 'ఋచః సామాని జజ్ఞిరే - యజు స్తస్మాదజాయత' (ఋ.సం.10.90.9) యద్వై యజ్ఞస్య సామ్నా యజుషా వా క్రియతే శిథిలం తత్, యద్ ఋచా తద్ దృఢమ్' (తై. సం. 6.5.10.3) మొదలైన వాక్యాలు వేదాలు మూడే

(వేదాః త్రయ ఏవ) అనే భావాన్ని బలపరుస్తున్నాయని, అందుకని అథర్వవేదానికి ప్రామాణ్యాన్ని కల్పించే ఉద్దేశ్యంతో ఇరవయ్యోకాండ అనుసంధించబడి, ఉండవచ్చునని విమర్శకుల అభిప్రాయం.

కాలక్రమాన 'ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వాంగిరసః' (బృ.ఆ.ఉ.1.4.4.10) ఋగ్యజుస్సామాథర్వాణః చత్వారో వేదాః (నృ.పూ.తా.1-2) తత్రా పరా ఋగ్వేదో యజుర్వేదః సామ వేదోఽథర్వవేదః (ము.1.1.5) 'చత్వారో వా ఇమే వేదాః ఋగ్వేదో యజుర్వేదః సామవేదో బ్రహ్మవేదః' (గో. బ్రా. 2.16). "ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేద మాథర్వణం చతుర్థమ్" (ఛాందో.7.1.2) మొదలైన వాక్యాలచేత అథర్వవేదం ఇతరవేదాలతో సమానస్థాన - ప్రామాణ్యాలను పొందడమే గాక, మహాభాష్యకాలానికి ప్రధానమైనట్లు పతంజలిమహర్షి **అథర్వాదిః వేదః** అని చెప్పడంవల్ల తెలుస్తున్నది. ఈ వేదం ప్రాచీనతను, సార్థకతను సాయణాచార్యుడు అథర్వవేదభాష్య భూమికలో నిరూపించాడు.

శతపథ బ్రాహ్మణ, తైత్తిరీయారణ్యక, ఛాందోగ్యోపనిషత్తులలో పేర్కొనబడి ఉన్న అథర్వవేద ప్రాదుర్భావాన్ని గురించి గోపథ బ్రాహ్మణం, విష్ణుపురాణం వివరించాయి. గోపథబ్రాహ్మణంలో '**పంచ వేదాన్నిరమిమీత**' అనే వాక్యంవల్ల అథర్వవేదానికి అంగాలుగా 'సర్పవేదం', 'పిశాచవేదం', 'అసురవేదం' 'ఇతిహాస వేదం' 'పురాణవేదం' అనబడే పంచవేదాలున్నట్లు తెలుస్తున్నది. ముండక, ప్రశ్న, మాండూక్య మొదలైన ఇరవైతొమ్మిది ఉపనిషత్తులు అథర్వవేదంతో సంబంధాన్ని పొంది ఉన్నాయి. '**చాతురధ్యాయికా**' అనేది అథర్వవేదప్రాతిశాఖ్యం. '**బృహదనుక్రమణిక**' (సర్వానుక్రమణిక) '**పంచపటలిక**' అనేవి అథర్వవేదసంహితానుక్రమణికలు. కణ్వుడు, కాశ్యపుడు, కక్షీవంతుడు, బాదరాయణుడు, అగస్త్యుడు, విశ్వామిత్రుడు, జమదగ్ని, పురుమీఢుడు,

వామదేవుడు, అనేవారు ఈ వేదంతో సంబంధంగల ప్రముఖులైన ఋషులు.

అథర్వసంహితలో స్త్రీ పురుషులు ఒకరినొకరు వశపరచుకోవడానికి ఉపయోగించేవి, ఆయుష్యాన్ని, తేజస్సును, కీర్తిని పెంచేవి, వ్యవసాయవాణిజ్యాదుల అభివృద్ధికి ఉపయోగించేవి, జీవాత్మ పరమాత్మతత్త్వాలను నిరూపించేవి, పంచభూతస్వరూపాలను బోధించేవి, సర్వపాపాలను తొలగించేవి, అంత్యసంస్కారాలను విధించేవి' ఇలా భౌతిక ప్రయోజనాలను కలిగించే ఎన్నో మంత్రాలు ఉన్నాయి.

జ్వర, అతిసార, అతిమూత్రాదివ్యాధుల నివారణకు ఆయుధాల దెబ్బలవల్ల కలిగే రక్తస్రావాన్నాపడానికి, భూత ప్రేత పిశాచరాక్షస బాలగ్రహాదుల నివారణకు వాతపిత్త శ్లేష్మాలను నియమించడానికి, విషజ్వరం, జలోదరం, గండమాల, క్షయ, బొల్లి, కుష్ఠు మొదలైన రోగాల శాంతికి పశువ్యాధులకు, సర్పవృశ్చిక విషనిరోధానికి సంతానోత్పత్తికి, సుఖప్రసవానికి, శిరస్సు, కన్ను, ముక్కు, చెవి, కంఠాలకు వచ్చే రోగాలకు ఇలా అనేక రకాలైన అనారోగ్యాలకు మందులు, మంత్రాలు అథర్వసంహితలో విరివిగా చెప్పబడిఉన్నాయి.

ఈ సంహితలోని మంత్రాలలో కొన్ని, జనన, వివాహ, మరణాలకు, కొన్ని పట్టాభిషేకం మొ॥ ఉత్సవాలకు, కొన్ని రాజకీయరంగానికి సంబంధించినవి కాగా; మరికొన్ని శత్రులక్షణాలు, శత్రుసంహారోపాయాలతో బాటు సంసారసుఖం, ప్రజలక్షేమం, దైవానుకూల్యం మొ॥ ఎలా పొందవచ్చు అనే అంశాలను బోధిస్తున్నాయి.

తుఫానులను, అతివృష్టులను నివారించేవి, అవసరమైతే వర్షాన్ని కురిపించేవి, జూదంలో జయాన్నిచ్చేవి, విరోధాలను పోగొట్టేవి, ఐకమత్యాన్ని సాధించేవి, రాజ్యలాభాన్ని కలిగించేవి, పశుసంపదను పెంచేవి, గ్రామ-నగర-దుర్గ-రాష్ట్రాలకు క్షేమాన్ని చేకూర్చేవి. స్త్రీలను,

గజ, అశ్వరథాదులను అనుగ్రహించేవి. ఇలా ఆయా ప్రయోజనాలను మానవులు సాధించుకోవడానికి అవసరమైన మంత్రాలనేకాలు, ఈ అథర్వసంహితలో లభిస్తున్నాయి..

మానవుని సకలవిధశ్రేయస్సుకు సాధనమైన గృహస్థాశ్రమాన్ని గురించి అథర్వసంహితలో మంచి వివరణలు కనిపిస్తున్నాయి. వివాహవిధిని, సతీపతుల ధర్మాలను తెలియజేసే కొన్ని మంత్రాలు రమణీయార్థప్రతిపాదకాలై శోభిల్లుతున్నాయి. '**శుద్ధాః పూతాః యోషితః**' (6.122.5) అనే మంత్రంలో బాల్యవివాహం కంటే తరుణీవివాహమే యుక్తమనీ, ధనవంతుడైన వరుని కంటే విద్యావంతుడైన వరుడే యోగ్యుడనీ చెప్పబడింది. వివాహితస్త్రీకి అత్తవారింటగల గౌరవ స్థానాన్ని 'సమ్రాజ్ఞీ శ్వశురే భవ, సమ్రాజ్ఞీ శ్వశ్ర్వాం భవ' అనే మంత్రం చెబుతుండగా, ఆమె పుట్టినింట్లో ఉండరాదని, అత్తవారింటనే భర్తతో కలిసి నివసించాలనీ 'భగమస్యా వర్చ' (1.14.1) అనే మంత్రం విధిస్తున్నది. వివాహమైనంత మాత్రాన స్త్రీ తల్లిదండ్రులతోను తోబుట్టువులతోను, పుట్టుకతో ఏర్పడిన బంధాన్ని కోల్పోదని '**ఏషా తే రాజన్ కన్యా వధూః**' (1.14.2) అనే మంత్రం స్పష్టం చేస్తున్నది. భార్య అంగీకారంతోనే భర్త గృహస్థధర్మాలను నిర్వర్తించాలన్న భావాన్ని '**అహం కేతురహమ్**' అనే మంత్రం చెబుతున్నది.

'**అపో** [illegible] **తా ఓషధయః**' (18.1.1) అనే మంత్రంచేత మానవుని ఆరోగ్యరక్షణకు జలం వాయువు ఓషధి ముఖ్యాలనీ, '**అప్స్వంతరమృతమ్**' '**అపో విశ్వస్య భేషజీః**' అనే మంత్రాల చేత పరిశుద్ధమైన జలాన్ని పానం చేయడం వల్ల మానవులు గుఱ్ఱాలలాగా వేగం కలవారు, వృషభాల్లాగా బలవంతులుకాగలరనీ, మామూలు అనారోగ్యాన్నే గాక, వంశపారంపర్యంగా సంక్రమించే వ్యాధులను గూడ ఎదుర్కొగలరనీ తెలుస్తున్నది. '**ఘృతం పీత్వా మధు చారు గవ్యమ్**' (2.13.1) అనే మంత్రంచేత నెయ్యిని త్రాగడంవల్ల ఆయుస్సు

పెరుగుతుందనీ **'నైనం రక్షాంసి ■ పిశాచాః'**(5.3.2) అనే మంత్రం చేత బంగారం సర్వరోగ వినాశకం, దీర్ఘాయుఃప్రదాయకమనీ, **'బ్రహ్మచర్యేణ తపసా దేవా'** అనే మంత్రంచేత బ్రహ్మచర్యం దీర్ఘాయువును అనుగ్రహించగలదనీ తెలుస్తున్నది. **'అయో ధర్మాణి'** (5.1.1-2) అనే మంత్రం పునర్జన్మను బోధిస్తుండగా **'ఏత దుస్వాదీయో యది గవమ్'** (9.6.9) అనే మంత్రం గోమాంస భక్షణాన్ని నిషేధిస్తున్నది.

వైద్యరంగంలో ''**శతం హ్యస్య భిషజః'** (2-9-3) అనే వచనం వైద్యులు ఓషధులను సమృద్ధిగా నిలువచేసుకొని ఉండాలని ఉపదేశిస్తున్నది. మార్జన, జలాభిషేచన, అభిమంత్రణ, ధూపనాదులు మాత్రమే గాక, శల్యచికిత్స (Orthopedics)ద్వారా ప్రమాదాల్లో విరిగిన శరీరావయవాలను సరిచేసే విధానం కూడ, అథర్వసంహితలో సూచించబడింది. **'వితే భినద్మి మేహనమ్'** (1.11.5) అనే మంత్రంలో ప్రసవం కష్టమైన సందర్భంలో శస్త్రచికిత్స (Caesarean Operation) చేసి, మాతాశిశువుల ప్రాణాలను కాపాడాలనే విషయం వర్ణించబడి ఉంది. **'అనుసూర్య ముదయతా'** (1.22.1) అనే మంత్రం సూర్యస్నానం (Sunbath) వల్ల కొన్ని మొండి వ్యాధులను పోగొట్టవచ్చునని చెబుతున్నది. **'సుత్రామాణం పృథివీం'** (7.63.3) అనే మంత్రం అంతరిక్షయాత్రను వర్ణిస్తూ ఆనాటివారికి విజ్ఞానరంగంలో గల ప్రజ్ఞను చాటుతున్నది. **'యదజః ప్రథమం సంబభూవ'** (10.7.3) అనే మంత్రం స్వారాజ్యవైభవాన్ని, **'భద్రమిచ్ఛంతి ఋషయః'** (19.41.1) అనే మంత్రం జాతీయభావాన్ని ప్రశంసిస్తున్నాయి. **'విరాడ్వా ఇద మగ్రాసీత్'** (8.10.1.12) మొ॥ మంత్రాలు రాజసభ, మంత్రిమండలి మొ॥ విషయాలను వర్ణిస్తున్నాయి.

రాజు ప్రజలనెలా కాపాడాలో **'అత్యాగవ్ రాష్ట్రమ్'** (3.4.1) అనే మంత్రం; పండితులు, వీరులు, దేశసర్వతోముఖాభివృద్ధికై ఎలా రాజుకు **తోడ్పడాలో** **'సభా చ సమితిశ్చావతామ్,'** (7.12.3) అనే

మంత్రం తెలియజేస్తున్నాయి. వంశపారంపర్య పరిపాలనచేసే రాజు నియంతలా వ్యవహరించక, ప్రజాభిప్రాయాన్ని మన్నించి నడచుకోవాలని తెలియజేసే పై మంత్రాల్లోని **'సభా,' 'సమితి'** శబ్దాలు, ప్రజాస్వామ్యభావనను సూచిస్తున్నాయని విమర్శకులు అభిప్రాయ పడుతున్నారు. సమాజౌన్నత్యాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రజలు అలవరచుకోవలసిన ప్రేమ, త్యాగం, సానుభూతి, సహృదయత మొదలైన గుణాలను గురించి అథర్వసంహిత తృతీయకాండలో వివరించబడింది.

ఆయా కార్యాలను సాధించడానికి వైదికకర్మలను చికిత్సా విధానాలను మాత్రమే గాక, జపించదగిన మంత్రాలను గూడ అథర్వసంహితలో మనం ప్రత్యేకంగా గమనించవచ్చు. ఉదాహరణకు కొన్నిమంత్రాలు __

| విషయం | మంత్రం | మంత్రసంఖ్య |
|---|---|---|
| 1. సభలో విజయం పొందడానికి | విద్మ తే సభే నామ | 7-12-2 |
| 2. శత్రుసైన్యాన్ని సమ్మోహపరచడానికి | అగ్నిర్నః శత్రూన్ | 3-1 |
| 3. స్త్రీవశీకరణానికి | యథేమే ద్యావాపృథివీ | 6-8-3 |
| 4. సుగుణవతైన భార్యను పొందడానికి | అగచ్ఛత అగతస్యనామ | [redacted] |
| [redacted]. యోగ్యుడైన భర్తను పొందడానికి | ధాతా దాధార పృథివీం | [redacted] |
| 6. గుండెజబ్బు పోవడానికి | అనుసూర్యముదయతాం | 1-5-22 |
| 7. ఆయురారోగ్యాలకోసం | యదిక్షితాయుః | 3-11-2 |
| 8. శత్రుసేనను కలవరపరచడానికి | యథా శ్యేనాత్ పతత్రిణః | 11-12-2 |
| 9. జూదంలో గెలవడానికి | యథా వృక్షమశనిః | 7-52-1 |
| 10. పాపపరిహారానికి | యథా సుహార్దః | 6-120 |

ఈ సందర్భంలో జపించినంతమాత్రానే అథర్వమంత్రాలు ఫలసిద్ధిని గలిగిస్తాయని తెలియజేసే ఈ శ్లోకం గమనార్హం__

యస్త్రత్రాథర్వణాన్ మంత్రాన్ జపేత్ శ్రద్ధాసమన్వితః ।
తేషామర్థోద్భవం కృత్స్నం ఫలం ప్రాప్నోతి స ధ్రువమ్ ॥ (అ.ప)

ఆభిచారిక విద్యకు ప్రాధాన్యాన్నిచ్చిన అథర్వవేదం, ప్రధానంగా స్వీయ యోగక్షేమాలను ఆరోగ్యాన్ని దృష్టిలో ఉంచుకొని, శత్రువినాశాన్ని కలిగించడానికి చేయవలసిన ఆభిచారిక కర్మలను, ఆ కర్మలలో ఉపయోగించాల్సిన మంత్రాలను బోధిస్తున్నది. దైనందిన జీవితంలో ప్రతివాడికీ ఎంతగానో ఉపయోగించే మంత్ర ఖగోళ జ్యోతిశ్శాస్త్రాలకు, వైద్యవిద్యకు పునాదులు వేసింది కావడం చేత ఈ అథర్వసంహిత పండితులచే బహుముఖంగా ప్రశంసింపబడుతున్నది.

రాజ్యయోగక్షేమాలకు బాధ్యత వహించవలసిన రాజ పురోహితునికి ఉండవలసిన అర్హతల్లో శత్రుమారకాలైన అభిచారాది కర్మలలో ప్రవీణుడై ఉండటం ముఖ్యమైంది. రాజపురోహితపదవిలో అథర్వవేద పారంగతుడైన వాణ్ణే నియమించాలని పురాణాలు చెబుతున్నాయి. 'పౌరోహిత్యం శాంతిపౌష్టికాని రాజ్ఞాం అథర్వవేదేన కారయేత్' (వి.పు). పురోహితం తథాఽథర్వమంత్ర బ్రాహ్మణ పారగమ్ (మ.పు). అభిషిక్తోఽథర్వమంత్రైర్మహీం భుంక్తే ససాగరామ్ (మా.పు).

ఋగ్యజుస్సామవేదాలలో, దండనీతిలో ప్రావీణ్యంగల పురోహితుడు, అథర్వవేదవిహితాలైన శాంతిక పౌష్టికకర్మల నాచరిస్తూ, రాజును రాజ్యాన్ని రక్షిస్తుండాలని నీతిశాస్త్రం:

త్రయ్యాం చ దండనీత్యాం చ కుశలః స్యాత్ పురోహితః ।
అథర్వవిహితం కర్మ కుర్యాత్ శాంతికపౌష్టికమ్ ॥

అనే శ్లోకంలో తెలియజేస్తున్నది.

శాంతివిధులను చక్కగా నేర్చిన అథర్వవేదపండితుడు ఏరాజ్యంలో ఉంటాడో, ఆ రాజ్యం ఎటువంటి ఆపదలకు లోనుగానిదై సర్వతోముఖంగా అభివృద్ధిచెందుతుంది. అందువల్ల తన క్షేమాన్ని

ప్రజాక్షేమాన్ని కోరే రాజు, జితేంద్రియుడైన అథర్వవేదవిదుని నిత్యం దానసమ్మానాద్యులచే గౌరవిస్తుండాలని –

యస్య రాజ్ఞో జనపదే అథర్వా శాంతిపారగః ।
నివసత్యపి తద్రాష్ట్రం వర్ధతే నిరుపద్రవమ్ ॥
తస్మాద్రాజా విశేషేణ అథర్వాణం జితేంద్రియమ్ ।
దానసమ్మానసత్కారైర్నిత్యం సమభిపూజయేత్ ॥

అని అథర్వవేద పరిశిష్టశ్లోకాలు చెబుతున్నాయి. శత్రుసంహారంలో దివ్యాస్త్రమైన అథర్వవేదం నింద్యంకాదని, ప్రశస్తమేనని **'మనుధర్మశాస్త్రం'** నిర్ణయించింది. అథర్వవేదాన్ని పరమప్రమాణంగా **'మహాభారతం'** అంగీకరించింది.

ఋగ్యజుస్సామవేదాలు ప్రాచీనమానవుల ధార్మికజీవనానికి ప్రాధాన్యతను ఇస్తే అథర్వవేదం లౌకిక జీవనానికి ప్రాధాన్యాన్నిచ్చినట్లు తోస్తున్నది.

ఈ విధంగా వేదాలలో బ్రాహ్మణాలలో శ్రౌతగృహ్యసూత్రాలలో పురాణేతిహాసాలలోను విశిష్టమైనదిగ ప్రశంసించబడిన అథర్వసంహిత మానవులకు అనేక విధాలైన ప్రయోజనాలను కలిగించేది కావటంచేత సర్వదా, సర్వథా ఉపాదేయమనడంలో అభిప్రాయభేదంలేదు. తిథులను, నక్షత్రాలను, సూర్య చంద్రాది గ్రహగతులను పట్టించుకోవ్వలసిన పనిలేదు. సకలకార్యసిద్ధికి అథర్వమంత్రం అద్వితీయసాధనమని చెప్పే అథర్వవేద పరిశిష్టంలోని ఈ శ్లోకం దాని విశిష్టతను ఎలా చాటుతోందో మనం గ్రహించాలి:

న తిథిర్న చ నక్షత్రం న గ్రహో న చ చంద్రమాః ।
అథర్వమంత్రసంప్రాప్త్యా సర్వసిద్ధిర్భవిష్యతి ॥

– ఎస్.బి.ఎస్.

## 5. 9 మతం - తత్త్వం

భారతీయులకు వేదాలు మొట్టమొదటి ఆధారగ్రంథాలు. అవి నాలుగు. వాటిలో ఋగ్వేదం యజుర్వేదం సామవేదం అనే మూడు ఒకటిగా 'త్రయి' అని పిలువబడుతున్నాయి. అథర్వవేదం మాత్రం వీటికంటే ప్రత్యేకంగా నాలుగవవేదంగా పేర్కొనబడింది.

మానవుడు తన విధ్యుక్తధర్మం ప్రకారం ఇష్టదేవతలకు హవిస్సులను సమర్పించడంలో ఈ 'త్రయి' ఉపయోగపడుతుంది. తనకున్న దాన్ని మానవుడు దేవునికి సమర్పిస్తే, దేవుడు దానికి ప్రతిఫలంగా అతనికి, అతనికుటుంబానికి అనేక సిరిసంపదలను, రక్షణను కలిగిస్తాడు.

అథర్వవేదం కూడా అదేవిధమైన లక్షణం కలిగి ఉంటుంది. కాని దాని దృక్పథం వ్యక్తిగతంగాను ఆచరణబద్ధంగాను ఉంటుంది. ఇందులో ఎన్నో అనుకూల ప్రతికూలభావనలు మనకు కనపడతాయి. మానవులు తమకు సుఖశాంతులను భగవంతుడు ప్రసాదించాలను కోవడం లాంటివి అనుకూలభావనలు. తమకు జీవితంలో ఏ ప్రమాదాలు, స్థిరత్వం లేకపోవడం లాంటి ఇబ్బందులు, ఆయన దయవల్ల ఉండకూడదనుకోవడం మానవుల ఆశలలోని ఒక ప్రతి కూలభావనాదృక్పథం.

భారతదేశంలోని సమాజం మానసికంగా ఎటువంటి మార్పుకు గురికావడం లేదు. భగవత్సాక్షాత్కారంలో ఎంతో సంతోషాన్ని పొందిన ఋషులు కూడా వారిజీవితంలో పూర్తిగా ప్రపంచంలోని కష్టాలనుంచి విముక్తులైనారని చెప్పడానికి వీల్లేదు. వారు ఆనాడు ఎదుర్కొని పరిష్కరించుకొన్న సమస్యలు ఈ కాలపు సమస్యల కంటే సులభమైనవి కావచ్చుకాని, ఆనాడు సమస్యలే లేవనడం కుదరదు. కుటుంబసభ్యుల్లో నిగ్రహాన్ని, స్వాతంత్ర్యాన్ని ఆకాంక్షించే

గృహస్థజీవితం, వ్యక్తులకు సమాజానికి కూడా కొన్ని సమస్యలను కలిగిస్తున్నది. ఇష్టం, అయిష్టం, అభిమానం, ఈర్ష్య, శాంతం, ఉద్వేగం, ఉపకారం అసూయలు తమవలన దుఃఖాలననుభవించిన ప్రజలను భయపెడుతున్నాయి. ఈ సమస్యలను ఎలాగో పరిష్కరించుకొని జరగబోయేజీవితంలో వీటిని సహించి ఉందామనుకొన్నప్పటికీ ఒక భగవంతుడు తప్పనిసరిగా ఉండితీరాలనేంతవరకు వారు అంగీకరించారు.

అనేక అధికారాల్లో కొనసాగే ప్రతిసామాన్యవ్యక్తికీ సమాజంలోగల తన స్థానం, మానసిక ప్రశాంతినివ్వడంలేదు. అందువల్ల ఇక్కడ ఎక్కువకాలం జీవించాలనే ఆశ అతడికి కలగడంలేదు. వరదలు, కరువు, ఎలుకలు, దోమలు, వీటి బాధలనుంచి తప్పించడమేకాక, మానవుడు కోరే మంచినీళ్లు, అన్నం, వస్త్రం, చక్కని వినోదం అతడికి లభించేటట్లు ఏదో ఒక అవకాశం కల్పించాలి. దాని వల్ల కావలసిన ప్రమాణంలో వాటిని తన అసమర్థతవల్ల పొందలేక పోతున్నాననే పరితాపం అతనికుండదు. అలా కాకపోతే ఊరికే ఆలోచించినంతమాత్రానే ఎంతో భయాన్ని కలిగించే క్రూర మృగాలుగానో, కీటకాలుగానో, విషసర్పాలుగానో, అపశకునాలుగానో మానవులు తయారౌతారు. దంపతుల్లో ఎవరో ఒకరిలో ఉండే చాపల్యంవల్ల ఏర్పడే అస్థిరమైన వివాహజీవితం, వ్యభిచారం, ధనం పైన అధికారంపైన ఉండే దురాశ, ఇంకా ఇలాంటి అనేక అనర్థాలు మానవుణ్ణి చుట్టుముట్టి పిచ్చివాణ్ణి చేస్తాయి.

పైన చెప్పబడ్డ స్వభావాలు మొత్తం ప్రపంచంలోను, మన భారతదేశంలోను, ఇదివరకూ ఉన్నాయి, ఇప్పుడూ ఉన్నాయి. సంఘంలోని ప్రతిజాతిలోను, ప్రతివర్గంలోను అన్ని కాలాల్లో అది కనపడకపోవచ్చు. అతి ప్రాచీనమైన ఋషులకాలంలో కూడా ఇలాంటి పరిస్థితే ఉండి ఉండాలి. 'త్రయి' అనబడే ఋగ్యజుస్సామవేదాలలో

చెప్పబడ్డట్లు వారు పవిత్రమైన యజ్ఞయాగాదుల నాచరించి ఉండాలి. అథర్వవేదంలో వాటికి పరిహారాలు, పరిష్కారాలు, వాటిని చక్కగా నిర్వహించే సాధనాలు, మార్గాలు చక్కగా చెప్పబడ్డాయి. అథర్వవేదం అర్వాచీనమైంది కాదనడానికి ఇది ఒక బలమైన హేతువు.

భారతీయులకు ఆధారగ్రంథాలైన ఋగ్యజుస్సామవేదాలు న్నప్పటినుంచే అథర్వవేదం కూడా ఉన్నది. అథర్వవేదానికి ఈ స్థానాన్ని ఇవ్వడానికి ఇష్టపడకపోతే, అథర్వవేదం ఏర్పడకపూర్వం వేదకాలీన ఋషులకు ఏ సమస్యలు లేనేలేవని, సమాజానికి సంబంధించిన కష్టనష్టాలు ఇటీవలే ఏర్పడ్డవనీ తప్పనిసరిగా చెప్పాల్సి వస్తుంది. ఆనాటి సమస్యలు ఇంత జటిలమైనవి, దుష్కరమైనవి కాకపోవచ్చు గదా! అని చెప్పవచ్చు, కానీ అంతమాత్రాన అవి లేనే లేవనడం సంభవించదు.

ఈ సమస్యల పరిష్కారానికి ఒక వేదమే ఎందుకు కావాలి? తాను సంపాదించిన దాన్ని నిలబెట్టుకోవడానికి, తనకు హానికలిగించేవారి నెదుర్కోవడానికి, తగిన, సాధనసంపత్తిని కనుక్కొని ఏర్పాటు చేసుకోవడం మానవుడికి సాధ్యం కాదా? ఇక్కడ సమాధానం - 'అవుతుంద' ని నిశ్చయాత్మకంగానే చెప్పవచ్చు. కానీ 'కాద' ని వ్యతిరేకంగానే చెప్పకతప్పదు. భారతీయజీవనదృక్పథం అలా ప్రతిబింబిస్తున్నది. భారతసమాజంలోని ఏవ్యక్తి, ఏనాడూ మతరహితమైన మార్గంలో ఇహలోక దృష్టికలవాడుగా బ్రతకలేదు. జీవితానికి సంబంధించిన మతలౌకికమార్గాలు ఎంతో సన్నిహితంగా సంబద్ధమైనవి. రెండవదాని ప్రభావం దీనిమీద ఎంతవఱకు ఉన్నదనే విషయం అర్థం చేసుకోకుండా ఒకదాన్ని పరిశీలించడానికి వీల్లేదు.

లౌకికజీవనం **(Secularism)** అంటే మతరాహిత్యంకాదు. మానవుడి స్వాతంత్ర్యం, ధైర్యం, సామర్థ్యం వీటిమీద తీర్చిదిద్దబడే

ఒక జీవనస్వరూపమే అది. ప్రతిదశలోను దేవుని పేరు లేకుండా భగవంతునిచేత లేక ఆత్మవిశ్వాసంచేత తను నడుపబడుతున్నాననే జ్ఞానం కలిగి ఉండాలి. మతపరమైన జీవనమంటే భగవంతునిపైన తను ఆధారపడి ఉన్నాననే దృఢవిశ్వాసం. ఆయన అనుగ్రహమే అతనికి కలిగే అన్ని కష్టనష్టాల్లోను మంచి మార్గాన్ని చూపెడుతుంది. ఈ రెండులక్షణాలు భారతీయ జీవనవిధానంలో చక్కని సమ్మిశ్రణాన్ని పొంది ఉన్నాయి.

కాబట్టి లోకమంతటా ప్రతివస్తువులోను, ప్రతిసంఘటనలోను భగవంతుని సాన్నిధ్యాన్ని చూడటమనేది మానవునికి స్వభావసిద్ధమైన విషయం. ప్రత్యక్షంగానో పరోక్షంగానో మానవుడికి చేయూత నివ్వడానికి లేక ఇతని అభిరుచులను రక్షించడానికి పశువులు, పక్షులు, కీటకాలు, లతలు, చెట్లు దయామయమైన దేవతలను కలిగి ఉన్నాయి. అథర్వవేదం ఈ విషయాలను విపులంగా విశదీకరించడంవల్లనే ఎంతో ప్రాముఖ్యాన్ని పొందుతున్నది.

ముందు పేర్కొనబడ్డ వ్యక్తిగత ప్రయోజనాలను పొందడానికి, కోరదగని అసంభావ్యాలను జరగకుండా చూసుకోడానికి, అథర్వవేదం మంత్రాలను ఉపయోగించే పద్దతిని ప్రవేశపెట్టింది. ఒక ప్రయోజనా న్నుద్దేశించి దానికి తగిన యాగాన్ననుష్ఠించేటప్పుడు మంత్రాలు చదువవలసి ఉంటుంది. అప్పుడప్పుడు బాధానివారకాలైన తీగలను, తాళ్లను కట్టేటప్పుడు, ఓషధులతో తయారుచేయబడ్డ మందులను ఉపయోగించేటప్పుడు మంత్రాలు చదువబడతాయి. అందువల్ల అథర్వవేదమంత్రాలు ఇతర వేదమంత్రాల్లాగానే ఒక ప్రత్యేకమైన ప్రయోజనం కోసమే ఉపయోగింపబడతాయనీ చెప్పవచ్చు.

అనేకఫలితాలనిచ్చే యాగాలనిక్కడ విభాగం చేసి విడివిడిగా చెప్పడం అంత అవసరమైన పనికాదు. సామాన్యంగా అవి శాంతిక

కర్మలు, పౌష్టికకర్మలు, ఆభిచారికకర్మలు అని చెప్పబడతాయి. ఈ సందర్భంలో దేన్నీ వదలకుండా జీవితానికి సంబంధించిన అన్ని విషయాలు వివిధకోణాల్లో పరిశీలింపబడతాయనే ముఖ్యవిషయం మనం తప్పకుండా గుర్తుంచుకోవాలి. ఇక్కడే అథర్వవేదంయొక్క ప్రాపంచికమైన అభ్యాసపరమైన స్వరూపం ఇమిడి ఉన్నది.

అథర్వవేదానికి సంబంధించిన మత-తత్త్వస్వరూపాన్ని పరిశీలించేటప్పుడు ఇతరవేదాలకు, దీనికి అంతపెద్ద తేడాలేదనే చెప్పాలి. దేవతాతత్త్వంపైన మానవుని విశ్వాసం, దేవతలకు మానవుడు ఋణపడి ఉండటం, వారిని ఆరాధించడంలోని ఆవశ్యకత ఈ వేదానికి సంబంధించిన తాత్త్విక స్వరూపాన్ని గుర్తింపజేస్తున్నాయి. ఇతరవేదాల్లో కనబడని దేవతల సంఖ్య ఈ వేదంలో బాగా పెరిగి పోయిందని చెప్పవచ్చు. పరిష్కరించాల్సిన సమస్యలు ఎక్కువ కావడం, వాటిలో ప్రతి ఒక్కదానికి పరిష్కారమార్గం కనుక్కోవాలంటే స్వరూపస్వభావాలలో విశిష్టమైన ఒక ప్రత్యేక దేవతాతత్త్వాన్ని కనిపెట్టవలసిన అవసరమేర్పడడమే దానికి కారణం.

తనకిష్టులైన దేవతలను గురించి మానవుని వ్యక్తిగతాభిమానం చాల ముఖ్యపాత్రను వహించింది. అందువల్ల కొంతమంది దేవతల విషయంలో హెచ్చు తగ్గుస్థాయి స్పష్టంగా గుర్తింపబడినట్లు మతపరంగా మనం చెప్పవచ్చు.

అథర్వవేదంయొక్క మత - తాత్త్విక దృక్పథానికి సంబంధించిన అనేక లక్షణాలు స్థూలంగా ఆ వేదాధ్యయనం ద్వారా తెలుసు కోవచ్చు. వాటిలో కొన్ని ఇక్కడ చెప్పబడ్డాయి. ఈ ప్రపంచంలో మానవుని జీవనం ఆ లక్షణాలన్నింటిలో మొట్టమొదటిది, విశిష్టమైందని చెప్పడం బాగుంటుంది. ఇప్పటి జీవితాన్ని మరచిపోకుండా ముందు ముందు సంతోషకరమైన జీవితాన్ని పొందే ఆశతో జీవితంలో

వచ్చిన దుఃఖాలను బాధలను సహించాలి. తను సంతోషంగా ఉండాలంటే ప్రతి ఒక్కడు తనవాళ్లను, తను సభ్యుడుగా ఉన్న ఆ సమాజాన్ని తనతో ముందుకు తీసుకువెళ్లాలి.

మనలో మనకు మనవారందఱికి చివరకు మన శత్రువులకు కూడా విరోధం లేకుండా ఉండాలి (7.54.1). మన మనస్సులు ఇతరులతో కలిసిపోయి ఉండాలి. మనమేపరిస్థితిలోను విడిపోకూడదు. మన మనస్సులన్నీ దేవతలపైనే కేంద్రీకరింపబడి ఉండాలి. ఈ రకమైన మనస్తత్వాన్ని చెడగొట్టే భావనగల మాటలు మనం మాట్లాడకుండా వినకుండా ఉండాలి. మనకు గిట్టనివాళ్లు, విరోధులైనవాళ్లమాటలు ఎప్పుడు మనకు వినబడకుండా ఉండాలి (7.54.2). మనం ఎవరిపైనా కోపగించకుండా ఉండాలి (7.21.3). ఆవులు తమ దూడలపైన శ్రద్ధతోను, ప్రేమతోను ఉన్నట్టు మానవులు కూడ ఇతరులపై ప్రేమతో ఉండాలి. ఆవుకు దూడకు పరస్పరం ఉన్న ఈ ప్రేమ మానవులకు కూడా ఒకరిపై ఒకరికి ఉండాలి (3.30.1). కుమారుడు తండ్రి అవసరాలను గమనిస్తూ, తండ్రి కుమారుని మంచి చెడ్డలను విచారిస్తూ ఉండాలి. తల్లి పిల్లలను సమానంగా చూడాలి. భార్య తన భర్తతో ప్రియంగా మాట్లాడాలి (3.30.2). అన్నదమ్ములిద్దరు ద్వేషం లేకుండా ఉండాలి. అక్కాచెల్లెళ్లు పరస్పరం మాత్సర్యం లేకుండా ఉండాలి. సోదరులంతా సమానంగా ఒకరిపై ఒకరు అభిమానంతో ఉండి గౌరవంగాను ప్రియంగాను మాట్లాడుకోవాలి (3.30.3).

ఈ రకమైన ప్రవర్తన దేవతలు మానవులకు అపకారం చేయకుండా చూస్తుంది (3.30.4). మానవులు ఇతరులకంటే మేము పెద్దవాళ్లమనిగాని, చిన్నవాళ్లమనిగాని ఆలోచించకుండా ఉండాలి. వాళ్లందఱు ఒకేరకమైన ఆలోచనతో తమకు ఇతరులకు కూడా ఉపయోగించే పనులనే చేయాలి. ప్రజలు వేఱుపడిపోకుండా ఉండాలి.

వాళ్లు ఒకరినొకరు తియ్యటి భావనలతో పిలుచుకోవాలి (3.30.5). ప్రజలంతా సమానంగా ఒకేరకమైన ఆహారాన్ని పానీయాన్ని తీసుకోవాలి. అందులో ఎవరినీ వేఱు చేయకూడదు (3.30.6). ప్రేమతో దగ్గఱయ్యే ప్రతివారిలో మంచిభావనలు, తియ్యటి సంభాషణలు ఏర్పడాలి (3.30.7). ఇలాంటి వరాలకోసం దేవతలు ప్రార్థింపబడాలి. ఈ ఆకాంక్షలలో నిర్మలమైన, సంతోషకరమైన ఆనాటి మానవుల జీవితం చక్కగా కనపడుతున్నది.

మానవుని ప్రశాంతజీవితం చెడిపోవడంలో ముఖ్యకారణం అతడిమనస్సు. అది దురుద్దేశ్యాలను పెంచుతుంది. అందువల్లనే తన స్వంతఇల్లు, భార్య, పిల్లలవఱకే ఇది పరిమితంగా ఉండాలని హెచ్చరింపబడుతోంది (6.45.1). ఒకరకంగా ఈ మాటలోని విశిష్టతను లోతుగా ఆలోచించి అర్థంచేసుకోవాలి. మానవుడు తన కుటుంబ విషయంలో గాఢంగా, వ్యక్తిగతమైన శ్రద్ధతీసికొంటూ, మంచి ప్రవర్తనను పెంచుకోవడానికి ప్రయత్నించాలి.

ప్రపంచంలో ఎన్ని బాధలున్నా మానవుడు సుదీర్ఘమైన జీవితాన్నే ఆశించాలి. ఎవరి జీవితాన్నీ అపహరించవద్దని దేవతలను తప్పక ప్రార్థించాలి. **"చాలా సంవత్సరాలు శాశ్వతంగా సూర్యుణ్ణి, చంద్రుణ్ణి చూడాలనే ఆశ"** అని ఆలంకారికంగా ఈ విషయమే వర్ణింపబడింది (8.1.4). తమకు ఎప్పటికీ ముసలితనం రాకుండా ఉండటం కోసం, తమ ఇంద్రియాలు ఎప్పుడూ దెబ్బతినకుండా, చక్కగా ఉండాలనీ దేవతలు ప్రార్థింపబడాలి (8.1.7).

ప్రతివాడికి ఒక ఆచార్యుడుండటం చాల అవసరం. ఆ గురువు పాపమార్గంలోనికి పోకుండా నివారించి, కర్తవ్యాన్ని నిర్వహించమని ఆదేశించి ఇతనికి మంచిమార్గాన్ని చూపిస్తాడు. **ఆచార్యుడైన వరుణుడు తన శిష్యుణ్ణి సూర్యుడు-చంద్రుడు-ఓషధులతో** సమానంగా చూస్తాడు. అతడు విద్యార్థిని, భౌతికదృష్టిలోను,

ఆధ్యాత్మికదృష్టిలోను మంచి శక్తిని ఉత్సాహాన్నివ్వడంద్వారా సంతోషపెడతాడు (11.7.14). తన గురువు ఆదేశించిన మార్గంలో విధినిర్వహణ చేయాలని అథర్వవేదం శిష్యుణ్ణి శాసిస్తున్నదని ఇక్కడ స్పష్టమౌతుంది.

ఇతర వేదాలు 'ఇది మాది' అనటానికి వీలులేకుండా, అథర్వవేదం మనకు అందించిన మహోపకారం అందులోని పృథ్వీసూక్తం (12వ కాండ). ఈ భూమిపైన సుఖంగా నివసించిన ప్రాచీన భారతీయుల భావనలకు ఇదొక చక్కని నిదర్శనం. మానవుడికెన్ని పదవులు, హోదాలు, శక్తి, అధికారం, ఉన్నప్పటికీ ఈ భూమిమీదే వాడు జీవించాలి. వాడెంతకాలం ఇక్కడ బ్రతుకుతాడో అంతకాలం దీని మీదనే వాడు కాలుమోపాలి. మానవుడు తన జీవితానికి కావలసిన నీళ్లు, ఆహారం, ఇంకా ఉపయోగకరమైన ఎన్నో వస్తువులు ఈ భూమినుంచే పొందుతున్నాడు. ఈ సూక్తంలో ఉన్న 63 మంత్రాలలో భూమికి సంబంధించిన ఒక చక్కనిప్రార్థన, హృదయాన్నాకర్షించే విజ్ఞప్తి, కృతజ్ఞతావిష్కరణం మనకు కనబడతాయి. ఉన్నతమైన హోదా, మంచి సస్యసమృద్ధి, అన్నం, లోహాలు, బంగారం, వర్షం, రక్షణ మొ॥ వాటిని మానవునికి అనుగ్రహించమని ఈ సూక్తంలో భూమి ప్రార్థింపబడుతోంది.

అథర్వవేదసూక్తాలను నిశితంగా అధ్యయనం చేయడం ద్వారా అనేకసత్యాలు స్పష్టమౌతాయి భూమిమీద జీవించే మానవుడికి వేదాలు నిధుల్లాంటివి. అర్వాచీనులైన తాత్త్వికుల్లాగా భూపరిసర తత్త్వాలను ఖండించడానికి వీల్లేదు. అథర్వవేదం ఇక్కడి జీవనానికి ప్రాధాన్యతనిస్తుంది. ప్రతివాడు తృప్తితో, ఆనందంతో, తోటివానితో సమానంగా జీవితాన్ని గడపాలి. బాధలను పెంచుకోకూడదు. వీలైనంత తగ్గించుకోవాలి. దురదృష్టాన్ని లెక్కచేయకుండా అతిక్రమించాలి. ఈ ప్రయోజనాలను సాధించడానికి దేవతలసహకారాన్ని అభ్యర్థించాలి. ఇతరవేదాల్లో విధింపబడిన (లేక సూచించబడిన) కర్మకాండను

అథర్వవేదం వ్యతిరేకించదు. ఈ సమాజంలో ఇతరులకు తనకు కూడ అన్ని అవకాశాలు లభించేటట్లు ప్రశాంతంగా ఎలా జీవించాలో మానవుడు తప్పక తెలుసుకోవాలి.

తాత్త్వికదృక్పథంతో ఆలోచించినప్పుడు ఈ అథర్వవేదం మానవుడు దేవతలకెంత ఋణపడి ఉన్నాడో నొక్కివక్కాణిస్తున్నది. ఇందులో దేవతలు మానవులపై ప్రేమకలవారుగా, సాహాయ్యకారులుగా వర్ణింపబడ్డారేగాని భయంకరులుగా చెప్పబడలేదు. తమలో ఉన్న శక్తిమంతులైన దేవతలను, మానవులకు హాని కలిగించకుండా ఉండాలని శాపాలివ్వకుండా ఉండాలనీ తరచుగా ప్రార్థించడం కనబడుతుంది. అంతేకాక, దుఃఖాలనుంచి మానవులను కాపాడమని వారు ప్రార్థించేవారు.

మతపరంగా ఇందులో ఆచరణప్రధానమైన జీవితంమీద ఎక్కువ శ్రద్ధ చూపబడింది. ఏ సమాజంలో తనొక సభ్యుడుగా ఉన్నాడో ఆ సమాజాన్ని మర్చిపోవడం మానవునకు మంచిపనికాదు. భగవంతుని ధ్యానంలోను, ఆరాధనలోను అతడి మనస్సు తత్పరమై ఉండాలి. అతడు సమాజాన్ని మరచిపోయి తోటిమానవులతో కఠినంగా, కర్కశంగా ఉంటే, వారు తమ ఆగ్రహాన్ని, ఆవేశాన్ని ప్రదర్శించి అతణ్ణి తప్పక నొప్పిస్తారు. ఈ సమాజానికి సహాయం చేయడం భగవంతుణ్ణి ఆరాధించడం లాంటిదనే విశేషం ఇందులో కనబడుతుంది. కనుక భగవంతుడు కూడా తనను ఆరాధించడంకంటే, మానవుడు తన బాధ్యతలను నిర్వహిస్తూ సేవచేయడంవల్లనే ఎక్కువ తృప్తిని పొందుతాడు. సమాజంలో తప్పులు చేసినవాడైనా, తనను సేవిస్తే, తప్పులను ఎంచకుండా భగవంతుడు సంతోషపడతాడు. ఈ రెండు భావనలు పాక్షికంగా నిజమైనవే. అథర్వవేదం ఇలా ప్రపంచమంతటా దివ్యత్వాన్ని అవలోకించి, మానవుడి అభ్యుదయానికి ధర్మానుకూలమైన, మతబద్ధమైన జీవనాన్ని ఉపదేశిస్తున్నది.

- వి.వి.

## 5. 10 సాంఘికాచారవ్యవహారాలు

ఋగ్వేదం మనకందించిన సామాజిక స్వరూపం కంటే కొంచెం భిన్నంగా అథర్వవేదం ఆనాటి సాంఘికపరిస్థితుల్ని చక్కగా అభివర్ణిస్తుంది. ఋగ్వేదం ముఖ్యంగా అనేకమంది దేవతల ప్రశంసలను ప్రార్థనలను, వారికర్పించే హవిస్సులను గురించి ప్రస్తావిస్తుంటే, అథర్వవేదం సామాన్యమానవుడి సాధారణ జీవితాన్ని వివరించడంలో అభిరుచిని ప్రదర్శిస్తుంది.

అథర్వవేదంలో వ్యాధులను పోగొట్టే సూక్తాలు, కుటుంబానికి, సంతానానికి, ఆలమందలకు, పంటభూములకు అభివృద్ధిని కలిగించే మంత్రాలు, చేసిన పాపాలనుంచి, దోషాలనుంచి విముక్తిని కలిగించే ప్రాయశ్చిత్తకర్మలు, కుటుంబాలమధ్య సఖ్యతను కలిగించే మంత్రాలు, గ్రామసభలలో ఐకమత్యంతో మెలగడానికి కావలసిన మంత్రాలు, ప్రేమకు, వివాహానికి సంబంధించిన మంత్రాలు, ప్రేమవల్ల స్త్రీ పురుషులలో కలిగే పరోక్షమైన విరోధాలకు, అసూయలకు సంబంధించిన మంత్రాలు, భూత-ప్రేత పిశాచాలను, ఐంద్ర జాలికులను, శత్రువులను వశపరచుకొనే మంత్రాలు, రాజులకు రాష్ట్రశాంతిలోను యుద్ధంలోను ఉపయోగపడే మంత్రఖండికలు, ఇలా ఇంకెన్నో ఉన్నాయి. అందువల్ల వైదికమానవుల సంపూర్ణ జీవితస్వరూపాన్ని మనకందించే ఒక నిజమైన గనిగా అథర్వవేదాన్ని పేర్కొనవచ్చు.

ఇది కేవలం ప్రాచీనభారతీయుల సాంస్కృతిక చరిత్రకు ఆధారగ్రంథంగా మాత్రమే విలువైనదిగా పరిగణింపబడటం లేదు; మంచి ఉత్సాహజనకమైన మానవజాతి శాస్త్రానికి **(Anthropology)** నిదర్శనమైన సాహిత్యంగా కూడ ప్రశంసింపబడుతున్నది. అథర్వ వేదం, అందులో ప్రతిపాదింపబడిన విషయాలను, దృక్పథాన్ని బట్టి ఋగ్వేదంకంటే చాల లౌకికమైందిగా **(Secular)** పరిగణింపబడింది.

ఆ రోజుల్లో ప్రభుత్వం ఒకేరాజు చేతిలో ఉండేది. ప్రజలకు ఆ రాజే ప్రభువు అతడు ప్రజలందఱకు సేవింపదగినవాడుగా, పూజనీయుడుగా ఉండేవాడు. రాజును ఎన్నుకోవడంలో ఆనాటి పద్ధతి మనకు అథర్వవేదంలో కనబడుతుంది (3.4.1). దాన్నిబట్టి ఆనాడు ప్రజలందఱిచేత రాజు ఎన్నుకోబడేవాడుకాదని, ప్రజలచే నియమింపబడ్డ నియోజకవర్గమనే ఒక చిన్న సభద్వారా ఎన్నుకోబడే వాడని తెలుస్తుంది[1]. అథర్వవేదంలో 'రాష్ట్రం' అనే పదం (3.4.1) 'రాజ్యం' అనే పదం (3.4.2) కనపడుతున్నాయి. ఈ రాష్ట్ర-రాజ్యపదాలకు గల తేడా ఆనాటి రాజకీయ సమాలోచనలోని ప్రగతియొక్క ఉత్తమస్థాయిని సూచిస్తున్నది. అప్పటి సామంత రాజు చక్రవర్తికి కొంత కప్పం కట్టవలసి ఉండేది (3.27.3). అథర్వవేదంలో రాజ్యభ్రష్టుడైన రాజును తిరిగి రాజ్యాధికారంలో నియోగించడం కూడా కనబడుతుంది (3.3; 4.8).

వైదిక కాలంనుంచీ భారతదేశం వ్యవసాయమే ప్రధానవృత్తిగా గల దేశం. వేదకాలంనాటి ప్రజల జీవితమంతా భక్తితత్పరతతో నిండిపోయినదే. కాబట్టి పంటపొలాల అభివృద్ధికోసం, గోసంపద సంక్షేమంకోసం ఆనాటివారు దేవతలను ప్రార్థించడం ఈ వేదంలో మనం సహజంగా చూడగలం. పొలం దున్నడంలాంటి చిన్నపని కూడా వారు వైదికసంస్కారంతోనే చేసేవారు. పొలం దున్నే ముందు ఒక ప్రత్యేకమైన మంత్రం చదివి నాగలి సిద్ధం చేయబడేది (3.17.1).

అథర్వవేదంలో వ్యవసాయానికి సంబంధించిన ఎన్నో సూక్తాలున్నాయి. వ్యవసాయంలో అభివృద్ధిని, ఆనందాన్ని పొందడానికి దేవతల సాహాయ్యాన్ని కోరినట్లు మనమా సూక్తాల్లో చూస్తున్నాం.

1. R. N. Dandekar "Sources of Ancient Indian Polity, Election of a king A.V. 3.4." B.K. Barua commemoration Vol. Gauhati, 1960.

అందులో 63 మంత్రాలతో చాల పెద్దది, విశిష్టమైనదైన ఒక సూక్తం ఉన్నది (12.1). ■ సూక్తంలో పృథివి ఓషధులకు తల్లిగా, ఆహారాన్నిచ్చేదిగా, ప్రాణులకందఱకు శక్తినిచ్చేదిగా అభివర్ణింపబడింది. రక్షణకోసం, సంపదకోసం, బలంకోసం, పరిపోషణకోసం, దీర్ఘాయుష్యం కోసం పృథివి ప్రార్థింపబడేది. అందులో ఇంకో సూక్తం గోసంపద క్షేమంకోసమే ఉద్దేశింపబడి ఉంది (3.28). పశువుల్లోని క్రిమికీటకాలు నాశనమైపోవడంకోసం ఇంకో రెండు సూక్తాలున్నాయి (2.31,32). ఒక్క సూక్తంలో దివ్యమైన గోశాల పేర్కొనబడింది (3 - 14).

వ్యవసాయంమీద ఆధారపడ్డ సమాజంలో ఆవుల, ఎద్దుల ప్రాముఖ్యాన్ని తోసివేయడానికి వీల్లేదు. ప్రాచీనకాలంలో వేద కాలంనాటి ప్రజలకు గోసంపద ప్రధానమైన ధనంగా, గొప్ప ఆస్తిగా ఉండేది. ఆవులు ఎంతో పూజ్యభావంతో పోషింపబడేవి. గోవులను ప్రశంసించే సూక్తమొకటి అథర్వవేదంలో కనబడుతుంది (4.21). ఇంకో మంత్రంలో భూమికి, స్వర్గానికి, అంతరిక్షానికి అన్ని దిక్కులకు సమస్త విశ్వానికి శక్తినిచ్చేదిగా ఒక ఎద్దు ప్రశంసింపబడింది. (4.2.1;4.11.1).

క్రొత్తగా ఒక ఇల్లు కడితే, అది సంతోషానికి, విశ్రాంతికి, మంచి అదృష్టానికి స్థానం కావాలని ప్రార్థింపబడేది (3.12.2). జడపదార్థాల్లో కూడా దివ్యత్వాన్ని చూడగల మనస్తత్వం ఆనాడు ఉండేదని దీనివల్ల మనం తెలుసుకోవచ్చు

వేదకాలంనాటి ప్రజలు వర్తకం బాగా తెలిసినవారు. వర్తకం కోసం చాలా దూరదేశాలు వెళ్లేవారు కాబట్టి తమ వ్యాపారంలో వారు కొన్ని నియమాలను కట్టుదిట్టాలను అవలంబించేవారు. అథర్వవేదంలోని ఒక సూక్తంలో తమ వ్యాపారంలో లాభాలు రావాలని ఇంద్రాగ్నులను ప్రార్థించడం కనబడుతుంది (3.15.4).

అథర్వవేదంనాటి ప్రజలు వాదవివాదాల్లో ఉత్సాహం కలవాళ్లు. వాళ్లు గొప్ప ఆలోచనాపరులు. సామూహికచర్చల్లో ముఖ్య పాత్రను వహించేవారు. నేర్పుగా సంభాషణ చేయగలగాలనే కోరిక ఒక మంత్రంలో వ్యక్తం చేయబడింది (2.27.1).

కుటుంబసభ్యుల్లో అభిప్రాయభేదాలు రావడం, అవి వారిలో విభేదాలు కలిగించి విడదీయడం సహజం. విభేదాలు రావడానికి కారణాలు తప్పనిసరిగా తెలుసుకోవాలి. ఎందుకంటే ■ కారణాలు స్పష్టంగా తెలిసేంతవఱకు ■ విభేదాలను పోగొట్టుకోవటం చాల కష్టసాధ్యమైన పని. ముఖ్యంగా ఐకమత్యాన్ని చెడగొట్టేది ద్వేషం. కాబట్టి ద్వేషాన్ని పోగొట్టుకోవాలని (3.30), అది కుటుంబంలో మంచి వాతావరణాన్ని సృష్టిస్తుందని అథర్వవేదంలో ఒక సూక్తంలో చెప్పబడింది (3.30.7).

వేదకాలంనాటి ప్రజలకు మంత్రాల శక్తిసామర్థ్యాలపైన ఎంతో విశ్వాసం ఉంది. ఒక వ్యక్తిని తనలోనే రక్షించగల ప్రార్థన ఒక అంతఃకవచమని చెప్పబడింది (1.17.4). కుటుంబసభ్యుల్లో ఐకమత్యాన్ని సంపాదించడానికి ఒక మంత్రం ఉపయోగింపబడింది (3.30.4). ప్రయోగోపసంహారాలనే అభిచారకర్మలపైన వారికున్న విశ్వాసం ఇంకో మంత్రంలో స్పష్టంగా తెలుస్తున్నది. ఒక ప్రేమికుడు తన ప్రియురాలిని రాత్రిపూట కలుసుకోవాలంటే ఒక మంత్రాన్ని చదివేవాడు. దాంతో అతని కోరిక ప్రకారం ఆమె బంధువులందఱు, పక్కవారు, చివఱకు ఇంటికి కాపలా కాసే కుక్కతో సహా నిద్రలో మునిగిపోయేవారు (4.5.6). ఇతరుల దుష్టప్రయత్నాలవల్ల శరీరంమీద ఏర్పడిన అమంగళకరమైన మచ్చలు మొ॥ వాటిని ఒక మంత్రం సహాయంతో పోగొట్టుకోవడం ఇందులో కనబడుతుంది(1.18.3).

ఆనాటి ప్రజలకు శకునాలమీద కొన్ని నమ్మకాలున్నాయి. వారు సముచితమైన ప్రార్థనలద్వారా, యాగాదివైదిక కర్మలద్వారా అపశకునాల దుష్ఫలితాలను పోగొట్టుకోవడానికి ప్రయత్నించేవారు. ఉదాహరణకు- పసిపాపకు, పై రెండు పళ్లు ముందువస్తే అది తల్లిదండ్రులకు హానిని సూచిస్తుంది. పండ్లవల్ల సూచింపబడ్డ హాని కలగకుండా మంచికలగడానికి దేవతలను ప్రార్థించేవారు (6.140.1). కాకి ఇంట్లో దూరడం చెడుశకునంగా భావింపబడేది. దానివల్ల ఏ దుష్ఫలితమూ కలగకుండా ఉండడానికి ఒక వైదికకర్మ చేయబడేది (12.3.13).

గర్భిణీస్త్రీని బహుశ కొన్ని భూత-రాక్షసాదిగ్రహాలు ఆశించవచ్చనే నమ్మకం వారిలో ఉండేది కనుక అవి ఆశించకుండా ఆవాలు అగ్నిలో హోమం చేయబడేవి. కోడలు మొట్టమొదట తన భర్తతో కలవడానికి మామగారిని వదిలి దూరంగా వెళ్లినట్లు కొన్ని రాక్షసగ్రహాలు సూర్యుణ్ణి వదిలి దూరంగా వెడతాయని చెప్పబడింది. మామగారు తగిన వైదికసంస్కారం జరిపిన తరువాత కొత్తగా పెండ్లైన వధువు ఆయన అనుమతి తీసుకొని మొట్టమొదటిసారి తన భర్తను కలుస్తుందనే విషయం ఇక్కడ వ్యక్తమౌతున్నది.

ఆయుర్వేదం అథర్వవేదానికి ఉపవేదంగా చెప్పబడిందనే విషయం సుప్రసిద్ధమైంది. వ్యాధులను పోగొట్టే అనేక సూక్తాలు అథర్వవేదంలో ఉండటంవల్లనే అలా చెప్పబడింది. వైదికప్రజలకు మందులను గూర్చి మంచి విజ్ఞానం ఉంది. కనుక అథర్వవేదంలో పచ్చకామెర్లు (1.22), అతిసారం (2.3), జ్వరం (5.22; 19.34), ఆనువంశికంగా వచ్చే రోగాలు (2.8;3.7) పోగొట్టడానికి కొన్ని సూక్తాలు చెప్పబడినట్లు మనకు తెలుస్తుంది. స్తంభించిన మూత్రం జారీ కావడానికి కూడ ఒక సూక్తం ఇందులో కనబడుతుంది (1.3).

బిగబట్టిన మూత్రం సులభంగా జారీకావాలంటే మూత్రమార్గాన్ని విడదీయాలి. దానికి సన్నని బొప్పాయిగొట్టంలాంటి గొట్టాన్ని వారు ఉపయోగించేవారనే విషయం మనకు ఎంతో ఉత్సాహాన్ని కలుగచేస్తున్నది (1.3.7).

పాముల, తేళ్ల విషానికి విరుగుడు వారికి తెలుసు (8.56). క్షయవ్యాధిని పోగొట్టడానికి గుగ్గిలాన్ని ఎక్కువగా వాడేవారు (19.38). రక్తస్రావాన్ని ఆపడానికి ఒక సూక్తం చెప్పబడినట్లు కనబడుతుంది (1.17.1). జుట్టులేనివారికి చాలినంత జుట్టు పెరగడానికి మూడు సూక్తాలు చెప్పబడ్డాయి (6.21.136, 137). అలాగే నేత్రవ్యాధులను పోగొట్టడానికి (6.16), గర్భస్రావాన్ని ఆపడానికి (2.25,20.96,11,16), క్రిములను నాశనం చేయడానికి కూడ (2.31,32; 4, 37; 5.23) అథర్వవేదంలో మంత్రాలున్నాయి. ఈ సందర్భంలో అపామార్గ (గాడిదగడ్డపాకు) పిప్పలి, పృష్ణపర్ణి, రోహిణి, లాక్ష, అంజన మొ॥ ఓషధులు పేర్కొనబడ్డాయి.

అథర్వసంహితలోని సాంఘికవ్యవహారాల్లో ముఖ్యంగా చెప్పుకోదగింది ఇంద్రజాలప్రదర్శనం. అథర్వపురోహితుడు శంఖంతో (4.10), వరణతో (10.3), దర్భతో (19.28.30,12.33), ఔదుంబరంతో (19.31), జంగిడతో (19.34.35) తయారుచేసిన కంకణాన్ని ఉపయోగించేవాడు. అథర్వవేదంలోని ఒక సూక్తం (5.31) గారడీలో ఉపయోగించే అనేక వస్తువులను పేర్కొంటున్నది. ఆ వస్తువులేవంటే- కాల్చని పచ్చికుండ, అనేక ధాన్యాల మిశ్రణం, పచ్చిమాంసం, కోడి, మేక, గొర్రెపోతు, ఒకే గిట్టగల పశువులు, రెండు దంతాలు గల జంతువులు, గాడిద, వేరులేని మొక్క, అగ్ని, పాచికలు మొదలైనవి. వేరేచోట ఇంద్రజాలంలో ఉపయోగించే అనేక ధాన్యాలను పేర్కొనడం మనం చూస్తాం. యవలు (2.8.3; 6.30.1), నువ్వులు (2.8.3; 6.140.2), చిక్కుడుగింజలు వాటిలో కొన్ని మాత్రమే.

అథర్వవేదంలో చాల ముఖ్యమైన ఒక ఐంద్రజాలిక విశేషమే మంటే ఒక బొమ్మను సృష్టించి దాన్ని ముక్కలు ముక్కలుగా పగల గొట్టడం లేక తగులబెట్టడం ఇది బొమ్మలను, ఆకారాల నమూనాలను, ఇంకా ఇతరమైన వ్యక్తుల ప్రతినిధులను మాయతో కల్పించినాశనం చేసే బొమ్మలగారడీలాగా ఉంటుంది. విరోధులపై నున్న అసూయద్వేషాలు, ఉద్వేగాలను తీర్చుకోవడానికి వారి ప్రతినిధులుగ చేసిన ఈ బొమ్మలు కొంతవఅకు ఉపయోగపడతాయి. చంద్రకర్రతో చేసిన శూలాన్నిగాని, మేకునుగాని, లేక కొమ్మునుగాని శత్రువును మాంత్రికంగా నాశనం చేయడానికి ఉపయోగించేవారు. మాంత్రికులు చేసిన కుటిలమైన ప్రయోగాలను ఉపసంహరించడానికి, (కృత్యాప్రతిహరణం) దయ్యాలను వదిలించడానికి కూడ కొన్ని ఆభిచారికకర్మలు ఈ వేదంలో చెప్పబడ్డాయి.

వేదకాలంనాటి ప్రజలు మంచి ఆలోచనాపరులు. కనుక అథర్వవేదంలో ఎన్నో తాత్త్వికవిషయాలకు సంబంధించిన సూక్తాలున్నాయి. మంత్రద్రష్టయైన వేనుడు పేర్కొన్న సూక్తం (2.1) దీనికి మంచి ఉదాహరణం ఇంకొక సూక్తంలో మంత్రద్రష్ట సృష్టికి, సృష్టికర్తకు సంబంధించిన రహస్య విజ్ఞానాన్ని ఆవిష్కరించాడు (10.8.32). రెండు సూక్తాల్లో కాలం వర్ణింపబడింది (19.53.54). అక్కడ కాలం ఏడు కళ్లేలతో పట్టుకోబడ్డ గుఱ్ఱంలాగా అభివర్ణింపబడింది. తెలివితేటలు గల జ్ఞానులు మాత్రమే దాన్ని అధిరోహించగలరు (17.53.1). ఈ సమస్త విశ్వానికి పూనికయైన స్కంభుని అథర్వవేదం వర్ణిస్తున్నది (10.7). వేదసంహిత లన్నింటిలోను అథర్వసంహితలో విశ్వానికి, పరబ్రహ్మకు, సంబంధించిన సూక్తాలు ఎక్కువ సంఖ్యలో మనకు కనపడతాయి. వాటిలో ఎక్కువగా జీవాత్మ (5:9; 8.111; 9.9.10) పరమాత్మలను (4.1; 5.6; 10.2.8) గురించిన ప్రస్తావన ఉన్నది. అథర్వవేదంలో లోకంలోని

ప్రాణులందరి క్షేమాన్ని కోరే సూక్తం కూడా ఉన్నది (1.31.4). ఇందులోని పదమూడవకాండ మొత్తం తాత్త్వికసూక్తాలతో నిండి ఉంది.

ఆధ్యాత్మికభావన ఉన్నప్పటికీ వేదకాలంనాటి ప్రజలు లౌకికజీవనంలోను మంచి ఉత్సాహం కలవారే. కనుక ఆరోగ్యంకోసం, నూరు సంవత్సరాల దీర్ఘాయుష్యంకోసం, జీవితంలో వచ్చే అనేక పరిణామాలను తట్టుకొని నిలబడడానికి కావలసిన రాతివంటి దృఢశరీరం కోసం వారు దేవతలను ప్రార్థించేవారు (2.13.4). తమ జీవనాన్ని ఆనందమయం చేయమని ప్రార్థనలు చేసేవారు (1.51). ఈ లోకంలో మంచి జీవితాన్ని కోరినప్పటికీ, వారికి భగవంతుని గురించి ఆయన్ను చేరే మార్గం గురించి బాగా తెలుసు. అనాటి సమాజంలో ఒకవైపు అనేక పరీక్షలతో, కష్టాలతో ఉండే సామాన్య మానవుడు, ఇంకో వైపు మోక్షాన్ని కోరుతూ, సృష్టికారణాలను అన్వేషించే యోగియైన తాత్త్వికుడు కూడా ఉండేవారు. ఇలా అథర్వసంహిత వైదికసమాజంయొక్క సంపూర్ణస్వరూపాన్ని మనకందిస్తున్నది.

- బి.ఆర్.ఎమ్.

## 5. 11 కవితాసౌందర్యం

విశ్వసాహిత్యంలో వైదికవాఙ్మయం ఎంత ప్రాచీనమైందో, అంత శ్రేష్ఠమైందిగా గూడా పరిగణింపబడుతున్నది. పరిశోధకులు అనేక దృక్కోణాలనుంచి వేదాల ప్రాశస్త్యాన్ని పరిశీలించటం జరుగుతున్నది.

ప్రాచీన వేదసంహితల్లోనే కవితాచమత్కృతిని పుణికి పుచ్చుకొన్న మంత్రాలు అనేకం గోచరిస్తున్నాయి. అందువల్ల సమస్తధర్మాలకూ మూలంగా పరిగణింపబడే వేదంలోనే తర్వాతి కాలంలో ఎంతగానో అభివృద్ధిచెందిన రమణీయమైన కావ్యవాఙ్మయానికి మూలమైన బీజాలు నిక్షిప్తమైన వున్నాయనడంలో సందేహం లేదు.

వేదాల్లోనే కావ్యం అనేపదం చాలాసార్లు ప్రయోగింపబడింది. `జల్లెడతో జల్లించి మేలైన పిండిపదార్థాన్ని వేరుచేసినట్లు కవులు ప్రతిభతో సందర్భ శుద్ది' గల పదాలను ఎన్నుకొని కవిత్వం చెప్పితే ఆ కవిత్వం అర్థవంతమై సహృదయులను ఆకట్టుకొనేవిధంగా రాణిస్తుందని ఋగ్వేదం చెబుతున్నది__

సక్తుమివ తితఉనా పునన్తః
యత్ర ధీరా మనసా వాచ మక్రత ।
అత్రా సఖాయః సఖ్యాని జానతే
భద్రైషాం లక్ష్మీర్నిహితాధి వాచి ॥ ఋ.సం. **10-71-2**

ఈ అభిప్రాయంతోనే తర్వాతి ఆలంకారికులు మళ్లీ మార్చటానికి వీలుగాని పదాలను ప్రయోగించడంలోనే కవుల గొప్పతనం ఇమిడివుందని స్పష్టంగా చెప్పారు.

అథర్వవేదానికి యజ్ఞక్రియాకలాపంతో ఎక్కువ సంబంధంలేదు. జనన మరణ వివాహాది సంస్కారాలు, రాజ్యాభిషేకం, శత్రునిరోధం,

రోగనివారణం, మొ॥ క్రియలలో వినియోగించే మంత్రాలే ఈ వేదంలో ఎక్కువగా గోచరిస్తాయి. అభిచారిక క్రియలను ముఖ్యంగా వివరించే వేదమిది.

అథర్వసంహితలో ఇంచుమించు ఆరువేల మంత్రాలున్నాయి. అందులో కవితాశోభను ప్రదర్శించే భాగాలు కొల్లలు. శత్రువులను భేదించడంలో అథర్వవేదమంత్రాలు పరమాయుధాలని మను ధర్మశాస్త్రం పేర్కొన్నది. అందుకు తగినట్లే పదప్రయోగంలోనూ, పద్యనిర్మాణంలోనూ సందర్భోచితమైన స్ఫూర్తి ఈ సంహితలో అక్కడక్కడా వ్యక్తమవుతున్నది.

ఇతరవేదాలకు యజ్ఞాలతోనే ఎక్కువ సంబంధం. ఈ వేదం అలాకాక అనేక విషయాలను వివరిస్తుంది కాబట్టి ఆయావిషయాలకు తగిన నానావిధ పదజాలం ఇందులో చోటు చేసుకొన్నది. పదప్రయోగంలోని వైవిధ్యం కూడా ఈ సంహితకు ఎనలేని శోభ చేకూర్చిందని నిస్సంశయంగా చెప్పవచ్చు.

కవితకు శోభ కలిగించేవాటిల్లో వర్ణన ఒక ప్రధానమైన అంశం. వర్ణనానిపుణుడే కవి అనబడతాడు. అందుకే ఆలంకారికులు మహా కావ్యాలలో అష్టాదశవర్ణనలు వుండాలన్నారు.

అథర్వసంహితలో వర్ణనావైశిష్ట్యాన్ని ప్రదర్శించే సందర్భాలు చాలా వున్నాయి. 4 వ కాండలోని 16 వ సూక్తం వరుణ దేవతను ఇలా వర్ణిస్తున్నది:

"వరుణుడు శత్రువులకు నియంత. వాళ్ళుచేసే అన్యాయాల నన్నింటినీ ఆయన దగ్గరనుంచి చూసినట్లే గ్రహిస్తాడు. చరాచరమైన సకలజగత్తూ ఆయనకు కరతలామలకం. ఎదురుగా నిలిచేవాడూ, పారిపోయేవాడూ, మోసంచేసేవాడూ, కనిపించకుండా తిరిగేవాడూ,

కష్టజీవనంతో ప్రవర్తించేవాడూ - ఇలాంటివాళ్ల నందరినీ వరుణుడు పరిశీలిస్తూనే వుంటాడు. ఇద్దరు ఒకచోట చేరి రహస్యంగా ఏమి మాట్లాడుకున్నా సర్వజ్ఞుడైన వరుణుడు దాన్ని చక్కగా గ్రహిస్తాడు. అందువల్ల తప్పుడుపనులకు పాలుపడకముందే వాళ్లను ఆయన నిగ్రహిస్తాడు ఈ భూమి ఆయన వశంలోనే ఉన్నది సువిశాలమైన ఆకాశంకూడా ఆయన అధీనంలోనే ఉంది. అంతేకాదు; పూర్వపశ్చిమ సముద్రాలే ఆ వరుణుడికి కుక్షిభాగాలు. జగమంతటా వ్యాపించివున్న ఆదేవుడు ఈ చిన్న తటాకంలోని నీళ్లలోకూడా దాక్కొని వుంటాడు. చెడుమార్గంలో సంచరించే అనర్థకారులైన శత్రువులను వరుణుని పాశాలు వదలవు ఆయన గూఢచారులు భూలోకానికి వచ్చి వెయ్యి కళ్లతో ఇక్కడి వృత్తాంతాన్ని గమనిస్తూ వుంటారు. భూమ్యాకాశాల మధ్య వుండే ప్రాణిలోకాన్నంతటినీ ఆయన కళ్లారా చూస్తూ వుంటాడు. జూదగాడు పాచికలను ఆడించినట్లే జవులను వాళ్ల పాపపుణ్యకర్మల ననుసరించి ఆయన ఆడిస్తూవుంటాడు"(4.16.1,6).

ఇలాంటి వర్ణనలు వైదిక కవుల ప్రతిభకు గీటురాళ్లు పై వర్ణనకు సంబంధించిన ఈ క్రింది మూడుమంత్రాలను ఉదాహరిస్తూ ప్రముఖవేదపండితుడు మాక్డోనెల్ ఇంత అందమైన వర్ణన వేదాలలో కూడా ఇతరత్రా ఎక్కడా లేదని శ్లాఘించాడు__

ఉతేయం భూమిర్వరుణస్య రాజ్ఞ
ఉతాసౌ ద్యౌర్బృహతీ దూరే అన్తా ।
ఉతో సముద్రౌ వరుణస్య కుక్షీ
ఉతాస్మిన్నల్ప ఉదకే నిలీనః ॥ 4 ॥

ఉత యో ద్యామతిసర్పాత్ పరస్తా
న్నస ముచ్యాతై వరుణస్య రాజ్ఞః ॥
దివస్పృశః ప్రచర న్తీదమస్య
సహస్రాక్షా అతి పశ్యన్తి భూమిమ్ ॥ 5 ॥

సర్వం తద్రాజా వరుణో విచష్టే
యదంతరా రోదసీ యత్పరస్తాత్ ।
సంఖ్యాతా అస్య నిమిషో జనానా
మక్షానివశ్వఘ్నీ నిమినోతి తాని ॥ 6 ॥

ఈసంహితలోని ద్వాదశకాండలో 63 మంత్రాలు గల ప్రథమసూక్తం భూమిని అత్యద్భుతంగా వర్ణిస్తున్నది. వైదికసాహిత్య పరిశోధకులందరూ ఈ సూక్తంలోని వర్ణనావైచిత్రిని ముక్తకంఠంతో శ్లాఘించారు. అందులోని ఒక మంత్రం ఇది___

యస్యాం గాయన్తి నృత్యన్తి భూమ్యాం మర్త్యా వ్యైలభాః
యుధ్యన్తే యస్యామాక్రందో యస్యాం వదతి దుందుభిః
సా నో భూమిః ప్ర ణుదతాం సపత్నా
న సపత్నం మా పృథివీ కృణోతు. (12-1-41)

దీని తాత్పర్యమిది- 'ఏ భూమి మీద మనుష్యులు ఆడుతూ పాడుతూ వుంటారో, ఎక్కడ యుద్ధానికి తలపడుతూ వుంటారో, ఎక్కడ ఆక్రందనాలూ, దుందుభిధ్వనులూ వినిపిస్తూ వుంటాయో, ■ భూమి మాశత్రువులను తరిమికొట్టుగాక! నన్ను శత్రువుల బారి నుండి తప్పించుగాక!'

ఇక్కడ భూతలంమీది ఆటపాటలతోబాటు ఆక్రందనాలనూ, యుద్ధకాలంలోని దుదుంభిధ్వనులనూ కూడా వర్ణించడం వల్ల ఈ ప్రపంచం సుఖదుఃఖాలకు నిలయమన్న సత్యం స్ఫురిస్తున్నది. శాకుంతలంలో చంద్రాస్తమయంతోబాటు అదేసమయంలో జరుగు తున్న సూర్యోదయాన్ని కూడా వర్ణించిన కాళిదాసుని భావం ఈ కోవకు చెందిందే.

పై పృథివీసూక్తంలోని వర్ణనతో పోల్చి చూస్తే ఈ ధోరణిలో సాగిన రమణీయమైన వర్ణనలు తరువాతవచ్చిన కావ్యజగత్తులో గూడా మనకు అరుదుగానే గోచరిస్తాయి. చెట్లూ, వరిపొలాలూ,

వివిధమృగాలూ, పశుపక్షులూ, నదులూ, కొండలూ, గుట్టలూ, మారుతున్న ఋతువులూ, రాత్రింబవళ్లూ, యజ్ఞయాగాలూ మొదలైన భూతలంలోని విశేషాలన్నీ ఇందులో మనోజ్ఞంగా వర్ణింపబడ్డాయి.

వర్ణనలతోపాటు కావ్యసౌందర్యానికి అలంకారాలు గూడా ఎంతో ఉపకరిస్తాయి - ఋగ్వేదకాలంనుండీ వేదసంహితలలో ఉపమ మొదలైన అలంకారాల ప్రయోగం విస్తృతంగానే కన్పిస్తున్నది.

అథర్వసంహితలోని ఐదవకాండలో దుందుభిని వర్ణించే సూక్తంలో మాలారూపమైన ఉపమాలంకార ప్రయోగం ఎంత సొంపుగా వుందో చూడండి-

> యథా మృగాః సంవిజన్త ఆరణ్యాః పురుషాదధి ।
> యథా వృకాదజావయో ధావన్తి బహు బిభ్యతీః ॥
> యథా శ్యేనాత్పతత్రిణః సంవిజన్తే
> అహర్దివి సింహస్య స్తనథోర్యథా ।
> ఏవా త్వం దుందుభేஉమిత్రానభిక్రంద
> ప్రత్రాసయాథో చిత్తాని మోహయ ॥ (5.21.4-6)

'వేటగాణ్ణి చూసి అడవిమృగాలు పారిపోయినట్లు, తోడేలుకు భయపడి మేకలు పరుగెత్తినట్లు, డేగను చూసి సింహగర్జన విన్నవాటిలాగా పక్షులు ఎగిరిపోయినట్లూ ఓ దుందుభీ! నీధ్వనితో శత్రువులను భయపెట్టి పారదోలు ! వాళ్లకు చిత్తక్షోభం కలిగించు!'

ఇలాంటి అలంకారప్రయోగాలవల్ల మంత్రాలకు కావ్యశోభ కల్గడమే కాకుండా అర్థవ్యక్తీకరణలో స్పష్టత గూడా సిద్ధించింది.

ఇక్కడ మరొక విశేషమేమంటే పైన ఉదాహరించిన మూడు మంత్రాలలోనూ ఉత్తరార్థం పునరుక్తమయింది. ఇలాంటి పునరుక్తులు ఈ వేదంలో అక్కడక్కడా కానవస్తాయి. మంత్రప్రయోక్తయొక్క దృఢనిశ్చయాన్ని తెలపటానికి ఉపయోగింపబడిన పునరుక్తులు ఈ సందర్భంలో భూషణాలే కాని దూషణాలుకావు.

ఈ సంహితకున్న మరొక ప్రాముఖ్యమేమంటే_ఆత్మస్వరూపాన్ని విపులంగా నిరూపించే ఉపనిషత్తులలోని అత్యున్నతభావాలకు మూల బీజాలు ఇందులో పుష్కలంగా వున్నాయి. పదవకాండలోని అధ్యాత్మ దేవతాకమైన ఎనిమిదవ సూక్తం ఈ భావాలకు నిలయం. అందలి ఈ క్రింది మంత్రం ఆత్మానాత్మల తత్త్వాన్ని అలంకారికమైన శైలిలో నిరూపిస్తున్నది.

పుండరీకం నవద్వారం త్రిభిర్గుణేభి రావృతమ్ ।
తస్మిన్యధ్యక్ష మాతన్వత్ తద్వై బ్రహ్మవిదో విదుః ॥ (10-8-43)

తొమ్మిది ద్వారాలతో కూడిన త్రిగుణాత్మకమైన పద్మంలో ఉన్న ఆత్మను బ్రహ్మజ్ఞులే తెలుసుకోగలరని దీని భావం.

ఇక్కడ ఉపమేయమైన మానవశరీరం వాచ్యంగా పేర్కొన బడకుండా పద్మంతో పోల్చబడింది. సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు ఆత్మను దేహంలో బంధిస్తున్నాయని వేదాంతుల సిద్ధాంతం. అభివృద్ధి చెందిన కావ్యశైలికి ఇదొక చక్కని నిదర్శనం.

మానవుణ్ణి అధికంగా పీడించేది మృత్యుభయం. సకలప్రాణులూ మృత్యుభీతితోనే అల్లాడుతున్నారు. ఈ భయాన్ని తొలగించుకోవాలంటే ఈ శరీరం తాను కాననీ, నిత్యస్వరూపుడూ, జరా మరణాదిరహితుడూ అయిన ఆత్మే తాననీ తెలిసికోవాలి. ఆత్మ జ్ఞానం తప్ప సంసారచక్రంనుంచి తప్పించుకోవటానికి మరొక మార్గం లేదు. ఇది సకలోపనిషత్తుల ప్రబోధసారం. ఈ పరమతత్త్వాన్ని పై సూక్తంలోని చివరిమంత్రం ఇలా బోధిస్తున్నది._

అకామో ధీరో అమృతః స్వయంభూ
రసేన తృప్తో న కుతశ్చ నో నః ।
తమేవ విద్వాన్ న బిభాయ మృత్యో
రాత్మానం ధీరమజరం యువానమ్ ॥ (10-8-44)

అంటే "కామరహితుడూ, ధీరుడూ, స్వయంభువూ అయిన ఆత్మ సర్వసమర్థుడై ఆత్మానందంతో తృప్తుడైవున్నాడు. వార్ధక్యాది దుర్దశలు లేకుండా నిత్యయువకుడైన అట్టి ఆత్మను తెలిసికొన్న వాడికి మృత్యుభయం లేనే లేదు".

అజ్ఞాననివారణకోసం ఆత్మజ్ఞానం ఆవశ్యకమనేది ఇందులోని పరమార్థం శరీరం శాశ్వతం కాకపోయినా నిత్యాత్మజ్ఞానానికి సాధనంగా మాత్రం ఉపయోగపడుతుంది. అందుకే **"శరీరమాద్యం ఖలు ధర్మసాధనం"** అని చెప్పాడు మహాకవి. శరీరారోగ్యాన్ని ఉద్దేశించే పెక్కుమంత్రాలు ఈ సంహితలో సాక్షాత్కరిస్తాయి. కాసరోగ నివారణకు ప్రయోగింపబడే ఈ క్రింది మంత్రాలలో భావతీవ్రతకు తగినట్లు అలంకారాలుకూడా ప్రయోగింపబడ్డాయి._

యథా బాణః సుసంశితః పరాపతత్యాశుమత్ ।
ఏవాత్వం కాసే ప్ర పత పృథివ్యా అను సంవతమ్ ॥
యథా సూర్యస్య రశ్మయః పరాపతన్త్యాశుమత్ ।
ఏవా త్వం కాసే ప్ర పత సముద్రస్యాను విక్షరమ్ ॥ **(6.105.2; 3)**

"ఓ కాసరోగమా! పదునైనబాణం విల్లునుండి విడిబడి మహావేగంతో ఎలా భూమిని భేదించుకొని పోతుందో, అలాగే నీవు ఈ పురుషుణ్ణి వదలి భూవివరం గుండా పాతాళంవరకూ వెళ్లు! సూర్యకిరణాలు ఎలా లోకాలోకపర్యంతం శీఘ్రంగా వెళ్తాయో అలాగే నీవు వీణ్ణి విడిచి సముద్రం వరకూ వెళ్లు!"

పదప్రయోగం వ్యర్థంగా కాక భావగర్భితంగా వుంటేనే కావ్యం శోభిస్తుంది. అందుకే మేటికవులు పదప్రయోగంలో ఎంతో జాగరూకులై వుంటారు.

మంచి భర్తకావాలని కోరుకునే వధువును ఆశీర్వదిస్తూ, యోగ్యుడైన పతి ఆమెకు లభించాలని చేస్తున్న ఈ క్రింది ఆశీర్వాదం ఎంతో భావగర్భితంగావుంది_

ధాతా దాధార పృథివీం ధాతా ద్యాముత సూర్యమ్ ।
ధాతాస్యా అగ్రువై పతిం దధాతు ప్రతికామ్యమ్ ॥ (6-60-3)

'పృథివినీ, ఆకాశాన్నీ, సూర్యుణ్ణీ ధరిస్తున్న సృష్టికర్త ఈ కుమారికి ఈమెకోరికకు తగిన పతిని ప్రసాదించుగాక!'

పృథివ్యాదులను ధరించే ధాత వధువుకు వరుణ్ణి చేకూర్చాలనడంలో ఆమె చేపట్టబోయే భర్త ఆమెనావిధంగా భరించేవాడుగా వుండాలనీ, వారి కుటుంబం విచ్ఛిన్నం కాకుండా విలసిల్లాలనీ వ్యక్తమవుతున్నది.

ఇలాంటి సాభిప్రాయపదప్రయోగమే పరికరము, పరికరాంకురము అన్న అలంకారాలుగా తర్వాతికాలంలో సాహిత్యశాస్త్రజ్ఞులు సిద్ధాంతీకరించటానికి హేతువైంది.

దాంపత్యం ఎలావుండాలో నిర్దేశిస్తూ మరొక మంత్రం ఇలా చెబుతున్నది._

'అమోహమస్మి సా త్వం
సామాహ మస్మ్యృక్ త్వం ద్యౌరహం పృథివీ త్వమ్ ।
తావిహ సంభవావ ప్రజామా జనయావహై ॥'(14-2-71)
భర్త భార్యతో ఇలా అంటున్నాడు_

"నేను సామను, నీవు ఋక్కువు, నేను ఆకాశాన్నీ, నీవు భూమివి. మనం కలిసిమెలసి జీవిస్తూ సంతానవంతులం ఔదాం!"

సంసారంలో ఉండవలసిన అన్యోన్యతను పై మంత్రం నిరూపిస్తున్నది. వైదికకాలంనుంచీ ఇలాంటి ఉజ్జ్వలభావాలుండటం వల్లనే ఈనాటికీ భారతీయుల గృహస్థజీవనం విచ్ఛిత్తికి దారి తీయకుండా సుఖసంతోషాలకు కారణం కాగలుగుతున్నది.

ఇక ఈ వేదసంహిత లోకక్షేమంకోరి ప్రజలకు చేస్తున్న హితబోధకూడా చాలా శ్లాఘనీయమైవుంది._

'సామ్మనస్యం కోరే ఓ ప్రజలారా! మీరు సమానజ్ఞానంకల్గి వుండండి! సమంగా పనులలో పాలుపంచుకోండి! మీమనస్సులు ఒకే రకమైన అర్థాన్ని గ్రహించుగాక! పూర్వం ఇంద్రాదిదేవతలు ఇలా పరస్పర విరోధంలేకుండా వుండి ఇష్టఫలాన్ని పొంది సుఖించారు. మీ అలోచన, కార్యప్రవృత్తీ, సంకల్పమూ, హృదయాలూ ఏకరూపంగా ఉండుగాక!'

ఈ సందర్భంలోని మూడవ మంత్రమిది._

'సమానీ వ ఆకూతిః సమానా హృదయాని వః ।
సమానమస్తు వో మనో యథా వః సుసహాసతి ॥ **(6-64-3)**

రాజులాగా శాసించాల్సిన వేదం ఇక్కడ అత్యంతసౌమనస్యంతో పరమోపదేశం చేసింది ఇలాంటి సదుపదేశాలున్న ఘట్టాలు ఇంకా ఎన్నో వున్నాయి. హితోపదేశంకూడా కావ్య ప్రయోజనాలలో ఒక ముఖ్యాంశంగా లాక్షణికులు పేర్కొన్నారుగదా!

నానావిధద్వేషభావాలతో సతమతమవుతున్న ఆధునిక ప్రపంచ ప్రజలకు అథర్వసంహిత కావించిన ఈ మహోపదేశం ఎంతైనా శిరోధార్యం.

**- ఎస్.ఎల్.ఎన్.**

## 5. 12 కాండలు - సంగ్రహసమీక్ష

నాలుగవవేదంగా పరిగణింపబడిన అథర్వసంహిత ఇరవై కాండలుగా విభజింపబడింది. ఈ ఇరవై కాండలు సూక్తాలు, ప్రపాఠకాలు, అనువాకాలు, దశతులనే అవాంతరవిభాగాలతో ఉన్నాయి (చూ.పే.429). ఇందులోని మంత్రాలు కేవలం ఋగ్వేదంలోలాగా పద్యరూపాలే కాక యజుర్వేదం మాదిరి గద్యరూపంలోకూడ ఉన్నాయి. విశేషంగా 15,16 కాండల్లో సుమారు 50 మంత్రాలు, ఇతరకాండల్లో అక్కడక్కడ ముప్పై దాకా ఈ గద్యమంత్రాలు దొరుకుతున్నాయి. ఇంకా కొన్ని చోట్ల పద్యమయమైన మంత్రాల మధ్యలో కొన్ని గద్యభాగాలుకూడా లేకపోలేదు.

ఈ సంహితలో మొదటి పదమూడు కాండలు మాత్రమే మొదట ఉండేవనీ, తరువాత ఏడుకాండలు చేర్చబడ్డాయని అందులోని విషయాలను, విభాగపద్ధతిని, దృష్టిలో పెట్టుకొని కొందఱు పాశ్చాత్యులు అభిప్రాయపడ్డారు. కాని విషయవిభాగసామ్యమున్నంతమాత్రాన అంతవఱకే మూలగ్రంథమని నిర్ణయింపబూనటం సాహసమని భారతీయుల భావన.

మొదటి ఏడు కాండల విభాగం అందులో ఉన్న సూక్తాల మంత్రసంఖ్యనుబట్టి చేయబడిందని కొందఱంటారు. మొదటికాండలో నాలుగు, రెండవకాండలో ఐదు, మూడవకాండలో ఆరు, నాలుగవ కాండలో ఏడు, ఐదవకాండలో ఎనిమిదినుంచి పదెనిమిదివఱకు, ఆరవకాండలో మూడు, ఏడవకాండలో సగభాగంలో ఒక్కొక్కటి మాత్రమే ప్రతి సూక్తంలోను మంత్రాలు కనబడుతున్నాయి. ఎనిమిదినుంచి పదమూడు కాండలవఱకు గల మంత్రాలు దీర్ఘచ్ఛందస్సుల్లో ఉన్నాయి. మొదటి పదమూడు కాండల్లోని విషయాలు చిందరవందరగా ఉన్నాయేగాని ఒక పద్ధతిప్రకారం చెప్పబడినట్లు లేవు.

ఇక పధ్నాలుగునుంచి పద్దెనిమిదివఱకు గల ఐదుకాండల్లో విషయం ఏదో ఒక పద్ధతిప్రకారం ఉన్నట్లు తోస్తుంది. వివాహానికి సంబంధించిన మంత్రాలు పధ్నాల్గవకాండలో చెప్పబడ్డాయి. అందులో చాలావఱకు ఋగ్వేదం పదోమండలాన్నుంచి తీసుకోబడినవే. పదిహేనవకాండ వ్రాత్యుడనే పేరుకల పరమాత్మను స్తుతిస్తుంది. పదహారు పదహేడవ కాండల్లో వశీకరణ మంత్రాలు చెప్పబడ్డాయి. ఈ రెండు చాల చిన్నవి. పదహారవకాండలో తొమ్మిది సూక్తాలు, పదిహేడవకాండలో ఒక్క అనువాకం మాత్రమే ఉన్నది. పద్దెనిమిదవకాండం మరణానంతరం చేసే ఖననసంస్కారాన్ని గురించి, పితృదేవతలనుగురించి వివరిస్తున్నది. ఇందులోని మంత్రాలుకూడా ఋగ్వేదంలోని పదవమండలంలోని మంత్రాలతో పోలి ఉంటాయి.

ఇక పందొమ్మిది, ఇరవై కాండలు ఆధునికాలుగా కనబడతాయి. పందొమ్మిదోకాండలో పరిశిష్ట భాగాలుకూడా లేకపోలేదు. ఇరవైయ్యవకాండలో ఋగ్వేదంలోని ఇంద్రస్తుతిపరాలైన సూక్తాలు కొన్ని మక్కికి మక్కిగా కనబడతాయి. ఈ కాండలో సోమయాగానికి సంబంధించిన మంత్రాలుండటం చూస్తే దీనికి వేదత్వప్రతిపత్తి కల్పించడానికి ఇలా యజ్ఞసంబంధం ఏర్పరచారేమోననిపిస్తున్నదని పాశ్చాత్యపరిశోధకులు అభిప్రాయపడ్డారు. ఈ కాండలో 'కున్తాప సూక్తాల'నే పేరుతో పది సూక్తాలున్నాయి **(127-136)**. ఇవి ఋగ్వేదంలోని దానస్తుతులను అనుకరిస్తూ ఉంటాయి. ఇలా ఈ సంహితలోని ఇరవైకాండల స్వరూపం మనం సంగ్రహంగా తెలుసుకోవచ్చు. ఈ కాండల్లో ప్రతిపాదింపబడిన విషయాలను స్థాలీపులాకంగా అక్కడక్కడ పరిశీలిస్తే ఈ సంహితలో గల ఆనాటివారి విజ్ఞానం, ఆలోచనలు, ఆదర్శాలు, ఆచారాలు మొ॥ వాటిని మనం అర్థంచేసుకోవచ్చు. మచ్చుకు కొన్నింటిని చూడండి:

## పుట్టింట్లోనే ఉండిపోనీ !

ఆడవారి మనసులో అసూయ ఏర్పడనంతవఱకు బాగానే ఉంటుంది. అసూయ అడుగుపెడితే చాలు, ద్వేషం నేనిక్కడే ఉన్నానంటూ ప్రత్యక్షమౌతుంది. ద్వేషాగ్ని మనసులో రగుల్కొంటే ఏమేమి చేస్తుందో ఎలా చెప్పగలం? తమ విరోధులను దురదృష్టవంతులను చేయడానికి వారు వాడిన పూలను, బంతులను, దంతధావన ద్రవ్యాన్ని, జుట్టును ఈ వేదంలోగల ప్రథమకాండలోని పద్యాల్లవ సూక్తాన్ని ఉచ్చరిస్తూ నేలలో పాతిపెట్టేవారు ఆనాటి వారు. దాని భావం గమనించండి:

> "విరబూసిన చెట్టునుంచి అందఱు ఎలా పూలు కోసుకుంటారో అలా నేను ఈమె భాగ్యాన్ని అందచందాలను అపహరిస్తున్నాను ఈమె భూమిలో బాగా పాతుకుపోయిన పర్వతంలాగా భర్తముఖం మళ్లాచూడకుండా పుట్టింట్లోనే స్థిరంగా ఉండిపోవాలి. ఓ సోమా! ఈమెను మెట్టినింటినుంచి పుట్టినింటికి వెళ్ళగొట్టు అదృష్టహీన అయిన ఈమె కట్టేసినట్లు జీవితాంతం వఱకు అక్కడే ఉండిపోనీ!" (1 14)

## క్రిమిరోగాల నరికడతాను !

క్రిములవల్ల మానవశరీరంలో అనేకరోగాలు కలుగుతున్నాయనే సత్యం ఈ వేదంలో గుర్తింపబడింది. రోగాలను పోగొట్టుకోవడానికి ఈ సూక్తం ఉపయోగపడుతుంది. చూడండి:

> "ఇంద్రశిల క్రిమిరోగాలనన్నిటిని పోగొట్టగలదు శనగలను రాతిమీద నూరినట్లు ఈ శిలతో నా శరీరంలోని రోగాలనన్నింటిని చూర్ణం చేస్తాను క్రిములుకొన్ని కంటికి కనపడతాయి; కొన్ని కంటికి కనపడవు, వలవేసి పట్టినట్లు పట్టి వాటినన్నింటిని నాశనం చేస్తాను. పేగుల్లోను, శిరస్సులోను, మడమలలోను, ఉండే క్రిములు పుండ్లద్వారా అన్న పానీయాలద్వారా మనలో ప్రవేశిస్తున్నాయి. వాటి ఉత్పత్తినే నేను అరికడతాను" (2.31).

## ఇష్టమైన స్త్రీని వశపరచుకోవాలంటే !

ఆమె చాల అందమైనది. ఆమెపైన తన కెంతో ఇష్టం. కాని అందుబాటులో లేదు. మరి ఎలా ఆమెను తనదాన్ని చేసుకోవడం? ఈ క్రింది సూక్తాన్ని జపిస్తూ ఆ స్త్రీని వేలితో తాకితే అంతే, ఆమె అలాగే వశపడుతుంది. చూడండి:

> "ఉత్తుదుడనే దేవుడు నిన్ను కామార్తురాలిని చేయాలి. సూదులతో గుచ్చినటు మదనవికారాలను పొంది నీవు పక్కపైన నిలవకుండా ఉండాలి గొప్పప్రభావంకల మన్మథాస్త్రంతో నీహృదయంలో కొడుతున్నాను మానసికపరితాపాలే ఆకులు, కామాభిలాషే బాణపుమునుకు, ఈ భోగాలననుభవించాలనే సంకల్పమే ■ మునుకును బాణానికి అంటించే ద్రవ్యం. అలాంటి బాణాన్ని ధనుస్సులో సంధించి మన్మథుడు నిన్నుకొట్టాలి ఆ బాణపుదెబ్బకు నీవు నాదగ్గఱకు రావాలి కోపంపోయి మృదువుగా అనుకూలంగా మాట్లాడుతూ నన్ననుసరించాలి. ఓ మిత్రావరుణులారా! ఈమెకు చిత్తవిక్షేపాన్ని కలిగించి, ఏమీతోచకుండా చేసి నాకు వశపడేటట్లు చేయండి" (3.25).

## లోకాన్నెలా వశపరచుకోవాలి ?

తన చుట్టూ ఉన్న సమాజంలో చక్కని స్నేహబంధాలను నెలకొల్పడంద్వారా దానిపై తన ప్రభావాన్ని ప్రసరింపజేసి 'సహృదయం సామ్మనుష్యం' అనే సూక్తంద్వారా దాన్ని వశపరచుకోవడం సాధ్యమని ఈ వేదం చెబుతుంది.

> "మీతో సమానహృదయంతో ప్రీతితో స్నేహం చేస్తున్నాను, మీరుకూడా ఆవుల్లాగా సత్వగుణంతో పరస్పరం స్నేహంగా ఉండండి. తండ్రిమాట వినే కొడుకు, పిల్లల భావాలనర్థంచేసుకొనే తల్లి, భర్తతో ప్రియంగామాట్లాడే భార్య, తోడబుట్టినవారితో తగాదాపడని అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు, ఇలా ప్రతివాళ్లు ఇతరులనర్థంచేసుకుంటూ మంచిమాటలను మాట్లాడుకోండి! మీరు సమానహృదయంతో బండి చక్రంలో నాభికి చుట్టూ ఆకులున్నట్లు కలసి మెలసి ఉండండి! మిమ్మల్ని స్నేహమనే పాశంతో బంధించి వశపరచుకుంటున్నాను (3.30).

## ఎలా నిద్ర కలిగించడం ?

కొందఱికి నిద్రకలిగించి తన కార్యాన్ని సాధించుకోవాలి ఎలా? 'సహస్రశృంగ' అనే సూక్తంతో అందఱికీ నిద్రవచ్చేటట్లు చేయవచ్చు.

"వెయ్యి కిరణాలుగల సూర్యునిద్వారా వీళ్లను నిద్రాపరవశుల్ని చేస్తున్నాను. గాలి ఎక్కువగా వీచకుండుగాక! నన్నెవడూ చూడకుండుగాక! ఓ వాయూ! నీవు ప్రాణవాయురూపంలో అందఱి శరీరాల్లో సంచరిస్తున్నావు చుట్టూ ఉన్నవారినందఱినీ నిద్రలో మునిగేటట్లు చెయ్యి! అచేతనమైన ఈ మహాభవనం ఎలా లోకాన్ని చూడలేదో అలాగే వీరంతా నన్ను చూడకుండా ఉండేటట్లు వీరి కన్నులను నిద్రతో మూసేస్తున్నాను నా ప్రియురాలి తల్లి, తండ్రి, వాకిట్లో కాపలాకాసే కుక్క, చుట్టూ ఉన్నవాళ్లు, చుట్టాలు అందఱు సూర్యోదయం అయ్యేవఱకు నిద్రలో మునిగి పోదురుగాక! (4.5).

## విరిగిన ఎముకలను కలపడమెలా ?

ఆయుధాలవల్ల శరీరావయవాలు తెగిపోయినప్పుడు, రక్తం ప్రవాహంలాగా కారిపోతున్నప్పుడు, ఎముకలు విరిగిపోయినప్పుడు 'రోహిణ్యసి' (4-12) అనే సూక్తంతో అభిమంత్రించిన లక్కనీళ్లతో ఆ భాగాలను ఉషఃకాలంలో తడపాలి. [redacted] చేస్తే తెగిన అవయవాలు, ఎముకలు అతుక్కుంటాయి.

## వర్షమెలా కురుస్తుంది ?

కరువు విలయతాండవం చేస్తున్నది. వర్షాలు పడటం లేదు. ఎలా వర్షాలను కురిపించడం? 'సముత్పతన్తు' (4.15) అనే సూక్తాన్ని ఉపయోగించి కొన్నిపనులు చేయడంద్వారా వర్షాన్ని కురిపించ వచ్చునని ఈ సంహిత చెబుతున్నది.

## గ్రహబాధలెలా పోతాయి ?

ఈ కాండలో ఎన్నో విశేషాలు కనబడుతున్నాయి. భూత గ్రహాదుల బాధలను నివారించడానికి ఉపయోగించే మంత్రభాగం ఇందులో కనబడుతుంది (4.36). జమ్మిఆకు పొడిని జమ్మికాయలో పెట్టి 'త్వయా పూర్వం' (4.37) అనే సూక్తంతో అభిమంత్రించి గ్రహబాధపడే వానిచేత తినిపించి అతడిచేత దాన్ని ధరింపజేస్తే ఎలాంటి గ్రహబాధలైనా పోతాయని చెప్పబడింది.

## ఓ జ్వరమా! వెళ్లిపో !

జ్వరం తగిలినప్పుడు కలిగే బాధలను వివరిస్తూ, అలాంటి జ్వరం మమ్ములను వదిలి దూరంగా పోవాలని 'అగ్నిస్తక్మానం' (5.22) అనే సూక్తంతో అభిమంత్రించిన జావను రోగికి తాగించేవారు. పధ్నాలుగు మంత్రాలుగల ఈ సూక్తంలో జ్వరస్వరూపం ఎంతో చక్కగా వివరింపబడింది. ఉదాహరణకు చూడండి:

> "ఓ జ్వరమా! నీరసమనే సోదరునితోను, దగ్గనే చెల్లెలితోను, దురద అనే దాయాదితోను కలసి ఇక్కడినుంచి దూరంగా వెళ్లిపో"

## స్త్రీవశీకరణం:

ఈ సంహితలో చాలాచోట్ల స్త్రీవశీకరణపద్ధతి చెప్పబడింది. కానీ ఆఱవకాండలో ఎనిమిదవసూక్తంలో పేర్కొన్న పద్ధతి ఎంతో ఆకర్షణీయంగా ఉన్నది. చూడండి:

> "తమలపాకు తీగె తనకాశ్రయమైన చెట్టునెలా కౌగలించుకుంటుందో, అలా నీవు నన్ను కౌగలించుకో నీవు నన్నే ప్రేమించి నాదగ్గతే ఉండేటట్లు ఇంకోచోటికి పోకుండా చేసుకొని ఈ ప్రయోగంద్వారా నిన్ను వశపరచుకొంటున్నాను" (6.8).

## ఇతడెలా అందుతాడు ?

తనకు ఇష్టుడైన పురుషుణ్ణి పొందడానికి ఇతర స్త్రీలు ఎవరైనా పోటీ వస్తుంటే 'రథజితాం' అని వరసనేగల మూడు సూక్తాలతో

**(6.130-132)** మినుములను అభిమంత్రించి ఆ స్త్రీలు తిరిగేచోట చల్లాలి. అలాచేస్తే వాళ్లు తన ప్రియునివెంట పడరు. అతడు తన దాసుడౌతాడు. చూడండి:

> "ఇతడు. కామంతో ఎప్పుడూ నన్నే స్మరించాలి. విరహంతో ఇతణ్ణి స్మరించి బాధపడవలసిన పరిస్థితి నాకెప్పుడూ రాకూడదు" **(6.130)**.

**సభలో నాకే విజయం లభించాలి :**

సభలో వాగ్వాదాలలో విజయం లభించడానికి "సభా చ మా" **(7.13)** అనే నాలుగు మంత్రాలుగల సూక్తంతో క్షీరాన్నంగాని పురోడాశంగాని రసాలనుగాని అభిమంత్రించి భుజించాలి.

> "సభకు 'నరిష్ట' అని పేరు అంటే ఒకరిమాటను ఎక్కువమంది అంగీకరించినా లేకపోయినా, ఎక్కువమంది మాటను మిగిలినవారు అంగీకరించవలసిందే ఇలాంటి మర్యాదకలది కాబట్టి సభకు ఆ పేరేర్పడింది. అలాంటి సభ నాకు అనుకూలంగా ఉండాలి నేను నా ప్రతివాదుల తేజస్సును విజ్ఞానాన్ని అపహరిస్తున్నాను. నాకు సభాగౌరవం లభించుగాక! ఉదయించే సూర్యుడు, తారకల తేజస్సును, అప్పటికీ నిద్రపోయేవారి వర్చస్సును ఎలా అపహరిస్తున్నాడో నేనలా నాప్రత్యర్థులైన స్త్రీపురుషుల శక్తి సామర్థ్యాల నపహరిస్తున్నాను" **(7.13)**.

**క్షయవ్యాధినివారణం :**

రాజయక్ష్మ అంటే క్షయ. అదొక భయంకరమైన వ్యాధి. దాన్ని పోగొట్టడానికి పదిరకాల చెట్లముక్కలతోను, లక్కతోను, బంగారంతోను తయారుచేయబడ్డ 'శాకలమణి'ని 'యాబభ్రవః' **(8.7)** అనే సూక్తంతో అభిమంత్రించి రోగికి కట్టేవారు. దాంతో అతనికి ఆరోగ్యం కుదిరేది.

**అతిథిసేవాఫలం :**

ఈ సంహితలో తొమ్మిదవకాండలోని మూడో అనువాకంలో **2-7** సూక్తాల్లో అతిథిమాహాత్మ్యం, అతిథిగౌరవం, ఆతిథ్యమివ్వడం

యజ్ఞంతో సమానమనే విషయాలు చక్కగా చెప్పబడ్డాయి. ప్రాచీన భారతీయుల ఆతిథ్యాన్ని గురించి విశేషంగా తెలుసుకోదలచినవారు తప్పకుండా చదవవలసినవి ఈ సూక్తాలు. ఉదాహరణకు చూడండి:

గృహస్థు ఎవరినైనా తన ఇంటికి ఆతిథ్యమిస్తాను రమ్మని ఆహ్వానించి ఏ కారణంచేతనైనా అతడు ఆలస్యం చేస్తే, అతనికంటే ముందే భోజనం చేసినట్లైతే ఏం జరుగుతుంది? తన కుటుంబానికి సంబంధించిన ఇష్టాపూర్తఫలాలు, పాడిపంటలు, సంతానం, పశుసంపద, కీర్తిప్రతిష్ఠలు, సంపద, వివేకం, అన్నీ నాశనమైపోతాయి. అతిథి భోజనం చేసిన తరువాతనే తను భోజనం చేయాలి. కనుక ఏ పరిస్థితిలోను అతనికంటే ముందు తను భోజనం చేయకూడదు (9.6).

## ఈ శరీరాన్ని భగవంతుడిచ్చాడు :

మనకు ఈ శరీరం ఎలా వచ్చింది? ఈ విషయాన్ని గురించి అథర్వవేదం చర్చించినంతగా ఇంకా ఏ వేదంలోను చర్చింపబడ లేదేమో! తొమ్మిదవకాండలో మొదటి అనువాకంలో రెండవసూక్తం ఎంతో విచిత్రంగా ఈ విషయాన్ని చర్చిస్తుంది. ఎన్నెన్ని ప్రశ్నలో! 33 మంత్రాల్లో మన శరీరంలోని ప్రతి అవయవం పేరుపేరుకు చెప్పబడి 'దీన్నెవరిచ్చారు'? 'ఇదెలా ఏర్పడింది'? అని చాలా వఱకు ప్రశ్న పరంపర కనబడుతుంది. చివఱకు 'ఇది దేవుడిచ్చిన శరీరం; దీన్ని మనకు అనుగ్రహించి ఇందులో ఆయన ప్రవేశించాడు' అని ఎంతో చక్కగా చెప్పబడింది. ఇందులో ఎన్నో నూతనాంశాలు కనపడుతున్నాయి. మానవుడైన ప్రతివాడు ఒక్కసారైనా జీవితంలో చదవవలసిన సూక్తమిది (10.2).

**అన్నమే అన్నం తింటున్నది !**

పదకొండవకాండలో అన్నం పరబ్రహ్మస్వరూపమని ప్రతిపాదింపబడింది. మనం అన్నాన్ని తింటున్నామా? అన్నం మనల్ని తింటున్నదా? అని ప్రశ్నించి అన్నమే అన్నాన్ని తింటున్నదనే సిద్ధాంతం ఇందులో ఎంతో ఆశ్చర్యంగా చేయబడింది.

పన్నెండవకాండలో గల పృథివీసూక్తం అథర్వవేదానికే తిలకం లాంటిది. భూమికి సంబంధించిన ఎన్నో విశేషాలు ఎంతో చక్కగా ఈ సూక్తంలో ప్రస్తావింపబడ్డాయి (12.1). రాజు, రాష్ట్రం క్షేమంగా ఉండాలని రోహితదేవుడు పదమూడవకాండలో స్తుతింపబడ్డాడు. ఉదయించే సూర్యునికే రోహితుడని పేరు (13.1).

ఈ సంహితలో మొదటినుంచి పందొమ్మిదవ కాండవఱకు అనేకమైన అభిచార కర్మలు, ఎన్నో లౌకికవిషయాలు ప్రతిపాదింపబడి చివఱికాండలో మాత్రం యజ్ఞయాగాలకు సంబంధించిన ఎన్నో విషయాలు చెప్పబడ్డాయి. భౌతికదృష్టితో పరిశోధనచేసే ఈనాటి పరిశోధకులకు అథర్వవేదం ఒక గనిలాంటిది. అందులో ఎన్నో రహస్యాలు, సమాజకల్యాణానికి అనుసరింపవలసిన పద్ధతులు కుప్పలు కుప్పలుగా ఉన్నాయి. వాటిని అర్థంచేసుకొని ఉపయోగించుకోవడం, దానిద్వారా లోకకల్యాణాన్ని సాధించడం బుద్ధిమంతుల కర్తవ్యం.

- ఎస్.బి.ఎల్.

# అధ్యేయగ్రంథసూచి


అథర్వవేదసంహితా (అ. సం)
విశ్వబంధు
విశ్వేశ్వరానందవైదిక సంస్థానం, హోషియార్‌పూర్, 1960.

అభిజ్ఞానశాకుంతలమ్ (అభి )
కాళిదాసగ్రాంథావళీ
రేవాప్రసాద ద్వివేది
బనారస్ హిందువిశ్వవిద్యాలయం, వారాణసి 1976

అష్టాధ్యాయీ (అష్టా.)
బ్రహ్మదత్త
రామ్‌లాల్ కపూర్ ట్రస్ట్ గ్రంథమాల, 1965

అహిర్బుధ్న్యసంహితా (అహి. సం.)
వి. కృష్ణమాచార్య
అడయార్ లైబ్రరీ అండ్ రీసెర్చ్ సెంటర్, మద్రాస్, 1966.

ఉవటభాష్యమ్ (ఉవ.)
(శుక్లయజుస్సంహితా)
జగదీశ్ లాల్‌శాస్త్రి
మోతీలాల్ బనార్సీదాస్, ఢిల్లీ, 1971.

ఋక్ప్రాతిశాఖ్యమ్ (ఋ. ప్రా.)
మంగళదేవశాస్త్రి
వైదిక స్వాధ్యాయమందిర్, వారాణసి, 1959.

ఋగ్భాష్యసంగ్రహః (ఋక్. సం.)
దేవరాజ్ చనానా
మున్షీరాం మనోహర్‌లాల్, ఢిల్లీ, 1961

ఋగ్వేదము (ఋ)
(ఏకదేవతావాద ప్రతిపాదకమగు ప్రథమాంధ్రవివృతి)
ఎస్. బి రఘునాథాచార్య
ఓరియంటల్ రిసెర్చి ఇన్స్టిట్యూట్.
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి. 1978

ఋగ్వేదసంహితా (ఋ.సం.)
ఎన్ ఎస్ సొంతక్కె
వైదికసంశోధమండలం, పూనా, 1972.

ఐతరేయబ్రాహ్మణమ్ (ఐ. బ్రా.)
వి. ఎస్. కాశీనాథశాస్త్రి
ఆనందాశ్రమ సాంస్క్రిట్ గ్రంథావళి. పూనా, 1977.

కాత్యాయన సర్వానుక్రమణికా (కా. స.)
శ్రీపాదదామోదరసాతవలేకర్
స్వాధ్యాయమండలం, పారడీ, 1970.

కృష్ణయజుర్వేదతైత్తిరీయసంహితా (తై. సం.)
వి. ఎస్ ఎస్ కాశీనాథశాస్త్రి అగాశె
ఆనందాశ్రమ సంస్కృత గ్రంథావళి, పూనా, 1978.

గోపథ బ్రాహ్మణమ్ (గో. బ్రా.)
రాజేంద్రలాల్ మిత్ర
ఇండొలాజికల్ బుక్ హౌస్, ఢిల్లీ, 1972.

చతుర్వేదవిషయసూచీ (చ. వి. సూ.)
స్వామి దయానందసరస్వతి
రామ్‌లాల్ కపూర్ ట్రస్ట్, బహాల్‌గడ్

చంద్రాలోకః (చంద్రా.)
చౌఖంబా సంస్కృత సిరీస్ ఆఫీస్, బనారస్, విక్రమసంవత్ 1995.

ఛందశ్శాస్త్రమ్ (ఛ. శా.)
పండిట్ కేదార్‌నాథ్
నిర్ణయసాగర ప్రెస్, బొంబాయి, 1927.

ఛాందోగ్యోపనిషత్ (ఛాందో.)
వాసుదేవశర్మ
నిర్ణయసాగర ముద్రణాలయం, బొంబాయి, 1925.

జయాఖ్యసంహితా (జయా.)
ఎంబార్ కృష్ణమాచార్య
ఓరియంటల్ ఇన్స్టిట్యూట్, బరోడా, 1981

నిరుక్తమ్ (ని.)
లక్ష్మణ్‌సరూప్
మోతీలాల్ బనారసీదాస్, న్యూఢిల్లీ, 1967

నృసింహపూర్వతాపనీయోపనిషత్ (నృ. పూ. తా.)
వాసుదేవశర్మ
నిర్ణయసాగర ముద్రణాలయం, బొంబాయి, 1925.

పాణినీయశిక్షా (పా.శి.)
మనోమోహన్ ఘోష్
యూనివర్సిటీ ఆఫ్ కలకత్తా, కలకత్తా, 1988.

బృహదారణ్యకోపనిషత్ (బృ.)
వాసుదేవబ్రహ్మభాగవత్
గంగావిష్ణు శ్రీకృష్ణదాస్, కల్యాణ్ - బాంబే, 1940.

భారతవర్షీయ ప్రాచీన చరిత్రకోశ్ (భా ప్రా.చ.)
సిద్ధేశ్వరశాస్త్రి చిత్రావ్
భారతీయ చరిత్రకోశమండల్, పూనా, 1964.

మత్స్యపురాణమ్ (మ. పు)
శ్రీరామశర్మ
సంస్కృతి సంస్థాన్, బరేలి, 1970.

మహాభారతమ్ (భార.)
వి. ఎస్. సుక్తంకర్
భండార్కర్ ఓరియంటల్ రిసెర్చి ఇన్స్టిట్యూట్, పూనా, 1988.

మహాభాష్యమ్ (మహా.)
జయకృష్ణదాస్ హరిదాస్‌గుప్త
చౌఖంబా సంస్కృత సీరీస్ ఆఫీస్, బెనారస్, 1854

మహీధరభాష్యమ్ (మహీ.)
జగదీశ్ లాల్ శాస్త్రి
మోతీలాల్ బనార్సీదాస్, ఢిల్లీ, 1971.

మీమాంసాదర్శనమ్ (మీ.ద.)
వాసుదేవ అభయంకర్, అంబాదాస్ జోషి
ఆనందాశ్రమ సాంస్క్రిట్ గ్రంథావళి, పూనా, 1976.

ముండకోపనిషత్ (ము.)
వాసుదేవశర్మ
నిర్ణయసాగర ముద్రణాలయం, బొంబాయి, 1925.

వాయుపురాణమ్ (వాయు.)
శ్రీరామశర్మ
సంస్కృతి సంస్థాన్, బరేలి. 1967.

విష్ణుపురాణమ్ (వి. పు. )
పి. బి. అణ్ణంగరాచార్య
కాంచీపురమ్. 1972.

వేదకాలీన్ సమాజ్ (వే. స.)
శివదత్తజ్ఞాని
చౌఖంబా విద్యాభవన్, వారాణసి. (1967)

వేదత్రయీ పరిచయ (వే. ప.)
సత్యవ్రతసామాశ్రమి భట్టాచార్య
హిందీసమితి, లక్నో. 1965

వేదభాష్యభూమికాసంగ్రహః (వే. భా. భూ.)
బలదేవ ఉపాధ్యాయ
చౌఖంబా సాంస్క్రిట్ సిరీస్, వారాణసి, 1958

వైదికకోశ్ (వై. కో)
సూర్యకాంత
వైదిక రిసెర్చ్ సమితి, బనారస్, 1968.

వైదిక వాఙ్మయ కా ఇతిహాస్ (వై వా ఇ.)
సత్యశ్రవా
ప్రణవ ప్రకాశన్, న్యూఢిల్లీ, 1978.

వైదిక సాహిత్య చరిత్రమ్ (వై. సా. చ.)
పి. పి. ఎస్. శాస్త్రి: కె. ఎల్. వి. శాస్త్రి
శ్రీ గీర్వాణవాణీ పుస్తకశాల, పాల్ఘాట్ 1927.

రామాయణమ్ (రామా.)
గంగావిష్ణు శ్రీకృష్ణదాస్
లక్ష్మీవేంకటేశ్వర స్టీమ్ ప్రెస్, కల్యాణ్, బొంబాయి. 1857.

శుక్లయజుర్వేదసంహితా (శు. సం.)
జగదీశ్ లాల్ శాస్త్రి
మోతీలాల్ బనార్సీదాస్, ఢిల్లీ 1971

శ్రీమద్భాగవతమ్ (శ్రీ. భా.)
సి ఎల్ గోస్వామి
గీతా ప్రెస్, గోరఖ్‌పూరు, 1971.

శ్రౌతపదార్థనిర్వచనమ్ (శ్రౌ. ని.)
విశ్వనాథశాస్త్రి
ఇ జె లాజరస్ అండ్ కొ, బెనారస్ 1919.

సామవిధానబ్రాహ్మణమ్ (సా. బ్రా.)
బి ఆర్ శర్మ
కేంద్రీయ సంస్కృత విద్యాపీఠమ్, తిరుపతి. 1964.

సామవేదసంహితా (సా. సం.)
శ్రీరామశర్మ ఆచార్య
సంస్కృతి సంస్థానం, బరేలి. 1965.

సామసారసర్వస్వమ్ (సా. సా. స.)
రామనాథ దీక్షితర్
రామాయణ ప్రింటింగ్ వర్క్స్, మదరాసు. 1972.

సాయణభాష్యమ్ (సా.భా.)
ఎన్. ఎస్. సొంతక్కె
వైదిక సంశోధనమండలమ్, పూనా. 1972.

# BIBLIOGRAPHY


ABINAS CHANDRA DAS
**Rgvedic Culture**
Bharatiya Publishing House. VARANASI, 1979.

AGUILAR, H
**The Sacrifice in the Rgveda**
Bharatiya Vidya Prakashan. DELHI.1976.

BHANDARKAR, R.G.
**Vaishnavism Saivism**
Indological Book House. VARANASI,1965.

BHAKTIVEDANTA SVAMI PRABHUPADA, A.C.
**[redacted] Bhagavatam**
The Bhaktivedanta Book Trust, NEW YORK, 1978.

BHARATI KRISHNA TIRTHAJI MAHARAJ
**Vedic Metaphysics**
[redacted] Banarsi Dass, DELHI, 1978.

BHAT, G.K.
**Vedic [redacted]**
Ajanta Publications, DELHI, 1978.

BLOOMFIELD. M.
**A Vedic Concordance**
Motilal [redacted] Dass, DELHI 1906.

BLOOMFIELD,M.
**Rgveda Repetitions**
The Harvard [redacted]
CAMBRIDGE, MASSACHUSETTS, 1916.

BLOOMFIELD.M.
**The Religion [redacted] the [redacted]**
Indological Book House, DELHI 1972

BRAJ BIHARI CHAUBEY
**Treatment of Nature in [redacted] Rgveda**
Vedic Sahitya Sadan. HOSHIARPUR, 1970.

CHAKRAVARTHY,C
**Common life in the Rgveda and Atharva Veda**
Punthi Pusthak, CALCUTTA.1977.

CHAKRAVARTHY G N
**The Concept of Cosmic Harmony in the Rgveda**
Prasaranga Manasagangotri , MYSORE, 1966.

DANGE, S.A.
**Cultural [redacted] from the Veda**
Bharatiya Vidya Bhavan, BOMBAY, 1977.

DANGE,S.A.
Pastoral Symbolism from the Rgveda
Poona Universtiy Publicaton, POONA 1970.

DANGE, S A.
**Sexual Symbolism from the Vedic [redacted]**
Ajanta Publication, DELHI 1979.

DASGUPTA, S.
**A History of Indian Philosophy**
Motilal Banarsi Dass. DELHI , 1975

DE NICOLAS, ANTONIO, T.
**Meditations through [redacted] Rgveda**
Shambhala Publications BOULDER, 1978.

GONDA J
**The Dual Deities in the Religion [redacted] [redacted] Rgveda**
North Holland Publishing Company. AMSTERDAM, LONDON, 1974.

GRISWOLD. H D
**The Religion of Rgveda**
Motilal Banarsi Dass, DELHI 1971.

HANS RAJ.
**Science in the Vedas**
Shakti Publications, LUDHIANA.1956

Jhala G.C.
**Asvina in the Rgveda and other Indological Essays**
The G C. Jhala Memorial, Committee, NEW DELHI,1978.

KARAMBELKAR, V.W.
**The Atharva Veda And The Ayurveda**
Vidarbha Samsodhna Mandala, NAGPUR, 1961.

KEITH, A B.
**The Religion and Philosophy of the Veda and Upanishads**
Motilal Banarsi Dass, DELHI, 1925.

KSHETRESH CHANDRA, CHATTOPADHYAYA
**Studies in Vedic and Indo-Iranian Religion and Literature**
Bharatiya Vidya Prakashan, VARANASI,1976

MACDONELL, A.A.
**A. Vedic Reader for Students**
Geoffrey Cumberlede, MADRAS,1951.

MACDONELL, A.A.
**The Vedic Mythology**
Indological Book House, VARANASI,1971.

MACDONELL, A.A. & KEITH, A B.
**Vedic Index of Names and Subjects**
Motilal Banarsi Dass, VARANASI, 1958.

MAXMULLER, F
**Origin And Growth of Religion**
Indological Book House, VARANASI, 1964.

MAXMULLER,F
**The Vedas**
Indological Book House, DELHI, 1969

PANDIT, M.P
**Aditi and other deities in the Veda**
Dipth Publications, PONDICHERY 1958

PANDIT, M P.
**Key to Vedic Symbolism**
Dipti Publications, Pondichery, 1967

PANDIT, M.P.
**Mystic Approach to the Veda and the Upanishads**
Ganesh & Company MADRAS, 1974

PENDSE, G S.
**The Vedic Concept of Sraddha**
Three Angles Memorial Trust, PUNE 1977.

PHILLIPS, MAURICE
**Teaching of the Vedas**
Seema Publications. DELHI, 1976.

RAJA RAMMOHAN RAI
**The Vedas**
Nag Publishers, DELHI. 1977.

RENOU, L.
**The Destiny of the veda in India**
Motilal Banarsi Dass, DELHI, 1965.

RENOU, L
Vedic India
Indological Book House, DELHI, 1971

STEVENSON, J.
**The Samaveda Samhita**
Indological Book House. VARANASI, 1961.

SUKTHANKAR, V.S
**Ghate's Lectures on Rgveda**
Oriental Book Agency, POONA, 1966

SVAMI SATYAPRAKASH SARASVATI AND SATYAKAM VIDYALANKAR
**Introduction to Rgveda Samhita**
Vedapratisthana, NEW DELHI, 1977

VASUDEVA, S AGRAWALA
**Sparkles from The Vedic Fire**
School of Vedic Studies, VARANASI, 1962.

VENKATASUBBAIAH, A
**Contributions to the Interpretations of The Rgveda**
Prasaranga, MYSORE.

VETTAM MANI
**Puranic Encyclopaedia (P.E.)**
Motilal Banarsi Dass, NEW DELHI, 1979

VIDYANANDA VIDEH
**The Exposition of The Vedas**
Veda Samsthan, AJMER, 1964

WILSON, H H.
**Religious Sects of the Hindus**
Indological Book House, VARANASI, 1972.

WINTERNITZ. M
**A History of Indian Literature (H.I.L.)**
Munshiram Manoharlal, NEW DELHI 1977.

# విశిష్టపదసూచి

●●●●●


అధ్వరవేదం 133
అధ్వర్యువేదం 133
అనస్తదేవుడు 135
అనన్తాచార్యుడు 321
అనుషుప్‌గర్భా 63
అనుష్టుప్ గర్భోష్ణిక్ 261
అనుష్టుప్ విరాట్ఛందః 262
అభిసారిణీ [illegible] 172
అశ్వలుడు 11
ఆదిత్యేష్టి 194
ఆధ్వర్యవం 133
ఆల్ఫ్రెడ్ లుడ్విగ్ 4
ఆర్ టి హెచ్ గ్రిఫ్ఫిత్ 5
ఆర్ పిశ్చెల్ 5
ఆశ్వలాయనుడు 11
ఆస్తార 67.171.264
ఆస్తారబృహతి 170
ఇంద్రప్రమతి 10
ఉఖ 175
ఉపజగతి [illegible]
ఉపరిష్టాత్ 65,169
ఉపరిష్టాత్ జ్యోతి 173
ఉపరిష్టాజ్జ్యోతి త్రిష్టుప్ 265
ఉపరిష్టాత్ బృహతి 263
ఉపసత్తులు 196
ఉపాయవః191
ఉవటుడు 137,321
ఉష్ణిగ్గర్భా 62
ఉష్ణిక్ విషమపాద 261
ఊర్ధ్వబృహతి 65. 264
ఋతమ్ 74,79,80.205.
ఎ బి కీత్ 137
ఎ వెబర్ 137.229
ఎఫ్ మాక్స్ ముల్లర్ 4
ఎల్ వి ష్రోడర్ 136
ఏకపదా 68.172
ఏకపదా గాయత్రి 166.260.
ఏకపదా విరాట్ 167.262.
ఏకాదికా అనుష్టుప్ 262.
ఏకాదికా పంక్తి 265.
ఏకోన ఊర్ధ్వ బృహతి 264
కకుద్మతి 166
కకుప్ 62 167.261
కకుమ్న్యంకుశిరా 62
కకుమ్మతి పరోష్ణిక్ 261
కలాపి 141
కక్షీవంతుడు 31.88
కాత్యాయనుడు 24.55 257
కావిరాట్ 63
కాళిదాసు 183
కాశ్యపుడు [illegible]
కృత్య 95
కృతి 64.169
కె ఎఫ్ గెల్డనర్ 5
గాయత్రీ అవసానహీనా [illegible]
గాయత్రీ ఉష్ణిగ్గర్భా 259
గాయత్రీ శంకుమతి 259
గాలవుడు 10
గ్యాలీయ 10
చతుష్పదా సతోబృహతి 170
జాగతీ త్రిష్టుప్ 172
జాతూకర్ణ్యుడు 10

జైమిని 1.12 336.235
టి హెచ్ గ్రిఫ్ఫిత్ 4
తనుశిరా 63. 168
తిత్తిరిమహర్షి 175
తృచమ్ 87
త్ర్యవసానా మహాపంక్తి 264
దయానందసరస్వతి 187
దాశరాజ 92
దుర్గాచార్య 12
ద్విపదా 68.172
ద్విపదా గాయత్రి 166.260
ద్విపదా విరాట్ 167.262
నమకం 217
నష్టరూపి 64.169
నిచృత్ 59.61.64.68
న్యంకుసారిణీ 65.169
న్యంకుసారిణీ బృహతి 263
పంక్తి త్రిష్టుప్ 264 265
పంక్తి విరాట్ 264
పంచపదా 173
పంచపదా పథ్యాబృహతి170
పతంజలి 6,140,141,144,319
పథ్యాపంక్తి 67.171
పథ్యాబృహతి 169, 263
పదపంక్తి గాయత్రి 259
పరాఉష్ణిక్ 168
పరాశర 10
పాణిని 27
పాదనిచృత్ 61.163
పింగళుడు 55.57.163.164.257
పిపీలికామధ్యా 63.64.65.168
పిపీలికామధ్యాకృతిఅనుష్టుప్ [illegible]
పిపీలికామధ్యా బృహతి 263
పురఉష్ణిక్ 62 167 261
పురస్తాత్ 65
పురస్తాజ్జ్యోతి 172 173
పురస్తాజ్జ్యోతి త్రిష్టుప్ 265
పురోడాశం 184
పురస్తాత్ బృహతి 263
పూర్వరూపా అనుష్టుప్ 262
పైలుడు 10 12 257
ప్రతిష్ఠా గాయత్రి 259
ప్రస్తార 67.171.264
ఫ్రెడ్రిక్‌రోజెన్ 4
బధ్యశ్వుడు 10
బాభ్రవ్యుడు 11 14
బాష్కలిభరద్వాజుడు 10
బాష్కలుడు 10.235
బౌధ్య 10
బ్రహ్మర్షిదేశం 135
బ్రహ్మోద్య 329
బ్లూంఫీల్డ్ 423
భట్టభాస్కర 12,139 206,164,204,205,206
భురిక్ 59,62,69
భురిక్ పదపంక్తి 62
మండూకేయుడు 10 11
మధ్యేజ్యోతి 172
మధ్యేజ్యోతి త్రిష్టుప్ 265
మధ్వాచార్యులు 183
మహాపంక్తి 70.264
మహాపదపంక్తి 64 169
మహాబృహతి 69 264
మహాబృహతీ త్రిష్టుప్ 264.265
మహాసతో బృహతి 70

మహాసౌరము 87
మహిదాసు 135
మహీధరుడు 12.284.321
మాండూకేయుడు 11
మాధవాచార్యుడు 134
ముద్గల 10
యజ్ఞము 157
యవమధ్యా 170
యవమధ్యాగాయత్రి 62
యవమధ్యా త్రిష్టుప్ 265
యవమధ్యా విరాట్ 61
యాస్కుడు 133.144.175
యుగేనె బర్నొప్ 4
రథీతరశాకపూణి 10
రామానుజాచార్యులు 186
లక్ష్మణసరూప్ 5
లక్ష్మీధరుడు 133
వర్ధమానా 61.166.168
వర్ధమానా ఉష్ణిక్ 261
వాత్స్య 10
వాయవః191
వారుణమంత్రాలు 178
వాల్మీకి 56
వాసుకి 257
విట్నీ 424
విపరీతాబృహతి 264
విపరీతాసతోబృహతి 66
విరాట్ 61.63.64.66.68.171.172
విరాడ్గాయత్రి 166
విరాడ్రూపా త్రిష్టుప్ 265
విషమపదా 66.169
విషమపదాపంక్తి 171
విష్టారపంక్తి 265
విశ్వామిత్రుడు 2
విస్తార 65.67.171
వృద్ధపదా 173
వృషాకపాయి 88
వృష్టివని 248
వేదవ్యాసుడు 10.12 142.144 318.320
వ్యాడి 15
శతబలాక్షుడు 10
శబరస్వామి 1.134
శాకలమహర్షి 2 10
శైశిరుడు 10
శౌనకుడు 2
షట్పద 173
సతోబృహతి 264
సతఃపంక్తి 171
సత్యశ్రవుడు 10
సత్యశ్రీ 10
సత్యహితుడు 10
సంస్తార 67.265
సవ్యుడు 92
సాతవలేకర్ 5.137 187.
సాయణుడు 26.55.56.72.95.106.114 133 135 139.144. 185.318.321 423
సూర్య 88
సోమపీథి 184
స్వరాట్ 59.69
స్వరాట్ ఉష్ణిక్ 261
స్వరాట్ గాయత్రి 259
హలాయుధుడు 257
హెచ్ హెచ్ రాథ్ 4



ఆర్ష విజ్ఞాన సర్వస్వము

# రానున్న సంపుటాలు

ఈ క్రింది సంపుటాలు 1/8 డెమ్మీ సైజులో సుమారు 400 పేజీలలో ఒక్కొక్కటి తీర్చి దిద్దబడుతున్నాయి.

1. బ్రాహ్మణాలు
2. ఆరణ్యకాలు
3. ఉపనిషత్తులు
4. వేదభాష్యాలు
5. శ్రౌత్ర - గృహ్యసూత్రాలు
6. పాంచరాత్రం
7. వైఖానసం
8. శైవం
9. వాస్తు - శిల్పం

తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

# ARSHA VIJNANA SARVASWAMU -

**Price : Rs. 50/-**



## తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

## తెలుగు ప్రచురణలు



| | | |
|---|---|---|
| 1. | సప్తపది | 5-00 |
| 2. | పురుషసూక్తములు | 5-00 |
| 3. | నారాయణీయం | 45-00 |
| 4. | యోగసర్వస్వము | 40-00 |
| 5. | గీతారహస్యం - సంపుటం - 1 | 40-00 |
| 6. | గీతారహస్యం - సంపుటం - 2 | 45-00 |
| 7. | గీతారహస్యం - సంపుటం - 3 | 35-00 |
| 8. | కల్యాణ సంస్కృతి | 7-00 |
| 9. | భజగోవిందం | 5-00 |
| 10. | తిరుమలలో తిరుప్పావై | 5-00 |
| 11. | శ్రీమద్భాగవతం - రెండవ స్కంధము | 55-00 |
| 12. | రామాయణము-ఉషశ్రీ | 35-00 |
| 13. | భారతీయ సంస్కారములు | 25-00 |
| 14. | తిరుమల సమయాచారములు | 15-00 |
| 15. | లలితా సహస్రనామం | 10-00 |
| 16. | రామచరిత మానసము | 40-00 |
| 17. | శ్రీ వేంటేశ్వర వైభవం | 40-00 |
| 18. | యజ్ఞోపవీత తత్త్వ దర్శనం | 10-00 |
| 19. | అద్వైతాక్షర మాలిక | 75-00 |
| 20. | ఆర్ష విజ్ఞాన సర్వస్వం - సంపుటం 1. | 50-00 |
| 21. | మహాభారతం అరణ్యపర్వం - 1. | 125-00 |
| 22. | మహాభారతం అరణ్యపర్వం - 2. | 150-00 |
| 23. | మహాభారతం విరాటపర్వం | 160-00 |
| 24. | దయాశతకం | 15-00 |

Printed and Published by Sri Ajeya Kallam, I.A.S., Executive Officer,
T.T.Devasthanams, Tirupati and Printed at Students Offset Printers, Tirupati
on behalf of Tirumala Tirupati Devasthanams.